శాస్త్రనిఘంటువు—4.

తెలుగు

# సాహిత్య పదకోశము

సాహిత్య శాస్త్రము నందలి

శ్రవ్యకావ్య-దృశ్యకావ్య-అలంకార పరిభాషా నిఘంటువు


సంగ్రహీతలు

**శ్రీ మిరియాల రామకృష్ణ,** ఎం. ఏ., భాషాప్రవీణ.

లెక్చరర్ పీఠికాపురాధీశ ప్రభుత్వ కళాశాల, కాకినాడ

**డా॥ ముకురాల రామారెడ్డి** ఎం. ఏ., బి. ఇడి., పి. హెచ్. డి.,

రిసెర్చి ఆఫీసర్, తెలుగు అకాడమి.

పరిష్కర్త

**శిరోమణి శ్రీసన్నిధానము సూర్యనారాయణశాస్త్రి**





తెలుగు అకాడమి

హైదరాబాదు

1978

saahitya padakoosamu : *Compilers :* Sri M. Ramakrishna; Dr. M. Rama Reddy
*Scrutiniser :* Sri S. Suryanarayana Sastry. First Edition 1978, PP. xii+402+xvi





*First Edition, 1978*

*Copies 1,000*

Published by TELUGU AKADEMI, Hyderabad-500 029 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of Production of Books and Literature in Regional languages at the University level, of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.





**Price : Rs. 13-00**

PRINTED IN INDIA

Text at Tarani Press, Mahankali Street, Secunderabad-500 003
Cover at the A. P. Govt. Text Book Press, Hyderabad-500 004
Andhra Pradesh

# ప్రస్తావన

వివిధ శాస్త్ర విషయాలలో పారిభాషికపద నిఘంటువులు రూపొందిస్తే అధ్యాపకులకు, విశేషించి అధ్యయన పరులకు కూడ ప్రయోజనకరంగా ఉంటవి అనే ఉద్దేశంతో తెలుగుఅకాడమి శాస్త్రనిఘంటువుల ప్రచురణ పథకానికి రూపకల్పన చేసింది. జిజ్ఞాసువులైనవారికి ఈ నిఘంటువులు సద్యస్సహాయకంగా అందుబాటులో ఉంటవి.

ఈ సంకల్పంతో ఛందః పదకోశం, సాహిత్యపదకోశం, వ్యాకరణ పదకోశం, అనేమూడు శాస్త్రనిఘంటువులను-ఆయాశాస్త్రవిషయాలనువిశిష్టంగా పరిచయంచేస్తూ, పరిభాషాపదాలకు లఘు వివరణమూ, పరస్పరసంబంధ నిర్దేశమూ, నిర్వహిస్తూ—కూర్చ వలెనని నిర్ణయించడమైంది.

ఈ ప్రణాళికలో ఛందఃపదకోశము ఇదివరకే వెలువడింది.

ఇప్పుడీ సాహిత్య పదకోశంలోని శ్రవ్యకావ్య విభాగాన్ని సంకలనం చేసిన వారు శ్రీమిరియాల రామకృష్ణ. నాటక విభాగము, అలంకార విభాగము ఈ రెంటిని సంకలనం చేసిన వారు డా॥ ముకురాల రామారెడ్డి. ఏవిభాగానికి ఆవిభాగం అకారాదిక్రమంలో ప్రచురిస్తేఅధిక ప్రయోజనకరంగానూ. పరిశీలనకు త్వరితగతిని ఉపకరించేదిగాను ఉంటుంది అనే ఉద్దేశంతో ఇవి వేర్వేరు భాగాలుగానే ఈ గ్రంథంలో కూర్చడం జరిగింది.

సాహిత్యలోకానికి చిరపరిచితులు, విశేషించి ఆరంగంలో కృషి చేసిన పండితులు అయిన శిరోమణిశ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు ఈ నిఘంటువుకు పరిష్కర్తలు.

ఇటువంటి పారి భాషికపదనిఘంటువును నవీనపద్ధతిని అనుసరించి కూర్చడం తెలుగు సాహిత్యంలో ఇదే ప్రథమప్రయత్నం.

గ్రంథం ఏదైనా అది నూటికినూరుపాళ్ళు సమగ్రం అని చెప్పేవీలు ఉండదు. ఈ గ్రంథంలో కూడా పునఃపరిశీలన యోగ్యములైన విషయాలేవైనా ఉంటే, అవి మాదృష్టికి వచ్చినప్పుడు, పునర్ముద్రణలో పరిశీలించగలమని మనవి.

# విషయసూచిక

# ఉపోద్ఘాతము

## (శ్రవ్యకావ్యము)

భారతీయులకు చిరంతనమైన సాహిత్య సంప్రదాయములున్నవి. కావ్యహేతువు, కావ్యాత్మ, కావ్యప్రయోజనము, కావ్యవస్తువు, కావ్యరచనావిధానము మొదలయిన సాహిత్య సమస్యలను గురించిన మీమాంస చిరకాలము సాగినది. భరతుడు మొదలుకొని పండితరాయల వరకు భిన్నభిన్న సాహిత్య సిద్ధాంతాలు వికసించినవి. ఈ గ్రంథరత్నములన్నియు సంస్కృత భాషా మహాసముద్రములో సముజ్జ్వలించుచున్నవి. ఈ గ్రంథములను అనువదించుకొను కార్యము కూడా చిరకాలము నుండి సాగుచున్నది. ఈ యనువాదముల ప్రయోజన మాధునికకాలమున మరింత పెరిగినది. అందులకు ప్రధానకారణము లివ్వి : (1) సంస్కృతభాషను చాలమంది చదువక పోవుట (2) సంస్కృత పండితులును దేవనాగర లిపిని సుకరముగా చదువలేక పోవుట (3) తెలుగులిపిలో ఆ గ్రంథములు లభింపక పోవుట. (4) విదేశీయ సాహితీ సిద్ధాంతములు ఉప్పెనగా వచ్చి ఉక్కిరిబిక్కిరి చేయుచుండగా ఆ సిద్ధాంతములకు భారతీయ సిద్ధాంతములకును గల సామ్య వైషమ్యములను దెలిసికొనవలసినయావశ్యక మేర్పడుట (5) ఆంధ్ర కావ్య ప్రపంచమంతయు సంస్కృత సాహిత్య లక్షణ లక్షితమగుటచే ఆ సాహిత్య లక్షణగ్రంథాధ్యయనము మిక్కిలి యవశ్య మగుట (6) ప్రాచీనాంధ్రకవుల ప్రతిభావ్యుత్పత్తులను విమర్శించు విమర్శకులకు సాహిత్య శాస్త్ర పరిశీలన మవశ్యమగుట మొదలయినవి.

ఇటీవల కొంతకాలము నుండి సాహిత్య శాస్త్ర గ్రంథానువాదములు ప్రకటితములగుచున్నవి ఆ గ్రంథ కర్తలు ఉద్దండ పండితులు. వారి గ్రంథములు వివరణాత్మకముగాగాక మక్కికి మక్కిగా నుండుటవలన విద్యార్థి జనమునకు కావలసినంతగా సహాయపడకున్నవి. దానిచే దేశమున సాహిత్యశాస్త్రజ్ఞానము మసకమసకగానే యున్నది. సాహిత్య సృష్టిలో పరభాషా సంప్రదాయ పరకాయ ప్రవేశము విదేశీయ ప్రక్రియల మూకానుకరణము అధికమై భారతీయతాముద్ర మృగ్య మైనది. ఇట్లనుటచే విదేశీయ సాహిత్యాధ్యయనము వలన మనకు ఏ లాభములు గలుగలేదని కాదు. ఈ నూతన సాహితీదృక్పథమునకు తోడుగా సమగ్రమైన భారతీయ శాస్త్ర సంప్రదాయ వివేకము లభించిన యెడల ఇబ్బడి మేలు గలుగును.

ఆంధ్ర దేశము నందు ప్రాచ్య విద్యా పరీక్షలు ప్రవేశపెట్టక మునుపు సాహిత్య శాస్త్ర గ్రంథములు సంస్కృతమున ప్రతాపరుద్రీయము, ఆంధ్రమున నరస భూపాలీయము మాత్రమే. ఇవి రెండును సంస్కృత సాహిత్య శాస్త్ర గ్రంథ సముద్రములో చిన్న పడవలు. ధ్వన్యాలోక, రసగంగాధరాది పలు ప్రామాణిక గ్రంథాల పొలిమేరలకు మాత్రమే యివి తీసుకొని పోగలవు. అధ్యేతలా ప్రధాన గ్రంథముల వాసన చూడలేకున్నారు. ఆ గ్రంథానువాదములు విద్యార్థులకు తగినంతగా సహాయపడకున్నవి. ఆంగ్లమున, హిందీలో ఈయలంకార శాస్త్ర గ్రంథముల కనువాదములు పెక్కు వచ్చినవి. కాని అవి ఆంధ్ర దేశమున విస్తృతముగా ప్రచారమున లేవు.

చాల మంది విద్వాంసులు [P. V. Kane, S. K. De, R. R. Mukharji, V. Raghavan, R. C. Dwivedi, A. Gangopadhyaya, G.C.O. Haas,

P. V. Naganadha Sastry, Ballantyne, Mitra, R. B. Patanker] అలంకార శాస్త్రమును ఆంగ్లమున పరిచయము చేసిరి. అవి సుబోధముగా నున్నవి. మనకినాడు గావలసినవి వట్టి యనువాదములు గావు. వివరణములు గావలెను ఆంధ్రమున సామాన్య జ్ఞానము గలవాని కర్థమగునట్టి వివరణములు గావలెను. పాఠకునికి పౌర్వాపర్య సిద్ధాంతముల ప్రవచనము చేయుచు ఒక కోశముగా ఒక సర్వస్వముగా సిద్ధము చేయవలెను. ఆంగ్లములో నిట్టి కోశములు వివిధప్రయోజనములను దృష్టి యందుంచుకొని రచింపబడినవి. 1. Cassell's Encyclopeadia of Literature 2. Slipley's Dictionary of world Literature వంటివి సాహిత్య సిద్ధాంత సర్వస్వములు. మారుచున్న అవసరాలు మనవి. ఈనాడు తెలుగు దేశములో తెలుగు ఆంగ్లభాషాస్థానమునందగోరుచున్నది. కళాశాలలో తెలుగులోనే అన్ని శాస్త్రములు అభ్యసింపఁబడు చున్నవి. ఇట్టి సమయమున మనకు శాస్త్ర కోశములు పరిచయ గ్రంథములుగా (Reference books) గావలసి యున్నది.

దీనిని గుర్తించి తెలుగు ఎకాడెమీ వారు సాహిత్య పదకోశము రచింపఁజేయ సంకల్పించి దీనిని నిర్మించుటకు సంగ్రాహకులను, పరిష్కర్తలను నియమించిరి. పరిష్కర్తలు రచనా విధాన సూత్రములను నిర్దేశించిరి.

ఈ కోశము సంస్కృత సాహిత్య శాస్త్ర పరిభాషలకు మాత్రమే పరిమితము. ఆ శాస్త్రమున లేని కొన్ని పరి భాషా పదములు తెలుగునకు వచ్చినవి. అందు కొంత దేశీయము, కొంత విదేశీయము గలదు. కానీ యొక చోట తెలుగు భాషా లక్షణ గ్రంథమైన విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో సంస్కృతోదాహరణ కావ్యముల వంటివి ఆంధ్రములో విద్దలి, పద్దలి, సద్దలి, ఉత్పల్లకము, అని నాలుగు కావ్యములు దాహరింపబడినవి. ఇవి మాత్రమీ కోశమున కెక్కినవి. తెలుగున నిట్టి కోశము రచించుట కిదే మొదలు. భవిష్యత్తులో అవసరమును బట్టి యిది యుపబృంహితముగా గలదు. ఇది తొలి మెట్టు మాత్రమే.

ఈ కోశము మూడు భాగములుగా ఉన్నది 1. శ్రవ్యకావ్య విభాగము. 2. దృశ్య కావ్య విభాగము, 3. అలంకార, గుణ, దోష విభాగము.

శ్రవ్య కావ్య పరిభాషా పదములు సుమారు 400. ఈ పరిభాషా పదములకు వివిధాలంకారికులు చెప్పిన నిర్వచనములను సంస్కృత గ్రంథముల నుండియే గ్రహింపబడి వాటికి తెలుగు వివరణము వ్రాయబడి యుదాహరణములు చూపఁబడినవి. ఉదాహరణములు కావ్యాలంకార సంగ్రహము (శ్రీసన్నిధానము వారి వ్యాఖ్య)నుండి గ్రహింపఁబడినవి. ఈగ్రంథ మాంధ్రదేశమున బహుళప్రచారము నందుండుట వలన నిది సంస్కృత సాహిత్య శాస్త్ర సౌధమునకు ముఖ్య ద్వార తోరణముగా నుండుట వలన దీని యుదాహరణములే గ్రహింపఁబడినవి.

ఈ కోశమున సంస్కృత లక్షణములే యీయఁబడినవి. కారణము సంస్కృత లక్షణములు సూత్రములవలె సంగ్రహములు. కంఠస్థములు చేయుట కుచితములు. సంక్షిప్తత, సమగ్రత, సరళత వాటికి ప్రాణ భూతములు. అట్టి వానిని వదలి తెలుగు పద్యము గానీ గద్యముగానీ యిచ్చుట వలన ప్రయోజనము శూన్యము. మరియు ఆంధ్ర సాహిత్య పిపాసువగు విద్యార్థికి సంస్కృత భాషాజ్ఞానము తప్పనిది. ఈ లక్షణములకు కాలక్రమము పాటింపఁబడినది. ప్రతాపరుద్రీయము, సాహిత్య దర్పణము, రసగంగాధరము ఇవి యుత్త

రోత్తరనవీనములు. ఉత్తరోత్తర ప్రామాణికములును. ఈ క్రమము సాధ్యమయినంత వరకు పాటింపఁబడినది. యథార్థమునకు జగన్నాథుఁడు ఆలంకారికులలో చివరివాడు. సిద్ధాంత కర్త. అతని లక్షణము సమగ్రము. అయినను తత్పూర్వ లాక్షణికుల లక్షణములనుగూడా చూపుట వలన నీ లాక్షణిక కుటుంబము యొక్క విమర్శనా శక్తి యెట్లు వికసించినదో ఈ లక్షణ వృక్షమెట్లు శాఖోపశాఖలతో విస్తరిల్లినదో సాహిత్య విద్యార్థులకు గోచరించును.

ఒకే పరిభాషకు పర్యాయపదము లున్నపుడు ఏది అత్యధిక ప్రచారములో నున్నదో దానినే ప్రధానారోపము (entry) గా గ్రహించి తక్కిన పర్యాయపదములు ప్రత్యేకాపరోపములుగా చూపింపఁబడినవి. వివరమునకు ఫలానా ఆరోపము చూడుడని వ్రాయ బడినది. ఉదా: సుప్తి అను వ్యభిచారి భావమున్నది. దీనిని కొందరు 'సుప్తము' అని మరి కొందరు 'స్వప్న' మని వ్యవహరించిరి. మూటికిని లక్షణమొక్కటియే కనుక సుప్తి పదము మాత్రమే ప్రధాన పరిభాషగా గ్రహింపఁబడినది.

ఈ గ్రంథము కోశము యొక్క బాల్య స్వరూపమే. దీనిని క్రమక్రమముగా పరి ష్కరించుకొనుచు నుపబృంహితము చేసికొనుచు నున్నచో సమగ్రత లభించును. విద్వాంసులు, విమర్శకులు, దీనిని పౌరోభాగ్యముతోఁ గాక సుహృద్భావముతో పరిశీలించి సూచనలు చేయ వలెను. దృష్టంకిమపిలోకేఽస్మిన్న నిర్దోషంన నిర్గుణం అని కదా అభియుక్తి.

## దృశ్య కావ్య విభాగము

ఇందు రెండు భాగములు గలవు. ప్రాచీన నాటక లక్షణ పరిభాషా ప్రకరణము, నాయికా నాయక ప్రకరణము. ఇవి రెండును ఒక విభాగము. అలంకార, గుణ, దోష ప్రకరణములు ఇంకొక విభాగము. ఇతివృత్తములేని కావ్యముండును. ఇతివృత్తము లేని నాటక ముండదు గదా! కావున ఇతివృత్తమునకు నాయికా నాయకులకు నవినాభావ సంబంధమున్నది. కావున నాయికా నాయక ప్రకరణము నాటక పరిభాషా ప్రకరణములోనే చేర్చఁబడినది. అలంకార, గుణ, దోషములు శ్రవ్య-దృశ్య కావ్యోభయ సాధారణములు. ఏ భాగమున నైనను చేర్చవచ్చును. వీటి పరిభాషా పదము లిందు చేర్చబడినవి. అలంకార లక్షణములు చూపు నపుడు వాటి పూర్వోత్తర పరిణామములును చూపబడినవి.

నాటకాలంకారముల (అర్థాలంకారములుగావు, నాటకాలంకారములు వేరు) పరి భాషా పదమును దాని ముఖ్య భేదమును ప్రధానా రోపముగా గ్రహించి వివరణము వ్రాయ బడినది. ప్రధానారోపములకు అవాంతర భేదములున్న పదముల కక్కడనే సంగ్రహ వివరణము వ్రాయబడినది. అవసరమైన వాటికి ప్రత్యేకారోపము లున్నవి. ఆయా యారోపముల వివరణము సంస్కృతమూలము ననుసరించియే వ్రాయబడినది.

ఇందుదాహరింపబడిన సంస్కృతాలంకార గ్రంథముల కర్తల పరిచయము అలఁతిగా చేయబడినది.

పరిష్కర్త.

## సంకేతాక్షర సూచిక-1

### శ్రవ్యకావ్య విభాగము

| | |
|---|---|
| ఆం. ధ్వ. లో. | ఆంధ్రధ్వన్యాలోకము |
| ఆం. ప్ర. రు. | ఆంధ్రప్రతాపరుద్రీయము |
| ఆం. ర. గం. | ఆంధ్ర రసగంగాధరము |
| ఆం. సా. ద. | ఆంధ్ర సాహిత్య దర్పణము |
| ఉద్యో. | ఉద్ద్యోతము |
| కా. ప్ర. | కావ్య ప్రకాశము |
| కా. లం. సం. | కావ్యాలంకార సంగ్రహము |
| కా. స్వ. | కావ్య స్వరూపమ్ |
| చూ. | చూడుడు |
| తృతీయ. | తృతీయాశ్వాసము, తృతీయపరిచ్ఛేదము |
| తృ. ఆ. | తృతీయాశ్వాసము. |
| ధ. ద. రూ. | ధనంజయుని దశరూపకము |
| ధ్వ. లో. లోచ. | ధ్వన్యాలోక లోచనము |
| ప. | పద్యము |
| పే. | పేజి |
| ప్ర. క. | ప్రకరణము |
| ప్రకా. | ప్రకాశము |
| ప్ర. రు. | ప్రతాపరుద్రీయము |
| శ్లో. | శ్లోకము |
| సం. | సంఖ్య |
| సా. ద. | సాహిత్యదర్పణము |
| సా. దర్శ. | సాహిత్యదర్శనము |

# సంకేతాక్షర సూచిక-2

## నాటక-అలంకార విభాగములు

| | |
|---|---|
| అ. గు. | అభినవగుప్తుడు |
| అదే. | అదే పుస్తకము |
| ఆ. చంద్రా. | ఆంధ్ర చంద్రాలోకము |
| ఆ. వి. స. | ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము |
| ఆ. సా. ద. | ఆంధ్ర సాహిత్యదర్పణము |
| ఉదా | ఉదాహరణము |
| కాణేవ్యా. (కా.వ్యా.) | కాణేవ్యాఖ్య |
| కా. క. | కాదంబరీ కల్యాణము |
| కా. ప్ర. | కావ్య ప్రకాశము |
| కా. సం. | కావ్యాలంకార సంగ్రహము |
| కువ. | కువలయానందము |
| చంద్రా. | చంద్రాలోకము |
| చూ. | చూడుడు |
| ద. రూ. | దశరూపకము |
| నా. శా. | నాట్య శాస్త్రము |
| పు. | పుట |
| ప్ర. రు. | ప్రతాపరుద్రీయము |
| ర. గం. | రస గంగాధరము |
| ర. మం. | రస మంజరి |
| లక్ష. | లక్షణము |
| వివ. | వివరణము |
| శ్లో. | శ్లోకము |
| సా. ద. | సాహిత్య దర్పణము |
| హిం. సా. కో. | హిందీ సాహిత్య కోశ్ |

### ENGLISH

**C. S. L.** A companion to Sanskrit Literature

**S. C. A. S.** Some concepts of the Alankara Sastra

# 1

## కావ్యవిభాగము

*అంగజములు :* వివరములకు ముందు చూ. అలంకారములు. భావము, హావము, హేల - ఈ మూడును అంగజములయిన అలంకారములు. (చూ. ఆయా శీర్షికలు.) అంగజములకే శరీరజములనియు పేరు.

*అగూఢము :* వివరములకు - ముందు చూ. గుణీభూత వ్యంగ్యము. ఎనిమిది విధములుగానున్న గుణీభూతవ్యంగ్య కావ్యములందు ఈ 'అగూఢము' అనునది ఒక భేదము. ఇందులో వ్యంగ్యార్థముకన్న వాచ్యార్థమే మనోహరముగా భాసించును. దీనిని అలంకారికులు మధ్యకావ్యముగా పరిగణించినారు. ఇందు వ్యంగార్థము అప్రధానము (చూ. వ్యంగ్యము, చూ. వాచ్యము, మధ్యమకావ్యము.)

అగూఢమనగా వ్యంగ్యము గూఢముగా లేకపోవుట. అగూఢమగు ఈవ్యంగ్యము మనోహరముగా ఉండదు. అందువల్లనే ఇది గుణీభూతవ్యంగ్య భేదమగుచున్నది.

ఉదాహరణము :- ''ఈ శత్రునగరములిప్పుడు పడిపోయిన కవాటములతో, కొల్లగొట్టబడిన బంగారముతో, చింపబడిన డేరాలతో నరసభూపతి శౌర్యమును చాటుచున్నవి.

క॥ పరిపతిత కవాటములై । పరిపాటిత కనకకూట పటవాటములై
అరినికరపుర ప్రకరము । లరుదుగ నరసింహు శౌర్యమంతయుఁదెలుపున్.

—నరసభూపాలీయము II ఆ. 149ప.

నరసభూపతి శత్రువులను గెలిచినాడు అని ఇందలి వ్యంగ్యము. కాని ఇదిగూఢముగనులేదు; అందముగనులేదు. అందువలననే అగూఢగుణీభూత వ్యంగ్య కావ్యమయిపోయినది. ఇక్కడ వ్యంగార్థముకన్న వాచ్యార్థము మనోహరముగాఉన్నది. 'శౌర్యమును చాటుచున్నది' అను మాటలో అగూఢత యున్నది. ఈ మాట తీసివేసినచో వ్యంగ్యము మనోహరమగును.

*అజహత్ స్వార్థ :* వివరములకు, ఉదాహరణములకు చూ. ఉపాదానలక్షణ. ''యత్రస్వాయ మనుపయుజ్య మానో ముఖ్యోఽర్థః స్వవిశేషరూపే అర్థాంతరే పరిణమతి తత్ర ముఖ్యార్థస్య స్వవిశేషరూపార్థాంతర సంక్రమితత్వాదర్థాంతర సంక్రమితవాచ్యత్వమ్...అత్రాద్యే ముఖ్యార్థస్య అర్థాంతరే సంక్రమణం ప్రవేశః నతుతిరోభావః అతఏవాత్ర అజహత్ స్వార్థాలక్షణా'' (సా. ద. IV-199పే-201పే) తాను స్వయముగా

నుపయోగపడజాలని ముఖ్యార్థము స్వవిశేషరూపమగు నర్థాంతరమున పరిణమించినపుడు అర్థాంతరసంక్రమిత వాచ్యమగును. ముఖ్యార్థము తానదృశ్యమైపోకుండ అర్థాంతరమున సంక్రమించుటచే (ప్రవేశించుటచే) ఈ పదము సార్థకము. అజహత్=విడిచిపెట్టని, స్వార్థ=వాచ్యార్థముగలది అజహత్స్వార్థ.

***అజహదభిధేయ :*** వివరములకు చూ. ఉపాదానలక్షణ. అజహత్=విడిచిపెట్టని ; అభిధేయ=వాచ్యార్థముగలది అజహదభిధేయ. చూ. అభిధేయము.

***అజహదర్థ :*** వివరములకు, ఉదాహరణములకు చూ. ఉదానలక్షణ. అజహత్=విడిచిపెట్టని ; అర్థ=వాచ్యార్థముగలది అజహదర్థ,

***అజహద్వాచ్యా :*** వివరములకు, ఉదాహరణములకు చూ. ఉపాదానలక్షణ. అజహత్=విడిచిపెట్టని; వాచ్య=వాచ్యార్థముగలది అజహద్వాచ్యా. చూ. వాచ్యము.

***అజహల్లక్షణ :*** వివరములకు, ఉదాహరణములకు చూ. ఉపాదానలక్షణ. అజహత్=వాచ్యార్థమును విడువని లక్షణ=లక్షణాశక్తి అజహల్లక్షణ చూ. లక్షణ.

***అతిమనోరమము :*** ''వ్రజ్యాక్రమేణ రచితః సఏవాతి మనోరమః'' సజాతీయా మేకత్ర సంనివేశో వ్రజ్యా'' అని సాహిత్యదర్పణము (సా. ద. VI పరి. 356 పే. 329 శ్లో). కోశము (అన్యోన్య నిరపేక్షక శ్లోకసమూహము) వ్రజ్యాక్రమమున రచితమగునేని అతి మనోరమము. వ్రజ్యయనగా సజాతీయములైన వానినొకచోటికి చేర్చుట. ఉదా :- ముక్తావళి.

***అత్యంత తిరస్కృతవాచ్యము :*** వివరములకు ముందు చూ. ధ్వని, లక్షణామూలధ్వని. అవివక్షిత వాచ్యధ్వనియొక్క రెండుభేదములందు మొదటిది అత్యంత తిరస్కృతవాచ్యము. రెండవదాని వివరములకు చూ. అర్థాంతర సంక్రమితవాచ్యము. అత్యంతతిరస్కృత వాచ్యధ్వనికి మూలము లక్షణ లక్షణ చూ. లక్షణలక్షణ (జహల్లక్షణ).

ఒక వాక్యముయొక్కగాని ఒక పదముయొక్కగాని వాచ్యార్థము ఆ ప్రకరణమునకు సరిపడకపోవచ్చును. అప్పుడా వాచ్యార్థము పూర్తిగా తిరస్కరింపబడినదన్న మాట. దీనినే పారిభాషికముగా అత్యంత తిరస్కృతము అందురు. అప్పుడు లక్షణాశక్తి ప్రవర్తించి వాచ్యార్థమునకు సన్నిహిత సంబంధముగల వేరొక అర్థమును అనగా లక్ష్యార్థమును - బోధించును. ఈలక్ష్యార్థమును ఏ ప్రయోజమునుద్దేశించి చెప్పుకొందుమో ఆ ప్రయోజనము వ్యంగ్యము. ఈ వ్యంగ్యమే అత్యంత తిరస్కృతవాచ్యము.

''యస్త్వనుపద్యమాన ఉపాయతా మాత్రేణార్థాంతర ప్రతిపత్తిం కృత్వాపలాయత ఇవ స తిరస్కృత ఇతి'' (ధ్వన్యాలోకలోచనము II ఉద్ద్యోతము 166 పేజి కాశీ సంస్కృతసీరిస్). వాచ్యార్థము తాను నిష్ప్రయోజనమైపోయినప్పుడు అర్థాంతరముగా మారిపోయి, తాను పారిపోవును. అప్పుడర్థాం

తరమును బోధించుటకుపాయమువంటిదిగా మాత్రమే వాచ్యార్థము కనిపించును. వ్యంగ్యార్థము తెలిసిన తరువాత వాచ్యార్థముతో బొత్తిగా మనకు పనియుండదిక్కడ. ఉపాదానలక్షణలోవలె వాచ్యార్థము అంటిపెట్టుకొనియుండదు; సంపూర్ణముగా తిరస్కృతమగును. పదార్థమునకై స్వసమర్పణమిది.

అత్యంత తిరస్కృతవాచ్యము (1) పదగతముగా (2) వాక్యగతముగా రెండువిధములుగా ఉండును. ఈ రెండింటికిని ఉదాహరణములు.

(1) పదగతము : ''తనసౌభాగ్యమా ! అదంతయు సూర్యునిలోనికే ప్రవేశించినది ! తన మండలమా ! అదంతయు మంచుతోనే ముసుగువడిపోయినది ! ఇక చంద్రుడు ఎట్లుండును ? అతడిప్పుడు నిట్టూర్పుగాలులచేత గ్రుడ్డితనమువచ్చిన అద్దమువలె ప్రకాశశూన్యుడై ఉన్నాడు.''

రవి సంక్రాంత సౌభాగ్యస్తుషారావృతమండలః
నిశ్శ్వాసాంధ ఇవాదర్శశ్చంద్రమానప్రకాశతే.

(—ధ్వ. లో. II-192 పే)

ఈ ఉదాహరణములో గ్రుడ్డితనమువచ్చిన అనువాచ్యార్థము పొసగుటలేదు. గ్రుడ్డితనము అచేతనమైన అద్దమునకెట్లువచ్చును ? కనుక గ్రుడ్డితనము అను శబ్దము తాను నిష్ప్రయోజనమై అర్థాంతరబోధకు ఉపాయమును చూపించి తాను మరుగుపడిపోవును. అయితే ఇక్కడ అర్థాంతరమేమి ? గ్రుడ్డితనము ప్రకాశహీనత అను అర్థాంతరమును తెల్పుచున్నది. ఈ అర్థాంతరమువలన అప్రకాశాతిశయము=మిక్కిలి కాంతిహీనమైపోవుట అను ధ్వని స్ఫురించుచున్నది. ఇది పదగత అత్యంత తిరస్కృతవాచ్యధ్వని.

(2) వాక్యగతము :- 'మిత్రమా ! నీ ఉపకారములను లెక్కింపగలనా? కృతజ్ఞతనెట్లు చెప్పగలను ? నీవేమో నీ మంచితనమును లెస్సగా ప్రకటించినావు. ఇప్పటివలెనే చేయుచు నీవు హాయిగా నూరేళ్ళుండు !'

కం. సలిపితి కడుమేలేమన వలెనీదగుపెద్దతనముఁ బ్రకటించితి వో, చెలికాఁడ? యివ్విధముననె సలుపుచు నూరేండ్లు మనుము ! సౌఖ్యముతోడన్— (కాలం సం. II - 192 పే.). ఈవాక్యములెవరు ఏప్రకరణమున ననిరో గ్రహింపనియెడల ఇక్కడ ధ్వని తెలియదు. ఇట వక్తయొక వంచితుడు. ఒక నక్కజిత్తులవాడు తనను కష్టములలోనికి త్రోయగా వానితో ననుచున్నమాటలివి. కనుకనే ఈ వాక్యముయొక్క వాచ్యార్థమిక్కడ కుదురుటలేదు. ఈ కుదరకపోవుటను వక్తయొక్క తాత్పర్యము లేక ప్రకరణము ననుసరించి గ్రహించుచున్నాము. ఈ వాక్యార్థము అర్థాంతరమును బోధించుటకు ఉపాయమాత్రముగా మిగిలి, అది మనకు స్ఫురించగానే పారిపోయినట్లగును. ఇక్కడ అర్థాంతరమేమందురా ?— 'దుర్మార్గుడా! నీ అపకారాలను లెక్కించగలనా ? నిన్నేమన్న నా కోపముతీరును ? నీవా, నీవు పూర్తిగా దుష్టతనే ప్రకటించినావు. ఇప్పటివలె నీవింక చిరకాలము బ్రతకవు.' ఇట్లు ఇక్కడ వాచ్యము అత్యంతము తిరస్కృతమయినది. కనుక ఇది వాక్యగతాత్యంత తిరస్కృత వాచ్యధ్వని.

**అద్భుతరసము :** విస్మయము స్థాయిభావముగాగల రసము ఇది నవరసము లందొకటి. (చూ. నవరసములు. చూ. విస్మయము)

అద్భుత రసస్వరూపమునుగూర్చి సాహిత్యదర్పణమిట్లు నిరూపించెను: (చూ. సా. ద. III- (183 పే. 242-45 శ్లో) స్థాయిభావము విస్మయము. గంధర్వుడధిదేవత. పీతవర్ణము వర్ణము. లోకాతీతవస్తువు ఆలంబన విభావము. దాని గుణములుద్దీపన విభావములు. స్తంభము, స్వేదము, రోమాంచము, గాద్గద్యము, సంభ్రమము, మొదలైనవి అనుభావములు. వితర్కము, ఆవేగము, ఉన్మాదము, హర్షము, మొదలైనవి వ్యభిచారిభావములు.

ఉదాహరణము : వామనుని విశ్వరూపసాక్షాత్కారమును వర్ణించు ఘట్టము : శా॥ "ఇంతింతై వటుఁడింతయై మఱియుఁ దానింతై నభోవీథిపై నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై"- పోతన మహాకవి (కా. అం. సం. III అనుబంధము 443. పేజి) లోకవిలక్షణుడగు వటువు ఆలంబనవిభావము. దానిగుణములుద్దీపనములు. రోమాంచగాద్గద్యాదులను భావములాక్షేప్యములు.

"ఈరసమును స్థాపించినవాడు నారాయణుడు. అతనిసిద్ధాంతమిది".- సత్త్వగుణాధిక్యమువలన మనకు బాహ్యప్రపంచమును మరపించునొక యానందము గలుగును. అది బ్రహ్మానందసదృశము. దీనికి లోకోత్తర చమత్కారమే ప్రాణము. చమత్కారమనఁగా మనస్సు విస్తరించుటయే మనోవిస్తారమనఁగా విస్మయమే కదా ! కావున విస్మయమెల్ల రసములకును మూలకారణము. కాబట్టి యద్భుతరసముననే మిగిలిన రసములన్నియును నిమిడియున్నవి" (-కా.అం.సం. III-311 & 312 పేజీలు)

**అధమకావ్యము :** వ్యంగ్యములేనికావ్యమధమకావ్యము.

"శబ్దచిత్రం వాచ్యచిత్రమవ్యంగ్యం త్వవరంస్మృతం । చిత్రమితి గుణాలంకారయుక్తం అవ్యంగ్యమితి స్ఫుటప్రతీయ మానార్థరహితం అవరమధమం" అని మమ్మటుడు (కా. ప్ర. I -34 పే.). వ్యంగ్యరహితమైన కావ్యమధమకావ్యము ఇది శబ్దచిత్రము, వాచ్యచిత్రము అని రెండువిధములు. చిత్రమనగా గుణాలంకారయుక్తము. అవ్యంగ్యమనగా స్ఫుటప్రతీయమానార్థరహితము. స్ఫుటమైన వ్యంగ్యములేనిది అధమకావ్యమని సారాంశము.

అధమకావ్యమే చిత్రకావ్యము. ఇది శబ్దచిత్రము, అర్థచిత్రము, ఉభయచిత్రము అని మూడువిధములని విద్యానాథుడు.

"యత్రార్థ చమత్కృత్యుపస్కృతా శబ్దచమత్కృతి : ప్రధానం తదధమం చతుర్థమ్" అని జగన్నాథుడు (అం. ర. గం. 105 పేజి.) అర్థచమత్కారముతోకూడిన శబ్ద చమత్కారము ప్రధానమైనచో నది అధమకావ్యము. ఇది నాల్గవరకమయిన కావ్యము. ఇందు అర్థచమత్కారము శబ్దచమత్కారమునందు ముసుగు వడిపోవును.

ఉదాహరణము :- శ్లో॥ మిత్రాత్రిపుత్రనేత్రాయ త్రయీ శాత్రవ శత్రవే గోత్రారి గోత్రజత్రాయ గోత్రాత్రేతే నమోనమః'' (ఆం. ర. గం. 105 పే.) నీకు సూర్యచంద్రులు నేత్రములు. నీవు వేదవిరోధులకు విరోధివి. అర్జునుని రక్షించితివి. గోవులను రక్షించితివి. నీకిదే వందనము. ఇందు శబ్ద చమత్కారము ప్రధానమైనది.

*అనిబద్ధము :* ''అనిబద్ధం పునర్గాథా శ్లోకమాత్రాది తత్పునః యుక్తం వక్రస్వభావోక్త్యా సర్వమే వైతదిష్యతే'' (భామహుని కావ్యాలంకారము I పరి. 30 శ్లో). ప్రాకృత్యపద్యమగు గాథయు. సంస్కృతపద్యమగు శ్లోకమును అనిబద్ధమనబడును, ఇందు నిబంధార్థముగాని ప్రబంధాత్మకత గాని లేవని యర్థము. ఇందు వక్రోక్తిగాని స్వభావోక్తిగాని యుండును. ముక్తకాదులు అనిబద్ధములు. ప్రబంధాదులు నిబద్ధములు.

*అనియత సంబంధవ్యంగ్యము :* వివరములకు ముందు చూ. వ్యంజన; వ్యంగ్యము.

వ్యంగ్యార్థమునకు మూడువిధములైన సంబంధములుండును. అందు అనియత సంబంధమొకటి. మిగిలినవాని వివరములకు చూ. నియత సంబంధ వ్యంగ్యము; సంబంద్ధ సంబధ వ్యంగ్యము

వాచ్య వ్యంగ్యములకు నియతమైన సంబంధములేనిచో అది అనియత సంబంధవ్యంగ్యము. ఇందనేక వ్యంగ్యార్థములు గోచరించును. ఇవియన్నియు ప్రకరణము, వక్త, బోద్ధవ్యుడు మొదలగువానినిబట్టి స్ఫురించును.

ఉదాహరణము :- (ఉపపతితో రమించి, దంతక్షతములతో అప్పుడే తోటయందుండి తిరిగివచ్చుచున్న) తన భార్యనుచూచి భర్త సందేహించుచుండగా ఆమెననుసరించి వచ్చుచున్న చెలికత్తె పలికిన మాటలివి— కం॥ పలు నొక్కులుగల తన కోమలి మోవినిగాంచి యెవడు మండిపడడు నే వలదన్న మూరుకొంటివి వెలఁది! సభృంగాబ్జమనుభవింపుమునీనిన్ (కా. లం. సం. II - 152 పే) సుందరీ తనకడకువచ్చిన తనప్రేయసిపెదవులమీది గాటులను చూచినపుడు ఏభర్త మండిపడకుండా ఉండగలడు ? నేను చెప్పినపుడు విన్నావా? వద్దువద్దని బ్రతిమాలినను నామాట పెడచెవినిబెట్టి నీవు ఆ తుమ్మెదతో గూడిన పద్మమును మూరొక్కవినావు దీనిననుభవింపక దప్పదుగదా. ఈ వాక్యము లందలి వాచ్యార్థము స్పష్టముగానేఉన్నది. దీనిని అనుభవింపుము అని నాయికను గురించి పల్కినది ముఖ్యార్థము. ఇక ఇక్కడ ప్రకరణాది వశమున అనియతముగా బహువిధములైన వ్యంగ్యార్థములు స్ఫురించుట కవకాశ మున్నది. (1) తుమ్మెద ఈమె ముఖమును కుట్టినది. మరొకడెవ్వడునుకాడు. ఈమెను శంకింపనక్కరలేదు- అని భర్తకుబోధ. (2) ఇప్పుడునేను చతురముగా సమర్థించినాను. ఇకముందిట్లు సాహసింపకుము. ప్రమాదము :- అని ఉపపతికి హెచ్చరిక (3) ఇపుడీవిధముగా నీరహస్యమును కప్పిపెట్టితిని. ఇకనుండి జాగ్రత్తసుమా అని నాయికకు హితబోధ.

ఈవిధముగా ఈ ముగ్గురికిమాత్రమేకాదు ఈ వ్యంగ్యార్థములు మరి కొన్ని అర్థములు మరికొందరికి స్ఫురించగలవు. (1) ఈమాటలే ఇరుగుపొరుగుల వారు విన్నారనుకొందము. అప్పుడు వారికర్థమగునదేమనగా ఈమె శంకింపదగి నదికాదు; నిష్కళంకశీల-అని. (2) ఈ మాటలు లోకములో కులటలకు హెచ్చ రికలుగా స్ఫురించును. ఉపపతులవలన చుంబనాదులనే గ్రహింపవలెనుకాని దంత క్షతాదులను ఆశింపరాదు-అని. (3) ఈ మాటలు సవతులకు స్ఫురింపజేయు వ్యంగ్యార్థమువేరు. ఈమె అతనికెంతో ప్రియురాలు. కనుకనే ఆమె పెదవి గాటునుచూచి సహింపలేక కోపపడుచున్నాడు. అని వారికి అసూయగలుగును. ఈ అర్థములన్నియు నిట్లుండగా తటస్థముగా నున్న విదగ్ధులకు ఆదూతిక ఎంతో చతురురాలు. ప్రమాదమునెంతచక్కగా తప్పించినది-అనిపించును.

**అనుభావము :** ఆలంబనోద్దీపనవిభావము (చూ. విభావము) ల వలన స్థాయి భావము) ఉద్బుద్ధమగును. ఆ స్థాయిభావమును వ్యక్తపఱచుమేన ప్రకాశింపజేయు క్రియావిశేషములు కటాక్షాదులు. ఇవియే అనుభావ ములు. విభావములు కారణములు. అనుభావములు కార్యములు. సామాజి కునిచే రసమునను భవింపజేయునవికావున అనుభావములు.

అనుభావమునకు నిర్వచనములు :- (1)"అనుభావో వికార స్తు భావసం సూచనాత్మకః అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకాశము 57 పేజి) అంతర్భావములను సూచించు బాహ్య వికారములే అనుభావములు. (2) అను= పశ్చాత్ భావః=ఉత్పత్తిః యేషాంతే అనుభావాః అనియొక వ్యుత్పత్తి (కా. అం. సం. తృ. ఆ. 333 పేజి). ఆయా రసములకు సంబంధించిన ఆయా స్థాయిభావముల ననుసరించి వెనువెంటనే ఉత్పన్నములగు కార్యములే అనుభావములు. (3) "అను-భావ్యతే ఇతిఅనుభావః" అనియొక వ్యుత్పత్తి. స్థాయిభావము ననుసరించి భావింపబడు కార్యము అనుభావము (ఆం. ప్ర. రు. రసప్రకరణము 241 పేజి) (4) "అనుభావయతి రత్యాదికమితి అనుభావః" అనియొక వ్యుత్పత్తి (కా.అం. సం. తృ ఆ. 333 పేజి) రతి మొదలయిన వాసనలకు స్థాయిభావములుగా మారిన తరువాత వానిని సామాజికునిచేత అనుభవింపజేయునది అనుభావము. (5) "ఉద్బుద్ధం కారణైః స్వైస్స్వైర్బహిర్భావం ప్రకాశయన్ లోకేయః కార్యరూపస్సోఽనుభావః" అని సాహిత్యదర్పణము (కా అం. సం. తృ. ఆ. 332 పేజి). లోకములో ఆలంబనకారణములచేతను, ఉద్దీపన కారణములచేతను ఒకనిలో రతి మొదలయిన స్థాభావములు ఉద్బుద్ధములగుచుండును. ఆ భావ ములను బయటికి వెల్లడించుటకు కొన్ని కార్యములు జరుగును. ఆ కారణములనే ఆలంకారిక పరిభాషలో అనుభావములందురు. (6) "కారణమైన విభావము చే రసమున్నతమైనఁ జెలఁగెడిదానం (బాహ్యాధ కటాక్షాదిక మారయ ననుభావ మయ్యె" అని నరసభూపాలీయము (III- 34 ప).

అనుభావమునకు నరసభూపాలీయమునందలి యుదాహరణము : నరస భూపాలునిమీద ఒక నాయికకు రతి కలిగినది. ఆ స్థాయిభావము ఆమె కటాక్ష

ములవలన ప్రకాశించినది. ఈ కటాక్షములు కార్యములు. నాయకుడైన నరస భూపాలుడు కారణము. ఉ "అలసాలోలములై యచంచలములై యాకేకరాగ్రంబులై యలఘువ్రీడములై యనిందితములై యానంద పూర్ణంబులై సులభాసూయములై సుతీక్ష్ణరుచులై సువ్యక్తరాగంబులై చెలువంబొందెడు చూపులింతి నెఱపెన్ శ్రీనారసింహేంద్రుపై." (III-35)

అనుభావములెన్ని ? అవియేవి ? అను విషయమున సాహిత్యదర్పణ కారుని మతమిది :- "ఉక్తాః స్త్రీణా మలంకారా అంగజాశ్చ స్వభావజాః తద్రూపాస్సాత్త్వికా భావాస్తథా చేష్టాః పరాఅపి" (కా. లం. సం. తృ. ఆ 333 పేజి అనుభావములు ఐదు రకములు (1) అంగజములు (2) అయత్నజములు (3) స్వభావజములు. ఈ మూడింటికిని అలంకారములు (చూ. అలంకారములు) అని పేరు (4) సాత్త్వికభావములు (5) చేష్టలు; వివరములకు చూ.ఆయా శీర్షికలు; శృంగారచేష్ట.

"అనుభావశ్చతుర్థాస్యాన్మనోవాక్కాయబుద్ధిభిః" (కా. లం. సం. తృ. ఆ.333 పేజీ.) అని మరొక వర్గీకరణమున్నది. అనుభావములు నాలుగు విధములు (1) మనోభవములు (2) వాగ్భవములు (3) కాయజములు (4) బుద్ధిజములు

***అనుమాన ప్రమాణము :*** ప్రత్యక్షముగా గోచరముగానిదానిని ఏదైన హేతువును పురస్కరించుకొని ఊహించుట అనుమానము. ఈ హేతువునే తర్క పరిభాషలో సాధనము, గమకము అనియు అందురు. ఇదియే లింగము. పొగవలన నిప్పును అనుమానింపవచ్చును. కొండమీద పొగకనబడినదను కొందము. పొగ హేతువుగా నిప్పు కొండమీద ఉన్నదని ఊహింతుము. ఇదియే అనుమానప్రమాణము; ఇక్కడ పొగ సాధనము. నిప్పుసాధ్యము ఇదియే లింగి లేక అనుమేయను. సాధ్యమునకు ఆశ్రయముగా నున్న దానని పక్షము అందురు.

ఇట్టి అనుమానములో వ్యాప్తి ఉండవలెను. సాధ్య సాధనముల నియత సంబంధమునకే వ్యాప్తి అనిపేరు ఎక్కడెక్కడ పొగఉండునో అక్కడక్కడ నిప్పుఉండును-అని నియతముగా చెప్పుటకు వీలున్నది. ఇదేవ్యాప్తి.

అనుమాన ప్రమాణమునకు ఉదాహరణము :- కొండయందు నిప్పు ఉన్నది. ఎందువలన ? అక్కడ పొగ ఉన్నది కనుక. ఎక్కడెక్కడ పొగఉండునో అక్కడెల్ల నిప్పుఉండును. ఇక్కడ పొగకును, నిప్పునకును నియత సాహచర్యము గమనింపదగినది.

***అనుమితివాదము :*** భరతుని రససూత్రమునకు శ్రీ శంకుకుడు చేసిన వ్యాఖ్యానమునకు అనుమితి వాదమనిపేరు. (చూ. రసము.) శ్రీ శంకుకుడు తార్కికుడు.

'విభావాను భావవ్యభిచారి సంయోగాద్ రసనిష్పత్తిః' అని భరతుని రససూత్రము. ఇందు సంయోగము, నిష్పత్తి అను పదములకు అర్థభేదమును కల్పించి భట్టలోల్లటుడు, శ్రీశంకుకుడు, భట్ట నాయకుడు, అభినవగుప్తుడు

వేరువేరు వ్యాఖ్యానములను చేసిరి. అందు శ్రీశంకుకుని వాదమున కనుమితి వాదమని పేరు. (చూ. ఉత్పత్తివాదము, భుక్తివాదము, అభివ్యక్తివాదము.)

శ్రీశంకుకుని మతమున సంయోగపదమునకు గమ్యగమన భావము, లేక జ్ఞాప్యజ్ఞాపక భావమని అర్థము. నిష్పత్తి పదమునకు అనుమితి లేక జ్ఞప్తి అని అర్థము. జ్ఞాపకములయిన విభావాదులవలన జ్ఞాప్యమైన స్థాయిభావమే రసమగును. ఇందురసము అనుకర్తయందుండును. నటునియందున్న రసమును సామాజికుడు అనుమానించుటద్వారా అనుభవించుచున్నాడని శ్రీశంకుకుని అభిప్రాయము. ఇందు విభావాదులు అనుమాపకములు. రత్యాదులు అనుమేయములు. (చూ. కా. అం. సం. III-283 పేజి)

**అనుమేయము :** అనుమానింపదగినది అని శబ్దార్థము. అనుమానప్రమాణము ద్వారా గమ్యమానమగు వస్తువు అనుమేయమగును.

తార్కికపరిభాషలోని ఈ అనుమేయమును ఆలంకారిక పరిభాషలోనికి అన్వయించి కావ్యానుమితి యను యనుక్రొత్తవాదమును లేవదీసినవాడు వ్యక్తివివేక కర్త రాజానకమహిమభట్టు.

ధ్వన్యాలోకకర్త వాచ్యము, వ్యంగ్యము అని అర్థము రెండువిధములుగా నుండునని నిరూపించెను. వ్యంగ్యమే ధ్వని. ఈ వ్యంగ్యార్థమును వ్యక్తివివేకకర్త అంగీకరింపక వాచ్యము, అనుమేయము అని అర్థము రెండు విధములుగా నుండునని ప్రతిపాదించెను. వ్యంగ్యార్థము అనుమేయములోనే అంతర్భవించునని వాదించెను. దానికై వ్యంజనావృత్తియని వేరొక శబ్దవృత్తి అనవసరమని అతని అభిప్రాయము. తార్కికపరిభాషననుసరించి శబ్దార్థములు లింగములనియు, ధ్వని లింగి అనియు నాతడు పేర్కొనెను. ఈ రెండింటికిని వ్యాప్తినతడంగీకరించెను.

వాచ్యార్థమునుండి అనుమానింపబడు అర్థాంతరమేదిఉండునో అదియే అనుమేయమని అతని నిర్వచనము. అతని శ్లోకమిది- "వాచ్యస్తదనుమితో వా యత్రార్థోఽర్థాంతరం ప్రకాశయతి।సంబంధతఃకుతశ్చిత్ సాకావ్యానుమితిరిత్యుక్తా" (కా. స్వ. 198 పే). ఇదే అతని కావ్యానుమితి సిద్ధాంతము.

అనుమేయము 1. వస్తువు, 2. అలంకారము, 3. రసము అని మూడు విధములు. ఇందు మూడవదైన రసమెల్లపుడును అనుమేయమే. తక్కిన రెండును వాచ్యములుగా కూడ ఉండవచ్చును.

***అనురణనవ్యంగ్యము :*** చూ. ధ్వని, వివక్షితాన్య పరవాచ్యము

వివక్షితాన్య పరవాచ్యము (అభిధామూలధ్వని) యొక్క రెండు భేదములందు అనురణన వ్యంగ్యమొకటి. దీనికే సంలక్ష్యక్రమవ్యంగ్యమని పేరు. రెండవభేదమునుగురించి చూ. అసంలక్ష్యక్రమవ్యంగ్యము

వాచ్యార్థము, వ్యంగ్యార్థము - రెండింటి క్రమము ఎక్కడ స్ఫుటముగా గోచరించునో దానిని సంలక్ష్యక్రమము అందురు. ఇదియే అనురణన వ్యంగ్యము.

అనురణనమనగా ప్రతిధ్వని అని అర్థము. ఒక గంట మ్రోగించి నప్పుడు ధ్వని తరువాతనే ఎప్పుడైనను లోకములో ప్రతిధ్వని వినిపించుచుం డును! ఆవిధముగానే వాచ్యార్థము గోచరించినతరువాత స్ఫురించునది వ్యం గ్యార్థము. గంట మ్రోగించునప్పుడు మొదట ఒక మ్రోత వినిపించి, తరువాత మరొక మ్రోత వినిపించునట్లు అనుక్రమముగా ఇవి రెండును గోచరించుటచేత ఈ ధ్వనిని అనురనణధ్వని అన్నారు. ఇక్కడ అనురణన అనుస్ఫురణములకు సామ్యము. కనుక సంలక్ష్యక్రమముగల వివక్షితాన్యపరవాచ్యమే అను రణనధ్వని అన్నమాట.

ఈ ధ్వని అనుస్వానధ్వని అనికూడ పేర్కొనబడును. ఇది మరల రెండు విధములు (1)శబ్దశక్తిమూలము. (2)అర్థశక్తిమూలము. ఈ విషయ మును చెప్పుచున్న కారిక ఇది -''క్రమేణ ప్రతిభాత్యాత్మ యోఽస్యాను స్వాన సన్నిభః శబ్దార్థశక్తిమూలత్వాత్ సోఽపి ద్వేధావ్యవస్థితః'' -ధ్వ.లో. II-76. ఉదాహరణకు చూ. సంలక్ష్య క్రమవ్యంగ్యము.

***అనౌచిత్యము :*** చూ. రసాభాసము, భావాభాసము.

***అన్యాపదేశి :*** కవియొక్క అవస్థలు పదియనియు అందు సహజ ప్రతిభునకును (చూ. సారస్వతుడు) ఆహార్యప్రతిభునకును (చూ. ఆభ్యాసికుడు) ఏడవ స్థలును, ఔపదేశికునకు (చూ. ఔపదేశికుడు) మూడవస్థలును నుండునని రాజశేఖరుడు కావ్యమీమాంస యందు పేర్కొనెను (కా. మీ. V-49పే.) మొదటి ఏడింటిలో అన్యాపదేశియగుట మూడవయవస్థ. (చూ. కావ్య విద్యాస్నాతకుడు, హృదయకవి, సేవిత, ఘటమానుడు, మహాకవి, కవిరాజు, ఆవేశికుడు, అవిచ్ఛేది, సంక్రామయిత).

''యఃస్వమపి కావ్యం దోషభయాదన్యస్యేత్యపదిశ్య పఠతి సోఽన్యా పదేశీ'' అని రాజశేఖరుడు (కా. మీ. V-50 పే). ఎవడు తన కావ్యమును దోషభయముచే అన్యరచనగా ప్రకటించి చదువునో అతడన్యాపదేశి.

***అపరాంగము :*** గుణీభూత వ్యంగ్యముయొక్క అష్టభేదములందొకటి. (చూ. గుణీభూతవ్యంగ్యము) మిగిలిన భేదముల వివరములకు చూ. అగూఢము, వాచ్యాంగము, అస్ఫుటము లేక అప్రకాశము, సందిగ్ధము, తుల్య ప్రాధాన్యము, కాక్వాక్షిప్తము, అరుచిరము.

వ్యంగ్యార్థము అప్రధానమై వాచ్యార్థము ప్రధానముగా గల కావ్యము గుణీభూత వ్యంగ్యము. అందలి భేదమేఅయిన అపరాంగమునందు రసాదులు రసాదులకుఅంగములగుట తటస్థించును. రసాదులనగా రసము, భావము, రసా భాసము, భావాభాసము, భావశాంతి, భావోదయము, భావసంధి, భావశబలత మొదలయినవి. ఇవిఅన్నియు తమలో ఒక్కొక్కదానికి అంగములగుటవలన అనేకవిధములైన అపరాంగములు ఏర్పడును. ఉదాహరణకు ఒక రసమునకు (1) వేరొకరసము అంగమగుట (2) భావము అంగమగుట (3) రసాభాసము అంగమగుట(4) భావాభాసము అంగమగుట (5) భావశాంతి అంగమగుట

(6)భావోదయము అంగమగుట (7)భావసంధి అంగమగుట (8) భావశబలత అంగమగుట.

ఒక రసమునకు వేరొకరసమంగమయినందుకు ఉదాహరణము :- "ఔరా! నరసభూపతి ఖడ్గపుత్రిక శత్రువుకడకుచేరి మెడగ్రుచ్చి కౌగిలించి, పారవశ్యము కలిగించి మోహనిద్రలో ముంచుచున్నది.

క॥ మెడగ్రుచ్చి కౌఁగిలించును
నొడ నొల్లఁబారవశ్య మొందిఁచునరిన్
వడిమోహనిద్రవుచ్చును
బుడమి నృసింహేంద్రు ఖడ్గపుత్త్రికయౌరా ॥

—నరసభూపాలీయము II ఆ. 151 ప.

ఇందులో శృంగారరసము రౌద్రరసమునకు అంగమయిపోయినది. ఇక్కడ రౌద్రము అంగిరసము. ఇదివిరుద్ధరససమావేశము.

**అపస్మారము :** వ్యభిచారిభావములందొకటి (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- (1) "ఆవేశో గ్రహదుఃఖాద్యై రపస్మారో యథావిధిః। భూపాతకంపప్రస్వేదలాలాఫేనోద్గమాదయః" అని దశరూపకము (ద. రూ నాలుగవ ప్రకా. 62 పేజి 31 సం.) గ్రహదుఃఖాదులవలన కలుగు ఆవేశము అపస్మారము. నేలమీద పడిపోవుట, వణఁకుట, స్వేదము, నోట్రిచొంగలు మొదలయినవి అనుభావములు (కార్యములు) (2) ఆవేశో మోహదుఃఖాద్యైరపస్మారోఽంగతాపకృత్" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 285 పేజి 22 సం). మోహము, దుఃఖము మొదలయిన వానివలనకలుగుఆవేశము అపస్మారము.అవయవతాపముఅనుభావము.(కార్యము). 3)మనఃక్షేపస్త్వపస్మారో గ్రహాద్యావేశనాదిజః భూపాతకంపస్వేదఫేనలాలాజలాదికారకః" అని సాహిత్యదర్పణము (సా.ద. III-146 పే. 153 శ్లో.) గ్రహాదుల ఆవేశనాదులవలన (మనఃక్షేపము) మనస్సు చెదిరిపోవుట, అపస్మారము, నేలమీఁదపడుట, వణఁకుట, స్వేదము, నోటిచొంగలు మొదలయినవి అపస్మారమువలనకలుగు అనుభావములు (కార్యములు). (4)'ధాతుచలనము దనరనపస్మారమనఁగఁదగు" అని నరసభూపాలీయము(III-366 పే. 33సం)."ధాతువులగు వాత, పిత్త, శ్లేష్మములయొక్క కదలికవలన నపస్మారము గలుగును" (కా.అం.సం III-370). (5)"వియోగ శోకభయ జుగుప్సాదీనామతిశయాత్ గ్రహావేశాదేశ్చ ఉత్పన్నో వ్యాధివిశేషోఽపస్మారః' అని రసగంగాధరము (కా. అం. సం. III-370 పే.). వియోగము, శోకము, భయము, జుగుప్స మొదలైనవాని అతిశయము వలనను, గ్రహావేశాదులవలనను పుట్టిన వ్యాధివిశేషము అపస్మారము. (6) "ఇది వ్యాధిలో నంతర్భవించును. కాని విశేషాకారముగాఁ జెప్పుటవలన బీభత్స, భయానకరసములలో నీయపస్మారమే వ్యభిచారియగును. కాని కేవలవ్యాధి వ్యభిచారి కాఁజాలదు. దీనికి వియోగ శోకాదుల యతిశయము విభావము. కంప, ఫేన, నిశ్శ్వాస, భూపాత, విపర్యాస,

జిహ్వాలోలనాదు లనుభావములు'' అని (శ్రీ) సన్నిధానంవారి వివరణ. (కా. లం. సం. III-370 పే.)

ఉదాహరణము : కం ''మదనగ్రహంబు సోఁకెను/సుదతీమణి దీర్ఘ దృష్టిఁజూచెడుఁ జెలులన్ ముద మొదవ రతుఁగట్టుఁడు మదవతికి నృసింహ నామమంత్రము కతనన్'' —కాలం సం III-92. ఇందు మదనావేశము విభావము (కారణము), దీర్ఘదృష్టి అనుభావము (కార్యము). అపస్మారము వ్యక్తమయినది.

*అప్రకాశము/అస్ఫుటము* : గుణీభూతవ్యంగ్యముయొక్క అష్టవిధభేదములం దొకటి. అస్ఫుటమనియు దీనికి వ్యవహారము (చూ. గుణీభూతవ్యంగ్యము) మిగిలినవాని వివరములకు చూ అగూఢము, అపరాంగము, వాచ్యాంగము, సందిగ్ధము, తుల్యప్రాధాన్యము, కాక్వాక్షిప్తము, అరుచిరము.

వ్యంగ్యము అతిగూఢముగా నుండి ఆలస్యముగా స్ఫురించినపుడు అప్రకాశము. ఇందులోని అలంకారముగాని, వస్తువుగాని క్లిష్టముగా వ్యక్త మగుచుండును.''

ఉదాహరణము :- ''నరసింహుని ఖడ్గము శత్రురాజుల కీర్తిదుగ్ధ ములను త్రాగివేయును''.

క॥ శ్రీనరసింహుని భుజసన్మానిత కౌక్షేయకంబు మహిమండలిలో
నానారిపుభూ నాథ వితానార్జితకీర్తిదుగ్ధధారలు గ్రోలున్.

-నరసభూపాలీయము II ఆ. 155 ప.

ఇందులో కీర్తి అనెడి పాలను కత్తి త్రాగివేసెను. అని చెప్పుటవలన ఆ కత్తి పామువలెఉన్నది అను ఉపమానము అస్ఫుటముగా, అప్రకాశముగా ఉన్నది. ఈ ఉపమాలంకారము క్లిష్టముగా వ్యక్తమగుచున్నది.

*అభిధ* : అభిధాలక్షణావ్యంజనలనే మూడు శబ్దశక్తులలో మొదటిది. తక్కిన శక్తులను గురించి తెలిసికొనుటకు చూ. శక్తి, లక్షణ, వ్యంజన.

''తంచ సంకేతితమర్థం బోధయంతీ శబ్దస్య శక్త్యంతరా నంతరితా శక్తిః అభిధానామ'' (సా. ద. II-పరి. 30 పేజీ) సంకేతితార్థ బోధకశబ్ద శక్తి పేరు అభిధ. ఏ యితర శక్తియు దీనిని దూరము చేయజాలదు.

''సంకేతశ్శబ్దార్థయోస్సంబంధావధారణమ్''(కాలం. సం II-130పే) శబ్దార్థముల పరస్పర సంబంధనిశ్చయమే సంకేతము. సంకేతింపబడినది సంకేతితము. వివరములకు, ఉదాహరణములకు చూ. సంకేతము, సంయోగాదులు.

అభిధా (శబ్ద) శక్తిచేత బోధింపబడు అర్థము అభిధేయము. (వాచ్యము, శక్యము, సంకేతితము) అభిధేయార్థబోధకశబ్దము వాచకము. చూ. వాచకము.

అభిధాభేదములు :- చూ. రూఢిపూర్విక, యోగపూర్విక, యోగ రూఢిపూర్విక.

***అభిధాపుచ్ఛభూత*** : లక్షణాశక్తికే ఇది నామాంతరము. అభిధకు తోకవంటిది అని అర్థము. అభిధాశక్తి ముఖ్యార్థమును బోధించగా లక్షణాశక్తి ముఖ్యార్థ సంబంధము గల అర్థమును బోధించును. ముఖ్యార్థసంబంధములేని అర్థమును లక్షణాశక్తి బోధించదు. కనుకనే దీనిని అభిధాపుచ్ఛభూత అందురు. వివరములకు, ఉదాహరణములకు చూ. లక్షణ, అభిధ.

***అభిధామూలధ్వని*** . చూ. అభిధామూల వ్యంజన.

అభిధామూలధ్వని రెండు విధములు (1) సంలక్ష్య క్రమము (2) అసంలక్ష్య క్రమము. (చూ. ఆ శీర్షికలు)

అభిధామూలధ్వనినే వివక్షితాన్యపరవాచ్యము అందురు. చూ. వివక్షితాన్యపరవాచ్యము.

***అభిధామూలవ్యంజన*** : వివరములకు ముందు చూ. వ్యంజన.

వ్యంజన రెండువిధములు. అందు మొదటిది అభిధామూల వ్యంజన. రెండవదానినిగురించి చూ. లక్షణామూలవ్యంజన.

"అనేకార్థస్య శబ్దస్య సంయోగాద్యైర్నియంత్రితే ఏకత్రాఽన్యధీహేతుర్వ్యంజనా సాభిధాశ్రయా" (సా.ద. II-53పే. 24 శ్లో). "అనేకార్థమైన శబ్దమునకు సంయోగాదులచేత ఒకటనర్థము నియంత్రితముకాఁగా అన్యబోధకు హేతువయిన వ్యంజన అభిధామూల." (అం.సా ద. II-19పే. 24 సం).

అభిధమీద ఆధారపడిన వ్యంజన అభిధామూలవ్యంజన. అనేకార్థములు గల శబ్దమునకు సంయోగాదులద్వారా (చూ. సంయోగాదులు) ఏదో యొక అర్థమునే నిర్ణయించి అభిధ ముగిసిపోయిన తరువాత వ్యంజనాశక్తి తిరిగి మరియొక అభిధనాశ్రయించి అర్థాంతరమును బోధించును. దీనినే అభిధామూలవ్యంజన అందురు.

ఉదాహరణకు— "దుర్గాలంఘిత విగ్రహుడితడు ఉమా వల్లభుడు" (సాహిత్యదర్పణమునుండి చూ. అం.సా.ద. II-20 పే). దుర్గములచేత అడ్డుపడని యుద్ధముగలవాడితడు ఉమయను పేరుగల దేవికి వల్లభుడు అని ఇట ఒకరాజు వర్ణింపబడినాడు. ఇందలి శబ్దములనేకార్థకములగుటచే వ్యంజనాశక్తి ప్రవర్తించి దుర్గాదేవిచేత ఆక్రమింపబడిన దేహముగలవాడగు నితడు పార్వతీపతియగు శివుడు అను అర్థాంతరమును ప్రతిపాదించినది. ఆ రాజు గౌరీవల్లభసదృశుడని వ్యంగ్యము.

***అభిధేయము*** : అభిధాశక్తిచేత బోధింపబడు అర్థము అభిధేయము. వివరములకు చూ. అభిధ.

***అభిలాషము*** : శృంగారావస్థలందొకటిగా దశరూపకకర్తయు సాహిత్యదర్పణ కర్తయు పేర్కొనిరి. (చూ. శృంగారావస్థలు)

"అభిలాషఃస్పృహా" అని నిర్వచనము (సా. ద. III-163 పే. 191 శ్లో.) అభిలాషమనగా కోరిక.

ఉదాహరణము :- మాలతీ సాక్షాద్దర్శనము లభించగా మాధవునికి కలిగిన యభిలాషమును వ్యక్తము చేయుమాటలు-శ్లో ప్రేమార్ద్రాః ప్రణయస్పృశః పరిచయాదుద్గాఢ రాగోదయా స్తాస్తా ముగ్ధదృశో నిసర్గ మధురాశ్చేష్టా భవేయుర్మయి యాస్వన్తః కరణస్య బాహ్యాకరణ వ్యాపారరోధీక్షణా దాశంసా పరికల్పితా స్వపిభవత్యానంద సాంద్రో లయః.'' —(ఆం. సా. ద. III-83 పేజి) ఇందు మాధవుడు మాలతీ చేష్టలు ప్రేమార్ద్రములనియు, ప్రణయయస్పృశములనియు, పరిచయముద్వారా గాఢరాగోదయము కలిగించునవి యనియు, నిసర్గమధురములనియు వర్ణించుటవలన అతని అభిలాషము వ్యక్తమగుచున్నది.

ఈ అభిలాషమెట్లు కలుగును ? దశరూపకకర్త శ్లో॥ అభిలాషః స్పృహాతత్రకాంతే సర్వాంగసుందరే। దృష్టే శ్రుతేవాతత్రాపి విస్మయా నంద సాధ్వసాః సాక్షాత్ ప్రతికృతి స్వప్నచ్ఛాయామాయాసుదర్శనం। శ్రుతిర్వ్యాజాత్ సఖీగీత మాగధాది గుణస్తుతేః'' -ధ. ద. రూ. IV ప్రకా. 70 పేజి.

***అభిలాషవిప్రలంభము :*** విప్రలంభ శృంగారభేదములందొకటి. చూ. విప్రలంభ శృంగారము. (ప్రతాపరుద్రీయ మతము)

విప్రలంభః పునరభిలాషేర్ష్యా విరహప్రవాస హేతుకత్వేన చతుర్విధః। అభిలాషోనామ సంభోగాత్ ప్రాగనురాగః ( ప్ర. రు. రస ప్రక. 234 పేజి). విప్రలంభము నాలుగు విధములు (1) అభిలాషవిప్రలంభము (2) ఈర్ష్యా విప్రలంభము (3) విరహవిప్రలంభము (4) ప్రవాస విప్రలంభము. సంభోగ శృంగారమునకు ముందు నాయికా నాయకులు పొందు అనురాగమే అభిలాషవిప్రలంభము.

"కలియుటకుమున్ను కోరిక యిల నభిలాషంబు'' (నరసభూపాలీయము III-137 ప.)

ఉదాహరణము :- చ అనయము శ్రీనృసింహు లలితాంకతలంబున నుండవచ్చు; నా యనఘునఖాంకసంగతుల నందఁగవచ్చు; నృపాల మౌళితో (జనవునఁ గుల్కవచ్చు; గుణసంగతి మెచ్చులు చూపవచ్చునో। వనజదళాక్షి! యా కనకవల్లికనైనను ధన్యనౌదుగా (కా. లం. సం. III-138 ప.) ఇందు నాయిక నరసభూపాలుని సంభోగము నభిలషించుచున్నది. చూ. పూర్వరాగము.

***అభివ్యక్తివాదము :*** భరతుని రససూత్రముతకు అభినవగుప్తుడు చేసిన వ్యాఖ్యానమునకు అభివ్యక్తివాదమని పేరు. (చూ. రసము). అభినవగుప్తుడు ఆలంకారికుడు.

'విభావానుభావవ్యభిచారి సంయోగాద్ రసనిష్పత్తిః' అని భరతుని సూత్రము. ఇందు సంయోగము, నిష్పత్తి అనుపదములకు అర్థభేదమును కల్పించి భట్టలోల్లటుడు, శ్రీశంకుకుడు, భట్టనాయకుడు, అభినవగుప్తుడు

వేరువేరు వ్యాఖ్యానములు చేసిరి. అందు అభినవగుప్తుని వాదమునకు అభి వ్యక్తివాదమని పేరు. ఇదియే సిద్ధాంతస్థాయినొందినది. చూ. ఉత్పత్తి వాదము, అనుమితివాదము, భుక్తివాదము).

ఈ మతమున సంయోగపదమునకు వ్యంగ్యవ్యంజక భావమనియు, నిష్పత్తిపదమునకు అభివ్యక్తిఅనియు అర్థములు. వ్యంజకములయిన విభావాదులవలన వ్యంగ్యమైన స్థాయిభావమే రసమగును. సహృదయుని హృదయమున వాసనారూపమున (చూ. వాసన). నున్న స్థాయిభావమును విభావాదులు వ్యక్తము చేయును. అదియే రసము. అభివ్యక్తి అనగా ఇంతకు ముందున్నదానినే పైకి వెలువరించుట. ఈ మతమున విభావాదులు వ్యంజకములు. రసము వ్యంగ్యము.

ఉదాహరణము :- కావ్యమునందలి విభావములగు నాయికానాయకులు తమ విభావనవ్యాపారముచే (చూ. విభావన వ్యాపారము) సహృదయుని హృదయమున వాసనారూపముననున్న స్థాయిభావము నుద్బుద్ధము చేయగా, వారి అనుభావములు (అశ్రుపాతాదులు) తమ అనుభావన వ్యాపారముచే (చూ. అనుభావన వ్యాపారము) ఆ వాసనారూప స్థాయిభావము ననుభవింపచేయగా, వారి వ్యభిచారిభావములు (నిర్వేదాదులు) తమ వ్యభిచారణవ్యాపారముచే (చూ. వ్యభిచారణవ్యాపారము) ఆ స్థాయిభావమును సంచరింపజేయగా అప్పుడు సహృదయుని హృదయము బాహ్యావిషయజ్ఞానమునుండి విముక్తమై శుద్ధముకురమువలె భాసిల్లి కావ్యగత విభావాదులన్నింటితో విలసిల్లుటవలన సత్త్వగుణోద్రేకము కలుగును. ఈ యుద్రేకమువలననే సహృదయుడు తనలోనున్న స్థాయిభావమును (వాసనను) తాను భావించి అనుభవించును. కావ్యగత నాయికానాయకులతనికప్పుడు సాధారణ వ్యక్తులుగా కనిపింతురు. అప్పుడతనికనిర్వచనీయానందము గలుగును. అదియే రసానందము. ఇది బ్రహ్మానంద సహోదరము. బ్రహ్మానందము కేవలానందము. విభావాదులతో కూడినది. ఆనందస్వరూపమగు ఆత్మను అజ్ఞానమునుండి విముక్తముచేసి వాసనలననుభవింపజేయునవి కావ్యమునందలి విభావాదులు. (చూ. కా. అం. సం. III-285-290 పేజీలు).

**అభ్యాసము** : కావ్యహేతువునందొక యంశము.

చూ. ప్రతిభ, వ్యుత్పత్తి.

"అవిచ్ఛేదేన శీలన మభ్యాసః సహి సర్వగామీ సర్వత్ర నిరతిశయం కౌశలమాధత్తే సమాధిరాంతరః ప్రయత్నో బాహ్యాస్త్వభ్యాసః, తావుభావపి శక్తిముద్భాసయతః" అని రాజశేఖరుడు (కా.మీ. IV-29పే.). విచ్ఛేదములేని అనుశీలనమభ్యాసము. ఇది సర్వగామియై సర్వవిషయములందును అత్యంత నైపుణ్యమును కలిగించును. 'సమాధి' ఆంతరప్రయత్నము కాగా అభ్యాసము బాహ్యప్రయత్నము. సమాధి, అభ్యాసము ఈ రెండును ప్రతిభ (శక్తి) ను ప్రదీపింపజేయును.

'కావ్యజ్ఞశిక్షయాఽభ్యాసః'। కావ్యం కర్తుం విచారయితుంచ యే జానంతి తదుపదేశకరణే యోజనే చ పౌనఃపున్యేన ప్రవృత్తిః -అని మమ్మటుడు (కా. ప్ర. I ఉల్లాస 3 శ్లో. వృత్తి.) కావ్యకర్తల, కావ్యవిమర్శకుల ఉపదేశములందును, యోజనమునందును పలుమారులు వర్తించుటయే అభ్యాసము.

'కావ్యవిచ్ఛిక్షయా పునఃపునః ప్రవృత్తి రభ్యాసః' అని హేమచంద్రుడు (కా. శ్వ. 147 పే.) కావ్యవేత్తల శిక్షననుసరించి పునఃపునః ప్రవృత్తినొందుట అభ్యాసము.

అమర్షము : 'రోషము' అనికూడా అందురు. వ్యభిచారి భావములందొకటి (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- "అధిక్షేపావమానాదే రమర్షోఽభి నివిష్టతా తత్ర స్వేద శిరఃకంపతర్జనా తాడనాదయః" అని దశరూపకము (ధ.ద.రూ నాలుగవ ప్రకా. 61 పేజి 22 సం) అధిక్షేపము, అవమానము మొదలైన వాని వలన కలుగు పగ (అభినివిష్టత) అమర్షము స్వేదము, శిరఃకంపము, భయపెట్టుట, కొట్టుట మొదలైనవి అనుభావములు (కార్యములు. (2) "అమర్షః సాపరాధేషు చేతః ప్రజ్వలనం మతం" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు రసప్రక. 287 పేజి 25 సం.). అపరాధము చేసినవారియందు మనస్సు మండుట అమర్షము. (3) "నిందాక్షేపావ (ప) మానాదే రమర్షోఽ భినివిష్టతా నేత్రరాగ శిరఃకంప భ్రూభంగోత్తర్జనాదికృత్" అని సాహిత్యదర్పణము (సా. ద. III-147 పే. 156 శ్లో.) నింద, ఆక్షేపము, అవమానము మొదలయిన వానివలన కలుగు పగ అమర్షము. దీనివలన కను లెఱ్ఱబడుట, తలనాడించుట, బొమముడివేయుట, బెదిరించుట మొదలయినవి కలుగును ఇవి దానికార్యములు. (4) ఎందును గృతాపరాధులయందు మనం బెరియ రోషమగు" అని నరసభూపాలీయము (III-32 ప.). (5) "పరకృతావజ్ఞాది నానాపరాధజన్యః మౌనవాక్యాది పారుష్యాది కారణీభూతశ్చిత్తవృత్తి విశేషోఽమర్షః' అని రసగంగాధరము (కా. లం. సం. III-351 పే). పరులుచేసిన అవజ్ఞారూపమగు అనేకాపరాధములవలన కలిగిన చిత్తవృత్తి విశేషము అమర్షము ఇది మౌనవాక్యములు, వాక్పారుష్యము మొదలయిన వానిని కలిగించును. (ఇవిదాని కార్యములు)

స్థాయిభావమగు క్రోధమునకును వ్యభిచారియగు అమర్షమునకును గల భేదమును వివరించుచు రసగంగాధరకారుడిట్లు వ్రాసెను :- "గురుబంధువధాది పరమాపరాధ జన్మా ప్రజ్వలనాఖ్యః చిత్తవృత్తి విశేషః క్రోధః। అయంచ పరవినాశాది హేతుః క్షుద్రాపరాధ జన్మాతు పరుషవచన-అసంభాషణాది హేతుః అయమేవ అమర్షాఖ్యో వ్యభిచారీతి వివేకః" (కా. లం. సం III-326 పేజి). గురుబంధువధ మొదలైన గొప్పగొప్ప అపరాధముల వలన పుట్టిన ప్రజ్వలనమను చిత్తవృత్తి విశేషమయినచో క్రోధము. అది

పర వినాశనమును చేయును. కాని ఏదో చిన్న అపరాధమువలన పుట్టిన చిత్తవృత్తి విశేషమయినచో అది పరుషవచనములకు, మౌనమునకు మాత్రమే హేతువగును. ఇది అమర్షము.

ఉదాహరణము :- ఒక నాయికా సఖి మన్మథునితో ననుచున్న మాటలు— కం॥ "నిలునిలు మనంగ! యొచటికిఁ దొలఁగెదు నరసింహుఁ డింతితోఁ గూడినఁ జా లలరు భవదీయచాపము కలుగానుగఁ ద్రిప్పి పిప్పి గాఁవింతున్" కాలం సం III-63. ఇందు మన్మథాపరాధము విభావము (కారణము), పరుషవచనమనుభావము (కార్యము). అమర్షము ధ్వని.

**అయత్నజములు** : వివరములకు ముందు చూ. అలంకారములు. శోభ, కాంతి, దీప్తి, మాధుర్యము, ప్రగల్భత, ఔదార్యము, ధైర్యము -ఈ యేడును అయత్నజములయిన అలంకారములు. (వివరములకు చూ. ఆయా శీర్షికలు)

**అరతి** : శృంగారావస్థలందొకటి (చూ. శృంగారావస్థలు).

నిర్వచనములు :- (1) "అన్యత్రాప్రీతి రరతిః" (ప్ర. రు. రసప్రక. 232 పే 92 సం.) అని ప్రతాప రుద్రీయము. ప్రియునియందే తప్ప మిగిలిన విషయములందు ప్రీతిలేకపోవుట అరతి. (ప్రియవ్యతిరిక్తవిషయ వైరాగ్యము. (2) "అరతి యన విషయనివృత్తి...ఆహారాదులందుఁ బ్రీతిలేకుంట యరతి యనబడును" అని సన్నిధానంవారు. (కా. లం. సం. III-398పేజి).

ఉదాహరణము :- శా "ఆహారంబునుమాని, పూని విషయ వ్యావృత్తినిన్ జిత్తమున్ సోఽహం వృత్తికిఁ దిప్పి, నిల్పఁబడ నాసాగ్రంబునం జూపువా। గ్రాహిత్యంబు వహించి శూన్యముగ లోకంబెల్ల భావింతువో, హాహా! యోగినివో! వియోగినివో? నాకోసీ! చెలీ! చెప్పవే!" —(కా. లం. సం. III-398 పేజి.) విరక్తిగొన్న నాయికతో చెలికత్తెయనిన మాటలివి. ఇందు అరతి స్పష్టము.

**అరుచిరము/అసుందరము** : గుణీభూత వ్యంగ్యముయొక్క అష్టవిధభేదములందు ఒకటి. (చూ. గుణీభూతవ్యంగ్యము). మిగిలినవాని వివరములకు చూ. అప్రకాశము, అగూఢము, అపరాంగము, వాచ్యాంగము, సందిగ్ధము, తుల్యప్రాధాన్యము, కాక్వాక్షిప్తము.

వ్యంగ్యము వాచ్యమువలె మనోహరముగా లేనప్పుడు అరుచిరము. ఇందు వాచ్యమే సుందరముగా నుండును.

ఉదాహరణము :- "నరసభూపాలా! మనోజబాణములహతిచే తట్టుకొనలేనిదై ఆమె ప్రాణములు బయటికి వచ్చి నేత్రమార్గమునుండి ప్రాకుచు అక్కడ కన్నీటి నది అడ్డముకాగా నిలిచిపోయినవి. ఆమెనింక మన్నించుట న్యాయము"

మ॥ బలితంబైన మనోజబాణహతిచేఁ బల్మాఱు నిల్పోపలే
కలినీలాలక ప్రాణముల్వెడలి నేత్రాంభోజమార్గంబునన్

గలయంత్రాకచువచ్చి యన్నెలవునం గన్నీటియేఅడ్డమై
నిలుపన్ నిల్చె నృసింహభూరమణ ! మన్నింపంగఁ బాఁడింతటన్.
-నరసభూపాలీయము II ఆ. 168 ప.

'ఇందులో నీవు రాకున్నచో ఆమె ప్రాణాలను విడుచును' అను వ్యంగ్యము స్ఫురించుచున్నది. ఇది వాచ్యార్థముకన్న సుందరముగాలేదు. ''ఆమెనింక మన్నించుటన్యాయము'' అనువాక్యము లేనిచో, నీవురాకున్నచో ఆమె ప్రాణములు విడుచును. అను వ్యంగ్యము సుందరముగానే యుండును. ఆమెనింక మన్నించుటన్యాయము.'' అనువాక్యముచే ఆ వ్యంగ్యము సుందరమైనది.

**అర్థపాకము** : పాకమునకే మరొకపేరు. శయ్యాశబ్దపాకము. అర్థగాంభీర్యము అర్థపాకము (చూ. కాలం. సం. II-178 పేజి).

**అర్థవృత్తులు** : వివరములకు చూ. వృత్తులు.

**అర్థశక్తి మూలధ్వని** : వివరములకుముందు చూ. ధ్వని, అభిధామూలధ్వని, సంలక్ష్య క్రమవ్యంగ్యము.

సంలక్ష్యక్రమవ్యంగ్యముయొక్క మూడు భేదములందు అర్థశక్తి మూలధ్వని యొకటి. (మిగిలినవాని వివరములకు చూ. శబ్దశక్తిమూలధ్వని, ఉభయశక్తిమూలధ్వని.)

శబ్దములను మార్చినప్పటికిని ఎక్కడ ధ్వనికి భంగము కలుగదో అది అర్థశక్తిమూలధ్వని. అర్థశక్తిమూలధ్వని భేదములకు చూ. సంలక్ష్యక్రమ వ్యంగ్యము.

ఉదాహరణములకు చూ. స్వతస్సిద్ధ అర్థశక్తి మూలధ్వని.

**అర్థశక్తి మూలవ్యంజన** : వివరములకు ముందు చూ. వ్యంజన.

అభిధామూలమైన లక్ష్యక్రమవ్యంజన ముప్విధము. అందిది రెండవది మిగిలినవానివివరములకు చూ. శబ్దశక్తిమూలవ్యంజన; ఉభయశక్తి మూల వ్యంజన.

'శబ్దపరివృత్తి సహత్వే అర్థవ్యంజనా' (కా. లం. సం. 166పే). ఎక్కడ వ్యంజకములగు శబ్దములను మార్చి వాని పర్యాయపదములనుంచి నను వ్యంగ్యార్థమునకు భంగము కలుగదో అక్కడ అర్థశక్తి మూలవ్యంజన. ఇది శబ్దశక్తిమూలవ్యంజననకు విరుద్ధమైనది. (చూ. శబ్దశక్తి మూల వ్యంజన). వాచ్యార్థమే తనయందున్న సౌందర్యవిశేషమువలన అర్థాంతర మునకు హేతువగును. ఇది వక్తనుబట్టి ప్రకరణమునుబట్టి బోద్ధవ్యునిబట్టి తెలియును.

ఉదాహరణము :- ఒక ప్రోషితభర్తృక తనయింటికివచ్చిన బాట సారితో పలికిన మాటలు ''గీ ఇచట మాయత్తపండు; నేనిటఁబరుండుఁ బగటనే లెస్సగని గుర్తుపట్టుకొనుము! ఓ నిశాంధుఁడ! పాంథుఁడా! యొప్పు దప్పి పడకుమీ; మాదు మంచాలపైని రేయి'' -(కా. లం. సం. II-166పే).

ఆమె అభిప్రాయమిందు వ్యంగ్యము. నా మంచమును గుర్తుంచుకొని, చీకటిలో నాదగ్గరకు రమ్మని ఆమె అభిప్రాయమదియిందు అర్థాంతరము. ఇట పడిపోకు అని నిషేధార్థక శబ్దమునకు బదులుగా తూలిపడకు, జారిపడకు వంటి పర్యాయపదములను ప్రయోగించినను వ్యంగ్యభంగము జరుగదు. అందుచే ఇది అర్థశక్తిమూలవ్యంజన.

అర్థశక్తిమూలవ్యంజనా వైలక్షణ్యమునకు చూ. కావ్యప్రకాశము తృతీయోల్లాసము.

*అర్థాంతరసంక్రమితవాచ్యము* : నామసార్థక్యమునకు చూ. అజహత్స్వార్థ వివరములకు, ఉదాహరణములకు చూ. ఉపాదానలక్షణ

*అర్థాంతరసంక్రమితవాచ్యము* : వివరములకుముందు చూ. ధ్వని, లక్షణామూలధ్వని, అవివక్షితవాచ్యము. లక్షణామూలధ్వని (అవివక్షిత వాచ్యము) యొక్క రెండు భేదములందు ఈ అర్థాంతర సంక్రమితవాచ్యమొకటి. రెండవభేదమును గురించి చూ. అత్యంత తిరస్కృతవాచ్యము. అర్థాంతరమున సంక్రమింపజేయబడిన వాచ్యార్థముగల ధ్వని యిది (చూ. అజహల్లక్షణ).

అర్థాంతర సంక్రమితవాచ్యము వాక్యగతము, పదగతము అని రెండు విధములు. ఈ రెండింటికిని ఉదాహరణములు :

(1) పదగత అర్థాంతరసంక్రమితవాచ్యధ్వని : "కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథువర్ణించు జిహ్వజిహ్వ." ఇందు ఆమ్రేడితమైన కరములు, జిహ్వ అనుపదములకు ముఖ్యార్థబాధ కలుగుచున్నది. అప్పుడు లక్షణాశక్తివల్ల (అజహల్లక్షణ) ఉత్తమకరములు, ఉత్తమ జిహ్వ అను అర్థాంతరములు వచ్చును. ఇట్లు వాచ్యార్థము అర్థాంతరమున సంక్రమించినది. ఇందు స్వార్థముతో కూడియే లక్ష్యార్థము భాసిల్లుచున్నది.

(2) వాక్యగత అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని :- "యవనులారా! మీ మనస్సున గ్రొవ్వుమానుడు"

"...యావనులే మనమునఁ గొవ్వుమానుఁడన మత్తతురుష్కులఁ ద్రుంచునీతఁడన్ ధ్వని యితరార్థ సంక్రమితవాచ్యము"

—నరసభూపాలీయము II ఆ. ౯౭ ప.

ఈ వాక్యము నరసభూపాలుని శత్రువులైన యవనులను గూర్చి చేసినహెచ్చరిక. యవనులెందుకు క్రొవ్వుమానవలెనను ప్రశ్నవచ్చి ముఖ్యార్థము తేలకున్నది. అప్పుడు లక్షణాశక్తివల్ల 'నరస భూపాలుడు మదించిన యవనులను చంపివేయును' అను అర్థాంతరము బోధ్యమగును. ఇట్లు వాచ్యార్థము అర్థాంతరమున సంక్రమించినది.

*అలంకారములు* : యౌవనవతియగు నాయిక మనోవికారములను వ్యక్తముచేయు అనుభావాదులను (శృంగారచేష్టలు మొనవి) దశరూపక కర్త అలంకారములని పేర్కొనెను.

"యౌవనే సత్త్వజాః స్త్రీణాం అలంకారాస్తు వింశతిః" -(ధ.ద.రూ. రెండవ ప్రకాశము—27 పేజి 48 సంఖ్య)— యౌవనమునందు స్త్రీలకు సత్త్వజములగు అలంకారములిరువది యుండును. ఈ యలంకారములు దశ రూపకమున త్రివర్గములుగా విభజింపబడినవి. (అ) శరీరజములు :- 'భావో హావశ్చ హేలాచ త్రయస్తత్ర శరీరజాః' (ధ. ద రూ. 27 పే. 49 సం). (1) భావము (2) హావము (3) హేల. (ఆ) అయత్నజములు :- శోభా కాంతిశ్చ దీప్తిశ్చ మాధుర్యంచ ప్రగల్భతా ఔదార్యం ధైర్యమిత్యేతే సప్తభావ అయత్నజాః (ధ. ద. రూ. 27 పే. 49 సం.) (1) శోభ (2) కాంతి (3) దీప్తి (4) మాధుర్యము (5) ప్రగల్భత. (6) ఔదార్యము (7) ధైర్యము. (ఇ) స్వభావజములు :- 'లీలావిలాసో విచ్ఛిత్తిర్విభ్రమః కిలకించితం మోట్టాయితం, కుట్టమితం బిబ్బోకో లలితం తథా విహృతంచే తివిజ్ఞేయా దశభావాః స్వభావజాః' (ధ. ద. రూ. 27 పే. 50సం.) (1)లీల (2) విలాసము (3) విచ్ఛిత్తి (4) విభ్రమము (5) కిలకించితము (6) మోట్టాయితము (7) కుట్టమితము (8) బిబ్బోకము (9) లలితము (10) విహృతము.

ప్రతాపరుద్రీయకర్త ఈ 'యలంకారములు' అను పరిభాషను వదిలి వేసి, శృంగారచేష్టలను 18 టిని పేర్కొనినాడు.

సాహిత్యదర్పణకర్తమాత్రము ఈ యలంకారములను పరిభాషను స్వీకరించి వాటిని 28 కి పెంచెను. అతడును అలంకారములను (1) అంగజములు (2) అయత్నజములు (3) స్వభావజములు అని త్రిర్గములుగానే విభజించెను. (అ) అంగజములు :- అష్టావింశతి సంఖ్యకాః అలంకారాస్తత్ర భావ హావ హేలాస్త్రయోఽంగజాః (సా ద. సం. తృతీయ 373 పేజి) (1) భావము (2) హావము (3) హేల. (ఆ) అయత్నజములు :- "శోభా కాంతిశ్చ దీప్తిశ్చ మాధుర్యంచ ప్రగల్భతా, ఔదార్యం ధైర్యమిత్యేతే సప్తైవ స్యురయత్నజాః (సా. ద. సం. తృతీయ 373 పేజి.) (1) శోభ (2) కాంతి (3) దీప్తి (4) మాధుర్యము (5) ప్రగల్భత (6) ఔదార్యము (7) ధైర్యము (ఇ) స్వభావజములు :- లీలావిలాసోవిచ్ఛిత్తిర్బిబ్బోకః కిలకించితం మోట్టాయితం కుట్టమితం విభ్రమో లలితం మదః। విహృతం తపనం మౌగ్ధ్యం విక్షేపశ్చ కుతూహలం హసితం చకితం కేళిరిత్యష్టాదశ సంఖ్యకాః స్వభావజాశ్చ (సా. ద. సం. తృతీయ 373 పేజి). (1) లీల (2)విలాసము(3)విచ్ఛిత్తి (4)బిబ్బోకము (5)కిలకించితము (6)మోట్టాయితము (7)కుట్టమితము (8)విభ్రమము(9) లలితము(10) మదము (11)విహృతము (12)తపనము (13)మౌగ్ధ్యము (14)విక్షేపము (15) కుతూహలము. (16) హసితము (17) చకితము (18) కేళి.

ఈ యలంకారములన్నియు నాయికాశ్రితములుగా నున్నపుడే శోభాకరములగును. "సర్వేఽప్యమీ నాయికాశ్రితా ఏవవిచ్ఛిత్తివిశేషం పుష్ణంతి"

(సా. ద. తృతీయ 121 పేజి). భావమునుండి ధైర్యము వరకుగల పది అలంకారములును నాయకునందుకూడా పొడమవచ్చును. "భావాదయో ధైర్యాంతా దశ నాయకానామపి సంభవంతి" (సా. ద. తృతీయ 121 పేజి)

శరీరజములనే సాహిత్యదర్పణము అంగజములు అన్నది.

వివరములకు, ఉదాహరణములకు చూ. ఆయా శీర్షికలు,

**అలక్ష్యక్రమము :** చూ. అసంలక్ష్యక్రమవ్యంగ్యము.

**అవహిత్థ :** వ్యభిచారిభావములందొకటి. (చూ. వ్యభిచారిభావము)

నిర్వచనములు :-(1) "లజ్జాద్యైర్విక్రియా గుప్తావవహిత్థాంగవిక్రియా" అని దశరూపకము (ద. ద. రూ. నాలుగవ ప్రకా. 64 పేజి 37 సం). లజ్జ మొదలైన వానిచే కలుగు విక్రియలను గుప్తముగా నుంచుటకు చేయు అంగవికారము అవహిత్థ. వికారము. (2)హర్షాద్యాకార సంగుప్తి రవహిత్థేతి కథ్యతే" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 288 పేజి. 26 సం.) హర్షము మొదలైన ఆకారములను కప్పిపుచ్చుకొనుట అవహిత్థ. (3) "భయ గౌరవ లజ్జాదేర్హర్షాద్యాకారగుప్తి రవహిత్థా వ్యాపారాంతర సక్త్యన్యథా వభాషణవిలోకనాదికరీ" అని సాహిత్యదర్పణము (సా. ద.III-148 పేజి. 158 శ్లో) భయము, గౌరవము, లజ్జ మొదలైనవానిచేఁగలుగు ఆకారమును దాచుట అవహిత్థ; అది మరొకపని చేయుట, మరొకమాట ఆడుట, ఎటో చూచుట మొదలయిన వానిని కలిగించును. (4) "భువిలో నాకృతి గోపన మవహిత్థ" అనినరసభూపాలీయము (III-72ప.) (5) "వ్రీడాది భిర్నిమిత్తైః హర్షాద్యను భావానాం గోపనాయ జనితో భావవిశేషోఽవహిత్థం" అని రసగంగాధరము (కా. లం. సం. III-356 పేజి). సిగ్గు మొదలైనవానిచేత హర్షము మొదలైన అనుభావములను దాచిపుచ్చుటకై పుట్టిన చిత్తవృత్తివిశేషము అవహిత్థ. (6) "అనుభావపిధానార్థోఽవహిత్థం భావఉచ్యతే తద్విభావ్యం భయవ్రీడాధార్ష్ట్యకౌటిల్యగౌరవైః" అని మరొక లక్షణము (కా. లం. సం. III-357 పేజి 16 సం.). భయము, సిగ్గు, ధార్ష్ట్యము, కౌటిల్యము, గౌరములచే అనుభావములను కప్పిపుచ్చు భావమవహిత్థ.

ఉదాహరణము :- నారదుడు పార్వతివివాహ విషయమును హిమవంతునితో ప్రసంగించుచుండెను. తండ్రిప్రక్కనున్న పార్వతీదేవి క్రిందికి చూచుచు లీలాకమలప త్రములను లెక్కించుచుండెను. శ్లో ఏవం వాదిని దేవర్షౌపార్శ్వేపితురధోముఖీ లీలాకమలంపత్రాణి గణయామాస పార్వతీ" -సాహిత్యదర్పణమునందు దాహృతమైన కాళిదాసశ్లోకము. (సా. ద. III-148 పేజి. 158 శ్లో. లక్ష్యము). ఇందు వివాహప్రసంగమువలన కలిగిన ఆనందము, లజ్జ, తండ్రియెడ గౌరవము విభావములు. ఆమె తన రోమాంచాది అనుభావములను కప్పిపుచ్చుటకై లీలాకమల పత్రగణనము, అధో

ముఖత్వముల నవలంబించినది. వీనివలన అవహిత్థ యనుచిత్త చిత్తవృత్తి వ్యక్తమగుచున్నది.

*అవిచ్ఛేది :* కవియొక్క అవస్థలు పదియనియు, అందు సహజప్రతిభునకును (చూ. సారస్వతుడు) ఆహార్యప్రతిభునకును (చూ. ఆభ్యాసికుడు) ఏడవస్థలును, ఔపదేశికునకు (చూ. ఔపదేశికుడు) మూడవస్థలను నుండుననియు రాజశేఖరుడు కావ్యమీమాంసయందు పేర్కొనెను. (చూ. కా. మీ. V-49 పేజి.) ఔపదేశికుని మూడవస్థలందును అవిచ్ఛేదియగుట రెండవ అవస్థ (చూ. కారయిత్రి), (చూ కావ్యవిద్యాస్నాతకుడు, హృదయకవి, అన్యాపదేశి, సేవిత, ఘటమానుడు, మహాకవి, కవిరాజు, ఆవేశికుడు, సంక్రామయిత).

"యో యద్వైవేచ్ఛతి తద్వైవావిచ్ఛిన్నవచనః సోఽవిచ్ఛేదీ" అని రాజశేఖరుడు (కా. మీ. V-51 పే.) ఎవడు తలచుకొన్నంతనే అవిచ్ఛిన్నముగా కవిత పలుకగలడో అతడు అవిచ్ఛేది.

*అవివక్షితవాచ్యము :* వివరములకు ముందు చూ. ధ్వని, లక్షణామూలధ్వని.

లక్షణామూలధ్వనికే అవివక్షితవాచ్యమని మఱియొక వ్యవహారము. ధ్వనియొక్క రెండు ప్రధానభేదములందును అవివక్షితవాచ్యమొకటి. రెండవదాని వివరములకు చూ. వివక్షితాన్యపరవాచ్యము (అభిధామూల ధ్వని).

అవివక్షితవాచ్యమనగా వివక్షితముకాని (పొసగని) వాచ్యార్థముగల ధ్వనియని భావము. ముఖ్యార్థబాధ కలిగినపుడు లక్షణాశక్తివలన తత్సంబంధముగల అర్థాంతరము స్ఫురించును. ఈ యర్థాంతరము లక్షణామూలధ్వని యగును. ఇదియే అవివక్షితవాచ్యము.

ఈ యవివక్షితవాచ్యము రెండువిధములు (1) అత్యంత తిరస్కృతవాచ్యము (2) అర్థాంతర సంక్రమితవాచ్యము. వివరములకు, ఉదాహరణములకు చూ. ఆ శీర్షికలు.

*అశ్రువు :* సాత్త్వికభావము లెనిమిదింటిలో నిదియొకటి. (చూ. సాత్త్వికభావము.) ఇది అనుభావము (చూ. అనుభావము.)

అశ్రువునకు నిర్వచనములు :- (1) "అశ్రునేత్రోద్భవం వారి దుఃఖరోషప్రహర్షజమ్" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రకరణము 269 పే). దుఃఖము, రోషము, హర్షము మొదలయిన వానివలన కంటినుండి పుట్టునీరే అశ్రువు. (2) "అశ్రునేత్రోద్భవం వారిక్రోధదుఃఖప్రహర్షజమ్" అని సాహిత్యదర్పణము (కా. లం. సం. 388 పేజి). క్రోధము, దుఃఖము, హర్షము మొదలైనవానివలన పుట్టు కన్నీరే అశ్రువు. (3) "దృగ్జలోజ్జృంభణ మశ్రువౌ" అని నరసభూపాలీయము. (III-87 ప.)

అశ్రువునకు నరసభూపాలీయమునుండి యుదాహరణము :- 'మన్మథాగ్నితో నిండిన నులివేడియూర్పులపొగలు పుట్టుచున్నట్లు ఆ తరుణి కంటి

రెప్పలనుండి కన్నీరు నేత్రపద్మముల నాళములనుండి దిగజారుచున్నది. నరసభూపాలా! ఇక నీవామెనాదరింపుము.' ఇందు ఆ యువతికి విరహ దుఃఖమువలన అశ్రువు కలిగినది. చం "మగువకు సంగజానల సమగ్రములౌ నులివేడియూరుపుం। బొగలెగయం జనించుగతి ముత్తెపుఁజిప్పలఁ బోలు ఱెప్పలన్ నెగడు నుదశ్రుపూరములు నేత్రసరోరుహనాళచాతురిం। డిగియె నృసింహా! యింకఁ దరుణీమణి గౌఁగిటనాదరింపుమా! కా.లం. స్మ. III-41.

**అష్టరసములు** : ఎనిమిదిరసములు (చూ. రసము).

"శృంగారహాస్యకరుణ రౌద్రవీర భయానకాః బీభత్సాద్భుత సంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యేరసాః స్మృతాః" అని భరతుని కారిక (కా. లం. సం. III-291పే) శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము- ఇవి అష్టరసములు.

***అసంలక్ష్యక్రమవ్యంగ్యము*** : వివరములకు ముందు చూ. ధ్వని, అభిధామూలధ్వని. అభిధామూలధ్వని (వివక్షితాన్యపరవాచ్యము) యొక్క రెండు భేదములందు ఈ అసంలక్ష్యక్రమవ్యంగ్యమొకటి. రెండవదాని వివరములకు చూ. సంలక్ష్య క్రమవ్యంగ్యము (అనురణన వ్యంగ్యము).

ఎక్కడ వాచ్యార్థవ్యంగ్యార్థముల క్రమము అతిసూక్ష్మముగా నుండుటచేత గోచరింపదో అది అసంలక్ష్య క్రమవ్యంగ్యము.

ఎక్కడ స్థాయిగతములును, వ్యభిచారి గతములును అయిన పూర్ణ విభావాను భావముల వర్ణనచే వినగానే రసవ్యక్తి కలుగునో అక్కడ అసంలక్ష్య క్రమవ్యంగ్యమే. దీనికి కాళిదాసు కుమార సంభవమునందలి శివపార్వతుల ప్రణయఘట్టము ఉదాహరణము.

అసంలక్ష్య క్రమవ్యంగ్యము (1) పదగతము (2) వాక్యగతము (3)వర్ణగతము (4)రచనాగతము (5)పదైకదేశగతము (6) ప్రబంధగతము అని ఆరు విధములు.

పదగతమునకుదాహరణము:- క "ఆయందంబాచందంబాయాలాప క్రమంబు నా సమయమునం బీయూషధార మైయిడె హాయిని నన్నిపుడలం చెనది వెనుజ్వరమై" -(కావ్యాలంకార సంగ్రహము 202పే.) ఇందు ఆ, ఆ అను పదములు లోకోత్తరమను అర్థమును స్ఫురింపజేయుచున్నవి.

"అక్కట! వాఁడు నా తగుల మారడిసేసి దయావిహీనుఁడై" —మనుచరిత్ర. ఇందు అక్కట అను నిపాతము వరూధినియొక్క విరహతాపాతిశయమును వ్యక్తముచేయును. ఇది అసంలక్ష్యక్రమవ్యంగ్యము.

**అసూయ** : ఈర్ష్య యని కొందరు. వ్యభిచారి భావములందొకటి. (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- (1) "పరోత్కర్షాక్షమాఽసూయా గర్వదౌర్జన్య మన్యుజా। దోషోక్త్యవజ్ఞే భ్రుకుటిమన్యు క్రోధేంగి తానిచ" అని దశ

రూపకము (ధ. ద. రూ. నాలుగవ ప్రకా. 60 పేజి. 21 సం) గర్వము, దౌర్జన్యము, కోపము మొదలయిన వానివలన పుట్టినది, పరోత్కర్షను సహింపలేనిది అసూయ. దోషవచనములు, అవమానము, బొమలు ముడి వేయుట, కోపము, క్రోధేంగితములు మొదలైనవి అనుభావములు (కార్యములు). (2)''పరోత్కర్షాసహిష్ణుత్వమసూయా పరికీర్తితా'' అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. రసప్రక. 272 పేజి 4సం). ఇతరుల గొప్పతనమును సహింపలేకపోవుట అసూయ. (3) ''అసూయాఽన్యగుణర్ధీనా మౌద్ధత్యా దసహిష్ణుతా। దోషోద్ఘోష భ్రూవిభేదా వజ్ఞాక్రోధేంగితాదికృత్'' అని (సా. ద. III-153 పే. 166 శ్లో.), సాహిత్యదర్పణము. అన్యుల గుణములయు, బుద్ధి (సంపద) యొక్కయు ఔద్ధత్యమును చూచి సహింపలేకుండుటయే అసూయ. దోషములను గట్టిగా ఘోషించుట, బొమ ముడి వేయుట, అవమానించుట, కోపచిహ్నములను చూపుట, మొదలైనవి దాని అనుభావములు (కార్యములు). (4) ''ఇతరుల యతిశయము సహింపకుండుటది యీర్ష్య'' అని నరసభూపాలీయము (III-367 పే. 30 సం) (5) పరోత్కర్ష దర్శనాది జన్యః పరనిందాది కారణీభూతశ్చిత్తవృత్తివిశేషః అసూయా'' అని రసగంగాధరము (కా. లం. సం. III-367 పే.). ఇతరుల ఉత్కర్షను చూచుట మొదలైన వానివలన పుట్టిన చిత్తవృత్తివిశేషమే అసూయ.

ఉదాహరణము :- నరసభూపాలుని దానాది గుణములవలన కీర్తికాంత అతనిని వదలకున్నదని లక్ష్మిదేవి సహింపక కీర్తికాంతను నిందించుచున్నది. కం ''ఈవికొలఁదంతె తసమే।లేవేళను బాండుశోభ; యెనయే నాకున్ వావిరిఁగీర్త్యంగన ? యని శ్రీ వెలయు నృసింహునొద్దఁ జిరతర లీలన్'' -(కాలం సం III-89) కీర్తియొక్క ఉత్కర్షమిందు విభావము, (కారణము). నిందావాక్యములు అనుభావములు (కార్యములు). అసూయ వ్యక్తమయినది.

**ఆకాంక్ష :** నిర్వచనమునకు, ఉదాహరణమునకు చూ. వాక్యము.

**అఖ్యానము :** కవి తాను స్వయముగాఁ జూచినదానినిఁ జెప్పుట యాఖ్యానము ''స్వయందృష్టార్థకథనం ప్రాహురాఖ్యానకం బుధాః'' (కాలం. సం. II-262 పేజి.)

''అస్మిన్నార్షే పునః సర్గా భవంత్యాఖ్యాన సంజ్ఞకాః'' అని సాహిత్యదర్పణము (సా. ద. VI పరి. 355 పే. 325 శ్లో). సర్గబంధము ఋషికృతమైనపుడు అందలి సర్గలు ఆఖ్యానములని వ్యవహరింపబడును. చూ. సర్గబంధము.

''ప్రబంధమధ్యే పరప్రబోధనార్థం నలాద్యుపాఖ్యాన మివోపాఖ్యానమభినయన్ పఠన్గాయన్ యదైకో గ్రంథికః కథయతి తద్ గోవిందవదాఖ్యానమ్ (భామహుని కావ్యానుశాసన భూమిక 30 పేజి) అని హేమ

చంద్రుడు (కావ్యానుశాసనము). ప్రబంధమధ్యభాగమునందు ఇతరులను ప్రబోధించుటకు నలోపాఖ్యానము మొదలైన వానివలె ఏదేని ఒక ఉపాఖ్యానమునభినయించి, పఠించి, గానము చేయుటద్వారా చెప్పబడునది ఆఖ్యానము.

**ఆఖ్యాయిక** : 'తత్కథాఽఖ్యాయ కేత్యేషా ఏకా సంజ్ఞాద్వయాంకితా.' అని దండి. (కాలం. సం II-266 పే.) కథ, ఆఖ్యాయిక అను రెండింటికిని భేదములేదు. చూ. కథ.

'ఆఖ్యాయికోచ్ఛ్వాసాదినా వక్త్రాపరవక్త్రాదినాచయుక్తా'(ధ్వ. లో. లోచ. III-324 పే.) అని లోచనకారుడు. ఉచ్ఛ్వాసములు, వక్త్రము మొదలైన పద్యములుగల కావ్యవిశేషము ఆఖ్యాయిక.

'కథాకల్పిత వృత్తాంతా సత్యార్థాఽఖ్యాయికామతా' అని శివతత్త్వ రత్నాకరము (కాలం సం II-266 పేజి). కల్పితవృత్తాంతముగలది కథ కాగా యథార్థవృత్తాంతము గలది ఆఖ్యాయిక.

'వృత్తమాఖ్యాయతే యస్యాం నాయకేన స్వచేష్టితమ్' అని యొక లక్షణమున్నట్లు కావ్యాలంకార సంగ్రహవ్యాఖ్య. (కాలం సం II-266 పేజి). నాయకుడే తన వృత్తాంతము తాను చెప్పకొను కావ్యము ఆఖ్యాయిక.

'సంస్కృతానాకులశ్రవ్య శబ్దార్థ పదవృత్తినా। గద్యేన యుక్తోదత్తార్థా సోచ్ఛ్వాసాఽఖ్యాయికామతా। వృత్తమాఖ్యాయతే తస్యాం నాయకేన స్వచేష్టితమ్। వక్త్రంచాపరవక్త్రంచకాలే భావ్యర్థశంసిచ। కవేరభిప్రాయకృతైః కథనైః కైశ్చిదంకితా కన్యాహరణ సంగ్రామ విప్రలంభోదయాన్వితా' (భామహకావ్యాలంకారము I పరి. 25-27 శ్లో). అని భామహుడు. ఆఖ్యాయిక గద్యయుతము. సంస్కృత భాషాబద్ధము. ఇందు శబ్దము, అర్థము, సమాసము అక్లిష్టములుగా నుండవలెను. విషయముదాత్తము కావలయును. ఉచ్ఛ్వాసవిభాగితమై యుండవలెను. నాయకుడిందు తన చరిత్రను తాను చెప్పకొనును. వక్త్రాపవక్త్రములనెడి ఛందోవిశేషములుండును. భావ్యర్థ కథనమటనట నుండును. కవి అభిప్రాయమును ప్రకటించుటయు నుండును. కన్యాహరణము, సంగ్రామము, విప్రలంభము, అభ్యుదయము మొదలైనవి వర్ణింపబడును.

ఆఖ్యాయికా కథావత్స్యాత్ కవేర్వంశాది కీర్తనం అస్యామన్య కవీనాంచ వృత్తం గద్యం క్వచిత్ క్వచిత్ అని సాహిత్యదర్పణము (సా.ద. VI-334శ్లో.). ఆఖ్యాయిక కథాతుల్యమే. కాని ఇందు కవి వంశాది కీర్తనముండును. అటనట ఇతరకవుల వృత్తము, గద్యము చేరుచుండును.

'వక్త్రంచాపరవక్త్రంచ సోచ్ఛ్వాసత్వంచ భేదకమ్ వర్ణ్యతేయత్ర కావ్యజ్ఞై రసావాఖ్యాయికామతా' (ప్ర.రు. కావ్యప్రక. 73-74 శ్లో. 83పేజి). వక్త్రము, అపరవక్త్రము అను పేరులుగల వృత్త విశేషములు, ఉచ్ఛ్వాస

విభాగము గల కావ్యము ఆఖ్యాయిక. హర్షచరిత్రము దీని కుదాహరణము.

*ఆధ్యానము :* చూ. చింత.

*ఆభ్యాసికుడు :* ఆహార్యప్రతిభగల కవిని ఆభ్యాసికుడని రాజశేఖరుడు పేర్కొనెను. (చూ. కారయిత్రి).

ఇహాజన్మ సంస్కారయోనిరాహార్యా (కా. మీ. IV-32 పేజి). ఆహార్యప్రతిభకు ఇహాజన్మ సంస్కారమే మూలము. ఇది ప్రయత్నసిద్ధము. ఇట్టిప్రతిభగలవాడే అభ్యాసికుడు.

'ఇహాజన్మాభ్యాసోద్భాసిత భారతీక ఆహార్యబుద్ధి రాభ్యాసికః'— (కా. మీ. IV. 32 పే).

*ఆరభటి :* వివరములకు-ముందు చూ. వృత్తులు.

అర్థవృత్తులందు ఇదియొకటి. మిగిలిన వాని వివరములకు చూ. కైశికి; సాత్త్వతి, భారతి.

"అత్యుద్ధతార్థ సందర్భావృత్తిరారభటీ స్మృతా" (ప్ర. రు. కావ్యప్రక. 51 పే.) మిగుల నుద్ధతమగు నర్థమును (రసమును) ప్రకటించు ఆంగికాభినయము ఆరభటి. రౌద్ర బీభత్సములు రెండును అత్యుద్ధతరసములు. ఈ రసములను స్ఫురింపజేయు ఆంగికాభినయము ఆరభటీవృత్తి. యుద్ధము వంటి ఉద్ధత సన్నివేశములలో ఈ ఆరభటీవృత్తి వర్ణింపబడును. "యత్ర రౌద్ర బీభత్సావతి ప్రౌఢేన సందర్భేణ ప్రతిపాద్యేతే తత్రారభటీ" (ప్ర. రు. 52 పే).

ఉదాహరణము :- మ స। ప్రతిపక్ష క్ష్మాపవక్షః ఫలక విదళన ప్రౌఢ గాఢప్రతాప ప్రతిభాసంరంభగుంభ ప్రబలసుబలకుంభన్నృసింహోగ్రరంహో యుతమై కల్పాంత దృప్యద్ద్యుమణి ధగధగ ప్రోద్యతజ్వాల జాల ప్రతికూల ప్రక్రమంబై పరగు నరసభూపాల దోఃఖడ్గమాజిన్" (నరసభూపాలీయము. II ఆ. 76 ప.) నరసభూపాలుని ఖడ్గము యుద్ధమునందెట్లు నటించునో వర్ణింపబడినది. ఇది ఆరభటీవృత్తి.

ఉద్ధతమైన ఆంగికాభినయమును (action) వర్ణించుటకు పరుషాక్షర బంధమగు దీర్ఘసమాసములు (గౌడీరీతి) సముచితములు. పై పద్యమున అట్టి రీతివలన రౌద్రరసము వ్యక్తమైనది. (చూ. గౌడి).

*ఆర్తి :* చూ. వ్యాధి.

*ఆర్థికుడు :* సప్తవిధ కవులందు ఆర్థికుడొకడని అప్పకవి పేర్కొనెను. "మితశబ్దములలోన నతివిపులార్థంబు లిమిడించు నర్థాఖ్య నెసగు నతడు" అని లక్షణము. తిక్కన ఈ తరగతికవి.

*ఆలంబనవిభావము :* వివరములకు ముందు చూ. విభావము. రెండువిధములయిన విభావములలో మొదటిది ఆలంబనవిభావము. దీనికే జనకకారణమనిపేరు.

"ఆలంబనం నాయకాది స్తమాలంబ్య రసోద్గమాత్" అని సాహిత్య

దర్పణము (తృతీయ పరిచ్ఛేదము) ఆలంబన విభావమున కిచ్చిన నిర్వచనము. రసము ఆవిర్భవించుటకు నాయికానాయకులాధారములు. అందువల్ల నాయికా నాయకులు ఆలంబనవిభావములు. కావ్యమందలి నాయికానాయకుల రతి హాసాది భావములు సామాజిక రతిహాసాదుల ఉద్బోధమునకు కారణము లగును. అందువలన వారు ఆలంబన విభావములు.

ఆలంబనవిభావమునకు నరసభూపాలీయమునందలి యుదాహరణము:- రతిమన్మథులను, నలదమయంతులను బ్రహ్మదేవుడు ముందుగా సృష్టించి నిపుణత్వమును సాధించి, ఆ పిమ్మట నిన్నును, నరసభూపాలుని సృజించి ప్రేమరూపులైన దంపతులుగా చేసియుండవచ్చును. చం ''అలరు రతిన్ రతీశు దమయంతి నలున్ నలువొంద ముందుగా నలువ సృజించి యందు కతనం దనచే యళుకెల్లఁదీఱి నే। ర్పలవడ నోలతాంగి నరసాధిపునిన్ నినుఁగూర్చి ప్రేమసం। కలితముగాఁగ దంపతులుగా నొనరింపఁగఁబోలు నెంతయున్.''-కా. లం. సం. III-29. ఇందు రతిమన్మథులు, నలదమయంతు లును శృంగారరసమునకాలంబన విభావములు.

**ఆలస్యము :** వ్యభిచారిభావములందొకటి (చూ. వ్యభిచారిభావములు).

నిర్వచనములు : ''ఆలస్యం శ్రమగర్భాదే ర్జాడ్యం జృంభాసితాది మత్'' అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవ ప్రకా. 63 పేజి 34 శ్లం). శ్రమము, గర్భము మొదలైనవాని వలన కలుగు జడత్వము ఆలస్యము. ఆవులింత, ఊరక కూర్చుండుట అనుభావములు (కార్యములు). (2) ''మందో ద్యమత్వ మాలస్యం కర్తవ్యేషు ప్రకీర్త్యతే'' అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. రసప్రక. 273 పేజి 7సం) కర్తవ్యములవిషయమున మంద ముగా ప్రవర్తించుట ఆలస్యము. (3) ''అలస్యం శ్రమగర్భాద్యైర్జాడ్యం జృంభాసితాదికృత్'' అని సాహిత్యదర్పణము (సా. ద III-147 పే. 155 శ్లో.) దశరూపకము ననుసరించినది. (4) ''కర్తవ్యకార్య మందో ద్యోగంబది యలసత'' అని నరసభూపాలీయము (III-364 పేజి 83 ప.) (5) ''అతితృప్తి, గర్భ, వ్యాధి, శ్రమాదిజన్మా చేతసః క్రియానున్ముఖతా ఆలస్యం'' అని రసగంగాధరము (కా. లం. సం. III-364 పే. 27 సం.) అతితృప్తి, గర్భము, వ్యాధి, శ్రమ మొదలయిన వానివలన పుట్టిన చిత్త వృత్తి విశేషము ఆలస్యము. మనస్సునకు కార్యవైముఖ్యము అనుభావము.

ఉదాహరణము : నరసభూపాలుడు నృపకుంజరుడు కనుక ఆ యువతి తానుకూడా ఆడయేనుగుగా మారెనేమో యన్నట్లు చెలులు ఆహారాదులకు రమ్మని పిలిచినను ఆమె అరగంటనే చూచుచుండెను. (ఆడయేనుగు అర గంటితో చూచును). కం ''చెలులాహారాదులకుం బిలిచిన నఱగంటఁజూచుఁ బ్రియుఁడు నృసింహుం డలఘు నృపకుంజరుండని యలికుంతల కుంభినీ త్వమందెనో తానున్'' –కాలం. సం. III-85 విరహశ్రమము విభావము. కార్యవైముఖ్యమను భావము, (కార్యము). ఆలస్యము వ్యక్తమయినది.

ఆవేగము : వ్యభిచారిభావములందొకటి (చూ. వ్యభిచారి భావము)

నిర్వచనములు :- (1) "ఆవేగస్సంభ్రమోఽస్మిన్నభిసరజనితే శస్త్ర నాగాభియోగో వాతాత్పాంసూపదిగ్ధ స్త్వరిత పదగతిర్వర్షజే పిండితాంగః। ఉత్పాతాత్ ప్రస్తతాంగేష్వహిత హితకృతే శోకహర్షానుభావా। వహ్నేర్ధూమాకులాస్యః కరిజమనుభయస్తంభకంపాపసారాః" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 68పేజి 31సం). సంభ్రమమే ఆవేగము. అది పరరాజుల యుపద్రవమువలన అయినపుడు శస్త్రములను, ఏనుగులను కూర్చుట కలుగును. సుడిగాలివలన అయినప్పుడు ధూళిచేత కలతనొందుట, త్వరితముగా పరుగిడుట కలుగును. వర్షమువలన అయినప్పుడు శరీరము చితుకుట కలుగును. ఉత్పాతమువలన అయినప్పుడు శరీరము సడలుట కలుగును. అహితమువలనను హితమువలనను అయినప్పుడు శోకము, హర్షము అనుభావములగును. అగ్నిజమైనప్పుడు పొగచేత కలతనొందుట కలుగును. ఏనుగువలన అయినప్పుడు స్తంభము, కంపము మొదలయిన అనుభావములు కలుగును. (2) "ఇష్టానిష్టాగమాజ్జాతః ఆవేగశ్చిత్త సంభ్రమః" అని ప్రతాపరుద్రీయము. (అం. ప్ర. రు. రసప్ర. 280 పే. 16 సం.) ఇష్టసిద్ధివలనగాని అనిష్టసిద్ధివలనగాని పుట్టిన చిత్తసంభ్రమమే ఆవేగము. (3) "ఆవేగస్సంభ్రమస్తత్ర హర్షజే పిండితాంగతా ఉత్పాతజే ప్రస్తతాంగో ధూమాద్యాకులతాగ్నిజే రాజవిద్రవజాదేస్తు శస్త్రనాగాది యోజనం। గజాదేః స్తంభకంపాది పాంస్వాద్యాకులతానిలాత్ ఇష్టాద్ధర్షాః శుచోఽనిష్టాత్ జ్ఞేయాశ్చాన్యే యథాయథమ్" అని సాహిత్యదర్పణము (సా. ద. III_141పే. 143, 144 శ్లో). సంభ్రమమే ఆవేగము అది హర్షజమయినపుడు సంకుచిత శరీరత్వము అనుభావము. ఉత్పాతజన్యమయినపుడు శరీరము ప్రస్తమగుట (జారుట) అనుభావము. అగ్నిజన్యమయినపుడు పొగ మొదలయినవానిచే కలతనొందుట అనుభావము. శత్రురాజులధాటివలన సంభవించినపుడు శస్త్రములను, గజములను సమకూర్చుకొనుట అనుభావము. ఏనుగుల వలన సంభవించినపుడు స్తంభము, కంపము అనుభావములు. గాలివలన సంభవించినపుడు ధూళి మొదలయినవానిచే ఆకులమగుట అనుభావము. ఇష్టమువలన సంభవించినవానికి హర్షములును, అనిష్టమువలన సంభవించినవానికి దుఃఖములును అనుభావములగును. (4) "క్రమమున నిష్టానిష్టాగమజమనస్సంభ్రమంబుగన నావేగంబు" అని నరసభూపాలీయము (III_65 ప.). (5) "అనర్థాతిశయ జనితాచిత్తస్య సంభ్రమాఖ్యా వృత్తిరావేగః" అని రసగంగాధరము (కా. లం. సం. III_352 పే. 11 సం.). అనర్థాతిశయము వలన పుట్టిన మనస్సంభ్రమరూపమయిన చిత్తవృత్తియే ఆవేగము.

ఉదాహరణము :- నరసభూపాలుడొకనాడు వీథిలో నేగుచుండెను. ఒకనాయిక అతనిని చూడబోయి తొందరగా బయటికి వచ్చెను. అప్పుడామె మెడలో వేసుకొనవలసిన హారము చేతిలోనే యుండెను. అప్పుడామె యెట్లు

న్నది ? అతనుడైన మన్మథునికి శరీరసిద్ధినిగోరి వ్రతముబూని అక్షమాలి కను చేతిలోధరించినిల్చిన రతివలె నుండెను. కం "సతి హారము నిడనెడలే। కతనుని తనుసిద్ధిగోరి యలరతి వ్రతసం గతి నక్షసరముఁ గైకొను। గతిఁ గేలన। దాల్చి నృపతిఁ గనుఁగొన నరిగెన్. —కా లం. సం. III-66. ఇందు ఇష్టాగమము విభావము. త్వరాగమనము, స్తంభము అనుభావములు (కార్యములు). 'ఆవేగము' వ్యక్తమయినది.

**ఆవేశికుడు :** కవియొక్క అవస్థలు పదియనియు, అందు సహజప్రతిభునకును (చూ. సారస్వతుడు),ఆహార్యప్రతిభునకును (చూ.అభ్యాసికుడు)పదవస్థలును ఔపదేశికునకు (చూ. ఔపదేశికుడు), మూడవస్థలును నుండునని రాజశేఖరుడు కావ్యమీమాంసయందు పేర్కొనెను. (చూ. కా. మీ. V-49 పే.) ఔపదేశికుని మూడవస్థలందును ఆవేశికుడగుట మొదటి అవస్థ. (చూ. కారయిత్రి), (చూ. కావ్యవిద్యాస్నాతకుడు, హృదయకవి,అన్యాపదేశి, సేవిత, ఘటమానుడు, మహాకవి, కవిరాజు, అవిచ్ఛేది, సంక్రామయిత).

"యో మంత్రాద్యుపదేశవశాల్లబ్ధసిద్ధిరావేశ సమకాలం కవతే స ఆవేశికః" అని రాజశేఖరుడు (కా. మీ. V-51 పే.) ఎవడు మంత్రోపదేశము మొదలైనవాని ప్రభావమువలన సిద్ధినిపొంది, తదావేశ సమయమునందు కవిత్వమును చెప్పునో అతడు ఆవేశికుడు.

**ఆశ్వాసము :** 'కథాంశానాం వ్యవచ్ఛేద ఆశ్వాస ఇతికథ్యతే' (కాలం. సం. II 268 పే.) కథాంశముల విభాగమే ఆశ్వాసము. కావ్యమందొకభాగము.

ప్రాకృతైర్నిర్మితే తస్మిన్ సర్గా ఆశ్వాస సంజ్ఞకాః అని సాహిత్యదర్పణము. (సా. ద. VI-356 పే) సర్గబంధము ప్రాకృతభాషారచితమైనపుడు అందలి సర్గలకు ఆశ్వాసములని పేరు. చూ. సర్గబంధము.

ఉచ్ఛ్వాసము దీనికి పర్యాయపదము.

**ఆసత్తి :** నిర్వచనమునకు, ఉదాహరణమునకు చూ. వాక్యము.

**ఇతిహాసము :** "దేవాసురాస్సంయత్తా ఆసన్ ఇత్యాదయః ఇతిహాసాః" అని విద్యారణ్యులు (కాలంసం II-264 పేజి). ఇతి-హ-అస్మిన్ అస్తీతి ఇతిహాసః అని వ్యుత్పత్తి (కాలం. సం. II-264 పే.) ఇది యిట్లు జరిగినదట అని యెందు వర్ణింపబడునో అది ఇతిహాసము.

"కౌటిల్య ఆహ। పురాణం, ఇతివృత్తం, ఆఖ్యాయికా, ఉదాహరణం, ధర్మశాస్త్రంచేతి ఇతిహాసః" (కాలం. సం. II-264 పే.) పురాణేతి వృత్త ఆఖ్యాయికోదాహరణ ధర్మశాస్త్రములన్నియుగలది ఇతిహాసమని కౌటిల్యుని మాట.

"ధర్మార్థకామమోక్షాణా ముపదేశసమన్వితం పురావృత్తం కథాయుక్త మితిహాసం ప్రచక్షతే" (ఆప్టేనిఘంటువు) ధర్మార్థకామమోక్షముల నుపదేశించుచు పూర్వరాజుల కథలను వివరించునది ఇతిహాసము.

పురాణప్రవిభేద ఏవేతిహాసః ఇత్యేకే సచద్విధా పరక్రియా పురా

కల్పాభ్యామ్ యదాహు :— పరక్రియా పురాకల్ప ఇతిహాసగతిర్ద్విధా స్యాదేకనాయకా పూర్వాద్వితీయా బహునాయకా । తత్ర రామాయణం భారతం చోదాహరణే" (కా. మీ. II-8వ పేజి) అని రాజశేఖరుడు. ఇతిహాసము రెండు విధములు (1) పరక్రియ (2) పురాకల్పము. మొదటిదాని యందు ఒక్కడే నాయకుడు. రెండవదానియందు బహునాయకులు. మొదటిదానికి రామాయణము, రెండవదానికి భారతము ఉదాహరణములు.

**ఈర్ష్యామానము :** వివరములకు ముందు చూ. విప్రలంభము. మాన విప్రలంభము (చూ. మానము) యొక్క రెండు భేదములలో ఈర్ష్యామానము రెండవది. (మొదటిది ప్రణయమానము). సాహిత్యదర్పణకర్తమతమున విప్రలంభభేదములందు మానమొకటి. ఆ మానమే రెండువిధములు. అందు ఈర్ష్యయొకటి.

"పత్యురన్య ప్రియాసంగే దృష్టేఽథానుమితే శ్రుతే ఈర్ష్యామానో భవేత్స్త్రీణాం తత్రత్వనుమితిస్త్రిధా ఉత్స్వప్నాయిత భోగాంకగోత్రస్ఖలనసంభవా" అని సాహిత్యదర్పణము (సా. ద. III-168 పే. 199, 200 శ్లో.). తన పతి మరొక ప్రియురాలితో కలిసియున్నట్లు చూచినను, అనుమానించినను విన్నను స్త్రీకి కలుగు కోపమే ఈర్ష్యామానము. ఇందు అనుమానము (ఊహ) మూడు విధములు. (1) ఉత్స్వప్నాయితము (పలవరింపు) (2) భోగాంకము (సంభోగచిహ్నము). (3) గోత్రస్ఖలనము (ప్రియురాలి నామమునుచ్చరించుట). ఈ మూడింటివలన అనుమానము జనించును.

ఉదాహరణము :- తనప్రియుడొక పరకాంతయందు అనురక్తుడైన వార్తవిని యొకనాయిక ఈర్ష్యామానమును పొందినవిధమిది—

తే. గీ తన్ను వంచించి చని వేఱుతన్విఁగూడి, కేళికా కుంజమందు నుయ్యాలలూగె తన ప్రియుండంచుఁ జెలి చెప్పవిని వెలంది యాత్మ రుసరుసలాడు; నాస్యము ముడుంచు" —శ్రీ సన్నిధానంవారు. (కా. అం. సం. III-406 పేజి).

**ఈర్ష్యావిప్రలంభము :** విప్రలంభ శృంగారభేదములందొకటి. (చూ. విప్రలంభ శృంగారము). ఈ విప్రలంభశృంగారము నాలుగువిధములు. అందు ఈర్ష్యా విప్రలంభము రెండవది. (చూ. అభిలాష విప్రలంభము, విరహవిప్రలంభము, (ప్రవాసవిప్రలంభము). ఇది ప్రతాపరుద్రీయ మతము.

ఈర్ష్యానామనాయకస్యాన్యాసక్త భావాచ్చిత్త వి క్రియా (ప్ర. రు. రసప్రక. 235). ఈర్ష్యకారణముగా జనించు విప్రలంభమే ఈర్ష్యావిప్రలంభము. నాయకుడు అన్యనాయికయందు ఆసక్తుడైన విషయమును నాయిక గ్రహించినప్పుడామెకు కోపము కలుగును. ఆ కోపమువలన కలిగిన మనోవికారమే ఈర్ష్య. తన ప్రియుడు అన్యనాయికయందనురక్తుడైన విషయమును నాయిక తాను స్వయముగా చూచుటవలనగాని, వినుట వలన

గాని, అనుమానమువలనగానీ తెలిసికొనవచ్చును. (చూ. ఈర్ష్యామానము).

ఉదాహరణము :- వాణి, ఇందిర, భూదేవి-ఈ ముగ్గురు నరసభూపాలుని సంగమమును పొందియుండగా నొకనాయిక వారియెడ ఈర్ష్యను పొంది యిట్లన్నదట :- మ॥ "వదనాగ్రంబున వాణియున్నది మమున్ వాక్రువ్వనీ దిందిరా। మదిరాక్షీమణియున్నదక్షులమమున్ మన్నించి వీక్షింపనీ దదియుంగాక నృసింహా। నీ విపుల బాహాశ్లేషమే నొందనోర్వదు భూదేవి బహుప్రియావర! నినుం బ్రార్థింప నింకేటికిన్"—కా.అం. సం III-138

*ఉగ్రత :* వ్యభిచారిభావములందొకటి (చూ. వ్యభిచారిభావము) 'ఔగ్ర్యము' రూపాంతరము.

నిర్వచనములు :- (1) "దృష్టేఽపరాధే దౌర్ముఖ్య క్రౌర్యైశ్చండత్వముగ్రతా తత్రస్వేద శిరః కంప తర్జనా తాడనాదయః" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 60 పేజి 18 సం.) అపరాధము, కనబడగా దుర్ముఖత్వముచేతను, క్రూరత్వముచేతను కలుగు చండత్వము ఉగ్రత. స్వేదము, శిరఃకంపము, తర్జనము, తాడనము మొదలయినవి అనుభావములు. (2) "దృష్టేఽపరాధే చండత్వముగ్రతా తర్జనాదికృత్" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 288 పేజి. 27 సం.) అపరాధము కనబడగా చండత్వము కలుగుట ఉగ్రత. దీనివలన తర్జనము కార్యము. (3) 'శౌర్యాపరాధాదిభవం భవేచ్చండత్వముగ్రతా తత్రస్వేద శిరః కంపతర్జనాతాడనాదయః" అని సాహిత్యదర్పణము (సా. ద. III-143పే. 149 శ్లో.). శౌర్యము, అపరాధము మొదలైన వానివలన కలుగు చండత్వమే ఉగ్రత. స్వేదము, శిరఃకంపము, తర్జనము, తాడనము మొదలైనవి దానివలన కలుగును. (4) "ఎగ్గొదవిన నతిచండత యుగ్రభావమగు" అని నరసభూపాలీయము (III-68 పే.). (5) "అధిక్షేపావమానాది ప్రభవా కిమస్య కరోమీత్యాది ఆకారా చిత్తవృత్తి రుగ్రతా" అని రసగంగాధరము (కా. అం. సం. III-356 పేజి 15 సం.). అధిక్షేపము, అవమానము మొదలయినవాని వలన గలుగు నేను వీనికి ప్రతీకారమేమిచేయుదును అను రూపము గల చిత్తవృత్తి ఉగ్రత. (6) నృపాపరాధోఽసద్దోషకీర్తనం చోరధారణం। విభావాస్స్యురథో బంధో వధస్తాడనభర్త్సనే ఏతే యత్రానుభావాస్తదౌగ్ర్యం నిర్ణయాత్మకం" (సా. ద.III-143 పేజి టీకయందుదాహృతము) —రాజాపరాధము, లేని దోషమును ప్రచారముచేయుట, చోరధారణము (?)— ఇవి విభావములు. బంధనము, వధ, తాడనము, భర్త్సనము—ఇవి అనుభావములు. వీనిచే వ్యక్తమగునది ఉగ్రత.

ఉదాహరణము : ఒక నాయికను బాధించుచున్న చంద్రుని ఉద్దేశించి ఆమె చెలి పలికిన మాటలు :- కం॥ "వలదు వలదేఁచఁగలువల చెలికాడ! నృసింహుఁగూర్చు చెలిఁగాకున్నన్ బొలఁతుక నిట్టూర్పుపొగల్ వెలువడి నీ బింబమెల్ల వెసమాయించున్" —(కా. అం. సం. III-71.) ఇందు చంద్ర

కృతాపరాధము విభావము, (కారణము). చంద్రునిగూర్చిన బెదిరింపు అనుభావము, (కార్యము). ఉగ్రత వ్యక్తమయినది.

*ఉచ్ఛ్వాసము :* చూ. ఆశ్వాసము.

*ఉత్కలికాప్రాయము :* ఒక గద్యభేదము. చూ గద్యము.

'అన్యందీర్ఘసమాసాఢ్యం' అనిసాహిత్యదర్పణము.(సా.ద.VI-331శ్లో. 357 పే). దీర్ఘసమాస సంపన్నమైన గద్యరచన ఉత్కలికాప్రాయము.

ఉదాహరణము :- అనిశ విస్మృమర నిశితతర శరవిసర విదళిత సమర పరిగత ప్రబలపరబల (సా. ద. VI-357 పే.)

*ఉత్తమకావ్యము :* వివరములకు-ముందు చూ. వాచ్యము, వ్యంగ్యము, ధ్వని. వాచ్యార్థముకన్న వ్యంగ్యార్థము మనోహరముగా నున్న కావ్యమే ఉత్తమ కావ్యము. ఇందులో వ్యంగ్యము ప్రధానముగా నుండును. అందువల్లనే దీనిని ధ్వని కావ్యము అనికూడా అందురు. మిగిలిన కావ్యభేదముల వివరములకు చూ. మధ్యమకావ్యము, అధమకావ్యము.

జగన్నాథపండితుని మతమున ఉత్తమకావ్యమనగా వ్యంగ్యార్థము అప్రధానమైనను చమత్కార కారణమయిన కావ్యము. "యత్రవ్యంగ్యమప్రధానమేవ సత్ చమత్కారకారణం తద్ద్వితీయం" అని అతడు చెప్పిన లక్షణము (అం. ర. గం. 78 పే.)

ఉదాహరణము :- శ్రీరాముని విరహజ్వాలచే క్రాగిపోవుచున్న సహ్యాపర్వత శిఖరములందు శిశిరకాలమున సుఖముగా శయనించిన కోతులు హనుమంతునిమీద కోపించినవి.

రాఘవవిరహజ్వాలా సంతాపిత సహ్యశైల శిఖరేషు
శిశిరే సుఖంశయానాః కపయః కుప్యంతి పవనతనయాయ.

(రసగంగాధరమణి-జమ్మలమడకవారిది 2 పేజి)

హనుమంతుడు సీతాకుశలవార్తను తెల్పగనే రాముడు చల్లబడెననియు, వెంటనే పర్వత శిఖరములు చల్లబడిపోయినవనియు, నప్పుడు చలికి తట్టుకొనలేక కోతులు బాధపడి హనుమంతునిమీద కోపించెననియు వ్యంగ్యము. ఈ వ్యంగ్యమునకిందు ప్రాధాన్యములేదు. చమత్కారము కలిగించుచున్నది.

*ఉత్తమోత్తమకావ్యము :* "శబ్దార్థౌ యత్రగుణీభావితాత్మానౌ కమప్యర్థమభివ్యక్తస్తదాద్యమ్" అని జగన్నాథుడు (అం. ర. గం. 41 పేజి.). "శబ్దార్థములముఖ్యములై చమత్కారియర్థ మభివ్యంజనము చేయుచో నది యుత్తమోత్తమము (రసగంగాధరమణి 1పేజి). (ఇతని మతమున కావ్యము నాలుగువిధములు. అందు మొదటిదిది. మిగిలినవి (1) ఉత్తమ (2) మధ్యమ (3) అధమకావ్యములు).

ఉదాహరణము :- శ్లో॥ శయితా సవిధేప్యనీశ్వరా సఫలీకర్తుమహో మనోరథాన్ దయితా దయితాననాంబుజం దరమీలన్నయనా నిరీక్షతే" (రసగంగాధరమణి 2 పేజి). "దయిత సవిధమున శయనించియు మనోరథ

ముల సఫలీకరించుకొనలేనిదై ప్రియుని వదన మరగన్నుల నిరీక్షించుచున్నది. ఇందు నాయకుడాలంబనము. ఏకాంత ముద్దీపనము. అరగన్నుల చూపను భావము. ఔత్సుక్యాదులు వ్యభిచారులు. వీని సంయోగమున రతి వ్యంగ్య మగుచున్నది. (రసగంగాధరమణి 2వ పేజి.)

**ఉత్పత్తివాదము :** భరతుని రససూత్రమునకు భట్టలోల్లటుడు చేసిన వ్యాఖ్యానమునకు ఉత్పత్తివాదమని పేరు. (చూ. రసము). భట్టలోల్లటుడు మీమాంసకుడు.

'విభావానుభావవ్యభిచారి సంయోగాద్ రసనిష్పత్తిః' అని భరతుని రససూత్రము. ఇందు సంయోగము, నిష్పత్తి అను పదములకు అర్థ భేదమును కల్పించి భట్టలోల్లటుడు, శ్రీశంకుకుడు, భట్టనాయకుడు, నాయకుడు, అభినవగుప్తుడు వేరువేరు వ్యాఖ్యానములను చేసిరి. అందు భట్టలోల్లటుని వాదమునకుత్పత్తివాదమని పేరు. (చూ. అనుమితివాదము, భుక్తివాదము, అభివ్యక్తివాదము).

ఈ మతమున "ఉత్పాద్యములగు విభావములచే రత్యాదిస్థాయిభావ ముత్పాద్యమై, గమకములయిన యనుభావములచే గమ్యమై, పోషకములయిన వ్యభిచారులచే పుష్టమై రసమగును." (కా. అం. సం. III-263 పే). రసము నాయకనిష్ఠమనియు, (అనుకార్యనిష్ఠము) అది ఉత్పాద్యమనియు, విభావములుత్పాదకములనియు, అనుభావములు గమకములనియు, సంచారిభావములు పోషకములనియు, భట్లలోల్లటుని యభిప్రాయము.

**ఉత్ఫుల్లకము :** చూ. ఉదాహరణకావ్యము. ఉదాహరణకావ్యము నాలుగువిధములు. (1) సద్దళి (2) షద్దళి (3) విద్దళి (4) ఉత్ఫుల్లకము.

"కళికలుత్కళికలు గమకింపఁబలికిన కావ్యంబు నుత్ఫుల్లకంబు" అని అప్పకవి. ఈ ఉదాహరణమున కళికోత్కళికలే కాని వృత్తములుండవు. విభక్తిక్రమముండును. (చూ. సద్దళి, షద్దళి, విద్దళి.)

**ఉత్సాహము :** వివరములకు ముందు చూ. స్థాయిభావము. ప్రయత్నము (Effort) అని సామాన్యార్థము. అలంకారశాస్త్రములో వీరరసమునకిది స్థాయిభావము.

ఉత్సాహమునకు నిర్వచనములు :- (1) "లోకోత్తరేషు కార్యేషు స్థేయాన్ ప్రయత్న ఉత్సాహః" అని ప్రతాపరుద్రీయ (రసప్రకరణము) లక్షణము. లోకోత్తరములయిన పనులలో మిక్కిలి స్థిరమైన ప్రయత్నమే ఉత్సాహము. (2) "కార్యారంభేషు సంరంభః స్థేయానుత్సాహ ఉచ్యతే" అని సాహిత్యదర్పణము (తృతీయపరిచ్ఛేదము). కార్యముల ఆరంభమునందు స్థిరతరమైన సంరంభమే ఉత్సాహము. (3) "పరపరాక్రమ దానాది స్మృతిజన్మా ఔన్నత్యాఖ్యశ్చిత్తవృత్తివిశేష ఉత్సాహః" అని రసగంగాధరము. శత్రువుల పరాక్రమము క్షీణించటను గురించి తలపోయుటవలన గల్గు ఔన్నత్యమను చిత్తవృత్తి విశేషము కలుగును. అదే

ఉత్సాహము. (4) "అత్యున్నత లోకోత్తర కృత్యంబులు సేయవేఁడి కృతకృత్యులిలన్ నిత్యముఁ దలఁచు ప్రయత్నంబత్యంతోత్సాహమయ్యె" అని నరసభూపాలీయము (తృతీయాశ్వాసము). (5) Firmness or fortitude regarded as the feeling which gives rise to the వీర or heroic sentiment. అని ఆప్టే నిఘంటువు.

ఉత్సాహమునకు నరసభూపాలీయమునందలి యుదాహరణము :- నరసభూపాలుని సేనానులిట్లను కొందురు- శత్రువులనెడి చెట్లను కత్తులతో నరుకవలె; శౌర్యమనెడి నిప్పులతో తగులబెట్టవలె; శస్త్రములనెడి నాగళ్లతో రణభూమిని దున్నవలె. శత్రువుల రక్తముతో దానిని తడుపవలె. అప్పుడు గాని కీర్తిసస్యములు పండవుగదా ! ఈ మాటలలో ఆ యోధుల ఉత్సాహము వ్యక్తమగుచున్నది. మ "అసిఁ జెండాడి విపక్షవృక్షముల శౌర్యాగ్నిచ్ఛటం బేల్చి శస్త్రసరత్సీరములన్ రణోర్వీతలమున్ సంక్షుణ్ణముం జేసివై। ర్యసృగార్ద్రింబొనరించి ప్రోదిగొనకుద్యత్కీర్తి సస్యౌఘముల్ । వెస సిద్ధించునె యంచుఁబల్కు నరసోర్వీనాథుయోధావళుల్" (కా. లం. సం. III-16. )

*ఉదాహరణము* : "యేనకేనాపి తాళేన గద్యపద్య సమన్వితమ్ జయత్యుపక్రమం మాలిన్యాదిప్రాసవిచిత్రితమ్ తదుదాహరణం నామ విభక్త్యష్టక సంయుతమ్" (ప్ర. రు. కావ్య ప్రక. 74-75 శ్లో. 83 పేజి.) అని ప్రతాపరుద్రీయము. మొదట జయతి అను ఉపక్రమము, మాలిని మొదలైన వృత్తములతో రమ్యముగా మొదలై, తరువాత 'అపిచ' అను ఉపక్రమము గల అష్టవాక్యములు సప్రాసములుగా సతాళములుగా ప్రతివిభక్తియందుండవలెను. తరువాత విభక్త్యాభాసములుండవలెను. ఇది ఉదాహరణ లక్షణము. (చూ. ప్రతాపరుద్రీయము 83పే.) ఇదిక్షుద్రప్రబంధములందు మొదటిదిగా విద్యానాథుడు పేర్కొనెను.

తెలుగులోని ఉదాహరణ కావ్యలక్షణమునకు ఉదాహరణములకు— చూ. కా. లం. సం. II-244-255 పేజీలు

*ఉద్దీపనవిభావము* : వివరములకుముందు చూ. విభావము. రెండు విధములైన విభావములలో రెండవది ఉద్దీపన విభావము. దీనికే పోషకకారణమని పేరు.

"ఉద్దీపనవిభావాస్తే రసముద్దీపయంతియే" అని సాహిత్య దర్పణము (తృతీయపరిచ్ఛేదము) ఉద్దీపన విభావమున కిచ్చిన లక్షణము. రసమునుద్దీపింపజేయు విభావములుద్దీపనవిభావములు (చూ. ఆలంబన విభావము.)

ఉద్దీపన విభావము రెండు విధములు :- (1) సహజములు (2) తటస్థములు.

నాయికానాయకుల (1) యౌవనము (2) భూషణములు (3) చేష్టలు —ఇవి సహజములు. ఇవి ఆలంబనముయొక్క గుణములు మొ నవి.

మలయానిలము, చంద్రుడు, కోకిలాలాపము మొదలైనవి తటస్థ

ములు. ఇవి దేశకాలాదులు. నరసభూపాలీయకర్త ఈ తటస్థములందు మన్మథునిగూడ చేర్చెను. నాయికానాయకులకు గోచరించువానినే తటస్థములగు ఉద్దీపనవిభావములందురు. మన్మథుడు గోచరింపడు. కనుక తటస్థోద్దీపనములందు మన్మథుని చేర్పరాదు.

ఉద్దీపనవిభావములకు నరసభూపాలీయమునందలి యుదాహరణములు: (1) యౌవనము :- యౌవనమనెడి శరత్కాలము రాగానే ముఖచంద్రుని యందమినుమడించెను. అప్పుడాయువతి బాల్యనదులెండిపోయెను. ఆ నదుల నుండితేలిన కొండలవలె వక్షోజములు ప్రకాశించెను. నీరెండిపోవుచున్నపుడు కనిపించు రేఖలవలె వళులు కనిపించెను. ఇందు నాయిక యౌవనము నాయకుని రతి కుద్దీపనముగా నున్నది. మ వరవక్త్రేందు విలాసకల్పనస్థ పయోవర్షావసానంబునం। దరుణీ శైశవసింధు లింకునెడఁ దత్తత్కాల లక్ష్యంబులా స్వరసాంతఃస్థిత గండశైలములనం జందోయి యంతంతకుం బరగుం; దత్క్రమశోష్య రేఖలనఁ గన్పట్టున్ వళీపుంజముల్'' —కా. లం. సం. II-30. (2) భూషణములు :- ఆమె చెవులకు మణితాటంకములు ధరించెను. ఆమె చూపులు మన్మథబాణములు. ఆ బాణములకు పదును పెట్టుకొనుటకు మన్మథుడేర్పరచుకొన్న సానరాళ్లవలె ఆమె మణితాటంకములు ప్రకాశించుచుండెను. ఇందు భూషణములు నాయకుని రతి కుద్దీపనములు. కం ''వెలఁదికి మణితాటంకము లలరున్ దిగ్విజయకాంక్ష నతనుఁడు చూపున్ ములుకులు నిశాతములుగా। నలవడవడిఁదీడు శాణయంత్రములనఁగన్ —కా. లం. సం. III-31. (3) చేష్టలు :- ఒక యువతి ముందునకేగుచు నరసభూపాలునివైపు వెనుకకు తిరిగి చూచెను. ఆసమయమున నామె వాల్జడ స్తనములమీదపడెను. అంతదాక వెనుకకు వ్రేలాడు వాల్జడ ముఖచంద్రుడు తనవైపునకు వచ్చుచుండెనని భయపడి చీకటివలె గిరిదుర్గములందు దాగుకొనుటకు వెళ్లుచున్నట్లు వక్షోజములమీద కదలసాగెను. ఇందు నాయక రతి కుద్దీపనముగ నున్నది నాయిక చేష్ట. చం। సుదతి నృసింహునిన్ మరలి చూచెవిలాసవివర్తితాస్యయై వదలని ప్రేమ వెన్తవిలివచ్చె ముఖేందుఁడటంచు భీతిచేఁ జెదరి గిరీంద్ర దుర్గములఁ జేరిన చీకటివోలె వాసనాస్పదమగు వాలుగొప్పు వలిచన్నులపై నసియాడుచుండఁగన్''—కా. లం. సం. III-32. (4) మన్మథ కోకిలాలాపములు :- మన్మథుడా యువతి మీదికీనాడు దండెత్తుచుండెను. ఆతని చేతిలో చిగురుకటారి, చెరకు విల్లు, పూలబాణములు, చెంగలువ కోలలు- అవిగో! అతడు చిలుకవాహనమెక్కెను- అదిగో! విను! కోకిల కంఠముల కాహళులు మ్రోగుచున్నవి. చం ''చిగురు కటారితోఁ జెఱకు సింగిణితో నలరంపగుంపుతో। నిగనిగమించు చెంగలువ నేజముతో వడిఁ జిల్క తేజిపై। మగఁటిమినెక్కి శూరుఁడయి మారుఁడు కోకిల కంఠకాహళుల్। నెగడలతాంగిపై వెడలె నేఁడు నృసింహ యెఱుంగఁ జెప్పితిన్'' —కా. లం. సం. III-33.

*ఉద్వేగము :* శృంగారావస్థలలో 'ఉద్వేగము'ను పేర్కొనినవారు దశరూపక కర్తయు, సాహిత్యదర్పణ కర్తయు. (చూ. శృంగారావస్థలు.)

ఉద్వేగమునకుదాహరణము :- "నిట్టూర్పులు పుచ్చును, నేల దొరలును; నీవచ్చుదారి నెదురుసూచును; చాలసేపు ఏడ్చును, చిక్కిన బాహువల్లరిని ఇటునటు విసరును. మఱి ప్రాణసమానుడా! కలలోనైన నీపొందును కోరినదై నిద్రను వాంఛించును. కాని, పాడుదైవము దానినైనను ఇయ్యదు." (శ్రీ వేదంవారి అనువాదము. అం సా. ద. III-61 పే).

శ్లో॥ శ్వాసాన్ముంచతి భూతలేవిలుఠతి త్వన్మార్గ మాలోకతే దీర్ఘంరోదితి విక్షిపత్యత ఇతః క్షామాం భుజావల్లరీం కించప్రాణసమాన, కాంక్షితవతీ స్వప్నేఽపితే సంగమం నిద్రాంవాంఛతి, నప్రయచ్ఛతి పునర్దగ్ధో విధిస్తామపి" (అం. సా. ద. III-61 పేజి.)

*ఉన్మాదము :* వ్యభిచారిభావములందొకటి (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు:- (1) "అప్రేక్షాకారితోన్మాదః సన్నిపాత గ్రహాదిభిః। అస్మిన్నవస్థా రుదితగీత హాసాసితాదయః" అని దశరూపకము. (ధ.ద.రూ. నాలుగవప్రకా. 64 పేజి 39 సం.) సన్నిపాతము, ఆగ్రహము, మొదలయినవానిచే కలుగు ఆలోచనారహితమైన చర్య ఉన్మాదము. ఇందు ఏడుపు, పాట, నవ్వు (?) మొదలైనవి అనుభావములు (కార్యములు).(2) "ఉన్మాదః తుల్యావర్తిత్వంచేతనాచేతనేష్వపి" అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. రసప్రక. 290 పేజి 30 సం.) చేతనములందును, అచేతనములందును సమానముగా ప్రవర్తించుట ఉన్మాదము. (3) "చిత్తసంమోహ ఉన్మాదః కామశోకభయాదిభిః అస్థానహాస రుదితగీత ప్రలపనాదికృత్" అని సాహిత్యదర్పణము (సా. ద. III-149 పేజి 160శ్లో.) కామము, శోకము, భయము మొదలైనవానివలన కలుగుమనోమోహము ఉన్మాదము.అస్థానమున నవ్వుట, ఏడ్చుట, పాడుట, వాగుట మొదలయినవి ఉన్మాదము వలన కలుగు అనుభావములు (కార్యములు) (4) "అనయంబు చేతనాచేతన సదృశమనో భ్రమంబు ధరనున్మాదంబనఁ బొల్చు" అని (III-368 పే. 32 సం.) నరసభూపాలీయము. (5) "విప్రలంభ, మహాపత్తి, పరమానందాదిజన్మా అన్యస్మిన్నన్యావభాసః ఉన్మాదః" అని రసగంగాధరము (కా. అం. సం. III-368 పే. 32 సం.). విప్రలంభము, మహాపద, పరమానందము మొదలయిన వానివలన పుట్టిన చిత్తవృత్తి విశేషము ఉన్మాదము.అనగా ఒకదానిని మరొకదానినిగా భ్రమింపజేయుట.

ఉదాహరణము :- తే.గీ. "అన్న భృంగంబ! భ్రమియింతు వఖిల దిశల। నాదు వలపులరాణి కన్పట్టెనోయి। ఔనటందువుసఖ! తెల్పుమాల సింప। కెచటఁగలదేమిగావించు? నెట్టిదామె" —సాహిత్యదర్పణమందలి శ్లో॥ "భ్రాతర్ద్విరేఫ భవతా భ్రమతా సమంతాత్ ప్రాణాధికా ప్రియతమా మమవీక్షితా కిమ్। (ఝంకారమనుభూయసానందమ్) బ్రూషేకిమోమితి

సఖేకథయాళు తన్మే। కింకింవ్యవస్యతి కుతోఽస్తి చకిద్రుశీయమ్''— (సా. ద. III-150 పే. 160 శ్లో. లక్ష్యము) శ్లోకమునకు శ్రీ సన్నిధానం వారి తర్జుమా (కా. లం. సం. 369 పే.) ఇందు ప్రియురాలి యెడబాటు విభావము. అసంబద్ధ ప్రలాపము అనుభావము. ఉన్మాదము వ్యక్తమయినది.

ఉన్మాదము కామదశలందొకటి యని సాహిత్యదర్పణకర్త పేర్కొనెను. (చూ. శృంగారావస్థలు.)

''ఉన్మాదశ్చాపరిచ్ఛేద శ్చేతనాచేతన్వేష్వపి'' అని (సా. ద. III-163 పే. 191 శ్లో) నిర్వచనము. చేతనములందును, అచేతనములందును సమానముగా వర్తించుట ఉన్మాదము.

ఉన్మాదము వ్యభిచారిభావములందుకూడా ఉన్నది. ఉన్మాదము స్థాయిభావమునకు సహకారి యయినప్పుడు సంచారిభావమే. అ స్థాయి భావముయొక్క క్రమవికాసమును వ్యక్తము చేయునప్పుడున్మాదము ఒక కామదశయగును.

ఉదాహరణమునకు :- 'అన్న శృంగంబ! భ్రమియింతు'' వను పద్యము. ఇది వ్యభిచారిభావమైన 'ఉన్మాదము'న కుదాహృతమైనదే.

*ఉపకథ :* ''పెద్దకథలోనికథ.'' గద్యప్రబంధ భేదమిది.

''ఏకతరచరిత్రాశ్రయేణ ప్రసిద్ధకథాంతరోపనిబంధఉపకథా'' (భామహకావ్యాలంకారభూమిక 31 పేజి) అని హేమచంద్రుడు. ప్రసిద్ధ కథాంతరమునందు ఏకతరచరిత్ర నాశ్రయించి రచింపబడిన కథాపిశేషము ఉపకథ. దీనికుదాహరణము ''చిత్రలేఖ.''

"యత్రాశ్రిత్య కథాంతర మతిప్రసిద్ధం నిబధ్యతే కవిభిఃచరితం విచిత్రమన్యత్ సోపకథా చిత్రలేఖాదిః" (అం: ప్ర. రు. యశోభూషణము II కావ్యప్రక. 169 పే.) అని కావ్యానుశాసనటీక. ''అతి ప్రసిద్ధమైన కథ నాధారము చేసికొని కల్పనాచాతుర్యముచేత రచించిన వేఱొక చిత్రమైన కథ ఉపకథ. ఉదా:- చిత్రలేఖ" (అం. ప్ర. రు. యశోభూషణము-II కావ్యప్రక. 169 పే.)

*ఉపకావ్యము :* "అసర్గబంధమపి యదుపకావ్యము దీర్యతే" అని ప్రతాపరుద్రీయము (ప్ర. రు. కావ్యప్రక. 72 శ్లో. 82 పే). సర్గములు లేనిది ఉపకావ్యము. సూర్యశతకము ఉపకావ్యము. చూ. సర్గబంధము.

*ఉపచారము :* "ఉపచారోహి నామ అత్యంతం విశకలితయోః (నిరాకాంక్షయోః ఇతిభావః) శబ్దయోః సాదృశ్యాతి శయమహిమ్నా భేదప్రతీతి స్థగన మాత్రమ్" —(సా. ద. II-47 పేజి). అత్యంతభిన్నములైన రెండు శబ్దములకు సాదృశ్యాతిమహిమచేత భేదప్రతీతిని కప్పిపుచ్చుటయే ఉపచారము.

వేరువేరు శబ్దములను రెండింటిని తీసికొని ఆ రెండింటికిని గల భేదమును కప్పిపుచ్చి రెండింటికిని అభేదము చెప్పుట ఆ రెండింటికిని సాదృశ్యము చెప్పదలచినపుడే సాధ్యమగును. భీముడు పులి అన్నపుడు భీముడు,

పులి భిన్న శబ్దములు. ఆ రెండింటికి భిన్నతను తొలగించి సాదృశ్యము చెప్పుటయే ఉపచారము. ఈ ఉపచారము లేనిదే గౌణలక్షణ ప్రవర్తింపదు. వివరములకు, ఉదాహరణములకు చూ. గౌణలక్షణ.

**ఉపాఖ్యానము :** ఒక కథను ఇతరులు చెప్పగా విని, తిరిగి దాని నితరులకు చెప్పుట ఉపాఖ్యానము. ''శ్రుతస్యార్థస్య కథన ముపాఖ్యానం ప్రచక్షతే'' (కాలం. సం. II-262 పే )

**ఉపాదానలక్షణ :** అర్థాంతర సంక్రమితవాచ్యము, అజహల్లక్షణ, అజహ ద్వాచ్య, అజహదభిధేయ, అజహత్స్వార్థ, అజహదర్థ-దీనినామాంతరములే.

పూర్తి వివరములకు ముందు చూ. లక్షణ, సంబంధనిబంధనాలక్షణ.

ముఖ్యార్థస్యేతరాక్షేపో
వాక్యార్థేఽన్వయసిద్ధయే
స్యాదాత్మనోఽప్యుపాదానా
దేషోపాదానలక్షణా.

-(సాహిత్యదర్పణము II పరి-37 పే 6 శ్లో )

లక్ష్యార్థముతోపాటు ముఖ్యార్థముకూడా వాక్యార్థమునందన్వయ సిద్ధికై చేరినచో ఉపాదానలక్షణ. (చూ. లక్షణలక్షణ )

స్వసిద్ధయే పరాక్షేపః
పరార్థం స్వసమర్పణం
ఉపాదానం లక్షణం చే
త్యుక్తః శుద్దైవసాద్విధా

—(కావ్యప్రకాశము- జమ్మలమడక వారిది II ఉల్లాస 66 పే 10శ్లో )

తనపని నెరవేర్చుకొనుటకు మరియొకనిని తీసుకొనువచ్చువానివంటిది ఉపాదానలక్షణ. ఇతరుల పని నెరవేర్చుటకు తాను వెళ్లువానివంటిది లక్షణ లక్షణ. ఉపాదానలక్షణలో ముఖ్యార్థము, లక్ష్యార్థము రెండును ఉండును. లక్షణలక్షణలో లక్ష్యార్థము మాత్రమే ఉండును.

ఉపాదానలక్షణ రూఢినిబట్టియు, ప్రయోజనమును బట్టియు రెండు విధములు రూఢికి ఉదా :- శ్వేతము పరుగెత్తుచున్నది. శ్వేతమనగా తెలుపు అని ముఖ్యార్థము. శ్వేతము అచేతనము. ఎట్లు పరుగెత్తగలదు ? ఇది ముఖ్యార్థబాధ. శ్వేతమనగా గుఱ్ఱమని రూఢి. ఆరూఢ్యర్థమే ఇక్కడ లక్ష్యార్థము. ఈ లక్ష్యార్థముతోపాటు ముఖ్యార్థము కూడా ఇక్కడ అర్థ సిద్ధికి అవసరమే. శ్వేతము=శ్వేతాశ్వము. ఈ విధముగా స్వసిద్ధికి పరాక్షేపము.

ప్రయోజనమునకు ఉదా :- కుంతములు ప్రవేశించుచున్నవి. కుంతములనగా ఈటెలు. ఇవి అచేతనములు. ముఖ్యార్థబాధ కలిగినది. కుంతములు= కుంతధారులు అని లక్ష్యార్థము. ఈ లక్ష్యార్థమునందు ముఖ్యార్థముకూడా

ఉన్నది. కుంతములనగా కుంతధారులని లక్ష్యార్థము చెప్పుటకు ప్రయోజన మున్నదా ? కుంతములవేగము కుంతధారులకు కూడా కలుగుటయే ప్రయోజనము.

**ఉభయకవి :** కావ్యమీమాంసయందు రాజశేఖరుడు కవులు మూడు రకము లనెను. అందు ఉభయకవి యొకడు. (చూ. శాస్త్రకవి, కావ్యకవి.) "ప్రతిభావ్యుత్పత్తిమాంశ్చ కవిఃకవిరిత్యుచ్యతే। సచత్రిధా। శాస్త్రకవిః కావ్యకవిరుభయకవిశ్చ.।,.. ఉభయకవిస్తూభయోరపి వరీయాన్ యద్యుభయత్ర పరంప్రవీణఃస్యాత్" (కా. మీ. V-43 పేజి), ప్రతిభావ్యుత్పత్తులు కల కవియే కవి. ఆ కవి మూడువిధములు. శాస్త్రకవి, కావ్యకవి, ఉభయ కవి అని. కావ్యశాస్త్రముల రెండింట ప్రవీణతగలవాడగుచో ఉభయకవి ఉభయులకంటె ఉత్తముడు.

**ఉభయశక్తిమూలవ్యంజన :** వివరములకు ముందు చూ. వ్యంజన.

అభిధామూలమైన లక్ష్యక్రమవ్యంజన ముప్విధము. అందిది యొకటి. మిగిలినవాని వివరములకు చూ. శబ్దశక్తిమూలవ్యంజన; అర్థశక్తిమూల వ్యంజన.

ఉభయశక్తియనగా శబ్దశక్తియు అర్థశక్తియు రెండును అని అర్థము. శబ్దశక్తిమూలవ్యంజన శబ్దములమార్పు చేసినచో వ్యంగార్థమును కోల్పోవును. అర్థశక్తిమూలవ్యంజన శబ్దములకు పర్యాయపదములను వాడినను వ్యంగ్యార్థమును కోల్పోదు. ఈ రెండు లక్షణములును గల వ్యంజనయే ఉభయశక్తిమూలము.

వ్యంజకములయిన శబ్దములు కొన్ని పరివృత్తిని (మార్పు) సహించియు, మఱికొన్ని సహింపకయు నున్నచో అది ఉభయశక్తిమూలవ్యంజన.

ఉదాహరణము :- శ్లో॥ విజితారిపురో మూర్త్యా విలసత్ సర్వమంగళః। రాజమౌళి రసౌభాతి రుద్రదేవో జగత్పతిః (అం. ప్ర. రు కా. ప్ర. క. 106 పేజి) ఈ రుద్రదేవుడు రూపవిలసత్ సర్వమంగళుడు, రాజమౌళి, జగత్పతి; విజితారిపురుడు.' ఇది కాకతి రుద్రదేవుని గురించిన స్తుతి. ఇందలి శబ్దములు కొన్ని రెండేసి యర్థములను బోధించుచున్నవి. (a) రూపవిలసత్ సర్వమంగళుడు=స్వరూపమున విలసిల్లుచున్న సర్వమంగళములు గలవాడు (2) స్వరూపమున విలసిల్లుచున్న సర్వమంగళ (పార్వతి) గలవాడు. (b) రాజమౌళి=(1) రాజచూడామణి (2) రాజు (చంద్రుడు) శిరస్సున గలవాడు. రుద్రదేవుడు=(1) కాకతి రుద్రుడు (2) శివుడు. ఇందలి మొదటి యర్థములు ప్రకరణ వశమున వాచ్యార్థములుగా నిర్ణయింపబడుచున్నవి. ఆ తరువాత వ్యంజనాశక్తివలన రెండవఅర్థములు కూడా ఇక్కడ వర్తించుచున్నవి. అందువల ప్రకృత, అప్రకృతార్థములు రెండును వచ్చుచున్నవి. వానికి ఉపమానోపమేయభావము కల్పింపవలెను. ఇంతవరకు శబ్దశక్తి మూలవ్యంజనయే. ఈ శబ్దములు పరివృత్తిని సహింపవు, కాని విజితారి

పురుడు, జగత్పతి అను పదములు పరివృత్తిని సహించియు, అర్థాంతరమును వ్యక్తము చేయగలవు. విజితారిపురుడనుటకు బదులు జితారాతినగరు డన్నను అర్థభంగమురాదు. జగత్పతి అనుటకు బదులు విశ్వేశుడన్నను అర్థ భంగమురాదు. ప్రకృతార్థమున కాకతిరుద్రుడు శత్రు నగరములను జయిం చినవాడనియు, లోకమునకు రాజనియు వాచ్యమగును. అప్రకృతార్థమున త్రిపురాసురుల నగరములను జయించినవాడనియు, లోకములకు ప్రభు వనియు గోచరించును. మొత్తముమీద శబ్దార్థశక్తి మూలకములయిన వ్యంజనలు రెండును ఇక్కడ ఆరాజు శివునివంటివాడను వ్యంగ్యార్థమును బోధించుచున్నవి. ఇది అలంకారవ్యంగ్యము.

*ఔగ్ర్యము :* చూ. ఉగ్రత.

ఔచిత్యము : "దేనికేది తగునో యది యుచితము. ఉచితముయొక్క భావమే యౌచిత్యము".

(1) రసమునకు జీవితభూతమైనదియు, చమత్కారమును కలిగించు నదియు ఔచిత్యమే అని క్షేమేంద్రుని మతము. ఈ ఔచిత్యము లేకున్నచో కావ్యమున గుణాలంకారములవలన ప్రయోజనము లేదని అట్టికావ్యము నిర్జీవ మనియు నితని యభిప్రాయము. "ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితం" అని తెలిపెను. రససిద్ధమగు కావ్యముయొక్క స్థిర జీవితము ఔచి త్యమే. ఈ ఔచిత్యము పదవాక్య ప్రబంధ గుణాలంకార రసక్రియాకార కాదులైన 29 విషయములందుండునని నిరూపించెను. (చూ.కా.స్వ. 121 పే.)

(2) క్షేమేంద్రునికి ముందే ఆనందవర్ధనుడు "అనౌచిత్యాదృతే నాఽన్యద్ర సభంగస్య కారణం। ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా" అని చెప్పెను రసభంగమునకు అనౌచిత్యమును మించిన కారణమేదియు లేదనియు మంచియౌచిత్య బంధముగల కావ్యమే రసమున కుపనిషత్తువంటి దనియు నాతనిభావము. (చూ. అనౌచిత్యము.)

(3) ఔచిత్యమునకు నిర్వచనమును క్షేమేంద్రుడిట్లు చెప్పెను: "ఉచితం ప్రాహురాచార్యాః సదృశం కిల యస్య యత్। ఉచితస్యచ యో భావస్త దౌచిత్యం ప్రచక్షతే" (కా స్వ. 121 పే.). (చూ కా. అం. సం. II అ. 102-103 పేజీలు).

ఔత్సుక్యము : వ్యభిచారిభావములందొకటి (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- (1) "కాలాక్షమత్వ మౌత్సుక్యం రమ్యేచ్ఛా రతి సంభ్రమైః తత్రోచ్ఛ్వాసత్వనిః శ్వాసహృత్తాప స్వేదవిభ్రమాః" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవ ప్రకా. 64 పేజి 41 సం.) మనోహర వాంఛచేతను, రతిసంభ్రమముచేతను ఆలస్యమును సహింపలేకపోవుట ఔత్సుక్యము. ఉచ్ఛ్వాస నిశ్వాసములు, మనస్తాపము, స్వేదము, విభ్రమము మొదలైనవి అనుభావములు (కార్యములు). (2) "కాలాక్షమత్వ మౌత్సుక్యం మనస్తాపత్వరాదికృత్" అని ప్రతాపరుద్రీయము (ఆం ప్ర. రు. రసప్రక.

284 పేజి. 20 సం.), కాలవిలంబనమును సహింపలేకపోవుట ఔత్సుక్యము. మనస్తాపము, త్వర మొదలైనవి అనుభావములు (కార్యములు).(3) "ఇష్టాన వాప్తే రౌత్సుక్యం కాలక్షేపాసహిష్ణుతా చిత్తతాపత్వరాస్వేదదీర్ఘనిః శ్వాసితాదికృత్" అని సాహిత్యదర్పణము (సా. ద. III-149 పే. 159 శ్లో). ఇష్టసిద్ధికాకపోవుటచే (కోరిక తీరకపోవుట.) కాలము గడపుటయందలి విసుగు ఔత్సుక్యము. చిత్తతాపము, త్వర, స్వేదము, దీర్ఘ నిశ్వాసము మొదలైనవి అనుభావములు. (కార్యములు). (4) "మఱియౌత్సుక్యంబన సమయాతుమత్వము" అని నరసభూపాలీయము III-150. (5) "అధునైవాస్య లాభోమమా స్త్వితీచ్ఛా హి ఔత్సుక్యం" అని రసగంగాధరము. (కా.లం, సం. III-359 పేజి. 20 సం ) ఇప్పుడేనాకిది లభించుగాక అనుకోరికయే యౌత్సుక్యము. (6) సంజాత మిష్ట విరహాదుద్దీప్తం ప్రియసంస్మృతేః నిద్రయా తంద్రయా గాత్రగౌరవేణ చ చింతయా అనుభావిత మాఖ్యాత మౌత్సుక్యం భావకోవిదైః" అని మరొక లక్షణము (కా.లం.సం. III-359 పేజి 20 సం.). (7) ఇష్టవిరహము ఆలంబనవిభావముగా, ప్రియసంస్మృతి ఉద్దీపనవిభావముగా, నిద్ర, తంద్రగాత్రగౌరవము (శరీరము బరువెక్కినట్లుండుట), అనుభావములుగా నున్నప్పుడు వ్యజ్యమానమగునది ఔత్సుక్యము

ఉదాహరణము :- నరసభూపాలుని కోసము కబురంపి, అతడెప్పుడు వచ్చునా యనుకొనుచు నామె ఎదురు చూచును. అతనిని చూచుటలో అంత రాయము కలుగునేమో యని కొంచెమైనను పరాకును సహింపదు. కం "వరుఁబిలువఁబనిచి యెపుడెపు డరుదెంచునొ? యనునుఁదలఁచి యభిముఖయగు బి। త్తరి; యింత పరాకైనను నరయఁ దదాలోక విఘ్నమగు వనుభీతిన్" —(కా.లం.సం. III_76 ప.) ఇందు ప్రియ విరహము విభావము. చింత, విభ్రమము మొదలైనవి అనుభావములు. ఔత్సుక్యము వ్యక్తము.

ఔదార్యము : ఇది అయత్నజమైన అనుభావము (చూ. అనుభావము. చూ అయత్నజములు చూ. అలంకారములు.)

ఔదార్యమునకు నిర్వచనములు :- (1) "ఔదార్యం ప్రశ్రయస్సదా" అని దశరూపకము. ధ. ద రూ. రెండవప్రకాశము 28 పేజి). వినయమెల్లప్పుడును చూపుట ఔదార్యము. ఇది ఇరువది అలంకారములలో ఒకటి (చూ. అలంకారములు). (2) "ఔదార్యం వినయస్సదా" అని సాహిత్యదర్పణము (సా. ద. 124 పేజి) సదా వినయమే ఔదార్యము. 28 అలంకారములలో ఒకటి (చూ. అలంకారములు.). "వినయమనఁ బ్రియుని యపరాధము దెలిసినను గోపము వహింపకుండుట" —(కా. లం.సం. 390 పేజి).

ఔదార్యమునకు శ్రీ సన్నిధానంవారిచ్చిన యుదాహరణము :-

గీ చిఱుతయలుకను వహియించి చిగురుఁబోఁడి యలఁతి నవ్వులు, సిగ్గులుఁ గొలఁది యూర్పు 'లలరఁ దాకకు! తాఁకకు' మనుచు జరిగి పోయి

మెలమెల్లఁగ గవాక్షమును బిగించె. —(కా. అం. సం. 391 పేజి). ప్రియుడపరాధి. ప్రియురాలి ప్రసన్నతకై చరణములందు బడనున్నాడు. ఆమె తాకకు తాకకుమని తప్పించుకొనిపోయి అలతినవ్వుతో సిగ్గుతో కిటికీ మూసినది. కిటికీ మూయుట కేళికిరమ్మని! ఇందామె యౌదార్యము వ్యక్తమయినది.

**ఔపదేశికుడు :** ఔపదేశికీ ప్రతిభగల కవిని ఔపదేశికుడని రాజశేఖరుడు పేర్కొనెను. (చూ. కారయిత్రి).

'మంత్రతంత్రాద్యుపదేశప్రభవా ఔపదేశికీ! ...ఔపదేశిక్యాః పునరైహిక ఏవ ఉపదేశకాలః, ఐహిక ఏవ సంస్కారకాలః (కా. మీ. IV-32పే.). ఔపదేశికీ ప్రతిభ మంత్రతంత్రాది ఉపదేశములవలన ఉదయించును. దానికి ఇహలోకమే ఉపదేశకాలము; సంస్కారకాలము. ఇట్టి ప్రతిభగలవాడే ఔపదేశికుడు. (చూ. సారస్వతుడు, అభ్యాసికుడు).

"ఉపదేశిత దర్శిత వాగ్విభవా దుర్బుద్ధి రౌపదేశికః'. (కా. మీ. IV-32 శ్లో.)

**కంపము :** సాత్త్వికభావము లెనిమిదింటిలో నిదియొకటి. (చూ. సాత్త్వికభావము). ఇది అనుభావము. (చూ. అనుభావము). వేపథువు అని నామాంతరము.

కంపమునకు నిర్వచనములు :- (1) "రాగరోషభయాదిభ్యో వేపథుర్గాత్రవేపనం" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రకరణము 267 పేజి). రాగము, రోషము, భయము మొదలయిన వానివలన కలుగు శరీర కంపమే వేపథువు. (2) "రాగద్వేషశ్రమాదిభ్యః కంపో గాత్రస్య వేపథుః" అని సాహిత్యదర్పణము (కా. అం. సం. తృతీయాశ్వాసము 339 పేజి). రాగము, ద్వేషము, శ్రమము మొదలయినవానివలన కలుగు శరీరవేపథువే కంపము. ఘోరదర్శనముచేత కూడా ఈ కంపము కలుగును. (3) "కంపమా వడఁకు" అని నరసభూపాలీయము. (III-37 ప.)

కంపమునకు నరసభూపాలీయమునుండి ఉదాహరణము :- 'అందమైన నరసభూపాలుని రూపమును చిత్రమున చిత్రించి ఆ నాయిక తన వక్షోజముల మీద చేర్చుకొని వణకి పోసాగినది. మన్మథుడు ముల్లోకములను జయింతునని ప్రతినబూని తన చేతిలోనున్న కత్తిని జళిపించుచున్నాడా అన్నట్లు ఆమె వణకుచుండగా అనిపించినది.' ఇందు నాయికకు కలిగిన కంపము రాగమువలన కలిగినది. ఉ చెన్నగు శ్రీ నృసింహవిభుఁజిత్రపటంబున వ్రాసి బింకపుం జన్నులమీఁదఁ జేర్చుకొని చాల వడంకఁ దొడంగె బాల; దాఁ । గన్నుల వింటివాఁడు త్రిజగంబు జయించెద నంచుఁ గ్రోధి చేనున్న కృపాణవల్లిక మహోజ్వలతన్ జళిపించెనో యనన్"
—కా. అం. సం. III-46.

**కదళీపాకము :** వివరములకుముందు చూ. పాకము. ఇది కవితాపాకములలో ఒకటి. మిగిలినవానికి చూ. ద్రాక్షాపాకము, నారికేళపాకము. శ్రీసన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు దీని లక్షణమిట్లు వ్రాసిరి. "కదళీఫలమును రుచి చూచుటకు ద్రాక్షాఫలమును రుచిచూచినంత సౌలభ్యముగానీ, నారికేళము రుచిచూచునంత క్లేశముగానీ యుండదు. కాన నాతి కఠినమును, నాతి సులభమును అగు అర్థభేదము కదళీపాకము." (కావ్యాలంకార సంగ్రహము 176పుట.)

ఉదాహరణము :- ఉ॥ "నిండుమనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము జగన్నుత! విప్రులయందు; నుర్వి నీ రెండును రాజులందు విపరీతము; గావున విప్రుఁడోపు; నోపండతి శాంతుఁడయ్యు నరపాలుడుఁ శాపము గ్రమ్మఱింపగన్".— నన్నయ. "ఈరెండును రాజులందు విపరీతము" అనగానేమి? భావించినగాని అర్థము బోధపడదిక్కడ. అందుచే నిది కదళీపాకము.

**కథ :** "నవక్త్రాపరవక్త్రాభ్యాం యుక్తానోచ్ఛ్వాస వత్యపి। సంస్కృతాసంస్కృతాచేష్టా కథాపభ్రంశ భాక్తథా। అన్యైః స్వచరితం తస్యాం నాయకేన తు నోచ్యతే। స్వగుణావిష్కృతిం కుర్యాదభిజాతః కథంజనః" అని భామహుడు. (భామహునికావ్యాలంకారము 1 పరి.28-29శ్లో.). కథ సంస్కృత ప్రాకృత అపభ్రంశభాషలలో ఏందేని నుండవచ్చును. వక్త్ర, అపవక్త్రములనెడి ఛందస్సులిందుండవు. ఉచ్ఛ్వాసవిభాగముండదు. నాయకుడే తన కథను చెప్పుకొనడు. నాయక గుణగణములను మరియొక పాత్ర వర్ణించును. కథ ఆఖ్యాయిక కంటె భిన్నము. చూ. ఆఖ్యాయిక. ఈ రెండింటికిని భేదమిది- (1) ఆఖ్యాయికయందు సంస్కృతముఃభాష. కథయందు సంస్కృత ప్రాకృతాపభ్రంశములుండవచ్చును. (2) ఆఖ్యాయికయందు వక్త్రాపవక్త్ర ఛందస్సులుండును. కథయందవియుండవు. (3) ఆఖ్యాయికయందు ఉచ్ఛ్వాసములుండును. కథయందుండవు. (4) ఆఖ్యాయిక నాయకకృత స్వచరిత వర్ణనయుండును. కథయందు అన్యకృతనాయకచరిత్ర వర్ణనయుండును. (చూ. భామహకావ్యాలంకార హిందీటీక.).

"అవాంతరవిభాగములు లేకయుఁబద్యములు లేకయు నున్న గద్య ప్రబంధము" కథ యని లోచనమున నున్నట్లు శ్రీసన్నిధానంవారు.

"కథాయాం సరసంవస్తు గద్యైరేవ వినిర్మితమ్ । క్వచిదత్ర భవేదార్యా క్వచిద్వక్త్రాపవక్త్రకే । ఆదౌ పద్యైర్నమస్కారః ఖలాదేర్వృత్తకీర్తనమ్" (సా. ద. VI-331-332 శ్లో) అని సాహిత్యదర్పణము. సరసమైన వస్తువు గలది కథ. ఇది గద్యమున రచితమగును. కొన్ని సందర్భములందు ఆర్య, వక్త్రాపవక్త్రములు మొదలైన పద్యములుండును. ఈ కథాకావ్యారంభమునందు నమస్క్రియ పద్యములతో చేయబడును. పద్యములతోనే ఖలవృత్త కీర్తనము (?) ఉండును. ఉదాహరణము - కాదంబరి.

చూ. ఆఖ్యాయిక.

*కరంభకము :* ''కరంభకంతు భాషాభిర్వివిధాభిర్వినిర్మితం'' అని సాహిత్య దర్పణము (సా. ద. VI పరి. 337 శ్లో.). 16 భాషలతో కూడిన ''ప్రశస్తి రత్నావళి'' అను కరంభకమును విశ్వనాథ కవిరాజు రచించెనట! అది దీనికుదాహరణము. ఇది గద్య పద్యమయకావ్యములందొకటి.

*కరుణరసము :* శోకము స్థాయిభావముగా గల రసము. ఇది నవరసములందొకటి (చూ. నవరసములు). (చూ. శోకము).

కరుణరసస్వరూపమును సాహిత్యదర్పణమిట్లు నిరూపించెను. (చూ. సా. ద. III-176 పే 222-225 శ్లో). ఇష్టబంధువుల నాశమువలనను, అనిష్టములు ప్రాప్తించుటవలనను కరుణరసము కలుగును. దీని వర్ణము కపోత వర్ణము. యముడధిదేవత. శోకము స్థాయిభావము. శోచ్యులగు బంధు మిత్రాదులు ఆలంబనవిభావము. వారి దాహాదికావస్థ ఉద్దీపన విభావము. దైవనింద, భూపాతము, ఆక్రందనము మొదలైనవి అనుభావములు. వైవర్ణ్యము, ఉచ్ఛ్వాసనిశ్వాసములు, స్తంభము, ప్రలాపము, నిర్వేదము, మోహము, అపస్మారము, వ్యాధి, గ్లాని, స్మృతి, శ్రమ, విషాదము, జడత, ఉన్మాదము, చింత మొదలయినవి వ్యభిచారిభావములు.

కరుణ రసానుభవము చిత్తవిద్రుతిని కలిగించునని భవభూతి తెలిపెను కరుణమొక్కటే రసమనియు నీరు బుద్బుద తరంగాది రూపములతో భిన్నముగా కనబడుచున్నట్లు నిమిత్తభేదమువలన కరుణమే భిన్నరసములుగా కనిపించుననియు నాతని వాదము. (చూ. కా. లం. సం. III-312 పేజి).

ఉదాహరణము :- రామవనవాసముచేత దుఃఖించుచున్న దశరథుడన్న మాటలు : అరణ్యమున జటానిబంధనమెక్కడ? నీ మనోహర శరీరమెక్కడ? ఈ రెండింటిని సమకూర్చుట విధిచేసిన దారుణము. ఇది ఎట్లున్నదనగా సుకుమారమైన శిరీషపుష్పమును కత్తితో కోయుట వలెనున్నది—ఇందు రామవనవాస జనితశోకార్తుడగు దశరథుని దైవనింద అనుభావము. అతని శోకము వ్యక్తమైనది. దీనికి మూల శ్లోకము :- ''విపినే క్వ జటానిబంధనం తవ చేదం క్వ మనోహరం వపుః। అనయోర్ఘటనా విధేః స్ఫుటం నను ఖడ్గేన శిరీషకర్తనం'' —(సాహిత్యదర్పణము. III-177 పేజి. 225 శ్లోకమునకు తరువాత).

కరుణరసమునకు కరుణ విప్రలంభమునకు భేదము :- శ్లో శోకస్థాయి తయాభిన్నో విప్రలంభాదయంరసః। విప్రలంభేరతిః స్థాయీ పునః సంభోగ హేతుకః'' —(సా. ద. III-177 పే. 226 శ్లో.). ''కరుణరసమునకు స్థాయీభావము శోకము. కరుణవిప్రలంభమునకుఁ బునస్సంభోగకారణమగు రతి స్థాయిభావము. కరుణరసమునఁ బునస్సంభోగముండదు. అసలు కేవల కరుణమో కేవలవిప్రలంభమో యుండును. కాని కరుణ విప్రలంభమనునది లేనేలేదు'' కా. లం. సం, III-486 పే.) చూ. కరుణ విప్రలంభము.

మరణించినను జీవించినను నిరపేక్షభావమున్నచోఁ గరుణమనియు, సాపేక్షభావమున్నచో విప్రలంభమనియు సిద్ధాంతము. దీనినిబట్టి కరుణ విప్రలంభమనునది లేనేలేదు.'' (కా. లం. సం. III-436 పే.).

*కరుణవిప్రలంభము* : విప్రలంభశృంగారభేదములందొకటి. ఈ విప్రలంభశృంగారము సాహిత్యదర్పణము ననుసరించి నాలుగు విధములు. (చూ. విప్రలంభశృంగారము). అందు కరుణ విప్రలంభము నాల్గవది. (మిగిలినవాని వివరములకు చూ. పూర్వరాగము, మానము, ప్రవాసవిప్రలంభము.).

''యూనోరేకతరస్మిన్ గతవతి లోకాంతరం పునర్లభ్యే విమనాయతే యదైక స్తదారసః కరుణవిప్రలంభాఖ్యః'' (సా. ద. III-172 పేజి209 శ్లో) అని సాహిత్యదర్పణము. నాయికానాయకులందొకరు లోకాంతరమునకు పోయి కాలాంతరమున ఆ శరీరముతోనే మరల బ్రతికివచ్చినచో నా యవస్థ కరుణవిప్రలంభము. భట్టబాణుడు రచించిన కాదంబరీ కావ్యమున నొకఘట్టమున మహాశ్వేతా పుండరీకులు నాయికానాయకులు. అందు పుండరీకుడు విరహోద్రేకమున మరణించును. కాని కాలాంతరమున నాతడు తన పూర్వ శరీరముతోనే మరల బ్రతుకును అప్పుడతనికి మహాశ్వేతా సంగమము కలుగును. ఈ యవస్థ కరుణవిప్రలంభమున కుదాహరణము. సంగమ ప్రత్యాశ యున్నప్పుడే కరుణవిప్రలంభము. తిరిగి కలసికొనుటయందు ఆశ లేనప్పుడు కలుగు దుఃఖము కరుణరసమే కాని కరుణ విప్రలంభము కాదు. పుండరీకుని పునర్జీవితమును గురించి ఆకాశవాణి వలన మహాశ్వేత తెలిసికొని వనశ్శాంతిని పొందినది. ఇది కరుణ విప్రలంభము.

అసలు కరుణవిప్రలంభమేలేదు. కరుణమో విప్రలంభమో యుండును గాని కరుణ విప్రలంభము అనునది లేదని అభినవగుప్తునిమతము. (కా. లం. సం. III-412 పేజి).

*కలాపకము* : ''కలాపకం చతుర్భిశ్చ'' అని సాహిత్యదర్పణము. (సా. ద. VI పరి. 352 పే. 315 శ్లో.). నాలుగు పద్యములతో కూడిన శ్రవ్యకావ్యము కలాపకము.

'చతుర్భిఃకలాపకమ్' అని ధ్వన్యాలోకలోచనము. (ధ్వ. లో. లోచ III-324 పే.). నాలుగు పద్యములకే కాన్వయమున్నచో అది కలాపకము.

'క్రియాసమాప్తికై పరస్పరాపేక్ష గల నాలుగు పద్యముల మొత్తము, కలాపకము. (కా. లం. సం. II-261 పేజి.).

*కవి* : కావ్యసృష్టిచేయువాడు కవి.

''అరోచికినః సతృణాభ్యవహారిణశ్చ కవయః" అని వామనుడు, అరోచకులు, సతృణాభ్యవహారులు అని కవులు రెండు విధములు. వివేచన శీలురు, శాసనీయులు నగు కవులరోచకులు. అవివేచన శీలురు సతృణాభ్యవహారులు.

"అపారే కావ్యసంసారే కవిరేకః ప్రజాపతిః । యథాస్మై రోచతే

విశ్వం తథేదం పరివర్తతే। శృంగారీచేత్కవిః కావ్యేజాతం రసమయం జగత్। సఏవవీతరాగశ్చేత్ నీరసంసర్వమేవతత్। భావానచేతనానపి చేతనవత్ చేతనానచేతనవత్। వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యేస్వతంత్రతయా. (ధ్వన్యాలోక తృతీయోద్యోతము, చౌఖాంబా 498 పేజి). అని ఆనందవర్ధనుడు. అనాద్యంతమైన ఈ కావ్యప్రపంచమునందు కవి యొక్కడే ప్రజాపతి. అతనికి ప్రపంచమెట్లు రుచించునో అట్లే అది మారిపోవును. కవి కావ్యమునందు శృంగారోక్తమైన విభావానుభావ వ్యభిచారుల చర్వణారూప ప్రతీతి చేయదలచినచో జగత్తంతయు రసమయముగా మారును. కవి రాగశూన్యుడైనచో సర్వప్రపంచమును రసశూన్యమేఅగును. సుకవి కావ్యమున స్వతంతముగా అచేతనభావములను చేతనవంతములుగాను, చేతన భావములను అచేతనవంతములుగాను యథేష్టముగా మార్చి వ్యవహరించును.

...త ఇమే తయో౽పి కవయః సారస్వతః, ఆభ్యాసికః ఔపదేశికశ్చ' (కా. మీ. IV-32 పే.). అని రాజశేఖరుడు. కారయిత్రీ భేదములను బట్టి సారస్వతుడు, ఆభ్యాసికుడు, ఔపదేశికుడు అని కవులు మూడువిధములు. (చూ. ఆయా శీర్షికలు).

'ప్రతిభావ్యుత్పత్తిమాంశ్చ కవిః కవిరిత్యుచ్యతే సచత్రిధా। శాస్త్రకవిః కావ్యకవి రుభయకవిశ్చ ...తత్ర త్రిధా శాస్త్రకవిః। యఃశాస్త్రం విధత్తే, యశ్చ శాస్త్రే కావ్యం సంవిధత్తే, యో౽పి కావ్యేశాస్త్రార్థం నిధత్తే కావ్యకవిః పునరష్టధా। తద్యథా–రచనాకవిః శబ్దకవిః, అర్థకవిః, అలంకారకవిః, ఉక్తికవిః, రసకవిః, మార్గకవిః, శాస్త్రార్థకవిరితి!... త్రిధాచ శబ్దకవిర్నామాఖ్యాతోభయభేదేన ... ద్విధా౽లంకారకవిః శబ్దార్థ భేదేన' (కా. మీ. V-43-48 పే.). ప్రతిభావ్యుత్పత్తులు రెండును గల కవియే కవి. అట్టి కవి మూడువిధములు (1) శాస్త్రకవి (2) కావ్యకవి (3) శాస్త్రకావ్యకవి (ఉభయకవి). శాస్త్రకవి మూడువిధములు. (1) శాస్త్ర రచయిత (2) శాస్త్రమున కావ్యమున రచించువాడు. (3) కావ్యమున శాస్త్రమును నిక్షేపించువాడు. కావ్యకవి ఎనిమిది విధములు (1) రచనాకవి (2) శబ్దకవి (3) అర్థకవి (4) అలంకారకవి (5) ఉక్తికవి (6) రసకవి (7)మార్గకవి (8) శాస్త్రార్థకవి. శబ్దకవి మూడువిధములు — (1) నామకవి (2) ఆఖ్యాతకవి (3) నామాఖ్యాతకవి. అలంకారకవి రెండువిధములు (1) శబ్దాలంకారుడు (2) అర్థాలంకారుడు.

ఏషాంద్విత్రైర్గుణైః కనీయాన్, పంచకైర్మధ్యమః, సర్వగుణయోగీ మహాకవిః దశచ కవేరవస్థా భవంతి తత్రచ బుద్ధిమదాహార్యబుద్ధయోః సప్త, త్రిస్రశ్చ ఔపదేశికస్య। తద్యథా కావ్యవిద్యాస్నాతకో, హృదయకవిః, అన్యాపదేశీ, సేవితా, ఘటమానః, మహాకవిః, కవిరాజః, ఆవేశికః, అవిచ్ఛేదీ, సంక్రామయితా చ। (కా మీ. V-49-51 పే.). అనియు రాజశేఖరుడు. ప్రతిభావ్యుత్పత్తులుకల కవి భేదముల గుణములలో రెండుమూడు

గుణములున్నవాడు కనిష్ఠుడు. అయిదు గుణములు గలవాడు మధ్యముడు. సర్వగుణయోగి మహాకవి. కవియొక్క అవస్థలు పది. బుద్ధిమంతుడు, ఆహార్యబుద్ధి అనువారికి సప్తావస్థలు, ఔపదేశికునికి మూడవస్థలు. (1) కావ్యవిద్యాస్నాతకుడు (2) హృదయకవి (3) అన్యాపదేశి (4) సేవిత (5) ఘటమానుడు (6) మహాకవి (7) కవిరాజు (8) ఆవేశికుడు (9) అవిచ్ఛేది (10) సంక్రామయిత.

నానృషిః కవిరిత్యుక్తమృషిశ్చ కిలదర్శనాత్ । విచిత్ర భావధర్మాంశ తత్త్వప్రఖ్యాచదర్శనమ్ । సతత్త్వదర్శనాదేవ శాస్త్రేషు పఠితఃకవిః । దర్శనాద్ వర్ణనాచ్చాథ. రూఢా లోకే కవిశ్రుతిః । తథాహి దర్శనేస్వచ్ఛే నిత్యేప్యాది కవేర్మునేః। నోదితా కవితాలోకే యావజ్జాతా నవర్ణనా'' అని భౌత భట్టు (కా. స్వ. 87 పేజి). దర్శనముగలవాడు ఋషి. ఋషి కానివాడు కవి కాడు. దర్శనమనగానేమి ? విచిత్రమైన భావముల (వస్తువుల), ధర్మముల, అంశముల తత్త్వమును సాక్షాత్కరింపజేసుకొనగల్గుట. ఇట్టివాడు ద్రష్ట. దర్శనము, వర్ణనము—ఈ రెండింటివలన ఋషి కవియగును కవి శ్రుతిఇట్లు లోకరూఢము. ముని యగు ఆదికవి (వాల్మీకి) కి స్వచ్ఛము, నిత్యమునగు దర్శనమున్నప్పటికిని వర్ణనశక్తి కలుగనంతవరకు ఆయననుండి కవిత్వ వెలువడలేదు.

'యత్కావ్యం లోకోత్తరవర్ణనానిపుణకవికర్మ' (కా. స్వ. 136 పే) అని మమ్మటుడు కావ్య ప్రయోజనప్రసంగమున చెప్పినదానినిబట్టి కవి లోకోత్తర వర్ణనా నిపుణుడు.

'కవయతీతి కవిః' అని విద్యాధరుడు (కా. లం. సం. 90 పేజి) వర్ణించువాడుకవి.

'కౌతి శబ్దాయతే విమృశతి రసభావాన్ ఇతి కవిః (కా. లం. సం. 90 పేజి) అని భట్టగోపాలుడు. రసభావములను విమృశించువాడు కవి.

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తి సిద్ధ—అర్థశక్తిమూలధ్వని : చూ. అభిధామూలధ్వని; సంలక్ష్యక్రమవ్యంగ్యము, అర్థశక్తిమూలధ్వని.

సంలక్ష్యక్రమవ్యంగ్యము అర్థశక్తిమూలమైనపుడు మూడువిధములుగ నుండును. (1) కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధము (2) స్వతస్సిద్ధము (3) కవి ప్రౌఢోక్తిసిద్ధము.

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తి యనగా కవిచేత నిబద్ధుడైన వక్తయొక్క ప్రౌఢోక్తి. కవి తాను స్వయముగ చెప్పక ఒకపాత్రచే చెప్పించును. ఇది నాలుగు విధములు.

(1). వస్తుకృతవస్తుధ్వని :- వస్తువుచే వస్తువు వ్యక్తమగుట, ఉదా :- నాయిక నాయకుని చూచినది. ఎట్లనగా మ అనురాగాంబుధి యుచ్చి వెల్వడినయట్లాపూర్ణ ఘర్మాంబువుల్ । తనువల్లిందిగజాఱఁ గన్నుగవ శ్రేధళ్ళల్ పిసాళించుచున్ । ననవిల్కాని పుర ప్రవేశకలనానాళికదా

మంబులై । తనరంగోమలి నిన్నుఁజూచె నరసేంద్రా! సాంద్రతేజోనిధీ (కా. లం. సం. II ఆ.-137 పద్యము). నరసభూపాలా! అనురాగ సముద్రము పొంగి, పైకివచ్చినట్లు ఘర్మజలము శరీరమునుండి జారుచుండగా తేదళ్కులు పిసాళించుచు నేత్రములు మన్మథనగరమున ప్రవేశించు పద్మమాలలై ప్రకాశింపగా ఆ నాయిక నిన్ను చూచినది.— అని ఒక దూతి మాటలు. ఇందు ఆ నాయిక మేనెల్ల చెమర్చుచుండగా నిన్ను కాంతతో చూచినది అను వస్తువుచేత ఆమె విరహతాపమున బాధపడుచున్నది అను వస్తువు వ్యక్తమగుచున్నది. ఇట కవి నిబద్ధవక్త్రియొుక దూతి.

(2) వస్తుకృతాలంకారధ్వని :- ఒక యాచకుడిట్లనును : చ। సురగిరి చుట్టునుంబవరి చుట్టుదువేల దినేశ! రత్నసం। భరితము దేవతాధనముఁ బాయక కాచెదనంచు నేటికిన్ । సురతరులం గరాంగుళులఁ జొప్పడఁదాల్చి యశోఽభ్రగంగచేఁబరగి నృసింహుఁడే సుకవిపంక్తులఁ బ్రోవనిదేల యేరికిన్ —(కా. లం. సం. II ఆ. 139 ప.). సూర్యుడా! రత్నసంభరితమైన దేవతాధనమును రక్షింతునని నేటికిని మేరుపర్వతము చుట్టును నీవేల తిరిగెదవు? ఆ ధనమిప్పుడెవరికి కావలె? మా నరసభూపాలుడు కల్పతరువులను తన కరాంగుళులందే ధరించి కీర్తిమందాకినితో విబుధపంక్తులను పోషించునుగదా! ఇక ఆ మేరువేల? —అని యాచకుని ప్రౌఢోక్తి. యాచకుడు కవినిబద్ధవక్త. మేరుపర్వత రక్షణమనావశ్యకమను వస్తువుచే నరసభూపాలుడు ప్రజలను పోషించుటలో మేరుగిరివంటివాడను ఉపమాలంకారము వ్యక్తమగుచున్నది.

(3) అలంకారకృతవస్తుధ్వని :- ఒక దూతి ఇట్లనును : చ। ధరణి ననంత కీర్తియుఁ బ్రతాపముగల్గిన రాజవౌటనిన్ । ధరుణిమనోఽరవిందమునఁ దాల్చిన చుట్టరికంబు పేర్మినో। కరివరయానకున్ విశదకాంతియుఁ గాకయునై కడంగిబిత్తరమగు మేనగీర్తియు బ్రతాపమునిల్చె నృసింహభూవరా! (కా. లం. సం. II ఆ-141 ప.). నరసభూపాలా! నీవు అనంతకీర్తియు, ప్రతాపమును గలవాడవు. నిన్నామెతన మనస్సున నిల్పుకొన్నది. అందుచే ఆమెకు కూడ నీ కీర్తి ప్రతాపములబ్బినవి కాబోలు! ఇప్పుడామెదేహము తెల్లబడి, తాపసహితముగ నున్నది—ఇందు కీర్తి ప్రతాపాఢ్యుడవైన నిన్ను తలపగా ఆమెకును కీర్తిప్రతాపములుకలిగినవో యనునట్లు తెల్లదనము, కాక కలిగినవి అనునది ఉత్ప్రేక్షాలంకారము. ఈ యుత్ప్రేక్షచేత ఆమెను నీవు వెంటనే స్వీకరింపుము. ఇక విరహము భరింపజాలదు అను వస్తువు ధ్వనించును. కనుక అలంకారకృతవస్తుధ్వని. ఇట కవినిబద్ధవక్త్రి యొకదూతి.

(4) అలంకారకృతాలంకారధ్వని :- ఒక చెలియిట్లనును: చ। చెలువ! యిదేమి? యామగువ చిత్రమువందు నృసింహభూవరుం। గలయనీక్షించు వేళఁ బులకంబులుఁ గ్రొంజెమరువుం దలిర్పఁగా। నొలయవడంకుచున్నది; సముజ్జ్వలమైన నృపాలరూపమున్ । వలపులు రేపుచున్న రతి వల్లభు రూపని

భీతిఁ జెందెనో (కా. లం. సం. II అ. 143 ప.). సఖి యిదేమి? ఆమె చి తమున నరసభూపాలుని గీసి పులకాంకితయు, సస్వేదయునయి, వణకి పోవుచున్నది! ఆ భూపాలుని రూపమును చూచి మన్మథునిరూపమని భయపడుచున్నదా? –ఇందు భ్రాంతిమదలంకారముచే నరసభూపాలుడు మన్మథునివలెనున్నాడను ఉపమాలంకారము వ్యక్తమగును.

*కవిప్రౌఢోక్తిసిద్ధ–అర్థశక్తిమూలధ్వని* : చూ. అభిధామూలధ్వని; సంలక్ష్య క్రమవ్యంగ్యము, అర్థశక్తిమూలధ్వని.

సంలక్ష్యక్రమవ్యంగ్యము అర్థశక్తిమూలమైనపుడు మూడు విధములుగానుండును. (1) కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధము (2) కవిప్రౌఢోక్తిసిద్ధము (3) స్వతస్సిద్ధము.

కవిప్రౌఢోక్తియనగా లోకమున యథార్థముగా గోచరింపక కవిచే మాత్రము కల్పితమైన ఉక్తివైచిత్రి (వక్రోక్తి). ఇది నాలుగు విధములు.

(1) వస్తుకృతవస్తుధ్వని :– "నరసభూపాలా! శివుడు నీ యశోలక్ష్మిని వశపరచుకొనుటకై నేటికిని కైలాసమున సంజ కెంజాయల జడలతో సురనదీ స్నానములతో, విభూతిధారణముతో, పులితోలు కచ్ఛడముతో, పాములు ప్రాకు శరీరముతో, హాలాహలధూమపానముతో తపస్సు చేయుచున్నాడు. లేనిచో అతనికి గతియేల?" -1 ఇందులో "నరసరాజుకీర్తిని పోలుటకై శివుడు తపస్సు చేయుచున్నాడు" అను వస్తువుచే 'శివుడుకూడ అతనికీర్తికి సరిపోలడు' అనువస్తువు వ్యక్తమగుచున్నది. శివుని తపస్సునకు చెప్పిన కారణము కవికల్పితము. అదే ప్రౌఢోక్తి (విచిత్రోక్తి).

(2) వస్తుకృతాలంకారధ్వని :– "నరసభూపాలుని ప్రతాపాగ్ని దిశలనలముకొన్నది. అందువల్లనే దవానలము అరణ్యములపాలైనది. బడబానలము సముద్రములో పడిపోయినది" 2 ఇందులో నరసభూపాలుని ప్రతాపాగ్నితో పోలలేక దావాగ్ని అడవులపాలైనది అను వస్తువుచే 'దావాగ్ని కలతచెందెకాబోలు అడవులపాలైనది' అను ఉత్ప్రేక్షాలంకారము వ్యక్తమగుచున్నది.

(3) అలంకారకృత వస్తుధ్వని :– "మహాపరాక్రమముతో ఘోర సంగ్రామవ్రతదీక్షను పూనియు ఉపవాసమున్న కారణముచేతనే కాబోలు నరసభూపాలుని ఖడ్గము శత్రుకంఠములను తుంచియు రక్తమును ముట్టకున్నది." 3 ఇందలి యుత్ప్రేక్షాలంకారముచే "మహావేగముగా అతడు శత్రుకంఠములను ఖండించెను." అను వస్తువు వ్యక్తమగుచున్నది. ఖడ్గమునకు రక్తమంటనంతవేగమది.

(4) అలంకారకృతాలంకారధ్వని :– "నరసభూపాలుని దాన జల ప్రవాహములన్నియు సాగరమున పడిపోగా వర్షాకాలమనియు అతని కీర్తికాంతి మేఘములపై పడగా శరత్కాలమనియు విష్ణువు భ్రాంతిపొంది సాగరమున నిద్రను, మెలకువను ఏకకాలమందే పొందుచున్నాడు." ఇందులో

విష్ణువునకు వర్షా శరద్భ్రాంతి కలిగెననుట భ్రాంతిమదలంకారము దీని వలన విష్ణువు తెలివితోకూడిన నిద్ర (యోగనిద్ర) పొందుచున్నట్లున్నది అను ఉత్ప్రేక్షాలంకారము వ్యక్తమగుచున్నది.

సీ ఒంటిగా మడికాసుగుంటిపైఁ గూర్చుండి
నంజకెంజాయ పెంజడలు దాల్చి
సౌరిదినేకాలంబు సురనదీస్నాతుఁడై
నిద్దంపుబూది మైనిండనలది
యచ్చుగాఁబులితో కచ్చడంబు ఘటించి
యొడఁబాములు బ్రాక నోర్చుగలిగి
హాలాహలాకలాభీలధూమముఁ గ్రోలి
యఱచేత హవ్యవాహనముఁబూని
నీయశోలక్ష్మిఁ బూను పూనికలఁదనము
నేఁడు నొనరించుచున్నాడు నీలగళుఁడు
కానియెడనేల యతని కీగతిసెఁ ంగ?
సరసగుణహార! యోబయ నరసధీర

—నరసభూపాలీయము II ఆ. 129 ప.

2 క· మేలిమి నృసింహధరణీ
పాలుప్రతాపాగ్ని దిశలఁ బఖలినఁగీలా
భీలదవానల మడవుల
పాలయ్యెన్ జలధిఁబడియె బడబానలమున్

—పై గ్రంథము II ఆ 131 ప

3 ఉ. అంచిత విక్రమంబున, మహాసమరవ్రతదీక్ష చేనొ పో (?) (శో
షించిన కారణంబుననో, శ్రీ నరసింహ కృపాణ మంజులం
బొంచి మదించిమించు నరిభూభృదకుంఠిత కంఠపీఠముల్
ద్రుంచియు వాఁతనంటదల దుఃక్షితి పక్షతజప్రవాహముల్

—పై గ్రంథము II ఆ. 133 ప

4 శా. ఆమోదంబున శ్రీ నృసింహవిభుదానా భోనిధుల్ సాగర
స్వామి జెందె యశంబు మేఘములఁబర్వంగల్గు ర్షాశర
తా మానాధి కర్ణ్య శక నచటన్ హామోదమందొంది ని
ద్రాముద్రానుగత ప్రబోధములఁ జితంబేక కాలంబునన్

—పై గ్రంథము IIఆ. 135 ప.

కవిరాజు : కవియొక్క అవస్థలు పదియనియు, అందు సహజ ప్రతిభునకును, (చూ. సారస్వతుడు) ఆహార్య పతిభునకును (చూ. అభ్యాసికుడు) ఏడవస్థలును, ఔపదేశికునకు, (చూ. ఔపదేశికుడు) మూడవస్థలును నుండునని రాజశేఖరుడు కావ్యమీమాంసయందు పేర్కొనెను: మొదటి ఏడింటిలో

కవిరాజులగుట్ట పడవలదా. (చూ. కావ్యవిద్యాస్నాతకుడు, హృదయకవి, అన్యాపదేశి, సేవిత, ఘటమానుడు, మహాకవి, ఆవేశికుడు, అవిచ్ఛేది, సంక్రామయిత.)

"యస్తు తత్ర తత్ర భాషావిశేషే తేషు తేషు ప్రబంధేషు తస్మింస్త స్మింశ్చ రసే స్వతంత్రః స కవిరాజః" అని రాజశేఖరుడు (కా.మీ. V-50 పే.) ఎవడు విభిన్నభాషలందు, విభిన్నప్రబంధములందు, విభిన్న రసములందు కావ్య నిర్మాణము చేయు సమర్థత గలవాడో అతడే కవిరాజు. ఇట్టివారు లోకములో అరుదుగా నుందురు.

**కాంతి :** ఇది అయత్నజమైన అనుభావము (చూ. అనుభావము, చూ. అయత్న జములు, చూ. అలంకారములు.)

'కాంతి'కి నిర్వచనములు:- (1) "మన్మథా వాపిత (ధ్యాసిత) చ్ఛాయా సైవకాంతిరితి స్మృతా" అని దశరూపకము (ధ. ద. రూ. రెండవప్రకా శము 28 పేజి). మన్మథావేశముచే కలిగిన సౌందర్యమే కాంతి. నాయికకు యౌవనమందు సత్త్వజములైన అలంకారములు ఇరువదింటిలో ఒకటి. ఇది అయత్నజము. (2) "సైవకాంతిర్మన్మథా ప్యాయితద్యుతిః మన్మథోన్మేషే ణాతివిస్తీర్ణా శోభైవ కాంతిరుచ్యతే" అని సాహిత్యదర్పణము (సా. ద. తృతీయపరిచ్ఛేదము 128 పేజి). శోభయే మన్మథునిచే పెంపొందింపబడిన ద్యుతిగలదైనప్పుడు కాంతియగును. హృదయమందుబికిన కామము (మన్మ థుడు) చే వెల్లుబ్బిన శోభయే కాంతి. (చూ. శోభ).

'కాంతి'కి శ్రీ సన్నిధానంవారిచ్చిన యుదాహరణము :- కం॥ తొలు ప్రాయపు మగకొదమల। తలఁపుల తమకములు మిగులఁదను నెదురుకొనం జలజాక్షి జవ్వనముగడు। వెలసెఁ బ్రతిక్షణము వింతవింతగనంతన్.- (కా. లం. సం. తృతీయాశ్వాసము, పే. 389.). జవరాలి యౌవన శోభ క్షణక్షణ మునకును వింతగా కనిపించి యువకుల నువ్విళ్లూరించినది. ఇందువలన 'కాంతి' యను అలంకారము వ్యక్తమగుచున్నది.

**కాకువు :** ఏ స్వరవిశేషముచేత వక్తయొక్క శోక హర్షాదులను ఊహింప వీలగునో అది కాకువు. అర్థాంతరమును అవగమింపజేయునది అని వ్యుత్పత్తి (కాయత్యర్థాంతర మితి కాకుః).

"ఈషదర్థే కు శబ్దః తస్యకాదేశః కుఃభూమిః హృదయస్థవస్తు ప్రతీతేః ఈషద్భూమిః కాకుః (కా. ప్ర. జమ్ములమడకవారిది 112 పేజి). హృదయ గతమైన వస్తు ప్రతీతిని కొంతగా సూచించునది కాకువు. అర్థవ్యంజనకు ఈ కాకువు సహాయపడును.

**కాక్వాక్షిప్తము :** చూ. గుణీభూతవ్యంగ్యము, మధ్యమకావ్యము.

గుణీభూతవ్యంగ్యముయొక్క అష్టభేదములందొకటి. మిగిలినవాని వివరములకు చూ. అగూఢము, అపరాంగము, వాచ్యాంగము, అస్ఫు టము, సందిగ్ధము, తుల్యప్రాధాన్యము, అరుచిరము.

కాకువుచే వ్యంగ్యము ఆక్షిప్తమగుట కాక్వాక్షిప్తము. శోకక్రోధ విస్మయాదులవల్ల కలిగిన స్వరభేదమును 'కాకువు' అందురు. ఇది శబ్దధర్మము; స్వరవిశేషము. ఈ స్వరవిశేషమువల్లనే ధ్వని తెలియును.

ఉదాహరణము :- "నరసభూపాలా ! ఒసగునప్పుడు కసరును; గర్జించును; ఒసగిఒసగి పిదప వెల్లబారును. మేఘము నీవలె విసువుకొనకుండ దానము సేయగలదా ?

క॥ "ఒసఁగునెడఁగసరు ; గర్జిలు నొసఁగి యొసఁగి వెల్లబాఱు; నొగినీకరణిన్
విసువక యొసఁగఁగ నేర్చునె? యసదృశగతి నంబువాహమౌళిశనరసా ।"

నరసభూపాలీయము II ఆ 161 ప

ఈ వాక్యమునందు దానము సేయగలదా? అనుటచేత దానము చేయజాలదు అను వ్యంగ్యము స్ఫురించుచున్నది. ఇదే కాక్వాక్షిప్తము. ఇందు వాచ్య వ్యంగ్యములు రెండును సమ కాలమందే భాసిల్లుచున్నవి.

*కామదశలు* : చూ. శృంగారావస్థలు.

*కారయిత్రి* : ప్రతిభ రెండువిధములుగా నుండుననియు, నందు కారయిత్రి యొకటి యనియు రాజశేఖరుడనెను (చూ. ప్రతిభ, భావయిత్రి.).

ఏ ప్రతిభవలన కవి కావ్యరచన చేయగల్గుచున్నాడో అది కారయిత్రి. "సాచద్విధా కారయిత్రీ భావయిత్రీ చ । కవేరుపకుర్వాణా కారయిత్రీ । సాఽపి త్రివిధా సహజాఽఽహార్యౌపదేశికీ చ । జన్మాంతర సంస్కారాపేక్షిణీ సహజా ఇహజన్మ సంస్కార యోనిరాహార్యా । మంత్రతంత్రాద్యుపదేశప్రభవా ఔపదేశికీ" అని రాజశేఖరుడు (కా. మీ. IV-32 పే). ప్రతిభ కారయిత్రి యనియు, భావయిత్రియనియు రెండు విధములు. కవికుపకారకమైనది కారయిత్రీ ప్రతిభ. ఇది మూడు విధములు. (1) సహజ (2) ఆహార్య (3) ఔపదేశికి. ఇందు సహజప్రతిభ జన్మాంతర సంస్కారము వలన పుట్టునది. ఆహార్యప్రతిభ ప్రకృతజన్మ సంస్కారమువలన కలుగునది. ఔపదేశికీప్రతిభ మంత్రతంత్రాద్యుపదేశములవలన ప్రాప్తించునది. ఇట్టి ప్రతిభలుగల ముగ్గురు కవులను వరుసగా (1) సారస్వతుడు (2) అభ్యాసికుడు (3) ఔపదేశికుడు అందురు. తేషాంపూర్వఃపూర్వః శ్రేయాన్ ఇతి శ్యామదేవః (కా. మీ. IV-33 పేజి). భావయిత్రీప్రతిభ సహృదయునిచేరస భావములనాస్వాదింపజేయును.

*కార్శ్యము* : శృంగారవస్థలందొకటి. (చూ. శృంగారావస్థలు).

నిర్వచనములు :- "కార్శ్యమంగస్యతానవం" అని ప్రతాపరుద్రీయము (ప్ర. రు. రసప్రక. 231 పే. 91 సం.) శరీరము కృశించుటయే కార్శ్యము.

ఉదాహరణము :- గీ॥ "వలపుగొని పెల్లువలకాక లలుగుడువడి పాప మా బాలయొడలు సాఁబాలుమాత మిగిలియున్నది నీకయి మిత్తిగొంగ, వేల్పుకయి గట్లరాయని బిడ్డవోలె" (శ్రీ సన్నిధానంవారిచ్చిన యుదా

హారణము, (కా. అం. సం. III-397 పేజి.) ఇందు నాయిక కృశత వర్ణితము.

**కావ్యకవి :** కావ్యమీమాంసయందు రాజశేఖరుడు కవులు మూడురకము లనెను. అందు 'కావ్యకవి' యొకడు (చూ. శాస్త్రకవి, ఉభయకవి.).

"కావ్యకవిః పునరష్టధా । తద్యథా-రచనాకవిః శబ్దకవిః అర్థకవిః అలంకారకవిః ఉక్తికవిః రసకవిః మార్గకవిః శాస్త్రార్థకవిరితి । "అని రాజశేఖరుడు (కా. మీ. V-44 పే). కావ్యకవి ఎనిమిది విధములుగా నుండును. (1) రచనాకవి (2) శబ్దకవి (3) అర్థకవి (4) అలంకారకవి (5) ఉక్తికవి (6) రసకవి (7) మార్గకవి (8) శాస్త్రార్థకవి.

ఇందు శబ్దకవి (1) నామకవి (2) ఆఖ్యాతకవి (3) ఉభయకవి. అని మూడువిధములు. అలంకారకవి (1) శబ్దాలంకారకవి (2) అర్థాలంకారకవి అని రెండు విధములు.

పై ఎనిమిది రకముల కవిత్వగుణములు గలవాడే మహాకవి. ఈ భేదములన్నింటికిని ఉదాహరణములు కావ్యమీమాంస పంచమాధ్యాయ మందున్నవి.

**కావ్యప్రయోజనము :** (1) 'ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసు చ । ప్రీతిం కరోతి కీర్తించ సాధుకావ్యనిబంధనమ్ (నిషేవణమ్) అని భామహుడు (కావ్యాలంకార, పాట్నా ప్రచురణ I పరిచ్ఛేద, 2 శ్లో). సత్కావ్య రచన (నిషేవణము) ధర్మార్థ కామమోక్షములందును, కళలయందును నైపుణ్యము కలిగించును; ఆనందమును, యశస్సును అందజేయును.

(2) 'కావ్యంసత్ దృష్టాదృష్టార్థం ప్రీతికీర్తి హేతుత్వాత్' (కా.స్వ. 41 పేజి.) అని వామనుడు. సత్కావ్యము దృష్ట పయోజనమును (ప్రీతిని), అదృష్టప్రయోజనమును (కీర్తిని) కలిగించును. "కీర్తిం స్వర్గఫలం ప్రాహు రాసంసారం విపశ్చితః" (కా. స్వ. 42 పే.). కీర్తి స్వర్గఫలమని పండిత వచనము. (చూ. ఆం. కా. లం. సూత్రవృత్తి-వేదాల 2 పేజి).

(3) 'నహికవే రితివృత్త మాత్ర నిర్వహణేన కించిత్ ప్రయోజనం ఇతిహాసాదేవ తత్‌సిద్ధేః' అని ఆనందవర్ధనుడు. (కా. స్వ. 66 పే). ఇతివృత్తము నిర్వహించుటవలన కవి సాధించుప్రయోజనము లేదు. ఇతిహాసాదుల వలననే అది సిద్ధించును."

(4) 'అస్త్యయముపదేశః కింతు నిషేధ్యత్వేన, న విధేయత్వేన' అని రాజశేఖరుడు కా. స్వ. 78 పేజి. కావ్యము విధిపూర్వకమగు ఉపదేశమును చేయదు; కాని నిషేధరూపమున అనగా ఇదిచేయవలదు ఇదిచేయవలదు అను నిషేధరూపమున) ఉపదేశింపగలదు.

(5) "తత్రకవేస్తావత్ కీర్త్యాపి ప్రీతిరేవ సంపాద్యా యదాహ-1 కీర్తిం స్వర్గఫలం పాహుః ఇత్యాది...తథాపి ప్రీతిరేవప్రధానమ్, అన్యథా ప్రభుసమ్మితేభ్యో వేదాదిభ్యో, మిత్రసమ్మితేభ్యశ్చేతిహాసాదిభ్యో,

వ్యుత్పత్తి హేతుభ్యః కోఽస్యకావ్యరూపస్య వ్యుత్పత్తిహేతోః జాయా సంమితత్వ లక్షణోవిశేష ఇతి ప్రాధాన్యేన ఆనంద ఏవోక్తః చతుర్వర్గ వ్యుత్పత్తే రపిచానందఏవ పార్యంతికం ఫలమ్'' (కా. స్వ. 103 పేజి.) అని అభినవగుప్తుడు. కవి కీర్తిచేతకూడ ప్రీతినే సంపాదించును. కీర్తి స్వర్గ ఫలము కలిగించునని యున్నది నిజమే (వామనుడు). అయినను ఆనందమే కావ్యమునకు ప్రధానము. అట్లు కానిచో వ్యుత్పత్తి హేతువులై ప్రభుసమ్మితములైన వేదాదులకంటెను మిత్ర సమ్మితములైన ఇతిహాసాదుల కంటెను జాయాసమ్మితత్వ లక్షణముగల కావ్యము కూడ వ్యుత్పత్తి హేతువేయనుటలో విశేషమేముండును ? కనుకనే ఆనందమే ప్రధానముగా చెప్పబడినది. చతుర్వర్గ జ్ఞానమునకుగూడా పార్యాంతికమగు ఫలము ఆనందమే. "కావ్యమునకు ప్రధాన ప్రయోజనము ఆనందము. ధర్మార్థ కామ మోక్షవ్యుత్పత్తియు కీర్తియు గూడ కావ్యమునకానుషంగిక ఫలములే'' యగునని భావము (అం. ధ్వ. లోకము. శ్రీపంతులవారు- ప్రథమోద్యోతము 74 పేజి.)

(6) ధర్మాదిసాధనోపాయః సుకుమారక్రమోదితః । కావ్యబంధోఽభిజాతానాం హృదయాహ్లాదకారకః అని కుంతకుడు (వక్రోక్తిసారము- శ్రీ జమ్మలమడకవారిది 1- 3 శ్లో.). రాజపుత్రాది అభిజాతులకు కావ్య బంధము ధర్మాది సాధనోపాయము, సుకుమార ఫణితిలో రచితము, హృదయాహ్లాదకారకము. "చతుర్వర్గ ఫలాస్వాద మతిక్రమ్య తద్విదాం కావ్యామృతరసేనాంతశ్చమత్కారో వితన్యతే" (పై గ్రంథమందే 1-5 శ్లో.). ధర్మార్థకామమోక్ష ఫలాస్వాదనము నతిక్రమించి కావ్యవిదులైన సహృదయులకు కావ్యామృతరసముచేత అంతశ్చమత్కారము కలుగును.

(7) "కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే । సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే ।" (కావ్యప్రకాశః, వావిళ్ల ప్రతి, 11వ పేజి). అని మమ్మటుడు. కావ్యము వేనికొఱకు ?! (1)యశస్సు (2) అర్థము (3, వ్యవహారజ్ఞానము, (4) శివేతరక్షతి (5) సద్యః పరనిర్వృతి (6) ఉపదేశము అనువానికొఱకు. కావ్యరచన కాళిదాసాదులకు కీర్తి కలిగించినది. కావ్యరచన చేయుటవలన ధావకాదులకు శ్రీ హర్షాదుల వలన ధనము లభించినది. రాజాదిగతమైన ఉచితాచార పరిజ్ఞానము- కావ్య పఠనమువలన కలుగును. కావ్యరచనవలన రోగపీడితులగు మయూరాదులకు ఆదిత్యాదులవలన అమాంగళ్యము నశించినది, (శివేతరక్షతి). సకలప్రయోజన మౌళిభూతం సమనంతర మేవ రసాస్వాదన సముద్భూతం విగళితవేద్యాంతరమానందం" (కావ్యప్రకాశః I-2 శ్లో. వివరణ). సకల ప్రయోజనములకు మౌళిభూతమైనది కావ్య శ్రవణమువలన కలుగు ఆనందము. ఇది రసాస్వాదనమువలన సముద్భూతమగును. ఇది విగళిత వేద్యాంతరమైనది. ఇదియే సద్యఃపరనిర్వృతి. (పూర్తి వివరములకు చూ. కావ్యప్రకాశము, శ్రీ

జమ్మలమడక వారి తెలుగు 14వ పేజి). "ప్రభుసమ్మిత శబ్ద ప్రధానవేదాది శాస్త్రేభ్యః సుహృత్సమ్మితార్థ తాత్పర్య వత్పురాణేతి హాసేభ్యశ్చ శబ్దార్థయోః గుణభావేన రసాంగభూతవ్యాపార ప్రవణతయా విలక్షణం యత్కావ్యం లోకోత్తర వర్ణనా నిపుణ కవి కర్మతత్. కాంతేవ సరసతా పాదనే నాభి ముఖీకృత్య రామాదివద్వర్తితవ్యం న రావణాదివత్ ఇత్యుప దేశం చ" (కావ్యప్రకాశ-I-2 శ్లో. వివరణ.). వేదాది శాస్త్రములు ప్రభు సమ్మితములు. శబ్దప్రధానములు. పురాణేతిహాసములు మిత్రసమ్మితములు. అర్థతాత్పర్య ప్రధానములు. వీనికంటె శబ్దార్థముల గుణభావముచేతను రసాంగభూతవ్యాపార ప్రవణత చేతను కావ్యము విలక్షణము. అది లోకో త్తర వర్ణనా నిపుణుడగు కవియొక్క కర్మ. అది ప్రభువువలెను, మిత్రుని వలెనుగాక, కాంతవలె సారస్యమును కలిగించుటద్వారా పాఠకులను అభి ముఖీకరించి రామాదులవలె వర్తింపదగును, రావణాదులవలె వర్తింప దగదు అని ఉపదేశము చేయును.

(8) 'కావ్యమానందాయ యశసే కాంతాతుల్యతయోపదేశాయచ' (కా: స్వ. 146 పే) అని హేమచంద్రుడు. కావ్యమెందుకు ? ఆనంద మునకు, యశస్సునకు కాంతాతుల్యమై ఉపదేశము చేయుటకు. "సద్యో రసాస్వాదజన్మా నిరస్తవేద్యాంతరా బ్రహ్మాస్వాద సదృశీ ప్రీతిరా నందః ఇదం సర్వప్రయోజనోపనిషద్భూతం కవి సహృదయయోః కావ్య ప్రయోజనమ్ యశస్తు కవేరేవ" (కా. స్వ. 146 పే.) కవి సహృదయు లిద్దరికిని కలుగు కావ్యప్రయోజనము ఆనందమే. అది సద్యోరసాస్వాద జనితమయి, నిరస్త వేద్యాంతరమై బ్రహ్మాస్వాద సాదృశ్యముగలది. ఇది సర్వప్రయోజనోపనిషద్భూతము. కవికి మాత్రమే లభించు కావ్యఫలము యశస్సు. సహృదయులకు మాత్రమే లభించు ప్రయోజనము కాంతా సమ్మితోపదేశము.

(9) యద్వేదాత్ప్రభుసమ్మితాదధిగతం శబ్దప్రధానాచ్చిరం యచ్చార్థ ప్రవణాత్పురాణ వచనాదిష్టం సుహృత్ సమ్మితాత్ కాంతాసమ్మితయా యయా సరసతామాపాద్య కావ్యశ్రియా । కర్తవ్యేకుతుకీ బుధోఽపి రచిత స్తస్యై స్పృహాం కుర్మహే (ప్ర. రు. ఉపోద్ఘాతః 8 శ్లో.5 పే.) అనివిద్యానా థుడు. ప్రభుసమ్మితము, శబ్దప్రధానము అయిన వేదమువలన కర్తవ్య గ్రహణము త్వరితముకాదు. సుహృత్సమ్మితము, అర్థప్రధానము అయిన పురాణ వచనము వలన హితము చిరకాలమునకుగాని తెలియదు. కాంతా సమ్మితమగు కావ్యము రసప్రధానమై బుధుడుకూడా కర్తవ్యమునందు కౌతుకము గలవాడగునట్లు వెంటనే చేయును. "ప్రసిద్ధం చైతన్మహాప్రబం ధేషు-పరివర్ధతే విజ్ఞానం; సంభావ్యతే యశో; విసర్పంతి గుణాః । శ్రూయ తేసుపురుషచరితం; కింతద్యేనహరంతి కావ్యాలాపాః? (ప్ర. రు. ఉపోద్ఘాతః 6 పే). కావ్యాలాపములు మనోహరములు కాకపోవుటలో హేతువేమున్నది?

విజ్ఞానము వర్ధిల్లును. యశస్సు సంభావితమగును. గుణములు వ్యాపించును. సుపురుషచరితము శ్రూయమాణమగును. "కింబహునా? చతుర్వర్గవ్యుత్పత్తి రప్యత్రైవ భవతీతి భావః తథాపి పరనిర్వృతిరేవేహ ముఖ్యంఫలమితి రహస్యం. అన్యథా కావ్యస్యకాంతా సమ్మితత్వ విశేషో నస్యాత్. తదుక్తం లోచనే-చతుర్వర్గవ్యుత్పత్తే రపి చానంద ఏవపార్యంతిక ఫలమితి." (ప్ర. రు. రత్నాపణవ్యాఖ్య 6 పేజి). వేయేల ? చతుర్వర్గ వ్యుత్పత్తిని కూడా కావ్యము కలిగించును. అయినను అన్నింటికంటె పరనిర్వృతియే ప్రధాన ప్రయోజనము. లేనిచో కావ్యమునకు కాంతాసమ్మితతత్వవిశేషము సార్థకము కాదు. 'లోచనము' దీనిని సమర్థించుచున్నది; చతుర్వర్గ వ్యుత్పత్తికంటె ఆనందమే పార్యంతికఫలము-అని.

(10) చతుర్వర్గ ఫలప్రాప్తిః సుఖాదల్పధియామపి । కావ్యాదేవయత స్తేన తత్స్వరూపం నిరూప్యతే । చతుర్వర్గఫలప్రాప్తిర్హి కావ్యతో రామాదివత్ప్రవర్తితవ్యం నరావణాది వదిత్యాదికృత్యా ప్రవృత్తినివృత్త్యుపదేశ ద్వారేణ సుప్రతీతైవ । ఉక్తంచః ధర్మార్థ కామమోక్షేషు...కావ్యనిషేవణమ్ - ఇతి । కించ కావ్యాత్ ధర్మప్రాప్తిః భగవన్నారాయణ చరణారవింద స్తవాదినా । 'ఏకఃశబ్దః సుప్రయుక్తః సమ్యక్ జ్ఞాతః స్వర్గేలోకే కామధుక్ భవతి" ఇత్యాది వేదవాక్యేభ్యశ్చ సుప్రసిద్ధైవ. అర్థప్రాప్తిశ్చ ప్రత్యక్షసిద్ధా. కామప్రాప్తిశ్చార్థద్వారైవ. మోక్షప్రాప్తిశ్చైతజ్జన్య ధర్మఫలాననుసంధానాత్. మోక్షోపయోగివాక్యే వ్యుత్పత్త్యాధాయకత్వాచ్చ । చతుర్వర్గ ఫలప్రాప్తిర్హి వేదశాస్త్రేభ్యో నీరసతయా దుఃఖాదేవ పరిణతబుద్ధీ నామేవ జాయతే । పరమానంద సందోహ జనకతయా సుఖాదేవ సుకుమార బుద్ధీనామపి పునః కావ్యాదేవ. । ననుతర్హి పరిణతబుద్ధిభిః సత్సు వేదశాస్త్రేషు కావ్యేషు కిమితి యత్నః కరణీయః ఇత్యపి నవక్తవ్యం । కటుకౌషధోప శమనీయస్య రోగస్య సితశర్క రోప శమనీయత్వే కస్యవా రోగిణః సితశర్కరా ప్రవృత్తిః సాధీయసీనస్యాత్' (సా. ద. I-4 & 5 పే.) అని విశ్వనాథుడు. అల్పబుద్ధులయినవారికికూడ సుఖముగా చతుర్వర్గఫలములు ప్రాప్తింపవలెనన్న కావ్యమే సాధనము. చతుర్వర్గ ఫలప్రాప్తి ఎట్లు కావ్యమువలన అగును? రామాదులవలె వర్తింపవలె; రావణాదులవలె నడువరాదు అను సరణిలో నడవడినిగూర్చి ప్రవృత్తిని ఉపదేశించుటద్వారా కావ్యము ధర్మార్థాదులను కలిగించును. ఈ విషయమునే భామహుడు చెప్పెను. కావ్యము ధర్మము నెట్లు కలిగించును ? భగవన్నారాయణ చరణారవింద స్తుతి చేయుటవలన ! చక్కగా తెలుసుకొని, చక్కగా ప్రయోగించబడిన ఒక్కశబ్దము చాలును. స్వర్గలోకమందు కామధేనువుగా ఉపయోగించును- అని వేదము ఘోషించుచున్నది. ఈ వేదవాక్యము ధర్మప్రాప్తికి వాఙ్మయమెట్లు సాధనమో తెల్పు

చున్నది. ఇక అర్థప్రాప్తి ప్రత్యక్ష సిద్ధము. ధనము లభించుటవలన కామములు నెరవేర్తును. ఇక మోక్షమునకు కావ్యమెట్లు సాధకమగును ? (కావ్యమువలన కలిగిన) ధర్మఫలముల ననుసంధించుటవలనను, మోక్షోపయోగకరములైన వాక్యములందు వ్యుత్పత్తిని కలిగించుట వలనను మోక్ష సాధకమగును! వేదశాస్త్రములు ఈ చతుర్వర్గముల ఫలములను కలిగించకపోవు. కానీ అవి నీ రసపద్ధతిలో కలిగించును. పైగా పరిణతబుద్ధులకు మాత్రమే క్లేశపూర్వకముగానే కలిగించును. కావ్యము పరమానందము నొనగూర్చుచు సుఖముగా సుకుమారబుద్ధులకు కూడా చతుర్వర్గఫలములను కలిగించును. అయిత్తే పరిణత్బుద్ధులైనవారు కావ్యములేల చదువవలయును. వారికి వేద శాస్త్రములు లేవా ? అని ప్రశ్నించుట సమంజసముకాదు. ఎందుకు? చేదు మందుతో కుదురు రోగము పంచదారతోనే కుదురునపుడు పర్రోగియైనను పంచదారనే ఎందుకు మందుగా వాడుకొనరాదు ?

కావ్యము : చూ. పద్యకావ్యములు

"భాషావిభాషా నియమాత్ కావ్యం సర్గసముత్థితం । ఏకార్థప్రవణైః పద్యైః సంధిసామగ్ర్యవర్జితమ్' అని సాహిత్య దర్పణము (సా. ద. VI పరి. 366 పే..328 శ్లో.). సంస్కృతముగాని అపభ్రంశముగాని నియమముగా గలిగి సర్గలతో కూడుకొని ఏకవాక్యతగల పద్యములతో రచింపబడినది కావ్యము. ఇందు సంధిసామగ్రి యక్కరలేదు. ఉదా :- భిక్షాటనము, ఆర్య విలాసము.

'శబ్దార్థౌ సహితౌ కావ్యమ్' అనిభామహుడు (కా. స్వ. 23 పేజి). శబ్దార్థములతో కూడినది కావ్యము; లేదా శబ్దార్థములు పరస్పరోప కారకములుగా వర్తించుటయెందో అది కావ్యము.

'శరీరం తావదిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ' అని దండి. (కా. స్వ. 27 పే.). మనోహరార్థముతో అలంకృతమైన పదావళి కావ్యము.

'నను శబ్దార్థౌ కావ్యం' అని రుద్రటుడు. (కా. స్వ. 38 పే) శబ్దార్థములు కావ్యము.

"కావ్యం గ్రాహ్యమలంకారాత్ । (కావ్యం ఖలు గ్రాహ్యముపాదేయం భవతి అలంకారాత్ । కావ్యశబ్దోఽయం గుణాలంకార సంస్కృతయోః శబ్దార్థయోఃవర్తతే)" అని వామనుడు. (కా. స్వ. 41 పే.). గుణాలంకారములచే సంస్కరింపబడిన శబ్దార్థములే కావ్యము. "రీతి రాత్మా కావ్యస్య । విశిష్ట పదరచనారీతిః" (కా. స్వ. 43 పే.) కావ్యమునకాత్మరీతి. విశిష్ట పద రచనమురీతి.

"శాస్త్రేతిహాస వైలక్షణ్యంతు కావ్యస్య శబ్దార్థ వైశిష్ట్యాదేవ. నాభిధావైశిష్ట్యాత్" అని ఉద్భటుడు (కా. స్వ. 48 పేజి.). కావ్యము శాస్త్రేతిహాసములకంటె విలక్షణము. ఆ వైలక్షణ్యమేమన శబ్దార్థ వైశిష్ట్యమే. అభిధావైశిష్ట్యము వలన కావ్య విశిష్టత కలుగదు.

''కావ్యస్యాత్మాధ్వనిః''...యోఽర్థః సహృదయశ్లాఘ్యః కావ్యాత్మేతి వ్యవస్థితః వాచ్యప్రతీయమానాఖ్యౌ తస్యభేదావుభౌస్మృతౌ (కా. స్వ. 57 పే.) అని ధ్వన్యాలోకము. కావ్యాత్మధ్వని. సహృదయ శ్లాఘ్యమగు అర్థమే కావ్యాత్మ. అది వాచ్యప్రతీయమానములని రెండు విధములు. 'నహి ప్రతీయమానార్థః శబ్దార్థశాసన జ్ఞానేన కేవలం నవేద్యతే । కేవలం కావ్యార్థతత్త్వజ్ఞైఃవేద్యతే తద్వ్యక్తి సమర్థః కశ్చనైవశబ్దః తౌశబ్దార్థౌమహాకవేః ప్రత్యభిజ్ఞేయౌ'' (ధ్వనిసారః 3 పేజి). ''ఆ ప్రతీయమానార్థము కేవల శబ్దార్థ శాసనజ్ఞానమునఁ దెలియదు. కావ్యార్థతత్త్వజ్ఞులు మాత్రమె దానిని తెలియగలరు. ఆ యర్థము నభివ్యక్తము చేయుటలో ఒకానొకశబ్దమె సమర్థము. ఆ యర్థము, శబ్దము ఈ రెండు మహాకవికి ప్రత్యభిజ్ఞేయములు.'' (శ్రీజమ్మలమడకవారి తెలుగు.). అలంకారోహిచారుత్వహేతుః ప్రసిద్ధః । నత్వసా వాత్మైవాత్మనశ్చారుత్వహేతుః (కా. స్వ. 63 పేజి). అలంకారము చారుతాహేతువే. కాని అది ఆత్మకాదు. ఆత్మకు చారుతాహేతువు మాత్రమే. వ్యంగ్యవ్యంజకాభ్యామేవహి సుప్రయుక్తాభ్యాం మహాకవీనాం మహాకవిత్వలాభః నతువాచ్య వాచక చారుత్వ మాత్రేణ'' (ధ్వనిసారః 3 పేజి). వ్యంగ్య వ్యంజకములను చక్కగా ప్రయోగించిననే మహాకవులకు మహాకవిత్వ సిద్ధికలుగును వాచ్య వాచకరచనా మాత్రమున నది లభింపదు.' (శ్రీ జమ్మలమడకవారి తెలుగు).

''ఉక్తివిశేషఃకావ్యమ్' (కా. స్వ. 78 పేజి.) అని రాజశేఖరుడు. ఉక్తివిశేషమే కావ్యము గుణవదలంకృతంచ కావ్యమ్ (కా. స్వ. 78) గుణాలంకారసహితమైనదే కావ్యము.

''శబ్దప్రాధాన్యమాశ్రిత్య తత్రశాస్త్రం పృథగ్విదుః । అర్థతత్త్వేన యుక్తేతు వదంత్యాఖ్యానమేతయోః । ద్వయోర్గుణత్వే వ్యాపారప్రాధాన్యే కావ్యధీర్భవేత్'' (కా. స్వ. 83 పే). అని భట్టనాయకుడు. శబ్ద ప్రాధాన్యము గలది శాస్త్రము. అర్థ ప్రాధాన్యము గలది ఆఖ్యానము. శబ్దార్థ ప్రాధాన్యముగలది కావ్యము.

కావ్యమితి శబ్దార్థావిత్యర్థః (కా. స్వ. 105) అని అభినవగుప్తుడు. శబ్దార్థములే కావ్యము. ''కవనీయం కావ్యం తస్యభావః కావ్యత్వమ్'' (కా. స్వ. 105) అని అభినవగుప్తుడు. వర్ణింప దగినది కావ్యము. దాని భావమే కావ్యత్వము. "కావ్యేతు గుణాలంకార మనోహర శబ్దార్థశరీరే, లోకోత్తర రసప్రాణకే, హృదయ సంవాదవశాత్ నిమగ్నాకారికా తావద్భవతిచిత్తవృత్తిః'' అని అభినవగుప్తుడు (కా. స్వ. అభినవభారతీ 106 పేజి). కావ్యమునకు గుణాలంకార మనోహర శబ్దార్థమే శరీరమనియు, లోకోత్తర రసమే ప్రాణమనియు ఇందు సూచితమైనది.

శబ్దార్థౌ సహితౌ వక్రకవి వ్యాపారశాలిని బంధే వ్యవస్థితౌ కావ్యం

తద్విదాహ్లాదకారిణి ద్వౌసమ్మిలితౌ కావ్యం । ద్వావేకమితి విచిత్రైవ ఉక్తిః । కేషాంచిన్మతే శబ్ద ఏవ కేవలం కావ్యమితి । కేషాంచిత వాచ్యమేవ కావ్యమితి । పక్షద్వయమపి నిరస్తం భవతి । ... న శబ్దస్యైవ రమణీయతా, విశిష్టస్య కేవలస్య కావ్యత్వం నాప్యర్థస్య. తేన శబ్దార్థౌ ద్వౌ సమ్మిళితౌ కావ్యం ఇతి స్థితం.' అని కుంతకుడు (వక్రోక్తి సారము 5, 6 పేజీలు.). వక్రకవి వ్యాపారశాలియు కావ్యవేత్తలకాహ్లాదకారియు నగు బంధమందు వ్యవస్థితములై సమ్మిళితములైన, సహితములైన శబ్దార్థములు కావ్యమగును. రెండింటినొక చేయనుట విచిత్రమైన మాటయే. కేవలము శబ్దమే కావ్యమని కొందరు; అర్థమే కావ్యమని కొందరు అందురు. ఈ రెండు పక్షములును నిరస్తములగును. రమణీయతా విశిష్టమైన కేవల శబ్దమునకు గాని కేవల అర్థమునకుగాని కావ్యత్వము లేదు. కనుక సమ్మిళిత శబ్దార్థములే కావ్యము.

అలంకారాస్త్వలంకారాః గుణా ఏవగుణాస్సదా ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్' అని క్షేమేంద్రుడు. కావ్యమునకలంకారము లలంకారములే; గుణములు గుణములే. రససిద్ధకావ్యమునకు జీవితము స్థిరమైన ఔచిత్యమే.

"నిర్దోషం గుణవత్కావ్య మలంకారైరలంకృతమ్ రసాన్వితం కవిః కుర్వన్... । ... ఉక్తిప్రాధాన్యాత్ కావ్య మిత్యుచ్యతే । శబ్దస్య ప్రాధాన్యమితి శాసనాత్ శాస్త్రమిదమ్। అతీతార్థ ప్రాధాన్యాదితిహాసః । అని భోజదేవుడు (కా. స్వ. 130 పే.) దోష రహితము, గుణసహితము, అలంకారాలంకృతము, రసాన్వితము అయిన కవి కర్మకావ్యము...ఉక్తిప్రాధాన్యము గలది కావ్యము. శబ్దప్రాధాన్యముగలది శాస్త్రము. అతీతార్థ ప్రాధాన్యము గలది ఇతిహాసము. "తత్కావ్యంపునః శబ్దార్థయోః సాహిత్య మామనంతి । నిర్దోషస్య గుణవతః అలంకృతస్య కావ్యశరీరస్య కామినీ శరీరస్యేవ శోభాతిశయనిష్పత్తౌ రసావియోగ ఏవ పకృష్ట ఉపయోగీ' (కా. స్వ. 131 పే). శబ్దార్థముల సహభావము (సాహిత్యము) ను కావ్యమందురు. నిర్దోషము, గుణవంతము, అలంకృతము నగు కావ్యశరీరమునకు కామినీ శరీరమునకు వలెనే శోభాతిశయ నిష్పత్తియందు రసావియోగమే ప్రకృష్టోపయోగి యగును.

తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునఃక్వాఽపి అని మమ్మటుడు. (కా. ప్ర. I ఉల్లాస 26 పే.). దోషరహితములును, గుణసహితములును అలంకారయుతములును అయిన శబ్దార్థములు కావ్యము. క్వాఽపి ఇత్యనేనై తదాహ యత్ సర్వత్ర సాలంకారౌ క్వచిత్తు స్ఫుటా లంకార విరహేఽపి న కావ్యత్వహానిః (కా. ప్ర. I ఉల్లాస 26 పే.). అలంకార రహితమైనను కొన్ని శబ్దార్థములు తదితర లక్షణసంపన్నములైనపుడు కావ్యమగు (అనలంకృతీపునఃక్వాఽపి) నని చెప్పినను శబ్దార్థములు సర్వత్ర సాలం

కారములై యుండవలెను. కాని ఒకానొకచో స్ఫుటాలంకారములు లేకున్నను కావ్యత్వమునకు హానియుండదు. (అలంకారములేనిచోట రసప్రధానముండవలెను. వ్యంగ్యము కావ్యమున కాత్మ.).

లోకోత్తరం కవికర్మకావ్యమ్ ...అదోషౌసగుణౌ సాలంకారౌ చ శబ్దార్థౌకావ్యమ్ చకారో నిరలంకారయోరపి శబ్దార్థయోః క్వచిత్ కావ్యత్వఖ్యాపనార్థః'' అని హేమచంద్రుడు. (కా. స్వ. 147 పే.). లోకోత్తరమైన కవి కర్మ కావ్యము. దోషరహితములు, గుణసహితములు అలంకారయుతములునగు శబ్దార్థములుకూడా క్వాచిత్కముగా కావ్యమగును.

గుణాలంకార సహితౌ శబ్దార్థౌ దోషవర్జితౌ। గద్యపద్యోభయమయం కావ్యం కావ్యవిదో విదుః అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యమితి కావ్య సామాన్య లక్షణమ్। శబ్దార్థౌమూర్తిరాఖ్యాతౌ జీవితం వ్యంగ్య వైభవమ్ హారాది వదలంకారాస్తత్ర స్యురుపమాదయః శ్లేషాదయోగుణాస్తత్ర శౌర్యాదయ ఇవస్థితాః ఆత్మోత్కర్షావహాస్తత్ర స్వభావా ఇవరీతయః శోభామాహార్యకం ప్రాప్తా వృత్తయో వృత్తయో యథా పదానుగుణ్యా విశ్రాంతిః శయ్యాశయ్యేవ సమ్మతా। రసాస్వాద ప్రభేదాస్స్యుః పాకాపాకా ఇవ స్థితాః। ప్రఖ్యాతా లోక వదియం సామగ్రీ కావ్యసంపదః' (ప్ర. రు. కావ్యప్రక. 37, 38 పే. 1-5 శ్లో.). గుణాలంకారసహితములు, దోషరహితములు అయిన శబ్దార్థములు కావ్యము. గద్య, పద్య, ఉభయ కావ్యములని అది ముప్విధము. కావ్యమునకు శబ్దార్థములే మూర్తి. వ్యంగ్యవైభవమే జీవితము. ఉపమాది అలంకారములు హారాదులవంటివి. శ్లేషాదిగుణములు శౌర్యాది గుణములవంటివి. రీతులు ఆత్మోత్కర్ష కలిగించు స్వభావములవంటివి. వృత్తులు ఆహార్యములవలె శోభాపాదకములు. శయ్య శయ్యవంటిది. రసాస్వాద ప్రభేదములైన పాకములు పాకములవంటివి. ఈవిధముగా కావ్యసామగ్రి లోకసామగ్రివంటిది. (విద్యానాథుని ప్రతాపరుద్రీయము).

వాక్యం రసాత్మకం కావ్యమ్ ... రసఏవాత్మా సారరూపతయా జీవనాధాయకోయస్య తేన వినాతస్య కావ్యత్వా భావస్య ప్రతిపాదితత్వాత్ రస్యతే ఇతిరసః ఇతి వ్యుత్పత్తి యోగాద్భావతదాభాసాదయోఽపి గృహ్యంతే ...దోషాస్తస్యాపకర్షకాః। .. ఉత్కర్ష హేతవః ప్రోక్తా గుణాలంకారరీతయః। —(ప్ర. రు. I-పరిచ్ఛేదః 21-22 పేజీలు). రసాత్మకమైన వాక్యము కావ్యము. సారరూపమగుటవలన జీవనప్రదాయకమగు రసమే కావ్యమునకాత్మ. రసము లేనిదే కావ్యమునకు కావ్యత్వములేదు. రసమనగా ఆస్వాదింపబడునది అని అర్థము. ఈ వ్యుత్పత్తివలన భావము, రసాభాస, భావాభాసములున్ననుకావ్యమగును. కావ్యమునకు దోషములు అపకర్షకలిగించును. గుణములు, అలంకారములు, రీతులు ఉత్కర్ష కలిగించును, (విశ్వనాథుని సాహిత్యదర్పణము).

"రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమ్ । రమణీయతా చ లోకోత్తరాహ్లాద జనక జ్ఞాన గోచరతాలోకోత్తరత్వంచ ఆహ్లాద గత శ్చమత్కారపర్యాయోఽను భవసాక్షికో జాతివిశేషః కారణంచత దవచ్ఛిన్నే భావనావిశేషః పునః పునరనుసంధానాత్మా పుత్రస్తేజాతః, ధనంతే దాస్యామి ఇతి వాక్యార్థ ధీజన్యస్య ఆహ్లాదస్య నలోకోత్తరత్వం అతో న తస్మిన్ వాక్యే కావ్యత్వప్రసక్తిః" (ఆం. ర. గం. కావ్య లక్షణ 10, 11 పే.). "రమణీయమగు నర్థమును ప్రతిపాదించు శబ్దము కావ్యము. శబ్దము బోధించిన యర్థము తెలిసి లోకోత్తరమగు నాహ్లాదము గలిగినపుడా యర్థము రమణీయమగును. ఆహ్లాదము లోకోత్తరమని సహృదయులు తమ యనుభవముతో నిర్ణయింతురు. ఆ యాహ్లాదమందున్న లోకోత్తరమైన ఆ యసాధారణ ధర్మమునకే చమత్కారము అని మరొక పేరు, ఇదొక విశిష్టమగుజాతి. ఈ చమత్కార మొదవుటకై అర్థమును మాటిమాటి కనుసంధింపవలెను. ఆ యనుసంధానమే విశిష్టమగు భావన. లోకములో నీకు కొడుకుపుట్టినాడు, నీకు డబ్బిత్తును అను నీరకపు మాటల యర్థము తెలిసినను కూడ ఆహ్లాదము కల్గును. కాని అది లోకసామాన్యపు చాయలదే. కనుక నామాటలు కావ్యము కావు." (శ్రీమాన్ వేదాల తిరువెంగళాచార్యుల తెలుగు తాత్పర్యము. ఆం. ర. గం. II-11 పేజి.). "ఇత్థంచ చమత్కార జనకభావనా విషయార్థ ప్రతిపాదకశబ్దత్వమ్ యత్ ప్రతిపాదితార్థ విషయక భావనాత్వం చమత్కార జనకతావచ్ఛేదకం తత్త్వమ్ । స్వవిశిష్ట జనకతావచ్ఛేదకార్థ ప్రతిపాదకతా సంసర్గేణ చమత్కారత్వ వత్త్వమేవ వా కావ్యత్వమితిఫలితమ్ (ఆం. ర. గం. II-11) "కాగా చమత్కారమును కలిగించు భావనలో గోచరమగు నర్థమును ప్రతిపాదించు శబ్దముకానీ, ఏది ప్రతిపాదించిన యర్థములు భావించుట యందుండు వైశిష్ట్యము చమత్కారము నొదవించుటలో ప్రయోజకమగునో అట్టిశబ్దము కావ్యము అని తేలినది. అథవా చమత్కారవత్త్వమును కలిగియుండు శబ్దమే కావ్యము. ఎట్లు? చమత్కారమును పొదవించు నర్థమును ప్రతిపాదించుట యను చుట్టరికము శబ్దమునకేకదా యుండును. కనుక ఈ సంబంధమునుబట్టి చమత్కారమే కావ్యమును గుర్తింపజేయును. కాగా పైఁజెప్పిన చమత్కారమే కావ్యమునకు లక్షణము. (వేదాల).

***కావ్యవిద్యాస్నాతకుడు :*** కవియొక్క అవస్థలు పదియనియు అందు సహజప్రతిభునకును ఆహార్యప్రతిభునకును ఏడవస్థలును, ఔపదేశికునకు మూడవస్థలును నుండునని రాజశేఖరుడు కావ్యమీమాంసయందు పేర్కొనెను మొదటి ఏడింటిలో కావ్యవిద్యా స్నాతకుడొకడగుట యొకటి. (చూ. కారయిత్రి, చూ. హృదయకవి, అన్యాపదేశి, సేవిత, ఘటమానుడు, మహాకవి, కవిరాజు, ఆవేశికుడు, అవిచ్ఛేది, సంక్రామయిత.)

"యః కవిత్వకామః కావ్యవిద్యోపవిద్యా గ్రహణాయ గురుకులానుపా

పాస్తే స విద్యాస్నాతకః" అని రాజశేఖరుడు. ఎవడు కవితా కుతూహల ముతో కావ్యవిద్యలను ఉపవిద్యలను నేర్చుకొనుటకై గురుకుల సేవలు చేయునో అతడు (కావ్య) విద్యాస్నాతకుడు.

**కావ్యహేతువు :** కావ్యమును రచించుటకు కవికి కావలసిన సాధనము కావ్య హేతువు. ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు కలిసి కావ్యహేతువు

(వివరములకు చూ. ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసము.)

**కావ్యానుమితి :** తార్కికపరిభాషలోని అనుమాన ప్రమాణమును ఆధారముగా తీసుకొని వ్యక్తి వివేకకర్త (మహిమభట్టు) స్థాపించిన నూతన సిద్ధాంత మునకు 'కావ్యానుమితి' అని పేరు. ఇది ధూమాగ్ని - అనుమానము కాదని తెల్పుటకై కావ్యానుమితి యని నామకరణ మొనర్చెను.

ధ్వన్యాలోకకర్త తెల్పిన ధ్వనులన్నియు అనుమానమునందే అంతర్భ వించుననియు, లక్షణావ్యంజనావృత్తులు అనావశ్యకములనియు నీతని యభి ప్రాయము. "అనుమానేఽంతర్భావం సర్వస్యాపి ధ్వనేః ప్రకాశయితుం వ్యక్తి వివేకంకురుతే ప్రణమ్య మహిమాపరాం వాచం" —(కా. లం. సం. II-99).

వాచ్యార్థమువలనగాని తత్ సంబంధముగల మరొక అర్థము వలన గాని ఏ అర్థాంతరము ప్రకాశించుచుండునో అదియే కావ్యానుమితి. "వాచ్యస్తదనుమితో వా యత్రార్థోఽర్థాంతరం ప్రకాశయతి సంబంధతః కుతశ్చిత్ సా కావ్యానుమితిరిత్యుక్తా. —(కా. స్వ. 198 పే).

వాచ్యము, అనుమేయము అని అర్థము రెండు విధములు. శబ్ద వ్యాపారవిషయము వాచ్యము. ఇదే ముఖ్యార్థము. దానినుండిగాని లేదా దాని లింగభూతమగు దాని యనుమానమునుండి కాని ఏఅర్థాంతరము అను మానింపబడునో అదే అనుమేయము. (వివరములకు చూ. కా. లం. సం. 99 & 100 పేజీలు.)

***కిలికించితము :*** 'కిలకించితము' అని రూపాంతరము. ఇది స్వభావజములయిన అలంకారములలో నొకటి. (చూ. స్వభావజములు; చూ. అలంకారములు). ఒక అనుభావము (చూ. అనుభావము.) ఒక శృంగారచేష్ట. (చూ. శృంగార చేష్టలు.)

నిర్వచనములు :- (1) "క్రోధాశ్రుహర్షభీత్యాదే స్సంకరః కిలకిం చితం" అని దశరూపకము (ధ. ద. రూ. రెండవప్రకాశము 29 పేజి). కోపము, దుఃఖము, సంతోషము, భయము మొదలయిన వాని కలయిక కిలకిం చితము. 20 అలంకారములలో ఒకటి. (చూ. అలంకారములు). (2) "రోషాశ్రు హర్ష భీత్యాదేః సంకరః కిలికించితం" (అం. ప్ర. రు. రసప్రకరణము 300 పేజి.) అని ప్రతాపరుద్రీయము. రోషము, అశ్రువు, హర్షము, భయము మొదలయిన వాని సంకరము కిలికించితము. ఇవన్నియు నొక్కే పర్యాయము కలుగుట యని భావము. 18 శృంగార చేష్టలందొకటి

(చూ. శృంగారచేష్టలు). (3) స్మిత శుష్క రుదిత హసిత త్రాసక్రోధ శ్రమాదీనాం సాంకర్యం కిలకించిత మభీష్ట తమసంగమాది జాద్ధర్షాత్'' అని సాహిత్యదర్పణము (సా. ద. తృతీయపరిచ్ఛేదము 127 పేజి). తన ప్రియ సమాగమము వలన పుట్టిన హర్షముచే చిరునవ్వు, కల్ల యేడ్పు, నవ్వు, భయము, కోపము, అలత మొదలయినవాని కలయిక కిలకించితము. 18 సత్త్వజాలంకారములలో ఒకటి. (చూ. సత్త్వజములు). (4) "అలుకలుక ముదము నశ్రువు గలిసినఁ గిలికించితంబు'' అని నరస భూపాలీయము (III-108 పద్యము).

ఉదాహరణము :- 'ఆమె తన కోరికలకు భంగము రాకుండు విధముగా చేతులనడ్డుపెట్టును; అతనిని చక్కగా నవ్వుతోనే బెదిరించును; సౌఖ్యమనుభవించు సమయమునందే కన్నీరు రాకుండ కపటముగా ఏడ్చును.' ఇందలి క్రియలు ప్రియసంగమము వలన కలిగిన హర్షమున నుదయించినవి. కం॥ "స్వమనోరథంబులకు భం । గము రానట్లడ్డగించుఁ గలికి నవుల యం । దముతోఁ దర్జించును ప్రియు । సుమాంగి కల్లేడ్పు లేడ్చు సుఖమగ్నయునై'' —కా. లం. సం. III- (సాహిత్యదర్పణమందలి శ్లోకమునకు సన్నిధానం వారి తర్జుమా). 380 పేజి. శ్లో॥ పాణిరోధమవిరోధితవాంఛం । భర్త్సనాశ్చ మధురస్మితగర్భాః । కామినః స్మ కురుతే కరభోరూ । హ్హారి శుష్కరుదితం చ సుఖేఽపి'' —సా. ద. తృతీయ పరిచ్ఛేదము 127 పేజి. లేదా ఆం. సా. ద. తృతీయ పరిచ్ఛేదము 141 సంఖ్య 59 పేజి.

**కుట్టమితము :** ఇది స్వభావజములైన అలంకారములలో నొకటి. (చూ. స్వభావజములు; చూ. అలంకారములు). ఒక అనుభావము చూ. అనుభావము). ఒక శృంగారచేష్ట (చూ. శృంగార చేష్టలు).

నిర్వచనములు :- (1) "సానందాంతః కుట్టమితం కుప్యేత్ కేశాధర గ్రహే'' అని దశరూపకము. (ధ. ద. రూ. 29 పేజి). ప్రియుడు తన జడను గాని, పెదవినిగాని తాకగా లోపల సంతోషించుచు నాయిక పైకి కోపమును ప్రకటించుట కుట్టమితము. 10 స్వభావజాలంకారములందొకటి (చూ. స్వభావజములు). (2) "సమ్మర్దేఽపి సుఖాధిక్యం రతే కుట్టమితం మతం'' అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర.రు. రసప్రకరణము 301 పేజి). రతియందు సమ్మర్దమున్నప్పటికిని సుఖాధిక్యము నొందుట కుట్టమితము. 18 శృంగార చేష్టలందొకటి. (చూ. శృంగారచేష్టలు). (3) "కేశస్తనాధరాదీనాం గ్రహేహర్షేఽపి సంభ్రమాత్ । ఆహుః కుట్టమితం నామ శిరఃకర విధూననం'' అని సాహిత్యదర్పణము (కా. లం. సం. 387 పేజి) ప్రియుడు తన కేశములు, స్తనములు, అధరములు మొదలయినవానిని గ్రహించగా సంతోషము కలుగుచున్నప్పటికిని పైకి తత్తరపడుచు నాయిక తన తలను, చేతులను విదల్చుట కుట్టమితము. 18 స్వభావజాలంకారములలో ఒకటి. (చూ. స్వభావజములు). (4) "రతుల నతి సమ్మర్దోజ్జ్వల సౌఖ్యము కుట్ట

మితము'' అని నరస భూపాలీయము. (III-118 పద్యము)

ఉదాహరణము :- ప్రియుడు ప్రియురాలి తలిరాకువంటి అరుణా ధరమును గ్రసించెను. అప్పుడు చిగురాకుతో పోలికగల ఆమె చేతికి కోపము వచ్చినదికాబోలు, అది గాజులతో గలగలమనెను; ఇందు అధర పానమువలన కలిగిన సౌఖ్యముచే ఆమె చేతులను విదలించినట్లు వ్యక్తమయి నది. అదియే కుట్టమితము. కం॥ "తలిరాకు చుట్టమగు నా చెలి కెమ్మోవిని గ్రసింపఁ జెలువుండు, కరం । బుల నున్న కంకణంబులు గలగలమనె నేదొ బెడఁద కలిగిన కరణిన్" -(కా. లం. సం. III- (సాహిత్య దర్పణము లోని శ్లోకమునకు సన్నిధానంవారి తర్జుమా 387 పద్యము.). శ్లో॥ పల్లవోప మితి సామ్య సపక్షం దష్టవత్యధరబింబ మభీష్టే । పర్యకూజి సరుజేవ తరు ణ్యాస్తారలోలవలయేన కరేణ' —సా. ద. తృతీయ పరిచ్ఛేదము 128 పేజి.

*కుడబకము :* 'అపభ్రంశ నిబద్ధేఽస్మిన్ సర్గాః కుడబకాభిధాః' అని సాహిత్య దర్పణము (సా. ద. VI పరి. 356 పే. 327 శ్లో.). అపభ్రంశ భాషా కావ్య మునందలి సర్గలకు కుడబకములనిపేరు. ఉదా :- 'కర్ణ పరాక్రమము' (చూ. సర్గబంధము.)

*కుతూహలము :* స్వభావజములైన అలంకారములందొకటి. (చూ. స్వభావజ ములు. చూ. అలంకారములు). ఒక అనుభావము (చూ. అనుభావము); ఒక శృంగారచేష్ట (చూ. శృంగారచేష్టలు).

నిర్వచనములు - (1) "కుతూహలం రమ్యదృష్టౌ చాపలం పరి కీర్త్యతే." అని ప్రతాపరుద్రీయము. (అం. ప్ర. రు. రసప్రకరణము 304 పే.) రమ్యవస్తువును (ప్రియుని) చూచినప్పుడు కలుగు చాపలమే కుతూహలము. 18 శృంగారచేష్టలందొకటి (చూ. శృంగారచేష్టలు.). (2) "రమ్యవస్తుసమా లోకే లోలతాస్యాత్కుతూహలం" అని సాహిత్యదర్పణము (కా. లం. సం. 388 పేజి). మనోహరమైన వస్తువులను చూచుటయందు ఆసక్తి (ఉబ లాటము) కుతూహలము. 18 స్వభావజములందొకటి (చూ. స్వభావజ ములు). (3) "లలనకుఁ జపలత కుతూహలంబు" అని నరసభూపాలీయము. (III-118 పద్యము).

ఉదాహణము :- 'ఒకయువతి నరసభూపాలునిచూచి, వలపుగొని తనచేతిలోనున్న లీలాకమలమును "ప్రాణనాథా! నాహృదయ కమలము నిన్నెడబాయలేక యీతీరుగానే తిరుగుచున్నదిసుమా" యని వ్యక్తము చేయుటకో అన్నట్లు త్రిప్పసాగెను.' చం॥ "కలికి నృసింహభూవిభునిఁ గాంచి నవప్రణయాభిరామయై । లలిత కరాబ్జకేళి కమలంబు భ్రమింపగ జేసె విభ్రమం । బలవడఁ బ్రాణనాథ ! హృదయాబ్జము నిన్నెడవాయలేక యి । ట్లెలమి భ్రమించుచున్న'దని యేర్పడఁ జెప్పెడి చందమందగన్'' —కా. ల. సం. III-120 పద్యము.

*కులకము :* పద్యకావ్యభేదము (చూ. పద్యకావ్యము.)

"పంచభిః కులకంమతం" అని సాహిత్యదర్పణము (సా. ద. VI పరి. 352 పే. 315 శ్లో), ఐదు పద్యములతోకూడిన శ్రవ్యకావ్యము కులకము.

"పంచప్రభృతిభిః కులకమ్" అని ధ్వన్యాలోక లోచనము (ధ్వ. లో. లోచ. III ఉద్యో. 324 పే.) ఐదుగాని అంతకుమించిగాని పద్యములకు ఏకాన్వయమున్నచో అట్టి స్వతంత్ర కావ్యమునకు కులకమనిపేరు.

"క్రియాసమాప్తికై పరస్పరాపేక్షగల ఐదుపద్యముల మొత్తము" కులకము (కా. లం. సం. II-261 పే.)

*కుసుంభరాగము :* (ఒకవిధమైన) పూర్వరాగభేదము, (చూ. పూర్వరాగము). ఈ పూర్వరాగము మూడువిధములు. అందు కుసుంభరాగము రెండవది. (చూ నీలీరాగము, మంజిష్ఠారాగము.)

"కుసుంభరాగం తత్ప్రాహుర్యదపైతి చ శోభతే" అని సాహిత్య దర్పణము (సా. ద. III-166 పే. 197 శ్లో.) ఏ ప్రేమ పైకి ప్రకాశిం చుచు కాలాంతరమున అదృశ్యమై పోవునో ఆప్రేమ కుసుంభరాగము. దేవ హూతికర్దముల ప్రేమ దీనికుదాహరణము.

*కేళి :* స్వభావజములైన అలంకారములందొకటి (చూ. స్వభావజములు. చూ. అలంకారములు). ఒక అనుభావము. (చూ. అనుభావము).

నిర్వచనము :- "విహారే సహ కాంతేన క్రీడితం కేళిరుచ్యతే" అని సాహిత్యదర్పణము (కా. లం. సం. 392 పేజి) కాంతునితోకూడివిహరించు నప్పుడు చేయు చుంబనాలింగనాది క్రీడయే కేళి. 18 స్వభావజములందొకటి (చూ. స్వభావజములు).

ఉదాహరణము :- ఒక యువతి కంటిలో పుప్పొడిపడెను. ఆమె కంటినప్పుడు ప్రియుడు తన ముఖవాయువుతో ఊదెను. కాని ఆ పుప్పొడి పూర్తిగా తొలగనందున ఆ యువతి తన ఉన్నత పీవరస్తనములతో నాతనిరొమ్మున పొడిచినది. శ్లో॥ "వ్యపోహితుం లోచనతో ముఖానిలై। రపార యంతం కిల పుష్పజం రజః పయోధరేణోరసి కాచిదున్మనాః । ప్రియం జఘానోన్నతపీవర స్తనీ" —సాహిత్యదర్పణము —III (సా. ద. 182 పేజి)

కం. కనులన్‌రాలిన పుప్పొడిఁ
దనవదనానిలముచేతఁదలఁగింపఁగజా
లని ప్రియునిఁబొడిచెఁబీన
స్తనియొకతె పయోధరమునఁ దద్వక్షమునన్.

పై శ్లోకమునకు సన్నిధానమువారి తర్జుమా (కా. లం. సం. III-392 పేజి.)

*కైశికి :* వివరములకు ముందు చూ. వృత్తులు. అర్థవృత్తులందుకైశికి యొకటి. మిగిలినవాని వివరములకు చూ. సాత్త్వతి, ఆరభటి, భారతి.

"అత్యర్థ సుకుమారార్థ సందర్భా కైశికీమతా" ప్ర. రు. కావ్యప్రక. 51 పే.) అత్యంత సుకుమారమైన అర్థమును ప్రకటించు ఆంగికాభినయము

కై శికి. శృంగార కరుణములు అత్యంత సుకుమార రసములు. ఆ రసములను స్ఫురింపజేయు ఆంగికాభినయము కైశికీవృత్తి. ''యత్ర శృంగారకరుణావతి కోమలేనసందర్భేణ వర్ణ్యతే తత్ర కైశికీ'' -(ప్ర. రు. కావ్యప్రక. 52 పే.)

శృంగారరసమునకు అనుకూలమైన నాయికానాయకుల వ్యాపారములు, మలయానిల, పుష్పోద్యానములు సుకుమారార్థములు. వీనిని స్ఫురింపజేయు ఆంగికాభినయము కైశికీవృత్తి.

ఉదాహరణము :- ఉ ''తిన్నని మేను, గన్నుగవ, తేటలుఁ దేనియలొల్కు మాటలున్ । సన్నపుఁ గౌనుఁ గుందనపుఁ జాయలుదేఱు మెఱుంగుఁ జెక్కులున్ । గ్రొన్నెలవంటి నెన్నుదురు, గుబ్బచనుంగవ, తళుకుచూపులున్ । జెన్నెసలారఁ గన్య నరసింహునిఁ జూచె విలాసధన్యయై'' (కా. అం. సం. II-171 పే.) —ఈపద్యమున కన్య శృంగారాభినయము వర్ణితమైనది. కనుక కైశికీవృత్తి.

నాయికానాయకుల సుకుమారమైన అంగికాభినయమును వర్ణించుటకు మృదుమధురమైన రచన కావలయును. దానికి వైదర్భీరీతి అనిపేరు. పైపద్యమందలిది వైదర్భీరీతి.

*కోశము :* పద్యకావ్యభేదము చూ. పద్యకావ్యము.

కోశః శ్లోక సమూహ స్తుస్యాదన్యోన్యానపేక్షకః (సా. ద. VI-356 పే. 329 శ్లో.) అన్యోన్య నిరపేక్షకములైన శ్లోకముల సమూహము కోశము.

*క్రోధము :* వివరములకు ముందు చూ. స్థాయిభావము. కోపమని సామాన్యార్థము. అలంకారశాస్త్రములో రౌద్రరసమున కిది స్థాయిభావము.

క్రోధమునకు నిర్వచనములు :- (1) ''శత్రుకృతాపచారేణ మనః ప్రజ్వలనం క్రోధః'' అని ప్రతాపరుద్రీయము (రసప్రకరణము) శత్రువులు చేసిన అపచారముచేత మనస్సు మండిపోవుట క్రోధము. (2) ''ప్రతికూలేషు తైక్ష్ణ్యస్యావబోధః క్రోధఇష్యతే'' అని సాహిత్యదర్పణము (తృతీయ పరిచ్ఛేదము). ప్రతికూలముల విషయమున తీక్షణత నొందుట క్రోధము. (3) ''గురుబంధువధాది పరమాపరాధజన్మా ప్రజ్వలనాఖ్యః చిత్తవృత్తి విశేషః క్రోధః అయంచ పరవినాశాది హేతుః క్షుద్రాపరాధజన్మాతు పరుషవచన-అసంభాషణాదిహేతుః అయమేవామర్షాఖ్యో వ్యభిచారీతి వివేకః.'' అని రసగంగాధరము. గురువులనుగాని బంధువులనుగాని వధించుటవంటి గొప్ప యపరాధమువలనఁ గలుగు ప్రజ్వలనము (మండుట) అను చిత్తవృత్తి విశేషమునే క్రోధమందురు. ఇది శత్రువులను నాశనము చేయుటకు కారణమగును. ఏదో చిన్న యపరాధమువలన కలిగిన క్రోధము స్థాయిభావము కాజాలదు. అట్టి కోపమువలన పరుషముగా మాటాడుట, మౌనము వహించుట వంటివి మాత్రమే సంభవించును. ఇది అమర్షము అను సంచారిభావమగును. (4) ''అపకారులగు నరులపరాధమొనర్ప నే మహామహుని మనంబు

పరిజ్వలితంబగుచున్నది యపరిమిత క్రోధమయ్యె'' అని నరసభూపాలీయము (తృతీయాశ్వాసము-31 ప.).

క్రోధమున కుదాహరణము :- పాండవులు ద్రోణుని వధించిరని తెల్సిన పిదప అశ్వత్థామ మనస్సు మండిపోయినది. ఆ మనః ప్రజ్వలనమున నాతడాడినమాటలివి— 'మర్యాదను విడచి మీరుగురువును వధించితిరి. దానిని కనులార చూచితిరి. మీరు ఆయుధములు ధరించిన నరపశువులు. ఇట్టి మిమ్ము నందరిని పక్షిమార్జనముగా రక్తమేదోమాంసములతో భూతబలి యిచ్చెదను చూడుడు.' ఈ మాటలలో శత్రుకృతాపరాధము వలన కలిగిన ప్రజ్వలన మనెడి చిత్తవృత్తి విశేషము గోచరించుచున్నది. అదే క్రోధము "తే.గీ కృతిత మర్యాదులై గురుపాతకంబు సలిపి సహియించి చూచిన సశరమనుజ పశుల మిమ్మెల్ల నే కృష్ణపార్థభీమ। యుక్తముగ భూతబలియిత్తు రక్తము నను" (కావ్యప్రకాశమునందలి ఉదాహరణ శ్లోకమునకు సన్నిధానంవారి తర్జుమా, చూ. కావ్యాలంకార సంగ్రహము తృతీయాశ్వాసము 327వ పుట).

**క్షుద్ర ప్రబంధములు :** (1) ఉదాహరణము (2) చక్రవాళము (3) భోగావళి (4) బిరుదావళి (5) తారావళి - వీనిని క్షుద్రప్రబంధములుగా ప్రతాపరుద్రీయము పేర్కొనెను (ప్ర. రు. కావ్యప్రక. 83, 84 పేజీలు) చూ. ఆయా శీర్షికలు.

(1) ఉదాహరణము, (2) చక్రవాళము (3) బిరుదావళి (4)మంజరి (5) తారావళి అను ఐదు క్షుద్రకావ్యములను రామరాజభూషణుడు పేర్కొనెను. (వాని లక్షణములకు చూ. కాలం. సం. III-244 - 258 పేజీలు.)

విశ్వావళి, రత్నావళి, పంచాననావళి, ముక్తకము, ద్వికము, త్రికము, పంచరత్నములు, గజమాల, నవరత్నములు, సూర్యమాల, శశికళ, నక్షత్రమాల, త్రింశత్తు, పంచాశత్తు, శతకము, అష్టోత్తరశతము, సప్తశతి, అష్టకము, పంచదశి, చత్వారింశిక, షష్టిక, సప్తతిక, అశీతిక, నవతిక, పంచశతి, వప్తశతి, సహస్రకము, ఖండకావ్యము, కరంభకము, యుగ్మకము, సంధానితకము, కలాపకము, కులకము, చాటువు, కోశము, వాక్యవాక్యము, ఆఖ్యానము, ఉపాఖ్యానము, గాథ, దండకము, మణిప్రవాళము, మొదలైనవికూడ క్షుద్రప్రబంధములే. (చూ. కాలం. సం. III.259-269)

**ఖండకథ :** పద్యకావ్యభేదము. చూ. పద్యకావ్యము.

"ఏకదేశవర్ణనా ఖండకథా" అని ధ్వన్యాలోకలోచనము. (ధ్వ. లో. లోచ. III-324 పే.) ప్రసిద్ధేతివృత్తము నందేకదేశము మాత్రమే వర్ణితమైనచో ఆకావ్యవిశేషము ఖండకథ.

'మధ్యాదుపాంతతోవా గ్రంథాంతర ప్రసిద్ధ మితివృత్తం యస్యాం వర్ణ్యేతే సేందుమత్యాదివత్ ఖండకథా'' (భామహకావ్యాలంకారభూమిక 81 పేజి) అని హేమచంద్రుడు (కావ్యానుశాసనము). మరియొక గ్రంథ

మందు ప్రసిద్ధమైన ఇతివృత్తమును మధ్యమందుండిగాని, ఉపాంతమునుండి గాని గైకొని దానిని వర్ణించుట ఖండకథ. ఉదాహరణము: ఇందుమతి.
దీనినే సాహిత్యదర్పణము 'ఖండకావ్యము' అనెను.

*ఖండకావ్యము :* చూ. పద్యకావ్యములు.
'ఖండకావ్యం భవేత్ కావ్యస్యైకదేశాను సారి చ' అని సాహిత్య దర్పణము. సా. ద. VI-పరి. 356 పే. 328 శ్లో.) కావ్యమునందేక దేశము ననుసరించి రచింపబడిన పద్యకావ్యము ఖండకావ్యము.
ఉదాహరణము :- మేఘదూత. చూ. ఖండకథ.

*గద్యపద్యమయకావ్యములు :* (1) చంపువు (2) బిరుదము (3) కరంభకము- ఈ మూడింటిని గద్యపద్యమయములుగా విశ్వనాథుడు పేర్కొనెను. (సా. ద. VI పరి.) చూ. పై శీర్షికలు.

*గద్యము :* గద్యకావ్యము.
"అపాదః పదసంఘాతో గద్యం" (ప్ర. రు. కావ్యప్రక. 82 పే.). పాదరహితమైన పదసమూహము గద్యము. 'కాదంబరి' గద్యకావ్యము.
శ్రవ్యకావ్యభేదములందొకటి గద్యమని సాహిత్యదర్పణము. (చూ. శ్రవ్యకావ్యము.) "వృత్తగంధోజ్ఝితం గద్యం ముక్తకం వృత్తగంధి చ భవేదుత్కలికాప్రాయం చూర్ణకం చ చతుర్విధమ్ ।" అని సాహిత్య దర్పణము (సా. ద. VI పరి. 357 పే. 330, 331 శ్లో). వృత్తమొక్కటియైనను లేనిది గద్యము. అది నాలుగు విధములు. (1) ముక్తకము (2) వృత్తగంధి (3) ఉత్కలికాప్రాయము (4) చూర్ణకము. (చూ. ఆయా శీర్షికలు). ఇవి గాక (1) కథ (2) అఖ్యాయిక గద్యకావ్యములుగా పేర్కొనబడినవి. (చూ. ఆ శీర్షికలు).

*గమకము :* చూ. అనుమాన ప్రమాణము.

*గమనము :* నరసభూపాలీయకర్త శృంగారావస్థలందు ఈ 'గమనము'ను పేర్కొనెను. చూ. శృంగారావస్థలు.
ఉదాహరణము :- నరసభూపాలుని పొందునకై ఏకాకిగా బయలు దేరిన నాయికను వర్ణించుచున్న పద్యము :- మ। చెలులన్ వంచనచేసి యొక్కతయ తాఁ జెన్నొంద నీయొద్దకున్ । నలినాక్షీమణి రాఁదలంచి నవరత్నప్రోత సౌధాంగణ । స్థలులన్ వెన్నెలవచ్చు నిర్మలతనుచ్ఛాయన్ నిరీక్షించి నె । చ్చెలి యేతెంచె నెఱుంగఁబోలునని నిల్చెన్ శ్రీనృసింహాధిపా. (కా. లం. సం. III-131 ప.).

*గర్వము :* వ్యభిచారిభావములందొకటి. (చూ. వ్యభిచారి భావము).
నిర్వచనములు :- (1) "గర్వోఽభిజ్యలావణ్య బలైశ్వర్యాదిభిర్మదః కర్మాణ్యాధర్షణావజ్ఞా సవిలాసాంగ వీక్షణం" అని దశరూపకము (ద. రూ. నాలుగవప్రకా. 61 పేజి 23 సం.) అభిజనము (ఇంటితనము), లావణ్యము, బలము, ఐశ్వర్యము మొదలయిన వానివలన కలుగు మదమే

గర్వము. పరులను లెక్కింపకుండుట, అవమానించుట, సవిలాసముగా అంగములను చూచుకొనుట మొదలయినవి అనుభావములు (కార్యములు). (2) "అన్యధిక్కరణాదాత్మోత్కర్షా గర్వః బలాదిజః" అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. రసప్రక, 282 పేజి 18 సం.) బలము మొదలైన వానివలన కలిగిన ఆత్మోత్కర్ష గర్వము. ఇతరులను ధిక్కరించుటకిది కారణము. (3) "గర్వోమదః ప్రభావశ్రీ విద్యాసత్కులతాదిజః। అవజ్ఞా సవిలాసాంగదర్శనా వినయాదికృత్" అని సాహిత్యదర్పణము (సా. ద. III-146 పే. 154 శ్లో.). ప్రభావము, సంపద, విద్య, సత్కులత్వము మొదలయినవానివలన పుట్టు మదమే గర్వము. అది అవజ్ఞ, సవిలాసముగా అంగములను చూచుకొనుట, అవినయము మొదలయిన వానిని (కార్యములను) కలిగించును. (4) "ఒరులన్ నిందించి తన్నుఁ బొగడు నమందోన్నతి గర్వమయ్యో" అని నరసభూపాలీయము (III-352 పే. 10 సం.) "రూపధన విద్యాది ప్రయుక్తాత్మోత్కర్ష జ్ఞానాధీన పరావహేలనం గర్వః" అని రసగంగాధరము (కా. లం. సం. III-352 పే. 10 సం.) రూపము, ధనము, విద్య మొదలయిన వానితోకూడిన ఆత్మోత్కర్ష జ్ఞానమువలన కలుగు పరావహేలనము గర్వము.

ఉదాహరణము :- కం "ప్రతియె కళంకాంకితునకు। సతియగు రోహిణియు నతను సతియగు రతియుం। జతురు నృసింహునిఁ జెందిన యతిధన్యకు నాకు ననుచు వంగన నవ్వెన్" 'కా. లం. సం. III-64 ప.) ఇందు నాయిక ఆత్మోత్కర్షము విభావము. నవ్వుట అనుభావము. గర్వము వ్యక్తమయినది.

***గుణవినుతి :*** శృంగారావస్థలందొకటి. (చూ. శృంగారావస్థలు). దీనినే 'గుణస్తుతి' యని కొందరు. గుణకథనమనియు కొందరు.

నాయిక నాయక గుణములను స్తుతించుటయే గుణస్తుతి. ఉదాహరణము :- కం అయందంబాచందం। బాయా నెఱజాణతనము లామాటతనం। బేయెడఁ గనమా సుందరి యాయసజు సామాన్య సృష్టియగునే తలఁపన్" (శ్రీ సన్నిధానంవారిచ్చిన యుదాహరణము - కా. లం. సం. III-397 పేజి). ఇందు నాయకుడు నాయిక గుణస్తుతి చేసెను.

***గుణీభూతవ్యంగ్యము :*** వివరములకు ముందు చూ. వ్యంగ్యము, ధ్వని. వ్యంగ్యార్థముకన్న వాచ్యార్థమే మనోహరముగానున్న కావ్యము గుణీభూతవ్యంగ్యము. ఇందు వ్యంగ్యము అప్రధానము. ఇదియే మధ్యమ కావ్యము. చూ. మధ్యమకావ్యము.

గుణీకృతవ్యంగ్యమని కూడా దీనికి వ్యవహారము. గుణమనగా అప్రధానము. అప్రధానముగా చేయబడిన వ్యంగ్యము గుణీకృత వ్యంగ్యమయినది. సమాసోక్తి, ఆక్షేపము, దీపకము, అపహ్నుతి మొదలయినవి గుణీభూతవ్యంగ్యములే.

ఉదాహరణము :- "కామధేనువు కొలువాస గొలిపి వెలకిలబడును. కల్పతరువు తనువేడగా ఆకులపడి పండ్లిగిలించును. నృసింహా! ఇవి నిన్ను పోలగలవా ?"

క॥ కొలువాస యొసఁగి సురగవి వెలకిలఁబడుఁ; గల్పతరువు వేఁడిన మఱి యా
కులపడి పండ్లిగిలించును; నలువుగ నిను బోలగలవె ; నరసింహ నృపా ;
నరసభూపాలీయము II ఆ. 94 ప.

'నిన్ను పోలగలవా' అను వాచ్యార్థమువల్ల పోలలేవు అను వ్యంగ్యార్థము స్ఫురించును. కాని వాచ్యార్థముతోనే ఆ కాకువు భాసిల్లుచున్నది. వ్యంగ్యార్థమునకు ప్రత్యేకతలేదు; ప్రాధాన్యములేదు. అందువల్ల వ్యంగ్యార్థము మనోహరముగా లేదు.

గుణీభూత వ్యంగ్యము ఎనిమిది విధములు. వివరములకు —చూ. (1) అగూఢము (2) అపరాంగము (3) వాచ్యాంగము (4) అస్ఫుటము (అప్రకాశము) (5) సందిగ్ధము (6) తుల్య ప్రాధాన్యము (7) కాక్వాక్షిప్తము (8) అరుచిరము.

*గౌడి :* వివరములకు ముందు చూ. రీతులు. ఇది రీతులలో ఒకటి (మిగిలిన వానినిగురించి చూ. వైదర్భి, పాంచాలి) "ఓజః కాంతి గుణోపేతాగాడీ యాకీతిరిష్యతే" (ఆంధ్ర ప్రతాపరుద్రీయము II-115 పే.) ఓజస్సు, కాంతి అను రెండు గుణములతో కూడుకొన్న రచనకే గౌడీరీతి అని సంజ్ఞ. ఓజోగుణమనగా గాఢమైన సమాసబంధములతో కూడిన రచన. కాంతిగుణమనగా విచిత్రమైన అక్షరా వృత్తి కలిగిన రచన. "రూక్షబంధయును ఖర సమాస యగు గౌడి" అని నరసభూపాలీయ నిర్వచనము. (కా. అం. సం. II-81 ప.)

ఉదాహరణము :- శా అంభోరాశి గభీర! యోబయనృసింహా! నీ రణోదస్తదోః స్తంభోత్తంభితజృంభితాసి లతికా సంరంభ సంభావనాదంభానర్గళదుర్గ, దుర్గమమదోద్యద్దుష్ట ధృష్టారిరాట్కుంభచ్ఛుంభనికుంభ సంభ్రమహార స్ఫూర్తిన్ విడంబించురా! (కా. అం. సం. II-175 పే.). ఇందు సంయుక్తాక్షరములుగల పదములు, విచిత్రమైన అక్షరముల ఆవృత్తి (కాంతి) గాఢమైన దీర్ఘ సమాసము (ఓజస్సు) ఉన్నవి. అందువల్ల గౌడీరీతి.

ఇది ఆరభటీవృత్తికి తగిన శబ్దరీతి. రౌద్ర, బీభత్సరసములందిట్టిరీతి శోభించును. (చూ. ఆరభటి.)

*గౌణలక్షణ :* పూర్తి వివరములకు ముందు చూ. లక్షణ.

ముఖ్యార్థలక్ష్యార్థములకు గల సంబంధము 'సాదృశ్యము' అయినపుడు గౌణలక్షణ. సాదృశ్యేతర సంబంధమయినపుడు శుద్ధలక్షణ. శుద్ధలక్షణను గురించి వివరములకు చూ. శుద్ధలక్షణ.

గౌణలక్షణ 8 విధములు. లక్షణ మొదట రెండు విధములు. రూఢిమూల, ప్రయోజనమూల. ఈ రెండును మరల ఉపాదాన లక్షణ, లక్షణ

లక్షణ అని రెండు విధములు. ఈ నాల్గును మరల ఆరోప, అధ్యవసాన అని రెండువిధములు. మొత్తమెనిమిది విధములు.

ఉదాహరణములు కొన్ని :- రూఢిమూల - ఉపాదానలక్షణ సారోప గౌణ :- "ఈ తైలములు హేమంతమునందు సుఖములు." తైలమనగా నువ్వులనూనెయని మాత్రమే ముఖ్యార్థము. రూఢివలన తక్కిన నూనెలు కూడా తైలములే అగుచున్నవి. తైలము వంటివి తక్కినమానెలన్నియు.

ప్రయోజనమూల - ఉపాదానలక్షణ సారోపగౌణ :- రాజకుమారులున్ను, తత్పరిచారకులును వీధిలో పోవుచుండగా చూచి— "అదుగో రాజకుమారులు పోవుచున్నారు" అనుట.

గ్లాని : వ్యభిచారి భావములందొకటి. (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- (1) "రత్యాద్యాయాస తృట్ క్షుద్భిర్ గ్లానిర్నిష్ప్రాణతేహ చ। వైవర్ణ్యకంపానుత్సాహ క్షామాంగ వచనక్రియాః" అని దశరూపకము (ద. ద. రూ. నాలుగవ ప్రకా. 59 పేజి. 11 సం.) రతి మొదలైన వానివలన ఆయాసము, ఆకటిదప్పికలు మొదలయినవానివలన కలుగు నిష్ప్రాణత (విలవిలలాడుట) గ్లాని. వైవర్ణ్యము, కంపము, అనుత్సాహము, అంగవచన క్రియలయందు శూన్యత దీనివలన కలుగును. (2) "గ్లానిర్బలస్యాపచయో వైవర్ణ్యారతికారణం" అని ప్రతాపరుద్రీయము (ప్ర. రు. రసప్ర. 271 పేజి 2 సం.) బలము కోల్పోవుటయే గ్లాని. ఇది వైవర్ణ్యమునకును అరతికిని కారణము. (3) "రత్యాయాస మనస్తాప క్షుత్పిపాసాది సంభవా గ్లానిర్నిష్ప్రాణతా కంపకార్శ్యానుత్సాహతాదికృత్" అని సాహిత్యదర్పణము (సా. ద. III-155 పే. 170 శ్లో.) రతి శ్రమ, మనస్తాపము, క్షుత్పిపాసలు మొదలైన వానివలన కలుగునది గ్లాని. ఇది నిష్ప్రాణత, కంపము, పనులయందు నిరుత్సాహము మొదలైన వానిని కలిగించును. (కార్యములు). (4) "కడుశక్తి యెడలి బడలిక సడలుట యది గ్లానియయ్యె" అని నరసభూపాలీయము (III-56 ప.) ఇది సరికాదు (శ్రీ సన్నిధానంవారు). (5) "ఆధివ్యాధి జన్య బలహాని ప్రభవః వైవర్ణ్యశిథిలాంగత్వ దృగ్భ్రమణాది హేతుః దుఃఖ విశేషో గ్లానిః." అని రసగంగాధరము (కా. లం. సం. III-347 పేజి 5 సం.) మనోవ్యాధివలనను, శరీర వ్యాధివలనను బలము తగ్గిపోగా, అప్పటి (చిత్తవృత్తి) దుఃఖ విశేషమే గ్లాని. దీనివలన వైవర్ణ్యము, శిథిలాంగత్వము, దృగ్భ్రమణము మొదలయిన అనుభావములు కలుగును.

ఉదాహరణము :- ప్రియవిరహముచే నామె ఆధివ్యాధి పీడితయైనది. అందుచే బలహీనత కలిగినది. ఆ దుఃఖములో నుండగా ఆమెకడకు ప్రియుడరుదెంచెను. 'ఆమె అప్పుడు శైవలశయనమున పరుండినదై కాంతి మాత్రమే మిగిలిన చంద్రరేఖవలె తన ప్రియుని తీయని చూపులతో మాత్రమే సత్కరించినది. శ్లో "శయితా శైవలశయనే సుషమాశేషా

నవేందులేఖేవ । ప్రియ మాగతమపి సవిధే సత్కురుతే మధురవీక్షణై రేవ''
—రసగంగాధరము. (కా. అం. సం. III-348 పేజి 5 సం-) ఇందు ప్రియ
విరహజన్య బలహాని విభావము. శిథిలాంగత్వము, దృగ్భ్రమణము, ఆశ్లే
షింపకుండుట మొదలైనవి అనుభావములు. వీనిచే 'గ్లాని' వ్యక్తమైనది.

ఘటమానుడు : కవియొక్క అవస్థలు పదియనియు అందు సహజప్రతిభునకును, ఆహార్యప్రతిభునకును ఏడవస్థలును, ఔపదేశికునకు మూడవస్థలును నుండు నని రాజశేఖరుడు కావ్యమీమాంసయందు పేర్కొనెను. మొదటి ఏడింటిలో ఘటమానుడగుట ఐదవ అవస్థ. (చూ. కారయిత్రి). (చూ. కావ్య విద్యా స్నాతకుడు, హృదయకవి, అన్యాపదేశి, సేవిత, మహాకవి, కవిరాజు, ఆవే శికుడు, అవిచ్ఛేది, సంక్రామయిత.)

"యోఽనవద్యం కవతే నతు ప్రబధ్నాతి సఘటమానః" అని రాజ శేఖరుడు. ఎవడు ఉత్తమకవితను చెప్పగలిగియు ప్రబంధమును రచింపడో అతడు ఘటమానుడు.

చంపువు : చూ. మహాకావ్యము; గద్యపద్య మయకావ్యములు.

'గద్య పద్యమయం కావ్యం చంపూరిత్యభిధీయతే (ప్రతా రు. కావ్య ప్రక. 73 శ్లో. 82 పే.) గద్యపద్యములు రెండింటితోను కూడిన కావ్యము చంపువు.

పై లక్షణమే సాహిత్యదర్పణమునను కనబడుచున్నది. ఉదా :- దేశి రాజ చరితము.

చకితము : స్వభావజములయిన అలంకారములందొకటి. (చూ. స్వభావజములు, చూ. అలంకారములు.). ఒక అనుభావము (చూ. అనుభావము). ఒక శృం గారచేష్ట (చూ. శృంగారచేష్టలు).

నిర్వచనములు :- (1) "చకితం భయసంభ్రమః" అని ప్రతాపరుద్రీ యము (అం. ప్ర. రు. 304 పేజి). భయమువలన కలుగు తత్తరపాటు చకితము. 18 శృంగారచేష్టలందొకటి (చూ. శృంగారచేష్టలు). (2) "కుతోఽపి దయితస్యాగ్రే చకితం భయవిభ్రమః" అని సాహిత్యదర్పణము (సా ద. 131 పేజి.) ఏదో యొక కారణమువలన ప్రియుని ఎదురుగా భయముచే తొట్రుపడుట చకితము. 18 స్వభావజములందొకటి. (చూ. స్వభావజములు). (3) "అళుకుట చకితము" అని నరసభూపాలీయము (III-118 పద్యము). 18 శృంగారచేష్టలందొకటి. (చూ. శృంగార చేష్టలు). (4) "భయపడదగి నంత పెద్దహేతువు లేకున్నను ప్రియునియెదుట భయపడుట శృంగారచేష్ట గదా" అని సన్నిధానంవారు (కా. అం. సం. 385 పేజి.).

ఉదాహరణము :- జలక్రీడలాడుచున్న ఒక యువతి తొడలను చేపలు తాకెను. అంతనామె తొట్రుపడెను. దానివలన నామెకొక క్రొత్త హొయలు కలిగెను. ఆ వె "తొడల మీలుదాకి గడుఁ దత్తఱించుచు వింతహొయలుహూపె నింతియొకతె చెలు లహేతువుగనె చేయుచుంద్రు

విలావ । ఘులను హేతువున్నఁ దెలుపవలెనే'' -కా. లం. సం. III (సాహిత్య దర్పణమునందలి శ్లోకమునకు సన్నిధానంవారి తర్జుమా) 386 పేజి.

శ్లో॥ త్రస్యంతీ చలశఫరీవిఘట్టితోరూ
ర్వామోరూరతిశయమాప్త విభ్రమస్య
క్షుభ్యంతి ప్రసభమహో వినాపి హేతో
ర్లీలాభిః కిముసతి కారణే తరుణ్యః

(సా. ద. 182 పేజి)

*చక్రవాళము* : చూ. క్షుద్రప్రబంధములు. క్షుద్రప్రబంధభేదములలో ఒకటి.

''సంబోధన విభక్త్యాయత్ ప్రచురం పద్యపూర్వకమ్ । విముక్త పునరాకృష్ట శబ్దం స్యాచ్చక్రవాళకమ్'' అని ప్రతాపరుద్రీయము. (ప్ర.రు. కావ్యప్రక. 76 శ్లో. 84 పే.). విముక్తములై తిరిగి తీసుకోబడిన శబ్దములతో సంబోధనా విభక్తితో గూడిన పద్యము ముందుగా నున్న కావ్యము చక్రవాళము.

"మొదలనొక సంబోధనాంత పద్యము; పిమ్మట నెనిమిది దళముల గద్య (ఇదియే కలిక). ఇదియు సంబోధనాంతముగానే యుండవలెను. ఆ పద్య గద్యములు రెండును ముక్తపదగ్రస్తములై సంబోధనాంతములుగా నుండవలెను. (కా. లం. సం. II-256 పే).

ఉదాహరణము :- "మ॥ ఫణికుంభదుష్ఛజసార । సారసముఖీ పంచాయుధాకార ! కారణ సంతత్యవతార ! తారగిరి ధైర్యస్థేమ దుర్వార ! వారణ సమ్రాడ్భుల భార ! భారవికవిప్రాభాక్తి సంచార ! చారణ సంస్తుత్యవిహార! హారహార విభ్రాజద్యశోవైభవా !". ఇట్టి యొకపద్యమును, దానివెంట నెనిమిది యిట్టి గద్యలును గల కావ్యము చక్రవాళము. దీనికి చతుర్భద్రమనియు నామాంతరము. (కా. లం. సం. II-257 పే.).

*చక్షుఃప్రీతి* : శృంగారావస్థలందొకటి. (చూ. శృంగారావస్థలు).

నిర్వచనములు : (1)''ఆదరాద్దర్శనం చక్షుఃప్రీతి రిత్యభిధీయతే'' అని ప్రతాపరుద్రీయము (ప్ర. రు. రసప్రక. 228 పే. 86 శ్లో). నాయిక నాయకుని ప్రత్యక్షముగా గాని చిత్రమునగాని స్వప్నమునగాని సాదరముగా చూచుటయే చక్షుఃప్రీతి. (2) 'చూచుట' అని నరసభూపాలీయము.

ఉదాహరణము :- ఒకయువతి నరసభూపాలుని చూచినది. అప్పుడామె ప్రేమసముద్రము పొంగిపొరలినది. కావుననే ఆ శరీరమున ఘర్మజలములు దిగజారుచున్నవి. ఆమె చూపులు మన్మథునిరాక కెదురుగా కట్టిన తామర పూలదండలవలెనున్నవి. మ॥ 'అనురాగాంబుధి యుబ్బివెల్వడిన యట్లా పూర్ణ ఘర్మాంబువుల్ । దనువల్లిం దిగజాఱఁ గన్నుఁగవ లేఁదళ్కుల్ పిసాళించుచున్ । ననవిల్కాని పురః ప్రవేశకలనా నాళీకదామంబులై । తనరం గోమలి నిన్నుఁ జూచె నరసేంద్రా ! సాంద్ర తేజోనిధీ ।'' —కా, లం, సం,

VI-124, ఇందు నాయిక నాయకుని సాదరముగా చూచినట్లు వ్యక్త మయినది.

చపలత : చూ. చాపల్యము.

చమత్కారము : జగన్నాథపండితరాయలు కావ్యలక్షణమును తెలుపుచు చమత్కారము లేదా లోకోత్తరాహ్లాదమును నిర్వచించెను. (చూ. కావ్యము.), (చూ. రమణీయత).

"లోకోత్తరత్వం చ ఆహ్లాదగతశ్చమత్కార పర్యాయోఽనుభవ సాక్షికో జాతివిశేషః కారణంచ తదవచ్ఛిన్నే భావనావిశేషః పునఃపునరను సంధానాత్మా" అని రస గంగాధరమున జగన్నాథపండితరాయలు. రమణీయార్థము వలన కలుగు లోకోత్తరమైన ఆహ్లాదమునకే చమత్కారమని పేరు. అది అనుభవమువలననే తెలియును. ఈ చమత్కారము ననుభవించుటకు ఆ రమణీయార్థమును తిరిగితిరిగి భావించుచుండవలెను.

ఉదాహరణము :- 'నీకు పుత్రుడుదయించెను. నీకు ధనమిత్తును' ఈ వాక్యములవలన కలుగు ఆహ్లాదము లోకసామాన్యమైనదే. లోకోత్తరత్వము లేదా చమత్కారమీ వాక్యములందులేదు.

చాపలము : వ్యభిచారిభావములందొకటి (చూ. వ్యభిచారిభావము). రూపాంతరములు 'చపలత', 'చాపల్యము'.

నిర్వచనములు :- (1)"మాత్సర్య ద్వేషరాగాదేశ్చాపలం త్వనవస్థితిః తత్ర భర్త్సన పారుష్య స్వచ్ఛందాచరణాదయః" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవ ప్రకా. 64 పేజి 42 సం.) మాత్సర్యము, ద్వేషము, రాగము మొదలైన వానివలన కలిగిన అస్థిరతయే చాపలము. దూషణము, బెదిరించుట, పరుషముగా మాటాడుట, స్వేచ్ఛగా వర్తించుట మొదలైనవి అనుభావములు (కార్యములు). (2) "చాపలం త్వనవస్థానం రాగద్వేషాది సంభవం" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 279 పేజి 14 సం.) రాగము, ద్వేషము, మొదలైనవానివలన కలిగిన చిత్తచాంచల్యము చాపలము. (3) "మాత్సర్య ద్వేషరాగాదే శ్చాపల్యం త్వనవస్థితిః తత్ర భర్త్సన పారుష్య స్వచ్ఛందాచరణాదయః" అని సాహిత్యదర్పణము (సా. ద. III-154 పే. 169 శ్లో.) దశరూపకము ననుకరించినది. (4) "రాగద్వేషజనిత చేష్టాద్యనవస్థితి చాపలము" అని నరసభూపాలీయము (III-68 ప.). (5) 'అమర్షాదిజన్యా వాక్పారుష్యాది కారణీభూతా చిత్తవృత్తిశ్చపలతా" అని రసగంగాధరము. (కా. లం. సం. III-68 పే.) అమర్షము మొదలైన వానివలన జనించు చిత్తవృత్తి చపలత. ఇది వాక్పారుష్యమునకు కారణమగును. (6) అమర్ష ప్రాతికూల్యేర్ష్యా రాగద్వేషాశ్చ మత్సరః। ఇతి యత్రవిభావాస్స్యురనుభావాస్తు భర్త్సనం వాక్పారుష్యం ప్రహారశ్చ తాడనం వధబంధనే తచ్చాపల మనాలోచ్య కార్యకారిత్వ మిష్యతే" (కా. లం. సం. III-355 పేజి). —అమర్షము, ప్రాతికూల్యము, ఈర్ష్య, రాగము,

ద్వేషము, మాత్సర్యము, అనునవి విభావములు. భర్త్సనము, వాక్పారుష్యము, ప్రహారము, తాడనము, వధ, బంధనము, అనాలోచితముగా కార్యములను చేయుట అనునవి అనుభావములు—కాగా 'చాపలము' అను వ్యభిచారిభావము వ్యక్తమగును.

ఉదాహరణము :- కం "వనిత నృసింహునిఁ గనుఁగొని । చను గుబ్బలమీఁది వలువ చక్కఁగ దిద్దున్ । జనఁజూచు; మరలుఁ జెలితోఁ బని లేమియుఁ బలుకు; నురముపయిఁ జెయిసేర్చున్"—(కా. లం. సం. III-70). ఇందు నరసభూపాలునిమీది రాగమే విభావము. అనాలోచితముగా చేసిన పనులు (వలువదిద్దుట, చనజూచుట, చెలితో మరలుట, పని లేమియు పలుకుట మొ॥ నవి) అనుభావములు. చాపలము ధ్వని.

*చింత* : అధ్యానమని కొందరు. వ్యభిచారిభావములందొకటి (చూ. వ్యభిచారిభావము.

నిర్వచనములు :- (1) "ధ్యానం చింతా హితానాప్తేః శూన్యతా శ్వాసతాపకృత్" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 60 పే. 19సం.). కోరిక లభింపకపోగా దానినిగూర్చిచేయు ధ్యానము చింత. శూన్యత (ఏమియు తోచకుండుట), శ్వాసము, తాపము దానివలన కలుగు కార్యములు (అనుభావములు). (2) "ఇష్టానధిగమాద్ధ్యానం చింతా శూన్యత్వ తాపకృత్" అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. రస ప్రక. 275 పేజీ 9సం.). కోరినకోరిక తీరకపోగా దానికై చేయు ధ్యానము (ఆలోచన) చింత, శూన్యత్వము, తాపము చింతవలన గలుగు అనుభావములు. (3) "ధ్యానం చింతాహితానాప్తేః శూన్యతా శ్వాసతాపకృత్" అని (సా. ద. III-155 పే. 171 శ్లో.) సాహిత్యదర్పణము దశరూపకముననుసరించినది. (4) హిత వస్తువుచేకూరమి నతులాధ్యానంబు చింతయగు" అని నరస భూపాలీయము III-867 పే. 31 సం. (5) ఇష్టాప్రాప్త్య నిష్టప్రాప్త్యాది జనితాఽ ధ్యానం పర పర్యాయా వైవర్ణ్య, భూలేఖన, అధోముఖత్వాది హేతుశ్చిత్తవృత్తి విశేషశ్చింతా" అని రసగంగాధరము (కా. లం. సం. III-867 పే.). ఇష్ట ప్రాప్తి కాకుండుట, అనిష్టము మీదపడుట మొదలయినవానివలన కలిగిన చిత్తవృత్తి విశేషము చింత. దీనికే అధ్యానమని నామాంతరమున్నది. పాలిపోవుట, నేలమీద వ్రాయుట, తలవంచుకొనుట మొదలయినవి ఈ చింత వలన కలుగు అనుభావములు. (6) విభావాయత్ర దారి ద్ర్య మైశ్వర్య భ్రంశ నంతథా । ఇష్టార్థాపహృతిః శశ్వచ్ఛ్వాసోచ్ఛ్వాసావధోముఖం సంతాపః స్మరణంచైవ కార్శ్యం దేహానుపస్కృతిః । అధృతిశ్చాను భావాస్స్యుః సా చింతా పరికీర్తితా । వితర్కోఽస్యాః క్షణే పూర్వేపాశ్చాత్యే వోపజాయతే" అని (కా. లం. సం. 868 పే. (మరొక లక్షణము. చింతకు పేదతనము, సంపదలు కోల్పోవుట, కోరికలు తీరకపోవుట అనునవి విభావములు. నిట్టూర్పులు, తలవంచుకొనుట, సంతాపము, స్మరణము, చిక్కిపోవుట, దేహ

సంస్కారము మానుట, అధైర్యము అనునవి అనుభావములు. ఇట్టి చింతకు ముందువెనుకలందు వితర్కము (చూ. వితర్కము) కూడా పుట్టును.

ఉదాహరణము :- ప్రియుడు లభింపకపోగా ఒక నాయిక చెక్కిటిపై చేయిచేర్చుకొనినది. అప్పుడామె చేతివ్రేళ్లు కాటుక కంటినీటితో తడిసి మన్మథునికి తోడ్పడుటకై తయారైన నల్లని ఐదు బాణములవలె కనిపించెను. కం॥ "సతి చెక్కిటఁజెయిసేర్పఁగ । నతుల కరాంగుళులు సాంజనాశ్రుయుతములై । రతిపతి బాసట మించిన । శిత పంచశరమ్ములనఁగఁజెలఁగు నృసింహా ।" —కా. లం. సం. III-89 ప.) ఇందు ప్రియుడు తనకడకు రాకపోవుట విభావము. చెక్కిటిపై చేయి చేర్చుకొని ఏడ్చుట, కన్నీరు అనుభావములు. వీనిచే చింత వ్యక్తమయినది.

కామదశలందొకటి యని సాహిత్యదర్పణకర్త పేర్కొనెను. (చూ. శృంగారావస్థలు).

"చింతా ప్రాప్త్యుపాయాది చింతనమ్" అని (సా. ద. III-163 పే. 191 శ్లో). నిర్వచనము— ప్రియుని సంగమమునకు ఉపాయమునుగూర్చి చింతించుటయే చింత. దీనినే కొందరు సంకల్పమనిరి. (చూ. సంకల్పము).

ఉదాహరణము :- "మదనుని సాక్షాల్లక్ష్మిని అకురంగాక్షిని ఎట్లు ఈక్షింతునో అని చింతాకులుఁడై కాంతుఁడు రేయెల్ల నిద్రంబొందఁడాయెను." (సాహిత్యదర్పణమందలి ఉదాహరణ శ్లోకమునకు వేదంవారి తెలుగుసేత). శ్లో కథమీక్షే కురంగాక్షీం సాక్షాల్లక్ష్మీం మనోభువః । ఇతి చింతాకులః కాంతో నిద్రాంనైతి నిశీథినీం' —(అం. సా. ద. III-88 పేజి). ఇందు ఒకానొక నాయికను గూర్చి ఇంద్రజాల ప్రదర్శనముచేత ప్రరూఢరాగుడైన నాయకుని చింత వ్యక్తమయినది.

**చిత్రకావ్యము :** అధమకావ్యమునకే మరొకపేరు చిత్రకావ్యము. వివరములకు చూ. అధమకావ్యము.

**చూర్ణకము :** చూ. గద్యకావ్యము. గద్యకావ్యభేదములందొకటి. ఇది "అల్పసమాసక" మయిన గద్యరచన "తుర్యంచాల్పసమాసకం" (సా. ద. VI-331 శ్లో.)

ఉదాహరణము .- "గుణరత్నసాగర జగదేక నాగర కామినీ మదన జనరంజన" (సా. ద. VI పరి. 357 పే. 331 శ్లో.).

**జడత :** కామదశలందొకటియని సాహిత్యదర్పణకర్త పేర్కొనెను. (చూ. శృంగారావస్థలు.).

"జడతా హీనచేష్టత్వ మంగానాం మనసస్తథా" అని నిర్వచనము (సా. ద. III-163 పేజి. 193 శ్లో.). అవయవములును, మనస్సును పని చేయకపోవుటయే జడత.

ఉదాహరణము :- శ్లో బిసినీదళశయనీయే నిహితం సర్వం సునిశ్చలం అంగం । దీర్ఘోనిశ్వాస భరఏష సాధయతి జీవతీతి పరం" —అం. సా.

ద. III-84 పేజి. దీనికి వేదంవారి అనువాదము చూడుడు :- ' తామరాకుల సెజ్జయందు దేహమంతయు బొత్తిగా కదలకయున్నది. నిడుద నిట్టూర్పుల యీ పెల్లిదము మాత్రము బ్రతికి యున్నదని తెలుపుచున్నది.'' —అం. సా. ద. III-84 పేజి.

**జహదభిధేయ** : వివరములకు, ఉదాహరణములకు చూ. లక్షణలక్షణ. జహత్- విడుచుచున్న ; అభిధేయ=అభిధేయార్థముగలది.

**జహద్వాచ్యా** : వివరములకు, ఉదాహరణములకు చూ. లక్షణలక్షణ. జహత్= విడుచుచున్న; వాచ్య=వాచ్యార్థముగల లక్షణ.

**జహల్లక్షణ** : వివరములకు, ఉదాహరణములకు చూ. లక్షణలక్షణ. జహత్= వాచ్యార్థమును విడుచుచున్న లక్షణ=లక్షణాశక్తి.

**జ్వరము** : శృంగారావస్థలందొకటి (చూ. శృంగారావస్థలు).

నిర్వచనములు :- "తాపాధిక్యం జ్వరోమతః' అని ప్రతాప రుద్రీయము (ప్ర. రు. రసప్రక. 232 పే. 94 సం.) తాపము అతిశయించుటయే జ్వరము. తాపమనగా మన్మథతాపమే.

ఉదాహరణము :- శ్లో॥ మోఘ శిశిరోపచారా వధూర్విరహజ్వరేణ గర్వ్యశా ఇదానీం రుద్రనరేశ్వర కాంక్షతి తవ దర్శనామృతకం" —(అం. ప్ర. రు. రసప్రక. 312 పేజి. 9 సం.) దీనికి శ్రీ జమ్మలమడక మాధవరామ శర్మగారి వివరణము చూడుడు : "ఓ రుద్రనరేశ్వరా! ఆ వధువు అధికమయిన విరహజ్వరముచేత బాధపడుతున్నది. ఆమె శిశిరోపచారాలు వ్యర్థములై పోతున్నవి. ఇప్పుడు నీ దర్శనామృతమును కోరుతున్నది. దీనిలో విరహ జ్వరాధిక్యము వర్ణితమయింది" —(అం. ప్ర. రు. రసప్రక. 312 పేజి 9 సంఖ్య).

**జాగరము** : శృంగారావస్థలందొకటి (చూ. శృంగారావస్థలు)

నిర్వచనములు :- (1) "జాగరస్తు వినిద్రత్వం" అని ప్రతాపరుద్రీయము (ప్ర. రు. రసప్రక. 231 పే. 90 సం.) నిద్రలేకపోవుట జాగరము.

ఉదాహరణము :- కం॥ "ఏ కడయందే చెట్టున । నేకొమ్మను గూరుచుండి యెల్లెత్తి మెడన్ । శ్రీకర సుధాంశులేఖ వి । లోకించెఁ జకోర మట్టులు నిశంగడపెన్" (కా. లం. సం. III-397 పేజి, శ్రీ సన్నిధానం వారిచ్చిన యుదాహరణము). ఇందు నాయకుని జాగరము వర్ణితము. ఈ జాగరమునకు కారణము విరహము.

**జాడ్యము** : జడత యని రూపాంతరము. ఒక వ్యభిచారిభావము (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- (1)"అప్రతిపత్తిర్జడతా స్యాదిష్టానిష్టదర్శన శ్రుతిభిః అనిమిషనయన నిరీక్షణ తూష్ణీంభావాదయస్తత్ర" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 60 పేజి 15 సం.). ఇష్టదర్శనము, ఇష్టశ్రవణము, అనిష్టదర్శనము, అనిష్టశ్రవణము —వీనివలన కలిగిన అప్రతిపత్తియే

(కర్తవ్యమూఢత) జడత. నిశ్చలముగా చూచుట, మౌనముగా నుండిపోవుట మొదలైనవి అనుభావములు. (2) "జాడ్య మప్రతిపత్తిః స్యాదిష్టా నిష్టా గమోద్భవా" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 281 పేజి 17 సం.) ఇష్టప్రాప్తి వలనను, అనిష్టప్రాప్తి వలనను కలిగిన అప్రతిపత్తి జాడ్యము. (3) "అప్రతిపత్తిర్జడతా స్యాదిష్టానిష్ట దర్శన శ్రుతిభిః అనిమిష నయన నిరీక్షణ తూష్ణీంభావాదయస్తత్ర" అని సాహిత్యదర్పణము (సా. ద. III-143 పేజి 148 శ్లో.) ఇది దశరూపక లక్షణమే. చూ. మీద (1). (4) "మదిలోఁగల కోరిక చేకూఱిన నలవెఱుఁగక యునికి జాడ్యము" అని నరసభూపాలీయము (III-53 ప.). ఈ లక్షణ మసంపూర్ణము. (5) "చింతోత్కంఠా భయవిరహేష్టానిష్ట దర్శన శ్రవణాది జన్యా అవశ్య కర్తవ్యార్థ ప్రతిసంధాన వికలా చిత్తవృత్తిర్జడతా" అని రసగంగాధరము (కా. ల. సం. తృతీయ 346 పేజి. 5 సం.). చింత, ఉత్కంఠ, భయము, విరహము, ఇష్టానిష్టదర్శన శ్రవణములు మొదలైన వాని వలన కలుగు చిత్తవృత్తి విశేషము జాడ్యము. ఇది ఇతికర్తవ్యతా మూఢత్వమును కలిగించును. చింతాదులు విభావములు. ఇతి కర్తవ్యతా మూఢత అనుభావము. జాడ్యము భావధ్వని

ఉదాహరణము - 'నరసభూపాలుడు రాగానే ఆమెకు ఇష్టదర్శనమైనది. అందువలన కలిగిన ఆనందముతో నామె రెప్పపాటువేయదు. చెలులను చూడదు; మాటాడదు; కదలదు; అతని ముఖచంద్రామృత పారణమున తన్మయురాలైనట్లున్నది.' కం "అదన నృసింహుడు వచ్చిన, సుదతి కనుంగొనదు; చెలులఁ జూడదు; భాషిం పదు, మిగులఁ జలింపదు; త ద్వదనామృత పారణావధానయుఁ బోలెన్ (కా. లం. సం. III-55 ప.) ఇట ఇష్టదర్శనము విభావము. అనిమిషనయనత్వము, మౌనముగా నుండి పోవుట అనుభావములు. జాడ్యము భావధ్వని.

**జుగుప్స :** వివరములకు ముందు చూ. స్థాయిభావము. రోత అని సామాన్యార్థము. అలంకారశాస్త్రములో బీభత్స రసమునకిది స్థాయిభావము.

జుగుప్సకు నిర్వచనములు:-(1) "అర్థానాందోషసందర్శనాదిభిర్గర్హణా జుగుప్సా" అని ప్రతాపరుద్రీయము రసప్రకరణము). పదార్థములందున్న దోషములను చూచుటవలన కలుగు రోతయే జుగుప్స. రక్తము, కక్కిన పదార్థములు మొదలైనవానిని వినినప్పుడుకాని, కనినప్పుడుకాని మనస్సంకోచము కలుగును. అదియే జుగుప్స అనిభావము. (2) "దోషేక్షణాదిభిర్గర్హా జుగుప్సా విస్మయోద్భవా" అని సాహిత్యదర్పణము (తృతీయపరిచ్ఛేదము) దోషములను చూచుటవలన కలిగిన ఏవగింపు జుగుప్స. అది విస్మయమును పుట్టించును. (3) "కదర్యవస్తు విలోకనజన్మా విచికిత్సాఖ్య శ్చిత్తవృత్తి విశేషో జుగుప్సా" అని రసగంగాధరము. రోతకలిగించు పురీషము మొదలైన వస్తువులను చూచినప్పుడు విచికిత్స అను చిత్తవృత్తి విశేషము కలుగును. అదియే జుగుప్స.

(4) "పలలాస్థిశోణితాదులఁ బలుమాఱును జూడ నరుచిభావములోనం దళు కొత్తనిగర్హణమది తలపోయ జుగుప్స యనగదగు" అని నరసభూపాలీయము (తృతీయాశ్వాసము —19 ప.). (5) Disgust considered as the feeling which gives rise to the బీభత్స sentiment." అని ఆప్టేనిఘంటువు.

పదార్థములందలి దోషములను చూచుట వలన కలుగు రోతయే జుగుప్స యని ప్రతాపరుద్రీయకారుడు చెప్పిన నిర్వచనము అసమగ్రము. ఒకనికొక పదార్థమున దోషము కనిపించవచ్చును. కాని ఆ దోషమే అందరి కిని కనిపింపక పోవచ్చును. అప్పుడు రోతకలుగదు. (ఈ లక్షణమునే నరస భూపాలీయకర్త అనుసరించెను.). దీనిని రసగంగాధరకర్త సవరించెను.

జుగుప్సకు నరసభూపాలీయమునందలి యుదాహరణము :- నరస భూపాలుడెందరినో శత్రువులను చంపెను. ఆ శత్రువుల వసారసమును త్రాగి మదించి పోయిన భూతములు యుద్ధము జరిగిన స్థలములందు ప్రవహించు రక్త ప్రవాహములలో విహరించుచున్నవి. ఆ భూతములు ఏనుగు పుర్రెలనెడి నావలనెక్కి తిరుగాడు చున్నవి. ఆ రక్తప్రవాహములలో తలలు పద్మము లుగా, మెదడులు నురుగులుగా, ప్రేగులు నీటిపాములుగా, ఎముకలు శంఖ ములుగా కనిపించుచున్నవి. —ఇట్లు భూతములు చరించుచున్న రక్తపు టేరుల వర్ణన జుగుప్సను వ్యక్తము చేయుచున్నది. చ। "తలలు సరోజముల్ మెదడుతండము క్రొన్నురు వంత్రజాలముల్ జలఫణులస్థిఖండములు శంఖములై తగు నెత్తుటేర్లలోఁ। గలభకపాలనౌచయముఁ గ్రక్కున నెక్కి చరించు సంగర। స్థలుల నృసింహనిర్దళిత శత్రువసారసమత్తభూత ముల్" —కా. లం. సం. III-20.

**తపనము :** స్వభావజములయిన అలంకారములందొకటి. (చూ. స్వభావజములు, చూ. అలంకారములు). ఒక అనుభావము (చూ. అనుభావములు)

నిర్వచనములు :- (1) "తపనం ప్రియవిచ్ఛేదే స్మరావేగోత్థచేష్టితం" అనిసాహిత్యదర్పణము. (కా.లం.సం. తృతీయ 391 పేజి). ప్రియుడు తనకు దూరముకాగా మన్మథావేగముచేత కలిగిన చేష్ట తపనము. 18 స్వభావజము లందొకటి (చూ. స్వభావజములు.).

ఉదాహరణము :- మ "కడు నిట్టూర్పులు పుచ్చు; నేలఁ బొరలున్; గాంచున్ భవన్మార్గ మె। ప్పుడు; బిట్టేడ్చు; గృశీభవించిన కరంబుల్ వేయు నట్టిట్టులన్। బడయంగాఁ గలనైన నీ కలయికన్ వాంఛించు నిద్రిం పఁగా। నిడఁదద్దానిని గూడఁబాడు విధి యోయీ! యెంత దౌర్భా గ్యమో!" కా. లం. సం. III (సాహిత్యదర్పణము నందలి శ్లోకమునకు శ్రీ సన్నిధానంవారి తర్జుమా) —391 పేజి. శ్లో। శ్వాసాన్ముఞ్చతి, భూతలే విలుఠతి త్వన్మార్గ మాలోకతే। దీర్ఘంరోదితి విక్షిపత్యత ఇతః క్షామాం భుజావల్లరీం। కించ ప్రాణసమాన, కాంక్షితవతీ స్వప్నేఽపి తే సంగమం

నిద్రాం వాంఛతి, న ప్రయచ్ఛతి పునర్దగ్ధో విధిస్త్వామపి'' —ఆంధ్రసాహిత్య దర్పణము తృతీయ పరిచ్ఛేదము 61 పేజి.

తాత్పర్యము : చూ. తాత్పర్యార్థము

తాత్పర్యార్థము : మీమాంసకులగు అభిహితాన్వయవాదుల మతమున దీనికి గల అర్థమునకును ఆలంకారికుల మతమున దీనికిగల అర్థమునకును భేద మున్నది.

ఒక వాక్యముయొక్క అఖండార్థమే మీమాంసకుల మతమున తాత్ప ర్యార్థము. ఈ అర్థమును బోధించునది తాత్పర్యశక్తి.

ఆలంకారికుల మతమున వ్యంగ్యార్థమునకు తాత్పర్యార్థము అనిపేరు. ప్రతాపరుద్రీయకర్త అభిహితాన్వయవాదుల తాత్పర్యశక్తిని ఖండించి తాత్పర్యార్థమును దానికి వ్యంగ్యార్థమని అర్థము చెప్పినాడు. 'తస్మిన్‌పరాః తత్పరాః తత్పరాణాం భావస్తాత్పర్యం' అని అభిహితాన్వయవాదులు వ్యుత్పత్తిని తెల్పి విశిష్ట రూపమైన వాక్యార్థమునందు తత్పరములైనవి అనగా వ్యంగ్యపరములైనవి శబ్దములనియు, వాని ధర్మమే తాత్పర్యమనియు వివరించిరి. కాని ప్రతాపరుద్రీయకర్త తచ్ఛబ్దమునకు రసాదిరూపమైన ప్రధానార్థమే చెప్పెను. తత్ అనగా వక్త తన బుద్ధిచేత సహృదయహృద యానుభవమునకు తెచ్చు రసాదులు. తత్పరాః అనగా ఆ రసాసక్తములైన విషయములు. వాని భావమే తాత్పర్యము. వాక్యార్థమును తెలుపుటతో కవి పని పూర్తికాదు. ఆ వాక్యార్థముకన్న రమణీయమగు అర్థాంతరమును తెల్పవలెను. తాత్పర్యమనగా వ్యంజనయే. ఇది రసాద్యర్థమును బోధించు పదార్థశక్తియే. భావప్రకాశకర్త కావ్యమందు వాక్యార్థమనగా రసాలం క్రియాదులే అని చెప్పుచు అదియే తాత్పర్యమని ధ్వనియని చాటెను. అతని శ్లోకమిది —'అతో ధ్వన్యాఖ్య తాత్పర్య గమ్యమానత్వతః స్వతః కావ్యే రసాలంక్రియాది ర్వాక్యార్థో భవతి స్ఫుటం' (కా. లం. సం. II-130 పేజి.)

తాత్పర్యమునే భావము, అభిప్రాయము, ఉద్దేశము అనికూడా అందురు.

తాపము : శృంగారావస్థలందొకటి. (చూ. శృంగారావస్థలు) దీనినే 'జ్వరము' అని కొందరు. చూ. జ్వరము.

తారావళి : క్షుద్రప్రబంధములలో ఒకటి. ఇరువదియేడు పద్యములు గల కావ్యము తారావళి. తారలనగా నక్షత్రములు. ఇవి ఇరువదియేడు సంఖ్య గలవి. ఆ సంఖ్యగల పద్యములను వ్రాసి కావ్యము ముగించినయెడల తారా వళి అగును.

''తారాణాం సంఖ్యయా పద్యైర్యుక్తా తారావళీమతా'' అని ప్రతాప రుద్రీయము (ప్ర. రు. కావ్యప్రక. 84 పే.).

**త్రాసము** : వ్యభిచారిభావములందొకటి (చూ. వ్యభిచారి భావము)

నిర్వచనములు :- (1) గర్జితాదేర్మనఃక్షోభస్త్రాసోఽత్రోత్కంపితాదయః" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 60 పే. 20సం.) గర్జితము మొదలైనవానివలన కలుగు చిత్తవిక్షోభమే త్రాసము. దీనివలన ఉత్కంపితము మొదలైన అనుభావములు కలుగును. (2) "ఆకస్మిక భయాచ్చిత్త క్షోభస్త్రాసః ప్రకీర్త్యతే" అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రసప్రక. 292 పేజి 32 సం.) ఆకస్మికముగా కలిగిన భయమువలన చిత్తక్షోభము కలుగును. అదే త్రాసము. (3) "నిర్ఘాత విద్యుదుల్కాద్యైస్త్రాసః కంపాదికృత్" అని సాహిత్యదర్పణము (సా. ద. III-151 పే. 164 శ్లో.) పిడుగులు, మెరుపులు, ఉల్కలు మొదలైనవానివలన కలుగునది త్రాసము. దానివలన కంపము మొదలైనవి కలుగును. (4) "ఆకస్మికమై పొడమ భయంబునఁ జిత్తము తడబడుటది త్రాసమనఁగదగు" అని నరసభూపాలీయము III-58 ప.) "ఘోరోర్ఘోర సత్త్వదర్శన స్ఫూర్జథు శ్రవణాది జన్మా చిత్తవృత్తి విశేషస్త్రాసః" అని రసగంగాధరము (కా. లం. సం. III-348 పేజి 7 సం.), వ్యాఘ్రాది ఘోరజంతువులను చూచుటవలనను, ఉరుములు మొదలయిన వానిని వినుటవలనను పిరికివానికి కలుగు చిత్తవృత్తి విశేషము త్రాసము. రోమాంచము, కంపము, స్తంభము, భ్రమము మొదలయిన వీందువలన కలుగు అనుభావములు (కార్యములు).

ఉదాహరణము :- తల్లిచే శిక్షింపబడుచున్న బాలకృష్ణుని మాటలు— "అమ్మా! నా చేతిపై కొరడాతో కొట్టవద్దమ్మా! నా మనస్సు వణకిపోవు చున్నది. ఈ గొల్లపిల్లలతో ఆటలాడుచు నికముందెప్పుడు నిట్లు ఆలస్యము చేయను లెమ్మా!" శ్లో॥ "మా కురుకశాం కరాబ్జే కరుణావతి కంపతే మమ స్వాంతం ఖేలన్న జాతు గోపైరంబ! విలంబం కరిష్యామి" —రసగంగాధరమునుండి శ్రీ సన్నిధానంవారిచే నుదాహృతము, (కా. లం. సం. III-349 పేజి 7 సం.). ఇందు కొరడాదెబ్బ విభావము. హృదయకంపమను భావము. త్రాసము ధ్వనించుచున్నది.

**తుల్యప్రాధాన్యము** : చూ. మధ్యమకావ్యము, గుణీభూతవ్యంగ్యము.

గుణీభూతవ్యంగ్యముయొక్క అష్టభేదములందొకటి. మిగిలినవాని వివరములకు చూ. అగూఢము, అపరాంగము, వాచ్యాంగము, అస్ఫుటము, సందిగ్ధము, కాక్వాక్షిప్తము, అరుచిరము.

వాచ్యార్థవ్యంగ్యార్థములు రెండింటికి సమ ప్రాధాన్యమున్నపుడు తుల్యప్రాధాన్యము. "ధ్వన్యాలోకమతమున నీ తుల్యప్రాధాన్యరూపమగు గుణీభూత వ్యంగ్యములేదు. వివరములకు చూ. కావ్యాలంకారసంగ్రహము -సన్నిధానంవారి వ్యాఖ్య 230 పుట.

ఉదాహరణము :- శత్రువులారా! మీ మకుటకాంతులతో నరసభూపాలుని చరణముల నరుణమొనరింపుడు. లేదా అతని నయనమరుణముకాగలదు."

కం॥ నరసింహేంద్రుని చరణం
బరుణంబుగ సంఘటింపుఁ డరులార! భవ
ద్వర మకుటస్ఫురణంబుఁ;
సరణంబగునతని సహన మటుగాకున్నన్.

నరసభూపాలీయము II ఆ. 160 ప.

నరసభూపాలునికి నమస్కారము చేయనిచో మీకు అరణ్యమే శరణ్యము" అనునది ఈ కావ్యమందలి వ్యంగ్యము. ఇచట వాచ్యార్థ వ్యంగ్యార్థములలో రెండును సుందరముగానే ఉన్నవి.

*దయావీరము :* వీరరసభేదములందొకటి. (చూ. వీరరసము). వీరరసము నాలుగు విధములు. అందిది నాలుగవది. (చూ. దానవీరము, ధర్మవీరము, యుద్ధ వీరము). (చూ. ఉత్సాహము).

నాయకుడు దేనియందుత్సాహము చూపునో దానినిబట్టి వీరరసమున కాపేరు పెట్టబడినది. దయయందుత్సాహము గలవాడు దయా వీరుడు. జీమూతవాహనుడు, బోధిసత్త్వుడు దయావీరులు

ఉదాహరణము:- జీమూతవాహనుడు! "నరముల నోళ్లనుండి రక్తము పాఱుచునేయున్నది. ఇంకను నాదేహమున మాంసమున్నది. నీకును ఆఁకలి తీఱినట్లు అగపడదు. గరుత్మంతుఁడా! ఏల భక్షించుటను మానితివి?" (ఆం. సా. ద. III-94 పేజి).

*దశావస్థలు :* చూ. శృంగారావస్థలు.

*దానవీరము :* వీరరసభేదములందొకటి (చూ వీరరసము). వీరరసము నాలుగు విధములు అందిది మొదటిది. (చూ. ధర్మవీరము, యుద్ధవీరము, దయా వీరము). (చూ. ఉత్సాహము).

నాయకుడు దేనియందుత్సాహము చూపునో దానినిబట్టి వీరరసమున కాపేరు పెట్టబడినది. దానము చేయుటయందుత్సాహము గలవాడు దాన వీరుడు. దానస్వీకర్త ఆలంబనముగా గలది దానవీరము.

ఉదాహరణము :- శిబి, దధీచి, పరశురాముడు మొదలైనవారు దానవీరులు.

"త్యాగః సప్తసముద్రముద్రిత మహీనిర్వ్యాజ దానావధిః" ఇతి. అత్ర పరశురామస్య త్యాగోఉత్సాహః స్థాయిభావః సంప్రదాన భూతబ్రాహ్మణైరాలంబనవిభావైః సత్త్వాధ్యవసాయాదిభిశ్చోద్దీపన విభావైర్విభావితః సర్వస్వ త్యాగాది భిరనుభావైరను భావితో హర్ష ధృత్యాదిభిః సంచారిభిః పుష్టం నీతో దానవీరతాం భజతే" —(సా. ద. III-180 పేజి). 'త్యాగమున కవధి సప్తసముద్రముద్రితమైన భూమిని నిర్వ్యాజముగా దానముచేయుట.' —ఈ వాక్యమున పరశురాముని త్యాగము వర్ణితము. ఇందుత్సాహము స్థాయి. సంప్రదానభూతులైన బ్రాహ్మణు లాలంబనము. సత్త్వము, అధ్యవసాయము ఉద్దీపనములు. సర్వస్వ త్యాగాదులు అనుభావములు. హర్షధృత్యా

దులు సంచారులు. వీనిచే విభావితమై, అనుభావితమై పుష్టమైన ఉత్సాహము దానవీరత నందుకొన్నది.

**దీప్తి :** ఇది అయత్నజమైన అనుభావము (చూ. అనుభావము, చూ. అయత్నజములు).

దీప్తికి నిర్వచనములు :- (1) 'దీప్తిః కాంతేస్తు విస్తరః" అని దశరూపకము (ధ. ద. రూ. రెండవప్రకాశము 28 పేజి). కాంతి విస్తారమే దీప్తి (చూ. కాంతి.). నాయికకు యౌవనమందు సత్త్వజములైన అలంకారములు ఇరువదింటిలో ఒకటి. ఇది అయత్నజము. (2) "కాంతి రేవాతి విస్తీర్ణా దీప్తి రిత్యభిధీయతే" అని సాహిత్యదర్పణము (కా. లం. సం. తృతీయ 390 పేజి). కాంతియే అతి విస్తీర్ణమైనచో దీప్తి. (చూ. కాంతి). నాయికకు యౌవనమందు సత్త్వజనులైన అలంకారములు ఇరువది యెనిమిదింటిలో ఒకటి. ఇది అయత్నజము.

దీప్తికి సాహిత్యదర్పణమునుండి ఉదాహరణము :- 'ఈమె (చంద్రకళ) యౌవనముయొక్క విలాసమే. లావణ్యముయొక్క హాసమే. ధరణికాభరణమే. యువజన మానసములకు వశీకరణమే' "తారుణ్యస్యవిలాసః సమధిక లావణ్య సంపదోహాసః । ధరణితలస్యాభరణం యువజనమనసో వశీకరణం" —ఆం. సా. ద. తృతీయపరిచ్ఛేదము-56 పేజి.

**దైన్యము :** ఒక వ్యభిచారిభావము (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- (1) "దౌర్గత్యాద్యై రనౌజస్యం దైన్యం కార్శ్యః (ర్ష్ణాం) రుజ్యాది కృత్ (మత్)" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవ ప్రకా. 60 పేజి 17 సం.) దుర్గతి మొదలైనవానివలన కలుగు తేజో విహీనతయే దైన్యము. అది కృశత్వమును, రోగములను కలిగించును. (అనుభావములు (2) "సత్వత్యాగాదనౌద్ధత్యం దైన్యం కార్పణ్య సంభవం" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 275 పే. 8 సం.) మనోదృఢత్వము పోవుటవలన కలుగు అనుద్ధతియే దైన్యము. అది కార్పణ్యమును కలిగించును. (3) "దౌర్గత్యాద్యై రనౌజస్యం దైన్యం మలినతాదికృత్" అని సాహిత్యదర్పణము (సా. ద. III-141 పే. 145 శ్లో.) దారిద్ర్యము మొదలయినవానివలన తేజస్సు క్షీణించును. అదియే దైన్యము. ఇది మాలిన్యము మొదలైన వానిని కలిగించును. (4) "బలమఱి యరికిన్ దయరాఁ బలుకుట దైన్యంబు" అని నరసభూపాలీయము (III-53 ప.). ఈ లక్షణము సరికాదు అని సన్నిధానంవారు. (5) "దుఃఖదారిద్ర్యాపరాధాది జనితః స్వాపకర్ష భాషణాది హేతుశ్చిత్తవృత్తి విశేషో దైన్యం" అని రసగంగాధరము (కా. లం. సం. తృతీయ 345 పేజి 3 సం.) దుఃఖము, పేదరికము, అపరాధము మొదలైన వానివలన కలుగు చిత్తవృత్తివిశేషము దైన్యము. ఇది స్వాపకర్షమును తెలుపు మాటలను పలికించును, అనగా దుఃఖాదులు

విభావములు. స్వాపకర్ష భాషణములు అనుభావములు. వీనిచే దైన్యము వ్యజ్యమానమగును.

ఉదాహరణము :- తన సఖి నరసభూపాలుని విరహముతో పడుచున్న బాధనుచూచి ఆమె చేటి మన్మథు నుద్దేశించి దీనముగా పల్కుచున్న మాటలు —'మన్మథుడా ! పూర్వము నీవు త్రిపురాంతకు నంతటి వానిచే నీళ్లు మోయించితివి. నీకు ఈ మదిరాక్షి యొకలక్ష్యమా ? ఈమెను దయతో నరసభూపాలునితో కూర్చుము'

క॥ మదన! మదిరాక్షి లక్ష్యమె
మొదలఁ బురాంతకుని నీళ్లు మోయించిన నీ
కిది మొదలు కరుణఁజూడుము
సుదతిన్ నరసింహుఁ గూర్పు సుకృతము గలుగున్.

-(కా. లం. సం. III 54 ప.)

ఈ మాటలందు నరసభూలుని ప్రియురాలి విరహదుఃఖమే విభావము. స్వాపకర్ష భాషణములు అనుభావములు. చేటి దైన్యము వీనివలన వ్యక్తమయినది.

ద్రాక్షాపాకము : వివరములకు ముందు చూ. పాకము. ఇది కవితా పాకములలో ఒకటి (మిగిలినవానికి చూ. కదళీపాకము, నారికేళ పాకము...) "ద్రాక్షా పాకస్స కథితో బహిరంతః స్ఫురద్రసః" (ప్ర. రు. కా. ప్ర. 59 పే.). వెలుపల, లోపల రసస్ఫురణ కల ద్రాక్షాఫలమువలె విన్నప్పుడు, ఆలోచించినప్పుడు అప్రయత్నముగా ఆహ్లాదమును కలిగించు భావము ఏరచనలో భాసించునో అది ద్రాక్షాపాకము. దీనినే గోస్తనీపాకమని కూడా అందురు. "అసంవృతార్థ పరిపాకనివేద్యము" గోస్తనీపాకమని నరసభూపాలీయము లోని లక్షణము (కా. లం సం. II-85 ప.) అసంవృతమైన (అగూఢమైన) అర్థముయొక్క రుచి ద్రాక్షాపాకము.

ఉదాహరణము :- క వాలికలై వెలిదమ్ముల పోలికలై చంద మామ పులుఁగులకును దా । మేలిక లైన నిరీక్షణ । మాలికల నృసింహుఁ జూచె మదవతి వేడ్కన్." —(నరసభూపాలీయము-II ఆ. 86 ప.)

ద్వాదశావస్థలు : చూ. శృంగారావస్థలు.

ధన్యత : వివరములకు ముందు చూ. శృంగారావస్థలు.

దశావస్థలందు 'ధన్యత' పదవదిగా పేర్కొనినవాడు నరసభూపాలీయ కర్త. "ధన్యతను నే యాలంకారికులును దెలుపలేదు. ధన్యత సంభోగ శృంగార లక్షణము. దశావస్థలును విప్రలంభముననే కలుగునని చెప్పితిమి. దానిలో ధన్యత యెట్లుండును. కాన నిది దోషము." అని శ్రీ సన్నిధానం వారి వ్యాఖ్య. (కా. లం. సం. III-401 పే.).

ఉదాహరణము :- నరసభూపాల సంభోగము వలన తమ నాయిక ధన్యత నొందినదని చెలులు స్తుతించుచున్నారు : మ శుకవర్గంబొక్క మాటలో మెలఁగె; నా సూనాయుధుండాంతరంగికుడై యుండె; మరాళ

మొక్క నడకం గ్రేళ్లుబ్బి వర్తించెఁ । బాయక వేడ్కన్ సుముఖత్వ మొందె శశి; మా యబ్జాక్షి సేమంబుతో నకలంకస్థితి నీవుగూడ నరసింహా! రాజ కంఠీరవా!" –(కా. లం. సం. III-133 ప.).

*ధర్మవీరము :* వీరరసభేదములందొకటి. (చూ. వీరరసము). వీరరసము నాలుగు విధములు. అందిది రెండవది (చూ. దానవీరము, యుద్ధవీరము, దయా వీరము). (చూ. ఉత్సాహము).

నాయకుడు దేనియందుత్సాహము చూపునో దానినిబట్టి వీరరసమున కాపేరు పెట్టబడినది. ధర్మమునందుత్సాహము గలవాడు ధర్మవీరుడు శ్రీరాముడు, యుధిష్ఠిరుడు ధర్మవీరులు.

ఉదాహరణము :- శ్రీరాముని ధర్మోత్సాహమును వ్యక్తముచేయు చున్న శ్లోకమిది : "స్నేహం దయాంచకీర్తించ యదివా జానకీ మపి । ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా" స్నేహము, దయ, కీర్తి - వీనిలో నేదైననుగానీ చివరికి నాపత్నియగు జానకినైనగానీ లోకా రాధనకై విడుచుటకు బాధపడను అని శ్రీరాముని వాక్యము. (చూ. కా. లం. సం. III-అనుబంధము 439 పేజి).

*ధృతి :* వ్యభిచారిభావములందొకటి (చూ. వ్యభిచారిభావము)

నిర్వచనములు :- (1) "సంతోషో జ్ఞానశక్త్యాదేర్ధృతి రవ్యగ్రభోగ కృత్" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవ ప్రకా. 59 పేజి 14 సం) జ్ఞానము, శక్తి మొదలయిన వాని వలన కలుగు సంతోషమే ధృతి. అవ్యగ్ర భోగము (?) అను భావము. (2) 'ధృతిశ్చిత్తస్య నైస్పృహ్యం జ్ఞానాభీష్టాగ మాదిభిః' అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. రసప్రక. 277 పేజి 12సం.)జ్ఞానసిద్ధిఅభీష్టసిద్ధి మొదలయిన వానివలన చిత్తమునకుకలుగు నిస్పృహ త్వము ధృతి. (3) జ్ఞానాభీష్టాగమాద్యైస్తు సంపూర్ణ స్పృహతా ధృతిః సౌహిత్య వచనోల్లాస సహాస ప్రతిభాదికృత్" అని సాహిత్య దర్పణము సా. ద. III-154 పే. 168 శ్లో.). జ్ఞానము, అభీష్టప్రాప్తిమొదలైన వాని వలన కోరికలు తీరుట ధృతి. దాని వలన తృప్తి, వచనోల్లాసము, హాస ముతో కూడిన ప్రజ్ఞ మొదలైనవి కలుగును. (4) "అమరంగ మనము కృతార్థత్వముఁ జెందిన ధృతి యనంగఁదగు'' అని నరసభూపాలీయము III-65ప). (5) ''లోభశోక భయాది జనితో పప్లవ నివారణ కారణీభూత శ్చిత్తవృత్తి విశేషోధృతిః" అని రసగంగాధరము (కా. లం. సం. III-353 పే. 12 సం.) లోభము, శోకము, భయము మొదలైనవానివలన కలిగిన ఉప ప్లవమును నివారించుటకు కారణమైన చిత్తవృత్తి విశేషము ధృతి.

ఉదాహరణము :- నరసభూపాలుడు ఆమె వద్దకు వచ్చుట మానెను. అందువలన ఉపద్రవము కలిగినది. కాని ఆమె ధైర్యవంతురాలు. ఆ ఉప ద్రవమును నివారించుకొన్నది. ఆమె తనలో ననుకొన్న మాటలివి.—

కం॥ "నరసేంద్రుడు రాకుండినఁ బరువడి భావింపఁ గలుగు భాగ్యమె

చాలున్ । జరితార్థనైతి మరునకు గిరునకుఁ బ్రియమేల పల్కఁగీడ్పడినాకున్'' (కా. లం. సం. III-67.) ఇందు వివేకము విభావము. తృప్తి అను భావము. ధృతి (వ్యభిచారిభావముగా) వ్యక్తమయినది.

ధైర్యము : ఇది అయత్నజమైన అనుభావము (చూ. అనుభావము. చూ అయత్నజములు).

ధైర్యమునకు నిర్వచనములు :- "చాపలాఽవిహతా ధైర్యం చిద్వృత్తిరవికత్థనా" అని దశరూపకము (ధ. ద. రూ. 29 పేజి.). చాపల్యముచే దెబ్బతినని ఆత్మస్తుతిలేని మనోవ్యాపారము ధైర్యము. 20 అలంకారములలో ఒకటి (చూ. అలంకారములు). (2) "శీలాద్య లంఘనం నామ ధైర్యమిత్యభిధీయతే" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. 297 పేజి). శీలము మొదలయినవానినుల్లంఘించకుండుటయే ధైర్యము. 18 శృంగార చేష్టలందొకటి. (చూ. శృంగారచేష్టలు). (3)''ముక్తాత్మ శ్లాఘనా ధైర్యం మనోవృత్తిరచంచలా'' అని సాహిత్యదర్పణము (కా. లం. సం. 377 పేజి) ఆత్మప్రశంస చేసికొనజాలనిది, చాపల్యము లేనిది అగు మనో వ్యాపారము ధైర్యము. 28 అలంకారములందొకటి (చూ. అలంకారములు) (4) ''కుల శీలాద్య విలంఘన మిల ధైర్యంబు" అని నరసభూపాలీయము (III-108 పద్యము). 18 శృంగార చేష్టలందొకటి.

ధైర్యమునకు నరసభూపాలీయమునుండి ఉదాహరణము :- 'సోదరి! మహా సంపన్నుడు నరసభూపాలుడు. తండ్రి ఆజ్ఞలను దాటలేని దానను నేను. అతడెక్కడ ? నేనెక్కడ ? కాని మన్మథుడు నా మనస్సునాతనిపై సంధించి విషమాస్త్రుడను పేరును ధరించెను.' మ। "అతులైశ్వర్య సమగ్రుఁడైన నరసింహాధీశ్వరుండేడ ? నీ నీ పితృవాచాపరతంత్రనై వ్రతతతిం బెంపొందు నేనేడ ? నా క్షితి పాలాగ్రణిపైఁ బ్రసక్తమగు నాచిత్తంబు సంధించినాఁ డతనుండక్కరో ! నేటినుండి విషమాస్త్రాభిఖ్యుఁడౌ నెంతయున్'' —కా. లం. సం. III-102. ఈ మాటలలో ఆ కన్య అచంచలమైన మనోవృత్తి; కులశీలముల నుల్లంఘింపజాలకుండుట, ఆత్మశ్లాఘ నొనరించుకొనకుండుట వ్యక్తములగుచున్నవి.

ధ్వని : వివరములకు ముందు చూ. వాచ్యము, వ్యంగ్యము. వ్యంగ్యమునే ధ్వని అనియు ప్రతీయమానము అనియు అందురు. ఇదే కావ్యాత్మ. ఇది మూడువిధములు. వస్తురూపము; అలంకారరూపము, రసరూపము.

ధ్వని లక్షణమును ఆనందవర్ధనుడిట్లు చెప్పెను :- ''యత్రార్థశ్శబ్దోవా తమర్థముపసర్జనీకృతస్వార్థౌ వ్యక్తః కావ్యవిశేషః స ధ్వనిరితి సూరిభిః కథితః." (ధ్వ. లో. I ఉద్యో 23 శ్లో.). ఎక్కడ శబ్దము తన అర్థమును అప్రధానముగా చేసి, వ్యంగ్యార్థమును బోధించునో, అర్థము తన స్వస్వరూపమును అప్రధానముగా చేసి వ్యంగ్యార్థమును బోధించునో ఆ కావ్యవిశేషమే ధ్వనియని పండితులందురు.

ఉదాహరణములు :- (3) " ఆ యందము, ఆ చందము ఆ యాలాప క్రమము ఆ సమయమున అమృతధారయై ఆహ్లాద కరమయ్యెను. ఇప్పుడది పెనుజ్వరమై బాధించెను." (1) —ఇందు ఆ, ఆ, ఆ అను వర్ణములు తమ అర్థమును అప్రధానముగా చేసి లోకోత్తరము అను వ్యంగ్యార్థమును బోధించుచున్నవి. (2) ఒక ప్రోషితభర్తృక తన యింటికి వచ్చిన పాంథు నితో "ఇట మా అత్త పండుకొనును; నేనిక్కడ పరుందును. పగటనే గుర్తులు తెలుసుకొనుము. నీవు నిశాంధుడవుగదా! రాత్రి మామంచాల మీద పడుకుమీ" [2] అన్నది. ఈ అర్థము తన స్వరూపమును అప్రధానముగా చేసి నామంచముమీది పడుమీ అను వ్యంగ్యార్థమును బోధించుచున్నది.

ధ్వని (1) అభిధామూలము (2) లక్షణామూలము అని రెండు విధములు. అభిధామూలము (వివక్షితాన్యపరవాచ్యము) (1) సంలక్ష్య క్రమము (2) అసంలక్ష్య క్రమము అని రెండు విధములు. సంలక్ష్య క్రమము 41 విధములు. అసంలక్ష్యక్రమము 6 విధములు. ఇవి మొత్తము 47 విధములు. ఇక లక్షణామూలము (అవివక్షితవాచ్యము) (1) అర్థాంతర సంక్రమిత వాచ్యము (2) అత్యంత తిరస్కృత వాచ్యము అని రెండు విధములు. ఇవి (1) పదగత (2) వాక్యగత భేదముచే 4 విధములు.

ఇట్లు శుద్ధధ్వని 47 + 4 = 51 భేదములు. ఈ ధ్వనులు ఒకదానితో ఒకటి కలిసి సంకీర్ణములై 1326 విధాలగును. ఇవి తిరిగి త్రివిధ సంకరముల చేతను, ఏకవిధ సంసృష్టిచేతను మొత్తము నాల్గురెట్లై 5304 విధాలగును. (వీని వివరములకు చూ. కావ్యాలంకారసంగ్రహము 204-05 పేజీలు)

చూ. అభిధామూలధ్వని; లక్షణామూలధ్వని; వివక్షితాన్య పర వాచ్యము; సంలక్ష్యక్రమవ్యంగ్యము; అసంలక్ష్య క్రమవ్యంగ్యము; అవివక్షిత వాచ్యము; అర్థాంతర సంక్రమితవాచ్యము; అత్యంత తిరస్కృతవాచ్యము; ఉత్తమకావ్యము.

1. క॥ ఆయందంబాచందంబాయాలాపక్రమంబు నాసమయమునం
బీయూషధారయై యిడె హాయిని నన్నిపుడలంచెనది పెనుజ్వరమై
—కావ్యాలంకార సంగ్రహము 202 పేజి

2 గీ॥ ఇచట మాయత్తపండు; నేనిచటఁ బరుందుఁ
బగటనే లెస్సగని గుర్తు పట్టుకొనుము
ఓ నిశాంధుడ ! పాంథుఁడా! యొప్పుదప్పి
పడకుమీ? మాదు మంచాల పైనిరేయి.
కావ్యలంకార సంగ్రహము 151 పేజి

**నవరసములు :** తొమ్మిది రసములు (చూ. రసము).

"శృంగారహాస్య కరుణ రౌద్ర వీరభయానకాః బీభత్సాద్భుత శాంతాశ్చ నవనాట్యే రసాః స్మృతాః" అని భట్టోద్భటుని కారిక (కా. లం సం. III-

292 పే.) శృంగారము హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము, శాంతము - ఇవి నవరసములు (చూ. ఆయా శీర్షికలు)

*నారికేళపాకము :* వివరములకు ముందు చూ. పాకము. ఇది కవితాపాకములలో ఒకటి. (మిగిలినవానినిగురించి చూ. ద్రాక్షాపాకము, కదళీపాకము). "స నారికేళపాకః స్యాదంతర్గూఢ రసోదయః (ప్ర. రు. కావ్యప్రక. 60 పేజి). రసస్ఫురణము అంతర్గూఢముగా గల రచన నారికేళపాకము. నారికేళఫలములోని రసమును ఆస్వాదించుట కెంతటి ప్రయత్నమవసరమో ఇట్టి రచన వలన ఆహ్లాదము నొందుటకును అంతటి ప్రయత్నమవసరము.

ఉదాహరణము :- మ "వరభూషాదులపై మనంబిడక దృగ్వ్యాపార మెంతేఁ బర। స్పర సందర్శన నాతిభిన్నమయి చూపట్టంగఁ గార్యాంతర స్మరణం బేమియు లేక నిశ్చలత నీ సాంగత్యముం గోరి మా। హరిణీ లోచన యాత్మయందు నరసింహా! నిన్నె భావించెరా!" (కా. అం. సం. II ఆ 87 ప.) "మా చెలికత్తె తన మనస్సును ధనకనక వస్తువాహనాదులపైఁ బోనీక (ఇతరులు దనకివియిత్తున్నను లెక్కింపక) దృగ్వ్యాపార మొకరి నొకరు చూచుకొనుటకన్న భిన్నముగానిది కాఁగా నన‌ఁగా నిన్నదియు దానిని నీవును జూచునట్లుగానే చూపట్టఁగా దేనినిగూడఁ దలంపక నీ సాంగత్యమునుగోరి యాత్మయందు నిన్నే స్మరించుచున్నది (పరస్పర సందర్శననాతి భిన్నము). ఈ యర్థము విస్పష్టముగా గోచరింపక శ్లేషముచే గోచరించుచున్నది.' (శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి వివరణము చూ. కావ్యాలంకార సంగ్రహము 177 పుట.)

*నిదర్శనము :* తిరశ్చామతిరశ్చాంవా చేష్టాభిర్యత్ర కార్యమకార్యం వానిశ్చీయతే తత్ పంచతంత్రాదివత్ ధూర్తవిట కుట్టినీమత మయూర మార్జారికాదివచ్చ నిదర్శనమ్ (భామహకావ్యాలంకార హిందీ భూమిక 30 పే.) అని హేమచంద్రుడు (కావ్యానుశాసనము). పశుపక్ష్యాదుల చేష్టలద్వారా కార్యాకార్యములను నిర్ణయించు కావ్యవిశేషము నిదర్శనము. పంచతంత్రము దీనికి నిదర్శనము.

*నిద్ర :* వ్యభిచారిభావములందొకటి (చూ. వ్యభిచారిభావము)

నిర్వచనములు :- (1) "మనస్సమ్మీలనం నిద్రా చింతాలస్యక్లమాదిభిః తత్ర జృంభాంగ భంగాక్షిమీలనోత్స్వప్నతాదయః" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 62 పేజి. 28 సం) చింత, ఆలస్యము, శ్రమ మొదలైనవానివలన మనస్సు వివశమగుటయే నిద్ర. ఆవులింత, ఒళ్లు విరుపు, కనులు మూతలుపడుట, కలగనుట మొదలయినవి అనుభావములు. (2) "నిద్రా చిత్త నిమీలనం" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 284 పేజి. 21 సం.). మనస్సు మూతవడుట నిద్ర. (3) చేతఃసంమీలనం నిద్రా శ్రమక్లమమదాదిజా జృంభాక్షిమీలనోచ్ఛ్వాస గాత్రభంగాది

కారణం'' అని సాహిత్యదర్పణము (సా. ద. III-148 పే. 157శ్లో). బడలిక, అలసట, మదము మొదలైన వానివలన మనస్సు మూతవడుట నిద్ర. ఆవులింత, కన్నులు మూతవడుట, ఉచ్ఛ్వాసము, ఒడలు విరుచుకొనుట మొదలైనవి అనుభావములు. (కార్యములు). (4) "చిత్తనిమీలనమగు నిద్రయనంగ'' అని నరసభూపాలీయము III-78 ప). (5) ''శ్రమాది ప్రయోజ్యం చేతసమ్మీలనం నిద్రా" అని రసగంగాధరము (కా. లం. సం. III-361 పే. 22 సం.) శ్రమాదులవలన కలిగిన మనస్సమ్మీలనమే నిద్ర.

ఉదాహరణము :- కం ''అలన నృసింహుని కౌఁగిట నలసియొపవలెల్ల నిద్రనందెడు నెలమిన్ నెలపొందున రే ముద్దులు। గులికి పగల్ నిద్రవోవు కుముదిని వోలెన్'' -(కా. లం. సం. III-361 పేజి.) అలసట విభావము నేత్రనిమీలనము అనుభావము (కార్యము).

*నిబద్ధము* : చూ. అనిబద్ధము.

*నియతసంబంధవ్యంగ్యము* : వివరముల ముందు చూ. వ్యంజన; వ్యంగ్యము.

వ్యంగ్యార్థమునకు మూడువిధములైన సంబంధములుండును. అందు నియత సంబంధమొకటి. మిగిలినవాని వివరములకు చూ. అనియత సంబంధ వ్యంగ్యము; సంబద్ధ సంబంధ వ్యంగ్యము

వాచ్యార్థము నిషేధరూపమున నుండగా నియతముగ వ్యంగ్యార్థము విధిరూపమై యుండుట నియతసంబంధ వ్యంగ్యము. ఇది ప్రకరణ వక్తృ బోద్ధవ్యాదులనుబట్టి స్ఫురించును.

ఉదాహరణము :- ఒక ప్రోషిత భర్తృక తనయింటికి వచ్చిన బాటసారితో పలికిన మాటలు :- గీ ఇచట మాయత్త పండు; నేనిటఁ బరుండుఁ బగటనే లెస్సగని గుర్తుపట్టుకొనుము! ఓ నిశాంధుఁడ! పాంథుఁడా! త్రొప్పు దప్పిపడకుమీ; మాదు మంచాలపై నిశేయి'' (కా. లం. సం. II-166 పేజి). ఓ బాటసారి! నీకు రేఁజీకటికదా! వెలుతురుండగానే గుర్తులు చూచుకొమ్ము. ఇక్కడ మాయత్త పండుకొనును. నేను పరుండు చోటిది. అర్ధరాత్రినీవులేచినచో మా మంచములమీద పడిపోవుదువేమో! అట్లు పడుకు సుమా!" ఇందు పడకుసుమా అను నిషేధము నియతముగా విధిరూపమగు వ్యంగ్యమును బోధించుచున్నది. ఆమె తనకతనియందున్న ఆసక్తిని తెలిపినది. నా మంచము గుర్తుంచుకొని అర్ధరాత్రి నా కడకువచ్చి సుఖమునిమ్ము అని వ్యంగ్యార్థము.

*నిరూఢలక్షణ* : రూఢినిబట్టి ముఖ్యార్థమునకు అర్థాంతరమును నిర్ణయించుట నిరూఢలక్షణ. వివరములకు చూ. లక్షణ

*నిర్వేదము* : ఒక వ్యభిచారిభావము (చూ. వ్యభిచారిభావము.)

నిర్వచనములు :- (1) తత్త్వజ్ఞానాపదీర్ష్యాదేర్నిర్వేదః స్వావమాననం తత్రచింతాశ్రు నిశ్శ్వాసవైవర్ణ్యోచ్ఛ్వాసదీనతాః'' అని దశరూపకము (ద.రూ. నాలుగవ ప్రకా. 59 పేజి 10 సం.). తత్త్వజ్ఞానము, ఆపద, ఈర్ష్య

మొదలైన వానివలన కలుగు ఆత్మావమానమే నిర్వేదము. ఇందు చింత, అశ్రువు, నిశ్శ్వాసము, వైవర్ణ్యము, ఉచ్ఛ్వాసము, దైన్యము అనుభావములు. (2) "దుఃఖేర్ష్యా తత్త్వ బోధాదేర్నిర్వేదో నిష్ఫలత్వధీః తత్ర చింతాశ్రు నిశ్వాసదీనతాః సంభవంతి చ" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రస ప్రక. 270 పేజి 1 సం.). దుఃఖము, ఈర్ష్య, తత్త్వబోధ మొదలైనవాని వలన కలుగు నిష్ఫలమైన బుద్ధి నిర్వేదము. ఇందు చింత, అశ్రువు, నిశ్వాసము. దీనత కలుగును. (3) "తత్త్వజ్ఞానాపదీర్ష్యా దేర్నిర్వేదః స్వావమాననం దైన్యచింతాశ్రునిశ్వాస వైవర్ణ్యోచ్ఛ్వాసితాదికృత్" అని సాహిత్య దర్పణము (సా. ద. III-140 పే. 142 శ్లో.) తత్త్వజ్ఞానము, ఆపద, ఈర్ష్య మొదలైనవానివలన కలుగు స్వావమాననమే నిర్వేదము. దైన్యము, చింత, అశ్రువు, నిశ్వాసము, వైవర్ణ్యము, ఉచ్ఛ్వాసితము మొదలైనవి దీని కార్యములు (అనుభావములు) (4) "నిరుపమ దుఃఖేర్ష్యాదుల। నిరతము జనియించు నరతి నిర్వేదమగున్" అని నరసభూపాలీయము (III-50 పద్యము). (5) "నీచ పురుషేషు ఆక్రోశన, అధిక్షేప, వ్యాధి, తాడన, దారిద్ర్య, ఇష్ట విరహ, పరసంపద్దర్శనాదిభిః ఉత్తమేషుతు అవజ్ఞాదిభిః జనితా విషయ ద్వేషాఖ్యా రోదన దీర్ఘశ్వాస దీనముఖతాదికారిణీ చిత్తవృత్తిర్నిర్వేదః" అని రసగంగాధరము (కా. అం. సం. తృతీయ 342 పేజి 1 సం.). ఆక్రోశనము, అధిక్షేపము, వ్యాధి, తాడనము, దారిద్ర్యము, ఇష్టవిరహము, పర సంపద్దర్శనము మొదలైన (విభావముల) వానివలన నీచులకును; పరతిరస్కారము మొదలైన వానివలన ఉత్తములకును విషయద్వేషమను చిత్తవృత్తి కలుగును. అదియే నిర్వేదము. అది రోదనము, దీర్ఘనిశ్వాసము, దీనముఖత్వము మొదలయినవానిని (అను భావములను) కలిగించును.

ఉదాహరణము :- నరసభూపాలుని దర్శనమునకు నోచుకొనని యొక యువతి యన్న మాటలివి— 'నరసభూపాలుని చూడకున్నచో నాకీ మణి భూషణములు రాళ్లుగా నున్నవి. హారములు సముద్రములో చిందిన చినుకులుగా నున్నవి.' కం 'శిలలు మణిభూషణంబులు। చెలువగు హారములు జలధిఁ జిందిన చినుకుల్ తలిరాకుఁబోఁడి నాకగు సులభదయానిధి నృసింహుఁ జూడకయున్నన్"—(కా. అం. సం. III-51). ఇందు నరసభూపాలుని అదర్శనము (ఇష్టవిరహము) విభావము. దైన్యమనుభావము. విషయ ద్వేషమను చిత్తవృత్తి వీనివలన వ్యక్తమయినది. అదియే నిర్వేదము.

*నీలీరాగము* : (ఒకవిధమైన) పూర్వరాగభేదము. (చూ. పూర్వరాగము). ఈ పూర్వరాగము మూడువిధములు. అందు నీలీరాగమొకటి. (చూ. కుసుంభ, మాంజిష్ఠ).

"నచాతి శోభతే యన్నాపైతి ప్రేమ మనోగతం తన్నీలీరాగ మాఖ్యాంతి" అని సాహిత్యదర్పణము (సా. ద. III-166పే. 196 శ్లో). ఏ ప్రేమ మనోగతముగా నుండి తొలగిపోకయు, పైకి ప్రకాశింపకయు నిలిచి

పోవునో ఆ ప్రేమ నీలీరాగము. సీతారాముల ప్రేమ దీని కుదాహరణము.

**పంచాననావళి** : 'పద్యైశ్చ పంచభిర్యుక్తా ప్రోక్తా పంచాననావళీ' (కా. లం. సం. II-259 పే.) అయిదు పద్యములతో కూడిన కావ్యము పంచాననావళి.

**పక్షము** : చూ. అనుమాన ప్రమాణము.

**పద్య[మయ]కావ్యములు** : శ్రవ్యకావ్యములందొక భేదము. చూ. శ్రవ్యకావ్యము.

'ఛందోబద్ధపదం పద్యం' అని సాహిత్యదర్పణము. (సా. ద. VI పరి. 352 పే.). గాయత్రి మొదలైన ఛందస్సులతో కూర్పబడిన పదములు గలది పద్యము. (పద్యకావ్యము).

(1) ముక్తకము (2) యుగ్మకము (3) సందానితకము (4) కలాపకము (5) కులకము (6) సర్గబంధము (7) కుడబకము (8) కావ్యము (9) ఖండకావ్యము (10) కోశము (11) అతి మనోరమము అని సాహిత్యదర్పణము పద్యకావ్యములను 11 విధములుగా పేర్కొనెను. చూ. ఆయా శీర్షికలు

**పద్ధళి** : చూ. ఉదాహరణకావ్యము. అది నాలుగువిధములు, అందు పద్ధళి యొకటి. మిగిలినవాని వివరములకు చూ. సద్ధళి; విద్ధళి; ఉత్ఫుల్లకము.

సంబుద్ధియు మిగిలిన ఏడు విభక్తులును-మొత్త మెనిమిది విభక్తులతో కూర్పబడిన ఉదాహరణము పద్ధళి. "సంబుద్ధితోఁగూడ సప్తవిభక్తులు పలుక నొప్పారుఁ బద్ధళి" అని అప్పకవి.

**పరికథ** : ఏకం ధర్మాది పురుషార్థ ముద్దిశ్య ప్రకార వైచిత్ర్యేణానంత వృత్తాంత వర్ణన ప్రకారా పరికథా" అని ధ్వన్యాలోక లోచనము (ధ్వ. లో. లోచ III ఉద్ద్యో 324 పే). ధర్మాది పురుషార్థములందొకదాని నుద్దేశించి విచిత్ర ప్రకారములతో అనంతమైన వృంత్తాంతమును వర్ణించినచో పరికథయగును.

"ఏకం ధర్మాది పురుషార్థముద్దిశ్య ప్రకారవైచిత్ర్యేణానంత వృత్తాంత ప్రధానా శూద్రకాదివత్ పరికథా" (భామహ కావ్యాలంకారము భూమిక 31 పేజి) అని హేమచంద్రుడు (కావ్యానుశాసనము) ఇది లోచన లక్షణము ననుసరించినది. ఉదాహరణము : శూద్రకము.

**పర్యాయబంధము**: "అవాంతరక్రియా సమాప్తావపి వసంతవర్ణనాదిరేకవర్ణనీయోద్దేశేన ప్రవృత్తః పర్యాయబంధః" అని ధ్వన్యాలోకలోచనము (ధ్వ. లో. లోచ. III-324 పే) అవాంతర క్రియా సమాప్తి యున్నను వసంత వర్ణనాదులపకవర్ణనీయోద్దేశముచే ప్రవృత్తమైన కావ్యవిశేషము పర్యాయబంధము.

**పాంచాలి** : వివరములకు ముందు చూ. రీతులు. ఇది రీతులందు ఒకటి. (మిగిలినవానిని గురించి చూ. వైదర్భి, గౌడి.). "పాంచాలరీతి ర్వైదర్భీ గౌడీ రీత్యుభయాత్మికా" (అం. ప్రరు. కా. ప్రక. 116 పే.). వైదర్భీరీతియు గౌడీరీతియు కలిసి యేర్పడినది పాంచాలీరీతి. ఆ రెండు రీతుల లక్షణములును దీనియందుండును. ఆ రెండింటి ప్రయోజనమును ఇది సాధించును.

మృదు పదరచన కొంతయు, పరుష పదరచన కొంతయు గల రీతి పాంచాలి యన్న మాట.

ఉదాహరణము :- శా ''ఆరూఢిం దప మాచరించెదవు చంద్రా! యల్లమందాకినీ తీరక్షోణితటిన్ మహానట జటా దీర్ఘాటవీ వాటిలోఁ, బ్రారబ్ధంబగు మేని యంకము హరింపన్ వేడి; యింతేల? నీ కారాధింపఁగ రాదె! యోబయ నృసింహాధ్యక్షు సత్కీర్తులన్ —(నరసభూపాలీయము II ఆ. 84 ప.) —ఈ పద్యమున గాఢబంధమును, కోమల పదావళియు నున్నవి.

ఇది సాత్త్వతీవృత్తికి తగిన శబ్దరీతి. వీర భయానక రసములందిట్టి రీతి శోభించును. చూ. సాత్త్వతి

పాంచాలీరీతియందు ప్రసాదగుణము ఉండును. ''ప్రసిద్ధ పదములను వాడుట ప్రసాదము'' (కావ్యాలంకార సంగ్రహము 529 పుట.)

పాకము : 'పాకము' అర్థధర్మము. "అర్థగంభీరమా పాకః" అని ప్రతాపరుద్రీయము (ప్ర. రు. కావ్యప్రక. 59 పే.) హృదయంగమ మైన అర్థగంభీరమయే పాకము రసాస్వాదనమునందలి విశేషము పాకము. వృత్తి, రీతి, గుణముల సంయోగమువలన ఏర్పడు నూత్న రుచిభేదమే పాకము. (చూ. ద్రాక్షాపాకము, నారికేళపాకము, కదళీపాకము.)

ప్రతాపరుద్రీయమున ద్రాక్షాపాకము నారికేళపాకము ఈ రెండింటికి లక్షణములున్నవి. కదళీపాకము కూడా ప్రసిద్ధమే. మూడువృత్తులు, మూడు రీతులు, మూడు గుణములు కలిసి మూడు పాకము లేర్పడును. కైశికీవృత్తి, వైదర్భీరీతి, మాధుర్యగుణము కలిసి ద్రాక్షాపాకమగును. ఆరభటీవృత్తి, గౌడీరీతి, ఓజోగుణము కలిసి నారికేళ పాకము. సాత్త్వతీ వృత్తి, పాంచాలీరీతి, ప్రసాదగుణము కలిసి కదళీపాకము. (చూ. రీతులు, వృత్తులు.) (గుణముల వివరములకు చూ. అలంకార పరిభాష)

రాజశేఖరుడు నవవిధపాకములున్నవని చెప్పెను. అవి పిచుమంద, బదర, మృద్వీక, వార్తాక, తింత్రిణి, సహకార, క్రముక, త్రాపుష, నారికేళపాకములు (చూ కావ్యమీమాంస V అధ్యాయము).

'పదనివేశ నిష్కంపతాపాకః' (కా. మీ. V-51 పే) పదగుంఫనలోని నిష్కంపత పాకమని ఆచార్యులు. ''ఆగ్రహ పరిగ్రహాదపి పదస్థైర్య పర్యవసాయస్తస్మాత్ పదానాం పరివృత్తి వైముఖ్యం పాకః'' ఇతి వామనీయాః (కా. మీ V అధ్యా) పదముల పరివృత్తివైముఖ్యము పాకమని వామనీయులు. శబ్దపాక వాక్యపాకాది భేదములకు చూ. కావ్యమీమాంస V అధ్యాయము.

పురాణము : ''సర్గము (ప్రపంచోత్పత్తి), ప్రతిసర్గము (బ్రహ్మాదులు సేసెడు నుత్పత్తి) వంశము (దేవాసుర విభేదోత్పత్తి, మన్వంతరము (వేఱువేఱు

మనువుల తరములు), వంశాను చరితము (సూర్యచంద్రవంశముల చరిత్రము) అను అయిదు లక్షణములు గలది పురాణము. —(కా. లం. సం. II-264 పే.)

"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ వంశాను చరితం చైవ పురాణం పంచలక్షణం." (వాయుపురాణము-8-10.)

అష్టాదశపురాణములు :- (1) బ్రహ్మ (2) పాద్మ (3) వైష్ణవ (4) శైవ (5) భాగవత (6) నారదీయ (7) మార్కండేయ (8) ఆగ్నేయ (9) భవిష్యత్ (10) బ్రహ్మ వైవర్త (11) లింగ (12) వారాహ (13) స్కాంద (14) వామన (15) కౌర్మ (16) మాత్స్య (17) గారుడ (18) బ్రహ్మాండ పురాణములు. (ఆప్టే నిఘంటువు).

"పౌరుషేయంతు పురాణం ... తత్ర వేదాఖ్యానోప నిబంధన ప్రాయం పురాణమష్టదశధా యదాహుః । సర్గః ప్రతి సంహారః కల్పో మన్వంతరాణి వంశవిధిః జగతోయత్ర నిబద్ధం తద్విజ్ఞేయం పురాణమితి" (కా. మీ. II-7 పేజి) అని రాజశేఖరుడు. పురాణము పౌరుషేయమైన శాస్త్రము. ఇందు వైదిక కథావర్ణన ముండును. ఇది 18 విధములు. ఈ జగత్తుయొక్క సృష్టి, సంహారము, కల్పము, మన్వంతరము, వంశవిధి —ఈ ఐదింటి వర్ణన గలది పురాణము.

**పూర్వరాగము :** (పూర్వరాగవిప్రలంభము). చూ. శృంగారము; విప్రలంభ శృంగారము; అభిలాష విప్రలంభము.

"స చ పూర్వరాగ మాన ప్రవాస కరుణాత్మకశ్చతుర్థాస్యాత్ । తత్ర శ్రవణాద్దర్శనాద్వాపి మిథః సంరూఢరాగయోః । దశావిశేషో యోఽప్రాప్తౌ పూర్వరాగః స ఉచ్యతే శ్రవణంతు భవేత్తత్ర దూతవందీ సఖీముఖాత్ । ఇంద్రజాలేచ చిత్రే చ సాక్షాత్ స్వప్నేచ దర్శనమ్ (సా. ద. III-162, 163 పేజీలు 187, 188, 189 శ్లో). విప్రలంభము నాలుగు విధములు (1) పూర్వరాగము (2) మానము (3) ప్రవాసము (4) కరుణము. నాయికా నాయకులు ఒకరినొకరు శ్రవణదర్శనములలో నొకదానివలన బద్ధానురాగులై ఒకరినొకరు పొందలేకపోయిన దశకే పూర్వరాగమని పేరు. ఇందు శ్రవణము దూతవందీ సఖి ముఖముగా జరుగును. దర్శనము ఇంద్రజాలమందును చిత్రమందును వాస్తవముగాను స్వప్నమునందును జరుగును. ఈ పూర్వరాగమునందే మన్మథావస్థలు సంభవించును (చూ. మన్మథావస్థలు).

"తత్రచ ఆదౌ వాచ్యః స్త్రియారాగః పుంసః పశ్చాత్ తదింగితైః । నీలీకుసుంభం మంజిష్ఠా పూర్వరాగోఽపి చ త్రిధా (సా. ద. III-166 పేజి 194 & 195 శ్లో). ఈ పూర్వరాగము నాయికా నాయకులలో ఎవరికి ముందు కలిగినట్లు వర్ణించవలెను ? ముందు స్త్రీకే రాగోదయమైనట్లును, పిదప పురుషుడు ఆమె యింగితమును గ్రహించినట్లును వర్ణింపదగును. ఈ పూర్వరాగము మూడు విధములు. (2) నీలి (2)కుసుంభము (3) మంజిష్ఠ.

*ప్రగల్భత* : ఇది అయత్నజమైన అనుభావము (చూ. అనుభావము. చూ. అయత్నజములు.)

ప్రగల్భతకు నిర్వచనములు :- (1) ''నిస్సాధ్వసత్వం ప్రాగల్భ్యం'' అని దశరూపకము (ధ. ద. రూ. రెండవప్రకాశము-28 పేజి) భయము లేకుండుట ప్రాగల్భ్యము. ఇరవై అలంకారములలో (చూ. అలంకారములు) నిది యొకటి. (2) ''నిస్సాధ్వసత్వం ప్రగల్భ్యమ్'' అని సాహిత్యదర్పణము (సా. ద. 124 పేజి. (చూ అలంకారములు).

ప్రగల్భతకు సాహిత్యదర్పణమునుండి ఉదాహరణము :- 'స్త్రీలు తమభర్తలను తమకు లొంగినవారినిగా చేసుకొను పద్ధతి చిత్రమైనది. కౌగిలించుకొనబడి కౌగిలింతలచేతను, చుంబితలై చుంబనములచేతను, దష్టలై దంశనములచేతను వారిని లొంగదీసికొందురు.' శ్లో॥ సమాశ్లిష్టాః సమాశ్లేషైశ్చుంబితా శ్చుంబనై రపి । దష్టాశ్చ దంశనైః కాంతం దాసీకుర్వంతి యోషితః'' (ఆం. సా. ద. III-56 పేజి) దీనికి శ్రీ సన్నిధానంవారి తర్జుమా :-

ఆ వె. కౌఁగిలింపఁదమ్ముఁ గౌఁగిలించుచు బిగ్గ
ముద్దులాడఁదమ్మ ముద్దుగొనుచు
మోవిఁ గఱవరేగి మోవినిం గఱచుచు
జెలులు ప్రియునిదాసుఁ జేసికొంద్రు

—కా. లం. సం. III-390 పేజి.

*ప్రణయమానము* : వివరములకు ముందు చూ. విప్రలంభము. మానవిప్రలంభము (చూ. మానము) యొక్క రెండు భేదములలో నిది మొదటిది. రెండవది ఈర్ష్యామానము.

ద్వయోః ప్రణయమానః స్యాత్ ప్రమోదే సుమహత్యపి । ''ప్రేమ్ణః కుటిలగామిత్వాత్ కోపోయః కారణం వినా'' అని సాహిత్యదర్పణము (సా. ద. III-167 పేజి. 198 & 199 శ్లో.). ప్రమోదాతిశయవేళకూడా కారణము లేకుండగనే ప్రణయ కౌటిల్యమువలన కలిగిన కోపము ప్రణయమానము. దీనినే ప్రణయకోపమందురు. (ద్వయోరితి నాయకస్య నాయికాయాశ్చ ఉభయోశ్చ ప్రణయమానోవర్ణనీయః). ఇది నాయికానాయకు లిరువురకును కలిగినట్లు వర్ణింపవచ్చును.

నాయకుని ప్రణయకోపమున కుదాహరణము :- ఒక నాయకుడు ప్రణయకోపమును వహింపగా నాయిక యతని ననునయించుచున్నదట :- ఆ॥ వె ''కన్నుదోయి మూసి కపట నిద్రను బోవు । సొగసుకాఁడ! నాకుఁ జోటునిమ్మ । పులకిరించె నాదు ముద్దులచే నీదు । చెక్కులింక నాలసింప లెమ్మ'' —సాహిత్యదర్పణ శ్లోకమునకు శ్రీ సన్నిధానంవారి యనువాదము. కా. లం. సం. III-403 పేజి). శ్లో॥ అలీక ప్రసుప్తక నిమీలితాక్ష దేహి సుభగ మహ్యామవకాశం । గండ పరిచుంబన పులకితాంగ, న పునశ్చిర

యిష్యామి (ఆం. సా. ద. III-85 పేజి).

ప్రతిభ : కావ్యహేతువునందు ప్రధానాంశము. చూ కావ్యహేతువు.

ప్రజ్ఞ, శక్తి, ప్రతిభానము—పర్యాయపదములు. చూ. కారయిత్రి, భావయిత్రి.

'కావ్యంతు జాయతే జాతు కస్యచిత్ ప్రతిభావతః' అని భామహుడు. (కా. స్వ. 23 పేజి) ఒకానొక ప్రతిభావంతుని వలన నొకానొకపుడే కావ్యము జనించుచుండును. ప్రతిభలేనివాడు కావ్యము రచించలేడని అభిప్రాయము).

'నైసర్గికీ చ ప్రతిభా' అని దండి. (కా. స్వ. 35 పే). ప్రతిభ యనునది సహజసిద్ధము.

'మనసి సదా సుసమాధిని విస్ఫురణ మనేకాభిధేయస్య అక్లిష్టాని పదాని చ విభాంతి యస్యా మసౌశక్తిః' అని రుద్రటుడు. (కా. స్వ. 38 పే.). అనేకాభిధేయార్థముల విస్ఫూర్తిని సమాధిగతమగు మనస్సునందు సదా కలిగించునదియేది? అక్లిష్టములగు పదములను ఆ మనస్సునందు ప్రకాశింప జేయునదియేది? అది శక్తి. (ప్రతిభ).

'అవ్యుత్పత్తి కృతోదోషః శక్త్యా సంవ్రియతే కవేః యస్త్వశక్తి కృతస్తస్య సఝటిత్యవభాసతే' (కా. మీ. టీక 30 పే). అని ఆనందవర్ధనుడు. వ్యుత్పత్తిలేని కవి చేసిన దోషము శక్తిచేత కప్పువడిపోవును. కాని శక్తిలేని కవి చేసిన దోషము వెంటనే బయటపడి వెక్కిరించును.

"సరస్వతీ స్వాదు తదర్థవస్తు నిష్యందమానా మహతాం కవీనాం । అలోకసామాన్య మభివ్యనక్తి పరిస్ఫురంతం ప్రతిభావిశేషమ్ । తత్ వస్తుతత్త్వం నిష్యందమానా మహతాం కవీనాం భారతీ అలోకసామాన్యం ప్రతిభావిశేషం పరిస్ఫురంత మభివ్యనక్తి. యేనాస్మిన్నతి విచిత్ర కవి పరంపరా వాహిని సంసారే కాళిదాస ప్రభృతయః ద్విత్రాః పంచషావా మహాకవయ ఇతి గణ్యంతే" అనియు ఆనందవర్ధనుడు. (ధ్వన్యాలోకః చౌఖాంబా ప్రచురణ 92-93 పేజీలు). ఆస్వాద్యమైన వస్తుతత్త్వమును నిష్యందింపజేయునదియై మహాకవులకు అలోకసామాన్యమైన ప్రతిభావిశేషము పరిస్ఫురించుదానినిగా సరస్వతి అభివ్యక్తీకరించును. కనుకనే అతి విచిత్రకవి పరంపరావాహినియగు కావ్య సంసారమున కాళిదాస ప్రభృతులు ఇద్దరు ముగ్గురుగాని, ఐదారుగురుగాని మహాకవులని గణింపబడుచున్నారు. (చూ. ఆం. ధ్వ. లో. ప్రథమ 184 పేజి).

'యా శబ్దగ్రామమర్థ సార్థ మలంకార తంత్రముక్తిమార్గ మన్యదపి తథా విధమధిహృదయం ప్రతిభాసయతి సా ప్రతిభా' అని రాజశేఖరుడు (కా. మీ. IV-30 పేజి). శబ్దసమూహమును, అర్థసార్థమును, అలంకార తంత్రమును, ఉక్తిమార్గమును, హృదయమున భాసింపజేయునదేది? అదియే ప్రతిభ.'' అప్రతిభస్య పదార్థసార్థః పరోక్షఇవ, ప్రతిభావతః పునరపశ్యతోऽపి

ప్రత్యక్ష ఇవ । యతో మేధావిరుద్ర కుమారదాసాదయో జాత్యంధాః కవయః శ్రూయంతే" అనియు రాజశేఖరుడు. (కా. మీ. IV-30 పే.). ప్రతిభలేనివానికి పదార్థసార్థము ప్రత్యక్షము కాజాలదు. ప్రతిభావంతునకు పరోక్షమందున్నదికూడా ప్రత్యక్షముగా గోచరించును. జాత్యంధులైన మేధావిరుద్ర, కుమారదాసాదులు కవులగుటకు ప్రతిభయే కారణము.

'ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభామతా' అని తౌతభట్టు (కా. స్వ. 86 పేజి). నవనవోన్మేషశాలినియగు ప్రజ్ఞయే ప్రతిభ.

ప్రతిభా అపూర్వవస్తు నిర్మాణక్షమా ప్రజ్ఞా; తస్యా 'విశేషో' రసావేశ వైశద్య సౌందర్యం కావ్యనిర్మాణ క్షమత్వమ్ (ధ్వన్యాలోకః చౌఖాంబా ప్రచురణ 92 పేజి లోచనము) అని అభినవగుప్తుడు. అపూర్వమైన వస్తువులను నిర్మించుటయందు నైపుణ్యముగల ప్రజ్ఞయే ప్రతిభ. దాని విశేషమేమి? రసావేశముచేత కలుగు వైశద్యముచేత సుందరమగు కావ్యమును నిర్మించుటయందలి సామర్థ్యము. "వర్ణనీయవస్తునిష్ఠః ప్రజ్ఞా విశేషః ప్రతిభానమ్" (కా. స్వ. 105 పేజి) అనియు అభినవగుప్తుడు. వర్ణింపదగిన వస్తువునందు నిష్ఠగల ప్రజ్ఞా విశేషమే ప్రతిభానము.

'శక్తిః కవిత్వబీజభూతః సంస్కారవిశేషః యాంవినా కావ్యం న ప్రసరేత్, ప్రసృతంవా అపహసనీయంస్యాత్' (కావ్యప్రకాశః వావిళ్లవారి ప్రచురణ (1891, 13 పేజి) అని మమ్మటుడు. కవిత్వముయొక్క బీజభూతమైన సంస్కార విశేషమే శక్తి. ఇది లేనిచో యేమగును? కావ్యముదయించనే ఉదయింపదు. ఒకవేళ కావ్యసృష్టి జరిగినను అపహాసము పాలగును.

ప్రతిభాస్యహేతుః । ప్రతిభా నవనవోల్లేఖశాలినీ ప్రజ్ఞా । అస్యకావ్యస్యేదం ప్రధానం కారణమ్ వ్యుత్పత్త్యభ్యాసౌతు ప్రతిభాయా ఏవ సంస్కారకా ఇతి వక్ష్యతే. సాచ సహజౌపాధికీ చేతిద్విధా (కా. స్వ. 146 పేజి). అని హేమచంద్రుడు. కావ్యహేతువు ప్రతిభ. అది నవనవోల్లేఖశాలినియగు ప్రజ్ఞ. ఇది కావ్యరచనకు ప్రధానకారణము. వ్యుత్పత్తి, అభ్యాసము ప్రతిభకు సంస్కారమునిచ్చును. ప్రతిభ సహజ, ఔపాధికీ అని రెండు విధములు.

'కావ్యస్యోపాదేయత్వ మగ్నిపురాణేఽత్యుక్తం నరత్వం దుర్లభం లోకే విద్యా తత్రసుదుర్లభా కవిత్వం దుర్లభం తత్రశక్తిస్తత్ర సుదుర్లభమ్' అని విశ్వనాథుడు. (సా. ద. 5 పే.). శక్తి సుదుర్లభము.

"తస్యచ కారణం కేవలా కవిగతా ప్రతిభా. సాచ కావ్యఘటనానుకూల శబ్దార్థోపస్థితిః తద్గతంచ ప్రతిభాత్వం కావ్యకారణ తావచ్ఛేదకతయా సిద్ధో జాతివిశేష ఉపాధిరూపం వా అఖండమ్ తస్యాశ్చ హేతుః క్వచిద్దేవతా మహాపురుష ప్రసాదాదిజన్య మదృష్టమ్ క్వచిచ్చ విలక్షణ వ్యుత్పత్తి కావ్యకారణాభ్యాసౌ । న తుత్రయమేవ । బాలాదేస్తౌవినాపి కేవలాన్మహాపురుష ప్రసాదాదపి ప్రతిభోత్పత్తేః" అని జగన్నాథుడు

(ఆం. ర. గం. 42 పేజీ). "ఆ కావ్యమునకుఁ గారణము కవియందుండు ప్రతిభయొక్కటియే. కావ్యములఁ గూర్చుట కనుకూలములగు శబ్దములయు, నర్థములయు నుపస్థితియేయది. ఆ యుపస్థితి ప్రతిభయగుట యనఁగానేమి? కావ్యమునకిది కారణమని నిర్ణయించుటకుఁ దగినట్టిధర్మముండుటయే పై నిర్ణయమున సిద్ధించిన యా ప్రతిభాత్వమను ధర్మమొక విశిష్టమగు జాతి. అధవా అఖండమగునుపాధి. ఆ ప్రతిభయొక్క యెడ దేవతలు, మహాపురుషులు మొదలగువారి యనుగ్రహమువంటివానివలన నదృష్టమేర్పడి దాని వలన జనించును. మరియొకచోటఁ గ్రొంగ్రొత్తరకపు వ్యుత్పత్తియుఁ గావ్యరచన నలవరచుకొనుటయు, నీ రెండుగూడి ప్రతిభను గల్పించుటయు జరుగును. అంతేకాని, యీ మూడును (ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు) గలసి యొకే కారణ మనరాదు. విలక్షణమగు వ్యుత్పత్తియు, నలవాటును లేకున్నఁగూడఁ బిల్లలు మొదలయినవారియందు మహాపురుల యనుగ్రహము వనే ప్రతిభ యుదయించినది. (శ్రీ వేదాలవారి యనువాదము).

**ప్రలాపము :** శృంగారావస్థలందొకటి (చూ. శృంగారావస్థలు).

నిర్వచనములు :- (1) "ప్రలాపః ప్రియసంశ్లిష్ట గుణాలాప ఉదాహృతః" అని ప్రతాపరుద్రీయము (ప్ర. రు. రసప్రక. 230 పే. 89సం.) ప్రియుని గుణములనుగూర్చి ఆలాపించుటే ప్రలాపము. (2) "అలక్ష్య వాక్ప్రలాపఃస్యాచ్చేతసో భ్రమణాద్ భృశమ్" అని సాహిత్యదర్పణము (సా. ద. III-163 పేజి 192 శ్లో.) "మనస్సు మిక్కిలి సుడివడుటచేత విషయములేనిమాట ప్రలాపము" (వేదంవారి తెలుగుసేత). (ఆం. సా. ద. III-82 పేజి).

ఉదాహరణము :- శ్లో "తథానిపుణస్తథా మధురస్తథా సుభగస్తథైవ చ సౌమ్యస్వభావః । ఏకో రుద్రనృప ఏవేతి గోష్ఠీ ప్రౌఢమహిళానాం" (ఆం.ప్ర.రు. రసప్రక. 309పే.). దీనికి శ్రీజమ్మలమడక మాధవరామశర్మగారి వివరణము చూడుడు :- "అట్లా నిపుణుడు అట్లామధురుడు ఆ విధముగా సుభగుడూ అట్టి సౌమ్య స్వభావుడూ అయినవాడు ఒక రుద్రనృపుడె అని ప్రౌఢమహిళలగోష్ఠి. దీనిలో నిపుణత్వాది గుణములు ఉన్నందువలన ప్రతాపరుద్రుడె మనలకు అభిగమ్యుడు అని ప్రౌఢాంగనలు ప్రసంగము చేస్తున్నారు. అందువలన ప్రలాపము (ఆం. ప్ర. రు. రసప్రక. 309 పే.).

**ప్రళయము :** వివరములకు ముందు చూ. సాత్త్వికభావము. సాత్త్వికభావము లెనిమిదింటిలో నిదియొకటి (చూ. సాత్త్వికభావము). ఇది అనుభావము (చూ. అనుభావము).

ప్రళయమునకు నిర్వచనములు :- (1) "ప్రళయః సుఖదుఃఖాద్యైర్గాఢమింద్రియమూర్ఛనం" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రస ప్రకరణము 266 పేజి) సుఖము, దుఃఖము మొదలైన భావములచే ఇంద్రియములు గాఢముగా మూర్ఛనొందుట ప్రళయము. (2) "ప్రళయః సుఖ

దుఃఖాభ్యాం చేష్టాజ్ఞాన నిరాకృతిః" అని సాహిత్యదర్పణము (కా.లం.సం. 337 పేజి). సుఖదుఃఖములచే చేష్టాజ్ఞానములు కోల్పోవుట ప్రళయము. (3) "అవశత్వమగుం బ్రళయంబు" అని నరసభూపాలీయము. (III-37 పద్యము).

ప్రళయమునకు నరసభూపాలీయమునందలి యుదాహరణము:- సరస్వతీప్రియుడగు నరసభూపాలుడు నేడు వియోగమువలన తెల్లబడిపోయిన ఈ యువతిని చూచి, సరస్వతియే యనుకొని, చిత్తమును హరించెను కాబోలు ! అందువల్లనే ఈమె అచేతనత్వము వహించెను. ఉ "ఇత్తటి నీ తలోదరివహించె నచేతనవృత్తి శారదా। చిత్తముఁజూఱగొన్న నరసింహుఁడు నేడు వియోగ పాండువౌ గుత్తపుగుబ్బలాఁడి పలుకుంజవరాలి వలెం దెలంగగా। నిత్తరళాక్షి చిత్తము నహీనరసోన్నతిఁ జూఱవెట్టెనో" —(కా. లం. స. III-40). ఈ అచేతనత్వమే ప్రళయము, నరసభూపాలునియందు రక్తయగుటచే నామెకు సుఖము కలిగినది. ఆ సుఖమువలన చేష్టా జ్ఞాననిరాకృతి కలిగెను.

*ప్రవహ్లిక :* "ప్రధానమధికృత్య యత్ర ద్వయోర్వివాదః సోఽర్థప్రాకృత రచితా చేటకాదివత్ ప్రవహ్లికా" (భామహకావ్యాలంకార భూమిక 31 పే.) అని హేమచంద్రుడు (కావ్యానుశాసనము). ప్రధానపాత్ర నుద్దేశించి రెండు పాత్రల వివాదము అర్థభాగము ప్రాకృత భాషా రచితమైన కావ్య విశేషము ప్రవహ్లిక. ఉదాహరణము : చేటకము.

*ప్రవాసవిప్రలంభము :* చూ. విప్రలంభ శృంగారము.

"విప్రలంభః పునరభిలాషేర్ష్యా విరహప్రవాస హేతుకత్వేన చతుర్విధః...యూనోర్దేశాంతర వృత్తిత్వం ప్రవాసః" అని ప్రతాపరుద్రీయము (ప్ర. రు. రసప్రక. 236 పే.) విప్రలంభము నాలుగు విధములు. (1) అభిలాషము (2) ఈర్ష్య (3) విరహము (4) ప్రవాసము...నాయికా నాయకుల దేశాంతర వృత్తిత్వమే ప్రవాస విప్రలంభము.

సచ పూర్వరాగ మాన ప్రవాస కరుణాత్మకశ్చతుర్థాస్యాత్ (సా. ద. III-162 పే.). విప్రలంభము నాలుగు విధములు (1) పూర్వరాగము (2) మానము (3) ప్రవాసము (4) కరుణము అని సాహిత్యదర్పణము. "ప్రవాసోభిన్నదేశిత్వం కార్యాచ్ఛాపాచ్చ సంభ్రమాత్ తత్రాంగ చేల మాలిన్యమేకవేణీధరం శిరః నిశ్వాసోచ్ఛ్వాస రుదిత భూమిపాతాది జాయతే" (సా. ద. III-170 పే. 204, 205 శ్లో.) అని సాహిత్యదర్పణము. నాయికా నాయకులకు భిన్నదేశములందు నివాసము తటస్థించినచో ఆ యవస్థకు ప్రవాసవిప్రలంభమని పేరు. ఈ దూరనివాసము కార్యవిశేషముచే గాని శాపముచేగాని సంభ్రమముచేగానికలుగును. ఇందు నాయికకు దేహమాలిన్యము, వస్త్రమాలిన్యము, ఏకవేణీధారణము, నిశ్వాసము, ఉచ్ఛ్వాసము, రుదితము, నేలపై పడుట మొదలగు అనుభావములు కలుగును. "అంగేష్వసౌష్ఠవం తాపః పాండుతా కృశతారుచిః అధృతిః స్యాదనాలంబస్తన్మయోన్మాద

మూర్ఛనా॥ । మృతిశ్చేతి క్రమాత్ జ్ఞేయా దశ (?) స్మరదశా ఇహా'' (సా. ద. III-170 పే. 205 & 206 శ్లో.). ఇందు పదునొకండు మన్మథావస్థలుకూడా కలుగును. (1) అవయవముల అసౌష్ఠవము (2) తాపము (3) పాండుత (4) కృశత (5) అరుచి (6) అధృతి (7) అనాలంబము (8) తన్మయత (9) ఉన్మాదము (10) మూర్ఛ (11) మృతి.

''భావీభవద్భూత ఇతి త్రిధాస్యాత్తత కార్యజః । కార్యస్య బుద్ధిపూర్వకత్వాత్ త్రైవిధ్యమ్'' (సా. ద. III-170 పే. 208 శ్లో.). కార్యము బుద్ధిపూర్వకము కాబట్టి ఈ ప్రవాసము (1) భావివిప్రలంభము (2) భవద్విప్రలంభము (వర్తమాన) (3) భూత విప్రలంభము అని మూడు విధములు.

విప్రలంభము ముందు రాబోవుచున్నదని యూహించి దుఃఖించుట భావి విప్రలంభము. వర్తమానమున సంభవించినది భవద్విప్రలంభము. గతమున సంభవించినది భూతవిప్రలంభము.

''ప్రవాసమనఁగొన్ని యామడల దూరముగల దేశమని భ్రమింపరాదు. స్వేచ్ఛగాఁ గలిసికొనుటకవకాశములేని ప్రతిబంధక భూయిష్ఠమగు దేశమని యర్థము.'' అని సన్నిధానంవారు (కా. లం. సం. III-407 పేజి).

ప్రవాసవిప్రలంభమునకు నరసభూపాలీయము నందలి యుదాహరణము :- నరసభూపాలుని శత్రువుయొక్క భార్య పొందిన ప్రవాసవిప్రలంభము— చ॥ చిరయశ! యోబభూవర! నృసింహ! భవద్రిపుకాంత కాననాం । తరమున కేగి యందు నిజనాథునిఁ గానక మన్మథార్తయై । వరుని సరోజపత్రమున వ్రాయునెడం గరముల్ సెమర్పఁగా నరయ నిజాంకకంబె పగయయ్యెనటంచుఁ దలంచు దైవమున్'' (III-140 ప.)

భావివిప్రలంభమున కుదాహరణము :- మ చనుదున్ సుందరి! పాంథుడా! చనుము! నీ స్వాంతంబునన్ శోకముం । గననాఁ బోకుము! శోకమెందుల? కికిం గన్నీరు రాత్రేల? వే । చన నైతంచునె; తొందరేల ననుఁబుచ్చన్ నీకు? నీ తోడఁ బో వనె వాంఛించుచు నిట్లు వేగపడు నా ప్రాణంబు లత్యంతమున్.'' —(కా. లం. సం. III-408 పేజి.) (శ్రీ) సన్నిధానంవారు సా. ద. శ్లోకమునకు చేసిన అనువాదము.(సా.ద. III-171 పే.). భావియందు కలుగనున్న విప్రలంభమును గూర్చి నాయిక పడుచున్న దుఃఖమిందు వ్యక్తమైనది.

తక్కిన యుదాహరణములకు చూ. కా. లం. సం. III-408, 409 పేజీలు.

**ప్రేయోరసము** : రసములనంతములనియు, నందు ప్రేయోరసమొకటి యనియు నొక వాదమున్నది.

రుద్రటుడు 'దశమోరసః ప్రేయాన్' అని తెలిపెను. ప్రేయోరసము పదవరసమని అతని మతము. (కా. లం. సం. III-304 పే.).

'అన్యోన్యం ప్రతి సుహృదోర్వ్యవహారోఽయం మత స్త్ర' అని రు దటుకు. స్నేహితుల పరస్పరవ్యవహారమే ప్రేయోరసమనిఅభి ప్రాయము. దీనికి 'స్నేహము' స్థాయిభావము (కా. లం. సం III-304 పేజి).

*బిబ్బోకము :* ఇది స్వభావజమైన అలంకారములలో నొకటి (చూ. స్వభావజములు; చూ. అలంకారములు.) ఒక అనుభావము (చూ. అనుభావము). ఒక శృంగారచేష్ట (చూ. శృంగారచేష్ట).

బిబ్బోకమునకు నిర్వచనములు :- (1) "గర్వాభిమానాదిష్టేఽపి బిబ్బోకోఽనాదరక్రియా" అని దశరూపకము (ధ. ద. రూ. రెండవప్రకాశము 29 పేజి). గర్వమువలన, అభిమానమువలన ఇష్టవస్తువునందుకూడా నిరాదరమును నటించుట బిబ్బోకము. 20 అలంకారములందిది యొకటి. (చూ. అలంకారములు). (2) "మనాక్ ప్రియకథాలాపే బిబ్బోకోఽనాదర క్రియా" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రస. ప్రక. 302 పేజి). తన ప్రియుని కథలు వినుట తటస్థించినప్పుడు స్వల్పముగా అనాదరమును ప్రదర్శించుట బిబ్బోకము. 18 శృంగారచేష్టలందొకటి. (3) "బిబ్బోకస్త్వతిగర్వేణ వస్తు నీష్టేఽప్యనాదరః" అని సాహిత్యదర్పణము (కా. లం. సం. 383 పేజి). అతి గర్వముచే ఇష్టవస్తువునందుకూడా అనాదరము చూపుట బిబ్బోకము. 18 స్వభావజాలంకారములందొకటి. (4) "వరునికథ యందనాదరమరయఁగ బిబ్బోకమయ్యె" అని నరసభూపాలీయము. III-114 పద్యము.

ఉదాహరణము :- 'ప్రియుడు తమదగ్గరకురాగా తప్పుల నెన్నుచుందురు; ప్రియునకు ప్రాణమర్పింతురు గాని అతనిని చక్కగా చూడరు; తమకు ఇష్టమైన వస్తువులనుకూడా వలదని పల్కుదురు. స్త్రీలిట్టి విలక్షణ ప్రకృతి గల్గియుందురు. అట్టి స్త్రీలు నీకు ప్రసన్నులగుదురుగాక !

చం "ప్రియుఁడు సతంబుఁ దమ్మనుసరించినఁ దప్పులు పట్టుచుంద్రు; నె ।
మ్మెయినిడ నెంతుగాని ప్రియుమీఁద నిగుడ్చరు నిండుచూడ్కి నె ।
మ్మెయినిఁ బొనర్తురిష్ట నిజ సమీహితమందు నిషేధ; మీ జగత్ ౹ యని
విలక్షణప్రకృతిఁ దాల్చిన వామలు నాకుఁ (?) గూర్చుతన్" —కా. లం. సం. III-(సాహిత్యదర్పణమందలి శ్లోకమునకు సన్నిధానంవారి తర్జుమా). 384 పేజి. 'ఇట గర్వముచేఁ బ్రియునియందనాదరముఁ జూపుటగలదు.'

శ్లో॥ యాసాం సత్యపి సద్గుణానుసరణే దోషానువృత్తిః పరా
యాః ప్రాణాన్వర మర్పయంతి న పునః సంపూర్ణదృష్టిం ప్రియే
అత్యంతాభిమతేఽపి వస్తుని విధిర్యాసాం నిషేధాత్మక
స్తాస్తై లోక్యవిలక్షణ ప్రకృతయో వామాః ప్రసీదన్తు తే.

—(ఆం. సా. ద. తృతీయ. 58 పేజి 140 సంఖ్య.)

*బిరుదావళి । బిరుదము :* క్షుద్రప్రబంధ భేదమని ప్రతాపరుద్రీయము. చూ. క్షుద్రప్రబంధములు. "వర్ణ్యమానాంక బిరుదవర్ణన ప్రచురోజ్జ్వలా । వాక్యా

డంబర సంయుక్తా సా మతా బిరుదావళీ'' అని ప్రతాపరుద్రీయము. (ప్ర. రు. కావ్యప్రక. 84 పే.) ఒకరాజును వర్ణించునపుడు అతని బిరుదములను వాక్యాడంబరయుతముగా వర్ణించినచో అది బిరుదావళి.

గద్యపద్యమయ కావ్యభేదమని సాహిత్యదర్పణము. చూ. గద్యపద్య కావ్యములు ''గద్యపద్యమయీ రాజస్తుతిర్బిరుద ముచ్యతే'' అని సాహిత్య దర్పణము. (సా. ద. VI-336 శ్లో.) గద్య పద్యమయమయిన రాజస్తుతికి బిరుదమని పేరు. ఉదాహరణము :- బిరుదమణిమాల.

అప్పకవీయమునందలి బిరుదావళీ లక్షణమునకు చూ. కా. లం. సం. II-257 పేజి)

***బీభత్సరసము :*** జుగుప్స స్థాయిభావముగా గల రసము. ఇది నవరసములందొకటి చూ. నవరసములు. చూ. జుగుప్స).

బీభత్సరసస్వరూపమును సాహిత్యదర్పణమిట్లు నిరూపించెను. (సా. ద. III-182 పే. 239-241 శ్లో.) స్థాయిభావము జుగుప్స. వర్ణము నీల వర్ణము. మహాకాలుడు అధిదేవత. దుర్గంధము, రక్తము, మాంసము, క్రొవ్వు మొదలయినవి ఆలంబనవిభావములు. కృమిపాతము మొదలయినవి ఉద్దీపన విభావములు. ఉమ్మివేయుట, పెడమొగము పెట్టుట, కనులు మూసి కొనుట మొదలయినవి అనుభావములు. మోహము, అపస్మారము, మరణము మొదలైనవి వ్యభిచారిభావములు.

ఉదాహరణము :— కం విఱిగిన కాళులఁ బగిలిన శిరములఁ దెగిపడిన యట్టి చేతుల, బహుధా। తరిగిన యెడళ్లనా సం గరభువి సూనాంగ ణంబు కరణిం బొలిచెన్' —విఱిగిన కాళులు, పగిలిన శిరములు, దెగిన చేతులు, తరిగిన యొడళ్లును గల సమరాంగణ మాలంబన విభావము. ఉద్దీపన విభావములచటి కృములు; నిష్ఠీవనాద్యనుభావము లాక్షే ప్యములు. దీనిచే బీభత్సరసము పుష్టమై రసమయ్యెను. (కా. లం. సం. III-442 పే.).

***బృహత్కథ :*** ''లంభాంకితాద్భుతార్థా నరనాహనదత్తాది చరితవత్ బృహ త్కథా'' (భామహకావ్యాలంకారభూమిక 31 పే). అని హేమచందుడు (కావ్యానుశాసనము). లంభాంకితము, అద్భుతార్థ యుక్తమునగు కావ్యము బృహత్కథ. ఉదాహరణము : నరవాహనదత్త చరిత్రము.

***బోద్ధవ్యుడు :*** ఎవనికి బోధించుటకొరకు వక్త వాక్యములను ప్రయోగించునో అతడే బోద్ధవ్యుడు. ''బోద్ధవ్యః పతిపాద్యః'' (కా. ప్ర. III ఉల్లాసము). బోద్ధవ్యుడనగా ప్రతిపాద్యుడు. బోద్ధవ్యుని వలన అర్థవ్యంజనా వైలక్షణ్యము సుగమమగును.

***భక్తిరసము :*** భక్తిని ప్రతిపాదించిన వారిద్దరు. రూపగోస్వామి; మధుసూదన సరస్వతి.

(1) శ్రీకృష్ణ గోపికా విషయమగు శృంగారమే భక్తియనియు చిత్తద్రవము దాని స్థాయిభావమనియు రూపగోస్వామి మతము.

(2) భక్తిరసమునకు భగవంతుడాలంబన మనియు, భగవత్కథలే ఉద్దీపనములనియు, భగవదాకార చిత్తవృత్తియే స్థాయిభావమనియు నేత్రాది వికారములను భావములనియు నిర్వేద శంకాహర్షాదులు వ్యభిచారులనియు మధుసూదన సరస్వతి మతము. భక్తి రసము గాదనియు భావమనియు భరత అభినవగుప్త మమ్మటాదుల మతము. (చూ. కా. అం. సం. III-306 పే.).

**భయము :** వివరములకు, ముందు చూ. స్థాయిభావము. అలంకారశాస్త్రములో భయానక రసమునకు స్థాయిభావము భయము.

భయమునకు నిర్వచనములు :- (1) "రౌద్ర సందర్శనాదిభి రనర్థా శంకనం భయమ్" అని ప్రతాపరుద్రీయము (రసప్రకరణము.) రౌద్రమైన రూపమును చూచినప్పుడును, రౌద్రమయిన శబ్దమును వినినప్పుడును ఏదైన అనర్థము సంభవించునేమో అని శంకించుటయే భయము. (2) "రౌద్ర శక్త్యాతు జనితం చిత్త వైక్లబ్యదం భయమ్" అని సాహిత్యదర్పణము (తృతీయపరిచ్ఛేదము). రౌద్రమైన శక్తిచేత పుట్టినది, చిత్తవైక్లబ్యమును కలిగించునది భయము. (3) "వ్యాఘ్రాది దర్శనాది జన్మా పరమానర్థ విషయకో వైక్లబ్యాఖ్యశ్చిత్తవృత్తి విశేషః భయమ్" అని రసగంగాధరము. పెద్దపులి మొదలగువానిని చూచుట మొదలైన సంఘటనలవలన పుట్టిన పెద్ద కీడునకు దారితీయు వైక్లబ్యమను చిత్తవృత్తి విశేషమే భయము పెద్దపులి కనిపించగనే అది మ్రింగివేయునేమోఅను జడుపు కలుగును. అదియే భయము. ఇట్లు మరణశంక కల్గినప్పుడే స్థాయిభావము. మరణాదిభిన్నమైన అనర్థమును గూర్చిన శంకయయినచో అది 'త్రాసము' అనెడి సంచారి భావమే అగును. (4) "క్రూరాకారముఁ జూచిన । నారయ నే జనుని హృదయమందు ననర్థాం । కూరా శంకనమగు నది । ధారుణిలో భయమనంగఁదగు" అని నరసభూపాలీయ లక్షణము (తృతీ యాశ్వాసము -17 ప.).

'భయము'నకు నరసభూపాలీయమునందలి యుదాహరణము :- నరసభూపాలుని శత్రువొకడు అరణ్యములు పట్టిపోయి, ఒక గుహలో నిద్రించెను. అప్పుడతనికొక స్వప్నమువచ్చెను. ఆ కలలో అతనికి యుద్ధము ప్రత్యక్షమయ్యెను. వెంటనే అతడు లేచి పరుగిడబోయెను. కాని అతని భార్య అతనిని వారించి యుద్ధము కాదుకాదని చెప్పెను. కాని అతనికెదురుగా వేటకాండ్రు విల్లమ్ములు ధరించి కనిపించుచుండిరి. ఏనుగులు తిరుగుచుండెను. అందువలన అతని యుద్ధ భ్రమ పోలేదు. అందుచే అతడు పరుగెత్తసాగెను. — ఇందాతడు నిద్రనుండి లేచి పరుగెత్తుట, భార్య మాటలు నమ్మకుండుట అనునవి అతని భయమును వ్యక్తము చేయుచున్నవి. ఈ 'భయము' తనకు మరణము తప్పదేమో అను శంకవల్లన కలిగినది.





చం "అనఘ! నృసింహ! నీ యరి వనావళికేఁగి గుహాగ్రసుప్తుఁడై। యని మరలం గలం గని భయంపడి పాఱుచు "నాజిగాదు కా" । దని సతి తెల్పినం దెలియఁ డార! నిషాదులఁ జాపహస్తులం। గని విపినేభపంక్తిఁగని క్రమ్మఱ నాజియ కాఁదలంచుచున్" (కా. లం. సం. III-18.)

*భయానకరసము :* 'భయము' స్థాయిభావముగా గల రసము. ఇది నవరసములం దొకటి. (చూ. నవరసములు. చూ. భయము.)

భయానకరసస్వరూపమును సాహిత్యదర్పణమిట్లు నిరూపించెను. (సా. ద. III-181 పే. 235-238 శ్లో.) స్థాయిభావము భయము. కాలుడు అధిదేవత. స్త్రీలును, నీచులును నాయకులు. వర్ణము కృష్ణవర్ణము. దేనివలన భయము పుట్టునో అది ఆలంబనవిభావము. దాని ఘోరతరచేష్టలు ఉద్దీపన విభావములు. వైవర్ణ్యము, గాద్గద్యము, ప్రళయము, స్వేదము, రోమాంచము, కంపము, దిక్కులు చూచుట, మొదలయినవి అనుభావములు. జుగుప్స, ఆవేగము, సమ్మోహము, సంత్రాసము, గ్లాని, దైన్యము, శంక, అపస్మారము, సంభ్రాంతి, మృతి మొదలయినవి వ్యభిచారిభావములు.

ఉదాహరణము :- నడగిరియను నేనుగు మదించి పట్టణముపైఁబడగా నచటి ప్రజల యలజడిని వర్ణించుచు శ్రీ సన్నిధానంవారు వ్రాసిన పద్యము:
సీ। వీడిన మొలనూలు వెనుకాలి బందమై, పఱచుచుం బఱచుచుం బడెడివారు।
చంకలో నిడుకొన్న చంటిబిడ్డలతోడ దిగ్భ్రాంతి నట్టిట్టు తిరుగువారు...
(కా. లం. సం. III అనుబంధము 441 పేజి).

*భవద్విప్రలంభము :* చూ. ప్రవాసవిప్రలంభము.

*భారతి :* వివరములకు చూ. వృత్తులు. అర్థవృత్తులందొకటి. మిగిలినవాని వివరములకు చూ. కైశికి, సాత్త్వతి, ఆరభటి.

ఈ షన్మృద్వర్థ సందర్భా భారతీవృత్తి రిష్యతే (ప్ర. రు. కావ్యప్రక. 51 పే.). ఇంచుక మృదువైన అర్థమును ప్రకటించు ఆంగికాభినయమునకు భారతీవృత్తి అని సంజ్ఞ. ఇట అర్థమనగా రసము లేదా రసవంతమైన యితివృత్తము. "యత్రనాతి సుకుమారా హాస్యశాంతాద్భుతా నాతి సుకుమారేణ సందర్భేణ సంగ్రథ్యంతేతత్ర భారతీ" (ప్ర. రు. కావ్యప్రక. 52 పే.). హాస్యము, శాంతము, అద్భుతము ఈ మూడును కించిత్సుకుమారములైన రసములు. వీనిని నాతి సుకుమార సందర్భమున వర్ణించుట భారతీవృత్తి.

భరతుని మతమున భారతీవృత్తి శబ్దవృత్తి. (విద్యానాథుడు దీనిని అర్థవృత్తిగా పేర్కొనెను.) కావ్యమునందలి వాగ్వ్యవహారమునకు భారతీవృత్తి యనిపేరు. ఇది మువ్విధము (1) వైదర్భి (2) గౌడి (3) మాగధి. లేదా పాంచాలి.

ఉదాహరణము :- ఉ ఆతని గొప్పవేలు, మఱియాతని నిందు దవమ్మువేలు, వేల్పుఁ-బాతనివీఁక, యచ్ఛ్వయసమయ్యదివేలు, భుజాబలంబు

వేత్రి తగు, రుద్రదేవునఖిలార్థము గ్రొత్తయ, వీనిఁ జేయఁగా। ధాత పదార్థమెట్టిదెటఁ దా సమకూర్చెనో! యెంతయో! భళీ! (ఆం. ప్ర. రు. యశో భూషణము—చలంచర్ల వారిది 104 పేజి).

**భావకత్వవ్యాపారము :** చూ. సాధారణీకరణము.

**భావకుడు :** (భావకత్వము)

చూ. భావయిత్రి. కవి అభిప్రాయమును భావించువాడు భావకుడు.

'పృథగేవ హి కవిత్వాద్భావకత్వం, భావకత్వాచ్చ కవిత్వమ్। స్వరూపభేదాద్విషయభేదాచ్చ। యదాహుః...ఏకస్సూతే కనకముపలః తత్పరీక్షాక్షమోఽన్యః తేచద్విధాఽరోచికినః, సతృణాభ్యవహారిణశ్చ ఇతి మంగళః ... చతుర్ధా ఇతి యాయావరీయః మత్సరిణ స్తత్త్వాభినివేశినశ్చ। (కా. మీ. IV-35 పే.)'

భావయిత్రీప్రతిభ మాత్రమే గలవాడు భావకుడు. భావకత్వము, కవిత్వము ఈ రెండును పరస్పర భిన్నములు. స్వరూపభేదము, విషయ భేదముకూడా వీటియందున్నది. కవి బంగారమును తయారుచేయగా భావకుడు తత్పరీక్షాక్షమమైన నికషోపలమగును. భావకులు రెండువిధములు (1) అరోచకులు (2) సతృణాభ్యవహారులు అని మంగళుని అభిప్రాయము. వీరు నలుగురని యాయావరీయాభిప్రాయము. (3) మత్సరులు (4) తత్త్వాభి నివేశులు.

**భావధ్వని :** విభావానుభావములచే ఒకవ్యభిచారి భావము వ్యక్తమగుటను 'భావధ్వని' అందురు.

ఉదాహరణము :- నిర్వేదము అను వ్యభిచారిభావమునకు ఆక్రోశ నము మొదలైనవి విభావములు. రోదనము మొదలైనవి అనుభావములు (కార్యములు). వీనిచే 'నిర్వేదము' వ్యజ్యమానమగును. వ్యభిచారిభావముల కిచ్చినఉదాహరణములన్నియు భావధ్వనికుదాహరణములే. చూ. నిర్వేదము, ధృతి మొ నవి.

**భావము :** వివరములకు ముందు చూ. అలంకారములు. ఇది అంగజమైన అను భావము (చూ. అనుభావము. చూ. అంగజములు). శృంగారచేష్టలలో ఒకటి. (చూ. శృంగారచేష్టలు).

భావమునకు నిర్వచనములు : (1) "నిర్వికారాత్మకాత్ సత్త్వాద్భావ స్తత్రాద్య విక్రియా" అని దశరూపకము (ధ. ద. రూ. రెండవప్రకాశము 28 పేజి). నిర్వికారమైన చిత్తమున మొట్టమొదట కలిగినవికారమే భావము. దశరూపకకర్త నాయికకు సత్త్వజములైన అలంకారములు ఇరువది యుండు నని తెలిపి, అందు శరీరజములైనవానిలో 'భావము'ను పేర్కొనెను. (2) "రసాభిజ్ఞాన యోగ్యత్వం భావ ఇత్యభిధీయతే" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రకరణము 295 పేజి). రసమును తెలిసికొను యోగ్యత కలిగి యుండుటే భావము. ప్రతాపరుద్రీయకర్త 18 శృంగార

చేష్టలలో భావమొకటియని పేర్కొనెను. (3) "నిర్వికారాత్మకే చిత్తే భావః ప్రథమవిక్రియా" అని సాహిత్యదర్పణము (సా. ద. తృతీయపరిచ్ఛేదము 122 పేజి 93 శ్లో.) ఏ వికారమును లేని చిత్తమున ప్రప్రథమమున కలిగిన వికారమే భావము. సాహిత్య దర్పణకర్త నాయికకు యౌవనమందుసత్త్వజములైన ఇరువదియెనిమిది అలంకారములుండుననియు, వానిలో 'భావము' అంగజమైన అలంకారమనియు, అను భావమనియు తెలిపెను. (4) "భావయతి రిరంసామితి భావః" అని యొక వ్యుత్పత్తి (కా. లం. సం. 374 పేజి). రమించు కోరికను తెలుపు మనోవికారమే భావము. (5) "భావయతి జ్ఞాపయతి హృదయగతమితి భావః" (కా. లం. 279 పేజి). హృదయమునందున్నదానిని తెలియజెప్పనది భావము.(6)"వికారోమానసోభావః" (కా. లం. సం. 336 పేజి). మనోవికారమే భావము (7) "భావంబు వెలయొచుండు మహి రసజ్ఞానయోగ్యతా మాత్రమగుచు" (1-75 పద్యము). అని నరస భూపాలీయము 18 శృంగారచేష్టలందొకటిగా పేర్కొనబడినది. (8) "భావమనగా రసజ్ఞానయోగ్యమగు మనోవికారము...బాల్య యౌవన సంధియందుత్పన్నమయిన శృంగార విషయకమగు మొదటి యంతఃకరణ వికారము భావమనబడును. యౌవనము రాకముందు శృంగార రసమును తెలిసికొను యోగ్యత యుండదు. అది రాఁగానే దానిసెలుఁగఁజాలునొక మనోవికారము గలుగును" అని సన్నిధానంవారి వ్యాఖ్య. (కా. లం సం. 374 పేజి).

భావమునకు సాహిత్యదర్పణమునుండి యుదాహరణము :- 'ఆ వసంతమే ఇప్పుడును. ఆ మలయా నిలయమే ఇదియును. ఆ యబలయే యీమె. కాని యీమె మనస్సుమాత్రము వేరువిధముగా కనిపించుచున్నది.' ఇందామె మనోవికారము అపూర్వముగా వ్యక్తమయినది. "స ఏవ సురభిః కాలః సఏవ మలయానిలః। సైవేయమబలా; కింతు మనోఽన్యదివ దృశ్యతే" (అం. సా. ద. తృతీయ పరిచ్ఛేదము 54 పేజి).

గీ. ఆ వసంతమే; యామలయా నిలంబె
ఆ వధూమణి యేయిది యగును; గాని
తొలుతటిదిగాక వేరుగాఁ దోచుచుండె
దానిహృదయంబు మాత్రమత్యద్భుతమిది.

శ్రీ సన్నిధానంవారి యనువాదము.

(1) 'వికారో మానసోభావః'. మనోవికారమే భావము. (2)"నిర్వికారాత్మకే చిత్తే భావః ప్రథమవిక్రియా". ఏ వికారమును లేని మనస్సునందు కలిగిన మొదటి వికారమే భావము. (3) "భావయతి జ్ఞాపయతి హృదయగతమితి భావః". హృదయమునందున్నదానిని తెలియజెప్పనది భావము. (చూ. కావ్యాలంకార సంగ్రహము-తృతీయాశ్వాసము 279 పే.).

**భావయిత్రి :** ప్రతిభ రెండు విధములుగా నుండుననియు, నందు భావయిత్రి రెండవది యనియు రాజశేఖరుడు కావ్యమీమాంసయందనెను. (చూ. ప్రతిభ, కారయిత్రి).

"భావకస్యోపకుర్వాణా భావయిత్రీ । సాహి కవేః శ్రమ మభి ప్రాయం చ భావయతి । తయా ఖలు ఫలితః కవేర్వ్యాపారతరుః ః అన్యథా సోఽవకేశీస్యాత్" అని రాజశేఖరుడు (కా. మీ. IV_34 పే.). సహృదయుడగు భావుకునకు (ఆలోచకునకు) ఉపకరించు ప్రతిభ భావయిత్రి. అదియే కవియొక్క పరిశ్రమను అభిప్రాయమును భావింపజేయును. దాని చేతనే కవియొక్క కావ్య తరువు సఫలమగును. ఇదిలేనిచో అది నిష్ఫలమగును.

'పాఠకునిచేఁ గావ్యార్థమును భావింపఁజేయుశక్తి భావయిత్రి. కాబట్టి కవికివలెనే పాఠకునికిని ప్రతిభయుండవలెను. లేకున్నచోఁ గవి భావమును గ్రహింపలేకపోవును." (కా. లం. సం. II_93 పేజి). చూ. భావకుడు.

**భావశబలత :** అనేకభావములొక్కచోటనే సమకూర్చబడినచో భావశబలత. (చూ. సా. ద. III-194 పే. 266 శ్లో.). భావమనగా నిర్వేదాది సంచారి భావములు. (చూ. సంచారిభావములు).

ఉదాహరణము :- మ॥ "చెలులేమందురొ ! భావవీధి నకటా ! శ్రీ నారసింహేంద్రు కౌఁ । గిలి నాకెన్నడు గల్గునో ! నృపతితోఁ గ్రీడింపఁగాఁబోవు చం । చలపుం జిత్తము నేమిసేయుదు; గురున్ సద్భక్తిఁ బ్రార్థింతునో యల ప్రాణేశ్వరుఁ జూడకున్నఁ బరితాపాటోపముల్ మానునే !" —(కా. లం. సం. III_148 ప.). ఇందు ఒక నాయికకు బహు భావములు వర్ణింపబడినవి. "చెలులేమందురొ భావవీధి" అన్నప్పుడామె శంక వ్యక్తమగును. "శ్రీ నారసింహేంద్రు కౌఁగిలి నాకెన్నఁడు గల్గునో" అన్నప్పుడామె ఔత్సుక్యము వ్యక్తమగును. "నృపతితోఁ గ్రీడింపఁగాఁబోవు చంచలపుం జిత్తమునేమి సేయుదు' అన్నప్పుడామె దైన్యము వ్యక్తమగును. 'గురున్ సద్భక్తిఁ బ్రార్థింతునో' అన్నప్పుడామె మతి వ్యక్తమగును. 'అలప్రాణేశ్వరుఁ జూడకున్నఁ బరితాపాటోపముల్ మానునే" అన్నప్పుడామె వితర్కము వ్యక్తమగును. ఇట్లు శంక, ఔత్సుక్యము, దైన్యము, మతి, వితర్కము మొదలైన సంచారిభావములన్నియు నొకమారే కలుగుటవలన నిది భావశబలత.

**భావశాంతి :** భావము అణగిపోవుటయే భావశాంతి. భావమనగా నిర్వేదాది భావములు. (చూ. సంచారిభావములు) (సా. ద. III_194 పే. 266 శ్లో.).

ఉదాహరణము :- "సుందరీ ! కోపమును మానుము, పాదానతుని నన్నుఁ జూడుము, నీకెప్పుడును ఇట్టి కోపము వచ్చియుండలేదుసుమా ! నాథుడు ఇట్లు పలుకుచుండగా ఆ తరుణి అడ్డముగా కన్నులు మూసికొని వెల్లుగా కన్నీటిని విడిచెను, ఏమియు బదులు పలుకరింపదాయెను" సాహిత్యదర్పణ శ్లోకమునకు వేదంవారి అనువాదము (ఆం. సా. ద.

III_102 పేజి.) ఇందు కన్నీరు విడుచుటచేత ఈర్ష్యయను సంచారి భావము యొక్క శాంతి వ్యక్తమగుచున్నది.

"అభినవగుప్తుఁడిట నీర్ష్యా విప్రలంభరసమునకుఁ బ్రశమ మనియు (రసశాంతి)ఁ జెప్పవచ్చునని చెప్పుచున్నాఁడు (అత్రచ ఈర్ష్యా విప్రలంభస్య రసస్యాపి ప్రశమః ఇతి శక్యం యోజయితుం—లోచనము ' అని శ్రీ సన్నిధానంవారు (కా. లం. సం. III-421 పే.).

**భావసంధి :** ఒకదానినొకటి ఉపమర్దించుచున్నట్లు రెండు భావములుండుట భావసంధి. భావమనగా నిర్వేదాది సంచారిభావములు. (చూ. సంచారిభావములు). (చూ. సా. ద. III-194 పే. 266 శ్లో.).

ఉదాహరణము:- కం "కనబడకుండిన నిన్నుం గనఁగా నువ్విళ్లు గొందుఁ గనిపించినచోఁ జనుదువని వెఱతు; నిన్నుం । గనకున్నను గన్న నాకుఁ గలుగవు సుఖముల్"-(శ్రీ సన్నిధానం వారిచ్చిన యుదాహరణము). (కా.లం సం. III_422 పేజి). ఇందు 'ఔత్సుక్యము'ను 'శంక' ఉపమర్దించుచున్నది.

**భావాభాసము :** చూ. రసాభాసము.

భావము అనౌచిత్యమున ప్రవర్తిల్లినచో భావాభాస మగును. (అనౌచిత్యప్రవృత్తత్వేత్వాభాసో రసభావయోః సా. ద. III-191 పే.).

"భావాభాసో లజ్జాదికే తు వేశ్యాదివిషయే స్యాత్" (సా. ద. III_194 పేజి 266శ్లో.). వేశ్యాది విషయకముగా లజ్జాదికమును వర్ణించుట భావాభాసమగును.

**భావివిప్రలంభము :** చూ. ప్రవాసవిప్రలంభము.

**భావోదయము :** భావము పుట్టుటయే భావోదయము. భావమనగా నిర్వేదాది భావములు (చూ. సంచారిభావములు).

ఉదాహరణము - తే గీ కుంచెఁగొని వ్రాయఁగాఁబూని గోడల పయిఁ బెక్కు చిత్తర్వుబొమ్మలా పొలఁతిమిన్న । చిత్తమక్కాలమునఁ బరాయత్తమగుడు । వ్రాసియున్నది నీదు రూపములెయెల్ల" —(శ్రీ సన్నిధానంవారిచ్చిన యుదాహరణము (కా. లం. సం. III-421 పే.). ఇందు నాయికకు 'స్మృతి' యను వ్యభిచారిభావముదయించినట్లు వ్యక్తమయినది.

**భుక్తివాదము :** భరతుని రససూత్రమునకు భట్టనాయకుడు చేసిన వ్యాఖ్యానమునకు భుక్తివాదమనిపేరు. (చూ. రసము). భట్టనాయకుడు సాంఖ్యవాది.

'విభావానుభావ వ్యభిచారి సంయోగాద్ రసనిష్పత్తిః' అని భరతుని సూత్రము. ఇందు సంయోగము, నిష్పత్తి అను పదములకు అర్థభేదమును కల్పించి భట్టలోల్లటుడు, శ్రీ శంకుకుడు, భట్టనాయకుడు, అభినవగుప్తుడు వేరువేరు వాఖ్యానములను చేసిరి. అందు భట్టనాయకుని వాదమునకు భుక్తివాదము అని పేరు. (చూ. ఉత్పత్తివాదము, అనుమితివాదము, అభివ్యక్తివాదము).

ఈ మతమున సంయోగ పదమునకు భావకత్వమని. నిష్పత్తి పదము నకు భుక్తి లేదా ఆస్వాదము అని అర్థములు. సామాజికుడు నాయకునితో అభేదమును పొంది సాక్షాన్నాయక రసానుభవమును పొందునని భట్టనాయ కుని సిద్ధాంతము. సామాజికునికి, నాయకునికి అభేదము విభావాది సాధా రణీకరణము' (చూ. సాధారణీకరణము) వలన కలుగును. శబ్దమునకు భావ కత్వ, భోజకత్వ వ్యాపారములున్నవని భట్టనాయకుడు కల్పించెను. (చూ. భావకత్వ వ్యాపారము, భోజకత్వవ్యాపారము). ఇందు విభావాదులు భోజకములు. రసము భోజ్యము. (చూ. కా. లం. సం. III_284 పేజి).

*భూతవిప్రలంభము :* చూ. ప్రవాసవిప్రలంభము.

*భోగావళి :* క్షుద్రప్రబంధములందొకటి. చూ. క్షుద్రప్రబంధములు.

ఆద్యంతపద్యా సంయుక్తా సంస్కృతప్రాకృతాత్మికా। అష్టభిర్వా చతుర్భిర్వాస్ వాక్యైఃస్కంధ సమన్వితా ప్రతిస్కంధం భిన్నవాక్యరీతిర్దేవ నృపోచితా సర్వతో దేవ శబ్దాది రేషాభోగావళీ మతా (ప్ర. రు. కావ్య ప్రక. 77,78 శ్లో. 84 పే.). అని ప్రతాపరుద్రీయము. ఆద్యంతములందు పద్య ములుండును; సంస్కృతప్రాకృతాత్మకమగుభాష ప్రయుక్తమగును. ఎనిమిది గాని నాలుగుగాని వాక్యములతో కూడిన స్కంధములుండును. ప్రతి స్కం ధమునందు వాక్యరీతి భిన్నముగా నుండును. ఆ వాక్యరీతి దేవ, నృపోచిత ముగా నుండును. అంతట మొదట దేవశబ్దముపయుక్తము కావలయును. ఇట్టి కావ్యము భోగావళి.

*భూషణార్థి :* సప్తవిధకవులందు భూషణార్థి యొకడని అప్పకవి పేర్కొనెను.

"పొందుపఱచు నలంకృతుల్ భూషణార్థి" అని లక్షణము.

*భోజకత్వవ్యాపారము :* చూ. సాధారణీకరణము.

*మంజరి :* చూ. క్షుద్రప్రబంధములు. క్షుద్రప్రబంధములందొక భేదము మంజరి.

తరుణీరత్నముల శృంగారము, విరహము, వసంత మన్మథాదుల విజృంభణము, సరోవరకేళి, వనకేళి మొదలయిన వర్ణనలున్న కావ్యముమంజరి. సంస్కృత లక్షణగ్రంథములలో దీని ప్రసక్తిలేదు. (చూ. కా. లం. సం. II_258 పేజి).

*మంజిష్ఠారాగము :* ఒకవిధమైన పూర్వరాగము (చూ. పూర్వరాగము). ఈ పూర్వరాగము మూడువిధములు. అందు మంజిష్ఠారాగము మూడవది (చూ. నీలీరాగము, కుసుంభరాగము).

"మంజిష్ఠారాగ మాహుస్త యన్నాపైత్యతిశోభతే" అని సాహిత్య దర్పణము (సా. ద. III_166 పేజి. 197 శ్లో.) ఏ ప్రేమ పైకధికముగా ప్రకాశించుచు నెప్పటికిని అదృశ్యమైపోదో ఆ ప్రేమ మంజిష్ఠారాగము. నలదమయంతుల ప్రేమ దీని కుదాహరణము.

*మణికుల్యా :* "యస్యాం పూర్వం వస్తు న లక్ష్యతే పశ్చాత్తు ప్రకాశ్యతే సా మత్స్యవాసితాదివత్ మణికుల్యా" (భామహ కావ్యాలంకారభూమిక 81 పే.)

అని హేమచంద్రుడు (కావ్యానుశాసనము). ఏ కావ్యమునందు మొదట వస్తువు గోచరించక, తరువాత ప్రకాశించునో అది మణికుల్య. ఉదాహరణము: మత్స్యహసితము ఇది ప్రాకృతకావ్యము.

మతల్లిక : ప్రేతమహారాష్ట్రి భాషయా క్షుద్రకథా గోరోచనానంగవత్యాదివన్మతల్లికా యస్యాం పురోహితా మాత్యతాపసాదీనాం ప్రారబ్ధనిర్వాహే ఉపహాసః సాఽపిమతల్లికా (భామహకావ్యాలంకారభూమిక 31 పేజి) అని హేమచంద్రుడు (కావ్యానుశాసనము). ప్రేతభాషయందుగానీ మహారాష్ట్రి భాషయందుగానీ రచింపబడిన క్షుద్రకథ మతల్లిక ఉదాహరణములు: గోరోచన, అనంగవతి మొదలైనవి. పురోహితులు అమాత్యులు, తాపసులు మొదలైనవారు మొదలిడిన కార్యములు పరిహసింపబడిన కథను కూడా మతల్లిక అందురు.

మతి : వ్యభిచారిభావములందొకటి. (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- (1) "భ్రాంతిచ్ఛేదోపదేశాభ్యాం శాస్త్రాదేస్తత్త్వధీర్మతిః" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవ ప్రకా. 63 పేజి 33 సం.). భ్రాంతిచ్ఛేదము, ఉపదేశము మొదలైనవానికొఱకు (?) శాస్త్రాదుల తత్త్వము నెరుగుట మతి. "(2) తత్త్వ మార్గాను సంధానాదర్థ నిర్ధారణం మతిః" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 289 పేజి 28 సం.). తత్త్వ మార్గమునను (సంధించుటవలన) సరించుటవలన అర్థమును నిర్ధారణ చేయుట మతి. (3) "నీతిమార్గానుసృత్యాదేరర్థ నిర్ధారణంమతిః స్మేరతా ధృతి సంతోషౌ బహుమానశ్చ తద్భవాః" అని (సా. ద. III-151 పే. 163 శ్లో.). సాహిత్యదర్పణము. నీతిమార్గము ననుసరించుట మొదలయిన వానిచే అర్థ నిర్ధారణమే మతి. దీనివలన మందహాసము, ధైర్యము, సంతోషము, గౌరవము మొదలైన అనుభావములు కలుగును. (4) "అర్థ వినిర్ణయంబు మతి" అని నరసభూపాలీయము (III-75 ప.). (5) శాస్త్రాది విచారజన్య మర్థనిర్ధారణం మతిః" అని రస గంగాధరము (కా. లం సం. III-360 పేజి 21 సం.). శాస్త్రములు మొదలైన వానిని తెలిసికొనుటచే కలుగు కార్య నిశ్చయము మతి. సంశయచ్ఛేదమనుభావము.

ఉదాహరణము :- కం "చెలువరొ ! శ్రీ నరసింహుం డలనాటి నృసింహమూర్తియగుఁ గాకున్నన్ దలఁచిన తావులనెల్లను నెలకొని సాన్నిధ్యమొందు నిపుణత గలదే" -(కా. లం. సం. III-77 ప.). పురాణ ప్రమాణము విభావము. సంశయచ్ఛేదమనుభావము. తత్త్వజ్ఞానరూప చిత్తవృత్తియగు మతి వ్యక్తమయినది.

మదము : స్వభావజములయిన అలంకారములందొకటి. (చూ. స్వభావజములు, చూ. అలంకారములు). ఒక అనుభావము (చూ. అనుభావము).

నిర్వచనములు :- (1) "మదో వికార సౌభాగ్య యౌవనాద్యవలేపజః" అని సాహిత్యదర్పణము (కా. లం. సం. 391 పేజి). సౌభాగ్యము,

యౌవనము మొదలైనవానియొక్క గర్వము వలన జనించిన వికారము మదము 18 స్వభావజములందొకటి.

ఉదాహరణము :- 'నీ చెక్కిలిమీద ప్రియుడు తన చేతితో వ్రాసిన పూలగుత్తిని చూచుకొని గర్వించకు; ఆతనికింకొక ప్రియురాలుండవచ్చును. కంపము కలుగనిచో ఆమెకూడా ఇట్టి మర్యాద పొందగలదు.' ఇందు సౌభాగ్య గర్వమువలన ఆమెకు కలిగిన మదము వ్యక్తమయినది. తే.గీ 'నాదు నునుజెక్కుఁ గులపైని నాయకుండు స్వయముగా వ్రాసెఁ బుష్పమంజరి నటంచు మురిసిపోకిట్టి వన్యయుం బొందకున్నె పాడువణఁకట్టిచో విఘ్న పరుపకున్న'' —కా. లం. సం. III-391 పేజి). (సాహిత్యదర్పణ మందలి శ్లోకమునకు సన్నిధానంవారి తర్జుమా) శ్లో। 'మాగర్వముద్వహః కపోలతలే చకాస్తి కాంతస్వహస్తలిఖితా మమ మంజరీతి। అన్యాపి కిం నఖలు భాజనమీదృశీనాం। వైరీ నచేద్భవతి వేపథురంతరాయః'—ఆం. సా. ద. తృతీయ 146 సంఖ్య 60 పేజి.

వ్యభిచారిభావములందొకటి (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- (1) "హర్షోత్కర్షో మదః పానాత్ స్ఖలదంగ వచోగతిః నిద్రాహాసోఽత్ర రుదితం జ్యేష్ఠమధ్యాధమాదిషు'' అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 61 పేజి 26 సం.). మద్యపానము వలన కలిగిన హర్షాతిశయము మదము. శరీరముతూలుట, మాటలు తడబడుట, అడుగులు పడకుండుట అనుభావములు. ఉత్తములకు నిద్ర, మధ్యములకు నవ్వు, అధములకు ఏడ్పు అనుభావములు (2) "మదిరాదికృతో మోహహర్ష వ్యతికరో మదః" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 273 పేజి 5 సం.). మదిరాపానము మొదలయిన వానివలన కలిగిన మోహ, హర్షముల సంకరము మదము. (3) 'సంమోహానంద సంభేదో మదో మద్యోపయోగజః అమునా చోత్తమః శేతే మధ్యో హసతి గాయతి అధమ ప్రకృతిశ్చాపి పరుషం వక్తి రోదతి' అని సాహిత్యదర్పణము (సా. ద. III-142 పే. 146, 147 శ్లో.) మద్యము త్రాగుటవలన తెలివి తప్పును. ఆనందము కలుగును. ఈ సంమోహానందముల మిశ్రమే మదము. దీనివలన ఉత్తమునకు నిద్ర అనుభావము. మధ్యమునకు నవ్వుట, పాడుట అనుభావములు. నీచులకు పరుషముగా మాటాడుట, ఏడ్చుట అనుభావములు. (4) ''మదము మదిరాదికృత సమ్మద మోహ వ్యతికరంబు'' అని నరస భూపాలీయము (I I-75 ప.). (5) ''మద్యాద్యుపయోగజన్మా ఉల్లాసాఖ్యః శయన హసితాది హేతుశ్చిత్తవృత్తి విశేషో మదః'' అని రసగంగాధరము (కా. లం. సం. III-358 పేజి. 16 సం.) మద్యపానాదులవలన కలిగిన ఉల్లాసము అనెడి చిత్తవృత్తి విశేషమే మదము. దీనివలన నిద్ర, నవ్వు మొదలైన అనుభావములు కలుగును

"మఱియు నీ మదము ముప్విధములు. తరుణము, మధ్యమము, అధ మము అని. అవ్యక్తములును, అసంగతములును నగు వాక్యములచేతను, సుకుమారమైన తొట్రుపాటు చేతను నభినయింపబడునది తరుణ మదము. భుజాక్షేపము (చేతులెగురవేయుట), స్ఖలితము (తొట్రుపాటుతోఁ గూడిన నడక), ఘూర్ణితము (తిరుగుడు పాటు) మొదలగు వానిచే నభినయింపఁ దగినది మధ్యమ మదము. గతిభంగ, స్మృతినాశ, హిక్కా (ఎక్కిళ్లు) ఛర్దులు (వాంతి) మొదలగువానిచే నభినయింపఁదగినది యధమమదము" —శ్రీ సన్నిధానంవారు (చూ. కా. లం. సం. III-359 పుట).

ఉదాహరణము :- నరసభూపాలుని పుష్పవనమున నాడు తుమ్మెదలు పుష్పాసవము త్రాగి గండుతుమ్మెదలతో గూడి తిరుగాడును; ఆడును; పాడును. కం "అమరు నృసింహుని వనమున। నమితాసవరసములాని యలి యావతముల్ । భ్రమియించు ! నాడుఁ బాడును రమణులతోఁ గూడి సాంద్రరాగ ప్రౌఢిన్" —(కా. లం. సం. III-78 ప.). ఇందు పుష్పా సవపానము విభావము. భ్రమణము, ఆట, పాట, అనుభావములు. వీనిచే మదము వ్యక్తమయినది (భావధ్వని).

***మధ్యమకావ్యము :*** వ్యంగ్యార్థముకన్న వాచ్యార్థమే మనోహరముగా నున్న కావ్యము, మధ్యమకావ్యము. ఇందు వ్యంగ్యము అప్రధానము. అందువల్ల నే దీనిని గుణీభూత వ్యంగ్యము అందురు. చూ. గుణీభూత వ్యంగ్యము.

చూ. ఉత్తమోత్తమ కావ్యము, ఉత్తమకావ్యము, అధమకావ్యము.

***మధ్యమకైశికి :*** చూ. వృత్తులు; కైశికి.

సర్వరససాధారణమగు వృత్తి మధ్యమ కైశికి. "మృద్వర్థేఽప్యనతి ప్రౌఢబంధా మధ్యమకైశికీ" (ప్ర. రు. కావ్య ప్రక. 54 పేజి) మృదువగు అర్థమున్నప్పటికిని అనతి ప్రౌఢబంధము గలది మధ్యమ కైశికి.

"శృంగార కరుణయో రతిసుకుమారయో రల్ప ప్రౌఢత్వంన దూష్యతే । కింత్వతి ప్రౌఢసందర్భో నేష్యతే; ప్రతికూలవర్ణ రూప దోషా పత్తేః" (ప్ర. రు. కావ్యప్రక. 54 పేజి). శృంగార కరుణములు అతి సుకుమారములు. అయినను అల్ప ప్రౌఢత్వము వానికి దూష్యముకాదు. కాని అతి ప్రౌఢసందర్భము మాత్రము సమ్మతముకాదు; ప్రతికూలవర్ణ రూపము అను దోషము కలుగుటకది కారణమగును. ఉదాహరణమునకు చూ. ప్ర. రు. కావ్యప్రక.

***మధ్యమారభటి :*** చూ. వృత్తులు; ఆరభటి.

సర్వరససాధారణమగు వృత్తి మధ్యమారభటి. "మధ్యమారభటీ ప్రౌఢేఽప్యర్థే నాతిమృదుక్రమా" (ప్ర. రు. కావ్య ప్రక. 54 పేజి). ప్రౌఢార్థమున్నను నాతిమృదు కమముండుట మధ్యమారభటి.

"అతి ప్రౌఢయోరపి రౌ దబీభత్సయో రీషన్మృదు బంధోన దూష్యతే అతి మృదుసందర్భస్తు విరుద్ధః" (ప్ర. రు. కావ్య ప్రక. 54 పే.). రౌద్ర

బీభత్సములతి ప్రౌఢములు. అయినను వానికి ఈ షన్న్మృదు బంధము దూష్యముకాదు. కాని అతిమృదు సందర్భము విరుద్ధమే. (ఉదాహరణము నకు చూ. ప్ర. రు. కావ్యప్రక.)

**మనస్సంగము** : శృంగారావస్థలందొకటి. (చూ. శృంగారావస్థలు).

నిర్వచనములు :- (1) "మనస్సంగః ప్రియతమే నిత్యం చిత్తస్య విశ్రమః" అని ప్రతాపరుద్రీయము (ప్ర. రు. రసప్రక. 229 పే. 87సం.). ప్రియునియందే నిత్యమును చిత్తము విశ్రమము పొందుట మనస్సంగము.

ఉదాహరణము :- శ్లో "సదా మమ మనో విలగతి రుద్రనరేంద్రే కస్మాత్కుపితాః తేనాహమపి విముక్తా సఖ్యః యుష్మాసుకావార్తా" -(ఆం. ప్ర. రు రసప్రక. 308 పేజి 2 సం.). రుద్రనృపతికి సన్నిహితముగానుండు నాయిక యొకతె అతనికి దూరముగా నున్న చెలులతో పలుకు చున్నమాటలివి "నా మనస్సు సదా రుద్రనృపాలునియందు లగ్నమగు చున్నది. కడకు దానిచేత నేనుకూడా విడువబడితిని మీకేల కోపము?". ఇందు నాయిక మనస్సంగము వర్ణితము.

**మరణము** : అంతమనియు కొందరందురు. వ్యభిచారి భావములలో నొకటి. (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు:- (1) "మరణం సుప్రసిద్ధత్వాదనర్థత్వాచ్చనోచ్యతే" అని దశరూపకము (ధ. ద రూ. నాలుగవ ప్రకా. 61 పేజి 25 సం.). సుప్రసిద్ధము, అనర్థకము అగుటవలన మరణమును గూర్చి చెప్పబనిలేదు. (2) "మరణం మరణార్థస్తు ప్రయత్నః పరికీర్తితః" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు రసప్రక. 291 పేజీ 31 సం.). మరణముకొఱకయిన ప్రయత్నమే మరణము (3) "శరాద్యైర్మరణం జీవత్యాగోఽంగపతనాదికృత్" అని సాహిత్యదర్పణము (సా ద. III-146 పే. 155శ్లో.). శరములు మొదలయినవానిచేత ప్రాణములు కోల్పోవుట మరణము. దేహపాతము మొదలయినవి దానివలన కలుగును. (4) "అగణితమృతియత్నమంతమగు" అని నరసభూపాలీయము (III-78 ప.). (5) "రోగాదిజన్యా మూర్ఛారూపా మరణప్రాగవస్థా మరణం" అని రసగంగాధరము (కా. లం సం. III-363 పేజి). రోగము మొదలయినవానివలన పుట్టిన మూర్ఛారూపమగు చిత్తవృత్తి మరణము. ఇది మరణమునకు పూర్వావస్థ. అనగా మరణయత్నమే మరణమను వ్యభిచారిభావము.

ఉదాహరణము :- కం వలపెటెఁగిరాఁడు; కౌఁగిట నలమఁడు నరసావనీంద్రుఁడని వగవఁజుమీ చెలులును జిలుకయు నెవ్వాతి వలనగునో యనుచుఁ గొంత వగచెద నాత్మన్" -(కా. లం. సం. III-82 ప.). ఇందు నాయికా విరహము విభావము. ఆమె చింత అనుభావము. ఆమె మరణయత్నము వ్యక్తమైనది.

'శృంగారావస్థలు' లో నొకటిగా మరణమును దశరూపకకర్త, ప్రతాపరుద్రీయకర్త, సాహిత్యదర్పణకర్త పేర్కొనిరి. చూ. శృంగారావస్థలు.

"రసవిచ్ఛేద హేతుత్వాన్మరణం నైవవర్ణ్యతే । జాతప్రాయంతు తద్వాచ్యం చేతసాఽకాంక్షితం తథా వర్ణ్యతేఽపి యది ప్రత్యుజ్జీవనం స్యాదదూరతః" (సా. ద. III-165 పేజి 193 & 194 శ్లో.). "కావ్యము లందు రసవిచ్ఛేదము గలిగించును, కాన మరణమును వర్ణింపరాదు. ౧. మరణము సంభవించునట్లు కానీ ౨. నాయికాదులు మరణమును గాంక్షించుచున్నట్లుగానీ వర్ణింపవలెను. ౩. ఒకవేళ నియతముగా మరణము సంభవించినట్లు వర్ణించినను ద్వరలోనే మరల జీవించినట్లు వర్ణింపవలెను. లేకున్న రసభంగమగును" (కా. లం. సం. III-401 పేజి).

ఉదాహరణములు :- మొదటిదానికి కం విరియం బాఱఁగ వావిలిఁ బరికించియు నెట్టొపట్టి ప్రాణము నిలిపెం దరుణీమణి; యాపిమ్మట నెఱుఁగము విని కోడికూత నేమగునొకటా!" (కా. లం. సం. III-402 పేజి). నాయకుని అప్రాప్తివలన నాయిక మరణదశ వర్ణితమైనది. దీనికి మూలము శ్లో॥ శేఫాలికాం విదళితా మవలోక్య తన్వీ । ప్రాణాన్ కథంచిదపి ధారయితుం ప్రభూతా ఆకర్ణ్య సంప్రతి రుతం చరణాయుధానాం కింవాభవిష్యతి నవేద్మి తపస్వినీ సా" –(సా. ద. III-165 పే. 194 శ్లో. లక్ష్యము).

రెండవదానికుదాహరణము :- గీ॥ ముసరఁగా నిమ్ము! జుమ్మని దెసలఁదేంట్లు; మలయఁగా నిమ్ము! మెలమెల్ల మారుతంబు; పాడఁగానిమ్ము! కోయిలల్ పంచమంబు; నరుగగానిమ్ము నా యయః ప్రాణములును (కా. లం. సం. III-401 పే.). ఇందు నాయిక మరణకాంక్ష వర్ణితము. దీనికి మూలశ్లోకము!"రోలంబాః పరిపూరయంతు హరితో ఝంకార కోలాహలై ర్మందం మందముపైతు చందనవనీజాతో నభస్వానపి మాద్యంతః కలయంతు చూతశిఖరే కేళీపికాః పంచమం ప్రాణాః సత్వరమశ్మసారకఠినా గచ్ఛంతు గచ్ఛంత్వమీ" (సా. ద. III-165 పేజి. 194 శ్లోకము లక్ష్యము).

మూడవదానికుదాహరణము :- కాదంబరిలో మహాశ్వేతా పుండరీక వృత్తాంతము. విరహ తాపముచే మరణించిన పుండరీకుడు కొంతకాలమునకు తిరిగి జీవించును.

మహాకవి : కవియొక్క అవస్థలు పదియనియు, అందు సహజప్రతిభునకును, ఆహార్యప్రతిభునకును ఏడవస్థలును, ఔపదేశికునకు మూడవస్థలును నుండునని రాజశేఖరుడు కావ్యమీమాంసయందు పేర్కొనెను. మొదటి ఏడింటిలో మహాకవి యగుట అరవదశ. (చూ. కారయిత్రి). (చూ. విద్యాస్నాతకుడు; హృదయకవి, అన్యాపదేశి, సేవిత, ఘటమానుడు, కవిరాజు, ఆవేశికుడు, అవిచ్ఛేది, సంక్రామయిత).

"యోఽన్యతర ప్రబంధే ప్రవీణః స మహాకవిః" అని రాజశేఖరుడు. (కా. మీ. IV-50 పే.). ఏ రకమైన ప్రబంధమయినను రచించుటయందు ప్రవీణుడెవడో అతడు మహాకవి.

కావ్యకవి ఎనిమిది విధములుగా నుండుననియు, (చూ. కావ్యకవి). ఆ ఎనిమిది విధములయిన ప్రజ్ఞలును గలవాడే మహాకవియనియు రాజశేఖరుడే మరొకచోట చెప్పెను. "ఏషాం (ద్విత్రైర్గుణైః కవీయాన్, పంచకైర్మధ్యమః) సర్వగుణ యోగీ మహాకవిః" (కా. మీ. IV-49 పేజి).

*మహాకావ్యము :* నగర, అర్ణవ, శైల, ఋతు, చంద్రోదయ, సూర్యోదయ, ఉద్యాన, జలక్రీడా, మధుపాన, రతోత్సవ, విప్రలంభ, వివాహ, కుమారోదయ, మంత్ర, ద్యూత, ప్రయాణ, యుద్ధ, నాయకాభ్యుదయములనెడి ఈ 18 వర్ణనములు గల కావ్యము మహాకావ్యము. "ఏతాని యత్రవర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే ఏషామష్టాదశానాం యైః కైశ్చిదూనమపీష్యతే" (ప్ర. రు. కావ్యప్రక. 82 పేజి). ఈ వర్ణనలలో కొన్ని తగ్గినను మహాకావ్యమే. "తత్త్రివిధం గద్యమయం పద్యమయ ముభయమయంచేతి" (ప్ర. రు. కావ్యప్రక. 82 పేజి). మహాకావ్యము మూడు విధములు. (1) గద్యకావ్యము (2) పద్యకావ్యము (3) ఉభయకావ్యము. కాదంబరి గద్యకావ్యము రఘువంశము పద్యకావ్యము. ఉభయకావ్యము చంపువు. (చూ. చంపూ కావ్యము). చూ. సర్గబంధము.

*మహావాక్యము :* కొన్ని వాక్యముల సమూహమే మహావాక్యము. (చూ. వాక్యము). "వాక్యోచ్చయో మహావాక్యమ్" (సా. ద. II-26 పే. 1 శ్లో.). రామాయణము, మహాభారతము, రఘువంశము మొదలగునవి మహా వాక్యములు. "శూన్యం వాసగృహం" వంటి శ్లోకములు వాక్యములు.

"స్వార్థబోధే సమాప్తానా మంగాంగిత్వవ్యపేక్షయా । వాక్యానామేక వాక్యత్వం పునస్సంహత్యజాయతే." (సా. ద. II-26 పే.) వాక్యములు తమతమ అర్థములను బోధించి సమాప్తములగును. తరువాత అవయవములు దేహముగా ఏర్పడుచున్నట్లు అవి అన్నియు కలిసి ఏకవాక్యమగును. ఇదియే మహావాక్యము.

*మాధుర్యము :* ఇది అయత్నజమైన అనుభావము (చూ. అనుభావము. చూ. అయత్నజములు.)

మాధుర్యమునకు నిర్వచనములు :- (1) "అనుల్బణత్వం మాధుర్యం" అని దశరూపకము (ధ. ద. రూ. రెండవప్రకాశము 28 పేజి). అతిశయము ఆడంబరము లేమి మాధుర్యము. నాయికకు యౌవనమందు సత్త్వజములైన అలంకారము లిరువదింటిలో ఒకటి. అయత్నజాలంకారమిది. (2) "అభూషణేపి రమ్యత్వం మాధుర్యం పరికీర్త్యతే" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రస ప్రక. 297 పేజి). అలంకారములు ధరింపకున్నను అందముగా నుండుట మాధుర్యము. ఇది శృంగారచేష్టలు 18 లో ఒకటి. (3) "సర్వా

వస్థావిశేషేషు మాధుర్యం రమణీయతా" అని సాహిత్యదర్పణము (కా. లం. సం. III-377 పేజి). అన్ని అవస్థా విశేషములందును రమణీయతయే మాధుర్యము 28 అలంకారములలో ఒకటి. (చూ. అలంకారములు). (4) "సొమ్ములు లేకతిరమ్యత్వము దలఁపఁగ నతివలకున్ మధురభావమగు" అని నరస భూపాలీయము. (III-100 పద్యము).

మాధుర్యమునకుదాహరణము :- పద్మము నాచుతో నున్నను అందముగానే ఉండును. నల్లగానున్నను మచ్చ చందమామ కందముగానే ఉండును. ఈమె (శకుంతల) నారచీర కట్టినను చాల అందముగా నున్నది. మధురాకారులకు ఏదైనను అలంకారమే గదా!' శ్లో "సరసిజమనువిద్ధం శైవలేనాపి రమ్యం । మలినమపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీం తనోతి ఇయమధిక మనోజ్ఞా వల్కలేనాపి తన్వీ । కిమవహి మధురాణాం మండనం నాకృతీనాం" —అం. సా. ద. తృతీయ పరి. 133 సంఖ్య. 56 పేజి.

**మానము** : (మానవిప్రలంభము) చూ. శృంగారము; విప్రలంభశృంగారము.

"స చ పూర్వరాగ మానప్రవాస కరుణాత్మకశ్చతుర్థాస్యాత్!... మానః కోపః సతుద్వేధా ప్రణయేర్ష్యా సముద్భవః (సా. ద. III-162పే 187 శ్లో.; 167 పే. 198 శ్లో.) విప్రలంభము నాలుగు విధములు (1) పూర్వరాగము (2) మానము (3) పవాసము (4) కరుణము. మానమనగా కోపము. అది రెండు విధములు (1) ప్రణయమానము (2) ఈర్ష్యామానము. వివరములకు చూ. ప్రణయమానము, ఈర్ష్యామానము.

"సామభేదోఽథ దానంచ నత్యుపేక్షే రసాంతరమ్ తదంగాయ పతిః కుర్యాత్ షడుపాయానితి క్రమాత్ తత ప్రియవచః సామ, భేదస్తత్ సఖ్యుపార్జనమ్ । దానంవ్యాజేన భూషాదేః పాదయోః పతనంనతిః సామాదౌతు పరిక్షీణే స్యాదుపేక్షావధీరణమ్ రభసత్రాస హర్షాదేః కోపభ్రంశో రసాంతరమ్ (సా. ద. III-169 పే. 201, 202, 203 శ్లో.). ప్రణయమానమునుగాని, ఈర్ష్యామానమునుగాని తొలగించి నాయికను ప్రసన్నురాలిని గావించుకొనుటకు నాయకుడు ప్రయోగింపదగిన ఉపాయములు ఆరున్నవి. వీనిని క్రమముగా పాటింపదగును. అవి (1) సామము-ప్రియవచనము) (2) భేదము (ప్రియురాలిని వశీకరించుకొనుట) (3) దానము (భూషాదులను మిషతో ఇచ్చుట) (4) నతి (పాద పతనము) (5) ఉపేక్ష (సామాదులు నిష్ప్రయోజనములుకాగా ఉపేక్షించుట). (6) రసాంతరము (రభసత్రాస హర్షాదులవలన కోప భ్రంశము)

ఉదాహరణము :- సామాదులు ప్రయోగించినను తన ప్రాణేశ్వరునిపై కోపము వీడని కలహాంతరిత మాటలు చూడుడు :- "కాంతుని ప్రియోక్తులను సరకుగొననైతిని, నా చెంత నతఁడిడిన హారమును కంటితో చూడనేనిచూడనైతిని. అతనిపై దయదాల్పుమని నా నెచ్చెలులు పలికినమాట లనులక్ష్యపెట్టనైతిని. నా పాదముల వ్రాలి తత్క్షణమతడు పోవుచున్నప్పుడు,

అయ్యో ! ఎంతటి మూఢురాలను ! తటాలున అతనిని నా రెండు చేతుల తోను అడ్డగించి కంఠమునందర్పించుకొనలేతిని' (ఆం. సా. ద. III-51 పే. 118 సంఖ్య (శ్రీ) వేదంవారి అనువాదము).

మాయారసము : మాయారసమని ప్రతిపాదించినవాడు భానుదత్తుడు.

ఇతని వాదమిది :- "చిత్తవృత్తి ప్రవృత్తిరూపమనియు, నివృత్తి రూపమనియు ద్వివిధము. నివృత్తియందు శాంతరసము గ్రహింపబడిన విధమునఁ బ్రవృత్తియందు మాయారసమంగీకరింపవలెను. రతి, హాస, శోక, క్రోధ, ఉత్సాహ, భయ, జుగుప్సా, విస్మయము లీ ప్రవృత్తియందే మెఱపులవలెఁ పుట్టును; అడఁగును. కాన నివన్నియు మాయారసమునకు వ్యభిచారిభావములు. ఈ మాయారసమునకు స్థాయిభావము మిథ్యాజ్ఞానము. సాంసారిక భోగము నార్జించు ధర్మాధర్మములు విభావములు. పుత్రి, కళత్ర, విజయ, సామ్రాజ్యాదు లనుభావములు." —(శ్రీ) సన్నిధానంవారి వివరణము. (కా. లం. సం. III-309 పేజి).

మార్దవకవి : సప్తవిధకవులందు మార్దవకవి యొకడని అప్పకవి పేర్కొనెను.

"చూపు రస మెందు మార్దవస్ఫుటకరుండు "అని లక్షణము. ఎఱ్ఱా ప్రెగడ ఈ తరగతి కవి.

మిశ్రధ్వనులు : వివరములకు ముందు చూ. ధ్వని; శుద్ధధ్వనులు. శుద్ధ ధ్వనులు 51 రకములు ఇవి ఒకదానితో ఒకటి కలియగా మిశ్రధ్వనులేర్ప డును. ఇవి 1326 భేదాలు. వీనినే సంకీర్ణధ్వనులనియు అందురు.

శుద్ధధ్వనిభేదముఖ 51 లోను మొదటిదానితో వరుసగా ఒక్కొక్క దానిని కలుపుటవలన 50 భేదములగును. రెండవది, మూడవది కలిసి ఒక భేదము, రెండవది, నాలుగవది కలిసి ఒకభేదము, —ఇట్లు రెండవ దానితో తక్కిన వాటిని వరుసగా కలుపుచు బోయిన 49 భేదములగును ఇట్లే అన్ని టిని ప్రస్తరించగా ఒక్కొక్కదాని సంఖ్య తగ్గును. మొత్తమిట్లు 1326 భేదము లేర్పడును. (వీని వివరములకు చూ. కావ్యాలంకార సంగ్రహము ద్వితీయాశ్వాసము 204-05 పేజీలు).

ముక్తకము : (1) ముక్తమన్యే నానాలింగితం తస్య సంజ్ఞాయాంకన్ । తేన స్వతంత్రతయా పరిసమాప్త నిరాకాంక్షార్థమపి ప్రబంధమధ్యవర్తి నముక్తక మిత్యుచ్యతే" అని 'లోచనము' (ధ్వన్యాలోకలోచనము III- ఉద్ద్యోతము 324 పేజి). మరి దేనితోను కూడనిది ముక్తము. సంజ్ఞయందు కన్ప్రత్య యము చేరగా ముక్తకమైనది. ఇది స్వతంత్రమైనది. ప్రబంధమందు మధ్య నెక్కడో వచ్చిన పద్యము స్వతంత్రమైనను ముక్తకము కాదు. "క్రియా సమాప్తికై పద్యాంతరములతో నెట్టి సంబంధమును లేక రసభావాదులు గల యేకపద్యము" ముక్తకము (కా. లం. సం II-261 పే.). ఉదా :- అమరుకము, ఆర్యాసప్తశతి.

(2) ఛందోబద్ధం పదం పద్యం తేన ముక్తేన ముక్తకమ్” అని సాహిత్యదర్పణము సా. ద. VI పరి. 313 శ్లో. 352 పే). ఒక పద్యము పద్యాంతర నిరపేక్షమైనచో అది ముక్తకము.

(3) వృత్త గంధోజ్ఝితమైన గద్యము నాలుగు విధములనియు అందు ముక్తకమొకటి యనియు సాహిత్యదర్పణము. ఆద్యం సమాస రహితం (సా. ద. VI పరి. 331 శ్లో. 357 పే.). ముక్తకమనగా సమాసరహితమైన గద్యము. ఉదా :- “గురుర్వచసి పృథురురసి'

(4) “పూర్వాపర నిరపేక్షేణాపి హి యేన రసచర్వణా క్రియతే తదేవ ముక్తకమ్” అని లోచనమున నున్నట్లు భామహాలంకార హిందీ టీకలో పేర్కొనబడినది. (చూ. భామహుని కావ్యాలంకారము 16 పేజి).

ముక్తకమునకు లోచనకారుడిచ్చిన యుదాహరణము :- ఒక సహృదయుడొక ముగ్ధ నడుగుచున్నాడు. మ అలసమ్ముల్ వలితమ్ములై ప్రణయలీలార్ద్రమ్ములై మొగ్గలై చలితమ్ముల్ క్షణసమ్ముఖమ్ములయి, లజ్జాప్తిన్ పరాస్తమ్ములై । అలివేణీ! హృదయ స్థితమ్ములగు భావాకూతముల్ జాలువా । ర్చు లసద్వీక్షల నిప్పుడే సుకృతి నాలోకించెదో చెప్పవే —(పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి. ఆం. ధ్వ. లో. II భా. 62 పే.).

***ముదము*** : చూ. హర్షము.

***ముద్ర*** : చూ. శయ్య.

***మూర్ఛ*** : శృంగారావస్థలందొకటి. (చూ. శృంగారావస్థలు).

నిర్వచనములు :- (1) “మూర్ఛాత్వాభ్యంతరీ వృత్తి ర్బాహ్యేంద్రియ నిమీలనాత్” అని ప్రతాపరుద్రీయము (ప్ర. రు. రసప్రక. 233 పే. 95 సం.). బాహ్యేంద్రియములు మూతవడినప్పుడు మనస్సునకు కలుగు శూన్యవృత్తియే మూర్ఛ.

ఉదాహరణము :- కం “పిలిచినను బలుక; దంగం బుల నట్టిట్టులు కదల్పఁబోవదు; కను ద మ్ములఁ దెఱవదు, రోఁజుచుఁ గడు । వలవంతలఁ జిక్కి బాల పాన్పునఁ సోలెన్” “పిలిచినను బలుకకుండుట, అట్టిట్టు కదలకుండుట, కనుదమ్ములు దెఱవకుండుట, రోఁజుట అనునివి మూర్ఛాకార్యములు; వీనిచే మూర్ఛవ్యక్తమగును” —(కా. లం. సం III-400 పేజి).

***మృతి*** : చూ. మరణము.

***మైత్రి*** : చూ. శయ్య.

***మోహము*** : వ్యభిచారిభావములందొకటి. (చూ. వ్యభిచారిభావము.)

నిర్వచనములు :- “మోహో విచిత్తతా భీతి దుఃఖావేశానుచింతనైః తత్రాజ్ఞాన భ్రమాఘాత ఘూర్ణనాదర్శనాదయః” అని దశరూపకము (ద. ద. రూ. నాలుగవ పకా. 63 పేజి 32 సం.). భయము, దుఃఖము, ఆవేశము, విచారము మొదలైనవానివలన కలిగిన విచిత్తతయే మోహము.

అజ్ఞానము, భ్రమ, అఘూతము, ఘూర్ణనము, అదర్శనము మొదలయినవి అనుభావములు. (2) మోహాస్తు మూర్ఛనం భీతి దుఃఖావేశానుచింతనైః'' అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 276 పేజి 10 సం.). భయావేశము, దుఃఖావేశము, అనుచింతనము-వీని వలన కలుగు మూర్ఛనమే మోహము. (3) ''మోహోవిచిత్తతా భీతిదుఃఖావేగానుచింతనైః మూర్ఛనా జ్ఞానపతన భ్రమణాదర్శనాదికృత్'' అని సాహిత్యదర్పణము (సా.ద. III-144 పే. 160 శ్లో.). భయము, దుఃఖము, ఆవేగము, అతిచింత మొదలైనవానిచే గలుగు విచిత్తత మోహము. మూర్ఛ, అజ్ఞానము, పతనము, భ్రమణము, అదర్శనము మొదలయిననానిని అది కలిగించును. అవి అనుభావములు. (4) ''మూర్ఛనందుట మోహంబగు'' అని నరసభూపాలీయము (III-78 ప.). (5) భయవియోగాది ప్రయోజ్యావస్తుతత్త్వానవధారిణీ చిత్తవృత్తిర్మోహః'' అని రసగంగాధరము (కా. లం. సం. III-361 పే. 23 సం.). భయము, వియోగము మొదలైనవానివలన గలుగు చిత్తవృత్తి మోహము. ఇది వస్తుతత్త్వమును నిశ్చయింపజాలమిని కలిగించును.

ఉదాహరణము :- ఆ యువతి విరహమనెడి తపస్సమాధిగలదై నరసభూపాలుడనెడి శ్రీ నృసింహుని తలపగా తన్మయత్వముతో మైమరచినదో యన్నట్లుగా మన్మథబాణముల దెబ్బలచే మూర్ఛిల్లెను. కం 'అతను శరహతుల సొరిగెను సతి విరహతపస్సమాధి జనితవ్రతయై। ధృతి శ్రీ నృసింహుఁదలఁపగ మతిఁ దన్మయమగుచు మేను మఱచినభంగిన్'' —(కా లం. సం. III-80 ప.). ఇందు ప్రియవియోగము విభావము. మూర్ఛ అనుభావము. మోహము వ్యక్తమయినది. (భావధ్వని).

**మోట్టాయితము :** ఇది స్వభావజములైన అలంకారములలో నొకటి, (చూ. స్వభావజములు. చూ. అలంకారములు). ఒక అనుభావము (చూ. అనుభావము). ఒక శృంగారచేష్ట (చూ. శృంగారచేష్టలు).

నిర్వచనములు :- (1) ''మోట్టాయితంతు తద్భావ భావనేష్ట కథాదిషు'' అని దశరూపకము (ధ. ద. రూ. రెండవప్రకాశము 29 పేజి 66 సంఖ్య). ప్రియుని కథాదికములు విని తన్మయత్వము నొందుట మోట్టాయితము. 20 అలంకారములలో ఒకటి. చూ. అలంకారములు (2) ''మోట్టాయితం స్యాదిష్టస్య కథాదౌ భావ సూచనం'' అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రస. ప్రక. 300 పేజి). ఇష్టుడైన ప్రియుని కథలు మొదలైనవానిని విన్నప్పుడు తన భావములను సూచించుట మోట్టాయితము. 18 శృంగారచేష్టలలో ఒకటి. (చూ. శృంగారచేష్టలు). (3) ''తద్భావ భావితే చిత్తే వల్లభస్య కథాదిషు। మోట్టాయిత మితి ప్రాహుః కర్ణ కండూయనాదికం'' అని సాహిత్యదర్పణము (కా.లం.సం. తృతీయ 381 పేజి). తన ప్రియుని కథాదులు వినుచున్నప్పుడు అతనిని

గురించి భావించుకొనుచు చెవులు గోకికొనుట మొదలైన చేష్టనే మోట్టాయితమందురు. 18 స్వభావజాలంకారములలో ఒకటి (చూ స్వభావజములు). (4) "కడునిష్ట కథాదుల నింగిత మెఱింగించుట దలఁపఁగ మోట్టాయితంబు" అని నరసభూపాలీయము III-108 పద్యము). 18 శృంగార చేష్టలలో ఒకటి.

ఉదాహరణము :- 'ఓ సుందరా! నీ ముచ్చట లెత్తగా ఆమె చెవులు గోకికొనును. ఆవులించును. హర్షాశ్రువులు విడుచును. ఒడలు విరుచుకొనును. ఆ. వె। "మోహనాంగ! నీదు ముచ్చట లెత్తంగఁ! గోమలాంగి చెవులు గోఁకికొనుచు నావులించుకొనుచు హర్షాశ్రువులు రాల। నొడలు విఱుచుకొనుచునుండు సుమ్మ" —కా. లం. సం. III (సాహిత్యదర్పణమునందలి శ్లోకమునకు సన్నిధానంవారి తర్జుమా). 381 పేజి. ఇందలి చేష్టలు ఆమె తన్మయత్వమును వ్యక్తముచేయుచున్నవి. శ్లో। సుభగత్వత్కథారంభే కర్ణ కండూతిలాలసా । ఉజ్జృంభవదనాంభోజా భినత్త్యంగాని సాంగనా —అం. సా. ద. తృతీయపరిచ్ఛేదము, 142 సంఖ్య, 59 పేజి.

*మౌగ్ధ్యము :* వివరములకు ముందు చూ. అలంకారములు. స్వభావజములయిన అలంకారములందొకటి. (చూ. స్వభావజములు.) ఒక అనుభావము (చూ.)

నిర్వచనము :- (1) "అజ్ఞానాదివ యా పృచ్ఛా ప్రతీతస్యాఽపి వస్తునః వల్లభస్య పురః ప్రోక్తం మౌగ్ధ్యం తత్తత్త్వ వేదిభిః" అని సాహిత్యదర్పణము (కా. లం. సం. 392 పేజి). తనకు చక్కగా తెలిసిన వస్తువును గురించి కూడా తెలియని దానివలెనే తన ప్రియుని కడ ప్రశ్నించుట మౌగ్ధ్యము. 18 స్వభావజములలో నొకటి. (చూ. స్వభావజములు).

ఉదాహరణము :- కం "చెలికాడ! నాదు కంకణములు ముద్దులు మూటగట్టు ముక్తాఫలముల్ గలవే వృక్షంబుల ? నే స్థలంబునను ? నాటిరెవరు ? సరిగఁ దెలుపవే ?" —(కా. లం. సం. (సాహిత్య దర్పణము నందలి శ్లోకమునకు (శ్రీ) సన్నిధానం వారి తర్జుమా.) III-392 పేజి శ్లో కేద్రుమాస్తే? క్వవాగ్రామేసంతి ? కేన ప్రరోపితాః నాథ మత్కంకణన్యస్తం యేషాం ముక్తాఫలం ఫలం" —(అం సా. ద. తృతీయ 149 సంఖ్య 61 పేజి).

*యుగ్మకము :* పద్యకావ్యభేదము. చూ పద్యకావ్యములు. క్రియాసమాప్తికై పరస్పర సంబంధము గల పద్యముల జంట" —(కా. లం. సం. II-261 పే.).

"ద్వాభ్యాంతు యుగ్మకం" -(సా. ద. VI-352 పే.). రెండు పద్యములతో కూడిన శ్రవ్యకావ్యము యుగ్మకము.

*యుద్ధవీరము :* వీరరసభేదములందొకటి. (చూ. వీరరసము). వీరరసము, నాలుగువిధములు. అందిది మూడవది. (చూ. దానవీరము, ధర్మవీరము, దయావీరము). (చూ. ఉత్సాహము).

నాయకుడు దేనియందుత్సాహము చూపునో దానినిబట్టి వీరరసమున కాపేరు పెట్టబడినది. యుద్ధమునందుత్సాహము గలవాడు యుద్ధవీరుడు. అర్జునుడు, శ్రీరాముడు మొదలైనవారు యుద్ధవీరులు.

ఉదాహరణము :- శ్రీరామచంద్రుడు రావణునితో ననుచున్న మాటలు— 'ఓయి లంకేశ్వరుఁడా, ఇమ్ము జానకిని, రాముఁడు స్వయము యాచించుచున్నాఁడు. నీకేమి యీ మతివిభ్రమము? నీతిని స్మరింపుము. ఇప్పటికిని ఏమియు మిగిలిపోలేదు. అట్లు చేయవేని, ఖరదూషణత్రిశిరముల కంఠరక్తముచే అడుసయిన యీ నాబాణము వింటినారికట్టునకు చుట్టము కావింపబడినట్టిది ఓర్వదు.' —(అం. సా. ద. III-94 పేజి.).

*యోగపూర్వికః* వివరములకు చూ. యోగమూలాభిధ.

*యోగమూలాభిధ :* అవయవార్థమును - (వ్యుత్పత్త్యర్థమును) తెలుపు అభిధాశక్తినే యోగమూలాభిధ అందురు. దీనినే యోగము, యోగపూర్వికఅనియు అందురు. ఇది అభిధాభేదములందొకటి. ఈ యోగమూలాభిధతో కూడిన శబ్దమే యౌగికము. యౌగిక శబ్దముచే బోధింపబడు అర్థమే యౌగికార్థము. ఉదా :- బలారి=ఇంద్రుడు. (చూ. అభిధ, యౌగికము, యౌగికార్థము).

*యోగరూఢము :* సంకేతితార్థమును, వ్యుత్పత్త్యర్థమును కూడా తెలుపు అభిధాశక్తి యోగరూఢి. ఈ అర్థములను బోధించు శబ్దమే యోగరూఢము. ఇది అవయవార్థమును బోధించుచున్నను విశేషించి సముదాయార్థమును మాత్రమే బోధించును. ఉదా :- పంకజము. పంకము (బురద)నుండి పుట్టినది అని వ్యుత్పత్త్యర్థము. కాని ఈ శబ్దము పద్మము అను అర్థమునందే రూఢము. పంకము నుండి పుట్టిన నత్తగుల్ల మొదలైన అర్థములను ఈ శబ్దము బోధించదు. (చూ. వాచకము).

*యోగరూఢిపూర్వికః* : వివరములకు, ఉదాహరణములకు చూ. యౌగికరూఢము.

*యోగ్యత* : నిర్వచనమునకు, ఉదాహరణమునకు చూ. వాక్యము.

*యౌగికము* : అవయవార్థమును (వ్యుత్పత్త్యర్థమును) తెలుపు అభిధాశక్తిని యోగము లేక యోగపూర్విక అందురు. ఆ అర్థమును బోధించు శబ్దమే యౌగికము. ఉదా :- పాచకుడు అను శబ్దము పచతీతిపాచకః=వంటను చేయువాడు అను వ్యుత్పత్త్యర్థమునే బోధించగలదు. (చూ. వాచకము, యోగమూలాభిధ.)

*యౌగికరూఢము* : (చూ. అభిధ.) వాచకమగు శబ్దము నాలుగు విధములు- అందు యౌగికరూఢమొకటి. తక్కినవి (1) యౌగికము (2) రూఢము (3) యోగరూఢము. (వివరములకు చూ. ఆయా శీర్షికల కింద).

వ్యుత్పత్త్యర్థమే యౌగికార్థము. (ప్రసిద్ధార్థమే రూఢ్యర్థము. యౌగికార్థమును, రూఢ్యర్థమును రెండింటిని బోధించు శబ్దమే యౌగికరూఢము. దీనిని ముక్తావళీకర్తమాత్రమే తెల్పినాడు (కా. లం. సం,

136 పే.). దీనికుదాహరణము :- ఉద్భిత్ —(1) ఉద్భేదించునది=తరువు-ఇది వ్యుత్పత్త్యర్థము. (2) యాగవిశేషము - ఇది రూఢ్యర్థము. ఈ రెండర్థములను బోధించుశక్తిగల శబ్దము కనుక ఇది యౌగిక రూఢము ఈ యౌగిక రూఢార్థమును బోధించు అభిధాశక్తిని యోగరూఢిపూర్వక అందురు.

*యౌగికార్థము* : వ్యుత్పత్త్యర్థమునే యౌగికార్థమందురు. (చూ. యౌగికము)

*రతి* : వివరములకు, ముందు చూ. స్థాయిభావము. రతి యనగా ఆనందమని సామాన్యార్థము. అలంకారశాస్త్రమున దీనికి విశేషార్థమున్నది. రసరాజమగు శృంగారమునకిది స్థాయిభావము.

రతికి వివిధ నిర్వచనము లేర్పడినవి— (1) "రతిర్మనోఽనుకూలేఽర్థే మనసః ప్రవణాయితం" అని సాహిత్యదర్పణమన్నది (తృతీయ పరిచ్ఛేదము) మనోనుకూలమైన అర్థమునందు మనస్సు లగ్నమగుటయే రతి. (2) "తత్ర సంభోగవిషయక ఇచ్ఛావిశేషో రతిః" (కా. అం. సం. 320 పేజి). సంభోగ విషయకమైన ఇచ్ఛావిశేషమేరతి. (3) "యూనోరన్యోన్యవిషయా స్థాయి నీచ్ఛా భవేద్రతిః" (కా.అం.సం. 320 పేజి). యువతీయువకుల అన్యోన్య విషయకమైన ఇచ్ఛయే రతి. (4) "స్త్రీపుంసయో రన్యోన్యాలంబనః ప్రేమాఖ్యశ్చిత్తవృత్తి విశేషోరతిః స్థాయిభావః" అని రసగంగాధరకారుని నిర్వచనము. స్త్రీ పురుషులు అన్యోన్యాలంబనముగా గల ప్రేమ యను పేరుగల మనో వ్యాపారవిశేషమే రతి.

యువతీయువకులకు కలిగిన సంభోగాభిలాషయే రతి యనెడి నిర్వచనమును రసగంగాధరకారుడు సవరించి రతి యనగా ప్రేమరూపమగు చిత్తవృత్తి విశేషమనియు దానిని యువతీయువకులు పరస్పరమనుభవింతు రనియు స్పష్టపరచెను.

రతికి కొన్ని అవస్థలున్నవి. ఆయా అవస్థలలో దానికి వేరువేరు పేరులున్నవి. (1) అంకురావస్థలోని రతి ప్రేమ. (2) పల్లవావస్థలోనిరతి మానము. (3) కళికావస్థలోని రతి ప్రణయము. (4) పుష్పావస్థలోని రతి స్నేహము. (5) ఫలావస్థలోని రతి రాగము. (6) భోగావస్థలోని రతి అనురాగము. (చూ. కా. అం. సం. 320 పేజి).

రతికి నరసభూపాలీయమునందలి యుదాహరణము :- "ఒక నాయిక నరసభూపాలుని గుణగణములనిట్లు స్తుతించుచున్నదట —చందమామలోని చల్లదనము, మన్మథునిలోని చక్కదనము, వసంతునిలోని పరిమళము —ఈ మూడు గుణములును నరసభూపాలునిలోనే యున్నవి." ఆ నాయికకు ఈ వర్ణనముచే నరసభూపాలునిమీద కలిగిన ప్రేమ వ్యక్తమగుచున్నది. ఇదే రతి. ఉ॥ "చల్లదనంబె చంద్రునకుఁ జక్కదనంబె ప్రసూనధన్వికిన్ । సల్లలితోరుసౌరభమె చైత్రునకొక్కనికొక్క మేలిమే । తెల్లముగాక నా పతి యుదీర్ణగుణాఢ్యుఁడు నారసింహభూవల్లభుడట్లు సర్వగుణవైభవమెవ్వరికైనఁ గల్గునే" —కా. అం. సం. III-10,

*రత్నావళి* : 'రత్నానాం సంఖ్యయా పద్యైర్యుక్తా రత్నావళీమతా' (కా.లం.సం. II-259 పే.). రత్నములసంఖ్య (నవరత్నములు) గల పద్యములతో కూర్చబడిన పద్యకావ్యము రత్నావళి.

*రమణీయత* : జగన్నాథపండితరాయలు కావ్యలక్షణమును తెలుపుచు 'రమణీయత'ను నిర్వచించెను. (చూ. కావ్యము).

"రమణీయతా చ లోకోత్తరాహ్లాద జనకజ్ఞానగోచరతా".లోకోత్తరమైన ఆహ్లాదమును కలిగించు జ్ఞానగోచరత్వమే రమణీయత. (చూ. చమత్కారము).

*రసదోషములు* : (1) వ్యభిచారిభావమును స్వశబ్దముతో తెలుపుట, (అనుభావముల ద్వారా వ్యభిచారిభావమును వ్యక్తము చేయవలయునేకాని వాచ్యము చేయరాదు). (2) రసమును స్వశబ్దముతో తెలుపుట. (విభావానుభావవ్యభిచారులచే రసము వ్యక్తము కావలయునేకానీ వాచ్యము కారాదు). (3) స్థాయిభావమును స్వశబ్దముతో తెలుపుట. (4) అనుభావవిభావములు కష్టముగా గుర్తింపబడుట. (5) ప్రతికూల రసముయొక్క విభావానుభావ వ్యభిచారులను గ్రహించుట (6) రసముయొక్క పునఃపునర్దీప్తి. (7) అ సమయమున రసమును ప్రకాశింపఁజేయుట (8) ఆ సమయమున రసమును విరమించుట. (9) అంగభూతమగు రసమును విస్తరించుట. (10) అంగిరసము ననుసంధింపకుండుట. (11) ప్రకృతి విపర్యయము. (12) రసానుపకారకమైన దానిని వర్ణించుట. (కా. లం. సం. IV-508-520 ఉదాహరణములకు చూ. కా. లం. సం.). వీనిని రసభంగహేతువులందురు. (చూ. ధ్వనిసారః 35-38 పేజి).

ఈ రసదోషములనుగూర్చి ధ్వన్యాలోకమున చర్చింపబడినది. రసవిరోధహేతువులని అవి పేర్కొనబడినవి (చూ. ఆంధ్ర ధ్వన్యాలోకము II శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి-108-). మం. ద్వ." స్వవిరోధి రసవిభావాదులంగొనుట । ప్రాసంగికంబయి ప్రాప్తించియున్న । వస్తువు నెంతయు వర్ణించుటయును అసమయంబున యందు త్యజించుటయును అసమయాన ప్రకాశమందజేయుటయు పరిపుష్టమై మనోహరమౌ రసంబు। తిరుగ నుద్దీపించి వరలఁ జేయుటయు వృత్త్యనౌచితిని గావించుచుండుటయు రసవిరోధమున కారయ కారణములు.

*రసానందము* : చూ. అభివ్యక్తివాదము.

రసానందము బ్రహ్మానంద సహోదరము. బ్రహ్మానందమునకు వివరణము తైత్తిరీయోపనిషత్తునందలి యానందవల్లిలో నున్నది (చూ. కా. లం. సం. III-117 పేజి). ఒక లక్షకోట్లకోట్ల మానుషానందము లొక బ్రహ్మానందము. రసానందము (కావ్యానందము) బహ్మానందముతో తుల్యమయినది.

అలౌకిక కావ్యార్థ పరిశీలనమువలన సత్త్వోద్రేకము కలుగును. ఈ సత్త్వోద్రేకమువలన 'అఖండస్వప్రకాశానంద చిన్మయము' వేద్యాంతర స్పర్శశూన్యము, బ్రహ్మాస్వాద సహోదరము, లోకోత్తర చమత్కార ప్రాణమునగు ఆనందము కలుగును. ఈ యానందమే రసము. (చూ. రసము).

కరుణాది రసములు దుఃఖమయములుగదా వానిచే ఆనందమెట్లు కలుగును ? "కరుణాదావపి రసేజాయతే యత్పరం సుఖమ్ సచేత సామ నుభవః ప్రమాణం తత్ర కేవలమ్ (సా. ద. III-77 పేజి). కరుణ బీభత్స భయానకాదులవలనకూడా కావ్యమున ఆనందమే కలుగుననుటకు సచేతసుల అనుభవమే ప్రమాణము. "కించ తేషు యదా దుఃఖం స కోఽపి స్యాత్తదున్ముఖః" (సా. ద. III-77 పేజి). సచేతనుడెవ్వడును తనకు దుఃఖము తెచ్చుకొనుటకు కావ్యమును చదువడు. కరుణము దుఃఖహేతువైనచో రామాయణపఠనము దుఃఖహేతువగును. దుఃఖ కారణమువలన ఆనందమెట్లు లభించును? దీనికి సమాధానము : శ్లో హేతుత్వం శోకహర్షాదేర్గతేభ్యో లోక సంశ్రయాత్ శోక హర్షాదయో లోకే జాయంతాం నామలౌకికాః అలౌకికవిభావత్వం ప్రాప్తేభ్యః కావ్య సంశ్రయాత్ । సుఖం సంజాయతే తేభ్యః సర్వేభ్యోఽపీతి కాక్షతిః (సా. ద. III-78 పేజి). "లౌకికములగు శోక హర్షాదులు లోకసంశ్రయములగుటచే, శోకహర్షాదులనే కలిగించును. కావ్యసంశ్రయములగుటచే విభావాదుల లౌకికములగుచున్నవి. అలౌకికము లగు విభావాదులవలన సుఖమే కలుగును ((శ్రీ) కె. వి. ఆర్. నరసింహము గారి అనువాదము - సా. దర్శ. 182 పేజి). లోకమున వనవాసాదులు దుఃఖకారణములుగా తలంపబడుచున్నవి. అవియే కావ్యనాట్య సమర్పితము లగుచో, కారణశబ్దవాచ్యతను గోల్పోయి అలౌకిక విభావ శబ్దవాచ్యత్వమును పొందుచున్నవి. మరియు సురత సమయమునందు దంతక్షతములరీతి, వీనివలన సుఖమే జనించుచున్నది. (సా. దర్శ. 182 పేజి). "లౌకిక శోకహర్షాది కారణేభ్యో లౌకిక శోకహర్షాదయో జాయంతే ఇతిలోక ఏవప్రతినియమః కావ్యేపునః సర్వేభ్యోఽపి విభావాదిభ్యః సుఖమేవ జాయతే ఇతి నియమాన్న కశ్చిద్దోషః'' (సా. ద. III-78 పేజి) అని సిద్ధాంతితము. (చూ. వాసన.) వాసనలు లేనివారికి రసానందము కలుగదు.

*రసాభాసము* : స్పష్టముగా రసముయొక్క రూపము భాసింపకుండుటే రసాభాసము. 'ఆ ఈషత్ భాసతే ఇతి ఆభాసః' అని ఆ భాసమునకు వ్యుత్పత్తి (అం. ప్ర. రు. రసప్రక. 145 పేజి). రసముయొక్క ఆభాసమే రసాభాసము.

(1) రససముల్లాసమునకు విభావాది సామగ్రి కావలెను. ఆ సామగ్రి సమగ్రముగా లేనిచో రసాభాసము కలుగును. (2) అంగరసము తన హద్దును దాటి ప్రవర్తించినప్పుడు అంగిరసము బాధితమగును. అప్పుడు

రసాభాసము కలుగును. (చూ. అం. ప్ర. రు రసప్రక. 145 & 146 పేజీలు).

ఈ రసాభాసము మూడు విధములుగా నుండునని ప్రతాపరుద్రీయ మిట్లు సూత్రించినది– "ఏకత్రైవానురాగశ్చేత్ తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపివా యోషితో బహుసక్తిశ్చేద్రసాభాస స్త్రిధామతః" (అం. ప్ర. రు. రసప్రక. 147 పేజీ). (1) నాయికానాయకులందొక్కరికి మాత్రమే అనురాగ మున్నప్పుడు రసాభాసము. (2) పశువులందును, పక్షులయందును, మ్లేచ్ఛుల యందును అనురాగము వర్ణితమైనచో రసాభాసము (3) నాయికకు బహు నాయకులయందనురాగమున్నట్లు వర్ణితమైనచో రసాభాసము.

సాహిత్యదర్పణమున రసాభాసమును గూర్చి యిట్లున్నది. "అనౌచిత్య ప్రవృత్తత్వే త్వాభాసో రసభావయోః (సా. ద. III-191 పేజి 262 శ్లో.) రసము, భావము అనౌచిత్యమున ప్రవర్తిల్లినచో క్రమముగా రసాభాసము, భావాభాసము అగును. (చూ. అనౌచిత్యము).

రసగంగాధరమున రసాభాసమును గూర్చి యిట్లున్నది :- "అనుచిత విభావాలంబనత్వం రసాభాసత్వం" (కా. లం. సం. III-414 పేజి). అను చితమైన విభావము. (చూ. విభావము) ఆలంబనముగా కలిగియుండుటే రసాభాసము. ఇదియే అనౌచిత్యము.

ఉదాహరణములు :- ఒక నాయికకు ఉపపతియందు రతి యున్నట్లు వర్ణించుట, నాయకునకు ముని, గురుపత్నులయందు రతిని వర్ణించుట, నాయికకు బహునాయకులయందు రతిని వర్ణించుట, నాయికానాయకులిరు వురియందును అరతిని తెల్పుట, ప్రతినాయకునియందలి రతిని తెల్పుట, అధమపాత్రల రతిని వర్ణించుట, పశుపక్ష్యాది రతిని వర్ణించుట శృంగారము నందు అనుచితములగుటచే రసాభాసములు (చూ. సా. ద. III-191 పేజి; 263, 264 శ్లో.).

తారాశశాంకమున చంద్రునికి గురుపత్నియందు (తారయందు) అనురాగము వర్ణింపబడినది. ఇది శృంగార రసాభాసమే

శృంగారాభాసము (1) సంభోగాభాసము (2) విప్రలంభాభాసము అని రెండువిధములు (కా. లం. సం. III-418 పేజి). నాయిక పరకీయ యైనట్లును, నాయకుడుపపతి యైనట్లును వర్ణింపబడినచో సంభోగాభాసము. అనురక్తుడు గాని నాయకునిగూర్చి నాయిక అనుభవించు విరహము విప్ర లంభాభాసము.

నవరసములకును రసాభాసములుండును. వీరాభాసము, హాస్యా భాసము, కరుణాభాసము, రౌద్రాభాసము, భయానకాభాసము, బీభత్సా భాసము, అద్భుతాభాసము, శాంతాభాసము. ఇవి కావ్యాలంకార సంగ్రహ ముల ఆయా రసములక్రింద చూడవచ్చును. (ఉదాహరణములకు చూ. కా. లం. సం. III-413 నుండి 419 మరియు 432 నుండి 444 పేజీలు).

**రసము :** కావ్యమునకు జీవితభూతమైనదేదో అది రసము. రసములు తొమ్మిది. శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము, శాంతము (చూ. ఆయా శీర్షికలు).

నిర్వచనములు :- (1) "విభావానుభావవ్యభిచారి సంయోగాద్ రసనిష్పత్తిః" అని భరతుని రససూత్రము. విభావములు, అనుభావములు, వ్యభిచారిభావములు- వీని సంయోగమువలన నిష్పన్నమగునది రసము. ఈ రససూత్రమందలి సంయోగము, నిష్పత్తి అను పదముల కర్థభేదమును కల్పించి భట్టలోల్లటుడు ఉత్పత్తివాదమును (చూ. ఉత్పత్తివాదము), శ్రీశంకుకుడు అనుమితి వాదమును (చూ. అనుమితివాదము), భట్టనాయకుడు భుక్తివాదమును (చూ. భుక్తివాదము), అభినవగుప్తపాదులు అభివ్యక్తివాదమును (చూ. అభివ్యక్తివాదము) ప్రతిపాదించిరి. ఇందు అభివ్యక్తివాదమే సిద్ధాంతమయినది. వ్యంజకములైన విభావానుభావ వ్యభిచారులవలన వ్యక్తమగు స్థాయిభావమే రసమని ఈతని సిద్ధాంతము. సహృదయుల హృదయమున వాసనారూపమున నున్న స్థాయిభావము కావ్యమందలి విభావ అనుభావ వ్యభిచారిభావములచే అభివ్యక్తమై ఆస్వాద్యమగును. అట్లాస్వాద్యమానమగు స్థాయిభావమే రసమని తాత్పర్యము. (చూ. స్థాయిభావము, సహృదయుడు, వాసన, విభావము, అనుభావము, వ్యభిచారిభావము).

(2) "విభావై రనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః ఆనీయమానః స్వాదుత్వం స్థాయిభావోరసః స్మృతః" అని దశరూపకము (ధ. ద. రూ. IV ప్రకా. 56 పే. 1 సూ). విభావములు, అనుభావములు, సాత్త్వికభావములు, వ్యభిచారిభావములు– వీనిచే స్వాదుత్వమును పొందిన స్థాయిభావమే రసము. కేవలమన్నము స్వాదువుగానుండదు. కూర, పప్పు వంటి వ్యంజనముల సంబంధమువలన అన్నమునకు స్వాదుత్వము కలుగుచున్నట్లే విభావాదుల సంబంధమువలన స్థాయిభావమునకు స్వాదుత్వము కలుగును. అప్పుడది రసమగును. (రత్నాపణవ్యాఖ్య-ప్ర. రు.)

(3) "విభావేనానుభావేన వ్యక్తః సంచారిణా తథా రసతామేతి రత్యాదిః స్థాయిభావః సచేతసామ్" (సా. ద. III-67 పే. 1 శ్లో.). సాహిత్యదర్పణము. విభావముచేతను, అనుభావముచేతను, సంచారిభావముచేతను వ్యక్తమైన రత్యాది స్థాయిభావమే సచేతసులకు (సహృదయులకు) రసత్వమును పొందును.

(4) ఈ రసాస్వాదనమెట్లు జరుగునో సాహిత్యదర్పణమిట్లు వివరించినది :- "సత్త్వోద్రేకాదఖండ స్వప్రకాశానంద చిన్మయః వేద్యాంతర స్పర్శశూన్యో బ్రహ్మాస్వాద సహోదరః లోకోత్తర చమత్కార ప్రాణః కైశ్చిత్ ప్రమాతృభిః స్వాకారవదభిన్నత్వే నాయమాస్వాద్యతే రసః । రజస్తమోభ్యామస్పృష్టం మనః సత్త్వమిహోచ్యతే" (సా. ద. III-7ూపే. 2 & 3 శ్లో). దీనిభావమిది:- బాహ్యప్రమేయ (వస్తుజ్ఞాన) వైముఖ్యమును

కలిగించు ఒకానొక మానసిక ధర్మమునకే సత్త్వమని పేరు. రజోగుణ తమోగుణములను అణచివేసి సత్త్వగుణము విజృంభించినచో దానికి సత్త్వోద్రేకమని పేరు. అలౌకికమైన కావ్యార్థ పరిశీలనము వలన ఈ సత్త్వోద్రేకము కలుగును. ఈ సత్త్వోద్రేకమువలన అఖండమును, స్వప్రకాశమును నగు ఆనందము కలుగును. అది వేద్యాంతర స్పర్శ శూన్యము. బహ్మానందముతో సమానమైనది. దీనికి లోకోత్తర చమత్కారమే ప్రాణము. (చమత్కారమనగా చిత్తవిస్తారము. అనగా విస్మయము.) ఇట్టి రసమును కొందరు ప్రమాతలు (తెలిసికొనగలవారు, ప్రాక్తనపుణ్యశాలురు) ఆత్మ సాక్షాత్కారమును వలె ఆస్వాదించగలరు

(5) కం। "పులకండంబులు గలిపిన నలువగు సలిలము రసాయనంబగు పగిదిన్ లలితవిభావాదులచే న లఘుతర స్థాయిభావ మమరున్ రసమై"— అని నరసభూపాలీయము (III-4 ప.). దీనితాత్పర్యమిది— "కండ చక్కెఱ కలుపఁగా జలము పానకమగు విధమున విభావ, అనుభావ, సంచారి భావములచేఁ బరిపుష్టమై యధికముగా నాస్వాద్యమైన స్థాయిభావము రసము. జలము తన జలరూపముతో నున్నప్పుడెక్కువగా నాస్వాద్యముగా నుండదు. అట్లే సహృదయుల హృదయమున వాసనారూపముననున్న స్థాయిభావముగూడా నాస్వాద్యముగా నుండదు. కాని యా జలము కండ చక్కెఱ, ఏలకులు, మిరియపుపొడి, మొదలగు వానియొక్క కలయికచేఁ బానకరూపమును బొంది కడుంగడు నాస్వాద్యమానమగుచున్నది. అట్లే యా సహృదయుల స్థాయియు విభావ, అనుభావ, సంచారి భావములచేఁ బరిపుష్టమై మిక్కిలియు నాస్వాద్యమగుచున్నది. కాఁబట్టి సహృదయుల హృదయమున నున్న స్థాయియే రసమగుచున్నది (శ్రీ సన్నిధానంవారు). —(కా. లం. సం. III-279 పేజి).

"శబ్ద సమర్ప్యమాణ హృదయసంవాద సుందరవిభావాను భావ సముచిత ప్రాగ్వినివిష్ట రత్యాది వాసనానురాగ సుకుమార సంవిదానంద చర్వణావ్యాపార రసనీయ రూపోరసః" అని అభినవగుప్తుడు (చూ. కావ్యస్వరూపమ్: లోచనవ్యాఖ్యా 103 పేజి).

*రసవిరోధులు* : శృంగారమునకు కరుణ బీభత్స రౌద్రవీరభయానకములు విరోధులు. భయానక కరుణములు హాస్యమునకు విరోధులు. హాస్య శృంగారములు కరుణమునకు విరోధులు. రౌద్రమునకు హాస్యశృంగార భయానకములు విరోధులు; వీరమునకు భయానక శాంతములు విరోధులు; భయానకమునకు శృంగార వీర రౌద్ర హాస్య శాంతములు విరోధులు; శాంతమునకు వీరశృంగార రౌద్రహాస్య భయానకములు విరోధులు. బీభత్సమునకు శృంగారము విరోధి. (చూ. ఆం. సా. ద. III_98 పేజి 24 2 సం.).

ఉదాహరణములకు (చూ. కా. లం. సం. IV 520-527 పేజి.).

**రీతులు :** "రీతిర్నామ గుణాశ్లిష్ట పద సంఘటనా మతా" (ప్రతాపరుద్రీయము కావ్యప్రక. 56 పేజి). గుణములతోకూడిన పదముల సంఘటనకే 'రీతి' అని సంజ్ఞ. మాధుర్యము, ప్రసాదము, మొదలైనవి గుణములు. ఈ గుణముల చేత విశిష్టమైన పదరచనమే రీతి.

రీతి మూడు విధములు :- (1) వైదర్భి (2) గౌడి (3) పాంచాలి. ఈ మూడును దేశనామములను బట్టి ఏర్పడిన నామములు. విదర్భదేశమున ఆదరింపబడిన రీతి వైదర్భి. గౌడదేశమున ప్రచారముపొందినరీతి గౌడి. పాంచాలదేశప్రసిద్ధమైన రీతి పాంచాలి. చూ. వైదర్భి, గౌడి, పాంచాలి.

రుద్రటుడు "లాటీయా" అను మరొక రీతిని కూడా పేర్కొనెను. భోజుడు మాగధి, ఆవంతి అను మరిరెండు రీతులను పేర్కొనెను. ధ్వని కారుడు మూడే రీతుల నామోదించెను.

రీతియే కావ్యాత్మయని వామనుని సిద్ధాంతము. విశిష్ట పదరచనయే రీతి యనియు విశిష్టమనగా గుణవిశిష్టమనియు అతని వివరణము. గుణములచే రీతులేర్పడును.

రీతులు రసోపకారకములని కేశవమిశ్రుని మతము. "రియంతే పరం పరయా గచ్ఛంతి అనయా కరణ సాధనోఽయం రీతిశబ్దః మార్గపర్యాయః" అని రత్నేశ్వరుడు వ్యుత్పత్తిని తెల్పెను. రీతి అనగా మార్గమని అర్థము. రసపదవిని క్రమముగా పొందుటకు మార్గమైనదే రీతి అని భావము. "రిణంతి గచ్ఛంతి అస్యాం గుణాః" అని రీతికి మరియొక వ్యుత్పత్తి. గుణములు నడచుటకేది మార్గమో అది రీతి. "రీయతే క్షరతి అస్యాం వాఙ్మధుధారా ఇతి రీతిః" అని యింకొక వ్యుత్పత్తి. వాఙ్మధుధార దేనియందు స్రవించు చుండునో అది రీతి.

రీతులు అర్థవృత్తులను వ్యక్తము చేయుచుండును. అర్థవృత్తులు సాక్షా ద్రసోపస్కారములు కాగా రీతులు పరంపరగా రసోపస్కారములు. రీతులు రసోపకారిణులని అలంకార శేఖరము చెప్పుచున్నది. రీతులు అర్థవృత్తులను ఆశ్రయించియే యుండును. ఇవి రెండును పరస్పరాపేక్షగలవి. (చూ. వృత్తులు).

రీతులలోని భేదములు పదరచనా స్వభావమునుబట్టి యేర్పడినవి. కోమల పదరచన, ప్రౌఢపదరచన ఉభయవిధరచన అను విశ్లేషణములవలన వరుసగా వైదర్భి, గౌడి, పాంచాలి అను రీతులేర్పడినవి. ఇవే వరుసగా కైశికి, ఆరభటి, సాత్త్వతి అను వృత్తులను వ్యక్తము చేయును. (చూ. కైశికి, ఆరభటి, సాత్త్వతి). అలంకార శాస్త్రగ్రంథములలో కైశిక్యాది వృత్తులును వైదర్భ్యాదిరీతులును, పాకము, శయ్య, మొదలగునవి యన్నియు నొకదానితోనొకటి పెనవేసుకొనియున్నవి. మనము వైదర్భి, గౌడి, పాంచాలీరూపరీతులను మాత్రము గ్రహించిన చాలును. (చూ. కా. అ. సం. 181-184 పేజీలు).

*రూఢము :* కేవల సంకేతితార్థమును తెలుపు అభిధాశక్తిని రూఢి అందురు. ఆ అర్థమును బోధించు శబ్దమే రూఢము. దీనికి అవయవార్థముతో పనిలేదు. సముదాయార్థమే ప్రధానము. ఇది యౌగికమునకు వ్యతిరేకము. ఉదా:- ఆకాశము. దీనికవయవార్థములేదు. అనంతకాలమునుండి ఇది ఒకే అర్థమును సంకేతించుచున్నది. ఇది ప్రసిద్ధార్థము. రూఢి అనగా ప్రసిద్ధియే. (చూ. వాచకము.)

*రూఢి :* వివరములకు చూ. రూఢి మూలాభిధ.

*రూఢిపూర్వక :* వివరములకు చూ. రూఢిమూలాభిధ.

*రూఢిమూలాభిధ :* వ్యుత్పత్త్యర్థమును కాక సముదాయార్థమును మాత్రమే బోధించు అభిధాశక్తినే రూఢిమూలాభిధ అందురు. దీనినే రూఢి అనియు రూఢిపూర్వక అనియు నందురు. ఇట్టిరూఢితోకూడిన పదములు రూఢములు. రూఢపదముచే బోధింపబడు అర్థమే రూఢ్యర్థము ఉదా:- మణి, గిరి. మొ నవి. (చూ. అభిధ).

*రోమాంచము :* సాత్త్వికభావములెనిమిదింటిలో నిదియొకటి (చూ. సాత్త్వికభావము). ఇది అనుభావము (చూ. అనుభావము).

రోమాంచమునకు నిర్వచనములు :- (1) "సుఖాద్యతిశయాజ్జాతా రోమాంచో రోమవిక్రియా" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రస ప్రక. 267 పేజి). సుఖము మొదలయినవి హెచ్చుగా కలిగినప్పుడు రోమ వికారము కలుగును. అదే రోమాంచము. (2) "హర్షాద్భుత భయాదిభ్యో రోమాంచో రోమవిక్రియా" అని సాహిత్యదర్పణము (కా. లం. సం. తృతీయ 339 పేజి 44 సంఖ్య). హర్షము, అద్భుతము, భయము మొదలైన వానివలన కలుగు రోమవికారము రోమాంచము. (3) తగుం బుల కంబన రోమహర్షణారంభము" అని నరసభూపాలీయము (III-37 పద్యము).

రోమాంచమునకు నరసభూపాలీయమునుండి యుదాహరణము :- 'నాయిక నరసభూపాలుని తలచినది. వెంటనే ఆమెకు పులకలు మొలకెత్తినవి. అవి యెట్లున్నవనుకొన్నారు? మన్మథహాలికుడు కస్తూరి పూతగల యువతి శరీర క్షేత్రమునందు మనోరథములనే విత్తనములుగా జల్లగా అవి మొలకెత్తినవి కాబోలన్నట్లుండెను.'— చ "కలికి నృసింహునిం దలఁపగా నెలమింబులక ప్రకాండముల్ మొలిచె మనోజహాలికుఁడు మోదమెసంగఁ గురంగ నాభిపం కిలమగు నింతిగాత్రమనుక్షేత్రమునన్ వెలయంగఁజేయు న స్ఖలితమనోమనోరథ నికాయము లీరికలెత్తెనోయనన్"- (కా. లం. సం. III-44.). ఇందు హర్షముచే రోమవికారము కలిగినది.

రోషము : చూ. అమర్షము.

రౌచికుడు : సప్తవిధకవులందు రౌచికుడొకడని అప్పకవి పేర్కొనెను.

"మృదుమధురోక్తుల వెదకి కావ్యంబెల్ల రచియించుఁ బదబడి రౌచికుండు'' అని లక్షణము. నన్నయభట్టు ఈ తరగతి కవి.

రౌద్రరసము : 'క్రోధము' స్థాయిభావముగా గల రసము. ఇది నవరసములం దొకటి (చూ. నవరసములు). (చూ. క్రోధము).

రౌద్రరసస్వరూపమును సాహిత్యదర్పణమిట్లు నిరూపించెను. (సా. ద. III-178 పే 227-231 శ్లో). దీనికి స్థాయిభావము క్రోధము. వర్ణము రక్తవర్ణము. రక్తము, దేవత. శత్రువు ఆలంబనవిభావము. వాని చేష్టలు ఉద్దీపనవిభావములు. పిడికిటిపోటులు, భూమిమీద పడగొట్టుట, వికృతముగా నరకుట, చీల్చుట, రణసంభ్రమము, మొదలైన వానిచే రౌద్రము ఉద్దీప్తమగును. బొమముడిపాటు, పెదవి కొరుకుట, బాహువులను చరచుట, అదలించుట (తర్జనము), తను చేసిన పెద్దపెద్ద పనులను చెప్పుకొనుట (ఆత్మావదాన కథనము), ఆయుధములను ఝళిపించుట, ఉగ్రత, ఆవేగము, రోమాంచము, స్వేదము, కంపము, మదము, ఆక్షేపము, క్రూర సందర్శనము మొదలైనవి అనుభావములు మోహము, అమర్షము, మొదలైనవి వ్యభిచారిభావములు. వీనిచే రౌద్రమభివ్యక్తమై యాస్వాద్యమగును.

ఉదాహరణము :- ద్రోణవధానంతరము అర్జునాదులనుగూర్చి క్రుద్ధుడైన అశ్వత్థామ మాటలివి. "తే।గీ॥ వీతమర్యాదులై గురుపాతకంబు సలిపి సహియించి చూచిన సళరమనుజ పశుల మిమ్మెల్ల నేఁ గృష్ణ పార్థ భీమ । యుక్తముగ భూతబలి యిత్తు రక్తమునను'' (సాహిత్యదర్పణోదాహృత శ్లోకమునకు శ్రీ సన్నిధానంవారి తెలుగు). (కా. లం. సం. III-327 పే & అం. సా. ద. III-93 పేజి).

లక్షకము : లక్షణాశక్తివలన లక్ష్యార్థమును బోధించు శబ్దమునకు లక్షకమని పేరు. (వివరములకు చూ. లక్షణ). దీనికి లాక్షణికము అనియు వ్యవహారము.

లక్షణ : శబ్దములకు అర్థమును బోధించు శక్తులలో లక్షణాశక్తి యొకటి. తక్కినవాని వివరములకు చూ. అభిధ, వ్యంజన.

"ముఖ్యార్థబాధే తద్యుక్తో యయాన్యోఽర్థః ప్రతీయతే రూఢే ప్రయోజనాద్వాసౌ లక్షణాశక్తి రర్పితా" (సాహిత్య దర్పణము II పరిచ్ఛేదము-34 పే 5 శ్లో.).

ఒకవాక్యమునందొక పదమునకు గల సంకేతితార్థమునకు బాధ కలిగినప్పుడు (సంకేతితార్థము పొసగనియెడల) రూఢినిబట్టికాని, ప్రయోజనమును బట్టికాని ఆ సంకేతితార్థమునకు సంబంధముగల) వేరొక అర్థమును స్ఫురింపజేయు శబ్దశక్తి పేరు లక్షణ.

అభిధాశక్తి ముఖ్యార్థమును బోధించి ముగిసిపోవును. కాని ప్రకరణము (సందర్భము) నకాయర్థము పొసగని యెడల లక్షణాశక్తి ఆ ముఖ్యార్థ

ముతో సంబంధముగల క్రొత్త అర్థమును బోధించి, ఆ వాక్యార్థమును ఒప్పించును. అర్థాంతరమే లక్ష్యార్థము.

ఈ లక్షణాశక్తి ప్రవర్తించుటకు 3 అంశములు కావలయును. (1) ఒక పదముయొక్క ముఖ్యార్థమునకు ఆ వాక్యమునందన్వయము పొసగకపోవుట (Inapplicability). (2) ముఖ్యార్థమునకును లక్ష్యార్థమునకును ఒక నిర్దిష్టమైన సంబంధముండుట (Definite close relation). (3) ఇట్టి యర్థాంతరమును చెప్పుటకు రూఢి (లోకప్రసిద్ధి) కానీ ప్రయోజనముగానీ ఉండుట (Usage or purpose).

ఈ మూడింటిలో మొదటిది - లక్షణాశక్తి ప్రవృత్తికి హేతువు. ఒక వాక్యమునందు ముఖ్యార్థబాధ యేర్పడి అన్వయము కుదురని స్థితి యేర్పడినపుడే లక్షణ అవసరమగును. రెండవది వాచ్యార్థముకన్న భిన్నమైన అర్థాంతరమును స్వీకరించవలసిన విధానము. వాచ్యార్థమునకు సంబంధమున్న అర్థమును (వివరములకు, ఉదాహరణములకు చూ. సంబంధము) మాత్రమే స్వీకరించవలెననుటకిది అవసరము. మూడవది అర్థాంతరమును గ్రహించుటకు గల ప్రయోజనము. ఆ పదమునకు వాచ్యార్థముకన్న భిన్నమైన ప్రసిద్ధార్థము (రూఢి) లోకమునందున్నచో గ్రహింపవచ్చును. లేదా ఆ యర్థాంతరమును గ్రహించుటకు విశిష్టమైన ప్రయోజనమొకటి యుండవలెను.

ఉదాహరణకు :- 'వాడు విద్యలయందు కుశలుడు' అను వాక్యమున్నది. ఇందు కుశలశబ్దమున కర్థము పొసగదు. కుశలుడనగా ముఖ్యార్థము కుశలను గ్రహించువాడు. ముఖ్యార్థమునకు బాధకలిగినది కనుక తత్సంబంధముగల వేరొక అర్థమును గ్రహింపక తప్పదు. లోకమునందు కుశలుడనగా నేర్పరి యని రూఢియున్నది. ఈ రూఢిని గ్రహించినచో వాడు విద్యలయందు నిపుణుడని లక్ష్యార్థము. ఇది రూఢిమూల లక్షణ.

గంగలో గొల్లపల్లె అను వాక్యమున్నది. గంగఅనగా ముఖ్యార్థము గంగానది. గంగాప్రవాహములో గొల్లపల్లె యెట్లుండ గలదు. కొట్టుకొని పోదా? ఇది ముఖ్యార్థబాధ. గంగలో అనగా గంగాతటమున అని ముఖ్యార్థ సంబంధముగల అర్థాంతరము. ఇట్టి అర్థము చెప్పకొనుటకు రూఢిలేదు. కానీ ప్రయోజనమున్నది. గంగా తీరస్థమగు గొల్లపల్లె అని చెప్పుటవలన గంగానదీగతమగు చల్లదనము, పవిత్రత మొదలయినవి గొల్లపల్లికి కూడా కలుగుటయే ఆ ప్రయోజనము. ఇది ప్రయోజన మూలలక్షణ. (ఇట్లే 'మాఇల్లు రోడ్డుమీద ఉన్నది' అను వాక్యము).

ఈ లక్ష్యార్థము ఆరోపితమే కానీ శబ్దగతమైనది కాదు; సహజమైనది కాదు. వాచ్యార్థ సంబంధములేని లక్ష్యార్థము ఉండదు.

ఈ లక్షణ రెండువిధములు (1)సంబంధ నిబంధన (2) సామ్యనిబంధన. ఇవి మరల (1) రూఢిమూల (2) ప్రయోజనమూల అని రెండేసివిధములు.

సంబంధనిబంధనాలక్షణ మరల రెండు విధములు. (1) లక్షణలక్షణ. (2) ఉపాదానలక్షణ. వీటికే జహల్లక్షణ, అజహల్లక్షణ అనికూడా వ్యవహారము. (వివరములకు చూ. ఆయాశీర్షికలు).

సామ్యనిబంధన రెండు విధములు (1) సారోప (2) సాధ్యవసాయ. (వివరములకు ఆయాశీర్షికల క్రింద చూ.).

ఇవిగాక లక్షితలక్షణ, విపరీతలక్షణ అని మరిరెండు భేదములుకూడ ఉన్నవి. (వివరములకు ఆ శీర్షికల క్రింద చూ.).

సాహిత్యదర్పణకర్త లక్షణాభేదములను ఈ విధముగా తెల్పినాడు:- మొదట రూఢినిబట్టి ప్రయోజనమును బట్టి లక్షణ రెండువిధములు. ఉపాదాన లక్షణ, లక్షణలక్షణ అని అవి రెండేసి రకములు. ఇవి ఒక్కొక్కటియు సారోప, సాధ్యవసాన అని రెండేసి రకములు. ఇవి అన్నియు శుద్ధ, గౌణ భేదముచేత మరల రెండేసి విధములు. ఇట్లివి 16 విధములగును. మరల ప్రయోజనలక్షణలోని 8 విధములును వ్యంగ్యముయొక్క గూఢతను బట్టి రెండేసి అయి మొత్తము 16 అగును. ధర్మగతము, ధర్మిగతము అను భేదమువలన ఈ పదహారును ముప్పదిరెండగును. ఇట్లు మొత్తము 40 భేదములైనవి. ఇవి యన్నియు పదగతములు వాక్యగతములు అని రెండేసి విధములగుటచేత మొత్తము 80 విధములైన లక్షణలు వచ్చును. (చూ. ఉదాహరణములకు సాహిత్య దర్పణము II పరి.).

**లక్షణలక్షణ** : జహల్లక్షణ, జహద్వాచ్య, జహదభిధేయ దీని నామాంతరములు. పూర్తివివరములకు ముందు చూ. లక్షణ, సంబంధ నిబంధనాలక్షణ.

సంబంధనిబంధనాలక్షణ రెండువిధములుకాగా అందు ఈ లక్షణలక్షణ యొకటి. రెండవదానిని గురించి తెలిసికొనుటకు చూ. ఉపాదానలక్షణ.

> అర్పణం స్వస్యవాక్యార్థే
> పరస్యాన్వయ సిద్ధయే
> ఉపలక్షణ హేతుత్వా
> దేషాలక్షణలక్షణా

—(సాహిత్యదర్పణము II పరి. 40 పే. 7 శ్లో.).

ముఖ్యార్థబాధ కలిగినపుడు దానితో సంబంధముగల మరొక యర్థమేగదా లక్ష్యార్థము. ఈ లక్ష్యార్థము సిద్ధించుటకై ముఖ్యార్థము పూర్తిగా తాన దృశ్యమై పోయినపుడు లక్షణలక్షణ. మరియొకని లాభముకొఱకై (అన్వయ సిద్ధి) తన స్వార్థమును విడిచిపెట్టువానివంటిదీ లక్షణలక్షణ.

స్వసిద్ధయేపరాక్షేపః పరార్థం స్వసమర్పణం । ఉపాదానం లక్షణంచే। త్యుక్తః శుద్ధైవ సాద్విధా." (కా. ప్ర. జమ్ములమడకవారిది 66 పేజి).

స్వసిద్ధికై పరాక్షేపము ఉపాదానలక్షణ. పరార్థమై స్వసమర్పణము లక్షణలక్షణ. ఉపాదానలక్షణలో ముఖ్యార్థము, లక్ష్యార్థము రెండును ఉండును. లక్షణలక్షణలో లక్ష్యార్థము మాత్రమే ఉండును. ఈ రెండింటికి

భేదమిది. ఉపాదానలక్షణ స్వార్థమునకై పరార్థమును గ్రహింపగా దానికి వ్యతిరేకముగా లక్షణలక్షణ పరార్థమునకై స్వార్థమును విడిచిపెట్టినది: ఇది చమత్కారముగా చెప్పిన లక్షణము.

లక్షణలక్షణ రూఢినిబట్టి ప్రయోజనమునుబట్టి రెండువిధములు. రూఢికి ఉదా :- వాడు పనిలో కుశలుడు (వివరణకు చూ. సంబంధనిబంధన) ప్రయోజనమునకు ఉదా:- గంగలో గొల్లపల్లె (వివరణకుచూ. సంబంధ నిబంధన).

అత్యంత తిరస్కృతవాచ్యమునకు ఈ లక్షణలక్షణ అను శబ్ద శక్తి భేదమే మూలము. (చూ. అంత్యంతతిరస్కృతవాచ్యము.)

**లక్షణామూలధ్వని :** వివరములకు ముందు చూ. ధ్వని, లక్షణ. లక్షణాశక్తి ఆధారముగా ప్రవర్తించు ధ్వని లక్షణామూలధ్వని. చూ. అభిధామూల ధ్వని. (ధ్వనియొక్క రెండవ భేదము).

ఈ లక్షణామూలధ్వనినే అవివక్షితవాచ్యము (చూ.) అందురు.

వాచ్యార్థమునకు బాధకలుగగా లక్షణాశక్తివలన లక్ష్యార్థము లభిం చును. ఆ లక్ష్యార్థము స్వస్వరూపమును అప్రధానముగా చేసి వ్యంగ్యార్థ మును బోధించును. అందుచేతనే యిది లక్షణామూలధ్వని.

ఉదాహరణములకు చూ. అత్యంత తిరస్కృతవాచ్యము; అర్థాంతర సంక్రమితవాచ్యము (ఇవి లక్షణామూలధ్వనియొక్క రెండు భేదములు. ఇవి పదగత, వాక్యగత భేదములచే నాల్గువిధములగును).

**లక్షణామూలవ్యంజన :** వివరములకు ముందు చూ. వ్యంజన, లక్షణ.

వ్యంజన రెండువిధములు. అందు లక్షణామూలవ్యంజనయొకటి. దీనికే లక్షణాశ్రయవ్యంజన అనియు నామాంతరము. రెండవదానిని గురించి చూ. అభిధామూలవ్యంజన.

వ్యంజన లక్షణాశక్తిమీద ఆధారపడినపుడు (అనగా వ్యంగార్థములక్ష్యా ర్థముమీద ఆధారపడినపుడు) లక్షణామూలవ్యంజనయగును. ముఖ్యార్థమునకు బాధకలిగినపుడు తత్సంబంధముగల అర్థాంతరమును రూఢినిబట్టికాని ప్రయో జనమునుబట్టికాని బోధించునది లక్షణాశక్తి. (చూ. లక్షణ). ఆ తరువాత వ్యంజనాశక్తికూడా అక్కడ ప్రవర్తించి మనోహరమైన అర్థాంతరమును స్ఫురింపజేయును. అదియే లక్షణామూలవ్యంగ్యము.

ఉదాహరణము :- "గంగలో గొల్లపల్లె." లక్షణాశక్తివలన గంగా తీరమున గొల్లపల్లె అని అర్థము వచ్చును. (దీనికి వివరణ 'లక్షణ' అను శీర్షి కలో చూ.) ఇట్టి అర్థము చెప్పుకొనుటకు కారణము రూఢికాదు; ప్రయో జనము. గంగాప్రవాహపు శీతత్వపావనత్వాదులున్న గొల్లపల్లెయని చెప్పట ప్రయోజనము. ఇప్పుడు వ్యంజనాశక్తి ప్రవర్తించి ఆ గొల్లపల్లె చల్లగా పవిత్రముగా వాసయోగ్యముగా నున్నదని వ్యక్తముచేయును.

**లక్ష్యక్రమము :** చూ. సంలక్ష్యక్రమవ్యంగ్యము.

**లక్షితలక్షణ :** ముఖ్యార్థమునకు బాధకలిగినప్పుడు దానికి సంబంధముగల అర్థాంతరమును తెలుపు శబ్దశక్తి లక్షణ. (వివరములకు చూ. లక్షణ). ముఖ్యార్థ సంబంధము సాక్షాత్ సంబంధముకాక పరంపరాసంబంధమైనచో అది లక్షిత లక్షణ అగును.

ఉదాహరణమిది :- ద్విరేఫము తేనెత్రాగుచున్నది— ద్విరేఫమనగా రెండురేఫములు గలది అని వ్యుత్పత్త్యర్థము. రెండురేఫములుగల శబ్దము తేనెత్రాగుట యేమి? ఇది ముఖ్యార్థబాధ. ద్విరేఫ పదమునకు రూఢినిబట్టి భ్రమరము అని అర్థము. భ్రమరమనుశబ్దము రెండురేఫములు గలది. (1, 3 అక్షరములందలి రేఫములు). భ్రమర శబ్దమునకు తుమ్మెద అని ముఖ్యార్థము. ఇట్లు ద్విరేఫ—భ్రమర—తుమ్మెద అను పరంపరాసంబంధమునుబట్టి ఈ లక్షణ వర్తించును. ఇక్కడ ద్విరేఫమునకు తుమ్మెద అనునది లక్ష్యార్థము.

**లజ్జాత్యాగము :** శృంగారావస్థలందొకటి. (చూ. శృంగారావస్థలు).

నిర్వచనములు :- (1) "వ్రీడాత్యాగోఽథ నిర్లజ్జా" అని ప్రతాపరుద్రీయము (ప్ర. రు. రసప్రక. 232 పే 93 సం.). సిగ్గును విడిచిపెట్టుట లజ్జాత్యాగము.

ఉదాహరణము :- వరూధిని మన్మథావిష్టయై లజ్జాత్యాగము చేసిన తీరును పెద్దన వర్ణించెను. మ అని చింతించుచు మీనకేతన ధనుర్జ్యాముక్త నారాచ దు । ర్దిన సమ్మూర్ఛిత మానసాంబురుహయై దీపించు పెందత్తరం । బునఁ బెల్లుత్తిన లజ్జ నంఘ్రికటకంబుల్ మ్రోయ నడ్డంబు ని । ల్చిన నయ్యచ్చరఁజూచి చేరఁజని పల్కెన్ వాఁడు విభ్రాంతుఁడై" "ఇట వరూధిని లజ్జాత్యాగముచేసి (పేలుత్తినలజ్జ) ప్రవరుని మార్గమున కడ్డము నిలిచినది." (కా. లం. సం. III-399 పేజి).

**లలితము :** వివరములకు ముందు చూ. అలంకారము. ఇది స్వభావజములైన అలంకారములందొకటి. (చూ. స్వభావజములు). ఒకఅనుభావము (చూ. అనుభావము). ఒకశృంగారచేష్ట(చూ. శృంగారచేష్టలు.).

నిర్వచనము :- (1) "సుకుమారాంగ విన్యాసో మసృణో లలితం భవేత్" అని దశరూపకము (ధ. ద. రూ. రెండవప్రకాశము 30 పేజి). మసృణము, సుకుమారము, అయిన అవయవ విన్యాసమే లలితము. 10 స్వభావజాలంకారములందొకటి (2) "సుకుమారోఽంగ విన్యాసో లలితం పరికీర్త్యతే" అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. రసప్రక. 303 పేజి). సుకుమారముగా అవయవములను ఉంచుట లలితము. 18 శృంగారచేష్టలందొకటి. (3) "సుకుమార తయాంగానాం విన్యాసో లలితం భవేత్" అని సాహిత్యదర్పణము (కా. లం. సం. తృతీయ 382 పేజి). కర చరణాది-అవయవములను ఒయ్యారముగా నుంచుట లలితము. 18 స్వభావజములలో

నొకటి (చూ. స్వభావజములు). (4) భాసురతనువల్లీవిన్యాసము లలితమ్ము" అని నరసభూపాలీయము (III-109 పద్యము). 18 శృంగారచేష్టలందొకటి.

ఉదాహరణము :- అంతవరకు నాట్యము చేసినదామె. ఇంతలో కాలియందియ కీలూడినది. దానిని సరిజేసికొనుటకై ఆగినది. ఆమె చేతులు చెమటపోసినవి. ఆ చేతులను మృదంగముమీద చేర్చి కీలెడలిన నూపురమును సరిజేసికొనుటకై తన పాదమును దూతిక చేతిలో మోపి నిల్చినది. అప్పుడామె స్తనకంపము ఆమె నిట్టూర్పుల వేగమును సూచించెను. ఇట్టి అవయవవిన్యాసమును చూచి సభయంతయు మన్మథుని పాలయ్యెను. చం 'వడియు శ్రమాంబులోడు భుజవల్లి మృదంగము మీఁదఁజేర్చి కీ। లెడలిన నూపురంబు ఘటియింపఁగ దూతి కరారవింద మం। దడుగిడి కంపిత స్తనరయంబున నూర్పులు దోఁప నింతి య। య్యెడ నటియించి నిల్చె సభయెల్ల ననంగుని పాలుసేయుచున్'' —కా. అం. సం. III-111 పద్యము (సింగభూపాలీయమునందలి శ్లోకమున కనువాదము).

శ్లో॥ స్వేదక్లేదిత కంకణాం భుజలతాం కృత్వా మృదంగాశ్రయాం
చేటీహస్త సమర్పితైకచరణా మంజీర సంధిత్సయా
సాభూయ స్తన కంపసూచితరయం నిశ్వాసమాముంచతీ
రంగస్థాన మనంగ సాత్కృతవతీ తాళావదా తస్థుషీ

—కా. అం. సం. III-382 పేజి.

*లాక్షణికము :* లక్షకమునకే మరొకపేరు. వివరములకు చూ. లక్షకము, లక్షణ.

*లింగము :* చూ. అనుమాన ప్రమాణము.

*లింగి :* చూ. అనుమానప్రమాణము.

*లీల :* స్వభావజమైన అనుభావమిది (చూ. అనుభావము. చూ. స్వభావజములు). శృంగారచేష్టలందొకటి. (చూ. శృంగారచేష్టలు).

లీలకు నిర్వచనములు :- (1) ''ప్రియానుకరణం లీలా మధురాంగ విచేష్టితైః'' అని దశరూపకము (ధ. ద. రూ. రెండవప్రకాశము 29 పేజి 61 సంఖ్య). తీయని చేష్టలతో తన ప్రియుని అనుకరించుట లీల. ఇరువది అలంకారములలో ఒకటి (చూ. అలంకారములు). (2) ''ప్రియానుకరణం లీలా వాగ్భిర్గత్యాథ చేష్టితైః" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక : 298 పేజి 6 సంఖ్య). వాక్కులచే నడకచే చేష్టలచే ప్రియుని అనుకరించుట లీల. 18 శృంగారచేష్టలందొకటి (చూ. శృంగారచేష్టలు). (3) ''అంగైర్వేషై రలంకారైః ప్రేమభి ర్వచనై రపి। ప్రీతిప్రయోజితై ర్లీలాం ప్రియస్యాను కృతింవిదుః" అని సాహిత్యదర్పణము. (కా. అం. సం. తృతీయ 379 పేజి 8 సంఖ్య). ఆంగికాభినయములచేతను, వేషముల చేతను, అలంకారములచేతను ప్రేమాలాపముల చేతను ప్రియుని అనుకరించుట లీల. 28 అలంకారములందు ఒక స్వభావజమైన అలంకారము.

చూ. అలంకారములు). (4) అధిపుని యలఘుగుణానుకృతి లీలయగు'' అని నరసభూపాలీయము. (III-103పద్యము.)

లీలకుదాహరణము :. 'తామరతూళ్లనే పాములకడియములుగా పెట్టుకొనెను; వాల్జడనే జటాజూటముగా ముడిచికొనెను. అదిగో హరుని అనుకరించుచున్న ఆ పార్వతీదేవి జగములను కాపాడుగాక!' ఇందు ప్రియవేషానుకరణము లీల. ''మృణాల వ్యాళవలయా వేణీబంధ కపర్దినీ। హరానుకారిణీ పాతులీలయా పార్వతీ జగత్'' -అం. సా. ద. III-57 పేజి 137 సంఖ్య. గీ పరగఁ దమ్మితూటి పాఁపకడెంబులు, వరలవేణియనుకపర్దకంబు హరునిననుకరించు నాపార్వతీదేవి లీలతోడ మిమ్ము నేలుగాక". అని సన్నిధానంవారి అనువాదము. —కా. లం. సం. 379 పేజి.

**వత్సలరసము :** ఇది అష్టరసములందుగాని నవరసములందుగాని చేరినదికాదు. కాని దీనిని భరతుడంగీకరించెనని సాహిత్యదర్పణకర్త ప్రతిపాదించెను. (చూ. కా. లం. సం. III-304 పేజి).

వత్సల రసస్వరూపమును సాహిత్యదర్పణమిట్లు నిరూపించెను. (సా. ద. III-186 పే. 251-54 శ్లో.) దీనికి స్థాయిభావము వత్సలత లేదా స్నేహము. పుత్రుడు, భ్రాత మొదలయినవారు ఆలంబన విభావములు. వారి చేష్టలును, విద్యాశౌర్య దయాదులును ఉద్దీపన విభావములు. కౌగిలింత, శరీరస్పర్శ, తల మూర్కొనుట, చూపులు, పులకాంకురములు, ఆనందాశ్రువులు మొదలైనవి అనుభావములు. అనిష్టశంక, హర్షము, గర్వము మొదలైనవి వ్యభిచారిభావములు. పద్మగర్భచ్ఛవివర్ణము. లోకమాత దేవత. వీనిచే వత్సల రసమభివ్యక్తమై యాస్వాద యోగ్యమగుచున్నది.

ఉదాహరణము :- దేశేదేశే కళత్రాణి దేశేదేశే చ బాంధవాః తంతుదేశం నపశ్యామి యత్రభ్రాతా సహోదరః'' (కా. లం. సం. III-305 పే.). ఈ మాటలు శ్రీరాముడన్నవి. ప్రతిదేశమందును కళత్రములు లభింతురు. ప్రతిదేశమందును చుట్టములు లభింతురు. కాని సహోదరుడు (తోఁబుట్టువు) లభించు దేశమును నేను చూడలేదు.' ఇందు భ్రాత్రాలంబనముగల్ల వత్సలరసము వ్యక్తమగుచున్నది.

**వర్ణనలు (వర్ణ్యములు) :** చూ. మహాకావ్యము, సర్గబంధము.

(1) సంధ్యా సూర్యేందురజనీ। ప్రదోషధ్వాంతవాసరాః ప్రాతర్మధ్యాహ్న మృగయా। శైలర్తు వనసాగరాః। సంభోగవిప్రలంభౌ చ మునిస్వర్గపురాధ్వరాః। రణప్రయాణోపయమ మంత్రపుత్రోదయాదయః। వర్ణనీయా' అని సాహిత్యదర్పణము (సా. ద. VI పరి. 353 పేజి). మహాకావ్యమున వర్ణనీయములు-సంధ్య, సూర్యుడు, చంద్రుడు, రాత్రి, సాయంకాలము, చీకటి, దినము, ప్రాతస్సు, మధ్యాహ్నము, మృగయ, శైలము, ఋతువులు, వనములు, సాగరము, సంభోగము, విప్రలంభము, ముని,

స్వర్గము, పురము, యజ్ఞము, యుద్ధము, ప్రయాణము, ఉపయమము, మంత్రము, పుత్రోదయము మొదలగునవి.

(2) నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనమ్ । ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవాః । విప్రలంభో వివాహశ్చ కుమారోదయ వర్ణనమ్ । మంత్రద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయాఅపి'' అని ప్రతాపరుద్రీయము. (ప్ర. రు. కావ్యప్ర. 82 పేజి). నగరము, సముద్రము, శైలము, ఋతువులు, చంద్రోదయ, సూర్యోదయము, ఉద్యానవనము, జలక్రీడ, మధుపానము, రతోత్సవము, విప్రలంభము, వివాహము, కుమారోదయము, మంత్రము, ద్యూతము, ప్రయాణము, యుద్ధము, నాయకాభ్యుదయము-

(3) పురసింధు నగర్త్వినశశి సరసీవనమధు రతిప్రసంగ విరహముల్ పరిణయ తనయోదయ నయవిరచన యాత్రాజి దౌత్య విభువర్ణనముల్' అని నరసభూపాలీయము (కా. లం. సం. II-166 ప.). పురము, సముద్రము, శైలము, ఋతువులు, సూర్యచంద్రులు, సరస్సు, వనము, మధువు, రతి ప్రసంగము, విరహము, పరిణయము, తనయోదయము, నయవిరచనము, యాత్ర, యుద్ధము, దౌత్యము, ప్రభువర్ణన. (చూ. కా. లం.సం. II-234 36 పేజి).

వాకోవాక్యము : ఉక్తి ప్రత్యుక్తి మద్వాక్యం చ వాకోవాక్యం విదుర్బుధాః। ద్వయోర్వక్త్రో స్తదిచ్ఛంతి బహూనామపి సంగమే' (కా. లం. సం. 262 పేజి). వాక్యము, ప్రతివాక్యము ఇరువురు వ్యక్తులకు మధ్యగాని బహు వ్యక్తులమధ్యగాని నడచినట్లు రచించుట వాకోవాక్యము. "వాక్యంచ ఉప వాక్యం చ వాకోవాక్యం (కా. లం. సం. II-262 పేజి).

''ఇది ఋజూక్తి, వక్రోక్తి, వైయాత్యోక్తి, ప్రశ్నోత్తరోక్తి, చిత్రోక్తిఅని పంచవిధములుగా సరస్వతీకంఠాభరణమునఁగలదు'' (కా. లం. సం. II-262 పేజి).

ఉదాహరణము :- "మ॥ చనుదున్ సుందరి!-పాంథుఁడా చనుము - నీ స్వాంతంబునన్ శోకముం గనఁగాఁ బోకుము - శోకమెందులకికం - గన్నీరు రాత్రేల - వే చనవైతంచునె - తొందరేల ననుబుచ్చన్ నీకు - నీతోడఁబోవనె వాంఛించుచు నిట్లు వేగపడు నా ప్రాణంబులత్యంతమున్''. -(కా. లం. సం. II-262 పే.). ఇది ప్రియునికిని ప్రేయసియొక్కయు ఉక్తి ప్రత్యుక్తి రూపమగు వాకో వాక్యము.

వాక్యపాకము : యదేకస్మిన్ వస్తుని మహాకవీనామనేకోఽపి పాఠః పరిపాక వాన్ భవతి, తస్మాద్ రసోచిత శబ్దార్థ సూక్తి నిబంధనః పాకః । యథాహుః గుణాలంకారరీత్యుక్తి శబ్దార్థ గ్రథనక్రమః । స్వదతే సుధియాం యేన వాక్యపాకః సమాంప్రతి'' (కా. మీ. V అధ్యా 52 పేజి).

వాక్యము : యోగ్యత, ఆకాంక్ష, ఆసత్తి అను మూడు ధర్మములుగల పద సమూహమే వాక్యము, ''వాక్యంస్యాద్ యోగ్యతా కాంక్షా సత్తి

యుక్తః పదోచ్చయః'' –(సా. ద. II–26 పేజి 1 శ్లో.).

పై నిర్వచనమునుబట్టి వాక్యమునకు లక్షణములివి. (1) వాక్యము కొన్ని పదముల సమూహము. (2) ఆ పదముల అర్థము ఒకదానితో ఒకటి సంబంధించియుండవలెను. (3) అందులో ఏ ఒక్క పదము దగ్గరను భావము పూర్తికాకుండ ఆగకూడదు. (4) ఆ పదముల ఉచ్చారణలో కాల విరామము లుండరాదు.

వాక్యనిర్వచనమున వాడిన యోగ్యత, ఆకాంక్ష, ఆసత్తి అను పారి భాషికములకు లక్షణములివి :- (1) యోగ్యత :- పదములకు అర్థములకు ఒకదానితో ఒకదానికుండు సంబంధమునకు ఎట్టిబాధయు కలుగకుండుట. ''యోగ్యతా పదార్థానాం పరస్పర సంబంధే బాధాభావః'' –(సా. ద. II–24 పేజి). అనగా పదార్థములకు పరస్పర సంబంధము చక్కగా అమరియుండుట. దీనినే మరొక విధముగా చెప్పవలెనన్న ఒక వాక్యములో ఉండు పదములు వాటిమధ్యనుండు అర్థమున కనుకూలముగా సంబంధమును కలిగి ఉండవలె. ఇదే యోగ్యత. ఉదా :- 'అగ్నితో తడుపుచున్నాడు'– అగ్నికి తడుపుటఅనుధర్మములేదు. కనుక పదార్థముల సంబంధమునకు ఇక్కడ బాధ కలిగినది. ఇది యోగ్యతారహితము కనుక వాక్యము కాదు. (2) ఆకాంక్ష :- అర్థప్రతీతికి సమాప్తి లేకుండా ఉండుటయే ఆకాంక్ష. ''ఆకాంక్షా ప్రతీతి పర్యవసాన విరహః.''–(సా. ద. III–24 పేజి.). వక్తకు ఒకభావమును పూర్తిచేయవలెనను కోరిక ఉండవలెను. లేనిచో ఆకాంక్ష ఉండదు, వాక్యములోని పదములు ఒక సంపూర్ణాభిప్రాయమునకు అను గుణముగా నుండనిచో ప్రతి పదము కడను అర్థప్రతీతి పూర్తి అయిపోవును. శ్రోత ఒక భావమును సంపూర్ణముగా తెలుసుకొనవలెననుజిజ్ఞాస కలిగి యుండును. అతనికి ఆకాంక్ష అవసరము. ఉదా :- 'గోవు గుఱ్ఱము పురుషుడు ఏనుగు' అను పద సమూహములో ప్రతిపదముదగ్గరను అర్థప్రతీతి సమాప్తమగుచున్నది. ఆకాంక్ష లేకుండా పోయినది. కనుక ఇది వాక్యము కాదు. (3) ఆసత్తి :- అర్థబోధకు విచ్ఛేదము లేకపోవుటే ఆసత్తి. ''ఆసత్తిర్బుద్ధ్యవిచ్ఛేదః'' –(సా. ద. II–25 పేజి). ఒక భావమును చెప్పుటలో పదముల ఉచ్చారణ మధ్య వ్యవధానము, విరామము లేకపోవుటే ఆసత్తి (Close proximity) ఉదా :- ఈ రోజు పలికిన 'దేవదత్తుడు' అను పదము మరొకరోజున పలికిన 'పోవుచున్నాడు' అను పదము కలిసి వాక్యము కాజాలదు. కారణము ఆ రెండింటికిని ఆసత్తి లోపించుటే.

*వాచకము* : పూర్తివివరములకు ముందు చూ. అభిధ.

అభిధాశక్తివలన వాచ్యార్థమును బోధించు శబ్దమే వాచకము. తక్కిన శబ్దభేదములకు చూ. లక్షకము, వ్యంజకము.

వాచకమగు శబ్దము సంకేతితార్థమును మాత్రమే బోధించును. ఈ సంకేతము స్వరూపమునుబట్టి నాలుగు విధములు. కనుక వాచకముకూడా

నాలుగువిధములు (1) జాతి సంకేతమును తెల్పు శబ్దములు జాతి వాచకములు. ఉదా :- గోవు. (2) గుణసంకేతమును తెల్పు శబ్దములు గుణవాచకములు ఉదా :- నీలము. (3) క్రియాసంకేతమును తెల్పు శబ్దములు క్రియావాచకములు ఉదా :- వండుచున్నది. (4) ద్రవ్య సంకేతమును తెల్పు పదములు ద్రవ్యవాచకములు. ఉదా:- రాముడు.

అర్థబోధక స్వభావమునుబట్టి. వాచకము నాలుగు విధములు. (1)యౌగికము (2) రూఢము (3) యోగరూఢము (4) యౌగికరూఢము. ఇందు నాల్గవదానిని చెప్పినవాడు ముక్తావళీకర్త. (వివరములకు చూ. ఆయా శీర్షికలు).

**వాచకుడు** : సప్తవిధకవులందు వాచకుడొకడని అప్పకవి పేర్కొనెను.

"బహుతరానుప్రాస పదబంధనియమంబు వదలక కృతిసేయు వాచకుండు" అని అప్పకవి చెప్పిన నిర్వచనము.

**వాచ్యము** : అభిధాశక్తిచే బోధింపబడు శబ్దార్థము—వాచ్యము. దీనినే అభిధేయము, శక్యము, సంకేతితము, ముఖ్యార్థము అనియు అందురు. వివరములకు చూ. అభిధ.

**వాచ్యసిద్ధ్యంగము/వాచ్యాంగము**: చూ. గుణీభూతవ్యంగ్యము;మధ్యమకావ్యము.

గుణీభూతవ్యంగ్యముయొక్క అష్టభేదములందు ఒకటి. మిగిలినవాని వివరములకు చూ. అగూఢము, అపరాంగము, సందిగ్ధము, తుల్యప్రాధాన్యము, కాక్వాక్షిప్తము, అరుచిరము, అప్రకాశము.

వ్యంగ్యార్థమే వాచ్యార్థము సిద్ధించుటలో అంగమయినచో అది వాచ్యసిద్ధ్యంగము. ఒక కావ్యమున అర్థము కుదరకపోయినపుడు వ్యంగ్యార్థమువలన కుదరవచ్చును. అదియే వాచ్యసిద్ధ్యంగము.

ఉదాహరణము :- "తన శరధారచే రిపుశౌర్యరూప సూర్యవైభవమును వారించుచు నరసభూపాలుని ధనుర్మేఘము ప్రకాశించును."

కం॥ ధారుణి శ్రీ నరసింహుని
నీరంధ్ర ధనుర్వినీల నీరదమమరున్
దారుణతర శరధారా
వారితరిపుశౌర్య సూర్యవైభవమగుచున్

—నరసభూపాలీయము II ఆ. 158 ప.

ఇందు మేఘమునుండి శరధారవచ్చి సూర్యుని వారించుచున్నట్లున్నది. శరధార అనగా బాణధార. అది మబ్బునుండి వెలువడుట పొసగదు. వాచ్యార్థము సిద్ధించుటకై 'శరధార' అను పదము జలధార అను అర్థాంతరమును వ్యక్తము చేయును. ఇట్లు వాచ్యార్థసిద్ధికి వ్యంగ్యము అంగమైనది.

**వాసన** : లోకానుభవమువలన సహృదయుని హృదయమున నేర్పడి సుప్తదశలోనుండు సంస్కారమునే 'వాసన' అందురు. ఇది రసాస్వాదనకు ముఖ్యసాధనము. రతిహాసాదుల రూపమున వాసనలుండును.

(1) కావ్యగత విభావాదులు సహృదయుని హృదయమున వాసనా రూపముననున్న స్థాయిభావమును వ్యక్తముచేయుననియు, అట్లు వ్యక్తమైన స్థాయిభావమే రసమనియు అభినవగుప్తుని అభివ్యక్తివాదము (చూ. అభివ్యక్తివాదము).

(2) "సవాసనానాం సభ్యానాం రసస్యాఽస్వాదనం భవేత్ నిర్వాసనాస్తు రంగాంతః కాష్ఠ కుడ్యాశ్మ సన్నిభాః" అని ధర్మదత్తుడు చెప్పెనని సాహిత్యదర్పణము పేర్కొనెను -(సా. ద. III-79 పేజి). వాసనతోకూడిన సభ్యులకే రసాస్వాదనశక్తి యుండుననియు, నిర్వాసనులైనవారు నాటకాదులను చూచుచున్నను రసాస్వాదన మాచరింపలేక రంగమందలి స్తంభములు, గోడలు రాళ్లువలె నుందురనియు భావము.

(3) "రసానుభూతి అందరకును కలుగదు. ఆ అనుభూతి సంస్కారవంతులైన సహృదయులకు మాత్రమే కలుగును సంస్కారమనగా రత్యాది భావములను ఆస్వాదింపజేయు హృదయధర్మము (Instinct). ఈ భావములు అప్పటికప్పుడు కలుగునవి కావు. బీజరూపమున సహృదయుల మనస్సుల లోనే ఉండును. ఈ బీజములు (రత్యాదిభావములు) మొలకెత్తుటకు అవకాశము కలుగు పర్యంతమును సుప్తావస్థలో హృదయమందు అణగిఉండును. ఇవియే వాసనలు అనబడును. ఈ వాసనల నిద్రావస్థయే 'నిర్వికారాత్మక చిత్తస్థితి" —డా పోణంగి శ్రీరామ అప్పారావు: నాట్యశాస్త్రము 226 పుట.

(4) న జాయతే తదాస్వాదో వినా రత్యాది వాసనామ్ । వాసనా చేదానీంతనీ ప్రాక్తనీ చ రసాస్వాదహేతుః । తత్ర యద్యాద్యా నస్యాత్తదా శ్రోత్రియ జరన్మీమాంస కాదీనామపి సాస్యాత్ । యది ద్వితీయానస్యాత్ తదా యద్రాగిణామపి కేషాంచిద్రసోద్బోధో నదృశ్యతే । తన్నస్యాత్—(సా. ద. III_79 పేజి). రత్యాదివాసనలేనివారికి రసాస్వాదము కలుగదు. వాసన యనునది రసాస్వాద హేతువు. అది రెండు విధములు. (1) ఇదానీంతని (ఈ జన్మకు సంబంధించినది లేదా ఇప్పటిది). (2) ప్రాక్తని (పూర్వజన్మలోనిది) ఇందు మొదటిదగు వాసన యక్కర లేనిచో శ్రోత్రియ జరన్మీమాంసకాదులకు గూడా రసాస్వాదము కలుగును. శ్రోత్రియాదులకు ఇదానీంతనియగు వాసనయుండదు. ప్రాక్తన వాసన యుండవచ్చును. రెండవదియగు ప్రాక్తన వాసన లేనిచో రక్తులగువారికి సైతము కొందరికి రసాస్వాదము కలుగదు. వీరికి ఇదానీంతన వాసనయున్నను ప్రయోజనము లేదు. కనుక ఈ రెండువాసనలుగలవాడే సవాసనుడు. అతడే సహృదయుడు. (చూ. సహృదయుడు).

**విక్షేపము** : స్వభావజములైన అలంకారములందొకటి. (చూ. స్వభావజములు, చూ. అలంకారములు). ఒక అనుభావము. (చూ. అనుభావము).

నిర్వచనము :- (1) "భూషాణా మర్ధరచనా మిథ్యా విష్వగవేక్షణమ్ రహస్యాఖ్యానమీషచ్ఛ విక్షేపో దయితాంతికే" అని సాహిత్యదర్పణము (కా. అం. సం. తృతీయ 392 పేజి 27 సంఖ్య). ప్రియుని సన్నిధిలో అలంకారములను సగముసగముగా పెట్టుకొనుట, నిష్కారణముగా నలువైపులకు చూపులు తిప్పుట, కొంచెము రహస్యముగా మాటాడుట మొదలైన చేష్ట విశేషము. 18 స్వభావజములందొకటి.

ఉదాహరణము:- కం॥ "అలవిరిసిన వేనలితో । నలదిర్చిన బొట్టుతోడ నళుకును గొన్న । ట్లరయుచు దెసలం బ్రియుతో । జరుపును గోమలి రహస్య సంభాషణముల్" —కా. అం. స. (సాహిత్యదర్పణమందలి శ్లోకమునకు సన్నిధానంవారి తర్జుమా-III-392 పేజి). శ్లో॥ ధమ్మిల్ల మర్ధముక్తం కలయతి, తిలకంతథా సకలం । కించిద్వదతి రహస్యం చకితం విష్వగ్విలోకతే తన్వీ —అం. సా. ద. తృతీయ పరిచ్ఛేదము 62 పేజి 150 సంఖ్య.

విచ్ఛిత్తి : వివరములకు ముందు చూ. అలంకారములు. ఇది స్వభావజమైన అలంకారములలో నొకటి (చూ. స్వభావజములు). ఒక అనుభావము. (చూ. అనుభావము). ఒక శృంగారచేష్ట.

విచ్ఛిత్తికి నిర్వచనములు :- (1) "ఆకల్పరచనాల్పాపి విచ్ఛిత్తిః కాంతిపోషకృత్" అని దశరూపకము (ధ. ద. రూ. రెండవప్రకాశము 29 పేజి 63 సంఖ్య). వస్త్రాదుల అలంకరణము ఎంత తక్కువైనను కాంతిని పెంపొందించునది అయినచో అది విచ్ఛిత్తి. 20 అలంకారములలో ఇది ఒకటి (చూ. శృం. చేష్టలు) (చూ. అలంకారములు). (2) "విచ్ఛిత్తి రతిరమ్యత్వం స్వల్పైరపి విభూషణైః" అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర రు. రసప్రక. 299 పేజి 8 సంఖ్య). స్వల్పమైన నగలచేతగూడా అతిరమణీయముగానుండుట విచ్ఛిత్తి. 18 శృంగారచేష్టలందొకటి. (3) "స్తోకాప్యాకల్ప రచనావిచ్ఛిత్తిః కాంతిపోషకృత్" అని సాహిత్యదర్పణము (కా.అం.సం. తృతీయ 383 పేజి 12 సంఖ్య). అలంకారములు కొద్దిగా పెట్టుకొన్నను అవి కాంతిని పోషించినచో అది విచ్ఛిత్తి. 18 స్వభావజాలంకారములలో ఇది యొకటి. (చూ. స్వభావజములు). (4) "సొమ్ములల్పములయ్యున్ భాసిల్లెడు శృంగార వికాసము విచ్ఛిత్తియయ్యె" అని నరసభూపాలీయము (III-112 పద్యము).

ఉదాహరణము :- 'ఆమె కొద్ది నగలే పెట్టుకొన్నది. నుదుట నెలవంకవంటి సన్ననిబొట్టే పెట్టుకొన్నది. అయిననేమి ? ఆమె యొయ్యారము కనులవిందుగా నున్నది. కొద్ది చుక్కలు, చంద్రరేఖగల విదియనాటిరాత్రి వలె ఆమె అందముగా నున్నది.' చం॥ పరిమితభూషణంబులును ఫాలముపై నెలవంక నామముం । బరగ నొయారియై నయనపర్వమొనర్చె వధూలలామ తా । విరళగనేయతారలు నవీనత రేందు కళావిలాసముల్ । వరుసవెలుంగఁగా విదియనాటి విభావరి వోల్పుకై వడిన్" —కా. అం. సం. III-113వ పద్యము.

*వితర్కము* : వ్యభిచారిభావములందొకటి చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- (1) "తర్కో విచారః సందేహాత్ భ్రూశిరోఽంగుళిన ర్తకః" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 64 పేజి 36 సం.) సందేహమువలన కలుగు విచారము వితర్కము. కనుబొమలు, శిరస్సు, చేతివ్రేళ్లు కదలుట అనుభావములు. (2) "సందేహాత్కల్పనానంత్యం వితర్కః పరికీర్తితః". అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. రసప్రక. 292 పేజి 33సం. సందేహమువలన అనంతములైన కల్పనలు చేయుట వితర్కము. (3) "తర్కో విచారః సందేహాద్ భ్రూశిరోఽంగుళినర్తకః" అని సాహిత్యదర్పణము (సా. ద. III_156 పేజి 171 శ్లో.) దశరూపకముననుసరించినది.(4)"సందేహాభ్యుదయ బహుత్వము వితర్కము" అని నరసభూపాలీయము III_365 పేజి. 83 ప.). (5) "సందేహాద్యనంతరం జాయమాన ఊహో వితర్కః". అని రసగంగాధరము. కా లం. సం. III_365 పేజి.28 సం.) సందేహము మొదలైనవి కలిగిన తరువాత పుట్టు ఊహయే వితర్కము. (6) "నరసభూపాలీయలక్షణములో నీ యర్థము (రసగంగాధర లక్షణము) కానరాదు. కేవలము పెక్కు (సందేహములు గలుగుటకాక సందేహానంతరమునఁ గలిగిన యూహయే వితర్కము. అదియు నిశ్చయానుకూలముగా నుండవలెను. (కా. లం సం. III_365) అని శ్రీ సన్నిధానంవారు.

ఉదాహరణము :- సీతనుగూర్చి రాముడనుకొన్న మాటలు —ఆ సీతాదేవి భూలోకమందు ఉండకయే పోయినచో నా జీవితమిప్పుడెట్లు నిలిచియుండును ? ఆలంబనము లేనిదే ఆశ్రితమగు వస్తువు ఉండదుగదా!" శ్లో। "యది సా మిథిలేంద్రనందినీ నితరామేవ న విద్యతే భువి అథ మే కథమస్తి జీవితం నవినాలంబన మాశ్రితస్థితిః" -రసగంగాధరము (కా. లం. సం. III_366 పేజి) ఇందు సీత గూర్చిన సందేహము విభావము. భ్రూశిరోఽంగుళి చలనములు అనుభావములు ఊహించుకొనదగును. వితర్కము వ్యజ్యమానమయినది. (భావధ్వని).

*విద్ధళి* : ఇది ఉదాహరణ కావ్యము భేదములందొకటి. మిగిలినవానినిగురించి చూ. (1) సద్దళి. (2) షద్దళి. (3) ఉత్ఫుల్లకము.

"సంబుద్ధితోడ విషమ విభక్తులతోడఁ బలికిన కృతియు విద్ధళి" అని అప్పకవి. ఈ ఉదాహరణమున ఎనిమిది విభక్తులును ఉండును. కాని అవి నియతక్రమమున ఉండవు.

*విపరీతలక్షణ* : పూర్తి వివరములకు ముందు చూ. లక్షణ.

లక్ష్యార్థము ముఖ్యార్థమునకు విరుద్ధముగా నున్నపుడు విపరీతలక్షణ. ఒకడొక శత్రువునుద్దేశించి 'నీవు నాకుపకారమొనర్చితివి' అని పలికినచో విపరీతార్థము లక్ష్యార్థమగును. ఒకమూర్ఖునిగురించి వీడు బృహస్పతి అని పలికినచో విపరీతార్థము స్ఫురించును. ఇదియే విపరీతలక్షణ.

*విప్రలంభశృంగారము* : చూ. శృంగారము.

"అథశృంగారః —సద్వివిధః, సంభోగో విప్రలంభశ్చేతి... (ప్ర. రు. రసప్రక. 233 పేజి). విప్రలంభః పునరభిలాషేర్ష్యా విరహప్రవాస హేతుకత్వేన చతుర్విధః" ప్ర. రు. రసప్రక. 234 పేజి). శృంగారము రెండు విధములు. (1) సంభోగము. (2) విప్రలంభము. విప్రలంభము నాలుగు విధములు. (1) అభిలాష (2) ఈర్ష్య (3) విరహము (4) ప్రవాసము. అని ప్రతాపరుద్రీయము (వివరములకు చూ. ఆయా శీర్షికలు).

"విప్రలంభోఽథ సంభోగ ఇత్యేష ద్వివిధోమతః। తత్ర। యత్రతు రతిః ప్రకృష్టా నాభీష్టము పైతి విప్రలంభోఽసౌ అభీష్టం నాయకం నాయికాంవా సచ పూర్వరాగ మానప్రవాసకరుణాత్మకశ్చతుర్ధాస్యాత్ (సా. ద. III-162 పేజి. 186, 187 శ్లో) శృంగారము రెండు విధములు. (1) విప్రలంభము (2) సంభోగము. రతి ప్రకృష్టమై అభీష్టమును పొందక పోయినచో విప్రలంభమగును. అభీష్టమనగా నాయకునిగాని నాయికనుగాని అనిభావము. ఈ విప్రలంభము నాలుగు విధములు (1) పూర్వరాగము (2) మానము (3) ప్రవాసము. (4) కరుణము. అని సాహిత్యదర్పణము. (వివరములకు చూ. ఆయా శీర్షికలు).

నరసభూపాలీయము ప్రతాపరుద్రీయమునే అనుసరించినది.

*విప్రలంభాభాసము* : చూ. రసాభాసము.

*విబోధము* . బోధమనియు వ్యవహారము. వ్యభిచారిభావములందొకటి. (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- (1) "విబోధః పరిణామాదే స్తత్ర జృంభాక్షిమర్దనే" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 62 పేజి 29 సం.) మేల్కొనుట (?) విబోధము. ఆవులింత, కనులు నులుముకొనుట అనుభావములు. (2) విబోధశ్చేతనావాప్తిః జృంభాక్షి పరిమార్గకృత్" అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. రసప్రక. 286 పేజి 24 సం). చైతన్య ప్రాప్తియే విబోధము. ఆవులింత, కనులు నులుముకొనుట మొదలైనవి అనుభావములు. (3) "నిద్రాపగమహేతుభ్యో విబోధశ్చేతనాగమః జృంభాంగ భంగ నయన మీలనాంగావ లోకకృత్" అని సాహిత్యదర్పణము (సా. ద. III-144 పేజి 151 శ్లో.) నిద్ర, తొలఁగుటవలనను (తొలగించు కారణముల చేత) చైతన్యము ప్రాప్తించుట విబోధము. ఆవులింతలు, ఒడలు విరుచుకొనుట, కనులు తెఱచుట, అవయవములను చూచుకొనుట మొదలైనవి దానివలన కలుగు అనుభావములు. (4) "బోధమెఱుకఁ జెందుట" అని నరసభూపాలీయము. (III-78 ప.). (5) "నిద్రానాశోత్తరం జాయమానో బోధో విబోధః" అని రసగంగాధరము (కా. అం. సం. III-362 పేజి. 24 సం.) నిద్రానాశమయిన తరువాత కలుగు మెలకువయే విబోధము. (6) "నిద్ర పూర్తియైనపుడును, స్వప్నాంతమందును పెద్దశబ్దము వినుట

వలనను నిద్రానాశము కలుగును. కాన నివి విభావములు. అక్షిమర్దన, గాత్రమర్దనాదులనుభావములు" అని శ్రీ సన్నిధానంవారు (కా. లం. సం. III_362 పేజి).

ఉదాహరణము :- నరసభూపాలుడు రాజ్యమునకు రాగా సూర్య వంశపు రాజుల కీర్తి ఇప్పుడు జడత్వమును వీడి వికసించిన కనులతో ఆవు లించుచు మేల్కొన్నది. కం। "తరణి కులాధీశయశ। స్తరుణి జడత్వంబు మాని సంపుల్లసితాం బురుహాక్షియు జృంభితయై। చిరగతి మేల్కనియె। శ్రీ నృసింహుడు కలుగన్" —(కా. లం. సం. III_81 ప.) ఇందు నిద్రా నాశకారకుడగు నరసభూపాలుని అవతరణము విభావము. కనులు తెరచుట, ఆవులించుట అనుభావములు. వీనిచే విబోధము వ్యక్తమయినది. (భావధ్వని).

***విభ్రమము*** : వివరములకు ముందు చూ. అలంకారములు. ఇది స్వభావజము లయిన అలంకారములలో నొకటి. (చూ. స్వభావజములు.) ఒక అనుభావము (చూ. అనుభావము). ఒక శృంగారచేష్ట (చూ. శృంగారచేష్టలు).

నిర్వచనములు :- (1) "విభ్రమస్త్వరయాకాలే భూషాస్థాన విపర్యయః" అని (ధ. ద. రూ. 29 పేజి 64 సంఖ్య) దశరూపకము. ప్రియా గమనకాలమున తొందరపాటుచేత అలంకారములను తారుమారుగా ధరిం చుట విభ్రమము. 10 స్వభావజాలంకారములలో నొకటి. (చూ. స్వభావ జములు). (2) దశరూపక నిర్వచనమునే ప్రతాపరుద్రీయము స్వీకరించెను. 18 శృంగారచేష్టలందొకటి. (చూ. శృంగారచేష్టలు). (3) "త్వరయా హర్షరాగాదేర్దయితాగమనాదిషు అస్థాన భూషణాదీనాం విన్యాసో విభ్రమో మతః" అని సాహిత్యదర్పణము (కా. లం. సం. తృతీయ 378 పేజి 7 సంఖ్య) ప్రియుడరుదెంచుట మొదలైన సమయములందు సంతోషము చేతనో అనురాగముచేతనో—కంగారువలన భూషణాదులను తారుమారుగా పెట్టుకొనుట విభ్రమము. 18 స్వభావజాలంకారములలో ఒకటి. (4) "ఒడలఁ దొడవులిడఁ దడఁబడినన్ వెలయఁగ విభ్రమము" అని నరసభూపాలీయము (III_103 పద్యము). 18 శృంగారచేష్టలందొకటి.

ఉదాహరణము :- ఆమె గదిలోపల ముస్తాబగుచుండగా ప్రియుడు వచ్చుచున్నాడను వార్తనెవరో చెప్పిరి. ఆ సంతోషములో ఆమె ముస్తాబంతయు తారుమారైనది. కాటుకను నొసటిపై పెట్టుకొనెను. లత్తుకను కనులలో పూసుకొనెను. తిలకమును చెక్కిళ్లపై పెట్టుకొనెను. కం "తనప్రియుఁడు వచ్చెవాకిటి। కని సొగసుంజేసికొనుచు నంగన విని యంజనమును నొసటను, లత్తుకఁ గనులను, దిలకంబుఁబెట్టె గండస్థలిపై" -కా. లం. సం. III (సాహిత్యదర్పణమందలి శ్లోకమునకు సన్నిధానంవారి తర్జుమా). —379 పద్యము. శ్లో ॥ శ్రుత్వాయాంతం బహిఃకాంతమ సమాప్త విభూషయా। భాలేఽంజనం దృశోర్లాక్షా కపోలేతిలకః కృతః' —ఆం. సా. ద. తృతీయపరి. 60 పేజి 144 సంఖ్య.

*విభావము* : "రత్యాద్యుద్బోధకా లోకే విభావాః కావ్యనాట్యయోః" అని సాహిత్యదర్పణ (తృతీయపరిచ్ఛేదము) నిర్వచనము. రతి మొదలైన భావములను ఉద్బోధించు వానిని లోకములో కారణములందుము. వానినే కావ్యనాట్యములలో విభావములందురు.

విభావమునకు వ్యుత్పత్తి :- "విభావ్యంతే ఆస్వాదాంకుర ప్రాదుర్భావ యోగ్యాః క్రియంతే సామాజిక రత్యాది భావాః" (కా అం. సం. 329 పేజి). సహృదయుల హృదయములలో వాసనారూపమున నుండు రతి మొదలైన భావములు వేనివలన అంకురరూపముగా ఆస్వాద్యమానములగునో అవియే విభావములు

సామాజికుని హృదయమున వాసనారూపమున రత్యాదులుండును. వానిని ఆస్వాదయోగ్యముగా చేయునది విభావనవ్యాపారము. ఈ వ్యాపారముగలది విభావము. లోకమున శ్రీరామాదుల రత్యాదులకు సీతాదులు కారణములు. (అట్లే సామాజికుల రత్యాదులకు కావ్యమందలి సీతాదులు కారణములు). సామాజిక రత్యాది భావములను ఆస్వాదాంకుర ప్రాదుర్భావ యోగ్యములుగా చేయుటే విభావనము. దానితో కూడినదానినే విభావమందురు. (పేర్లు మొదలైనవి విభావములు).

ఈ విభావము రెండు విధములు (1) ఆలంబన విభావము (చూ. ఆలంబనవిభావము). (2) ఉద్దీపనవిభావము (చూ. ఉద్దీపన విభావము).

*విరహవిప్రలంభము* : విప్రలంభ శృంగారభేదములందొకటి. (చూ. విప్రలంభ శృంగారము). ఈ విప్రలంభశృంగారము నాలుగు విధములు. అందు విరహ విప్రలంభము మూడవది. (మిగిలినవానివివరములకు చూ. అభిలాషవిప్రలంభము, ఈర్ష్యావిప్రలంభము, ప్రవాసవిప్రలంభము). ఇది ప్రతాపరుద్రీయమతము.

నాయికానాయకులొకమారు సమాగమమును పొంది, తరువాత ఏదో కారణమువలన ఎడబాటు పొందినచో దానికి విరహ విప్రలంభము అనిపేరు. ఇది స్త్రీ పురుషులకిద్దరికిని కలుగవచ్చును.

ఉదాహరణము :- నరసభూపాలుని యెడబాటునొందిన నాయిక యొకతె మన్మథునిట్లు ప్రార్థించుచున్నదట :- ఉ "నెచ్చెలులీ నృసింహ ధరణీవరుఁ దెచ్చెదమంచుఁ బోయి రా రిచ్చట నీవునుం గరుణ యించుక లేక లరంపగుంపులం । గ్రుచ్చెదవేల ? మత్ప్రియునిఁ గూర్పుము మన్మథ! నీకుఁ దద్విభుం । దెచ్చుటకై యొసంగెద మదీయ కటాక్షములన్జయాస్త్రముల్" —(కా. అం. సం. III-139 ప.)

*విలాసము* : వివరములకు ముందు చూ. అలంకారములు. స్వభావజమైన అలంకారమిది (చూ. అనుభావము, చూ. స్వభావజములు). శృంగారచేష్టలందొకటి (చూ. శృంగారచేష్టలు).

విలాసమునకు నిర్వచనములు :- (1) తాత్కాలికో విశేషస్తు విలాసోఽంగ క్రియాదిషు" అని దశరూపకము (ధ. ద. రూ. రెండవప్రకాశము 29 పేజీ 62 సంఖ్య.) ఆంగికమైన కదలికలలో తాత్కాలికములయిన విశేషములను చూపుట విలాసము. 20 అలంకారములలో ఒక స్వభావజమైన అలంకారము. (చూ. అలంకారములు). (2) "తాత్కాలికో వికారఃస్యాద్ విలాసో దయితేక్షణే" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 298 పేజీ 7 సంఖ్య.) ప్రియుడు చూచుచుండగా కలిగిన తాత్కాలికమైన వికారమునకు విలాసమని పేరు. 18 శృంగారచేష్టలందొకటి. (3) యానస్థానాసనాదీనాం ముఖనేత్రాది కర్మణాం విశేషస్తు విలాసఃస్యాదిష్ట సందర్శనాదినా" అని సాహిత్యదర్పణము (కా. లం. సం. తృతీయ 376 పేజి. 4 సంఖ్య). తన ప్రియుని చూచుట మొదలయిన వానిచేత నడచుటలో నిలుచుటలో, కూర్చుండుటలో, మాటాడుటలో, చూచుటలో గలుగు విశేషమే విలాసము. 28 అలంకారములలో ఒకటి. (చూ. అలంకారములు). (4) "పతిఁగనఁదాత్కాలికమగు నతులవికారము విలాసమగు" అని నరసభూపాలీయము III-100 పద్యము. 18 శృంగారచేష్టలందొకటి.

'విలాసము'నకు నరసభూపాలీయమునుండి ఉదాహరణము :-

కం ఇరుగడల వెడలి సుడిగొని । తరళములై వెలికి బెళికి తళతళమనుచున్ బరగురువారపుఁ జూపుల । హరిణాక్షి నృసింహవిభుని కారతి సేసెన్" ఇందు చూపులకు పెక్కు వికారములు కలిగినట్లు వర్ణితమైనది. —కా. లం. సం. III-101.

**వివక్షితాన్యపరవాచ్యము** : వివరములకు ముందు చూ. ధ్వని, అభిధ, అభిధామూలధ్వని.

అభిధామూలధ్వనికే ఇది మఱియొక వ్యవహారము.

ఎక్కడ వాచ్యార్థము అన్యపరముగా (వ్యంగ్యపరముగా) వివక్షింపబడునో అదివివక్షితాన్యపరవాచ్యమగు ధ్వని.

ఉదాహరణములకు చూ. సంలక్ష్య క్రమవ్యంగ్యము; అసంలక్ష్య క్రమవ్యంగ్యము (ఇవి వివక్షితాన్యపరవాచ్యముయొక్క రెండు భేదములు).

సంలక్ష్యక్రమవంగ్యగ్యము 41 విధములు. అసంలక్ష్య క్రమవ్యంగ్యము 6 విధములు. అందువలన వివక్షితాన్యపరవాచ్యము 47 విధములు.

**వివేకి** : సప్తవిధకవులందు వివేకి యొకడని అప్పకవి పేర్కొనెను.

'గణవర్ణ శబ్దార్థ గుణదోషనికరంబుఁ బరికించి కూర్చుఁ గబ్బము వివేకి' అని లక్షణము.

**విశ్వావళి** : "విశ్వేషాం సంఖ్యయా పద్యైర్యుక్తా విశ్వావళీమతా" (కా. లం. సం. II-259 పేజి). విశ్వములు పదునాలుగు. పదునాలుగు పద్యములతో కూడిన కావ్యము విశ్వావళి.

*విశేషకము* : '[త్రిభిర్విశేషకమ్' అని ధ్వన్యాలోక లోచనము. మూడు పద్యములకు ఏకాన్వయమున్నచో అది విశేషకము (చూ. ధ్వ. లో. లోచ, III-ఉద్యో, 324 పేజి).

*విషాదము* : వ్యభిచారిభావములందొకటి. (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- (1) "ప్రారబ్ధకార్యాసిద్ధ్యాదేర్విషాదః సత్త్వసంక్షయః నిశ్వాసోచ్ఛ్వాస హృత్తాప సహాయాన్వేషణాది కృత్" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 64 పేజి. 40 సం.). మొదలుపెట్టిన పని సిద్ధించకపోవుటవలన ధైర్యము క్షీణించుట విషాదము. నిశ్వాసము, ఉచ్ఛ్వాసము, హృదయతాపము, సహాయాన్వేషణము మొదలైనవి అనుభావములు. (2) "విషాదశ్చేతసో భంగః ఉపాయాభావచింతనైః" అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. రసప్రక. 283 పేజి. 19 సం.). ఉపాయము తోచకపోవుటవలన, చింతనమువలన మనస్సుకు వ్యాకులత్వము కలుగుట విషాదము. (3) "ఉపాయాభావ జన్మాతు విషాదః సత్త్వ సంక్షయః నిశ్వాసోచ్ఛ్వాస హృత్తాప సహాయాన్వేషణాదికృత్" అని సాహిత్యదర్పణము (సా. ద. III-153 పే. 167 శ్లో.) దశరూపక లక్షణము ననుసరించినది. (4) "వివిధోపాయాభావాద్యవిరతభంగము విషాదమగు" అని నరసభూపాలీయము (III-72 ప.). (5) "ఇష్టాసిద్ధి రాజగుర్వాద్యప రాధాది జన్యోఽనుతాపో విషాదః" అని రసగంగాధరము (కా. లం సం. III-358 పేజి 18 సం.). ఇష్టము నెరవేరకపోవుటవలనను, రాజునకు, గురువునకు అపరాధము చేయుటవలనను కలిగిన అనుతాపమే విషాదము.

ఉదాహరణము :- నరసభూపాలుడు కోపించినచో అతని ప్రియురాలికి పువ్వులే మన్మథబాణములు. వెన్నెలే చంద్రకిరణములనుండి పుట్టినది; చలిగాలియే శత్రువు. ఇక ఆమెకు కలిగిన తాపమెట్లు తగ్గును? కం। "అలరులు మరునమ్ములు; హిమ। జలమిందు కరోదితంబు; శత్రువు దలఁపం। జలిగాడ్పు; శ్రీ నృసింహుం డలిగిననాఁడెట్లు మాను నతివకుఁ గాకల్" -(కా. లం. సం. III-74 ప.). ఇందు నరసభూపాలుని కోపరూపమైన ఇష్టాసిద్ధి విభావము. నిశ్వాసాదులు అనుభావములు. విషాదము వ్యక్తమగుచున్నది. (భావధ్వని).

*విస్మయము* : వివరములకు ముందు చూ. స్థాయిభావము. ఆశ్చర్యమని సామాన్యార్థము, అలంకారశాస్త్రములో అద్భుత రసమునకిది స్థాయిభావము.

విస్మయమునకు నిర్వచనములు :- (1) అపూర్వవస్తుదర్శనాచ్చిత్త విస్తారో విస్మయోమతః" అని ప్రతాపరుద్రీయ లక్షణము (రసప్రకరణము). అపూర్వ వస్తువులను చూచినప్పుడు కలుగు చిత్తవిస్తారమే విస్మయము. (2) "వివిధేషు పదార్థేషు లోకసీమాతివర్తిషు విస్ఫారశ్చేతసో యస్తు స విస్మయ ఉదాహృతః" అని సాహిత్యదర్పణము (తృతీయపరిచ్ఛేదము). లోక

మర్యాదల నతిక్రమించిన అనఁగా లోకోత్తరములయిన వివిధ పదార్థములను గురించి మనస్సునకు గలుగు విస్తరణము విస్మయము. (3) "అలౌకిక వస్తు దర్శనాది జన్మా ఆశ్చర్యాఖ్యో విస్మయః". అని రసగంగాధరము (చూ. కా. లం. సం. 328 పేజి). లోక విలక్షణములైన వస్తువులను చూచుటవలన కలుగు ఆశ్చర్యమను చిత్తవృత్తి విశేషము" విస్మయము. (4) వివిధాపూర్వములగు వస్తువులు గనుంగొనిన యెడల సుజనునిమదిలోఁ । దవిలిన ప్రమోదవిస్తర । మవిరళ విస్మయమనంగనగు" అని నరసభూపాలీయము (III-23).

విస్మయమునకు నరసభూపాలీయమునందలి యుదాహరణము :- నరసభూపాలుని ప్రతాపము ఎండవలె బ్రహ్మాండ మంతటను కాయుచున్నది. దానికి శత్రురాజులందరును వణకిపోవుదురు. అంతేగాక తమ ఛత్రచామరాదులను వారు తొలగించుకొందురు. వారికి కనులు మిరుమిట్లు గొలుపును. —ఇట నరసభూపాలుని ప్రతాపమొక అపూర్వ వస్తువు. కనుకనే దానిని చూడగానే శత్రురాజులకు ఆశ్చర్యమనెడి చిత్తవృత్తి కలిగినది. వారిచేష్టలు ఆ విస్మయమును వ్యక్తము చేసినవి. చం॥ "ధరణి నృసింహభూవరు ప్రతాపమహాతప మబ్జజాండక । ర్పరములు నిండి తీవ్రగతిఁ బర్వ నఖర్వ సగర్వవైరి భూ । వరులు వడంక సాగుదురవార్య నవవ్యజనాత పత్రవై । ఖరులు దొలంగఁజేయుదురు కన్నులఁ జీకటి కప్పుచుండఁగన్" —కా. లం. సం. III-24.

**హృతము** : వివరములకు ముందు చూ. అలంకారములు. స్వభావజములయిన అలంకారములందొకటి. (చూ. స్వభావజములు). ఒక అనుభావము. (చూ. అనుభావము). ఒక శృంగారచేష్ట (చూ. శృంగారచేష్టలు).

నిర్వచనములు (1) ప్రాప్తకాలం నయద్బ్రూయాద్ వ్రీడయా విహృతం హి తత్" అని దశరూపకము (ధ. ద. రూ. రెండవప్రకాశము 80 పేజి. 70 సంఖ్య). మంచి అవకాశము వచ్చినను సిగ్గువలన ప్రియునితో మాటాడకుండుట విహృతము. 10 స్వభావజములలో నొకటి. (చూ. స్వభావజములు). (2) "విహృతం ప్రాప్తకాలస్య వాక్యస్య అకథనం హ్రియా" అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. రసప్రక. 305 పేజి 17 సంఖ్య). అనువైన సమయములో తెలుపవలసిన మాటలను సిగ్గువలన తెలుపలేక పోవుట విహృతము. 18 శృంగార చేష్టలందొకటి (చూ. శృంగారచేష్టలు). (3) "వక్తవ్యకాలేఽప్యవచో వ్రీడయా విహృతం మతం" అని సాహిత్యదర్పణము (కా. లం. సం. 384 పేజి 14 సంఖ్య). పలుకవలసిన సమయమున సిగ్గువలన మౌనము వహించుట విహృతము. 18 స్వభావజములందొకటి. (చూ. స్వభావజములు). (4) "అనుమతిఁ బలుకం దరమగు తగు వేళల నుత్తర మొసఁగమి విహృతమనఁదగు" అని నరసభూపాలీయము (III-114 పద్యము).

ఉదాహరణము :- ఆ వె "నెపముతోడఁ గాలనేలను రాయుచుఁ దరుణి నన్నుఁ గనుచు మఱలమఱలఁ బలుకఁ దలఁచి యెదియొ వాతెఱం గదిపియుఁ । బలుకదయ్యె లజ్జ బలిసియుంట" —శ్రీ సన్నిధానంవారి రచన. కా. అం. సం. III-385 పేజి.

*వీరరసము :* 'ఉత్సాహము' స్థాయిభావముగా గల రసము. ఇది నవరసము లందొకటి. (చూ. నవరసములు. చూ. ఉత్సాహము).

వీరరస స్వరూపమును సాహిత్యదర్పణమిట్లు నిరూపించెను. (చూ. సా. ద. III-179 పేజి 232-234 శ్లో.). దీనికి నాయకుడుత్తముడు. స్థాయిభావ ముత్సాహము. మహేంద్రుడు దేవత. హేమవర్ణము వర్ణము. విజేత వ్యాదులు ఆలంబనవిభావములు. విజేతవ్యాదిచేష్టలు ఉద్దీపనవిభావములు. సహాయాన్వేషణాదులు అనుభావములు. ధృతి, మతి, గర్వము, స్మృతి, తర్కము, రోమాంచము, మొదలైనవి వ్యభిచారిభావములు. వీనిచే వీర రసము వ్యక్తమై ఆస్వాదయోగ్యమగును.

ఈ వీరరసము నాలుగు విధములు (1) దానవీరము (2) ధర్మవీరము (3) యుద్ధవీరము (4) దయావీరము. (చూ. ఆయా శీర్షికలు).

ఉదాహరణము :- నరసభూపాలుని యోధులు రణోత్సాహముతో నిట్లందురట :- మ "అసిఁజెండాడి విపక్షవృక్షముల శౌర్యాగ్నిచ్ఛటం బేల్చి శ । త్రు సరత్ సీరములన్ రణోర్వితలమున్ సంక్షుణ్ణముంజేసి వై । ర్యసృగార్ద్రింబొనరించి ప్రోదిగొనకుద్యత్కీర్తి సస్యౌఘముల్ । వెస సిద్ధించునె యంచుఁ బల్కు నరసోర్వీనాథు యోధావళుల్" —(కా. అం. సం. III-16 ప.). ఈ వీరరసము నాలుగు విధములేకాదు. పెక్కువిధములుగా నుండునని రసగంగాధరకారుడు పాండిత్యవీరుని నుదాహరించెను. ఇట్లే క్షమావీరుఁడు. (చూ. కావ్యాలంకారసంగ్రహము III-440 పేజి).

*వృత్తగంధి :* చూ. గద్యకావ్యము. గద్యకావ్యభేదములందొకటి. "వృత్త భాగ ములతో కూడుకొన్న" గద్యమే వృత్తగంధి. "వృత్తభాగయుతం పరం" (సా. ద. VI-357 పేజి).

ఉదాహరణము :- "సమరకండూల నిబిడభుజదండ కుండలీకృత కోదండ శింజినీటంకారోజ్జాగరిత వైరినగర (సా. ద. VI-357 పేజి). ఇందులో "కుండలీకృత కోదండ" అను భాగము అనుష్టుప్ వృత్తపాదము. "అంత ఫల్గునుఁడతనితో నిట్టులనియె" —ఇది తేటగీతి నడకగల గద్య భాగము.

*వృత్తి :* చూ. శక్తి.

*వృత్తులు :* ఇవి శబ్దవృత్తులనియు, అర్థవృత్తులనియు రెండు విధములు. అభిధా లక్షణా వ్యంజనలు శబ్దవృత్తులు. కైశికి, ఆరభటి, సాత్త్వతి, భారతి అర్థ వృత్తులు. (నిర్వచనములకు ఉదాహరణలకు చూ. ఆయా శీర్షికలు).

భరతుని మతమున అర్థవృత్తులు మూడు. కైశికి, ఆరభటి, సాత్త్వతి. భారతీవృత్తి భరతమతమున శబ్దవృత్తి. భారతీవృత్తి మూడు రీతులుగా మారినది. (చూ. భారతి). (కా. అం. సం. 170 పేజి).

'రసోచితపవచేష్టా విశేషోవృత్తిః' అని అభినవగుప్తుడు. (కా. అం. సం. 181 పేజి). ఇతివృత్తరసానుకూలమగు చేష్టావిశేషమే వృత్తి.

యా వికాసేఽధవిక్షేపే సంకోచే విస్తరేతథా । చేతసోవర్తయిత్రీ స్యాత్ సా వృత్తిస్సాఽపి షడ్విధా (కా. అం. సం. 179 పేజి). అని రత్నేశ్వరుడు. దేనిచే చిత్తమునకు వికాసము, విక్షేపము, సంకోచము, విస్తరము కలుగునో అది వృత్తి. ఇది రసానుకూలమగు నాయికానాయక వ్యాపారము. (ఇంకను వివరములకు చూ. కా. అం. సం. 179-181 పేజి).

వృత్తులు రీతులచే ప్రకాశించును. వృత్తులాంగికాభినయ రూపములు కాగా రీతులు వాచికాభినయరూపములు.

ఉదాహరణము :- దుష్యంతుడు ముద్దిడుకొనఁబోగా శకుంతల చేసిన ఆంగికాభినయము శ్లో ముహురంగుళి సంవృతాధరోష్ఠం ప్రతిషేధా క్షర విక్లబాభిరామం । ముహురంసవివర్తి పక్ష్మలాక్ష్యాః కథమప్యున్నమితం న చుంబితంతు." (అభిజ్ఞానశాకుంతలము). మాటిమాటికి ఆమె తన వ్రేళ్లతో అధరోష్ఠమును మూసికొనుచున్నది. వద్దువద్దని ప్రతిషేధించు చున్నది. ముఖము నిటునటు త్రిప్పుకొనుచున్నది. అట్టియామె ముఖమును నేనెట్లో పైకెత్తితిని. కాని ముద్దిడుకొనలేకపోయితిని. ఇది వైదర్భీరీతిలో వర్ణింపబడినది. శృంగారరసస్ఫూర్తిగల ఈ యభినయము కైశికీవృత్తి యందున్నది. (చూ. కా. అం. సం. 168 పేజి).

**వైదర్భి** : వివరములకు, ముందు చూ. రీతులు. రీతులందు ఇది ఒకటి. మిగిలిన వానినిగురించి చూ. పాంచాలి, గౌడి. "బంధపారుష్యరహితా శబ్దకాఠిన్య వర్జితా । నాతిదీర్ఘ సమాసాచ వైదర్భీరీతి రిష్యతే." (ప్ర. రు. కావ్య ప్రక. 56 పేజి). బంధపారుష్యము, శబ్ద కాఠిన్యము, అతిదీర్ఘ సమాసములు లేని రచన వైదర్భీరీతి.

ఉదాహరణము:- శా "ఆ లావణ్య మగణ్య మా గుణగణం బవ్యాజ మాతేజ ము ద్వేలం బావినయంబమేయతర మా వీర్యంబనిర్వాచ్య మా। యాలాపం బతి సత్య మా వితరణం బాశాంతవి శ్రాంత మా । శీలం బార్జవ మూలమెన్నఁదరమే ? శ్రీ నారసింహేంద్రునిన్." (కా. అం. సం. II-174 పేజి). ఇందన్నియు మృదువైన పదములే అగుటవల్ల బంధపారుష్యము లేదు. కఠిన శబ్దములు లేవు. అతి దీర్ఘసమాసములు లేవు. అల్పసమాసములే ఉన్నవి.

ఇది కైశికీవృత్తికి తగిన రీతి. శృంగారరసమునందిట్టిరీతి శోభించును. (చూ. కైశికి.)

వైవర్ణ్యము : వివరములకు ముందు చూ. సాత్త్వికభావము. సాత్త్వికభావము లెనిమిదింటిలో నిదియొకటి. ఇది అనుభావము. (చూ. అనుభావము.)

వైవర్ణ్యమునకు నిర్వచనములు :- (1) "విషాదమదరోషాద్యై ర్వర్ణాన్యత్వం వివర్ణతా" అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. 268 పేజి 6 సంఖ్య). విషాదము, మదము, రోషము మొదలయిన వాని వలన ముఖాదులందు వేరొకరంగు కలుగుట వైవర్ణ్యము. సాహిత్యదర్పణము కూడా ఇదే నిర్వచనమును స్వీకరించెను. (2) "పాండురుచుల్ వివర్ణతల్" అని నరసభూపాలీయము. III_37 పద్యము. (3) వైవర్ణ్యమనఁ జాలిపోవుట అని శ్రీ సన్నిధానంవారు. —336 పేజి.

వైవర్ణ్యమునకు నరసభూపాలీయమునుండి యుదాహరణము :- 'నిరంతరము మనస్సులో నరసభూపాలునే ఆమె ధరించుచుండెను. అందుచే ఆ నరసభూపాలుని ముఖచంద్రుని వెన్నెలలామె శరీరము మీదికి పొంగి పొరలియుండును. కావుననే ఆమె శరీరము తెల్లబడిపోయెను.' ఉ "మానవతీలలామ యసమానసముజ్జ్వలగాత్రవల్లిపైఁ గానఁగనయ్యెఁ బాండుతర కాంతి; నిరంతరమై మనంబునన్ । శ్రీ నరసింహ భూవరుధరింపఁగఁ దద్వనేందుమండలీ మానితచంద్రికారస సమాజముపైపయిఁ బర్వెనో యనన్" —కా. లం. సం. III_47. ఆ నాయికకు మదము వలన వైవర్ణ్యము కలిగెనని యిందు గ్రహింపదగును.

వైస్వర్యము : వివరములకు ముందు చూ. సాత్త్వికభావము. సాత్త్వికభావము లెనిమిదింటిలో నిదియొకటి. ఇది అనుభావము (చూ. అనుభావము). దీనికే 'విస్వరత్వము' అనియు 'స్వరభంగము' అనియు నామాంతరములు.

వైస్వర్యమునకు నిర్వచనములు :- (1) "మతం గద్గద భాషిత్వం వైస్వర్యం సముదాహృతం" అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. రసప్రకర. 269 పేజి 8 సంఖ్య). సంతోషాదుల వలన కలుగు గద్గద భాషణములనే విస్వరత్వమందురు. (2) "మదసమ్మదపీడాద్యై ర్వైస్వర్యం గద్గదం విదుః" అని సాహిత్యదర్పణము. (కా. లం. సం. తృతీయ 339 పేజి-43 సంఖ్య). మదము, సంతోషము, పీడనము మొదలైన వానిచేత కలుగు గద్గదస్వరము వైస్వర్యము. జాగరణము, ఉచ్చారణాధిక్యము మొదలయినవికూడా వైస్వర్యమునకు హేతువులు. (3) "గద్గదవాక్యవైఖరీ గుంభము విస్వరత్వము" అని నరసభూపాలీయము. III_37 పద్యము.

వైస్వర్యమునకు నరసభూపాలీయమునుండి యుదాహరణము :-

'పరాంగన చేసిన నఖక్షతములతో కనిపించిన నరసభూపాలుని అతని ప్రియురాలు నిందించదలచియు గాద్గద్యము కలిగి నిందించలేకపోయినది. ఒకవేళ ఆమె కాతనియెడనున్న అనురాగమే మనస్సులోపలనుండి అతనిని నిందింపవలదని అడ్డుపెట్టినదేమో!' చం "అమరఁబరాంగనా నఖముఖాంకితుఁడైన నృసింహభూవరుం గమలదళాక్షి చూచి తమకమ్మున దూఱెద

నన్న గద్గద । త్వమునఁ బోసంగవయ్యె సతివాక్యము; లాంతరమై చెలంగు
నె । య్యము హృదయేశు దూఱవలదంచు నిరోధమొనర్చునో యనన్"
—కా. లం. సం. III-43. ఇందు నిరోధరూపమైన పీడచేత వైస్వర్యము
కలిగెను.

*వ్యంగ్యము :* చూ. అభిధ, లక్షణ, వ్యంజన.

అభిధాశక్తివలనగాని, లక్షణాశక్తివలనగాని శబ్దార్థము (వాచ్యార్థము
కాని లక్ష్యార్థముకాని) నిర్ణయమైన తరువాత ఆ శక్తులపని పూర్తియగును.
అపుడు వ్యంజనాశక్తియను మరియొక శబ్దశక్తి పనిచేసి రమణీయమగు
నర్థాంతరమును స్ఫురింపజేయును. ఈ యర్థమునే వ్యంగ్యమందురు. ఈ
ఈ వ్యంగ్యార్థమును బోధించు పదములు వ్యంజకములు.

ప్రకరణము, వక్త, బోద్ధవ్యుడు, దేశము, కాలము, అన్యసన్నిధి,
కాకువు, వాక్యము, వాచ్యము, మొదలగువాని వైశిష్ట్యమువలన బహురూప
ములతో వ్యంగ్యము ప్రకాశించును. ఉదాహరణకు ప్రొద్దుక్రుంకినది
అనువాక్యమున్నది. ఈ వాక్యమునకు వాచ్యార్థమందరకును ఒకవిధముగనే
బోధపడును. కానీ వక్తనుబట్టి బోద్ధవ్యుని బట్టి అర్థాంతరము స్ఫురించును.
ఇది యొక దూతీవాక్యమైనపుడు అభిసరింపవేళయయినది అను అర్థాంతము
నాయికకు స్ఫురించును. ఇది యొక కూలివాని మాట యయినపుడు ఇక
పని చాలించి యింటికి పోవచ్చును అను వ్యంగ్యార్థము మరియొక కూలి
వానికి స్ఫురించును. ఈ విధముగా బహుళార్థములనేకులకు తోచును.

వాచ్యార్థము, వ్యంగ్యార్థము —ఇవి రెండును స్వరూపమునుబట్టి
భిన్నములుగా నుండును. (1) వాచ్యము విధిగా నున్నపుడు వ్యంగ్యము
నిషేధరూపమున భాసించుట. (2) వాచ్యము నిషేధరూపమున నున్నపుడు
వ్యంగ్యము విధిరూపమున భాసించుట. (3) వాచ్యము విధిరూపమై
యుండగా వ్యంగ్యము అనుభయరూపమున నుండుట. (4) వాచ్యము
నిషేధరూపమున నుండగా వ్యంగ్యము అనుభయరూపమున నుండుట.
(5) వాచ్యముకంటె వ్యంగ్యము పూర్తిగా వేరుపడియుండుట.

ఈ యైదింటికిని క్రమముగా ఉదాహరణములు :- (1) తన సంకేత
నికుంజమున ప్రతిదినము పత్రపుష్పాదులను కోయుచు మరుగులేకుండ
చేయుచున్న యొక పూజారికి ఒక కులటానాయిక చేసిన హెచ్చరిక యిట్లు
న్నది— కం "ఇఁకఁదిరుగవచ్చు నమ్మకముగ నో పూజరి । పరిమార్చెను
సుమ్మీ । నికటోద్ధతమగు గోదానికుంజగత సింహమొకటి నేఁడాకుక్కన్"
(కా. లం. సం. II-150 పేజి). ఇందు తిరుగవచ్చునను విధి నిషేధార్థమును
వెల్లడించుట వ్యంగ్యము.

(2) ఒక ప్రోషితభర్తృక తన యింటికి వచ్చిన బాటసారితో నను
చున్న మాటలిట్లున్నవి:- గీ ఇచట మాయత్తపండు; నేనిచటఁబరుండుఁ
బగటనే లెస్సగని గుర్తుపట్టుకొనుము ఓ నిశాంధుఁడ పాంధుఁడా! యొప్పు

దప్పిపడకుమీ ; మాదుమంచాలపై నిరేయి" (కా. అం. సం. II-151 పేజి). ఇందు 'పడుకుమీ' అను నిషేధము విధిని వెల్లడించుట వ్యంగ్యము. (చూ. అర్థశక్తి మూలవ్యంజన).

(3) ఒక ఖండితనాయిక కృతాపరాధుడైన తన ప్రియునితో ననుచున్న మాటలిట్లున్నవి :- గీ పొమ్ము నాకొక్కటెకె కల్లనిమ్ము ప్రియుడ! ఊర్పులేడ్పులు; దాని వియోగకలన నీకునేటికిఁ గలదొకో నీకుఁ భీతి ? వచ్చితివి పూతమెఱుఁగుల వలపుత్రోడ" (కా అం. సం 151 పేజి). ఇందు పొమ్ము అనగా పొమ్మనియు కాదు; ఉండుమనియుకాదు; ఉపాలంభమే వ్యంగ్యము.

(4) ఒక అభిసారికతో ప్రియుడనుచున్న మాటలిట్లున్నవి :- గీ చాలు ! మ్రొక్కుదు ! మఱలుమో బాల ! నీదు మోముజాబిల్లిఁ జీకటి మొత్తమడఁగె దారిఁజరియించు నన్యాభిసారికలకు నడ్డుతగులుచు నుంటి హాతాశురాల ! (కా. అం. సం. II-151 పేజి). ఇందు మఱలుము' అను (వెడలవలదు) నిషేధరూపమునకు విధినిషేధాతీతమైన వ్యంగ్యార్థమున్నది.

(5) స్వైరిణియగు నాయికతో చెలికత్తె పలుకుచున్న మాటలిట్లున్నవి :- కం పలునొక్కులుగల తన కోమలిమోవినిఁ గాంచి యెవఁడు మండిపడఁడు? నే వలదన్న మూరుకొంటివి వెలఁది ! సభ్రంగాబ్జ మనుభవింపుము దీనిన్. (కా. అం. సం. II-152 పేజి). ఇందు అనియతసంబంధ వ్యంగ్యమున్నది. (చూ. అనియత సంబంధవ్యంగ్యము).

వ్యంగ్యము (1) శబ్దము (2) శబ్దైకదేశము (3) అర్థము (4) వర్ణములు (5) రీతి అనువానినాశ్రయించియుండును. క్రమముగా ఉదాహరణములు :-

(1) సిరిగలవానికి చెల్లును దరుణుల పదియారువేలఁ దగఁ బెండ్లాడన్ (శ్రీనాథునిచాటువు) —ఇందు సిరిగలవాడు అనగా సంపన్నుడని వాచ్యార్థము. లక్ష్మీపతియగు శ్రీకృష్ణుడని వ్యంగ్యార్థము.

(2) 'అక్కట ! వాడు నా తగులమారడి సేసి దయావిహీనుఁడై ' (పెద్దన). వరూథిని విరహతాపాతిశయమును అక్కటయను శబ్దైకదేశము వ్యక్తముచేయుచున్నది.

(3) అర్థశక్తిమూలవ్యంజనను చూ.

(4) బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్ (—పోతన) ఇందలి సకారలకారాదులగు వర్ణములు సౌకుమార్య వ్యంజకములు.

(5) ప్రతిపక్షక్ష్మాపవక్షః ఫలక విదళన ప్రౌఢగాఢ ప్రతాపప్రతిభా— (భట్టుమూర్తి). ఇందలి గౌడీరీతి, ఆరభటీవృత్తి రౌ ద్రరసవ్యంజకములు.

ప్రకరణాది వశమున వ్యంగ్యము వాచ్యముతో మూడువిధములగు సంబంధములు గలదై యుండును. చూ. (1) నియతసంబంధ వ్యంగ్యము.

(2) అనియతసంసంబంధము, సంబద్ధ సంబంధ వ్యంగ్యము. చూ. ధ్వని.

*వ్యంగ్యార్థము* : చూ. వ్యంగ్యము.

*వ్యంజకము* : వ్యంజనాశక్తి వలన వ్యంగ్యార్థమును బోధించు శబ్దమునకు వ్యంజకమని పేరు. చూ. వ్యంజన.

ఉదాహరణమునకు :- చూ. వ్యంగ్యము.

*వ్యంజన* : అభిధాలక్షణా వ్యంజనలనెడి మూడు శబ్దశక్తులలో మూడవది. తక్కిన వివరములకు ముందు చూ. శక్తి; అభిధ; లక్షణ; వ్యంగ్యము; వ్యంజకము.

"విరతాస్వభిధాద్యాసు యదర్థో బోధ్యతే పరః
సావృత్తిర్వ్యంజనా నామ శబ్దస్యార్థాదికస్య చ"
—(సాహిత్యదర్పణము రెండవ పరి. 52 పేజి 12 శ్లో.)

అభిధాలక్షణాశక్తుల వలన శబ్దార్థము నిర్ణయమైన తరువాత, ఆ శక్తుల వ్యాపారము ముగిసిపోవును. ఆ తరువాత రమణీయమైన అర్థాంతరమును వ్యక్తముచేయుటకై పనిచేయు శబ్దశక్తి వ్యంజన. ఇది అర్థాదికమునందు కూడా పనిచేయును.

ధ్వననము, గమనము, ప్రత్యాయనము, ద్యోతనము, వ్యంజనకు పర్యాయపదములు. చూ. ధ్వని. ఉదాహరణములకు చూ. వ్యంగ్యము.

వ్యంజన రెండు విధములు (1) అభిధామూల (2) లక్షణామూల. అభిధామూల రెండువిధములు (1) లక్ష్యక్రమము. (2) అలక్ష్యక్రమము. లక్ష్యక్రమము ముప్విధము :- (1) శబ్దశక్తి మూలవ్యంజన. (2) అర్థశక్తి మూలవ్యంజన. (3) ఉభయశక్తిమూలవ్యంజన. చూ. ఆ శీర్షికలు.

లక్షణామూలవ్యంజన రెండువిధములు :- (1) అత్యంత తిరస్కృత వాచ్యము. (2) అర్థాంతర సంక్రమితవాచ్యము. చూ. ఆ శీర్షికలు.

ఈ వ్యంజనాశక్తిని ఆనందవర్ధనుడు స్థాపించెను. ఆయనకు దీనిని స్థాపించుటలో స్ఫోటవాదము సాయపడినది. చూ. స్ఫోటము.

పూర్వపూర్వవర్ణముల సంస్కారముతో గూడిన అంత్యవర్ణధ్వని స్ఫోటము (శబ్దము)ను వ్యక్తపరచునని వైయాకరణుల వాదము. ఇదే స్ఫోట వాదము. శబ్దమనగా వర్ణముల వలన మనకేది స్ఫురించునో అదే. అట్లే వ్యంజనాశక్తివలన శబ్దమునుండి స్ఫురించు అర్థాంతరము వ్యంగ్యమగు చున్నది. స్ఫోటవాదులు చెప్పు శబ్దమునకు వ్యంగ్యమని పరిభాష. ఆ పరిభాషనే ఆనందవర్ధనులు అర్థాంతరమునకు అన్వయించిరి. స్ఫోటమునకు వ్యంజకము వర్ణములధ్వని. వ్యంజనాశక్తిలో అర్థాంతరమునకు వ్యంజకము శబ్దము. స్ఫోటమే వ్యాకరణములో వ్యంగ్యము. వస్త్వలంకారరసాదుల ధ్వనియే కావ్యమున వ్యంగ్యము. వ్యాకరణములో వర్ణధ్వని శబ్దమయినది. ఆ ధ్వని అను పదమునే ఆనందవర్ధనులు గ్రహించి వ్యంగ్యమునకు వాడిరి. (చూ. స్ఫోటము).

*వ్యభిచారిభావము :* రూపాంతరము సంచారిభావము. స్థాయిభావము రసముగా వ్యక్తమగుటలో సహకరించు భావము వ్యభిచారి. (చూ. స్థాయిభావము. చూ. రసము).

నిర్వచనములు :- (1) విశేషాదాభిముఖ్యేన చరంతో వ్యభిచారిణః స్థాయిన్యున్మగ్న నిర్మగ్నాః కల్లోలా ఇవవారిధౌ" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవ ప్రకా. 58 పేజి 8 సం.). విభావములు, అనుభావములు, మొదలైనవానికన్న విశేషముగా రసమునకు అభిముఖములై చరించునవి వ్యభిచారులు. ఇవి స్థాయిభావములైన రతి, హాసము మొదలైనవాని యందు సముద్రమున తరంగములవలె పైకి లేచుచు క్రిందికి పడుచు నుండును. (2) "విశేషేణ అభితః చరంతీతి వ్యభిచారిణః" అని ప్రతాపరుద్రీయము. విశేషముగా అంతటను సంచరించు భావములు వ్యభిచారులు (3) "కారణాన్యథ కార్యాణి సహకారీణి యానిచ రత్యాదేః స్థాయినో లోకే తాని చేన్నాట్య కావ్యయోః విభావశ్చాను భావశ్చ కథ్యంతే వ్యభిచారిణః" అని కావ్యప్రకాశమునుండి ప్రతాపరుద్రీయము ఉదాహరించినది (ప్ర. రు. 189 పేజి). లోకములో స్థాయిభావములైన రత్యాదులకు ఏవి కారణములు, కార్యములు, సహకారులుగా నుండునో అవియే నాట్యమందును కావ్యమందును క్రమముగా విభావము, అనుభావము, వ్యభిచారి అని వ్యవహరింపబడును. (4) విశేషాదాభిముఖ్యేన చరణాద్ వ్యభిచారిణః స్థాయిన్యున్మగ్న నిర్మగ్నాస్త్రయస్త్రింశచ్చ తద్భిదా" అని సాహిత్యదర్పణము (సా. ద. III-139 పే. 140 శ్లో.). స్థాయిభావములో తేలినవియు మునిగినవియు నగుచు విశేషముగా ఆభిముఖ్యముతో (విభావానుభావ సాత్త్వికములకంటె అతిశయించి) చరించు భావములు వ్యభిచారులు. ఇవి ముప్పదిమూడు. (5) "స్థిరతయా వర్తమానే హి రత్యాదౌ నిర్వేదాదయః ప్రాదుర్భావతిరో భావాభ్యామాభిముఖ్యేన చరణాద్ వ్యభిచారిణఃకథ్యంతే" అనియు సాహిత్యదర్పణము (సా. ద. III-139 పేజి. 140 శ్లో. వివరణ). స్థిరముగానున్న రతి మొదలైన స్థాయిభావములలో నిర్వేదము మొదలైన (వ్యభిచారి) భావములు (తరంగములవలె) ప్రాదుర్భావ తిరోభావములొందుచు ఆభిముఖ్యముతో చరించుటవలన వ్యభిచారులయినవి. (6) వి+అభితః+ చరంతి=వ్యభిచారిణః అని వ్యుత్పత్తి (కా. లం. సం. III-341 పేజి). (7) సమ్యక్ చారయంతి=సంచారిణః అని వ్యుత్పత్తి (కా. లం. సం. III-341 పేజి). (8) "అహరహము రసోత్పత్తికి సహాయభావంబు లెలమి సంచారులగున్" అని నరసభూపాలీయము (III-47 ప.). (9) "ఈ వ్యభిచారి భావములు స్థాయిభావములను లెస్సగాఁ బోషించి వానిని గస్యమానములుగాఁ జేయును" అని శ్రీ సన్నిధానంవారు- (కా. లం. సం. III-341 పేజి).

వ్యభిచారిభావములు దశరూపకము ననుసరించి :- (1) నిర్వేదము, (2) గ్లాని (3) శంక (4) శ్రమము (5) ధృతి (6) జడత (7) హర్షము

(8) దైన్యము (9) ఔగ్ర్యము (10) చింత (11) త్రాసము (12) ఈర్ష్య (13) అమర్షము (14) గర్వము (15) స్మృతి (16) మరణము (17) మదము (18) సుప్తము (19) నిద్ర (20) విబోధము (21) వ్రీడ (22) అపస్మారము (23) మోహము (24) మతి (25) ఆలస్యము (అలసత) (26) ఆవేగము (27) తర్కము (28) అవహిత్థ (29) వ్యాధి (30) ఉన్మాదము (31) విషాదము (32) ఔత్సుక్యము (33) చాపలము [1].

ప్రతాపరుద్రీయము ననుసరించి :- (1) నిర్వేదము (2) గ్లాని (3) శంక (4) అసూయ (5) మదము (6) శ్రమము (7) ఆలస్యము (8) దైన్యము (9) చింత (10) మోహము (11) స్మృతి (12) ధృతి (13) వ్రీడ (14) చపలత (15) హర్షము (16) ఆవేగము (17) జడత (18) గర్వము (19) విషాదము (20) ఔత్సుక్యము (21) నిద్ర (22) అపస్మారము (23) సుప్తి (24) విబోధము (25) అమర్ష (26) అవహిత్థ (27) ఉగ్రత (28) మతి (29) వ్యాధి (30) ఉన్మాదము (31) మరణము (32) త్రాసము (33) వితర్కము [2].

సాహిత్యదర్పణము ననుసరించి :- (1) నిర్వేదము (2) ఆవేగము (3) దైన్యము (4) శ్రమము (5) మదము (6) జడత (7) ఉగ్రత (8) మోహము (9) విబోధము (10) స్వప్నము (11) అపస్మారము (12) గర్వము (13) మరణము (14) అలసత (15) అమర్షము (16) నిద్ర (17) అవహిత్థ (18) ఔత్సుక్యము (19) ఉన్మాదము (20) శంక (21) స్మృతి (22) మతి (23) వ్యాధి (24) త్రాసము (25) లజ్జ (26) హర్షము (27) అసూయ (28) విషాదము (29) ధృతి (30) చపలత (31) గ్లాని (32) చింత (33) వితర్కము.

నరసభూపాలీయము ననుసరించి :- (1) నిర్వేదము (2) శ్రమము (3) దైన్యము (4) జాడ్యము (జడత) (5) గ్లాని (6) త్రాసము (7) శంక (8) ఆర్తి (వ్యాధి) (9) రోషము (అమర్షము) (10) గర్వము (11) ఆవేగము (12) ధృతి (13) స్మృతి (14) చపలత (15) ఉగ్రత్వము (ఔగ్ర్యము) (16) అవహిత్థ (17) త్రప (లజ్జ) (18) అంతర్వైక్లబ్యము (విషాదము) (19) మదము (20) ఉత్సుకత్వము (ఔత్సుక్యము) (21) మతి (22) నిద్ర (23) మోహము (24) బోధము (25) అంతము (మరణము) (26) ముదము (హర్షము) (27) ఆలస్యము (28) వితర్కము (29) సుప్తి (స్వప్నము) (30) అసహత (అసూయ) (31) ఆధ్యానము (చింత) (32) భ్రమము (ఉన్మాదము) (33) అపస్మారము.

వ్యభిచారిభావములనుగూర్చి వివిధ మతములు :- (1) స్థాయిభావము లెనిమిదియు (అష్టరసములు) ఇతర రసములందు చేరి వ్యభిచారులగునని భరతుడు. (2) అపస్మారము, మరణము అను రెండింటిని భోజుడు తగ్గించెను. ఈర్ష్యాశమములు చేర్చెను. (3) 'ఛలము' అను వేరొక వ్యభిచారిభావమును

భానుదత్తుడు చేర్చెను. (4) "గురుదేవ నృపపుత్రాది విషయా రతిశ్చేతి చతుస్త్రింశత్" అని రసగంగాధరము. గురుదేవనృప పుత్రాది విషయకరతితో ముప్పదినాలుగు వ్యభిచారులు. (చూ. కా. లం. సం. III-342 పేజి).

పై భావముల లక్ష్య లక్షణముల నాయా శీర్షికల క్రింద చూడుడు.

1. దశరూపకమునందలి శ్లో నిర్వేదగ్లాని శంకాశ్రమ ధృతి జడతా హర్ష దైన్యౌగ్రచింతా స్త్రాసేర్ష్యా మర్ష గర్వాః స్మృతి మరణ మదాః సుప్తనిద్రావిబోధాః వ్రీడాపస్మార మోహాః సమతి రలసతావేగ-తర్కా-వహిత్థా వ్యాధ్యున్మాదౌ విషాదోత్సుక చపలయుతాస్త్రింశదేతే త్రయశ్చ —(ధ. ద. రూ. 58 పేజి).

2. ప్రతాపరుద్రీయమునందలి శ్లో నిర్వేదగ్లాని శంక్యాస్తథాఽసూయా మదశ్రమా । ఆలస్యం చైవ దైన్యంచ చింతా మోహః స్మృతి ర్ధృతిః । వ్రీడా చపలతా హర్ష ఆవేగో జడతా తథా । గర్వోవిషాద ఔత్సుక్యం నిద్రాపస్మార ఏవచ సుప్తిర్విబోధోఽ మర్ష శ్చావ్యవహిత్థ మథోగ్రతా మతిర్వ్యాధి స్తథోన్మాద స్తథామరణమేవచ । త్రాసశ్చైవ వితర్కశ్చ విజ్ఞేయా వ్యభిచారిణః త్రయ స్త్రింశదమీ వా రసస్య సహకారిణః —(ప్ర. రు. రసప్రక. 188 పేజి).

3 సాహిత్యదర్పణమునందలి శ్లో నిర్వేదావేగ దైన్యశ్రమ మద జడతా ఔగ్ర్యమోహౌ విబోధః । స్వప్నాపస్మారగర్వా మరణమలసతా మర్ష. నిద్రావహిత్థాః ఔత్సుక్యోన్మాదశంకాః స్మృతిమతి సహితా వ్యాధి సంత్రాసలజ్జా హర్షాసూయా విషాదాః సధృతి చపలతా గ్లానిచింతావితర్కాః —(సా. ద. III-140 పేజి. 141శ్లో.).

**వ్యాధి :** దీనిని ఆర్తి అనికూడా అందురు. వ్యభిచారిభావములందొకటి. (చూ. వ్యభిచారి భావము).

నిర్వచనములు :- (1) వ్యాధయస్సన్నిపాతాద్యా స్తేషా మన్యత్ర విస్తరః" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 64 పేజి 38 సం.). సన్నిపాతము మొదలైనవి వ్యాధులు. వానినిగూర్చి సవిస్తరముగా వైద్యశాస్త్రమున గలదు. (2) మనస్తాపాద్యభిభవాత్ జ్వరాదిర్వ్యాధిరిష్యతే" అని (అం. ప్ర. రు. రసప్రక. 290 పేజి 29 సం.). ప్రతాపరుద్రీయము మనస్తాపము మొదలైన అభిభవము వలన కలుగు జ్వరాదికము వ్యాధి. (3) "వ్యాధి ర్జ్వరాది ర్వాతా ద్యైర్భూమీచ్ఛోత్కంపనాది కృత్ । తత్రదాహమయత్వే భూమీచ్ఛాదయః । శైత్య మయత్వే ఉత్కంపనాదయః" అని సాహిత్యదర్పణము (సా. ద. III-151 పేజి 164 శ్లో.) వాతము మొదలైనవానివలన కలుగు జ్వరము మొదలయినవి వ్యాధి. నేల మీద పరుండు కోర్కె, కుదుపు మొదలయినవి దీనివలన కలుగును. ఈ వ్యాధి దాహమయమైనచో భూమీచ్ఛ మొదలైనవియు, శైత్యమయమైనచో కుదుపు మొదలైనవియు కలుగును. (4) "హృదయమందలి తాపంబినుమడి

యైవెలిఁబర్విన ననయము తనుపీడ యార్తి యగు" అని నరసభూపాలీయము (III_59 ప.). వ్యాధినే ఆర్తియని నరసభూపాలీయము పేర్కొన్నది. (5) "రోగవిరహాదిప్రభవో మనస్తాపో వ్యాధిః" అని రసగంగాధరము (కా. లం. సం. II_350 పేజి). రోగము, విరహము మొదలయిన వాని వలన కలుగు మనస్తాప రూపమైన చిత్తవృత్తివిశేషము వ్యాధి. గాత్ర శైథిల్యము, శ్వాసము మొదలైనవి అనుభావములు.

ఉదాహరణము :- 'ఆ యువతి వక్షఃస్థలమున తామరతూండ్లు పెట్టు కొన్నది. మాటిమాటికి అంగములనిటునటు కదలించుచున్నది. తన ప్రియుని గురించి చెలికత్తె చెప్పుచుండగా చూపులను అతి దీనముగా ప్రసరించు చున్నది'. శ్లో। హృదయే కృతశైలానుషంగా ముహురంగాని యతస్తతః క్షి పంతీ । తదుదంతపరే ముఖే సఖీనా మతిదీనా మియమాదధాతి దృష్టిం" :- రసగంగాధరము. (కా. లం. సం. III_350 పేజి). ఇందు విరహము విభావము. అంగవిక్షేపము మొదలైనవి అనుభావములు. వీనిచే వ్యాధి (ఆర్తి) అభివ్యక్త మయినది (భావధ్వని).

కామదశలందొకటియని సాహిత్యదర్పణకర్త పేర్కొనెను. (చూ. శృంగారావస్థలు).

"వ్యాధిస్తు దీర్ఘ నిఃశ్వాస పాండుతా కృశతాదయః" అని నిర్వచనము. (సా. ద. III_163 పేజి. 192 శ్లో) నిట్టూర్పు, పాలిపోవుట, కృశించుట మొదలైనవి వ్యాధి.

ఉదాహరణము :- సఖీ ! పాలిపోయిన, కృశించిన నీ ముఖము, సరసమైన నీ హృదయము, అలసమయిన నీ శరీరము నీ హృదయము నందలి కుదరని, కఠినమైన రోగమును తెలుపుచున్నవి. శ్లో పాండు క్షామం వదనం హృదయం సరసం తవాలసం చ వపుః । ఆవేదయతి నితాంతం క్షేత్రియ రోగం సఖి హృదంతః —(అం. సా. ద. III_83 పేజి).

**వ్యాప్తి** : చూ. అనుమానప్రమాణము.

**వ్యాపారము** : చూ. శక్తి.

**వ్యుత్పత్తి** : చూ. కావ్యహేతువు.

పాండిత్యమని సామాన్యార్థము. కావ్యహేతువునందొక యంశము.

"ఛందోవ్యాకరణ కళాలోక స్థితి పదపదార్థ విజ్ఞానాత్ యుక్తాయుక్తవివేకో వ్యుత్పత్తిరియం సమాసేన (కా. స్వ. 38 పేజి). అని రుద్రటుడు. ఛందస్సు, వ్యాకరణము, కళలు, లోకము, పదపదార్థములు మొదలగువాని విజ్ఞానమువలన కలుగు యుక్తాయుక్త వివేకము వ్యుత్పత్తి

బహుజ్ఞతా వ్యుత్పత్తిః ఇత్యాచార్యాః । ...ఉచితానుచిత వివేకో వ్యుత్పత్తిః ఇతి యాయావరీయః ప్రతిభావ్యుత్పత్త్యోః ప్రతిభా శ్రేయసీ ఇత్యానందః । సాహి కవేరవ్యుత్పత్తి కృతం దోషమశేషమాచ్ఛాదయతి । తదాహి—అవ్యుత్పత్తి కృతోదోషః శక్త్యా సంవ్రియతే కవేః ।

యస్త్వశక్తి కృతస్తస్య ఝటిత్యేవావభాసతే ... వ్యుత్పత్తిః శ్రేయసీ ఇతి మంగళః సాహి కవేరశక్తి కృతం దోషమశేషమాచ్ఛాదయతి ।... ప్రతిభావ్యుత్పత్తీ మిథః సమవేతే శ్రేయస్యౌ ఇతి యాయావరీయః నఖలు లావణ్యలబ్ధిర్మహతే సౌందర్యాయ । ... ప్రతిభావ్యుత్పత్తి మాంశ్చ కవిః కవిరిత్యుచ్యతే' అని రాజశేఖరుడు (కా. మీ. పంచమ 40-42, పేజీలు). బహుజ్ఞతయే వ్యుత్పత్తి అని ఆచార్యుల మతము. ఉచితానుచిత వివేకమే వ్యుత్పత్తియని యాయావరీయుని (రాజశేఖరుని) మతము. ప్రతిభ, వ్యుత్పత్తి- ఈ రెండింటియందును ప్రతిభయే శ్రేష్ఠమయినదని ఆనంద వర్ధనుని మతము. కవి అవ్యుత్పత్తివలన సంభవించిన దోషమునంతటిని కప్పి వేయునది ప్రతిభయే. అది ఎట్లనగా అవ్యుత్పత్తికృతమైన దోషము కవి యొక్క శక్తి (ప్రతిభ) చే మరుగుపడిపోవును. కాని అశక్తిచేత సంభ వించిన దోషము వెంటనే పట్టుబడిపోవును. ఇది యిట్లుండగా వ్యుత్పత్తియే ప్రతిభకన్న శ్రేష్ఠతరమని మంగళుని వాదము. కవియొక్క అశక్తివలన దొరలిన దోషమంతటిని వ్యుత్పత్తియే కప్పివేయును. ...ఈ వాదము లన్నింటిమీద యాయావరీయుని తీర్పు ఇట్లున్నది— ప్రతిభావ్యుత్పత్తులు రెండును మిళితములై యుండుట శ్రేయస్కరము. లావణ్యములేని రూప సంపదయు, రూపసంపదలేని లావణ్యమును శోభాకరములు కాజాలవుగదా! కావున ప్రతిభావ్యుత్పత్తులు గల కవియే కవి.

'సమస్తవస్తు పౌర్వాపర్య పరామర్శ కౌశలం వ్యుత్పత్తిః' అని అభి నవగుప్తుడు. (చూ. కా. మీః V-40 పేజి టీక). సమస్తవస్తువులను ముందు వెనుకల పరామర్శింపగల నైపుణ్యమే వ్యుత్పత్తి.

"నిపుణతా లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్ । లోకస్య స్థావరజంగ మాత్మక లోకవృత్తస్య శాస్త్రాణాం ఛందోవ్యాకరణాభిధాన కోశకలా చతుర్వర్గ గజతురగ ఖడ్గాది లక్షణ గ్రంథానాం కావ్యానాం చ మహాకవి సంబంధినాం ఆది గ్రహణాదితిహాసాదీనా మవేక్షణాద్ విమర్శనాత్ నిపుణతా వ్యుత్పత్తిః" అని మమ్మటుడు. (కావ్య ప్రకాశః వావిళ్లవారి ప్రతి 13వ పే). కావ్యహేతువులోని యంశము నిపుణత. ఇది లోకశాస్త్రకావ్యాదుల అవేక్ష ణమువలన లభించును. లోకమనగా స్థావరజంగమాత్మక లోకవృత్తము. శాస్త్రములనగా ఛందస్సు, వ్యాకరణము, అభిధానకోశము, కళలు, చతుర్వర్గములు, గజతురగ ఖడ్గాది లక్షణ గ్రంథములు మొదలయినవి. కావ్యములనగా మహాకవి విరచితములు; ఇతిహాసములు మొదలయినవి. వీట న్నింటి విమర్శనమువలన గలుగు నిపుణతయే వ్యుత్పత్తి.

*వ్రజ్యా* : అకారాది హకారాంతముగా ఆద్యక్షరములు గల ముక్తకములను ఒకచోటచేర్చినచో అది వ్రజ్యా. చూ. అతిమనోరమము

*వ్రీడ* : త్రప, లజ్జ అనియు కొందరు పేర్కొనిరి. వ్యభిచారిభావములందొకటి. (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- (1) దురాచారాదిభిర్వ్రీడా ధార్ష్ట్యాభావ స్తమున్న యేత్ । సాచీకృతాంగావరణ వైవర్ణ్యాధోముఖాదిభిః" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 62 పేజి 30 సం.). దురాచారమువలన కలుగు అధైర్యము వ్రీడ. సాచీకృతమైన అవయవావరణత్వము, వైవర్ణ్యము, అధోముఖత్వము మొదలయినవనుభావములు. (2) "చేతస్సంకోచనం వ్రీడాఽనంగరాగ స్తవాదిభిః" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 278 పేజి 13 సం.). మనస్సు సంకోచించుట వ్రీడ. అనంగరాగమువలన గాని అన్యుల స్తవముల వలనగాని వ్రీడ కలుగును. (3) "ధార్ష్ట్యాభావో వ్రీడా వదనానమనాది కృద్దురాచారాత్" అని సాహిత్యదర్పణము (సా. ద. III-152 పేజి 164 శ్లో.). దురాచారము వలన కలుగు మనస్సంకోచము (ధార్ష్ట్యాభావము) వ్రీడ. ఇది తలవంచుకొనుటకు కారణమగును. (4) 'మనంబు ముడుఁగుట త్రప' అని నరసభూపాలీయము (III-72 ప.) (5) స్త్రీణాం పురుషముఖావలోకనాదేః పుంసాంచ ప్రతిజ్ఞాభంగ పరాభవాదేరుత్పన్నో వైవర్ణ్యాధో ముఖత్వాది కారణీ భూతశ్చిత్తవృత్తి విశేషో వ్రీడా" అని రసగంగాధరము (కా. లం. సం. III-357 పేజి 17సం.). స్త్రీలకు పురుషుల ముఖములను చూచుటవలన గలుగునదియు, పురుషులకు ప్రతిజ్ఞాభంగము, పరాభవము మొదలైనవానివలన కలుగునదియు, నగు చిత్తవృత్తి విశేషము వ్రీడ. దీనివలన వైవర్ణ్యము, అధోముఖత్వము మొదలగునవి (అనుభావములు) కలుగును.

ఉదాహరణము :- ఒక వనిత పరాకువలన నరసభూపాలునిపేరు అనుకొనకుండ పలికెను. ఎదుట చెలిక త్తె యున్నదని వెంటనే తలవంచుకొనెను. ఆ తలవంచుకొనుట యెట్లున్నది? తన మొగము తన భావమును తెలిపి వేసినదేయని ఆ మొగమును తన కుచదుర్గములందు నిలిపినదో యన్నట్లున్నది.' —కం। "వనిత నృసింహేంద్రుఁ బరా । కునఁ బేర్కొని శిరము వంచుకొనెుఁ జెలియెదుటన్ గనిపించె భావమని మోమనయముఁ గుచదుర్గ వసతి నాఁగిన భంగిన్" —(కా. లం. సం. III-74 ప.). ఇందు నరసభూపాల నామోచ్చారణము విభావము. తలవంచుకొనుట అనుభావము. వ్రీడ భావ ధ్వని.

**శంక :** వ్యభిచారిభావములందొకటి. (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- (1) "అర్థ ప్రతిభాశంకా పరక్రౌర్యాత్ స్వదుర్నయాత్ కంప శోషా (కా) భి వీక్షాది రత్ర వర్ణ స్వరాన్యతా" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 59 పేజి 12 సం.). ఇతరుల క్రూరత్వము వలనను తన దుష్ప్రవర్తనము వలనను అనర్థము కలుగునని ఊహించుట శంక. దీనివలన కంపము, శోషము, అభివీక్ష, వైవర్ణ్యము, వైస్వర్యము మొదలైనవి కలుగును. (2) "అనిష్టాభ్యాగమోత్ప్రేక్షా శంకా

రోషాదికారణం" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 271 పేజి 3 సం.). అనిష్టము రావచ్చునని ఊహించుట శంక. దీనివలన రోషము మొదలైనవి కలుగును. (3) "పరక్రౌర్యాత్మ దోషాద్యైః శంకానర్థస్య తర్కణం వైవర్ణ్య కంపవైస్వర్య పార్శ్వాలోకాస్య శోషకృత్" అని సాహిత్యదర్పణము (సా. ద. III-150 పే. 161 శ్లో.). ఇతరుల క్రూరత్వము, తన దోషము మొదలయినవానివలన అనర్థమేదో కలుగునని తర్కించుటయే శంక'. దీనివలన వైవర్ణ్యము, కంపము, వైస్వర్యము, ప్రక్కలకు చూచుట, నోరెండిపోవుట మొదలైనవి కలుగును. (4) "తనకు ననిష్టం బగునోయని కొదుకుట శంక" అని నరసభూపాలీయము (III-59 ప.); (5) కిమనిష్టం మమభవిష్యతీత్యాకార శ్చిత్తవృత్తి విశేషశ్శంకా" అని రసగంగాధరము (కా. లం. సం. III-349 పేజి 8 సం ). నాకు అనిష్టమేమైన కలుగునేమో అను ఆకారముగల చిత్తవృత్తి విశేషము శంక.

ఉదాహరణము :- నరసభూపాలా ! నీ వియోగమువలన ఆయువతి తన చెలిమాటలనుకూడా చిలుకల పలుకేమో అని వినుటకు సందేహించును. చంద్రుడేమో అని అద్దము చూచుటకు సందేహించును.' కం "చిలుకల పలుకోయని విన నలుకుం జెలిపలుకుఁ; దలఁకు నద్దము సూడన్ । గలువల చెలికాఁడోయని । చెలువ వియోగంబు కతన శ్రీ నరసింహా ! —(కా. లం. సం. III-60 ప.). ఇందు చిలుకల పలుకులు, చంద్రుని రూపము విభావములు. ముఖ వివర్ణత, కంపము అనుభావములు. వీనిచే అనిష్టప్రాప్తిని గూర్చిన శంక అభివ్యక్తమగుచున్నది.

**శక్యము :** వివరములకు ముందు చూ. అభిధ. అభిధాశక్తిచే బోధింపబడు శబ్దార్థమే శక్యము లేదా శక్యార్థము. శక్యమునే వాచ్యము, సంకేతితము, అభిధేయము, ముఖ్యార్థము అనియు అందురు.

**శక్తి :** పదమునకును, దాని అర్థమునకునుగల సంబంధమునే శక్తి అందురు. "పదపదార్థ సంబంధశ్శక్తిః" ఇది తార్కికుల పరిభాష. ఆలంకారికులు దీనినే వృత్తి యనియు, వ్యాపారమనియు కూడా అందురు. శక్తి మూడు విధములు —అభిధ. లక్షణ, వ్యంజన. (చూ. ఆయా శీర్షికలు).

శక్తియే ప్రతిభయని కొందరు, ఇవి రెండును వేరువేరని కొందరు అభిప్రాయపడిరి చూ. ప్రతిభ.

మమ్మటుడు శక్తి కావ్యహేతువనెను. 'శక్తిర్నిపుణతా' ఇత్యాది శ్లోకము చూడుడు

"సా కేవలం కావ్యేహేతుః ఇతి యాయావరీయః । విప్రసృతిశ్చ సా ప్రతిభావ్యుత్పత్తిభ్యామ్ । శక్తి కర్తృకే హి ప్రతిభావ్యుత్పత్తి కర్మణి । శక్తస్య ప్రతిభాతి శక్తశ్చ వ్యుత్పద్యతే " అని రాజశేఖరుడు (కా. మీ. IV-30 పేజి). శక్తియే కేవలకావ్యహేతువని యాయావరీయునభిప్రాయము. ఇది ప్రతిభావ్యుత్పత్తులకంటె భిన్నము. శక్తినుండియే ప్రతిభా

వ్యుత్పత్తులుత్పన్నములగును. శక్తికర్త. ప్రతిభావ్యుత్పత్తులు కర్మలు. శక్తునకే ప్రతిభవ్యుత్పత్తులు లభించును.

*శబ్దపాకము :* చూ. శయ్య.

"యత్పదాని త్యజంత్యేవ పరివృత్తి సహిష్ణుతామ్ । తం శబ్దన్యాస నిష్ణాతాః శబ్దపాకం ప్రచక్షతే" (కా. మీ. V-52 పేజి). పరివృత్తి సహిష్ణుత గల పదములను విడిచివేయునది శబ్దపాకము. పదవినిమయము నంగీకరింపని రచనయని సారాంశము. దీనినే తరువాతివారు శయ్య అనిరి. చూ. శయ్య.

*శబ్దశక్తిమూలధ్వని :* వివరములకు ముందు చూ. ధ్వని, అభిధామూలధ్వని. సంలక్ష్యక్రమవ్యంగ్యము; శబ్దశక్తిమూలవ్యంజన.

సంలక్ష్య క్రమవ్యంగ్యముయొక్క మూడు భేదములందు ఈ శబ్దశక్తిమూలధ్వని యొకటి. మిగిలినవాని వివరములకు చూ. అర్థశక్తిమూలధ్వని ఉభయశక్తి మూలధ్వని.

శబ్దములను మార్చినచో ధ్వని నష్టమైపోవుట శబ్దశక్తిమూలధ్వని లక్షణము. శబ్దపరివృత్తినిది సహింపదు. దీని రెండుభేదములకును ఉదాహరణములు :

(1) (శబ్దశక్తిమూల) వస్తుకృతవస్తుధ్వని :- "ఓ బాటసారీ! ఈ రాత్రి ఈ గ్రామమున పరుండుటకు చాపలుకూడాలేవు. ఇక్కడ అన్నియు రాళ్లురప్పలు. కాని ఉన్నతమైన పయోధరములనుచూచి ఆగిపోదలచినచో ఆగిపొమ్ము[1]". అని ఒక ప్రోషితభర్తృక తనయింటికివచ్చిన యువక పాంథునితో అన్నది— "వర్షింపసిద్ధముగానున్న మబ్బులను చూచి వాననుండి తప్పించుకొనుటకై నిలువదలచినచో నిలువుము" అని వాచ్యార్థము. "ఇక్కడివారందరును జడులు (రాళ్లు) నీవు ఉండిపోయినను అనుమానింపరు. నా పయోధరాలు (నా వక్షోజములు) చూచి కుతూహలమున్నచో ఈరాత్రికిక్కడ ఉండిపొమ్ము" అన్నది వ్యంగ్యము. ఇది శబ్దశక్తిమూల వస్తువు. "నీవు తప్పక ఇక్కడ ఉండిపోయి నన్ననుభవింపుము" అనునది మరియొకధ్వని. ఇట్లు వస్తుకృత వస్తుధ్వని ఇక్కడ శబ్దములను ఆశ్రయించుకొనియున్నది.

(2) (శబ్దశక్తిమూల) అలంకారధ్వని :- ఓ నరసరాజా! ఈ కోమలి పద్మిని. నీవెల్లప్పుడును రక్షించు ఇనుడవు. నీ కరస్పర్శలేనిచో ఈమెయెట్లు ప్రకాశించును?[2]" —ఇందు "ఈమె పద్మినీజాతివనిత. నీవు ప్రభువవు. నీ హస్తస్పర్శలేనిచో ఈమె యెట్లు ప్రకాశించును."అన్నది వాచ్యార్థము. పద్మిని, ఇనుడు, కరము అను శబ్దములశక్తివలన "ఈమె తామరతీగ. నీవు సూర్యుడవు. నీ కిరణ స్పర్శలేనిచో ఈమె ఎట్లు ప్రకాశించును?" అను అర్థాంతరము స్ఫురించును. ఈ రెండర్థములకును ఉపమేయోపమాన

భావముండును. ఇదే అలంకారధ్వని. ఈ రెండర్థముల క్రమమును స్ఫుట ముగా గోచరమగుచున్నది కనుక ఇది సంలక్ష్యక్రమము.

పై రెండు భేదములును పదగత, వాక్యగత భేదములచే నాలుగు విధములగును.

1ఆ. వె. కటికరాలుదక్కఁ గనరావు కంటికి పల్లెకొంపలందు బాటసారి !
ఘనపయోధరములు గనుఁగొని నిలువంగఁ దలఁచితేని నేఁడు నిలిచిపొమ్ము
— కావ్యాలంకార సంగ్రహవ్యాఖ్య. 209 పేజి.

2క ఈ కోమలి పద్మిని యఁట
యే కాలముఁ బ్రోచు నినుఁడ వీవఁట, సతిదా
నీ కరసంస్పర్శసహన
గాక చెంగునె! నృసింహ ; ఘనబలసింహా !
— నరస భూపాలీయము II ఆ. 117 ప.

**శబ్దశక్తిమూల వ్యంజన** : వివరములకు ముందు చూ. వ్యంజన. అభిధామూల మైన లక్ష్యక్రమవ్యంజన మువ్విధము. అందిది యొకటి. మిగిలినవాని వివ రములకు చూ. అర్థశక్తి మూలవ్యంజన; ఉభయశక్తిమూలవ్యంజన.

ఒక వాక్యమున నానార్థక పదములున్నపుడు మొదట ప్రకరణాదుల వలన అప్రకృతమైన అర్థములు నివారింపబడి, ప్రకృతార్థములు మాత్రమే అభిధాశక్తివలన గోచరించును. ఆ తరువాత మరలయే శక్తివలన అప్ర కృతార్థము కూడా అచట గోచరమగుటకు అవకాశము లభించునో ఆశక్తినే శబ్దశక్తిమూలవ్యంజన అందురు.

సంయోగాదులు నానార్థక శబ్దముల యొక్క ప్రాకరణికార్థమును నియమించును. (వివరములకు చూ. సంయోగాదులు). అందువలన తక్కిన అర్థములు నివారింపబడును. ముఖ్యార్థమిట్లు సిద్ధించిన తరువాత ఆ శబ్దముల (వ్యంజనా) శక్తివలన అర్థాంతరము కూడా రావచ్చును. అదే వ్యంగ్యా ర్థము. ఈ శబ్దశక్తి మూలవ్యంజనలో శబ్దములు ముందు వాచకములై, తరువాత వ్యంజకములగును. ఈ రెండు అర్థములందును, మొదటిదైన వాచ్యార్థము ప్రాకరణికార్థము కాగా రెండవదైన వ్యంగ్యార్థము అప్రా కరణికార్థము. ఈ రెండింటికిని ఉపమానోపమేయభావము (వ్యంగ్యార్థ ముపమానము, వాచ్యర్థముపమేయము) సిద్ధించును.

ఎక్కడ వ్యంజకములగు శబ్దములను మార్చి వాని పర్యాయ పదము లుంచినప్పుడు వ్యంగ్యార్థము సిద్ధింపదో అక్కడ శబ్ద శక్తి మూలవ్యంజన. "శబ్దస్య పరివృత్త్యసహత్వే శబ్దవ్యంజనా"(కా. లం. సం. II-165 పే.)

ఉదాహరణము— : నృసింహుని చేతిలోని కత్తి నిజ సమగ్ర ధారాని మజ్జనతత్పరులగు నరులకు అనిమిషభావమునిచ్చును.

క. ఘనత నృసింహుని కరమున । దనరెడునసి నిజసమగ్ర ధారాగ్ర నిమ
జ్జనతత్పరులగు నరులకు ననిమిష భావంబొనర్చు ననవరతంబున్.
— కా. లం. సం II-69.

దీనికి వాచ్యార్థమిది:— నరసింహరాజు చేతిలోనున్న కత్తి తన పదనుకు గురి కాదలచిన శత్రువులకు రెప్పపాటు లేమిని కలిగించును. అనగా శత్రువులతని కత్తిపదును కింద పడి నిశ్చేష్టులై మరణింతురు అని అర్థము. ఈ ఉదాహరణమున (1) నృసింహుడు (2) తత్పరులగు నరులు (3) అనిమిషభావము అను శబ్దములకు రెండేసి అర్థములున్నవి. ప్రకృతార్థము (ప్రాకరణికార్థము) వాచ్యార్థమయినది. ఆ తరువాత స్ఫురించు అప్రకృతార్థములివి: (1) నృసింహావతారధారి యగు విష్ణువు (2) ఆసక్తులగు మానవులు (3) దేవత్వము. ఈ అర్థముల వలన పై ఉదాహరణమునందు మనోహరమగు అర్థాంతరము స్ఫురించుచున్నది. అది :- నృసింహావతారధారి అయిన విష్ణువు తన కత్తి పదునులో మునుగ దలచిన మానవులను దేవతలనుగా మార్చివేయును. ఈ వాచ్యార్థవ్యంగ్యార్థములకు ఉపమేయోపమాన భావమును చెప్పవచ్చును.

**శమము** : వివరములకు ముందు చూ. స్థాయిభావము. శాంతియని సామాన్యార్థము. అలంకారశాస్త్రములో శాంతరసమున కిది స్థాయిభావము.

శమమునకు నిర్వచనములు :— (1) "వైరాగ్యాదినా నిర్వికారచిత్తత్వం శమః" అని ప్రతాపరుద్రీయలక్షణము (రసప్రకరణము). వైరాగ్యము మొదలైన వానిచేత నిర్వికారమైన మనస్సుతో నుండుటయే శమము. వైరాగ్యాదులనగా వైరాగ్యము, దైవానుగ్రహము, సత్సంగము మొదలైనవి. ఈ శమము కలిగినప్పుడు విషయాభిలాషలు నశించును. (2) "శమో నిరీహావస్థాయాంస్వాత్మ విశ్రామజం సుఖమ్" అని సాహిత్య దర్పణము (తృతీయ పరిచ్ఛేదము). కోరికలు లేని అవస్థయందు ఆత్మ విశ్రామమువలన కలుగు సౌఖ్యమే శమము. (3) "నిత్యానిత్య వస్తువిచారజన్మా విషయ విరాగాఖ్యః నిర్వేదః గృహకలహాదిజస్తు వ్యభిచారీ" అని రసగంగాధరము (ఆంధ్రరసగంగాధరము -143 పేజి) ఏది నిత్యమో ఏది అనిత్యమో తెలిసికొనుటవలన విషయవాంఛలందు విరాగమేర్పడును. ఆ చిత్తవృత్తియే వైరాగ్యము. దీనినే నిర్వేదమనియు శమమనియు నందురు. గృహకలహాదుల (ఇంటిపోరు మొ.నవి) వలన గూడ వైరాగ్యము కల్గవచ్చును. కాని అది సంచారి భావమే కాని స్థాయిభావము కాజాలదు. (4) "నిరుపమ వైరాగ్యాదుల కిరవై నిశ్చలతఁబూని హృదయము తిరమై నరులకుఁ బరిణతిఁ జెందిన ధరలో నది శమమనంగఁదగు" అని నరసభూపాలీయము. (III-25).

శమమునకు నరసభూపాలీయమునందలి యుదాహరణము:-నరసభూపాలుని శత్రువులు ప్రాణాపాయము కలుగునని భయపడి అడవులకు పారిపోయిరి. వారు సంసారములను విడిచిరి. అక్కడ వారికి వైరాగ్యము కలిగినది. అందువలననే వారు నృసింహజపము చేయసాగిరి. వారి కట్టి వైరాగ్యము కల్గుటకు మొదట నరసింహభీతియే కారణము. అయినను తరువాత వారు నరసింహనామస్మరణముతోనే వైరాగ్యసౌఖ్యమనుభవించిరి. ఇది శత్రువుల

నిర్వేదరూపమగు చిత్తవృత్తిని (శమమును) వ్యక్తము చేయుచున్నది.
ఉ "ఘోరభవాదిదుఃఖములఁ గుందఁగ నీక నృసింహుఁడౌర ! దు ర్వార ఫలప్రదంబగు విరక్తిసుఖంబొనరించెనంచు నీ వైరులు మౌనులై విపినవాటిని నీవ గురుండవంచు నీ పేరిటి యక్షరంబులె జపింతురు శ్రీనరసింహ భూవరా" — కా. ల. సం. III —26.

*శయ్య :* శయ్య శబ్దధర్మము. "యా పదానాం పరాఽన్యోన్యమైత్రీ శయ్యేతి కథ్యతే" (ప్ర. రు. కావ్య ప్రక. 58పేజి). మార్పును సహింపజాలని ఉత్కృష్టపదముల గాఢమైన పరస్పర మైత్రియే శయ్య. రచనలో పదముల కుండుపొత్తు శయ్య. ఏపదముత రువాత ఏ పదమును కూర్చినప్పుడు సుంద రముగా నుండునో అది ఆ రచయితకే తెలియును. ఆ పదములు వినిమయమును సహింపవు. ఈ శయ్యనే పరివృత్త్యసహిష్ణుత అనియు అందురు.

ఉదాహరణము :— క చెఱనుండి ముక్తిగాంచిన, నరుగతి నీ దేహ బంధనము వీడి మహాత్తరగతిఁ బొందెడి జీవుల కొఱకై చింతింప బద్ధ కోటికిఁ దగునే?" —— (కా. లం. సం. II—178 పే.)

శయ్యయను పదమునకు పడక అని శబ్దార్థము. ఎగుడు దిగుడు లేక మృదువుగానున్న శయ్య సౌఖ్యావహమగుచున్నట్లే కావ్యమున శబ్దముల కూర్పు విషమముగాకుండ నుండవలెనను భావముతో దీనిని శయ్య అనిరి.

శయ్యకు మైత్రి, ముద్ర అను నామాంతరములున్నవి. శయ్యనే శబ్దపాకము అని కూడా అందురు.

(ఇంకను వివరములకు చూ. కాలంసం II— 179 పేజి.)

*శరీరజములు :* చూ. అంగజములు.

*శాస్త్రకవి :* కావ్యమీమాంసయందు రాజశేఖరుడు కవులు మూడు రకములనెను. అందు' శాస్త్రకవి' యొకడు. (చూ. కావ్యకవి, ఉభయకవి).

"త్రిధా శాస్త్రకవిః యః శాస్త్రం విధత్తే, యశ్చ శాస్త్రే కావ్యం సంవిధత్తే, యోఽపి కావ్యే శాస్త్రార్థం నిధత్తే " అని రాజశేఖరుడు. (కా. మీ V- 44 పేజి). శాస్త్రకవి మూడు విధములుగానుండును. (1) శాస్త్రనిర్మాత (2) శాస్త్రమున కావ్య సంవిధానము చూపువాడు. (3) కావ్యమున శాస్త్రార్థమును ప్రదర్శించువాడు.

*శిల్పకుడు :* సప్తవిధకవులందు శిల్పకుడొకడని అప్పకవి పేర్కొనెను.

"చెప్పుయమకంబు నెప్పట్ల శిల్పకుండు" అని లక్షణము.

*శుద్ధధ్వనులు :* వివరములకు చూ. ధ్వని అభిధామూల (వివక్షితాన్యపరవాచ్య) ధ్వని 47 విధములను, లక్షణామూల (అవివక్షితవాచ్య) 4 విధములును కలిసి 51 రకములైన ధ్వనులును శుద్ధధ్వనులనబడును. వీనినే అసంకీర్ణ ధ్వనులు అని కూడ అందురు. (చూ. మిశ్రధ్వనులు.)

*శృంగార చేష్ట :* ఉద్దీపన విభావములలో నొకటి (చూ. ఉద్దీపన విభావము). అనుభావము (చూ. అనుభావము) లలోని భేదము

శృంగారచేష్ట నాయిక యొక్క అనుభావము. ఇదియే నాయకుని కుద్దీపన విభావము.

శృంగారరసమునకు సంబంధించిన చేష్ట శృంగారచేష్ట. ఈ చేష్టలు 18 గలవని ప్రతాపరుద్రీయమును,

"భావోహావశ్చ హేలాచ మాధుర్యం ధైర్యమిత్యపి । లీలా విలాసోవిచ్ఛిత్తిర్విభ్రమః కిలికించితం । మోట్టాయితం కుట్టమితం బిబ్బోకోల లితం తథా కుతూహలంచ చకితం విహృతం హాసఇత్యపి ఏవం శృంగార చేష్టాస్స్యురష్టాదశ విధామతాః" –(ప్ర. రు. 220 పేజి 64, 65 సం), దాని ననుసరించి నరసభూపాలీయమును (కా. లం. సం. 372 పేజి65, 66 సం) పేర్కొనెను. సాహిత్యదర్పణమున ఈ చేష్టలను చేష్టలను పేరున గాక అలంకారము (చూ. అలంకారములు) లను పేరున తెలుపుట జరిగెను. అవి ఇరువదియెనిమిది.

ప్రతాపరుద్రీయమునందలి శృంగార చేష్టలు :– (1) భావము (2) హావము (3) హేల (4) మాధుర్యము (5) ధైర్యము (ఈ అయిదును మానసిక చేష్టలు). (6) లీల (7) విలాసము (8) విచ్ఛిత్తి (9) విభ్రమము. (10) కిలకించితము (11) మోట్టాయితము (12) కుట్టమితము (13)బిబ్బో కము (14) లలితము (15) కుతూహలము (16) చకితము (17)విహృతము (18) హసితము (ఈ పదమూడును కాయికచేష్టలు). (ఆంప్రరు 295 పేజి) వీని నాయాశీర్షికలకింద ఈ గ్రంథమున చూడుడు.

***శృంగారము :*** నవరసములందొకటి. (చూ. నవరసములు). దీనికే అభిమాన రసము, అహంకారరసము అని నామాంతరములు. (కాలంసంIII_309).

ఇది రెండువిధములు. (1) సంభోగశృంగారము (2) విప్రలంభ శృంగారము. వివరములకు, ఉపభేదములకు చూ. ఆ శీర్షికలు.

"శృంగంహి మన్మథోద్భేదస్తదాగమన హేతుకః ఉత్తమ ప్రకృతి ప్రాయో రసః శృంగార ఇష్యతే" అని సాహిత్యదర్పణము (సా. ద.III–161పే. 183 శ్లో.). శృంగమనగా మన్మథోద్భేదము. (సంభోగేచ్ఛయు బుకుట). అది కారణముగా గలది శృంగారము. ఇది ఉత్తమ ప్రకృతి ప్రాయము. "పరోఢాం వర్జయిత్వాతు వేశ్యాం చాననురాగిణీం ఆలంబనం నాయికాః స్యుర్దక్షిణాద్యాశ్చ నాయకాః" అని సాహిత్యదర్పణము (సా. ద. III-161పే. 184శ్లో.). పరోఢ(పరకీయ) కాక, అనురాగములేని వేశ్యకాక, తక్కిన నాయికలును, దక్షిణాదులగు నాయకులును శృంగారమునకు ఆలం బనములు. "చంద్రచందనరోలంబ రుతాద్యుద్దీపనం మతం । భ్రూవిక్షేప కటాక్షాదిరనుభావః ప్రకీర్తితః । త్యక్త్వౌగ్ర్య మరణాలస్య జుగుప్సా వ్యభి చారిణః । స్థాయిభావోరతిః శ్యామవర్ణోఽయం విష్ణుదైవతః" అని సాహిత్య దర్పణము (సా. ద. III–161 పేజి. 185, 186 శ్లో.). చంద్రుడు, చంద నము, తుమ్మెదల మ్రోత మొదలైనవి శృంగారమునకు ఉద్దీపనములు. భ్రూ

విక్షేపము, కటాక్షము మొదలైనవి దానికి అనుభావములు. ఉగ్రత, మర ణము, ఆలస్యము, జుగుప్స అనునవికాక తక్కినవి దానికి వ్యభిచారి భావములు. ఈ శృంగారమునకు 'రతి' స్థాయిభావము. ఇది శ్యామవర్ణము గలది. దీనికి విష్ణువధిదేవత.

"స్త్రీలయందు శృంగార మంకురావస్థ, పల్లవావస్థ, కోరకావస్థ, పుష్పావస్థ, ఫలావస్థయను పంచావస్థలును క్రమముగాఁ బొందును. ఈ పంచావస్థాత్మకమగు శృంగారము దశావస్థలను బొందును" అని కావ్యా లంకార సంగ్రహవ్యాఖ్య (కా. ల, సం. III_393 పేజి). (చూ. మన్మథా వస్థలు).

"శృంగారోహి నామ విశిష్ట, ఇష్ట, దృష్ట, చేష్టాభివ్యంజకానాం ఆత్మగుణసంపదాం ఉత్కర్ష బీజం బుద్ధి సుఖదుఃఖేచ్ఛాద్వేష ప్రయత్న సంస్కారాద్యతిశయ హేతురాత్మనోఽహంకార విశేషః" అనిభోజుఁడు. "తన యిచ్ఛావిషయమగు విశేషముతోఁ గూడిన చేష్టలచే నభివ్యక్త ములును, చేష్టలను వ్యక్తీకరించు నవియునగు నాత్మ గుణసంపదలను (రత్యాదులను) ఇతరవ్యక్తియందు గ్రహించి స్వవిషయములుగా భావిం చుటవలనఁ దనరత్యాదులకు నతిశయము గలుగును. మఱియు బుద్ధి సుఖదుః ఖాదులకును నతిశయము గలుగును. ఈ యతిశయమునకు హేతుభూత మహంకార విశేషము. ఆ యహంకారమే శృంగారము" (కా. లం. సం. III_311పే. -శ్రీసన్నిధానంవారి తెలుగుసేత). (భోజుని యభిప్రాయము పై సమగ్రమైన వ్యాఖ్యకు చూ. కా. లం. సం. III_311పేజి.)

"శృంగారమునకు సాహిత్యదర్పణమునందలి యుదాహరణము:-భర్త నిద్రించుచున్నాడనుకొని యతని భార్య ఏకాంతముగా నున్న పడకగదిలో అతని ముఖమును చాలసేపు చూచి, సందేహించక, అతని చెక్కిటిని ముద్దు గొనెను. అంత నతనికి పులకాంకురములు కలిగెను. అది చూచి ఆమె ముఖము వంచుకొనెను. అప్పుడతడు నవ్వుచు ఆమెను చాలసేపు ముద్దిడుకొనెను.

శ్లో॥ శూన్యం వాసగృహం విలోక్య శయనాదుత్థాయ కించిచ్ఛనైః। నిద్రా వ్యాజముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖమ్ విస్రబ్ధం పరిచుంబ్య జాతపులకా మాలోక్య గండస్థలీం । లజ్జా నమ్రముఖీ ప్రియేణ హసతా బాలా చిరం చుంబితా" -(ఆం. సా. ద. I-7పే.) ఇందు ఉక్తస్వరూపు లగు నాయికానాయకులు ఆలంబన విభావములు. శూన్యమైన వాసగృహము ఉద్దీపనవిభావము. చుంబన మనుభావము; లజ్జాహాసములు వ్యభిచారి భావములు. వీనిచేత అభివ్యక్తమై సహృదయ విషయమైన రతిభావము శృంగార రసరూపము నొందును. (చూ. సా. ద. III-161 పేజి. 186 శ్లో. వివరణ).

**శృంగారావస్థలు** (దశావస్థలు / ద్వాదశావస్థలు): (1) శృంగారరసము అయోగ విప్రయోగ సంభోగములని ముప్విధము, అయోగ శృంగారమున

అవస్థలు పది. "దశావస్థాః సత్రాదా వభిలాషోఽథ చింతనం, స్మృతి ర్గుణకథోద్వేగ ప్రలాపోన్మాద సంజ్వరాః జడతా మరణంచేతి దురవస్థం యథోత్తరం" (ధ. ద. రూ. IV ప్రకా. 70 పేజి59, 60సం.) అని దశరూపకము. (1) అభిలాష (2) చింతనము (3) స్మృతి (4) గుణకథ (5) ఉద్వేగము (6) ప్రలాపము (7) ఉన్మాదము (8) సంజ్వరము(9) జడత (10) మరణము.

(2) "శృంగారస్యాంకురితత్వ పల్లవితత్వ కుసుమితత్వ ఫలితత్వ హేతవో ద్వాదశావస్థా నిరూప్యంతే చక్షుః ప్రీతిర్మనస్సంగ సంకల్పోఽథ ప్రలాపితా। జాగరః కార్శ్యమరతిర్లజ్జాత్యాగోఽథ సంజ్వరః ఉన్మాదో మూర్ఛనంచైవ మరణంచరమంవిదుః అవస్థా ద్వాదశమతాః కామశాస్త్రానుసారతః కేచిత్తు దశావస్థా ఇతికథయంతి" —(ప్ర. రు. రసప్రక. 228 పేజి), అని ప్రతాపరుద్రీయము. శృంగారరసము అంకురించి పల్లవించి కుసుమించి ఫలించుటకు హేతువులైన అవస్థలు పన్నెండు. (1) చక్షుఃప్రీతి (2) మనస్సంగము (3) సంకల్పము (4) ప్రలాపము (5) జాగరము (6)కార్శ్యము (7) అరతి (8) లజ్జాత్యాగము (9) జ్వరము (10) ఉన్మాదము(11)మూర్ఛనము. (12) మరణము. ఇవి కామశాస్త్రానుసారులు.

(3) "శృంగార మంగనామణులయందు నంకురిత పల్లవిత పుష్పితాది భేద వర్ణితాకృతియై దశావస్థలయ్యె". క ఇలఁజూచుట, చింతించుట, తలఁచుట, గుణవినుతి, యరతి, తాపము, లజ్జాసలనము, గమనము, మూర్ఛ యు నలధన్యత యననవస్థలగు"—(కాలం సం. III_393,94 పే) అని నరస భూపాలీయము.

(4) శృంగారము విప్రలంభమనియు, సంభోగమనియు ద్వివిధము. విప్రలంభము పూర్వరాగ - మాన - ప్రవాస-కరుణములని చతుర్విధము." శ్రవణాద్దర్శనాద్వాపి మిథః సంరూఢరాగయోః । దశావిశేషో యోఽప్రాప్తౌ పూర్వరాగఃసఉచ్యతే। శ్రవణంతు భవేత్తత్ర దూత వందిసఖీముఖాత్ ఇంద్రజాలేచ చిత్రేచ సాక్షాత్ స్వప్నేచ దర్శనమ్ అభిలాషశ్చింతాస్మృతి గుణకథనోద్వేగ సంప్రలాపాశ్చ ఉన్మాదోఽథ వ్యాధిర్జడతా మృతిరితి దశాత్రకామదశాః" (సా. ద. III_163 పేజి 186 నుండి 190 శ్లో.). శ్రవణదర్శనములవలన సంరూఢరాగులయినవారి అప్రాప్తియందలి దశావిశేషమే పూర్వరాగము. ఇందు కామదశలు పది. (1) అభిలాషము (2) చింత (3) స్మృతి (4) గుణకథనము (5) ఉద్వేగము (6) సంప్రలాపము (7) ఉన్మాదము (8) వ్యాధి (9) జడత (10) మృతి.

(5) భావప్రకాశమున నీ యవస్థలు భిన్నముగా నున్నవి. ఎట్లన:—శ్లో "దశధామన్మథావస్థా భవేద్ద్వాదశధాఽపివా ఇచ్ఛోత్కంఠాభిలాషాశ్చ చింతా స్మృతిగుణస్తుతీ । ఉద్వేగోఽథ ప్రలాపఃస్యా దున్మాదో వ్యాధిరేవచ జాడ్యం

మరణమిత్యాద్యేద్వేకై శ్చిద్వర్జితే బుధైః" —ఇచ్ఛ, ఉత్కంఠ, అభిలాష, చింత, స్మృతి, గుణస్తుతి, ఉద్వేగము, ప్రలాపము, ఉన్మాదము, వ్యాధి, జాడ్యము, మరణము అను పండ్రెండింటిలో మొదటిరెండును, ఇచ్ఛ (ఉత్కంఠ) గొందఱు విడిచిరి. నరసభూపాలీయ పద్యమునందలి 'గమనము, ధన్యత' యనునవి పైవేనియందును గానరావు. గుణవినుతి భావప్రకాశ లక్షణమునఁగలదు. తాపము సంజ్వర నామముతోఁ ప్రతాపరుద్రీయమునఁ గలదు. ప్రలాప, సంజ్వరములు గలిపికొని దృఙ్మనస్సంగ సంకల్పాదులగు పదియును స్వీకరించి మొత్తము పండ్రెండవస్థలు స్వీకరించుట యుచిత మగును. ఆంధ్ర కావ్యములలో నాయికచేయు చంద్రాదిదూషణము లీ ప్రలాపరూపములే. ఈ ద్వాదశావస్థాత్మకమగు శృంగారమునకుఁ బూర్వ రాగమని పేరు" —శ్రీసన్నిధానంవారు (కాలం సం III-394, 395 పేజీలు).

శ్రమము : ఒకవ్యభిచారిభావము (చూ. వ్యభిచారి భావము).

నిర్వచనములు :- (1) "శ్రమఃఖేదోఽధ్వరత్యాదేః స్వేదోస్మిన్ మర్దనాదయః" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 59 పేజీ 13 సం). దూరప్రయాణము, రతి మొదలైన వానివలన కలిగిన ఖేదమే శ్రమము. స్వేదము, మర్దనము మొదలైనవి దీనికి అనుభావములు. (2) "శ్రమం ఖేదోఽధ్వరత్యాదేః జాతః స్వేదాతిభూమికృత్" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రస ప్రక. 273 పేజీ 5సం). ప్రయాణము, రతి మొదలయిన వానివలన కలిగిన ఖేదమే శ్రమము. స్వేదాతిశయము నిది కలిగించును. (3) "ఖేదోరత్యధ్వగత్యాదేః శ్వాసనిద్రాదికృత్ శ్రమః" అని (సా. ద III-141 పే. 146 శ్లో). సాహిత్యదర్పణము రతి, ప్రయాణము మొదయిన వానివలన కలుగు ఖేదము శ్రమము, నిశ్వాసము, నిద్ర మొదలయిన వానినిది కలిగించును. (4) "సురతగమనాది సంభవసరస స్వేదాంబులహరిశ్రమము" అని నరసభూపాలీయము (III-51 ప.). (5) "బహుతర శారీరవ్యాపార జన్మా నిశ్వాసాంగ సమ్మర్ద నిద్రాది కారణీభూతః ఖేదవిశేషః శ్రమః" అని రసగంగాధరము (కా. లం. సం. తృతీయ 344 పే. 2సం). బహుతరమైన శరీరవ్యాపారమువలన కలిగిన ఖేదవిశేషమే శ్రమము. ఇది నిశ్వాసము అంగసమ్మర్దము, నిద్ర మొదలయిన వానిని కలిగించును. (6) అధ్వవ్యాయామ సేవాద్యైర్విభావైరనుభావకైః గాత్రసంవాహనైరాశ్య సంకోచై రంగ మోటనైః నిశ్వాసై ర్జృంభితైర్మందైః పాదోత్క్షేపై శ్శ్రమోమతః" అని మరొక నిర్వచనము (కా. లం. సం. తృతీయ 344 పేజీ 1సం). ప్రయాణము, వ్యాయామసేవ మొదలైన విభావముల చేతను, గాత్ర సంవాహనము, ముఖసంకోచము, అవయవ మోటనము, నిశ్వాసములు, జృంభితము, మందమైన పాదోత్క్షేపణము మొదలైన అనుభావములచేతను వ్యక్తమగు వ్యభిచారి భావము శ్రమ,

ఉదాహరణము :— 'నరసభూపాలుని చూడవలెనని ఒకయువతి వేగముగా నడచివచ్చెను. అందువలన నామెకు స్వేదము కలిగెను. అప్పుడామె చంద్రకిరణములు పడుటవలన కరిగిపోయిన చంద్రకాంత శిలాప్రతిమవలె నుండెను.' కం "నరసేంద్రుఁజూడ రయమున నరుదెంచి లతాంగి శ్రమ జలాపూరితయైన।రసేందు కిరణపరిణతిఁ గరఁగిన నెలచట్టు బొమ్మకైవడి నమరెన్" — (కాలం సం -III-52 ప). ఇందు నరసభూపాలదర్శనార్థము ప్రయాణము విభావము. స్వేదము అనుభావము. ఈ రెండింటిచే శ్రమము వ్యక్తమగుచున్నది.

**శ్రవ్యకావ్యము :** "శ్రవ్యం శ్రోతవ్యమాత్రం తత్పద్యగద్యమయంద్విధా" అని సాహిత్యదర్పణము (సా. ద. VI పరి. 352 పే 313 శ్లో). కేవలము వినదగిన కావ్యము శ్రవ్యము. అది పద్యకావ్యము, గద్యకావ్యము అని రెండు విధములు. చూ. పద్యకావ్యము, గద్యకావ్యము.

**శాంతరసము :** నవరసములందొకరసము. (చూ. నవరసములు).

(1) భరతుడీ శాంతమును రసముగా పేర్కొనలేదు. (2) భట్టోద్భటుడు శాంతమును రసముగా పేర్కొని శమమును దానికి స్థాయిభావముగా తెలిపెను. (3) ధనికుడు శ్రవ్యకావ్యమున శాంతము రసముగా నిబంధింపదగినదని తెలిపెను. (4) "నయత్రదుఃఖం న సుఖం నచింతా నద్వేష రాగౌనచి కాచిదిచ్ఛా రసస్తు శాంతః కథితో మునీంద్రైః సర్వేషు భావేషు శమప్రధానః" అని ధనికుని వివరణము. "ఏదశలో దుఃఖము గానీ ప్రపంచ సుఖముగానీ రాగద్వేషములుగానీ యిచ్ఛగానీ లేవో, యా దశయే శాంతము. ఎల్లవిషయములందును శమమే ప్రధానమగు రసముశాంతము." (సన్నిధానంవారి తెలుగుసేత). (5) శాంతము కావ్యనాటకములు రెండింటను నుండునని సాహిత్యదర్పణము. (చూ. కా. లం. సం. III-291-298పే.)

శాంతరసమునకు స్థాయిభావమేదియను విషయమున భిన్నమతములున్నవి. (1) కొందరు 'శమము' స్థాయిభావమనిరి. (2) రుద్రటునిమతమున 'సమ్యగ్ జ్ఞానము' స్థాయిభావము. (3) ఆనందవర్ధనుని మతమున 'తృష్ణాక్షయసుఖము' స్థాయిభావము (4) భోజుని మతమున 'ధృతి' స్థాయిభావము' (ధృతి-నిత్యసంతుష్టి). (5) కొందరి మతమున 'నిర్వేదము' స్థాయిభావము' (తత్వజ్ఞానము వలన గలిగిన నిర్వేదము) (6) కొందరిమతమున 'ఉత్సాహము' స్థాయిభావము. (7) కొందరిమతమున 'జుగుప్స' స్థాయిభావము' (8) కొందరిమతమున 'ఆత్మరతి' స్థాయిభావము. (9) అభినవగుప్తుని మతమున 'తత్త్వజ్ఞానము' స్థాయిభావము. (చూ. కా. లం. సం. III-298, 304 పేజీలు).

శాంతరస స్వరూపమును గూర్చి సాహిత్యదర్పణమునందు నిరూపింపబడినది (చూ. సా. ద. III-184 పేజి. 245-248 శ్లో.) శాంతమునకు

శమము స్థాయిభావము నాయకుడు ఉత్తముడు. వర్ణము కుందేందు సుందరము. నారాయణుడధిదేవత. ఈ జగత్తు అనిత్యమైనదని తెలిసికొనుట చేత వస్తువులన్నియు నిస్సారములను జ్ఞానముకానీ, పరమాత్మస్వరూపము కానీ ఆలంబన విభావము. పుణ్యాశ్రమములు, హరిక్షేత్రములు, తీర్థములు, రమ్యవనములు మొదలైనవియు మహాపురుష సంగము మొదలైనవియు ఉద్దీపన విభావములు. రోమాంచము, సంతోషము, భూతదయ మొదలైనవి అను భావములు. నిర్వేదము, హర్షము, స్మరణము, మతి, భూతదయ మొదలైనవి వ్యభిచారులు.

"నయత్ర దుఃఖం న సుఖం న చింతా న ద్వేషరాగౌ నచకాచిదిచ్ఛా। రసః సశాంతః కథితో మునీంద్రైః సర్వేషు భావేషు సమప్రమాణః" ఇత్యేవం రూపస్య శాంతస్య మోక్షావస్థాయామేవ ఆత్మస్వరూప ఆపత్తిలక్షణాయాం ప్రాదుర్భావాత్ తత్ర సంచార్యాదీనామభావాత్ కథంరసత్వమిత్యుచ్యతే। యుక్తవియుక్తదశాయామవస్థితోయః శమఃసఏవయతః।రసతామేతి తదస్మిన్ సంచార్యాదేః స్థితిశ్చ న విరుద్ధా "(సా.ద. III– 185పే). సుఖదుఃఖములు చింతాద్వేష రాగములు, ఇచ్ఛ మొదలైన వేవియు లేని భావములన్నింటి యందును శాంతమున్నదని భరతాదులయభిప్రాయము. ఇట్టి శాంతము ఆత్మస్వరూపప్రాప్తి లక్షణమైన మోక్షావస్థయందే కలుగును. ఆ దశయందు సంచార్యాదులుండవు. మరి రసమెట్లు వ్యక్తమగును! అను ప్రశ్నకు సమాధానము– ఆత్మ సాక్షాత్కారదశయందును, తదభావదశయందును సాధారణమైన శమమే రసత్వమును బొందును. అందు సంచార్యాదుల స్థితి విరుద్ధము కాదు. ఉదాహరణమునకు చూ. శమము.

**శుద్ధలక్షణ** : పూర్తి వివరములకు ముందు చూ. లక్షణ, గౌణలక్షణ.

ముఖ్యార్థ లక్ష్యార్థములకు గల సంబంధము సాదృశ్యేతర మైనపుడు శుద్ధలక్షణ.

శుద్ధలక్షణ 8 విధములు. లక్షణ మొదట రెండు విధములు-రూఢిమూల, ప్రయోజనమూల. ఈ రెండును మరల ఉపాదానలక్షణ, లక్షణ లక్షణ అని రెండు విధములు. ఈ నాల్గును మరల ఆరోప, అధ్యవసాన అని రెండు విధములు. మొత్తమెనిమిది విధములు. ఇవి గౌణ అయినపుడు 8 విధములు. శుద్ధ అయినపుడు 8 విధములు.

కొన్ని ఉదాహరణములు :—

రూఢిమూల - ఉపాదానలక్షణ సారోప శుద్ధ :— 'శ్వేతము పరుగిడు చున్నది' అనగా శ్వేతాశ్వము పరుగిడుచున్నది అని సాదృశ్యేతర సంబంధము గల లక్ష్యార్థము. (ఇది రూఢి).

ప్రయోజనమూల — ఉపాదానలక్షణ సారోపశుద్ధ :— కుంతములు ప్రవేశించుచున్నవి అనగా కుంతధారులు ప్రవేశించుచున్నారు అని సాదృశ్యేతర సంబంధముగల లక్ష్యార్థము (ఇది ప్రయోజనము).

**శోకము** :— వివరములకు ముందు చూ. స్థాయిభావము. దుఃఖమని సామాన్యార్థము. అలంకార శాస్త్రములో కరుణ రసమునకిది స్థాయిభావము.

శోకమునకు నిర్వచనములు :— (1) "ఇష్టజనస్య వినాశాత్ శాపాత్ క్లేశాచ్చ బంధనాద్ వ్యసనాత్ ఏతైరర్థవిశేషైః కరుణాఖ్యోరసస్సముద్భవతి" అన్నది నాట్యశాస్త్రము (చూ. కా. అం సం. 323 పేజి). ఇష్టజనులు మరణించుటవలన గాని, శాపము పొందుట వలన గాని, క్లేశమువలన గాని, బంధనము వలన గాని, వ్యసనమువలన గాని కరుణరసము (శోకము) పుట్టుచుండును. (2) "ఇష్టజన విరహాదినా ఆత్మని దుఃఖాతిభూమి శ్శోకః" అని ప్రతాపరుద్రీయ లక్షణము (రసప్రకరణము :- ఆం. ప్ర. రు. 252 పేజి). ఇష్టజనవిరహము, అనిష్టప్రాప్తి, ద్రవ్యనాశము, గృహదహనము మొదలయిన వాని వలన మనస్సులో కలుగు దుఃఖాతిశయమే శోకము. (3) "ఇష్టనాశాదిభి శ్చేతోవైక్లబ్యం శోకశబ్దభాక్" అని సాహిత్యదర్పణము (తృతీయపరిచ్ఛేదము). ఇష్టనాశాదుల వలన మనస్సునకు కలుగు విక్లబత్వమే శోకము. (4) "పుత్రాది వియోగమరణాది జన్మా వైక్లబ్యాఖ్యశ్చిత్తవృత్తి విశేష శ్శోకః" అని రసగంగాధరము.(ఆం.ర. గం. 143 పేజి). కుమారుని వియోగము వలన గాని, మరణమువలన గాని, కలిగిన వైక్లబ్యమనెడి చిత్తవృత్తి విశేషమే శోకము. (5) "హితజన విరహవ్యధచే నతిశయమై జనుల మానసాంభోజమునన్ పతిదినము పొడము దుఃఖంబతిభూమి వహింప శోకమగు" అని నరసభూపాలీయము (III-13 పద్యము).

శోకమునకు నరసభూపాలీయము నందలి యుదాహరణము — నరసభూపాలుడు తన శత్రువులను చంపెను. ఆ శత్రువుల కాంతలు ఎట్లేడ్చినారో తెల్పుట సందర్భము : మా భర్తలు నరసభూపాలుని శౌర్యాగ్నిలో నశించిరి. బ్రహ్మ మమ్ము వితంతువులను చేసెను. కాని అంతటితో విధికి పగ తీరినట్లు కనిపించదు. మమ్ము కూడా దావాగ్ని పాలు చేసెను — అని శత్రుకాంతలు రోదించుచు కన్నీరు కార్చగా, ఆ బాష్పవర్షములో ఆ దావాగ్ని కూడ ఆరిపోవుచున్నదట! ఈ విధముగా వారి దుఃఖాలాపములు శోకమును వ్యక్తపరచుచున్నవి. చం "పతుల నృసింహ శౌర్యశిఖి పాలుగఁ జేసిన యట్టి పాపపున్ శతధృతి కింతటం జలము జాఱదు; మమ్మును దావపావక వ్రతతుల పాలుజేసె; నని పల్కులు రోదనమందు విద్విషత్ సతులకు బాష్పపూరములె చాలు వనానలమున్ హరింపగన్" — కా. అం. సం. III-14.

**శోభ** :— వివరములకు ముందు చూ. అలంకారములు ఇది అయత్నజమైన అనుభావము (చూ. అనుభావము., చూ. అయత్నజములు).

'శోభ'కు నిర్వచనములు :— (1) "రూపోపభోగతారుణ్యైః శోభాఽంగానాం విభూషణం" అని దశరూపకము (ధ ద. రూ. రెండవ ప్రకాశము 28 పేజి 54 సం). రూపము, ఉపభోగము, యౌవనము — వీనిచే అవయవములకు కలిగిన అలంకారమే శోభ. దశరూపకకర్త నాయికకు యౌవనమందు

సత్త్వజములైన అలంకారము లిరువది యందునని తెలిపి అందు అయత్నజా లంకారములలో శోభ యొకటి యని పేర్కొనెను. (2) "రూపయౌవన లాలిత్య భోగాద్యై రంగభూషణమ్ శోభా ప్రోక్తా" అని సాహిత్యదర్పణము (కా.లం సం. తృతీయ 389 పేజి లేదా సా ద. 123 పేజి. 95 సం). సౌందర్యము, యౌవనము, లాలిత్యము, భోగము మొదలైనవానిచే అంగములకు గలుగు అలంకారమే శోభ. సాహిత్య దర్పణకర్త. నాయికకు యౌవనమందు సత్త్వజములైన అలంకారములు ఇరువదియెనిమిది యుండుననియు, వానిలో శోభ అయత్నజాలంకారమనియు తెలిపెను.

నరసభూపాలీయకర్త దీనిని పేర్కొనలేదు. శోభకు సాహిత్య దర్పణమునుండి ఉదాహరణము :— 'ఆమెకు బాల్యము గడచి యౌవనము వచ్చెను. ఆ వయస్సు ఆమె శరీరమునకు పెట్టని అలంకారమయ్యెను. మద్యము లేకుండగనే మదము కలిగించెను. మన్మథునికి పుష్పేతరమైన అస్త్రమయ్యెను'. శ్లో అసంభృతం మండన మంగయష్టే రనాసమఖ్యం కరణం మదస్య కామస్య పుష్పవ్యతిరిక్త మస్త్రం బాల్యాత్పరం సాధ వయః ప్రపేదే."—సా. ద. III-123 పేజి లేదా ఆం. సా. ద.-55 పేజి.

*సంకల్పము :* శృంగారావస్థలందొకటి (చూ శృంగారావస్థలు).

నిర్వచనములు :— (1) "సంకల్పో నాథవిషయో మనోరథ ఉదాహృత:" అని ప్రతాపరుద్రీయము (ప్ర. రు. రసప్రక. 229పే. 87 సం). ప్రియుని విషయమైన మనోరథమే సంకల్పము. (2) సాహిత్యదర్పణకారుడు సంకల్పమును 'చింత' యనెను. "చింతా ప్రాప్త్యుపాయాది చింతనమ్" అని సాహిత్యదర్పణము. ప్రియుని సంగమోపాయాదులను గూర్చి చింతించుటయే చింత.(3)'చింతించుట' యని నరసభూపాలీయము. ఉదా నకు చూ. చింత.

*సంక్రామయిత :* కవియొక్క అవస్థలు పది యనియు, అందు సహజ ప్రతిభునకును, ఆహార్యప్రతిభునకును ఏడవస్థలును, ఔపదేశికునకు మూడవస్థలును నుండుననియు రాజశేఖరుడు కావ్యమీమాంస యందు పేర్కొనెను. ఔపదేశికుని మూడవస్థలందును సంకామయిత యగుట మూడవయవస్థ. (చూ. కారయి త్రి). (చూ. కావ్యవిద్యాస్నాతకుడు, హృదయకవి, అన్యాపదేశి, సేవిత, ఘటమానుడు, మహాకవి, కవిరాజు, ఆవేశికుడు, అవిచ్ఛేది).

"యః కన్యా కుమారాదిషు సిద్ధమంత్రః సరస్వతీం సంక్రామయతి స సంక్రామయితా" అని రాజశేఖరుడు. (కా.మీ.V-51పే.). మంత్రసిద్ధుడై ఎవడు కన్యాకుమారాదులందు (బాలబాలికలు) సరస్వతిని సంక్రమింప జేయునో వాడు సంక్రామయిత.

*సంకేతము* "సంకేతశ్శబ్దార్థయోస్సంబంధావధారణమ్. అనగా శబ్దమునకును దాని యర్థమునకును గల పరస్పర సంబంధమునునిర్ణయించుట. ఇదియే సంకేతము చూ. అభిధ.

సంకేతము నాలుగు విధములు (1) జాతిసంకేతము. (2) గుణ సంకే తము. (3) క్రియాసంకేతము (4) ద్రవ్యసంకేతము. ఈ సంకేతముల స్వభావమునుబట్టి శబ్దములుకూడ నాలుగు విధములు (1) జాతివాచకములు (2) గుణవాచకములు (3) క్రియావాచకములు (4) ద్రవ్యవాచకములు.

ఉదా:- (1) గోత్వము జాతిసంకేతము. గోవు జాతివాచకము. అనేక వ్యక్తులయందు అనుగతముగా నుండు ధర్మమే జాతి. గోవులన్నింటి యందును సామాన్యధర్మము గోత్వమే. కనుక గోత్వము జాతి సంకేతము. (1) శుక్ల, నీల, పీత మొదలగు పదములు గుణసంకేతముగలవి. కనుక గుణ వాచకములు. (3) వండుచున్నది - ఇది క్రియాసంకేతముగలది. వంట అనగానేమి? పొయ్యిమీదికెక్కించి ఉడికిన తరువాత కిందికి దించుట. ఇట్టి సంకేతములను బోధించునవి క్రియావాచకములు. (4) రాముడు - ఇది ద్రవ్యసంకేతముగల శబ్దము. ద్రవ్యమనగా నామము. కనుక ఇది ద్రవ్య వాచకము. దీనినే నామవాచకమనుచున్నాము.

ఇట్లు సంకేతమువలన బోధింపబడిన అర్థమే సంకేతితార్థము. దీనినే వాచ్యమనియు, అభిధేయమనియునందురు. ఇట్లు సంకేతితార్థమును బోధించు శబ్దశక్తినే అభిధాశక్తి అనుచున్నారు.

భాషలో ఒక శబ్దమునకొకే అర్థముకాక అనేకార్థములు కూడా కన బడుచుండును. అవి అన్నియు సంకేతితార్థములే. వాక్యములో ఏది వాక్యార్థ మునకుపకరించు సంకేతితార్థమో తెలుసుకొనుటకు శబ్దార్థ నిర్ణయ సాధన ములు కొన్ని ఉన్నవి. అవియే సంయోగాదులు. వానిని సంయోగాదులు అను శీర్షిక క్రింద చూడుడు. ఈ సంయోగాదులు అభిధాశక్తిని నియం త్రించి అర్థనిర్ణయమునకు తోడ్పడును.

**సంకేతితార్థము :** శబ్దమునకు అర్థమునకు గల పరస్పర సంబంధమును నిర్ణ యించుటకే సంకేతమనిపేరు. ఇట్టి సంకేతమువలన నిర్ణయింపబడిన అర్థమే సంకేతితార్థము. దీనినే అభిధేయార్థము, వాచ్యార్థము, శక్యార్థము, ముఖ్యా ర్థము అనియు అందురు. దీనిని బోధించు శబ్దశక్తిపేరే అభిధాశక్తి. (చూ. అభిధ, సంకేతము.)

**సంఘటన :** వామనుడు తెల్పిన రీతినే ఆనందవర్ధనుడు 'సంఘటన' అని వ్యవహ రించెను. ఈ సంఘటన వక్త, వాచ్యము, ప్రబంధము అను మూడింటి ఔచిత్యమును బట్టి అసమాస, అల్పసమాస, దీర్ఘసమాస అని మూడు విధా లుగా ఉండును.

గుణములు, సంఘటన ఒకటే అనిగాని, అవి రెండును వేర్వేరు అని గాని వ్యాఖ్యానింపవీలున్నది. సంఘటన గుణములను ఆశ్రయించి యుండును. అట్లే గుణములు సంఘటనను ఆశ్రయించియుండును. (వివరములకు చూ. కా. లం. సం, II-183 పేజి).

*సంచారిభావము :* చూ. వ్యభిచారి భావము.

*సందానితకము :* పద్యకావ్యభేదము.

"సందానితకం త్రిభిరిష్యతే" అని సాహిత్యదర్పణము. (సా. ద. VI పరి. 352 పే. 314 శ్లో.). మూడు పద్యములతో కూడిన శ్రవ్యకావ్యము సందానితకము.

"ద్వాభ్యాం క్రియాసమాప్తౌ సందానితకమ్" అని ధ్వన్యాలోక లోచనము (ధ్వ. లో. లోచనము III ఉద్ద్యో. 324 పే.). రెండు పద్యములతో క్రియాసమాప్తి యయినచో సందానితకము.

"క్రియాసమాప్తికై పరస్పరాపేక్షగల మూడు పద్యముల సమూహము" సందానితకము (కా. అం. సం. II-261పే.).

*సందిగ్ధము :* చూ. మధ్యమకావ్యము, గుణీభూతవ్యంగ్యము.

గుణీభూతవ్యంగ్యముయొక్క అష్టభేదములందొకటి. మిగిలినవాని వివరములకు చూ. అగూఢము, అపరాంగము, వాచ్యాంగము, అస్ఫుటము, కాక్వాక్షిప్తము, తుల్యప్రాధాన్యము, అరుచిరము.

వాచ్యార్థము, వ్యంగ్యార్థము— ఈ రెండింటిలో ఏది ప్రధానము? అను సందేహమును కలిగించు కావ్యమే సందిగ్ధము.

ఉదాహరణము :- "చంద్రోదయారంభమందు అంబురాశివలె హరుడు కించిత్పరిలుప్తధైర్యుడై బింబఫలాధరోష్ఠము గల ఉమాముఖము నందు విలోచనములు ప్రసరింపజేసెను."

హరస్తు కించిత్పరివృత్తిధైర్యశ్చంద్రోదయారంభ ఇవాంబురాశిః
ఉమాముఖే బింబఫలాధరోష్ఠే వ్యాపారయామాస విలోచనాని
— కుమారసంభవము

ఇందు శివుడు పార్వతిని చూచెను అను వాచ్యార్థము ప్రధానమా? అతడామె బింబఫలాధరోష్ఠమును ముద్దాడ నభిలషించెను అను వ్యంగ్యార్థము, ప్రధానమా? ఈ రెండును చమత్కారముగానే ఉన్నవి. ఏది ప్రధానమో తేలలేదు. కనుక సందిగ్ధము.

*సంబంధనిబంధనాలక్షణ :* పూర్తి వివరములకు ముందు చూ. లక్షణ.

లక్షణాశక్తిచేత బోధింపబడు అర్థాంతరము ముఖ్యార్థసంబంధము మాత్రమే కలదైనచో సంబంధనిబంధన. ఉదా:- గంగలో గొల్లపల్లె- ఈ వాక్యమునందు గంగలో అనుదానికి గంగాప్రవాహములో అని ముఖ్యార్థము. కాని గొల్లపల్లె ప్రవాహములో నుండుటెట్లు? ముఖ్యార్థబాధ అనగా ఇదియే. అప్పుడు లక్షణాశక్తిద్వారా లక్ష్యార్థము చెప్పుకొనవలెను. లక్ష్యార్థమనగా ముఖ్యార్థసంబంధమో, సామ్యమో గల మరొక అర్థము. ఇక్కడ గంగగట్టుమీది గొల్లపల్లె అని అర్థము చెప్పుకొన్నచో సరిపోవును. ఇది సంబంధార్థమే? ఈ సంబంధము ప్రయోజనమును బట్టియు రూఢిని బట్టియు రెండు విధములుగా నుండును.

ఇక్కడ గొల్లపల్లె చల్లనిది; పవిత్రమైనది అని చెప్పుట ఈ అర్థాంతర ప్రయోజనము. ఇక రూఢికుదాహరణమిది- వాడు పనిలో కుశలుడు- ఈ వాక్యమున కుశల శబ్దమునకు అర్థము పొసగుటలేదు. కుశలుడనగా కుశలను గ్రహించువాడు అని వ్యుత్పత్త్యర్థము. ఇదే ముఖ్యార్థము. దీనికి బాధకలిగినది. వాడు పనిలో దర్భలను గ్రహించువాడు అన్నచో అర్థము కుదరలేదుగదా! అప్పుడు కుశలుడు అను పదమునకు లోకములో రూఢి అగు అర్థము నేర్పరి అని ఉన్నది కనుక దానిని గ్రహింపవలెను. ఇది ముఖ్యార్థసంబంధముగల లక్ష్యార్థము.

*సంబంధము* : ముందు వివరములకు చూ. లక్షణ, సంబంధనిబంధనాలక్షణ, సామ్యనిబంధనాలక్షణ.

ముఖ్యార్థమునకు సంబంధముగల అర్థాంతరమును చెప్పుట లక్షణాశక్తివలన జరుగుపని. ఈ సంబంధమనేమి?

నైయాయికులు ఐదువిధములైన సంబంధములను పేర్కొనినారు. వాచ్యార్థలక్ష్యార్థ సంబంధము వీనిపై నాధారపడియుండును. (1) తాత్స్థ్య సంబంధము లేక ఆధారాధేయసంబంధము. (2) తాద్ధర్మ్య సంబంధము లేక సాదృశ్య సంబంధము (3) తత్సామీప్య సంబంధము లేక సామీప్యసంబంధము (4) తత్సాహచర్య సంబంధము. (5) తాదర్థ్య సంబంధము లేక ఉపకార్యోపకారక సంబంధము. పరమ లఘుమంజూషలోని శ్లోకము :- తాత్స్థ్యాత్ తథైవ తాద్ధర్మ్యాత్ తత్సామీప్యాత్తథైవ చ తత్సాహచర్యాత్తాదర్థ్యాత్ జ్ఞేయావై లక్షణా బుధైః. వీనికి వరుసగా ఉదాహరణములు :- (1) ఉయ్యాల నవ్వుచున్నది (2) బాలుడు సింహము (3) గంగలో గొల్లపల్లె. (4) వేత్రములను ప్రవేశపెట్టుము. (5) స్థూణము లింద్రులు (ఇంద్రపూజనార్థములైన స్తంభవిశేషములు స్థూణములు).

ముఖ్యార్థసంబంధమైదువిధములుగా నుండును (కా. ప్ర. జమ్మలమడక వారు II-ఉల్లాస 65 పే.). అవి (1) అభిధేయ సంబంధము (2) సాదృశ్య సంబంధము (3)సమవాయ సంబంధము (4)వైపరీత్యసంబంధము (5)క్రియాయోగసంబంధము. వీనికి వరుసగా ఉదాహరణములు:-ద్విరేఫమను శబ్దమునకు అభిధేయము భ్రమరము. అభిధేయసంబంధమువలన ద్విరేఫమునకు తుమ్మెద లక్ష్యార్థమగును. (చూ. లక్షితలక్షణ). (2) మాణవకుడు సింహము - సాదృశ్యసంబంధమువలన మాణవకుడు సింహమువంటివాడు అని లక్ష్యార్థము. (3) గంగలో గొల్లపల్లె అనుచోట సామీప్యసంబంధమువలన గంగాతీరమున గొల్లపల్లి అని లక్ష్యార్థము. (4) 'నీవుపకారము చేసితివి' అని శత్రువును గురించి పల్కినప్పుడు వైపరీత్యసంబంధమువలన అపకారము లక్ష్యార్థము. (4) శత్రుఘ్నుడు (రామునితమ్ముడు) కానివానినికూడా శత్రుహనన క్రియాయోగమువలన శత్రుఘ్నుడనుట క్రియాయోగ సంబంధము.

సాదృశ్యేతర సంబంధము లనేకములున్నవి (చూ. కా. ప్ర. II ఉల్లాసము). (1) తాదర్థ్యసంబంధము (2) స్వస్వామి భావసంబంధము (3) అవయవావయవిభావ సంబంధము (4) తాత్కర్మ్య సంబంధము. మొదలగునవి. వీనికి వరుసగా ఉదాహరణములు (1) స్థూణములింద్రులు (2) రాజసేవకుడగు పురుషుడు పోవుచుండగా "అడుగో రాజు పోవుచున్నాడు" (3) ముంజేతినిమాత్రమేచూపి "ఇదిగోచేయి" (4) విప్రుడైన వడ్రంగి ఇతడు. (వడ్రంగికాడుకాని వడ్రంగపుపనిచేయు బ్రాహ్మణుడు).

*సంబద్ధసంబంధవ్యంగ్యము :* వివరములకుముందు చూ. వ్యంజన, వ్యంగ్యము.

వ్యంగ్యార్థమునకు మూడువిధములైన సంబంధములు గలవు. అందిది మూడవది. మిగిలినవాని వివరములకు చూ. నియత సంబంధవ్యంగ్యము; అనియతసంబంధవ్యంగ్యము.

వ్యంగార్థమే అర్థాంతరమునకు వ్యంజకమైనపుడు సంబద్ధ సంబంధ వ్యంగ్యమగును. ఇది ప్రకరణాదులనుబట్టి వ్యక్తమగును.

ఉదాహరణము :- ఓబింబోష్ఠి! సఖి! నీ ముంజేతిమీద కూర్చుండ బెట్టుకొని ఈ చిలుకకు పండ్లు తినిపించుము. అంతేకాని దానిని ముద్దాడవద్దు.

ఫలానిదిశ భవ్యాని నివేశ్య మణిబంధనే
బింబోష్ఠి చుంబనైరేవమాశి లాలయ మా శుకం

—కావ్యాలంకారసంగ్రహము, 169 పేజి.

ఇక్కడ వ్యంగ్యార్థమిది :- నీపెదవి దొండపండువంటిది కనుక ఈ చిలుక ఫలభ్రాంతిచేత కొరుకును అని. ఈ వ్యంగ్యార్థము- నీభర్త నిన్నప్పుడు అనుమానించును అను అర్థాంతరమునకు వ్యంజకముగా పరిణమించును. ఇక్కడ రెండు వ్యంగ్యార్థములు. ఈ రెండింటికిని గల సంబంధము సంబద్ధమయినది.

*సంభోగశృంగారము :* 'అయోగో విప్రయోగశ్చ సంభోగశ్చేతి సత్రిధా' (ధ. ద. రూ. నాలుగవప్రకా. 70 పేజి 58 సం.) అని దశరూపకము. అయోగము, విప్రయోగము, సంభోగము అని శృంగారము మూడువిధములు. "అనుకూలౌ నిషేవేతే యత్రాన్యోన్యం విలాసినౌ దర్శనస్పర్శనాదీని సంభోగో ముదాన్వితః" (ధ. ద. రూ IV ప్రకా. 74 పే 76 సం.). నాయికానాయకులు అన్యోన్యానుకూలురై దర్శనస్పర్శనాదులననుభవించుట సంభోగశృంగారము.

"సద్వివిధః సంభోగో విప్రలంభశ్చేతి" సంయుక్తయోస్తు సంభోగో విప్రలంభో వియుక్తయో" రితి శృంగారతిలకే. సంభోగస్య పరస్పరావలోకన సంభాషణాలింగన చుంబనాద్యనేక వ్యాపారమయత్వేనానంత్యాదేకవిధత్వేన గణనాకృతా— అని ప్రతాపరుద్రీయము (ప్ర. రు. రసప్రక. 233పే.). శృంగారము సంభోగము, విప్రలంభము అని రెండు విధములు. సంయుక్తుల శృంగారము సంభోగము. వియుక్తుల శృంగారము విప్రలంభము— అని శృంగారతిలకమందున్నది. పరస్పరావలోకనము, సంభాషణము, ఆలింగ

నము, చుంబనము, మొదలైన అనేకవ్యాపారములు గలదగుటచే శృంగారము ఒకటిగానే లెక్కింపబడినది.

"దర్శనస్పర్శనాదీని నిషేవేతే విలాసినౌ యత్రానురక్తౌ వన్యోన్యం సంభోగోఽయముదాహృతః అది శబ్దాదన్యోన్యాధరపాన చుంబనాదయః ...సంఖ్యాతుమశక్యతయా చుంబనపరిరంభణాదిబహు భేదాత్ అయమేక ఏవధీరైః కథితః సంయోగశృంగారః తత్రస్యాదృతుషట్కం చంద్రాదిత్యౌ తథో దయాస్తమయః జలకేళివనవిహార ప్రభాత మధుపానయామినీ ప్రభృతిః । అనులేపన భూషాద్యా వాచ్యం శుచిమేధ్య మన్యచ్చ । (సా. ద. III-173పేజి-210-23 1శ్లో), అని సాహిత్యదర్పణము. పరస్పరానురాగముగల యువతీయువకులు దర్శన స్పర్శనాదుల ననుభవించుటయే సంభోగ శృంగారము. ఇందు అధరపానము, చుంబనము మొదలయినవికూడా ఉండును. చుంబనము, పరిరంభణము మొదలైన సంభోగశృంగార భేదములనంత సంఖ్యగలవి. అందువలన సంయోగ శృంగారమొకేవిధ మందురు. ఇందు ఋతుషట్కము, చంద్రాదిత్యులు, ఉదయాస్తమయములు, జలకేళి, వనవిహారము, ప్రభాతము, మధుపానము, యామిని మొదలైనవి వర్ణింపబడును. అనులేపనము, భూషాదులు మొదలైనవి, శుచిమేధ్యము తదితరములు వర్ణనీయములు.

"కథితశ్చతుర్విధోఽసావనంతర్యాత్తు పూర్వరాగాదేః యదుక్తమ్ నవినా విప్రలంభేన సంభోగః పుష్టిమశ్నుతే । కషాయితేహి వస్త్రాదౌ భూయాన్‌రాగో వివర్ధతే" (సా. ద. III-173 పేజి 213 శ్లో. వివరణ) అని సాహిత్యదర్పణము. ఈ సంభోగ శృంగారము పూర్వరాగ, మాన, ప్రవాస, కరుణ విప్రలంభములకు తరువాత వచ్చుటవలన నాలుగువిధములగును. అవి (1) పూర్వరాగానంతర సంభోగము (2) మానానంతర సంభోగము (3) ప్రవాసానంతర సంభోగము (4) కరుణ విప్రలంభానంతర సంభోగము. వస్త్రాదులు కషాయితములు కాకుండా రాగయుక్తములు కానట్లు విప్రలంభము లేనిచో సంభోగశృంగారము పుష్టినొందదు.

ఉదాహరణములు:- చుంబనరూప సంభోగశృంగారమునకు సాహిత్యదర్పణకర్త యిచ్చిన శ్లో శూన్యం వాసగృహం విలోక్య శయనాదుత్థాయ కించిచ్ఛనైః నిద్రావ్యాజముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖమ్ విస్రబ్ధం పరిచుంబ్య జాతపులకామాలోక్యగండస్థలీం లజ్జానమ్రముఖీ ప్రియేణ హసతా బాలాచిరం చుంబితా (అం. సా. ద. I-7 పేజి. 8 సం. మరియు III-89 పేజి 225 సం.). దీనికి వేదంవారి తెలుగు చూడుడు—పడుకటింట ఎవ్వరును లేమిని గనిపట్టి మిక్కిలి మెల్లగా పడుకనుండి లేచినదై నిద్రామిషను బొందియున్న పతియొక్క ముఖమును చాలసేపు పరికించి నిశ్శంకముగా అతని చెక్కిటిని నిండుగా ముద్దుగొని అందు పులకలు మొలవంగని

మోము వాంచిన దైన బాలను ప్రియుడు నవ్వుచు చిరకాలము ముద్దు గొనెను.” (ఆం సా. ద. I-7&8 పేజి).

(2) పూర్వరాగానంతర సంభోగ శృంగారమునకు కుమారసంభవ కావ్యమునందలి పార్వతీపరమేశ్వర సంభోగశృంగారముదాహరణము.

*సంభోగాభాసము :* చూ. రసాభాసము.

*సంయోగాదులు :* అనేకార్థములు ఒకే శబ్దమునకున్నప్పుడు ఒక వాక్యములో ఆ సందర్భమునకు తగిన అర్థమునే నిర్ణయించుటకు కొన్ని సాధనములున్నవి. అవియే సంయోగాదులు. అభిధాశక్తి ప్రాకరణికార్థమును నిర్ణయించుటలో ఈ సంయోగాదులు పనిచేయును. (చూ. సంకేతము, అభిధ.)

(1) సంయోగము :- హరి సశంఖ చక్రుడు- హరి శబ్దమునకు అనేకార్థములున్నను ఇక్కడ శంఖచక్రసంయోగము వలన హరి అనగా విష్ణువనియే అభిధేయార్థము.

(2) విప్రయోగము :- అశంఖచక్రుడగు హరి - శంఖచక్రముల వియోగమువలన ఇక్కడకూడా హరి అనగా విష్ణువే.

(3) సాహచర్యము :- భీమార్జునులు - ఇక్కడ అర్జునుడనగా కార్తవీర్యుడు కాడని, భీమ సాహచర్యమున పార్థుడగు అర్జునుడే అని అభిధ నియంత్రితమగును.

(4) విరోధము :- కర్ణార్జునులు - ఇక్కడ కర్ణుడనగా సూతపుత్రుడే అని కర్ణార్జున విరోధమువలన అర్థము బోధపడును.

(5) అర్థము లేదా ప్రయోజనము:- స్థాణువునకు వందనను - స్థాణువనగా మొద్దు, శివుడు అని రెండర్థాలు : ఇక్కడ ముక్తినిచ్చుట అను ప్రయోజనమువలన స్థాణువనగా శివుడను నర్థమే బోధ్యమగును.

(6) ప్రకరణము :- దేవరకు అన్నియు తెలిసినవే'- వక్త, శ్రోత (దూత, రాజు) ఈ ఇద్దరినిబట్టి ఇక్కడ దేవరకు అనగా మీకు (రాజునకు) అను అర్థము వాచ్యమగును. ప్రకరణమనగా ప్రస్తుత సందర్భము.

(7) లింగము (చిహ్నము) :- లింగమనగా అసాధారణ చిహ్నము. ఇతరులందుండని ధర్మమేదో అది లింగము. మకరధ్వజుడు కోపించెను- మకరధ్వజ శబ్దమునకు సముద్రుడు, మన్మధుడు అని నానార్థాలు. కోపము మన్మథుని అసామాన్యధర్మము. అది అతని లింగమన్నమాట. కనుక కోపరూపచిహ్నము మకరధ్వజుడనగా మన్మథుడే అని చెప్పుటకు అభిధను నియమించెను.

(8) అన్యశబ్దసన్నిధి :- పురారి అగు దేవుని పూజింతును- పురారి అను మరొక శబ్దమునకు సన్నిహితముగానున్న దేవుడను శబ్దమునకు శివుడను అర్థమే ముఖ్యార్థము.

(9) సామర్థ్యము :- కోకిల మధువుచే మత్తమయినది. మధువనగా వసంతుడనియు, మద్యమనియు రెండర్థములున్నవి. ఇక్కడ కోకిలకు మద

మును గలిగించు సామర్థ్యము వసంతునికే ఉన్నది కనుక మధుశబ్దమునకు వసంతమని అర్థమును బోధించుటకు సామర్థ్యమే అభిధాశక్తిని నియమించును.

(10) ఔచిత్యము :- 'ప్రియురాలి ముఖము మిమ్ము రక్షించుగాక'- ముఖశబ్దమునకు వదనము, సమ్ముఖము మొదలయిన అర్థములున్నవి. ఇక్కడ ఔచిత్యమునుబట్టి సమ్ముఖము అను అర్థమే ఉపయోగించును. ఔచిత్యమనగా యోగ్యత. ఉత్కంఠగల ప్రియునకు ప్రియురాలిసమ్ముఖమే ప్రత్యక్షభావము. కోరికలు నెరవేర్చును. కనుక ముఖశబ్దమునకు సామ్ముఖ్యము అను అర్థము ఔచిత్యము కలిగించుచున్నది.

(11) దేశము :- చంద్రుడాకాశమున ప్రకాశించుచున్నాడు- ఆకాశమిక్కడ దేశవాచకము. కనుక చంద్రశబ్దమునకు చందమామ అను అర్థమే బోధ్యమగును.

(12) కాలము :- రాత్రి చిత్రభానువు ప్రకాశించు చున్నాడు- చిత్రభానువనగా సూర్యుడు, అగ్ని అను అర్థములున్నవి. ఇక్కడ రాత్రి అగుటచేత సూర్యుడు ప్రకాశింపవీలులేదు. కాలము చిత్రభాను శబ్దమునకు అగ్ని అను అర్థమును బోధించుటకు అభిధను నియమించుచున్నది.

(13) వ్యక్తి :- పుంనపుంసకాది లింగమునకే వ్యక్తి అని పరిభాష. మిత్రశబ్దము పులింగమయినప్పుడు సూర్యుడను అర్థమును నపుంసక లింగమయినపుడు స్నేహితుడను అర్థమును తెలుపును. 'మిత్రము వచ్చుచుండెను'- ఇక్కడ ఈ శబ్దము నపుంసకలింగముగా వాడబడినది. కనుక సఖుడనియే అర్థము. వ్యక్తియే ఈ అర్థమును బోధించుటకు అభిధను నియమించినది.

(14) స్వరము :- ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము- వీనికి స్వరమనిపేరు. ఇది వేదమునందే అర్థవిశేషమును బోధించుటకు అభిధను నియమించును. కావ్యమున దీనికి ప్రయోజనములేదు. (చూ. కా. లం. సం. II-132-134 పేజీలు).

*సంలక్ష్యక్రమవ్యంగ్యము* : అభిధామూలధ్వని (వివక్షితాన్యపరవాచ్యము) యొక్క రెండు భేదములయందు ఈ సంలక్ష్యక్రమవ్యంగ్యము (అనురణన వ్యంగ్యము) ఒకటి. రెండవదాని వివరములకు చూ. అసంలక్ష్యక్రమ వ్యంగ్యము.

వాచ్యార్థ వ్యంగ్యార్థముల క్రమము ఎక్కడ స్ఫుటముగా గోచరించునో దానిని సంలక్ష్యక్రమవ్యంగ్యము అందురు. (చూ. అనురణన వ్యంగ్యము).

ఉదాహరణము :- "ఇతడు నరసింహుడు"— ఇందు 'నరసింహ' పదమునకు అభిధాశక్తినిబట్టి విష్ణువు అను అర్థాంతరము వ్యక్తమగును. మొదట నరసభూపాలుడను అర్థము వాచ్యము. తరువాత విష్ణువను అర్థము

వ్యంగ్యము. ఈ రెండర్థముల క్రమమును స్ఫుటముగా గోచరించుచున్నది. అందుచే సంలక్ష్యక్రమము.

ఇది మూడు విధములు :- (1) శబ్దశక్తిమూలము (2) అర్థశక్తిమూలము (3) ఉభయశక్తిమూలము. ఇందు శబ్దశక్తిమూలధ్వని మరల రెండువిధములు. (1) శబ్దశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని (2) శబ్దశక్తిమూల అలంకారధ్వని. ఇవి మరల పదవాక్యభేదములచే రెండేసి యగును. అప్పుడు (1)పదగత శబ్దశక్తిమూల వస్తుకృతవస్తుధ్వని (2) వాక్యగతశబ్దశక్తిమూల- వస్తుకృత వస్తుధ్వని. (3) పదగత శబ్దశక్తిమూల- అలంకారధ్వని (4) వాక్య గత శబ్దశక్తిమూల- అలంకారధ్వని అని నాలుగు విధములగును. ఉదాహరణ ములకు చూ. శబ్దశక్తిమూలధ్వని.

అర్థశక్తిమూలధ్వని (1) స్వతస్సిద్ధము (2) కవిప్రౌఢోక్తి సిద్ధము, (3) కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తి సిద్ధము అని మూడు విధములు. ఇవి మరల ఒక్కొక్కటి (1) వస్తుకృతవస్తుధ్వని (2) వస్తుకృతాలంకారధ్వని (3) అలంకారకృతవస్తుధ్వని (4) అలంకార కృతాలంకారధ్వని అని నాలుగు విధములు. ఈ పన్నెండును మరల (1) పదగత (2) వాక్యగత (3) ప్రబంధగత అను భేదములచే 36 విధాలు అగును. ఉదాహరణములకు చూ. అర్థశక్తిమూల ధ్వని.

ఇట్లు సంలక్ష్యక్రమవ్యంగ్యము 4+36+1 = 41 భేదములతో నుండును.

**సకలకథ :** 'సమస్తఫలాంతేతివృత్తవర్ణనా సకలకథా' అని ధ్వన్యాలోక లోచనము. (ధ. లో. లోచ. III ఉద్యో. 324 పే.). ఇతివృత్తమున చివరకు సమస్తఫలములు (చతుర్విధపురుషార్థములు) ప్రాప్తించినట్లు వర్ణించినచో ఆ కావ్యవిశేషము సకలకథ. దీనికుదాహరణముగా "సమరాదిత్యము"ను పేర్కొనినాడు హేమచంద్రుడు. (చూ. భామహకావ్యాలంకారభూమిక 31 పేజి).

**సద్ధళి :** ఉదాహరణకావ్య భేదములందొకటి. మిగిలినవానినిగురించి చూ. (1) పద్ధళి (2) విద్ధళి (3) ఉత్ఫుల్లకము.

సంబుద్ధిని వదలి మిగిలిన ఏడు విభక్తులతో మాత్రమే కూర్చిన ఉదాహరణము సద్ధళి. "సంబుద్ధి యెడలించి సప్తవిభక్తులు పలికిన భక్తి సద్ధళి" అని అప్పకవి.

**సమాధి :** రాజశేఖరుడు తన కావ్యమీమాంస (చతుర్థాధ్యాయము) లో కవికి 'సమాధి' ఆవశ్యకగుణమని శ్యామదేవుని మతముగా పేర్కొనెను.

"కావ్యకర్మణి కవేః సమాధిః పరం వ్యాప్రియతే ఇతి శ్యామదేవః। మనస ఏకాగ్రతా సమాధిః సమాహితం చిత్తమర్థాన్ పశ్యతి" అని కావ్య మీమాంస (కా. మీ. IV-28, 29 పేజీలు). కావ్యకర్మయందు కవికి సమాధి పరమావశ్యకమనియు మనస్సుయొక్క ఏకాగ్రతయే సమాధి యనియు,

సమాహితమైన చిత్తమే వివిధార్థములను దర్శింపగలదనియు భావము.

సారస్వత రహస్యమును దర్శించుటకీ సమాధి యత్యవసరమనికూడా శ్యామదేవమతము. ఈ సమాధిని అంతరప్రయత్నముగా మంగళుడు భావించెను.

*సర్గబంధము :* (1) "అగ్రామ్య శబ్దమర్థ్యం చ సాలంకారం సదాశ్రయం। మంత్రదూత ప్రయాణాజి నాయకాభ్యుదయైశ్చయత్ పంచభిః సంధిభి ర్యుక్తం నాతివ్యాఖ్యేయ మృద్ధిమత్। చతుర్వర్గాభిధానేఽపి భూయసార్థోప దేశకృత్। యుక్తం లోకస్వభావేన రసైశ్చ సకలైః పృథక్ నాయకం ప్రాగుపన్యస్య వంశవీర్యశ్రుతాదిభిః। న తస్యైవ వధం బ్రూయాదన్యోత్కర్షాభిధిత్సయా। యది కావ్య శరీరస్య నసవ్యాపిత ఘేష్యతే। నచాభ్యుదయ భాక్తస్య ముధాదౌ గ్రహణం స్తవే" (భామహవిరచిత కావ్యాలంకారః బీహార్ రాష్ట్రభాషాపరిషద్ I పరి.) అని భామహుడు. సర్గబంధమునందు గ్రామ్యశబ్దములుండరాదు. అర్థసౌష్ఠవముగలదై సాలంకారమై సత్పురుషాశ్రితమై యుండవలెను. మంత్రణము, దూతసంప్రేషణము, ప్రయాణము, యుద్ధము, నాయకాభ్యుదయము, వీనితోను, పంచసంధులతోను కూడి అనతివ్యాఖ్యేయమై బుద్ధిపూర్ణము కావలయును. చతుర్వర్గ నిరూపణమున్నప్పటికి ప్రధానముగా అర్థోపదేశముండవలెను. లోకస్వభావము, సకలరసములు వర్ణితములు కావలెను. వంశవీర్యశ్రుతాదులచే నాయకుని నుగ్గడింపవలెను. నాయకవధ వర్ణింపరాదు. కావ్యశరీరమునందు నాయకవ్యాపనము లేనిచో నాయకస్తవాదికము సార్థకముకాదు.

(2) "సర్గబంధో మహాకావ్యం తత్త్రైకో నాయకః సురః। సద్వంశః క్షత్రియో వాపి ధీరోదాత్త గుణాన్వితః ఏకవంశభవా భూపాః కులజా బహవోపివా। శృంగారవీర శాంతానామేకోఽంగీ రసఇష్యతే। అంగాని సర్వేఽపి రసాః సర్వే నాటకసంధయః। ఇతిహాసోద్భవం వృత్త మన్యద్వా సజ్జనాశ్రయమ్। చత్వారస్తస్య వర్గాః స్యుస్తేష్వేకం చ ఫలం భవేత్। ఆదౌనమస్క్రియాశీ ర్వావస్తునిర్దేశ ఏవవా। క్వచిన్నిందా ఖలాదీనాం సతాం చ గుణకీర్తనమ్। ఏకవృత్తమయైః పద్యైరవసానేఽన్యవృత్తకైః। నాతిస్వల్పా నాతిదీర్ఘాః సర్గా అష్టాధికా ఇహ। నానావృత్తమయః క్వాపి సర్గఃకశ్చన దృశ్యతే। సర్గాంతే భావిసర్గస్య కథాయాః సూచనంభవేత్। సంధ్యాసూర్యేందు రజనీ ప్రదోషధ్వాంతవాసరాః। ప్రాతర్మధ్యాహ్న మృగయా శైలర్తు వనసాగరాః। సంభోగవిప్రలంభౌ చ ముని స్వర్గ పురాధ్వరాః। రణప్రయాణోపయమ మంత్ర పుత్రోదయాదయః। వర్ణనీయా యథాయోగం సాంగోపాంగా అమీ ఇహ। కవేర్వృత్తస్యవా నామ్నా నాయకస్యేతరస్యవా। నామాస్య సర్గోపాదేయకథయా సర్గనామ తు" (సాహిత్యదర్పణము-తుకారాంజవాజి ప్రచురణ 1902. షష్ఠ పరిచ్ఛేదము ౩౫౩ పేజీ. ౩౧౫ - ౩౨౫ శ్లో.). మహాకావ్యమే సర్గబంధము.

ఇందొకడే నాయకుడు. ఆ నాయకుడు దేవత కావచ్చును; లేదా క్షత్రియుడు కావచ్చును. అతడు సద్వంశజాతుడు, ధీరోదాత్త గుణాన్వితుడు కావలెను. ఏక వంశజాతులైన రాజులు ఉత్తమకులజులు అనేకులైనను నాయకులు కావచ్చును. శృంగార వీరశాంతములందొకటి అంగిరసమగును. మిగిలిన రసములన్నియు అంగరసములగును. నాటక సంధులన్నియు నుండును. ఇతిహాసమునుండి కథగైకొనవలెను. ఇతర కథయైనచో అది సజ్జనాశ్రయమై యుండవలెను. చతుర్వర్గముల నిరూపణయున్నను అందేదో యొకదానికి ప్రాధాన్యముండవలయును. కావ్యాదియందు నమస్కారాశీర్వస్తు నిర్దేశము ములందొకటి యుండవలెను. కొన్నియెడల ఖలాదినింద, సద్గుణకీర్తనము చేయవచ్చును. పద్యములన్నియు నొకేవృత్తములోనుండి, అవసానమందు అన్యవృత్తములుండవచ్చును. ఈ సర్గబంధమును నాతిస్వల్పములు, నాతి దీర్ఘ ములు నయిన సర్గములుగా విభజింపవలెను. ఆ సర్గములు ఎనిమిదికి తక్కువ కారాదు. ఎనిమిది దాటవచ్చును. ఎక్కడైననొక సర్గము నానా వృత్తమయమై ఉండవచ్చును. సర్గాంతమున భావిసర్గ కథాసూచన చేయవచ్చును. సంధ్యా సూర్య- చంద్ర- రాత్రి-ప్రదోష-తిమిర-వాసర ప్రాతర్మధ్యాహ్న మృగయా-శైల-ఋతు-వన-సముద్ర-సంభోగ-విప్రలంభ ముని-స్వర్గ-పుర-యజ్ఞ-రణ-ప్రయాణ-వివాహ-మంత్ర-పుత్రోదయాది వర్ణ నలు యథాయోగముగా సాంగోపాంగముగా వర్ణింపవలయును. ఈ సర్గ బంధమునకు నామకరణము కవిపేరుతోగానీ ఇతివృత్తముపేరుతోగానీ నాయ కుని పేరుతోగానీ కథాగతమగు ఇతరనామముతోగానీ చేయవచ్చును. సర్గ మునకు ఆ సర్గోపాదేయమగు కథతో నామకరణము చేయవచ్చును. దీని కుదాహరణములు—రఘువంశము, శిశుపాలవధము, నైషధము మొదలైనవి.

(3) "మహాకావ్యరూపః పురుషార్థఫలః సమస్తవస్తువర్ణనా ప్రబంధః సర్గబంధః సంస్కృతఏవ" అని ధ్వన్యాలోకలోచనము. (ధ్వ. లో. లోచ. III ఉద్యో. 324 పేజి). పురుషార్థములను లభింపజేయునది, సమస్తవస్తు వర్ణనా ప్రబంధమయినది మహాకావ్యరూపము గలది సర్గబంధము. ఇది సంస్కృతభాషయందే యుండును.

*సహృదయుడు :* కావ్యమును రచించిన కవి హృదయముతోను, కావ్యగతనాయ కుని హృదయముతోను సమానమయిన హృదయము గలవాడే (పాఠకుడే) సహృదయుడు.

(1) యేషాం కావ్యానుశీలనాభ్యాసవశాద్ విశదీభూతే మనోముకురే వర్ణనీయతన్మయీభవనయోగ్యతా తే హృదయసంవాదభాజః సహృదయాః' అని అభినవగుప్తుని నిర్వచనము. (కావ్యస్వరూపమ్ 103 పేజి లో. 38-39). "దృశ్యశ్రవ్యకావ్యములను పరిశీలించుటవలన హృదయము బాహ్యావిషయ జ్ఞానమునుండి ముక్తమై శుద్ధమగు నద్దమువలె భాసిల్లును. అప్పుడాకావ్య మున వర్ణితములయిన విభావాదులు సూటిగా నందుఁ బ్రతిఫలించును.

వానితో నప్పుడా సహృదయునకుఁ గావ్యగత నాయకాదులతోఁ దన్మ యత్వము (అభేదప్రతిపత్తి) గలుగును. అట్టివారే సహృదయులు.'' (శ్రీ సన్నిధానంవారి అనువాదము కా. లం. సం. III-287 పేజి).

(2) ''నాయకస్య కవేః శ్రోతుః సమానోఽనుభవ స్తతః'' అని భట్ట తౌతుడు వ్రాసెనట! కవినాయకుల హృదయములతో సమానానుభవము గలవాడే సహృదయుడు. (కా. లం. సం. III-287 పేజి). అప్పుడే సభ్యుడు సాక్షాన్నాయకరసానుభవమునొందును.

(3) ''యస్తుష్టౌ తుష్టిమాప్నోతి శోకే శోకముపైతి చ క్రోధే క్రుద్ధో భయే భీరుస్స శ్రేష్ఠః ప్రేక్షకః స్మృతః'' అని భావ ప్రకాశము. (కా. లం. సం. III-287 పేజి). సంతోషమున సంతోషమును, శోకమున శోక మును ఎవడు పొందునో నాయకుని క్రోధమున ఎవడు క్రుద్ధుడగునో నాయ కుని భయమున ఎవడు భీరువగునో అట్టివాడే ఉత్తమ ప్రేక్షకుడు. (ఇట ప్రేక్షకుడే సహృదయుడు).

(4) సచేతస్కుడు, భావకుడు, సామాజికుడు, సహృదయుడు పర్యా యములుగా నిందు (ధ్వన్యాలోకమున) ప్రయుక్తములై నవి. కావ్యార్థ భావనా విశేషమున విశదమయిన మనోముకురము కలవాడు. నానావిధము లయిన చిరంతన సంస్కారములు, సమకాల సంస్కృతులు గలవ్యక్తి. సత్వ ప్రకాశముగల యంతరంగము కలవ్యక్తి. సహృదయుడె కావ్యాధికారి. సహృదయత్వము జన్మాంతర విశేషమువలన కలుగునొక రమణీయధర్మము'' (శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ —ధ్వనిసారః 86 పేజి).

**సాత్త్వతి :** వివరములకు, ముందు చూ. వృత్తులు. ఇది అర్థవృత్తులందొకటి. మిగిలినవాని వివరములకు చూ. కైశికి, ఆరభటి, భారతి, ''ఈష ప్రౌఢార్థ సందర్భా సాత్త్వతీ వృత్తిరిష్యతే'' (ప్ర. రు. కావ్యప్రక. 51 పేజి) ఇంచుక ప్రౌఢమయిన అర్థసందర్భముగల ఆంగికాభినయవర్ణనసాత్త్వతీవృత్తి. (అర్థమనగా రసములేదా రసవంతమైన యితివృత్తము) వీరరసము, భయానక రసము—ఈ రెండు ఇంచుక ప్రౌఢమయిన రసములు. కనుక ఈ రసములున్న సన్నివేశములలో సాత్త్వతీవృత్తి ఉండును. ''యత్రనాతి ప్రౌఢావీరభయా నకౌ నాతిప్రౌఢేన సందర్భేణ నిర్వాహ్యేతే తత్రసాత్త్వతీ'' (ప్ర. రు. 52).

ఉదాహరణము :- చ ఉభయరగండ! తావకరణోగ్రగజయానక ముల్ । గుభుల్ గుభుల్ గుభులని మ్రోయగా భవద కుంఠిత వీరభటుల్ ప్రభుల్ ప్రభుల్ ప్రభులని శత్రుభూపతులపైఁ జొఱఁ జాఱునెడన్ । విభుల్ విభుల్ విభులని సంభమింపుదురు వేడ్క నఖర్వ సుపర్వ భామినుల్'' (కా. లం. సం. II-172 పేజి.) ఇందులో వీరశృంగారరసానుకూలమైన ఆంగికాభినయ వర్ణన ఉన్నది.

అర్థవృత్తులు నాట్యాశ్రయములు. అందువలన సాత్త్వతీవృత్తిలో వీరుల ఈషత్ప్రౌఢమయిన ఆంగికాభినయము వర్ణింపబడును. ఇట్టి సాత్త్వతీ

వృత్తికి కొంత దీర్ఘసమాసము, కొంత మృదుపదబంధమునగు పాంచాలీరీతి అవసరము. పై పద్యములో అట్టిరీతి ఉన్నది. చూ. పాంచాలి.

**సాత్త్వికభావము :** "వికారాః సత్త్వసంభూతాః సాత్త్వికాః పరికీర్తితాః" అని సాహిత్యదర్పణము (సా. ద. తృతీయ 137 పేజి 134 సంఖ్య). సత్త్వము వలన పుట్టిన వికారములు సాత్త్వికములు. అవియే సాత్త్వికభావములు. ఇవి అనుభావములు (చూ. అనుభావము).

"సత్త్వము" అను పదమునకు నిర్వచనములు :- (1) "అభినయాది ముఖేన అన్యగత సుఖదుఃఖాది భావనాయా మంతఃకరణస్య అనుకూలత్వం సత్త్వం" (కా. అం. సం. తృతీయ 335 పేజి 36 సం.). అభినయాదుల ద్వారా ఇతరులయందలి సుఖదుఃఖానుభవమునకు అంతఃకరణము అనుకూలమగుటయే సత్త్వము. (2) "రజస్తమోభ్యామస్పృష్టం మనః సత్త్వమిహోచ్యతే." (కా. అం. సం. తృతీయ 335 పేజి. 36 సంఖ్య). రజోగుణతమోగుణముల తాకిడిలేని మనస్సునే సత్త్వమందురు. (3) సత్త్వంనామస్వాత్మ విశ్రామ ప్రకాశకారీ కశ్చన ఆంతరోధర్మః". (సా. ద. తృతీయపరిచ్ఛేదః 137 పేజి 134 సంఖ్య). తన యాత్మనందున్న రతిహాసాది భావములను ప్రకాశింపజేయకల మనోధర్మమే సత్త్వము. (4) "భావాంతర నైరపేక్ష్యేణ రసాపరోక్షీకరణత్వలక్షణో బలవిశేషస్సత్త్వం" (కా. అం. సం. తృతీయ 335 పేజి. 36 సంఖ్య.) మరేభావములతోను పనిలేకుండగనే రసమును అనుభవింపజేయగల బలవిశేషమే సత్త్వము. (5) "పరగత సుఖదుఃఖాదుల నరయఁగ భావించి యట్ల యలరుట సత్త్వస్ఫురణము" అని (III-36 పద్యము) నరసభూపాలీయము.

ఇట్టి సత్త్వమున పుట్టినవి లేదా సత్త్వదశయందు పుట్టిన కార్యములే సాత్త్వికభావములు.

సాత్త్వికభావములెనిమిది :- స్తంభప్రలయరోమాంచాః స్వేదో వైవర్ణ్యవేపథూ। అశ్రువైస్వర్యమిత్యష్టౌ -(ధ. ద. రూ. 58 పేజి). స్తంభః స్వేదోఽథ రోమాంచః స్వరభంగోఽథవేపథుః వైవర్ణ్య మశ్రు ప్రళయ ఇత్యష్టౌ సాత్త్వికాః స్మృతాః (సా.ద. 138 పేజి 135-36 సంఖ్య).

(1) స్తంభము (చూ. స్తంభము)
(2) స్వేదము (చూ. స్వేదము)
(3) రోమాంచము (చూ. రోమాంచము)
(4) స్వరభంగము (వైస్వర్యము) (చూ. వైస్వర్యము)
(5) వేపథువు (కంపము) (చూ. కంపము)
(6) వైవర్ణ్యము (చూ. వైవర్ణ్యము)
(7) అశ్రువు (చూ. అశ్రువు)
(8) ప్రళయము (చూ. ప్రళయము).

"జృంభ" యను సాత్త్వికభావమును తొమ్మిదవదిగా భానుదత్తుడు తన రసమంజరిలో పేర్కొనెను. "జృంభా చ నవమః సాత్త్వికభావ ఇతి ప్రతిభాతి''. —కా. అం. సం. III-336 పేజి 37 సంఖ్య.

ఈ సాత్త్వికభావముల లక్షణలక్ష్యములాయా శీర్షికల క్రింద ఈయబడినవి.

**సాధనము :** చూ. అనుమానప్రమాణము

**సాధ్యవసానిక :** వివరములకు చూ. సాధ్యవసాయ.

**సాధ్యవసాయ :** చూ. లక్షణ. (దీనినే సాధ్యవసానిక అనికూడా అందురు.) లక్షణాశక్తిచే బోధింపబడు అర్థాంతరము ముఖ్యార్థముతో సాదృశ్యము గలదైనచో సామ్యనిబంధన. ఇది రెండు విధములు— (1) సారోప (2) సాధ్యవసాయ. (చూ. సారోప.)

సామ్యనిబంధనలో ఉపమేయమును మరుగుపరిచి ఉపమానమును మాత్రమే చెప్పినప్పుడు సాధ్యవసాయ అగును. ఇది అతిశయోక్త్యలంకార మునకు బీజము. ఉపమానవాచకముతోనే ఉపమేయమును ప్రతిపాదించుటను అధ్యవసానమందురు. ఇది నిశ్చయజ్ఞానము. ఉపమేయోపమానములు విడి విడిగా ప్రయోగింపబడినచో అది సారోప. "విషయస్యాని గీర్ణస్యాన్య । తాదాత్మ్య ప్రతీతికృత్ సారోపాస్యాత్ నిగీర్ణస్య । మతా సాధ్యవసానికా" (సా. ద. II-42 పే. 8-9 శ్లో.).

ఉదాహరణము :- పోచిరాజ వంశరత్న స్తంభమున నృసింహుడు పుట్టెను. ఇది నరసభూపతివర్ణన. స్తంభమున అతడు పుట్టుట - ముఖ్యార్థ బాధకము. కాగా ముఖ్యార్థసామ్యమువలన నృసింహునివంటివాడగు నృసింహుడు అను లక్ష్యార్థము వచ్చును. ఇక్కడ ఉపమానమే కాని ఉప మేయము చెప్పబడలేదు. కనుకనే సాధ్యవసాయ.

**సాధారణీకరణము :** ఇది శబ్దగతవ్యాపారమని భట్టనాయకుడు విభావాదుల వ్యాపారమని అభినవగుప్తుడును భావించిరి.

(1) భట్టనాయకమతము : శబ్దమునకు మూడు వ్యాపారములుండును. అభిధావ్యాపారము మొదటిది. ఇది శబ్దముయొక్క వాచ్యార్థమును బోధించును. భావకత్వ వ్యాపారము రెండవది. ఇది శబ్దగత రసాదులను బోధించును. ఇదియే సాధారణీకరణమనబడును. మూడవది భోజకత్వవ్యాపారము లేదా భోగీకృతి. ఇది రసాదులను సహృదయులచే భోగింపజేయును. భావకత్వవాపారము విభావాదులను సాధారణీకరించును. కనుకనే ఇది సాధారణీకరణమైనది. కావ్యమందలి నాయికా నాయకులు విభావము లన బడుదురు. కావ్యమున రాముడు, సీత విభావములు. ఈ విభావములు భావ భావకత్వముచే వ్యాపారము సామాజికునకు సాధారణవ్యక్తులుగా కనిపిం తురు. రామత్వసీతాత్వములు అడగిపోవును. అప్పుడు సామాజికుడు విభావ

నాయకునితో అభేదమును పొంది రత్యాదులను భోగించును—ఇది భట్టనాయకుని భుక్తివాదము (చూ. భుక్తివాదము). (చూ. ఆం. ప్ర. రు. రసప్రక. 230 పే.).

(2) అభినవగుప్తమతము :- కావ్యమునందలి విభావాదులు సహృదయుని సత్త్వగుణోద్రేకమునకు కారణములగును. ఆ ఉద్రేకమువలన అతని హృదయమున వాసనారూపముననున్న స్థాయిభావము ఉద్బుద్ధమగును. అప్పుడతడా విభావాదులను తిరిగితిరిగి భావించుచుండును. ఆ భావన వలన కావ్యమందలి శకుంతలాదుల శకుంతలాత్వము మొదలగునవి అణగిపోయి సాధారణకాంతలు గోచరింతురు. ఆ భావనయే సాధారణీకరణము. ఈ సాధారణీకరణమువలననే సామాజికుడు నాయకునితో అభేదము పొందును. అప్పుడు రసానుభవము కలుగును. (చూ. అభివ్యక్తివాదము). (చూ. కా. లం. సం. III-287 పేజి).

(3) ఈ సాధారణీకరణమును గూర్చి సాహిత్యదర్పణమిట్లు వివరించినది :- "నను కథం రామాదిరత్యాద్యుద్బోధ కారణైః సామాజిక రత్యాద్యుద్బోధ ఇత్యుచ్యతే— వ్యాపారోఽస్తి విభావాదేర్నామ్నా సాధారణీకృతిః తత్ప్రభావేణ యస్యాస పాథోధి ప్లవనాదయః ప్రమాతా తదభేదేన స్వాత్మానం ప్రతిపద్యతే". రాముడు, సీత మొదలైనవారి రత్యాదికమును ఉద్బోధించిన కారణములు సామాజికుల రత్యాదికమునెట్లు ఉద్బోధించగలవని సందేహము ఏర్పుట సహజము. సమాధానమిది :- విభావాదులకు 'సాధారణీకరణము' అను వ్యాపారమొకటున్నది. దాని ప్రభావము వలన సామాజికుడు (భావుకుడు) తాను చేయని సముద్రలంఘనము మొదలైనవానిని అవి చేసినవానితోడి అభిన్నత్వమును భావించుకొని అనుభవించును. ఇట్లు భావించుకొనుటకు సామాజికునిలోని (ఉత్సాహమనెడి) వాసనయే కారణము. (సాధారణీకరణము=ఒకనికి వ్యక్తిగతముగానున్న విభావాదులకు అందరకును సాధారణములుగా చేయబడుట.)

**సామ్యనిబంధనాలక్షణ** : పూర్తి వివరములకు ముందు చూ. లక్షణ, సంబంధ నిబంధనాలక్షణ.

లక్షణాశక్తిచేత బోధింపబడు అర్థాంతరము ముఖ్యార్థముతో సాదృశ్యము గలదైనచో సామ్యనిబంధన. ఉదా :- బ్రాహ్మణుడగ్ని ఇక్కడ బ్రాహ్మణుడే అగ్నిదేవుడా అను ప్రశ్నరాగా ముఖ్యార్థము పొసగకుండా పోవును. అప్పుడు లక్షణాశక్తి అగ్ని సదృశుడు అను అర్థాంతరమును బోధించును. ఈ విధముగా సామ్యము చెప్పుటకు కారణమేమి? అది ప్రయోజనము. రూఢికాదు. బ్రాహ్మణుడు అగ్నివలె శౌచము, పవిత్రత గలవాడు అను అర్థము లక్ష్యార్థము. ఇట్లే 'వాడు భీముడు, ఆయన ధర్మరాజు' మొదలైనవి.

ఇక రూఢికుదాహరణమిది :- హేరండతైలము- ఇక్కడ తైలము అనుదానికి ముఖ్యార్థము తిలలనుండి పుట్టినదియగు చమురు. కాని ఆముదము నుండి తీసిన చమురును కూడా హేరండతైలము అనుటకు సామ్యానిబంధనా లక్షణయే కారణము'

ఈ సామ్యానిబంధన (1 )సారోప (2) సాధ్యవసాయ అని రెండు రకాలు. (వాటిని గురించి చూ. ఆయా శీర్షికలకింద.)

**సారస్వతుడు :** సహజప్రతిభగల కవిని సారస్వతుడని రాజశేఖరుడు పేర్కొనెను. (చూ. కారయిత్రి).

"జన్మాంతర సంస్కారాపేక్షిణీ సహజా।" (కా. మీ. IV-32 పేజి)· సహజప్రతిభ జన్మాంతర సంస్కారమునుండి ఉత్పన్నమగును. ఇట్టి ప్రతిభ గలవాడే సారస్వతుడు. (చూ. ఆభ్యాసికుడు, ఔపదేశికుడు).

జన్మాంతరసంస్కార ప్రవృత్త సరస్వతీకో బుద్ధిమాన్ సారస్వతః (కా. మీ. IV-32 పే.).

**సారోప :** పూర్తి వివరములకు ముందు చూ. లక్షణ లక్షణాశక్తిచే బోధింపబడు అర్థాంతరము ముఖ్యార్థముతో సాదృశ్యము గలదైనచో సామ్యానిబంధన. ఇది రెండు విధములు- (1) సారోప (2) సాధ్యవసాయ. సారోపనే ఆరోప అనికూడా అందురు.

సామ్యానిబంధనలో ఉపమానోపమేయములు విడివిడిగా ప్రయోగింపబడినచో అది సారోప. ఉపమానమునకు, ఉపమేయమునకు అభేదమును చెప్పదలచినప్పుడు అవి విడివిడిగా ఉండును. అదియే ఆరోపము. ఈ లక్షణాభేదమే రూపకాలంకారమునకు మూలము. ఉపమేయమును దాచి ఉపమానమును మాత్రమే చెప్పినపుడు సాధ్యవసాయ అగును. "విషయస్యానిగీర్ణస్యాన్య। తాదాత్మ్య ప్రతీతికృత్ సారోపాస్యాత్ నిగీర్ణస్య। మతా సాధ్యవసానికా"- (సా. ద. II పరి. 42 పే. 7-9 శ్లో.).

ఉదాహరణము :- "రాజు సింహము"- ఇక్కడ రాజు సింహమెట్లగును ? అను ప్రశ్నరాగా ముఖ్యార్థబాధ కలుగును. అప్పుడు ముఖ్యార్థసామ్యమువలన సింహమువంటివాడు అను లక్ష్యార్థము వచ్చును. ఇందు రాజు ఉపమేయము. సింహము ఉపమానము. ఈ రెండును విడివిడిగా ఉన్నవి ఉపమేయము దాచబడలేదు. ఉపమానముతోడి తాదాత్మ్యము గలదై ఉన్నది. కనుక ఇది సారోప.

**సాహిత్యము :** "'పంచమీ సాహిత్యవిద్యా' ఇతి యాయావరీయః సాహిచతస్రృణామపి విద్యానాం నిస్యందః" అని రాజశేఖరుడు (కా. మీ. II-10 పేజి.). ఆన్వీక్షకీ త్రయీవార్తా దండనీతులనునవి నాలుగును విద్యలని కౌటిల్యుడనెను. ఐదవది సాహిత్యవిద్యయని యాయావరీయుని యభిప్రాయము. సాహిత్యము నాలుగువిద్యలయొక్కయు సారతత్త్వము."శబ్దార్థ

యోర్యథావత్ సహభావేనవిద్యా సాహిత్యవిద్యా" (కా. మీ. II-13 పేజి) అనియు రాజశేఖరుడు. శబ్దార్థముల సముచిత సహభావము గల విద్యయే సాహిత్యవిద్య.

సహితయోర్భావః సాహిత్యం శబ్దార్థయోర్విచిత్రావిన్యాస భంగీ పరస్పర స్పర్థితరమణీయా సహృదయాహ్లాదకారికా అవస్థితిః సాహిత్య ముచ్యతే (వక్రోక్తిసారము- జమ్మలమడకవారిది 9వ పేజి). అని కుంతకుడు. సహితములుగానుండువాని ధర్మము సాహిత్యము. శబ్దార్థముల విచిత్రమైన విన్యాసభంగి-పరస్పర స్పర్థవహించిన అందముతో సహృదయాహ్లాదమును కలిగించునదై యుండుటయే సాహిత్యము.

కిం సాహిత్యమ్ ? యఃశబ్దార్థయోః సంబంధః । సచ ద్వాదశధా అభిధా, వివక్షా, తాత్పర్యం, ప్రవిభాగః, వ్యపేక్షా, సామర్థ్యం, అన్వయః, ఏకార్థీభావః, దోషహానం, గుణోపాదానం, అలంకారయోగః, రసావియోగ శ్చేతి.' (కా. స్వ. 131 పే.). అని భోజదేవుడు (శృంగారప్రకాశము). సాహిత్యమననేమి? శబ్దార్థముల సంబంధము. అది పన్నెండువిధములు. (1) అభిధ (2) వివక్ష (3) తాత్పర్యము (4) ప్రవిభాగము (5) వ్యపేక్ష (6) సామర్థ్యము (7) అన్వయము (8) ఏకార్థీభావము (9) దోషహానము (10) గుణోపాదానము (11) అలంకారయోగము (12) రసావియోగము. "నిర్దోషస్య గుణవతః అలంకృతస్య కావ్యశరీరస్య కామినీశరీరస్యేవ శోభాతిశయ నిష్పత్తౌ రసావియోగ ఏవప్రకృష్ట ఉపయోగీ" (కా.స్వ 131 పే.). ద్వాదశవిధ సాహిత్యములో చివరి నాలుగుమాత్రమే కావ్యసాహిత్యమున కావశ్యకము, నిర్దోషము, గుణవంతము, సాలంకృతము, నగు కావ్యశరీరమునకు కామినీశరీరమునకు వలె శోభాతిశయ నిష్పత్తియందు రసావియోగమే పరమోపయోగకరమైనది.

"సాహిత్యం సపరిష్కారం కవినాపరికల్పితమ్ భావయన్ రసికో లోకే సుఖమత్యంతమశ్నుతే వృత్త్యాదీనాం సమష్టిఃస్యాత్ సాహిత్యం తత్పరిష్కృతిః శబ్దార్థయోః పరిష్కారః కవిస్తస్య ప్రసాధకః" అని సాహిత్యమీమాంస (కా. స్వ. 153 పేజి). సపరిష్కారమైన సాహిత్యము కవిచేత కల్పితము. దానిని రసికులు లోకమున భావించి ఆనందమందుదురు. వృత్తి మొదలైన వాని సమూహమును, తత్పరిష్కారమును కలిసి సాహిత్యమగును. ఆ పరిష్కారమును చేయువాడు కవి. "వృత్తివివక్షాదేః సాహిత్యాంతర్భావం, దోషహీన గుణాలంకార రససంబంధస్య బహిర్భావంచ" అనియు సాహిత్య మీమాంస. (కా. స్వ. 154 పే.). వృత్తి, వివక్ష, తాత్పర్యము మొదలైన ఎనిమిది శబ్దార్థ సంబంధములు సాహిత్యాంతర్భావములు. దోషహీనము, గుణోపాదానము అలంకారవియోగము, రసావియోగము అను నాలుగును సాహిత్య బహిర్భావములు. "ఏషాం సమష్టిరష్టానాం సాహిత్యమితినిర్ణయః సాహిత్యస్య పరిష్కారః పారంపర్యేణ సిద్ధ్యతి"

(కా. స్వ. 154 పే.). అనియు సాహిత్యమీమాంస. అష్టవిధ సంబంధముల సమూహామే సాహిత్యము. సాహిత్య పరిష్కారము పారంపర్యవశాత్తు సిద్ధించును.

సుప్తి : సుప్తము అని రూపాంతరము. దీనినే స్వప్నమని కొందరు. వ్యభిచారిభావములందొకటి (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- (1) "సుప్తం నిద్రోద్భవం తత్ర శ్వాసోచ్ఛ్వాస క్రియాపరం" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 62 పేజి 27 సం.). నిద్రవలన పుట్టినది సుప్తము. శ్వాసము, ఉచ్ఛ్వాసము మొదలైనవి అనుభావములు (కార్యములు). (2) "సుప్తిర్నిద్రాసముద్రేకః" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 286 పేజి. 28 సం.). నిద్రయొక్క అతిశయమే సుప్తి. (3) "స్వప్నో నిద్రాముపేతస్య విషయానుభవస్తు యః కోపావేగ భయగ్లాని సుఖదుఃఖాది కారకః" అని సాహిత్యదర్పణము (సా. ద. III-145 పే. 152 శ్లో.). నిద్రతోకూడినవాని విషయానుభవము స్వప్నము. కోపము, తొట్రుపాటు, భయము, గ్లాని, సుఖము, దుఃఖము మొదలైనవి దీని కార్యములు. (4) "అతి నిద్రసుప్తి" అని నరసభూపాలీయము. (III-366 పే. 87 ప.) ఇదిసరికాదని (శ్రీ) సన్నిధానంవారు. (5) "నిద్రా విభావోత్థజ్ఞానం సుప్తం" అని రసగంగాధరము. (కా. అం.సం. III-366పే.29 సం.). నిద్రయను విభావమువలన పుట్టిన జ్ఞానము సుప్తము. ప్రలాపాదులు అనుభావములు.

ఉదాహరణము :- ఆ వె "నిన్న పగటిపూట నిద్రలో నినుఁగూర్చి, పాపమానెలంత పలవరింప సవతి నవ్వె; నత్తదివులొందెఁ; బరువెత్తి, మూసిరంత దానిమొగముఁ జెలులు" —(శ్రీ) సన్నిధానంవారు. (కా. అం. సం. III-366 పేజి) ఇందు నిద్ర విభావము. ప్రలాపమనుభావము. స్వప్నము వ్యక్తమయినది.

సేవిత : కవియొక్క అవస్థలు పదియనియు అందు సహజప్రతిభునకును (చూ. సారస్వతుడు) ఆహార్యప్రతిభునకును (చూ. ఆభ్యాసికుడు) ఏడవస్థలును, ఔపదేశికునకు (చూ. ఔపదేశికుడు) మూడవస్థలును నుండునని రాజశేఖరుడు కావ్యమీమాంస (చూ. కా. మీ. V-49 పే.). యందు పేర్కొనెను. మొదటి ఏడింటిలో సేవిత యగుట నాల్గవ అవస్థ. మిగిలినవాని వివరములకు చూ కావ్యవిద్యాస్నాతకుడు, హృదయకవి, అన్యాపదేశి, ఘటమానుడు, మహాకవి, కవిరాజు, ఆవేశికుడు, అవిచ్ఛేది, సంక్రామయిత).

"యః ప్రవృత్తరచనః పౌరస్త్యానామన్యతమచ్ఛాయయా మభ్యస్యతి స సేవితా" అని రాజశేఖరుడు (కా. మీ, V-50). ఎవడు రచనకుఁ బూనుకొన్నవాడై ప్రముఖ కవులయందు అగ్రగణ్యుడైన కవియొక్క శైలిని కాని, భావములను గాని ఛాయారూపముగా గ్రహించి కావ్యరచన చేయునో వాడుసేవిత.

***స్తంభము*** : వివరములకు ముందు చూ. సాత్త్వికభావము. సాత్త్వికభావము లెనిమిదింటిలో నిదియొకటి. ఇది అనుభావము. (చూ. అనుభావము).

"స్తంభము"నకు నిర్వచనములు :- (1) "స్తంభః స్యాన్నిష్క్రియాంగత్వం రాగభీత్యాది సంభవం" అని ప్రతాపరుద్రీయము. (ఆం. ప్ర. రు. రసప్రక. 265 పేజీ. 1 సంఖ్య). అనురాగము, భయము మొదలయిన భావముల వలన అవయవములు చలనము తప్పి క్రియాశూన్యములగుటయే స్తంభము. (2) "స్తంభశ్చేష్టాప్రతీఘాతో భయహర్షామయాదిభిః" అని సాహిత్యదర్పణము. (కా. లం. సం. III-337 పేజీ. 39 సం.). భయము, సంతోషము, రోగము మొదలయిన వానివలన చేష్టలు కోల్పోయిన స్థితియే స్తంభము. (3) "స్తంభమచంచలత్వము" అని నరసభూపాలీయము. III-37 ప.

స్తంభమునకు నరసభూపాలీయమునందలి యుదాహరణము :- ఒక నాయికకు నరసభూపాలుని చూడగనే నిశ్చలత్వము కలిగినది. ఆ రాజు రూపమును చూచి మన్మథుడు సైతము నిశ్చలుడే యగుటచేత ఆ మన్మథునిచే ఆవిష్టయైన ఆ నాయిక జంత్రపుబొమ్మవలె నిశ్చలముగా నుండుటలో ఆశ్చర్యములేదు గదా! చం 'కలికి నృసింహభూవరునిఁ గన్గొని నిశ్చలగాత్రవల్లియై అలరె విలాసచేష్టలొలయం గలయంగ నటింపఁజేయు నా, వలపుల సూత్రధారుఁడనవద్యనృపాకృతిఁ జూచి తాను నిశ్చలత వహింపఁగాఁ గదలఁజాలని జంత్రపు బొమ్మయో యనన్" —కా. లం. సం. III-39. ఇందు నాయికకు ఆ రాజును చూడగనే అనురాగము కలిగి స్తంభమేర్పడినది. అదియే ఆమె సాత్త్వికభావము.

***స్థాయిభావము*** : స్థిరముగా నిలిచిపోవుభావమని సామాన్యార్థము. రసస్ఫూర్తి కలుగువరకు సహృదయుల హృదయములలో వాసనారూపమున ఉండు భావమే స్థాయిభావము.

స్థాయిభావమునకు నిర్వచనములు :- (1) "సజాతీయై ర్విజాతీయై రతిరస్కృతమూర్తిమాన్ యావద్రసంవర్తమానః స్థాయిభావ ఉదాహృతః" (దశరూపకోక్తముగా ప్రతాపరుద్రీయమున (రసప్రకరణము) పేర్కొనబడినది. చూ. ప్ర. రు. 185 పేజి). దేని రూపమును సజాతీయభావములుగాని విజాతీయభావములుగాని కప్పివేయజాలవో, ఏ భావము రసస్ఫూర్తిపర్యంతము చెదిరిపోకుండ నిలిచియుండగలదో ఆ భావమే స్థాయిభావము (వివరములకు చూ. కా. లం. సం. 280 పేజి). (2) "విరుద్ధై రవిరుద్ధైర్వాభావైర్విచ్ఛిద్యతే న యః ఆత్మభావం నయత్యాశు సస్థాయీ లవణాకరః". (ధ. ద. రూ. 65 పేజి). ఏదివిరుద్ధభావములచేతగాని, అనుకూల భావములచేతగాని (విజాతీయ సజాతీయభావములు) చెడిపోకుండ నిలిచిపోగలదో, ఏది ఇతరభావములను సైతము తన కనుకూలముగా మార్చుకొని తనకు పోషక

ములుగా చేసుకొని తనలో నైక్యము నొందించుకొనగలదో ఆ భావము స్థాయిభావము. ఇది ఉప్పునీటిసముద్రమువంటిది. (మధుర) స్వాదుజలములుగల అనేక నదులు తనలో కలిసినను తన క్షారరసత్వమును విడువని సముద్రము వంటిది స్థాయిభావము. విభిన్నభావములను దనలో గలుపుకొనును. (3) "చిరంచిత్తేఽవతిష్ఠంతే సంబధ్యంతేఽనుబంధిభిః రసత్వం యే ప్రపద్యంతే ప్రసిద్ధాః స్థాయినోఽత్రతే" (రసగంగాధరము- కా. అం. సం. 280 పేజి). సహృదయుల చిత్తములో చిరకాలము వరకు నిలిచిపోవునవి యేవో, విభావాదులతో సంబంధము గలవి యేవో, రసత్వమును పొందునవి యేవో ఆ భావములే స్థాయిభావములు. (4)' రత్యాదయః స్థాయిభావాస్స్యుః భూయిష్ఠ విభావజాః స్తోకై ర్విభావై రుత్పన్నాస్త ఏవ వ్యభిచారిణః'' (అం. ర. గం. 142 పేజి). రతి మొదలైనభావములు అధికమైన విభావముల వలన వ్యక్తములైనప్పుడు స్థాయిభావములగును. అల్పవిభావములవలన వ్యక్తములైనప్పుడు ఆ రతిమొదలైనవి సంచారిభావములేగాని స్థాయిభావ ములు గావు. (5) "అవిరుద్ధా విరుద్ధా వా యం తిరోధాతు మక్షమాః ఆస్వాదాంకుర కందోఽసౌ భావః స్థాయీతి సమ్మతః'' (సాహిత్యదర్పణము- తృతీయపరిచ్ఛేదము). విరుద్ధభావములుగాని అవిరుద్ధభావములుగాని దేనిని మరుగుపుచ్చజాలవో ఏది ఆస్వాదమను బీజమునకు దుంపవంటిదో ఆభావమే స్థాయిభావము. (6) "స్రక్సూత్రవృత్త్యా భావానా మన్యేషామనుగామకః న తిరోధీయతే స్థాయీ తైరసౌ పుష్యతే పరమ్ (సాహిత్యదర్పణము). వివిధ వర్ణములు వివిధాకారములుగల పూలదండలోని దారమువలె విరుద్ధ అవిరుద్ధ భావములలో (దనయునికికి) భంగము రాకుండ నుండునది స్థాయిభావము, (కాని) ఆ భావములచే కప్పబడునదికాదు. పైగా ఆ భావములచే తాను పోషింపబడు చుండును. (7) "యథా నరాణాం నృపతిః శిష్యాణాంచ యథాగురుః ఏవంహి సర్వభావానాం భావః స్థాయీ మహానిహ'' (నాట్య శాస్త్రము చూ. సా. ద 257 పేజి.). మానవులకు రాజువలె, శిష్యులకు గురువువలె, సర్వభావములకును స్థాయిభావము గొప్పది. (8) గరిమ నదు లెన్ని గలిసినఁ గప్పుకొనఁచు జలధి గనుపట్టురీతి సంచారిభావ సంచయము లెన్ని గలిసిన మించనీక తాన కనపట్టు భావంబుస్థాయి'' అని నరసభూపా లీయము (III-5 పద్యము). ఈ నిర్వచనమున 'సంచారిభావసంచయము లెన్ని గలిసిన మించనీక' అని యుండరాదు. సజాతీయ విజాతీయములైన స్థాయి భావము లెన్ని కలిసినను మించనీయక స్థిరముగా నిలుచునదే స్థాయిభావము. (చూ. కా. అం. సం. 279 పేజి).

మొదట ఈస్థాయిభావము సహృదయుని హృదయములో వాసనారూప మున నుండును. అప్పుడది ఆస్వాద్యముగా నుండదు. విభావ, అనుభావ సంచారిభావములచే అది పరిపుష్టమై ఆస్వాద్యమగును. అట్టి స్థాయిభావమే రసమగును. "విభావై రనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః ఆనీయ

మానః స్వాదుత్వం స్థాయిభావోరసః స్మృతః" అను దశరూపకలక్షణమీ యర్థమునే తెల్పుచున్నది. (చూ. రసము).

రసములు తొమ్మిదింటికి తొమ్మిది స్థాయిభావములు వేరువేరుగా నున్నవి. (1) శృంగారరసము —రతి (చూ. రతి) (2) హాస్యరసము— హాసము (చూ. హాసము) (3) కరుణరసము— శోకము (చూ. శోకము). (4) వీరరసము—ఉత్సాహము (చూ. ఉత్సాహము). దీనికి యత్నమని నామాంతరము. (5) భయానకరసము—భయము (చూ. భయము). (6) బీభత్సరసము—జుగుప్స (7) రౌద్రరసము—క్రోధము (చూ. క్రోధము) (8) అద్భుతరసము—విస్మయము (చూ. విస్మయము). (9) శాంతరసము— శమము (చూ. శమము.). ఉదాహరణములకు ఆయాశీర్షికలందు చూడుడు.

**స్ఫోటము :** వర్ణములకన్న భిన్నమై వర్ణముల వలన వ్యక్తమై అర్థమును బోధించు నిత్యమైన శబ్దమును స్ఫోటము అని వైయాకరణులు అందురు. "వర్ణాతిరిక్తః వర్ణాభివ్యంగ్యః అర్థప్రత్యాయకో నిత్యశ్శబ్దః స్ఫోటః" (కా. లం. సం. II-161 పేజి).

శబ్దము వర్ణములచేత ఏర్పడుచున్నది. ఈ వర్ణములను ఒక్కొక్కటిగా ఉచ్చరింతుము. అవి అనిత్యములు. ఒక వర్ణమునుచ్చరింపగానే మూడవక్షణ మున అది నశించును. ఇట్లు నశించు వర్ణములు అర్థమునెట్లు బోధించునో వైయాకరణులు చెప్పిరి. మూడవవర్ణమునుచ్చరించునపుడు మొదటివర్ణము నశించుచున్ననుదాని సంస్కారముమాత్రము మనస్సులో ఉండును. ఆసంస్కా రముతోనే అంత్యవర్ణమును అనుభవింతుము. దానివలన అర్థము వ్యక్త మగును. ఈ అర్థమే స్ఫోటమువలన వ్యక్తమగునది. "పూర్వపూర్వవర్ణాను భవాహిత సంస్కారసచివేన అంత్యవర్ణానుభవేన అభివ్యజ్యతే స్ఫోటః." (కా. లం. సం. II-162).

అర్థము దేనిచేత స్ఫుటమగుచున్నదో అదియే స్ఫోటము." స్ఫుట త్యర్థోఽస్మాత్ ఇతిస్ఫోటః" అని వ్యుత్పత్తి (కా. లం. సం. II-162 పే.). అర్థమును వ్యక్తపరచునది స్ఫోటము. స్ఫోటయత్యర్థమితి స్ఫోటః అనికూడా వ్యుత్పత్తిని చెప్పవచ్చును. (కా. లం. సం. II-162పే.).

ఈ స్ఫోటసిద్ధాంతము ప్రతిపాదించినవారే స్ఫోట బ్రహ్మవాదులు లేదా శబ్దబ్రహ్మవాదులు. ఆనందవర్ధనులీ సిద్ధాంతమునను సరించి వ్యంజనా శక్తిని స్థాపించిరి. చూ. వ్యంజన.

**స్మృతి :** వ్యభిచారిభావములందొకటి. (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- "సదృశజ్ఞాన చింతాద్యైః సంస్కారాత్ స్మృతి రత్ర చ । జ్ఞాతత్వేనార్థభాసిన్యాం భ్రూసమున్నయనాదయః" అని దశ రూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 61 పేజి 24 సం.). సదృశ జ్ఞానము, చింత, మొదలైనవానిచేతకలిగిన సంస్కారమువలన కలుగు చిత్త వృత్తి స్మృతి. కనుబొమలెత్తుట మొదలయినవనుభావములు. (2)"పూర్వాను

భూతవిషయ జ్ఞానం స్మృతిరుదాహృతా'' అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. రసప్రక. 277 పేజి 11 సం.). పూర్వమెప్పుడో అనుభవించిన విషయములకు సంబంధించిన జ్ఞానమే స్మృతి. (3) "సదృశజ్ఞానచింతాద్యైర్భ్రూ సముఙ్నయనాదికృత్ స్మృతిః పూర్వానుభూతార్థ విషయజ్ఞాన ముచ్యతే" అని సాహిత్యదర్పణము (సా. ద. III-150 పే. 162 శ్లో.) సదృశజ్ఞానము, చింత మొదలైనవానివలన పూర్వమనుభవించిన విషయమును జ్ఞాపకమునకు తెచ్చుకొనుట స్మృతి.ఇది కనుబొమలెత్తుట మొదలైన అనుభావములను కలిగించును. (4) 'స్మృతియగు పూర్వానుభవస్మృతి' అని నరసభూపాలీయము (III-68 ప. (5) 'సంస్కారజన్యంజ్ఞానం స్మృతిః' అని రసగంగాధరము (కా. అం. సం. III-354 పేజి). సంస్కారమువలన పుట్టిన జ్ఞానము స్మృతి. (6) "లోకములో నొకప్పుడు మనము దేనినేనిఁ జూతుము; లేదా విందుము. ఆ విషయము ప్రత్యక్షమునకు దూరమైనను మన హృదయమునకు హత్తుకొని యుండును. అదియే సంస్కారము. మరల నెన్నడేని నావిషయమును జూచుటగాని వినుటగాని సంభవించినచో వెనుకటి సంగతి మన తలఁపునకు వచ్చును. అట్టి తలఁపు స్మృతి'' అని శ్రీ సన్నిధానంవారు. కా. అం. సం. III-354 పేజి 13 సం.).

ఉదాహరణము :- కం ''నాఁటి పరిరంభసౌఖ్యము నేఁటి బలెం ? బాయదాత్మ నిండి తొలకుచున్ । బోఁటి ! నృసింహునిఁ బాయని పాటల సుమగంధులెంత భాగ్యాధికలో'' —కా. అం సం. III-69. ఇందు పరిరంభ సౌఖ్యము విభావము. ఆనందబాష్పములు మొదలైనవి అనుభావములుగా ఊహ్యములు. స్మృతి వ్యక్తమగుచున్నది.

శృంగారావస్థలందొకటి. (చూ. శృంగారావస్తలు)

సంస్కారజన్యమగు జ్ఞానము స్మృతి. నాయికానాయకులు పరస్పరము గుణములను తలపోయుట స్మృతి.

ఉదాహరణము :- కం "స్మరియించు నీ నామమె । స్మరియించును నీదు గీతమాధుర్యంబె స్మరించుఁ బ్రియుడు నీ సుం దరరూపవిలాస సంపదలే లలితాంగీ!" (కా. అం. సం. III-395. పేజి). శ్రీ సన్నిధానం వారిచ్చిన యుదాహరణము.

**స్వతస్సిద్ధ - అర్థశక్తిమూలధ్వని** : వివరములకు ముందు చూ. అభిధామూలధ్వని; సంలక్ష్యక్రమవ్యంగ్యము; అర్థశక్తిమూలధ్వని.

సంలక్ష్యక్రమవ్యంగ్యము అర్థశక్తిమూలమైనపుడు మూడువిధములుగా నుండును. అందు మొదటిది ఈ స్వతస్సిద్ధ అర్థశక్తిమూలధ్వని. మిగిలినవానివివరములకు చూ. కవి ప్రౌఢోక్తిసిద్ధ అర్థశక్తిమూలధ్వని; కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తిసిద్ధ-అర్థశక్తిమూలధ్వని.

కవికల్పన యేమియులేక స్వభావముచే సిద్ధమైన అర్థము స్వతస్సిద్ధము స్వతస్సిద్ధమైన అర్థశక్తిమూలధ్వని నాలుగువిధములు. వాని ఉదాహరణములు.

(1) వస్తుకృతవస్తుధ్వని :- "నరసభూపాలా! నీ విరోధిభార్య నేడొక పర్వతముమీద ప్రవాసక్లేశ మనుభవించుచు అక్కడి భిల్ల వనితలతో మా పల్లె లోని చందమామ చల్లనివాడు మా యూరిలోనిది చల్లనిగాలి అని చెప్పుకొనుచున్నది[1]". ఇందు 'మా పల్లెలోని చందమామ చల్లనివాడు' అని చెప్పుకొనుటవల్ల ఆమె ముగ్ధాత్వము వ్యంగ్యము. ఆ వ్యంగ్యమువల్ల ఆమె భర్తృవిరహ సంతాపము వ్యక్తము. మరల దీనివల్ల నరసరాజు విరోధుల నందరిని జయించెనను వస్తువు వ్యంగ్యము. ఇట్లు 'చల్లనివాడు మా పల్లె లోని చందమామ' అనుట స్వతస్సిద్ధార్థము.

(2) వస్తుకృతాలంకారధ్వని :- మత్స్యయంత్రమును కొట్టినవాడు నరసభూపాలుడు. ఆ నరసభూపాలుని వంశాధిపతియగు సూర్యుని పట్టి కొన్నచో నన్నుకూడ నరసభూపాలుడు కొట్టునని భయపడి రాహువు చంద్రుని పీడించినంతగా సూర్యుని పీడించడు.[2]"—ఇందు యంత్ర మీన మును కొట్టిన నరసభూపాలుడు తన్నును అవలీలగా కొట్టునని కాబోలు రాహువు సూర్యుని బాధించడు- అను ఉత్ప్రేక్షాలంకాము స్ఫురించుచున్నది.

(3) అలంకారకృతవస్తుధ్వని :- "ఓ నరసభూపాలా! నీ యశోవధూటికి చంద్రుడే ముఖము. తారకలే నఖాంకురములు. కైలాస హిమాద్రులే వక్షోజములు. సితాబ్జములే లోచనములు'' -ఇందు అలంకారము రూపకము. దీనిచే 'నీకీర్తి అన్నిలోకములందును నిండిపోయినది' అను వస్తువు వ్యక్త మగుచున్నది.

(4) అలంకారకృతాలంకారధ్వని :- "ఓ నరసభూపాలా! నీ కీర్తి గంగవలె ఆకాశమంటుచున్నది." ఇందలి ఉపమాలంకారము "నీవు శంకరుని వంటివాడవు" అను ఉపమాలంకారమును వ్యక్తము చేయుచున్నది.

1. ఉ॥ చల్లనివాఁడు మా నెలవు చందురుమామ; కడంగి వేఁడుముల్
చల్లనివాఁడు మా యవటి చందన శైల సమీరుఁడంచుఁ ద
ద్భిల్లవధూమతల్లికలఁ బేర్కొని పల్కు నృసింహమేదినీ
వల్లభ ! నీ విరోధినృపవల్లభ దుర్భర శైలవాసయై

—నరసభూపాలీయము II ఆ. 121 ప.

2. మ॥ సలిలచ్ఛాయ గణించి యంత్రకృత మత్స్యంబీ నృసింహక్షమా
తలనాథాగ్రణి యేసెనంచు విని తద్వంశాధిపుం బట్టినన్
సలిలచ్ఛాయగుణించి యేయునని యంచద్భీతి మార్తాండునిన్
బలిమిం బట్టఁడు వేగ రాహు విధునిం బైకొన్న చందంబునన్

—పై గ్రంథము II ఆ. 129 ప.

3. ఉ॥ భూరిభుజాప్రతాప గుణభూషణ ! యోబయ నారసింహ ! నీ
దారు యశోవధూమణికి సారసవైరి ముఖంబు ! తారకల్
సారనఖాంకురంబు; లల శంకరశైల హిమాద్రు లాత్మ వ
క్షోరుహముల్; సితాబ్జములు సొంపగు లోచన పంకజాతముల్.

—పై గ్రంథము II ఆ. 125 ప

4. చ॥ అరిపురభంజనోజ్జ్వల బలాధిక ! శ్రీ నరసింహరాజ శే
ఖర ! భవదీయకీర్తిరుచి గంగ యనంగఁ జెలంగుఁ బొంగుచున్
హరిపద సంగ సంకలితయై భువనత్రయపూర్ణయై నిరం
తరతరహంసజాంఘ సముదాయ సమన్వితయై వసుంధరన్.

—పై గ్రంథము II ఆ. 127 ప.

**స్వాప్నము :** చూ. సుప్తి.

**స్వాభావజములు :** వివరములకు ముందు చూ. అలంకారములు. దశరూపకము ననుసరించి స్వభావజములయిన అలంకారములు పది :- (1) లీల (2) విలాసము (3) విచ్ఛిత్తి (4) విభ్రమము (5) కిలికించితము (6) మోట్టాయితము (7) కుట్టమితము (8) బిబ్బోకము (9) లలితము (10) విహృతము.

పై పదింటికి క్రొత్తగా మరి యెనిమిది అలంకారములను సాహిత్యదర్పణకర్త చేర్చెను. క్రొత్తగా చేర్పబడినవి :- (1) మదము (2) తపనము (3) మౌగ్ధ్యము (4) విక్షేపము (5) కుతూహలము (6) హసితము (7) చకితము (8) కేళి.

వివరములకు, ఉదాహరణములకు ఆయా శీర్షికలను చూడుడు.

**స్వేదము :** వివరములకు ముందు చూ. సాత్త్వికభావము. సాత్త్వికభావము లెనిమిదింటిలో నొకటి. ఇది అనుభావము (చూ. అనుభావము).

స్వేదమునకు నిర్వచనములు :- (1) "వపుర్జలోద్గమః స్వేదః రతిఘర్మ శ్రమాదిభిః" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 267 పేజీ 5 సంఖ్య, సా. ద. 138 పేజీ). రతివలన, వేడివలన, శ్రమవలన శరీరము నుండి వెడలు నీరే స్వేదము. భయంకరదర్శనము, ఆకస్మిక దుర్ఘటనము మొదలైనవానివలనకూడా స్వేదము కలుగును (కా. లం. సం. 338 పేజీ) (2) "చెమట స్వేదము" అని నరసభూపాలీయము.

స్వేదమునకు నరసభూపాలీయమునుండి యుదాహరణము :- 'చతుస్సముద్ర ముద్రితమైన భూమినంతటిని మోయుచున్న నరసభూపాలుని మనస్సులో వహించుటవలన కాబోలు ఆ యువతి మేను చెమర్చెను. కాక

మన్మథాస్త్రములు నిరంతరము మీదపడగా పుట్టిన అగ్నిజ్వాలలచేతనేమో ఆమె శరీరము చెమర్చెను?' చం "సతికిఁ జెమర్చె మేను జలజాతదళాక్షి చతుష్సముద్రముద్రిత వసుధాధురంధరుని శ్రీ నరసింహుని భావవీధిలోఁ బ్రబలిదిన మున్ వహించు నతి భారము వంకనొ ? కాక సంతతాపతదసమాస్త్ర శస్త్రభవపావక కీలల వేడివంకనో ?" -(కా, అం, సం. III-42) ఇందు యువతికి శ్రమువలన స్వేదము కలిగినది,

హర్షము : దీనిని 'ముదము' అని కొందరనిరి, వ్యభిచారిభావములందొకటి (చూ. వ్యభిచారిభావము).

నిర్వచనములు :- "ప్రసత్తి రుత్సవాదిభ్యో హర్షోఽశ్రుస్వేదగద్గదాః" అని దశరూపకము (ధ. ద. రూ. నాలుగవప్రకా. 60 పేజి 16 సం). ఉత్సవాదులవలన కలుగు ప్రసత్తి హర్షము. అశ్రువు, స్వేదము, గాద్గద్యము అనుభావములు. (2) "ప్రసత్తి రుత్సవాదిభ్యో హర్షః స్వేదాశ్రుకంపకృత్" అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. రసప్రక. 279 పేజి 15 సం.). ప్రియాగమనము, పుత్రజననము మొదలైన ఉత్సవాదులవలన కలుగు మనః ప్రసాదము హర్షము. స్వేదము, అశ్రువు, కంపము మొదలయినవాని కిది కారణము. (3) "హర్షస్త్విష్టావాప్తేర్మనః ప్రసాదోఽశ్రుగద్గదాదికరః" అని సాహిత్యదర్పణము (సా. ద. III-152 పే. 165 శ్లో.). ఇష్టప్రాప్తి వలన కలుగు మనః ప్రసాదము హర్షము. అశ్రువు, గాద్గద్యము దాని కార్యములు. (4) "ముదమిష్టలాభభవ సమ్మదమగు" అని (III-79 ప.). నరసభూపాలీయము. (5) దేవభర్తృగురుస్వామి ప్రసాదః ప్రియసంగమః । మనోరథాప్తి రప్రాప్య మనోహర ధనాగమః । తథోత్పత్తిశ్చ పుత్రాదే ర్విభావోయత్ర జాయతే । నేత్రవక్త్రప్రసాదశ్చ ప్రియోక్తిః పులకోద్గమః । అశ్రుస్వేదాదయశ్చానుభావా హర్షం తమాదిశేత్" అని రసగంగాధరము (కా. లం. సం. III-363 పే. 26 సం.). దేవభర్తృగురుస్వామి ప్రభృతుల అనుగ్రహము, ప్రియసంగమము, కోరికలు తీరుట, అప్రాప్యుడయిన మనోహరుడు, ధనము మొదలయినవాని రాక, కుమారజననము మొదలయినవి విభావములు, కనులందు ప్రసన్నత, ముఖమునందు ప్రసన్నత, ప్రియమైన మాటలు, పులకలు పుట్టుట, అశ్రువులు, స్వేదము మొదలయినవి అనుభావములు కాగా వ్యక్తమగు చిత్తవృత్తి విశేషము హర్షము.

ఉదాహరణము :- దరిద్రుడు నిధితోఁగూడిన కుంభముయొక్క ముఖమును చూచినట్లు చిరకాలమునకు పుత్రుని కనుగొనిన ఆ తండ్రి చంద్రోదయ సమయమున పొంగిన సముద్రునివలె సంతోషమువలన తన శరీరమందు తానే ఇముడలేకపోయెను. శ్లో "సమీక్ష్యపుత్రస్య చిరాత్పితా ముఖం నిధాన కుంభస్య యథైవ దుర్గతః । ముదా..శరీరే ప్రబభూవ

నాత్మనః । పయోధి రిందూదయ మూర్ఛితో యథా" (సా. ద. III-153 పేజి. 165 శ్లో. లక్ష్యము). ఇందు పుత్ర ముఖదర్శనము విభావము, పులకోద్గమాదులు అనుభావములు. హర్షము వ్యక్తమయినది.

**హసితము :** వివరములకు ముందు చూ. అలంకారములు. స్వభావజములైన అలంకారములందొకటి (చూ. స్వభావజములు. ఒక అనుభావము (చూ. అనుభావము). ఒక శృంగారచేష్ట (చూ. శృంగారచేష్టలు).

నిర్వచనములు :- (1) "ఆకస్మికంతు హసితం యౌవనాది వికారజం" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 303 పేజి 18 సం.). యౌవనము మొదలయిన వికారమువలన ఆకస్మికముగా పుట్టినది హసితము. 18 శృంగారచేష్టలందొకటి (చూ. శృంగారచేష్టలు). (2) "హసితం తు వృథాహాసోయౌవనోద్భేద సంభ్రమః" అని సాహిత్యదర్పణము (కా. లం. సం. 386 పేజి). యౌవనారంభమువలన అకారణముగా కలిగిన నవ్వు హసితము. 18 స్వభావజములందొకటి (చూ. స్వభావజములు). (3) "నవ్వుచు నలరుట హసితంబు" అని నరసభూపాలీయము (III-117 పద్యము). 18 శృంగార చేష్టలందొకటి.

ఉదాహరణము :- కం॥ "తలవని తలఁపుగ నవ్వెం । దలిరుంబోఁడి యిదియేలనా ? నిక్కముగా । నలరులవిల్తుండెక్కెను । చెలిమేనను రాజ్యమందు సింహాసనమున్" (కా. లం. సం. III-387 పేజి; సాహిత్యదర్పణము నందలి శ్లోకమునకు సన్నిధానంవారి తర్జుమా). శ్లో॥ 'అకస్మాదేవ తన్వంగీ జహాస యదియం పునః। మానం ప్రసూనబాణోఽస్యాం స్వారాజ్యమధితిష్ఠతి' (ఆం. సా. ద. తృతీయపరిచ్ఛేదము 62 పేజి 152 సం.).

**హావము :** వివరములకుముందు చూ. అలంకారములు. ఇది అంగజమైన అనుభావము (చూ. అనుభావము, చూ. అంగజములు). శృంగారచేష్టలలో ఒకటి (చూ. శృంగారచేష్టలు).

హావమునకు నిర్వచనములు :- (1) "హేవాకసస్తు శృంగారో హావోఽక్షిభ్రూవికారకృత్" అని దశరూపకము (ధ. ద. రూ. రెండవ ప్రకాశము 28 పేజి 52 సం.). కనులయందును, కనుబొమలయందును వికారమును కలిగించు అతిశయమైన అనురాగమే హావము. దశరూపకకర్త నాయికకు సత్త్వజములైన అలంకారములు ఇరువది యుండునని తెల్పి, అందు శరీరజములైన వానిలో 'హావము' రెండవదిగా పేర్కొనెను. (2) "ఈషద్దృష్టవికారః స్యాద్భావో హావః ప్రకీర్త్యతే" అని ప్రతాపరుద్రీయము (ఆం. ప్ర. రు. రసప్రక. 296 పేజి 2 సం.) భావమునందు కొంచెము వికారము కనిపించినచో అది హావము (చూ. భావము). 18

శృంగారచేష్టలలో హావమొకటిగా పేర్కొనబడినది. (3) భ్రూనేత్రాది వికారైస్తు సంభోగేచ్ఛా ప్రకాశకః భావ ఏవాల్ప సంలక్ష్య వికారో హావ ఉచ్యతే" అని సాహిత్యదర్పణము (కా. లం. సం. తృతీయ 375 పేజి 2 సం.). భ్రూ నేత్రాది వికారములచేత సంభోగేచ్ఛను తెలుపుచు అల్పముగా కనిపించు వికారముగల భావమే హావము. సాహిత్యదర్పణకర్త నాయికకు యౌవనమందు సత్త్వజములైన ఇరువదియెనిమిది అలంకారములుండుననియు, వానిలో హావము అంగజమైన అలంకారమనియు, అనుభావమనియు తెల్పెను. (4) "అది (భావము) ఈషద్ వ్యక్తముగా సుదతులయెడ హావమయ్యె" అని నరసభూపాలీయము III-87 ప.

హావమునకు నరసభూపాలీయమునుండి ఉదాహరణము :- 'ఆయువతి నృసింహగీతములు పాడును. కాని ఆ గీతములందు నృసింహనామమును మాత్రము సిగ్గువలన ఉచ్చరించుట మానుకొనును. పెద్దలెవరైన నరసభూపాలుని గుణములను మెచ్చుకొనుచున్నప్పుడామె పెద్దలసేవచేయుటకో అనునట్లు భక్తితో అక్కడికి చేరి ఆ ప్రశంసలను వినుచు తల వంచుకొనుచుండును. మధ్యమధ్య పరాకు వహించుచుండును.'' చం "పడఁతి నృసింహుగీతములు పాడెడి వేళ నృసింహునామమున్ । నుడువదు సిగ్గుతోఁ; గురుజనుల్. నరనాథు గుణప్రశంస లే । ర్పడ నొనరించుచో నుచితభక్తిమెయిన్ గురుసేవ సేయుకై । వడి వడి నాలకించుఁ దలవాంచుఁ పరాకగుఁ గొంత వింతగన్" (కా. లం. సం. III-97). ఇందామెభావము ఈషద్వ్యక్తమగుచున్నది కనుక హావము.

**హాసము :** వివరములకు ముందు చూ. స్థాయిభావము. నవ్వు అని సామాన్యార్థము. అలంకారశాస్త్రమునందు హాసము హాస్యరసమునకు స్థాయిభావముగా విఖ్యాతమయినది.

హాసమునకు నిర్వచనములు:(1)'వికృతాకార వాగ్వేష చేష్టాదేర్నకౌతుకాద్భవేత్ హాసో్య హాసః స్థాయిభావః.' అని సాహిత్యదర్పణము (తృతీయ పరిచ్ఛేదము). వికృతరూపము, వికృతములైనమాటలు, వికృతమైన వేషము, వికృతమైన చేష్ట మొదలైనవాని నభినయించిన నటులవలన కలుగు నవ్వునకు హాసమనిపేరు. (2) "వాగంగాది వికారదర్శనజన్మా వికాసాఖ్యోహాసః" అన్నది రసగంగాధరము (అం. ర. గం. 144 పేజి.). వాగ్వికారము (మాటలు) అవయవ వికారము (చేష్టలు) వంటి వికారములను చూచినప్పుడు పుట్టుచున్న మనోవికాసమే హాసము. వికారమన స్వభావవిరుద్ధమగు చేష్ట. (3) "చేకొని యక్రూరములగు నాకారవికారచేష్ట లాలోకింపన్ గైకొను మనోవికాస స్వీకారము హాసమయ్యె'' అని నరసభూపాలీయము (III-11 పద్యము).

హాసమునకు నరసభూపాలీయమునందలి యుదాహరణము :- నరస భూపాలుని దాడిని విన్న ముసల్మానుల వికృతచేష్టలిట్లున్నవి. నరసభూపాలు డడుగో మనమీద పడిపోవుచున్నాడని కేకలువేయుచు బరీదుడనుపేరుగల తురకరాజొకడు పారిపోవుచుండగా, అతని సేనాధిపతులు తొందరపడి గుఱ్ఱములమీద వెనుక ముందులుగా ఎక్కికూర్చొనిరి. అప్పుడు వారికి గుఱ్ఱముల తలలను శత్రువులు నరికివేసిరని అనిపించినది. ఇందు సేనాధిపతులు గుఱ్ఱములమీద నెక్కి కూర్చున్నతీరు వికృతముగా నుండుటచే మనకు నవ్వు కలిగించును. చం॥ "అదెయిదె వచ్చెవచ్చె నరసాధిపుదాడి యటంచుఁ జాళముల్ । బెదర బరీదుఁడేగునెడఁ బెంపటి ఖానులు వెన్కముందుగాఁ । గదిసి హయాళినెక్కి హయకంధరముల్ పొడగానకప్పుడే । చదిపిరి వాజిమస్తముల శత్రులటంచు భ్రమింతురెంతయున్." (కా. లం. సం. III-12)

*హాస్యరసము* : హాసము స్థాయిభావముగా గల రసము. ఇది నవరసములందొకటి (చూ. నవరసములు). (చూ. హాసము).

హాస్యరసస్వరూపమును సాహిత్యదర్పణము నిరూపించినది (సా. ద. III-175 పే. 214-216 శ్లో.). వికృతాకారము, వికృతవచనములు, వికృతవేషము, వికృతచేష్టలు మొదలైనవి ప్రదర్శింపబడినప్పుడు హాస్యరసము నిష్పన్నమగును. దీని వర్ణము శ్వేతము. ప్రమథుడు దీనికి దేవత. వికృతాకారాదులు కలిగి నవ్వు పుట్టించువాడే ఆలంబనవిభావము. వాని చేష్టలే ఉద్దీపనవిభావములు. అక్షి సంకోచము, వదనస్మితము మొదలైనవి అనుభావములు. హర్షము, అవహిత్థ, చాపల్యము, ఆవేగము వ్యభిచారిభావములు (చూ. కా. లం. సం. III-433 పే.).

అనుభావముల భేదములుబట్టి ఈ హాస్యరసము ఆరు విధములు (1) స్మితము (2) హసితము (3) విహసితము (4) అవహసితము (5) అపహసితము (6) అతిహసితము.

ఉదాహరణము :- ఆ వె 'చాకివానితోడ జగడాలు పడలేక । సిరిగ లోఁడు పట్టుచీరగట్టె । శివుఁడు తోలుగప్పె; సీయనిమదిరోసి । భైరవుండు చీర పాలవైచె" (సన్నిధానంవారు). ఇందు వికృత వేషధారణమున హాస్యము వ్యక్తమగుచున్నది (కా. లం. సం. III-433 పే.). (చూ. హాసము.)

*హృదయకవి* : కవియొక్క అవస్థలు పదియనియు అందు సహజప్రతిభునకును (చూ. సారస్వతుడు) ఆహార్య ప్రతిభునకును (చూ. అభ్యాసికుడు) పదవస్థలును, ఔపదేశికునకు (చూ. ఔపదేశికుడు) మూడవస్థలును నుండునని రాజశేఖరుడు కావ్యమీమాంసయందు పేర్కొనెను (కా. మీ. V-49 పే.). మొదటి పదింటిలో హృదయకవి యగుట రెండవ అవస్థ (మిగిలినవాని వివ

ములకు చూ. కావ్యవిద్యాస్నాతకుడు, అన్యాపదేశి, సేవిత, ఘటమానుడు, మహాకవి, కవిరాజు, ఆవేశికుడు, అవిచ్ఛేది, సంక్రామయిత).

"యో హృదయ ఏవ కవతే నిహ్నుతే చ స హృదయకవిః" అని రాజశేఖరుడు (కా. మీ. V-50 పే.). ఎవడు తన హృదయమ్మందే కవిత్వ మల్లి దాచుకొనుచుండునో అతడు హృదయకవి.

*హృదయసంవాదము* : "లోకమున ప్రియాప్రియుల పరస్పర స్నిగ్ధావలోకనములు, దరహాసములు మున్నగువానిని చూచి, వివేకముగలవ్యక్తి, వారి చిత్తవృత్తి రతిరూపమని యనుమానించును. మొదటనే సహృదయునిలో రత్యాది సంస్కారములు వాసనారూపమున నుండును. కావ్య నాట్యగత విభావాది ప్రతీతి కలుగునపుడు, సహృదయుని హృదయమున ఆయా విభావాదులకు నాకారములుగల చిత్తవృత్తు లుదయించును. ఇట్లు సమరూప చిత్తవృత్త్యుదయమే హృదయ సంవాదము. సహృదయత్వమే హృదయ సంవాదమని తాత్పర్యము (ఆచార్య కె. వి. ఆర్. నరసింహము : సాహిత్యదర్శనము 166 పేజి).

చూ. సహృదయుడు, వాసన,

"ఒకరు నిరూపించిన భావము తనకును పరిగ్రాహ్యమై స్పంద మొదవించినచో నా భావముతో తనకు హృదయ సంవాదము కలుగును." —శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ : ధ్వనిసారః 88 పేజి).

*హేల* : వివరములకు ముందు చూ. అలంకారములు. ఇది అంగజమైన అనుభావము (చూ. అనుభావము., చూ. అంగజములు.) శృంగారచేష్టలలో ఒకటి (చూ. శృంగారచేష్టలు).

'హేల' కు నిర్వచనములు :- "సా ఏవ హేలా సువ్యక్త శృంగార రససూచికా" అని దశరూపకము (ధ. ద. రూ. రెండవప్రకాశము. 28 పేజి 58 సం.). శృంగారరసమును సువ్యక్తముగా సూచించు భావమే హేల. దశరూపకకర్త నాయికకు సత్త్వజములైన అలంకారములు ఇరువది యుండునని తెల్పి అందు శరీరజములైన వానిలో హేల నొకదానినిగా పేర్కొనెను. (2) "సువ్యక్త విక్రియోభావః హేలేతి ప్రతిపాద్యతే" అని ప్రతాపరుద్రీయము (అం. ప్ర. రు. రసప్రక. 296 పేజి. 8 సం.) భావమునందు వికారము చక్కగా కనిపించినప్పుడది హేల (చూ. భావము, హావము). 18 శృంగార చేష్టలలో హేల ఒకటి. (3) "హేలాత్యంత సమాలక్ష్య వికారః స్యాత్ సఏవతు" అని సాహిత్యదర్పణము (సా. ద. తృతీయ 122 పేజి 95 సం.). భావమునందు అత్యంతముగా వికారము కనిపించినచో నది హేల. సాహిత్యదర్పణకర్త నాయికకు యౌవనమందు సత్త్వజములైన

ఇరువదియెనిమిది అలంకారములుండుననియు, వానిలో హేల అంగజమైన అలంకారమనియు, అనుభావమనియు తెలిపెను. (4) "సువ్యక్తంబై పొదల్పిన ననవరతంబును నది (భావము) మిక్కిలి హేల యయ్యె" అని నరసభూపాలీయము (III-86 పద్యము).

'హేల' కు నరసభూపాలీయమునుండి ఉదాహరణము :- 'పరిహాసము లాడుచు చెలికత్తెలందరును ఆ నాయిక చుట్టునుచేరి 'నీవు నరసభూపాలుని పెండ్లియాడెదవా' అని యడిగిరి. ఆ ప్రశ్న వినగానే ఆమె శరీరము గగుర్పొడిచినది. మాటరాలేదు. సిగ్గు చుట్టుముట్టినది కాబోలు.' ఉ। "మేలము లాడుచుంగడు సమేళములై చెలులెల్లఁగూడి యో। బాలిక! శ్రీ నృసింహ నరపాలు వరించెదవే యటన్న నీ। లాలక యంగవల్లిఁ బులకాంకురముల్ ననలొత్త నేమనం జాలక యూరకుండె ననిశంబు త్రపావృతయైన కైవడిన్" (కా. లం. సం. III-99.) ఇందామె మనోవికార మత్యంతము వ్యక్తమగుటచే హేల.

# 2
# నాటక విభాగము

*అంకకాలపరిమితి :* ప్రదర్శన విషయమున, అంకమునకు కొంత కాలపరిమితిని నిర్దేశించిరి. ఒకదినములో జరిగిన కథను ప్రయోజన బీజానుసారముగా, అవశ్యకమైన కార్యములన్నియు కలసి వచ్చునట్లుగా చూచుకొని ఒక అంకములో నిబంధించవలె. క్షణ, యామ, ముహూర్తములచే దినము విభక్తమై ఉండును. సంధ్యావందనాది ముఖ్య కార్యక్రమములను సూచించుచు వివిధ కార్యసన్నివేశములకు తగినట్లుగా అంకమును ప్రదర్శించవలె. ఒకనాడు జరిగిన కార్యమును అంకములో ప్రదర్శించుటకు వీలుపడనిచో, అంకమును ముగించి మిగిలిన సన్నివేశమును ప్రవేశకాదులచే ప్రదర్శించవలె. ఒక కార్యమునకు మరొక కార్యమునకు మధ్య ఎన్ని దినములైన ఎన్ని సంవత్సరములైన గడవవచ్చు. మొత్తము కథలో ముఖ్యమైన కార్య దినములు మాత్రమే ఆయా అంకములలో ప్రదర్శించుటకు ఎన్నుకోవలె. ఉదా రామాయణ కథను ముఖ్యమైన అయిదు కార్యదినములలో ప్రదర్శింప దలచినచో 5 అంకముల నాటకము, 10 కార్యదినములను ఎన్నుకొనినచో 10 అంకముల నాటకము రచించుటకు వీలగుచున్నది (నా. శా. 18-పు. 515-17).

*అంకము* [1] *:* నాటక ఇతివృత్త విభాగము. కథా (వస్తు) సంబంధమైన అవాంతర భాగమును ముగించుటకొరకుగాని, విశ్రాంతికొరకుగాని చేసిన విభజన. ఒకే కార్యావస్థను రెండంకములలో నిబంధించుట, కార్యావస్థలకు ఉపక్రమ, ఉపసంహారములు రెంటిని కల్పించుట చూపవలసివచ్చును. కావున 'నాటక-ప్రకరణములు, 5-10 అంకముల వరకు విస్తరించును. బీజ (నిష్పత్తి) సహితమైన ఆరంభావస్థ పరిపూర్ణమైనచోట అనగా బీజసంహారము జరిగినచోట వెంటనే మొదటి అంకమును ముగించవలె. మొదటి అంకములో పాత్రల చరిత్ర (ప్రవేశకాదులతోకాక) ప్రత్యక్షముగా ప్రదర్శితము కావలె. ఇది నానా భావ, రసోపేతము కావచ్చు. సుదీర్ఘము కారాదు. పాత్రలన్నియు అంకాంతమున నిష్క్రమించవలె (నా. శా. 18-పు. 518-17). అంకములో నాయకుడు ఆసన్నుడై ఉండవలె. 3 లేదా 4 పాత్రలుండవచ్చు. 'పతాక' సూచితము కావలె. ఆదిలో బీజము అంతమున బిందువు సూచితము కావలె. ప్రవేశకాదులతో నిర్వహించవలె (ద. రూ. 3-36-37). రచన సరళమైన

గద్యశైలిలో ఉండవలె. పద్యములు ఎక్కువగా ఉండరాదు. ప్రత్యక్షచిత్ర చరిత్రలతో కూడినదిగా ఉండవలె.

ప్రదర్శనలో నిషేధములు : దూరముగా ఉన్నవారిని కేక వేయుట, వధ, యుద్ధము, రాజ్యదేశాది విప్లవము, వివాహము, భోజనము, మలినము లైన పనులు, లజ్జాకరములైన పనులు, స్నాన, శయన, అధరపానాదులు. (సా. ద. 6. పు. 134).

త్రివిధ అంగములు : (1) చూలికాంకము :- ఒకానొక అర్థము పాత్ర ప్రయత్నమువలన లభించకున్నను ఇతరులవలన ప్రాప్తించుట. (2)అవతారాం కము :- అన్ని అంకముల బీజభూతమగు అర్థమును సమ్మిళితముగా ఒకే చోట చూపుట. (3) అంకముఖము :- ఇతివృత్తమును అతిక్రమించు ఉద్దేశముతో ఒక అంకముచివర రాబోవు అంకము యొక్క కథను నిబంధించుట. (ఈ విభజన కోలాహలాదులు చేసినదట) (నా. శా. 18-పు. 513-15).

***అంకము*** [2] ***:*** దశవిధరూపకములలో ఒకటి. చూ ఉత్సృష్టికాంకము.

***అంకముఖము :*** అర్థోపక్షేపకములు ఐదు. వాటిలో ఒకటి. చూ. అంకాస్యము.

***అంకసంఖ్య :*** నాటకము, ప్రకరణము ఈ రెండు రూపకములలో 5-10 వరకు అంకములు ఉండవచ్చు. 5 కంటె తక్కువ అంకములుండు రూపకములున్నవి. చూ. నాటిక, డిమము, సమవకారము, ప్రహస నము, ఈహామృగము, వ్యాయోగము మొ (నా. శా. 19-పు. 591). అయి దంకముల నాటకము చిన్నది. పది అంకముల నాటకము పెద్దది; మహా నాటకము (ద. రూ. 3-38).

***అంకావతారము :*** అర్థోపక్షేపకములు ఐదు వాటిలో ఒకటి. అంకాంతములో గల కథ తరువాతి అంకములో కొనసాగుట, ఇట్లు కొనసాగుకథ ప్రయో గము ననుసరించి బీజార్థయుక్తి యుక్తముగ నుండుట. దీనినే అంకావతారము అందురు. ఒక అంకము ముగియుచుండగా విరామము లేకుండ ముందు అంకము ఆరంభమగుట అంకావతారము/అంకావతరణము (ద. రూ. 1-62).

***అంకాస్యము :*** అర్థోపక్షేపకములు ఐదు. వాటిలో ఒకటి. అంకాస్యమునకే మరొక పేరు అంకముఖము. రాబోవు అంక ప్రారంభములో జరుగుకథ ఈ (జరుగుచున్న) అంకము చివర (స్త్రీ పాత్రచే గాని, పురుషపాత్రచే గాని) సూచితమగును. కావున ఇది అంకముఖము అయినది (నా. శా. 19-పు. 580). అంకము చివర నిష్క్రమించుచున్న పాత్రలు, విడిపోయిన కథను, రాబోవు అంకములోని కథను అతుకునట్లుగా సూచించిపోవుట అంకాస్యము (ద. రూ. 1-61).

***అంతర్నాటకము :*** చూ. గర్భాంకము.

***అక్షరసంఘాతము :*** చూ. అక్షరసంహతి.

***అక్షరసంహతి :*** (అక్షర సంఘాతము) నాట్య (నాటక) మునకు భూషణప్రాయ ములైన 36 లక్షణములలో ఒకటి. అ. గు. ని ఉపజాతి వృత్తపాఠము

ప్రకారము పరస్పర సమ్మిశ్రితములైన అల్పాక్షరములచే విచిత్రార్థవర్ణనము చేయుటను 'అక్షరసంహతి' అనిరి (పేరు, నిర్వచనము, అనుష్టుప్ పాఠములో కూడా ఇట్లే ఉన్నది). (నా. శా. 16-పు. 143).

*అజ్ఞాతయౌవన* : నాయిక, దశాభేదము. చూ. ముగ్ధ.

*అతిశయము* : నాట్య (నాటక) మునకు భూషణప్రాయములైన 36 లక్షణము లలో ఒకటి. అ. గు. ని ఉపజాతి వృత్తపాఠము ననుసరించి: కొంత విషయమును చెప్పి చెప్పుట కలవిగాని విశేషమింకను కలదని సూచించు టను 'అతిశయము' అనిరి (అనుష్టుప్ వృత్తపాఠములోని అతిశయనిర్వచన మునకు ఇది భిన్నమైనను సమన్వితమైనది: సర్వజన సాధారణములగు గుణము లను మొదట కీర్తించి, పిమ్మట విశేషమును చెప్పుటను 'అతిశయము' అనిరి) (నా. శా. 16-పు. 445).

*అధిబలము* [1] : గర్భసంధికిగల 13 అంగములలో ఒకటి. కపటముచే వంచించుట అధిబలము (నా. శా. 19-పు 574). కార్యసిద్ధికొరకు యుక్తిగా, అతివినయ ముగా మోసగించుటయే అధిబలము (ద. రూ. 1-40) మిషతో అభి ప్రాయము తెలిసికొనుట అధిబలము.

ఉదా:- 'రత్నావళి'లో కాంచనమాల :- 'భట్టినీ! ఇదియే ఆ చిత్ర శాల, వసంతునికి సంజ్ఞ చేసెదను' మొ (సా. ద. 6-పు. 161).

*అధిబలము* [2] : వీథ్యంగములు 13. వాటిలో ఒకటి : స్వపక్షబలమును సాధించు టకు ఉక్తి-ప్రత్యుక్తులు రెంటిని సాగించుటను అధిబలము అందురు (నా. శా. 18-పు. 580). ఇరువురు తమ ప్రసంగములో ఒకరినొకరు మించుటకు ప్రయత్నించుట అధిబలము (ద. రూ. 3-18). ఉదా వేదం వేంకటరాయ శాస్త్రి రచించిన ప్రభావతిలో వజ్రనాభుడు 'ఈ గదతో అవలీలగా వీని యురమును చదిపి ఇదె ఇపుడు మీ రెండు లోకములను నిర్మూలించెదను' అన్న సందర్భము.

*అధీర* : చూ. ధీర మొ నాయికలు.

*అనుకరణము* : నాట్యము (నాటకము) 'లోకవృత్తానుకరణము' అని చెప్పిన దానికి యథాతథముగా ప్రదర్శించుట అని అర్థము చెప్పరాదు. లోక వృత్తము ఆధారముగా వినోదజనకముగా చేసిన కూర్పుమాత్రమే కళాత్మక మైన అనుకరణ అగును (నా. శా. 1-పు. 22-23). ఉదా॥ లోకములో ఒకడు మరొకని చావబాదు సన్నివేశము చూచినప్పుడు ప్రేక్షకులలో కొందరికి సంతోషము; కొందరికి రోషము, ద్వేషము; మరికొందరికి జాలి (కరుణ) కలుగవచ్చు. నాటకములోగాని, శ్రవ్యకావ్యములోగాని అట్టి అవస్థను చూచినప్పుడు, విన్నప్పుడు నటులుగాని కవిగాని, సహృదయులకు ఏ అవస్థను ప్రధానముగా కల్పింప నుద్దేశింతురో ఆ అవస్థకు సంబంధించిన రసప్రతీతియే కలుగును. లౌకికమైన వాస్తవ సన్నివేశమునకు, కళాత్మక మైన అనుకరణకుగల భేదమిది. పాశ్చాత్యులుకూడా ఇట్లే వ్యాఖ్యానించిరి.

(1) సర్వభావానుకీర్తనము (2) సప్తద్వీపానుకరణము (3) హితోపదేశ జనకము (4) విశ్రాంతిజనకము (5) వినోదజనకము అయిన కావ్యనాటక కళను ఇట్లు గ్రహించవలె.

**అనుకూలుడు :** నల్గురు శృంగారనాయకులలో ఒకడు: ఏకనిరతుడు అనగా ఒకే నాయికయందు ఆసక్తుడైనవాడు (సా. ద. 3-36). ఉదా శ్రీరాముడు. చూ. నాయకులు

**అనుక్తసిద్ధి :** నాట్య (నాటక) మునకు భూషణప్రాయమైన 36 లక్షణములలో ఒకటి: చూ. పరిదేవనము.

**అనుచారిక :** అభ్యంతర (రాజాంతఃపుర) పరివారములలో ఒకతి. నేర్పరురాలు, రాజు కుడిపక్కన వుండి ఉపచారములు అరయునది (నా.శా. 24-పు. 707).

**అనునయము :** నాట్య (నాటక) మునకు భూషణప్రాయములైన 36 లక్షణ ములలో ఒకటి. చూ. అనువృత్తి.

**అనునీతి :** నాట్య (నాటక) మునకు భూషణప్రాయములైన 36 లక్షణములలో ఒకటి. అ. గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము: అపూర్వ క్రోధ జనకమైన అపరాధమును తొలగించుటకై మధుర వాక్యములను పల్కుటను అనునీతి అనిరి (ఇది అనుష్టుప్ వృత్తపాఠములోని 'ప్రసిద్ధి'తో భిన్నమైనను సమన్వితమైనది. లోకప్రసిద్ధములును సాతిశయములును అయిన బహువాక్యములతో వాక్యార్థమును సాధించుటను ప్రసిద్ధి అందురు). (నా.శా. 16-పు. 449).

**అనుబంధములు :** చూ. అనుసంధులు.

**అనుమానము :** గర్భసంధికిగల 13 అంగములలో ఒకటి. ప్రత్యక్షమైన రూపము ఆధారముగా తదనురూపమైన ఇంకొకదానిని ఊహించుటను అనుమానము అనిరి (నా. శా. పు. 19-574). ఒక ముఖ్య చిహ్నమునుచూచి ఆ చిహ్న ముతో నియత సంబంధముగల విషయమును ఊహించుట. ఆ ఊహయే అను మానము (ద. రూ. 1-40).

**అనురక్త :** ఒక నాయిక నాయకునియందు మిక్కిలి అనురక్తిగల స్త్రీ. అతని గుణములను సఖులకు చెప్పునది. అతనికై స్వీయధనమును వెచ్చించునది, అతని మిత్రులను గౌరవించునది, శత్రువులను ద్వేషించునది, అతనికొరకు సస్నేహముగా నిరీక్షించునది, అతని చుంబనమునకు ప్రతిచుంబన మిచ్చునది, అతనికంటె ముందే మేల్కొనునది, అతని సుఖదుఃఖములలో పాలుపంచు కొనునది. వీటికి విరుద్ధమైన గుణములు చూపునది విరక్త. అనురక్త, విరక్త ఈ నాయికలను నా. శా. మాత్రమే ప్రస్తావించినది (నా. శా. 23-పు. 692).

**అనువృత్తి :** నాట్య (నాటక) మునకు భూషణప్రాయములైన 36 లక్షణము లలో ఒకటి. అ. గు. అనుసరించిన ఉపజాతివృత్తపాఠము ప్రకారము: స్నేహమువలనగాని, దాక్షిణ్యమువలనగాని, అర్థసంయుక్తముగా వినయ

ముతో పరులను అనువర్తించుటను "అనువృత్తి" అనిరి (ఇది అనుష్టుప్పు పాఠము 'అనునయము' అనుదానికి భిన్నమైనను సమన్వితమైనది. "విరుద్ధమైన అభినివేశముగల ఇరువురకు ప్రీతి కలిగించునది, అర్థసాధకమగునది అయిన వాక్యమును" అనునయము అనిరి (నా. శా. 16. పు. 449).

*అనుశయాన* : నాయిక, అంతర్భేదము. చూ. పరకీయ.

*అనుసంధులు* : ప్రధానకార్యమును అనుసరించి ఉండెడి ఇతర సంధులు అను సంధులు లేదా అనుబంధములు. ప్రాసంగికేతివృత్తమున ('పతాక'యందు) ఒకటి లేదా అంతకు మించి ప్రధానార్థమును అనుసరించి ఉండు సంధులు ఇవే. వీటినే అనుసంధులు (అనుబంధములు) అనిరి. పతాకానిబంధనము పరార్థమే అగుటచే అది గర్భసంధివరకు లేదా విమర్శ=అవమర్శ సంధివరకు మాత్రమే వ్యాపించి ఉండును. ప్రధాన ఫల ప్రాప్తిలో పతాకానాయకుడు భాగస్వామి కారాదని భావము (నా. శా. 19-పు. 569).

*అనూఢ* : నాయికాభేదము, కన్యక, అనూఢ. చూ. పరకీయ-భేదములు.

*అన్యా* : నాయికాభేదము. చూ. పరకీయ-భేదములు.

*అన్యథాకల్పనము* : రసపోషణకొరకు కవి చేసిన మార్పులు, కూర్పులు, చేర్పులు (శాకుంతల నాటకములో కవి కల్పించిన దుర్వాసుని శాపకారణము మొ) అన్యథాకల్పనములు అగుచున్నవి (నా. శా. 19-పు. 589). మూల కథను అవసరము కొలది కూర్చిగాని, విడిచిగాని, నాటకమును రచించవచ్చు (ద. రూ. 3-24).

*అన్యసంభోగదుఃఖిత* : నాయికాభేదము. చూ. త్రివిధనాయికలు-ప్రకారాంతరములు.

*అపటీక్షేపము* : పటీక్షేపము లేదా పటాక్షేపము. ఏ సూచన లేకుండా పాత్ర తత్తరపాటుతో తెరను తోసుకొని ప్రవేశించుట.

*అపవాదము* : విమర్శసంధికిగల 13 అంగములలో ఒకటి: దోషమును వెల్లడి చేయుటను అపవాదము అందురు (నా. శా. 19-పు. 575). ఏవిధముగానైనను దోషమునే వెల్లడి చేయుట అపవాదము (ద రూ. 1-45). ఉదా 'వేణీసంహారము'లో 'దురాత్ముడు, పాతక ప్రధానహేతువు' అయిన దుర్యోధనుడు దొరికినాడని పాంచాలుడు యుధిష్ఠిరునితో చెప్పుసన్నివేశము (సా. ద. 6. పు. 161).

*అపవారితకము* : ఆకాశవచనాదులైన అపకారితములలో ఒకటి: ఇతరులకు వినబడకుండ ఒక్కనికే చెవిలో చెప్పుటను అపవారితకము అందురు (నా. శా. 25 పు. 725). తక్కిన పాత్రలను వెనుకకు విడిచి ఒకరితోనే రహస్యముగా ప్రసంగించుట అపవారితము (ద. రూ. 1-66). నటులకు కొంచెము దూరముగా పోయి రహస్యముగా మాట్లాడుట అపవారితకము. దీనికిని త్రిపతాక హస్తము పట్టుదురు. ప్రేక్షకుల సమీపమునకు జరిగి త్రిపతాక హస్తముతో

చేయు సంభాషణము 'జనాంతికము'. ఇవి 'అశ్రావ్యము'లని మెల్లగా మాట్లాడరాదు. సహజముగానే సంభాషించవలె.

**అపవారితములు** : నాట్యధర్మము నపేక్షించి సాగిపోవు వస్తువు తిరిగి మూడు విధములైనది. (1) శ్రావ్యము (అందరు వినతగినది) (2) అశ్రావ్యము (అందరు వినదగనిది) (3) నియతశ్రావ్యము (కొందరు మాత్రమే వినదగినది) (ద.రూ. 1-63). చూ. ఆకాశవచనము, ప్రకాశము, ఆత్మగతము (స్వగతము), జనాంతికము, అపవారిత (క) ము, కర్ణోక్తము.

**అభినయము** : అభినయము నటవ్యాపారము. అభినయమువల్లనే నాట్యము కళ అయి, వాస్తవికమైన లోకమునుండి వేరుపడుచున్నది. ఇది నాట్య సంశ్రయమేకాని లోక సంశ్రయముకాదు. ప్రయోగసమయములో నటులు అభినయములతో రూపకములోని అర్థములను సామాజికులకు హృదయగోచరము చేయుదురు. కాబట్టి నాట్యమనగా- వట్టి నాటక రచనమాత్రమేకాదని- రూపక ప్రయోగమని స్పష్టమగుచున్నది. సర్వ ప్రకృతులను అభినయము ద్వారా వ్యక్తము చేయువారు నటీనటులు (అభినేత్రి - అభినేత).

అభినయము 4 విధములు : సర్వప్రకృతులను అభినయించు నటుల వ్యాపారములు 4 విధములు. వీటిలో (1) సాత్త్విక (2) వాచిక (3) ఆంగిక అభినయములు ఈ మూడు మనో-వాక్-కాయసంబంధమైన చేష్టలు ఆధారముగా ఏర్పడినవి. నాలుగవది అయిన ఆహార్యాభినయము ఈ మూడింటిలో అంతర్గతమై ఉన్నది (ఆహార్యాభినయమనగా వేషధారణాదులు).

అభినయప్రయోజనము : రూపకార్థములను సామాజికులకు సువ్యక్తముచేయుట, అనగా సామాజికులలో రసోత్పత్తిని కలిగించుట అభినయ ప్రయోజనము.

అభినయనిర్వచనము : రసభావాది వ్యంజకమైన చేష్టావిశేషమే అభినయము (మల్లినాథసూరి- కిరా. 10-42).

'నీ' ధాతువునకు నడిపించు అను అర్థముకూడ ఉన్నది. నడిపించువాడు అభినేత (నటుడు), నడచువారు సామాజికులు (తాడిపత్రి రాఘవాచార్యులు).

అభినయవస్తువులు 3 : ఇచట వస్తువనగా అభినయమందుపయోగించు అంగాదులు లేదా పద్ధతి. (1) శాఖ: ఇందు హస్తాభినయము ప్రధానము (శారీరాభినయములోని భాగము). (2) అంకురము: ఇందు దృష్టివ్యాపారము ప్రధానము. అర్థసూచనా రూపమగుటచే దీనిని అంకురము అనిరి. (3) నృత్తము: కరణ, అంగహార నిష్పన్నమైనది. చేష్టాకృతమగు ఆంగికాభినయములో ఇది ఒక భాగము (విశేషములకు చూ. నా. శా. పు. 285-86, 714, 737 మొ ).

**అభినేత** : పాత్ర, నటుడు, ప్రయోక్త, ప్రయోజకుడు, అభినేత ఇవి పర్యాయపదములు.

*అభినేత్రి :* నటి.

*అభిప్రాయము ;* నాట్య (నాటక) మునకు భూషణప్రాయములైన 36 లక్షణములలో ఒకటి: చూ. యుక్తి.

*అభిమానము :* నాట్య (నాటక) మునకు భూషణప్రాయములైన 36 లక్షణములలో ఒకటి: అ. గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము; ఒక అర్థమునకు వేరొక అర్థముతో ఉన్న సంబంధమును నిశ్చయముగా తెలిసియు, ఫలము విరుద్ధముగా ఉండుటచేత ఆ సంబంధమును అనేకవిధములైన యుక్తులతో శంకించుటను అభిమానము అనిరి. అనుష్టుప్ పాఠము సారూప్యముతో సమన్వితమైనది; "తానింతకుముందు చూచి, విని, అనుభవించియున్న విషయములను చెప్పుటచే కలిగిన సాదృశ్యము క్షోభజననము అనగా హృదయమందు స్థిరముగా నిలువనిది అగుటను సారూప్యము" అనిరి (నా.శా. 16-పు.444).

*అభివాదనాభినయము :* మానవులకు, దేవ, గురు ప్రముదలకు (ఎదుట ఉన్న వారికి లేనివారికి ఆయా నియమముల ననుసరించి) అభినయముతో చేయు అభివాదనము (చూ. నా. శా. 25-పు. 723).

*అభిసారణము :* అభిసారికలు (నాయకుని అభిసరించి పోవుస్త్రీలు) నాయకులకు చేయు కామోపచారము (నా. శా. 22-పు. 676).

*అభిసారిక :* శృంగారనాయిక. చూ. నాయికలు- అష్టవిధములు.

*అభూతాహరణము :* గర్భసంధికిగల 13 అంగములలో ఒకటి. కపటముతో కూడిన వాక్యము అభూతాహరణము (నా. శా. 19-పు 578). అప్రస్తుత ప్రసంగముచే ప్రస్తుతమును కప్పిపుచ్చుట అభూతాహరణము. ఉదా॥ రత్నావళినాటికలో వాసవదత్త వేషమున సాగరిక వత్సరాజు నభిసరించుట (ద. రూ. 1. 37). ఉదా అశ్వత్థామాంకము అను రూపకములో: యుధిష్ఠిరుడు అశ్వత్థామ హతిచెందెను అని స్పష్టముగా చెప్పి ఆ సత్యవచనుడే వాక్యసమాప్తిలో మెల్లగా ఏనుగు అని పలికెను (సా. ద. 6 పు. 158).

*అమాత్యులు :* రాజుకు ఉండవలసిన బాహ్య పరివారములో ఒక వర్గము. అమాత్యుల లక్షణములు: బుద్ధిమంతులు, నీతిసంపన్నులు, విక్రాంతులు, ప్రియంవదులు, అర్థశాస్త్రకుశలులు, ప్రజలయందనురక్తులు, ధార్మికులు. అయినవారు అమాత్యులుగా నియుక్తులు కావలె (నా. శా. 24 పు 710).

*అర్థప్రకృతులు-ఐదు :* కథాగమనములో ఐదు కార్యావస్థలు క్రమదశలుకాగా, ఐదు అర్థప్రకృతులు కథాగమనమునకు హేతువులగుచున్నవి. బీజము మొ॥ అర్థ ప్రకృతులు ఐదు యథావిధిగా కూర్చతగినవి. వీటి లక్షణములకు చూ. (1) బీజము (2) బిందువు (3) పతాక (4) ప్రకరి (5) కార్యము. నాయకుని బట్టి ప్రయోజనసిద్ధి నాశించి ఒక అర్థప్రకృతి విశేషమును ప్రధానముగా కూర్చవలె. తక్కినవి అక్కడ అప్రధానములగును. అర్థమనగా ఫలము. ప్రకృతి అనగా హేతువు, పాత్రల అవస్థలకు (ఫల) హేతువు లగునవి అర్థ

ప్రకృతులు. ఇవి ఇతివృత్తభాగములుగా తలచరాదు. అవస్థల హేతువులను అర్థప్రకృతులనిరి. ఇది ఆలంకారికుల పరిభాష. ముఖ్యములైన అర్థప్రకృతులు మూడే: (1) బీజము (2) బిందువు (3) కార్యము. ఇవి ఆధికారికేతివృత్తమునకు సంబంధించినవి. ప్రాసంగికేతివృత్తమునకు సంబంధించినవి రెండు: (1) పతాక (2) ప్రకరి. పతాక-ప్రకరులు లేని ఇతివృత్తములలో వీటి పనిని బిందువే సాధించుచుండును. బీజము, బిందువు, కార్యము ఈ మూడు ఇతివృత్తమంతయు వ్యాపించును. నాటకవ్యవస్థలో ఐదు అవస్థలు (కార్యావస్థలు: కథాగమనమునకు సంబంధించిన క్రమదశలు), ఐదు అర్థప్రకృతులు (అవస్థలకు లేదా కథాగమనమునకు హేతువులు), ఐదు సంధులు (కథలో ఏకసూత్రతకల సన్నివేశములు) గమనించదగినవి.

*అర్థాపత్తి :* నాట్య (నాటక) మునకు భూషణప్రాయములైన 36 లక్షణములలో ఒకటి: చూ. కార్యము.

*అర్థోపక్షేపకములు-ఐదు :* నాటక ఇతివృత్తము (కథ, వస్తువు) స్థూలముగా రెండు విభాగములు (1) సూచ్యము (ప్రదర్శనకు వీలుకాక సూచింపబడునది) (2) అసూచ్యము (ప్రదర్శించుటకు వీలైనది). ప్రదర్శనలో నీరసముగా ఉండు కథాభాగము లేదా ప్రదర్శించుటకు వీలులేని కథాభాగము సూచ్యము అగుచున్నది (సూచింపబడుచున్నది). ఈ సూచన ఐదు విధములు. వాటి లక్షణములకు చూ. (1) విష్కంభము (2) చూలిక (3) ప్రవేశకము (4) అంకావతారము (5) అంకముఖము. ఈ అర్థోపక్షేపకములను అన్నిటిని ఒకే రూపకములో తప్పక ప్రయోగించి తీరవలెనను నియమము ఎచ్చటను లేదు. అవసరము కానిచో మానివేయవచ్చు. చూ. రంగమున నిషిద్ధములు.

*అవపాతము :* ఆరభటీవృత్తికిగల 4 అంగములలో ఒకటి: సంతోషాతిశయముచే గాని భయాతిశయముచేగాని పాత్రలు శీఘ్రముగా ప్రవేశించుట, నిర్గమించుట-విద్రవముచేగాని, వినిపాతముచేగాని పాత్రలు ఆవేగ ప్రధానమైన చేష్టలు చేయుట ఇట్టిదానిని అవపాతము అనిరి (నా. శా. 20-పు. 619). ప్రవేశనము, త్రాసము, నిష్క్రమణము, హర్షము వీటితో కూడినది అవపాతనము. ఉదా కృత్యరావణము- అం-6: (ఖడ్గహస్తుడైన పురుషుడు ప్రవేశించి) అనునది మొదలుగా నిష్క్రమణ పర్యంతము (సా. ద. 6-పు. 172).

*అవమర్శసంధి :* విమర్శసంధికి మరొకపేరు. చూ. విమర్శసంధి.

*అవలగితము :* వీథ్యంగములు 13 అందులో ఒకటి: ఒకవిధమైన ప్రశ్నకిచ్చిన సమాధానము మరియొక కార్యము (అర్థము) సాధించుటను అవలగితము అనిరి. (నా. శా. 18- పు. 529). అవలగితము రెండు విధములు: (1) వెంట వెంట వచ్చిన రెండు కార్యములలో అనుకొన్నదొకటి, అనుసరించినది మరియొకటి అగుట. (2) ప్రస్తుతకార్యము అనుకొన్నట్లుకాక

ఇంకొకవిధముగ అది కొనసాగుట (ద. రూ. 3-14). 'ఆముఖము'నకు అంగమైన 'అవలగితము' కూడ ఇదే.

*అవస్థలు :* ప్రధానఫలము సాధించుటకొరకు నాయకునియందు కవి కల్పించిన వ్యాపారము క్రమముగా అయిదు అవస్థలలో విభక్తమైనది. ఈ పంచావస్థలను కార్యావస్థలు అనికూడ అందురు. ఇవి (1) ప్రారంభము (2) ప్రయత్నము (3) ప్రాప్తి సంభవము (4) నియతఫలప్రాప్తి (5) ఫలయోగము. నాటక కర్తలుగాని, ప్రయోక్తలుగాని వీటిక్రమమును తప్పించకూడదు. "ప్రధాన ఫలముపై దృష్టిని కేంద్రీకరించిన నాయకుని చిత్తవృత్తులే ఈ అవస్థలని గ్రహించవలెను. ఈ అవస్థలు తత్తదుచితములైన కాయిక-వాచిక-మనో వ్యాపారరూపములై ఉండును" అని నాట్యదర్పణము చెప్పినది (నా.శా. పు. 19-563)— ఈ అవస్థలపేర్లు వివిధ గ్రంథములందు కొంచెము రూపభేద ముతో కన్పించుచున్నవి. (1) ఆరంభము (2) యత్నము (3) ప్రాప్త్యాశ 4. నియతాప్తి 5. ఫలాగమము (ద. రూ-1.19). ఈ పేర్లే ప్రసిద్ధికెక్కినవి. చూ. కార్యావస్థలు.

*అవస్పందితము :* వీథ్యంగములు 13. వాటిలో ఒకటి: దైవికముగా వచ్చిన ఒక అర్థమును కప్పిపుచ్చి వేరొక అర్థము వచ్చునట్లుగా సమాధానము చెప్పు టను అవస్పందితము అనిరి (నా. శా. 18-పు. 529). అవస్యందితము అని ద. రూ. సా. ద. స్వరసమున చెప్పిన వాక్యమునకు వేరువిధముగా వ్యాఖ్యా నము చేయుట అవస్యందితము. ఉ। ఛలితరామము అను రూపకములో కుశ లవులు తమ తండ్రి శ్రీరాముడా? అని శంకించునపుడు శ్రీరాముడే మీ తండ్రి అని సీత వచించు సన్నివేశము (సా. ద. 6-పు. 197).

*అవస్యందితము :* చూ. అవస్పందితము.

*అష్టవిధనాయికలు :* చూ. నాయికలు—అష్టవిధములు.

*అసత్ప్రలాపము :* వీథ్యంగములు 13. వాటిలో ఒకటి: విద్వాంసులు చెప్పిన సమాధానము హితమైనదైనను ఛలము (మూర్ఖత) వలన మూర్ఖుడు దానిని హితముగా గ్రహించక పోవుటను అసత్ప్రలాపము అనిరి (నా. శా. 18. పు. 529)—సందర్భశూన్యమైన ప్రసంగమే అసత్ప్రలాపము (ద. రూ. 3-20). అసంబద్ధమైన మాటగాని, ప్రత్యుత్తరముగాని, మూర్ఖులు గ్రహిం పకపోయినను వారికి హితము చెప్పుటగాని అసత్ప్రలాపములు. ఉదా వేదం వేంకటరాయశాస్త్రి రచించిన 'ప్రభావతీ' రూపకములో ప్రద్యుమ్నుడు మామిడితీగవద్ద నిలిచిన సన్నివేశము (సా. ద. 6-పు.198).

*అనూచ్యము :* ఇతివృత్తము (కథావస్తువు) (1) సూచ్యము (2) అసూచ్యము అని రెండు విధములు. నీరసమైన ఇతివృత్తభాగములను ప్రదర్శించక సూచనచేయుదురు (చూ. అర్థోపక్షేపకములు). కావున ఆ భాగము సూచ్యము అనబడినది. సరసమైన ఇతివృత్త భాగములను అంకాదులతో ప్రద

ర్శింతురు. కావున ఇది అ+సూచ్యము(=ప్రదర్శనీయము) అనబడినది (నా.శా. 19-పు. 579).

*అంగికాభినయము :* నాల్గువిధములైన అభినయములలో ఒకటి అంగికాభినయము. ఇది మూడు విధములు: (1) శాఖ (2) అంగ (3) ఉపాంగ సహితము. ఈ మూడును వెరసి శారీర (శరీరజ) అభినయమైనది.

(1) శాఖాభినయము : శిరము, ముఖము, జంఘలు, ఊరువులు, పాణిపాదములు వీటివర్తనములు ఒకే భావమును వ్యక్తీకరించుటకు ఒకే కాలమున ప్రయుక్తమగుట: ఇందు హస్తాభినయమునకు అధిక ప్రాధాన్యము.

(2) అంగాభినయము : శిరము, హస్తములు, కటి, ఉరము, పార్శ్వములు, పాదములు ఈ ఆరు అంగములు అభినయము.

3. ఉపాంగాభినయము : నేత్రములు, కనుబొమలు, నాసిక, అధరము, కపోలములు, చిబుకము ఈ ఆరు ఉపాంగముల అభినయము.

ప్రత్యంగపదము నా. శా. లో ఉన్నది. జఠరము, జంఘలు, ఊరువులు ప్రత్యంగములు అని తరువాతి అధ్యాయములలో ఉన్నది. ముఖ్యాంగమైన చేతికి మోచేయి ప్రత్యంగము, వ్రేళ్ళు ఉపాంగములు. కంటికి కనుబొమ ప్రత్యంగము, కను రెప్పలు, గుడ్లు ఉపాంగములు. వీటి కదలికతో భావమును వ్యక్తీకరించుట అంగాభినయము. అంగాభినయములో దేహమంతయు వస్తువే అగుచున్నది (నా. శా. 8 - పు268).

*అకాశపురుషభాషితము :* చూ. ఆకాశవచనము.

*అకాశవచనము :* అపవారితములలో ఒకటి. దీనికే ఆకాశపురుషభాషితమని మరొకపేరు. రంగమున ప్రవేశించిన పాత్ర, రంగమున ప్రవేశించక దూరముగా ఉన్నపాత్ర ఎదుటనున్నట్లుగా ఉద్దేశించి ఆకాశమువంక చూచుచు ఏదో ప్రశ్న యడిగి దానికి సమాధానముగా "ఏమనుచున్నావు? ఇట్లనుచున్నావా? అని ప్రశ్నను ఉత్తరమును తానేచెప్పు ప్రకారము. నానాకారణ సంయుక్తములైన వాక్యములు, సంలాపములు ఇందుండును. వాచికాభినయమునకు సంబంధించిన చిత్రాభినయమిది (నా. శా. 25-పు. 724).

*అక్రందము :* నాట్య (నాటక) మునకు భూషణప్రాయములైన 36 లక్షణములలో ఒకటి. అ. గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము: సాక్షాద్వాచ్యము కాగూడని తీవ్రమైన అర్థమును చెప్పునపుడు సాదృశ్య యోజనముచే ఆత్మాభిప్రాయమును ఇతరులెరుగునట్లు ఉపన్యసించుటను అక్రందము అనిరి (ఇది అనుష్టుప్ వృత్తపాఠములోని 'తుల్యతర్కము'తో భిన్నమైనను సమన్వితమైనది: "తుల్యార్థములకు రూపకములను ఉపమలను ప్రయోగించి అప్రత్యక్షార్థమును గోచరింప చేయుటను తుల్య తర్కము అనిరి) (నా. శా. 16. పు. 446).

అక్షిప్తము : చూ. ఆక్షిప్తి.
అక్షిప్తి : క్షిప్తి, ఆక్షిప్తి పర్యాయములు; గర్భసంధికిగల 13 అంగములలో ఒకటి : హృదయస్థమైన రహస్యము ఏ కారణముచేతనైనను బయలు బడుటను 'ఆక్షిప్తి' అనిరి (నా. శా. 19-పు. 574). గర్భసంధిలోని బీజమును వ్యక్తముచేయుటయే ఆక్షేపము (ద. రూ. 1-42). క్షిప్తి ఉదా అశ్వత్థామాంకములో 'కేశగ్రహమున కొకటికే దారుణమైన విపాకము భూమిలో పేర్చుచున్నది. ఈ రెండవ కేశగ్రహముచేత ప్రజలు నిశ్చయముగా నిశ్శేషితు లగుదురు (సా. ద. 6-పు.160).
అక్షేపము : చూ. ఆక్షిప్తి.
అఖ్యానము : నాట్య (నాటక) మునకు భూషణ ప్రాయములైన 36 లక్షణములలో ఒకటి. అ. గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము: ప్రశ్నపూర్వకముగాగాని, అప్రశ్న పూర్వకముగాగాని ఒక నిర్ణయమును చేయుటను ఆఖ్యానము అనిరి (ఇది అనుష్టుప్ వృత్తపాఠములోని 'ప్రసిద్ధి' నిర్వచనమునకు భిన్నమే అయినను సమన్వితమైనది. "లోకప్రసిద్ధములును, సాతిశయములును అయిన బహువాక్యములతో వాక్యార్థమును సాధించుటను "ప్రసిద్ధి" అనిరి) (నా. శా. 16-446).
అత్మగతము : అపవారితములలో ఒకటి. దీనికే స్వగతమని మరొకపేరు. పాత్రలు మనస్సులో అనుకొనెడి మాటలు. ఆకాశవచనాదులైన వాచికాభినయ (చిత్రాభినయ) పద్ధతికి చెందినది (నా. శా. 25-పు. 725) అందురు. వినదగని మాట ఆత్మగతము (ద. రూ. 1-64).
అదానము : విమర్శసంధికిగల 13 అంగములలో ఒకటి: బీజకార్యము (బీజ ఫలము) సన్నిహితమగుట ఆదానమనబడును. అనగా ఫలము సమీపము నందుండుట (నా. శా. 19-పు. 575). ప్రధాన కార్యమున చేసిన కార్య కలాపమును వివరించుట. ఉదా। వేణీసంహారమున భీముడు దుర్యోధనుని తొడలు విరగగొట్టిన తర్వాత "రిపులు నేటితో సమరాగ్నిలో నిరవశేషముగ కాలిపోయిరి" అనుట ఆదానము (ద. రూ. 1-48). కార్యమును సంగ్రహించుట అనగా ఆయా కార్యములను సంగ్రహించి చెప్పుట ఆదానము. ఉదా। వేణీసంహారములో :- ఓహోయి శమంత పంచకచారులారా! నేను రాక్షసు డనుకాను భూతమునుగాను...' అను వచనము.
అధికారికము : ప్రధానమైన ఇతివృత్తము. వివేకవంతులైన కవులు ఇతివృత్తమును రెండు విధములుగా కల్పించవలె. (1) ఆధికారికేతివృత్తము (2) ప్రాసంగికేతివృత్తము. ముఖ్య ఫలప్రాప్తి సంబద్ధమగునట్లు సామర్థ్యముతో కవిచే పరికల్పితమైన ఆరంభము (అనగా జ్ఞానము, ఇచ్ఛ, ప్రయత్నము, క్రియ అను లక్షణములు గల ఫలవిషయికమైన కార్యము) ఆధికారిక మనబడును. ఫలప్రాప్తి అనగా ప్రధాన ఫలప్రాప్తి. ఈ ప్రధాన ఫలమును కవి తన ప్రయత్నము వలన ధీరోదాత్తాది నాయకులలో యోగ్యు

డైన వానికి సంబంధించిన దానినిగా కల్పించును. ఈ ఆధికారికేతివృత్తము ప్రాసంగికమునందును అంతర్లీనమై ఉండును. ఆధికారికమునకు ఉపకరణ ముగా కల్పించినది ప్రాసంగికము. ప్రఖ్యాతమైన వంశము, కీర్తి, గుణ ములుగల ధీరోదాత్త నాయకుని ఇతివృత్తము ఆధికారికమనబడినది (ద.రూ. 3-22,23).

ఆధికారికమనగా ఫలమందు స్వామ్యము, తత్స్వామి అధికారి, అతని ఇతివృత్తమును కవులు ఆధికారిక మందురు (సా. ద. 6).

*ఆనందము* : నిర్వహణ సంధికిగల 14 అంగములలో ఒకటి: అర్థము లన్నియు చేకూరుట ఆనంద మనబడును. కోరిక ఫలించుట వలన కలిగినది ఆనందము (నా. శా. 19 పు. 576). ఉదా వత్సరాజుకు రత్నావళి ప్రాప్తిరూప మైన ఆనందము (ద. రూ. 1-52).

*ఆపెరా* : నేటి పాశ్చాత్యుల నృత్యప్రకారములలో సుప్రసిద్ధమైనవి రెండు: (1) బాలేనృత్యము (Ballet-Dance) 2. ఆపెరా (Opera). ఆపెరా క్రీ.శ. 1597-98 ప్రాంతమున ప్రప్రథముగా ప్రదర్శితమైనది. ఇది మన యక్ష గానమువంటిదని చెప్పవచ్చు.

*ఆభ్యంతరనాట్యము* : లక్షణ సహితమైన నాట్యము: ఉద్భటము కానిది: సంభ్ర మాదులు లేనిది; అవిద్ధములైన అంగచేష్టలు లేనిది; లయ-తాల-కళా పాత ములచే నియతములైన అక్షరములుకలది. చక్కని పదములతో సంభాషణ ములతో కూడినది: పారుష్యరహితమైనది (నా. శా. 22-పు. 664). చూ. బాహ్యానాట్యము.

*ఆభ్యంతరపరివారము* : రాజాంతఃపుర పరివారములోని స్త్రీ జనులు 17 వర్గ ములు. చూ. (1) మహాదేవి (2) దేవి (3) స్వామిని (4) స్థాపిత (స్థాయిని) (5) భోగిని (6) శిల్పకారిక (శిల్పకారిణి) (7) నాటకీయ (8) నర్తకి (9) అనుచారిక (10) పరిచారిక (11) సంచారిక (12) ప్రేషణకారిక (ప్రేషణిక) (13) మహత్తరి (14) ప్రతిహారి (15) కుమారిక (16) వృద్ధ (17) ఆయుక్తిక (18) నపుంసకాది వర్గము. ఉదా స్నాతకులు (ఆర్యా చార పరిరక్షకులు), కంచుకీయులు (అర్థవంతమైన పనికి పంపబడువారు) వర్షవరులు (మూగలై కామాచారములందు నియుక్తులు అగువారు), ఔప స్థాయికులు (స్త్రీలు పంపిన కార్యములను చేయువారు), నిర్ముండులు (బాల బాలికల రక్షణకొరకు నియమితులైనవారు (నా. శా. 24-పు. 705).

*ఆముఖము* : దీనికే ప్రస్తావన అని మరొకపేరు. స్థాపనలో ఇదొకభాగము. భారతీవృత్తికిగల నాలుగు అంగములలో ఒకటి: నటిగాని, విదూషకుడుగాని, పారిపార్శ్వకుడుగాని సూత్రధారునితో కలసి ప్రస్తుత కార్యమునకు సంబంధించిన చిత్రవాక్యములతో వీథ్యంగములతో, స్పష్టములైన ఉక్తి ప్రత్యుక్తులతో చేయు సంలాపము ఆముఖము (ప్రస్తావన). ఆముఖమునకు అంగములు ఐదు.(1)ఉద్ఘాత్యకము(2)కథోద్ఘాతము (3)ప్రయోగాతిశయము

(4) ప్రవృత్తకము (5) అవలగితము. ఈ ఐదింటిలో కథోద్ఘాతాదులు మూడును పాత్రప్రవేశ సూచకములు. ఉద్ఘాత్యకము, అవలగితము అట్టివి కావు. వీథ్యంగములైన ఈ రెండు ప్రశ్న ప్రతివచన రూపములై వైచిత్ర్యాత్మకములుగా ఉండును. ఆముఖము (ప్రస్తావన) లో కలిసియున్న 'వీథి'ఇది. ఆముఖాంగముల నన్నింటిని ఒకేసారి ప్రయోగించవలసిన అవసరములేదు. వీలునుబట్టి ఒకటిగాని, రెండుగాని ప్రయోగించవచ్చు. ముఖ సంధి పర్యంతము ఉండునది, కథా ముఖమును సూచించునది కావున దీనిని ఆముఖము అనిరి. ఇందు పాత్రలధికముగా ఉండరాదు. (1) సూత్రధారుడు ఆవశ్యముగా ఉండును (2) నటి (3) పారిపార్శ్వకుడు (ఇతడురానిచోట విదూషకుడు). వీరిలో ఇద్దరో ముగ్గురో కలిసి సంలాపము చేయుదురు. (నా. శా. 20-పు. 612. 14). సూత్రధారి భారతీవృత్తినాశ్రయించి నటి, మారిష, విదూషకులలో ఒకరితో ప్రయోగింపబోవు నాటకమును గూర్చి ప్రసంగించుట ఆముఖలక్షణము (ద. రూ. 3.7).

*ఆయుక్తిక* : ఆభ్యంతర (రాజాంతఃపుర) పరివారములోని ఒక అధికారిణి: బహుజన పరివారము తోడుగా భాండాగారము, ఆయుధాగారము ఫల-మూల-ఔషధ-గంధ-మాల్య-ఆభరణ- వస్త్రాదులను పర్యవేక్షించు అధికారిణి. ఈమెకే అన్వవేక్షిక లేదా అన్వవీక్షణ అనియు పేర్లు (నా. శా. 24-పు. 708).

*ఆరంభము* [1] : ప్రారంభము పంచకార్యావస్థలలో మొదటిది. చూ. కార్యావస్థలు.

*ఆరంభము* [2] : పూర్వరంగాంగము. చూ. అంతర్యవనికాంగములు.

*ఆరభటీవృత్తి* : వృత్తి అనగా మనో, వాక్, కాయముల వ్యాపారము. ఆరభట (క్రోధ, ఆవేగాది) గుణములు. వివిధములగు కపటములు, వంచనములు, దంభములు అనృతవాక్యములు కలిగి దీప్తరసములగు రౌద్రాదులందు ప్రయుక్తమగునది ఆరభటీవృత్తి. ఈ వృత్తిలో నాలుగుభేదములున్నవి. చూ. (1) సంక్షిప్తకము (2) అవపాతము (3) వస్తూత్థాపనము (4) సంఫేటము (నా. శా. 20-పు. 618).

*ఆరుబయలు ప్రయోగము* : విశ్వకర్మ నిర్మించిన ప్రథమ నాట్యగృహమునకు ముందు నాట్యప్రయోగము ఆరుబయటనే జరిగినదనవలె, నా. శా. 13వ అధ్యాయములోని 'బాహ్యప్రయోగము' ఆ సంగతిని స్పష్టము చేయుచున్నది.

*ఆవిద్ధరూపకములు* : ప్రయోగ (ప్రదర్శన) విశేషములనుబట్టి దశరూపకములు ఆవిద్ధములని, సుకుమారములని రెండువిధములు. ఉద్ధతిని ప్రకటించు అంగహారములు, ఛేదన, భేదనక్రీడలు ప్రధానముగాగల యుద్ధములు; మాయాజాలము, ఇంద్రజాలము, పుస్త (బహువిధకృత రూపాలంకరణలు)- నేపథ్యములు; పలువురు పురుషులు, కొలదిమంది స్త్రీలు కలిగినవై, సాత్త్వతీ-ఆరభటీ వృత్తులు ప్రధానముగాగల నాట్య (నాటక) ము 'ఆవిద్ధప్రయోగము' అన

బడును. ఇట్లు ప్రయోగింపబడు డిమ-సమవకార-వ్యాయోగ-ఈహామృగములు ఈ నాల్గు ఆవిద్ధరూపకములు. దేవ, దానవ, రాక్షసులు, శౌర్య వీర్య, బలాన్వితులగు ఉద్ధతపురుషులు ఈ రూపకము లందుందురు (నా. శా. 13-పు. 379). చూ. సుకుమార రూపకములు.

**ఆశీస్సు** : నాట్య (నాటక) మునకు భూషణప్రాయములైన 36 లక్షణములలో ఒకటి: అ. గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠముప్రకారము శాస్త్రీయార్థ సంపన్నము, మనోరథసముద్భవము అయినదానిని ప్రార్థనీయముకాని, ఆకాంక్షించుటను 'ఆశీస్సు' అనిరి (ఇది అనుష్టుప్ పాఠములోని 'నిదర్శన, నిర్వచనముకంటె భిన్నముగా ఉన్నను సమన్వితమైనది: ఇతరాపేక్షను అనగా వ్యతిరేకమును నిరసించుటకు ప్రసిద్ధార్థములను కీర్తించుటను నిదర్శనము అనిరి. దీనికి అ. గు. ని పాఠము మరొకవిధముగా ఉన్నది: "సాధ్య వస్తు విషయికమగు ఆకాంక్ష తత్సంపత్తిచే శమించుటకు ప్రసిద్ధులగు దేవతాదులను కీర్తించుటను నిదర్శనము అనిరి (నా. శా. 16-పు-447).

**ఆశ్చర్యాభిఖ్యానము** : సంధ్యంగ ప్రయోజనములు వాటిలో ఇతివృత్తమును ఆశ్చర్యకరముగా రచించుట ఆశ్చర్యాభిఖ్యానము.

**ఆశ్రావణము** : పూర్వ రంగాంగము. చూ. అంతర్యవనికాంగములు.

**ఆసారితము** : పూర్వరంగాంగము. చూ. అంతర్యవనికాంగములు.

**ఆసీనము** : లాస్యాంగములు 10, వాటిలో ఒకటి. ఆతోద్యములేవియు లేకుండ, జిహ్మదృష్టి నిరీక్షణముతో, అప్రసారితగాత్రముతో, చింతా-శోకసమన్వితముగా కూర్చుండుటను ఆసీనము అందురు ఉదా॥ 'రత్నావళి' మూడవ అంక ప్రారంభమున రాజు ప్రవేశము (నా. శా. 19-పు. 582).

**ఆహార్యాభినయము** : నాల్గువిధములైన అభినయములలో ఒకటి: నేపథ్యమున చేయు అలంకరణ 'ఆహార్యము' (make-up). నాట్యము అనుకరణాత్మకము, కావున ఆయా సన్నివేశములకు, పాత్రలకు తగిన అనురూప-వేషభూషరచన లన్నియు ఆహార్యములు. కథాకాలము ఏకాలమునకు చెందినదో నాటి పాత్రలు ఏ రూపమున ఉండిరో ఆహార్యమువలననే తెలియుచున్నది. ఆహార్యము నాల్గువిధములు: (1) పుస్తము: ప్రదర్శన రక్తి కట్టుటకు పర్వతములు, నగరములు మొ నిర్మించుట (2) అలంకారము: స్త్రీ పురుషుల వివిధ భూషణములు దేశ-జాతి లక్షణములను తెలుపునవి (3) అంగరచన రకరకముల రంగులతో మిశ్రవర్ణములు చేసి పాత్రల రూపములను రచించుట, ప్రతిశిరములు (విగ్గులు) తయారుచేయుట మొ (4) సంజీవము: సజీవులైన పాత్రలతోపాటు సజీవములైన పశుపక్ష్యాదులనుగూడ రంగముపై ప్రవేశ పెట్టుట సంజీవము (నా. శా. అధ్యా. 21).

**ఆహ్లాదరూపకము** : ప్రాచీన పాశ్చాత్య రూపకములు సాధారణముగా రెండు విధములు (1) విషాదరూపకము (ఖేదాంత నాటకము (Tragedy) (2)ఆహ్లాదరూపకము(శుభాంతరూపకము=మోదాంతనాటకము,Comedy ).

ఈ ఆహ్లాదరూపకరచనలో అరిస్టోఫేన్స్ (C.448-C.388 B.C.) ప్రసిద్ధుడు విమర్శ, హేళన, హాస్యము ప్రధానముగా రచించిన నాటకము లివి.

*ఇతివృత్తము* : నిర్వచనము దీనికే కథ అని, వస్తువు అని, కథావస్తువు అని పేర్లు. ఇతివృత్తము నాట్య (నాటక) మునకు శరీరప్రాయమైనది. నాటక కథ ఐదు సంధులుగా విభజితమై రచితము కావలసినది. అనగా ఇతివృత్తములో పంచ సంధులుండును. చూ. సంధులు-ఐదు.

ఇతివృత్తరచన నిర్వహణ : కవి ఒక ఉత్తమనాయకుని జీవితములోని ఒక ఆకర్షణీయమైన ఘట్టము ఎన్నుకొని నీరసములైన సన్నివేశములను పరిహరించి, సరసమైన సన్నివేశములను సంస్కరించుచు కథను ఐదు సంధులుగా విభజించుకొని ప్రదర్శనానుకూలముగా రచించును. ఆ సంధులలో కార్యావస్థలను, అర్థ ప్రకృతులను, సంధ్యంగములను, సంధ్యంతరములను, పతాక స్థానములను యథోచితములుగా గుర్తించుకొనును. సంధి, సంధ్యంగ విన్యాస చమత్కారము తెలిసిన వ్యక్తి ఉత్తమనాటకములను రచించును.

ఇతివృత్తనిర్మాణము-పాశ్చాత్యులు : అరిస్టాటిల్ (రచించిన పొయెటిక్స్‌లో) రూపకమును మొత్తము ఆరు అంశములుగా విభజించెను: (1) ఇతివృత్తము (Plot) (2) పాత్ర (Character) (3) శైలి (Diction) (4) భావములు (Thought or sentiment) (5) రంగాలంకరణాదులు (Spectacle) (6) సంగీతము (Song). ఈ ఆరు అంశములలో ఇతివృత్తము ప్రధానమని అతడు నిర్దేశించెను. రూపకమునకు ప్రాణమైనది ఇతివృత్తమే అని అతని అభిప్రాయము (నా. శా. 19 వ అధ్యాయము).

*ఇతివృత్తవిభజన* : వస్తువు రెండు విధములు. చూ. (1) ఆధికారికము (2) ప్రాసంగికము (నా. శా. 19-పు. 562)-ఆధికారికము (ముఖ్యమైనది) ప్రాసంగికము (ప్రసంగవశము అయినది) (ద. రూ. 1-11)- ఇతివృత్తము మరొకరకముగా రెండువిధములు: (1) దృశ్యము(=అసూచ్యము, అంకములుగా కనిపించు బాహ్య విభాగము) (2) సూచ్యము (విష్కంభ-ప్రవేశక-చూలిక, అంకావతార-అంకాస్యములు)-మరొక రకముగా మూడు విధములు: (1) శ్రావ్యము (2) అశ్రావ్యము (3) నియతశ్రావ్యము. చూ. అపవారితములు- మరొక రకముగా మూడు విధములు : చూ. (1) ప్రఖ్యాతము (2) ఉత్పాద్యము (3) మిశ్రము. ఆధికారికేతివృత్తము కార్యావస్థల క్రమదశల ననుసరించి, అయిదువిధములు, చూ. కార్యావస్థలు. కథాగమన హేతువులైన అర్థ ప్రకృతుల ననుసరించి అయిదు విధములు, చూ. అర్థ ప్రకృతులు; కార్యావస్థలకు, అర్థప్రకృతులకు అనుగుణముగా సాగు సంధి విభాగమునుబట్టి అయిదువిధములు, చూ. సంధులు(నా. శా. 19-పు.594).

*ఇష్టార్థరచన* : సంధ్యంగప్రయోజనములు 6 అందులో ఇదిఒకటి: అభీష్టమైన ప్రయోజనమును విస్తరింపజేయుట ఇష్టార్థరచన (నా. శా. 19-పు. 570).

*ఈహామృగము :* దశవిధరూపకములలో నాల్గవది. లక్షణము (1) ఇతివృత్తము ప్రఖ్యాతమైనది కావలె (2) నాయకుడు: దివ్యపురుషుడు, దివ్యనాయిక అయిఉండవలె (3) అంకములు: ఒకటి లేదా నాలుగు ఉండవలె. (4) సంధులు: మూడు (గర్భ, అవమర్శలుతప్ప) (5) వృత్తులు. కైశికి ఉండదు. (6) రసములు. శృంగారమే ప్రధానము (7) విశేషములు : కథ అల్లిబిల్లిగా ఉండును. 12 గురు దివ్యపురుషులుందురు. ఒక స్త్రీని భేదన-అపహారణ-అవమర్దనములచే పొందిన శృంగారము ఇందు ప్రదర్శితమగును. దీని జన్యరూపకము చిత్రతాల (నా. శా. 18-పు. 542)— (1) ఇందులో వస్తువు మిశ్రము.(ప్రఖ్యాతము, కల్పితము). (2)నాయక ప్రతినాయకులు దివ్యులో, మానవులో నియమములేదు (ద. రూ. 3. 73) ఇతివృత్తము మిశ్రము. పతాకనాయకులు, నాయక. ప్రతినాయకులు మొత్తము 10. మృగమువలె అలభ్యఅయిన నాయికను నాయకుడు కోరును కావున ఇది ఈహామృగము ఉదా॥ కుసుమశేఖర విజయము (సా. ద. 6-పు. 194).

*ఉక్తప్రత్యుక్తము :* లాస్యాంగములు 10. వాటిలో ఒకటి. కోపప్రసాద జనితమై, సాధిక్షేపపదాశ్రయమై, చిత్రగీతార్థ ప్రయోగములుగలది ఉక్తప్రత్యుక్తము. 'రత్నావళి' తృతీయాంకములో దీని ఉదాహరణమున్నది. (నా. శా. 19-పు. 583).

*ఉత్తమనటుడు :* ఆయాసన్ని వేశములకు, ప్రకృతులకు తగిన వేషధారణము చేయకలిగిన వ్యక్తి. జీవాత్మ (పునర్జన్మతోగాని, పరకాయ ప్రవేశముతోగాని) దేహాంతరము నాశ్రయించినప్పుడు స్వస్వభావమును పరిత్యజించి అన్యదేహస్వభావములను పొందునట్లే వేషముచే వర్ణకము (రంగు) లచే ఆచ్ఛాదితమైన వ్యక్తి. ఆశ్రయించిన పాత్రభావమును చక్కగా ప్రదర్శింపగలిగినచో అది ఉత్తమ నటన (నా. శా. 21-పు. 636).

*ఉత్తమోత్తమకము :* లాస్యాంగములు 10, వాటిలో ఒకటి. వివిధ రస సంశ్రయమై, విచిత్రశ్లోకబంధమై, హేలా-హావ-భావ విచిత్రమైనది ఉత్తమోత్తమకము. 'రత్నావళి' తృతీయాంకములో దీని ఉదాహరణమున్నది. (నా. శా. 19-పు. 583).

*ఉత్థాపకము :* సాత్వతీవృత్తికిగల నాలుగు అంగములలో ఒకటి: మానసిక సంఘర్షమును సూచించు వ్యాపారమును ఉత్థాపకము అనిరి. "ఇదిగో నేను గూడ సిద్ధముగానే ఉన్నాను. లెమ్మ, నీ శక్తిని చూపుము" అనెడి సంఘర్షసముత్తములైన వాక్యములతో కూడినది. ఉత్థాపకము (నా. శా. 20-పు. 615). ఉదా వీరచరితములో పరశురామునితో శ్రీరాముడన్న వాక్యము.

*ఉత్థాపనము :* పూర్వరంగ (బహిర్యవనిక) అంగములు 10. అందులో ఇదొకటి: నాంద్యాదిపాఠకులు రంగమునందు ప్రప్రథముగా ప్రయోగమునకు ఉపక్రమింతురు. కావున దీనిని ఉత్థాపనము అనిరి (నా. శా. 5-పు. 158).

*ఉత్పాద్యము* : మూడు విధములైన నాటకవస్తువు (కథ, ఇతివృత్తము) లలో ఒకటి: కవి కల్పితమైన కథను ఉత్పాద్యము అనిరి (ద. రూ. 1-15). ఉదా ప్రబోధ చంద్రోదయము :

*ఉత్సృష్టికాంకము* : దశవిధరూపకములలో 7 వది (అంకము అని మరొక పేరు) లక్షణము 1. ఇతివృత్తము: సాధారణముగా ప్రఖ్యాతమైనదై ఉండవలె. (2)నాయకుడు: దేవతలు నాయకులు కారాదు(3)అంకములు ఒకటిమాత్రమే (4)సంధులు: రెండు, ముఖ-నిర్వహణములు .(5) వృత్తులు-భారతీ వృత్తి మాత్రము (6) రసములు: కరుణరసమొక్కటే (7)విశేషములు: యుద్ధము నుండి మరలినవారు, గాఢముగా గాయములు తగిలినవారు ఇందులోని పాత్రలు. స్త్రీల శోక విలాపాదులు అధికముగా ప్రదర్శితము కావలె. (నా. శా. 18-పు. 542).

*ఉదాహరణము 1* : నాట్య (నాటక) మునకు గల 36 లక్షణములలో ఒకటి : అ. గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము ఒక అర్థమును ప్రతిపాదించుటకు ఉపయుక్తమైన శబ్దముచే అనేకార్థములు తత్సంబద్ధములైనవిగాని, అనుక్తములైనవిగాని స్ఫురించినచో దానిని "ఉదాహరణము" అనిరి. (అనుష్టుప్ వృత్తపాఠములోను దీనికిదే పేరు. నిర్వచనములో మార్పు తోచినను సారాంశమొక్కటే:" తుల్యార్థయుక్తమై వాక్యముతో వేరొక అర్థమును సాధించుటను 'ఉదాహరణము' అనిరి. (నా. శా. 16-పు-444).

*ఉదాహరణము 2* : గర్భసంధికి అంగములు 13, వాటిలో ఒకటి: అతిశయ సహితమైన వాక్యమును ఉదాహరణము అందురు. (నా. శా. 19. పు. 574).

*ఉద్ఘాత్యకము* : వీథ్యంగములు 13. వాటిలో ఒకటి: ఉద్ఘాత్యకము ప్రశ్న-ప్రతి వచనాత్మకమని తెలియతగినది. ఆదర సహితములును, ప్రశ్న రూపములును అయిన పదములకు తత్పర్యాయములైన పదములతో సమాధానము చెప్పుటను ఉద్ఘాత్యకము అనిరి (నా. శా. 18-పు. 529).

*ఉద్ధత ప్రయోగము* : చూ. ఆవిద్ధ రూపకములు.

*ఉద్భేదము* : ముఖసంధికిగల 12 అంగములలో ఒకటి: భూసంశ్లేషము వలన బీజము మొలకెత్తినట్లు ఇందు బీజోత్పత్తి జరుగును. దానిని వర్ణించుటయే ఉద్భేదము (నా. శా. 19-పు. 572). —రహస్యము బయలు పడుటయే ఉద్భేదము (ద. రూ. 1-29). ఉదా "వేణీసంహారము" లో జరిగిన అవమానమును తలచుకొని భీముడు ద్రౌపదితో" కౌరవ్యులను నిశ్శేషులను చేయని వానిని, వృకోదరుని మరల చూడవు, అనిన సందర్భము (సా. ద. 6-పు. 155).

*ఉద్వేగము* : గర్భసంధికిగల 13 అంగములలో ఒకటి: శత్రువులు, రాజులు, దస్యులు మొ॥ వారిచే కలుగుభయము ఉద్వేగము (నా. శా. 9-పు. 574). శత్రుభయమువలన కలిగినదే ఉద్వేగము. ఉదా 'రత్నావళి'లో సాగరికకకు వాసవదత్తవలన కలిగిన భయము (ద. రూ. 1-41).

**ఉపక్షేపము :** ముఖసంధికిగల 12 అంగములలో ఒకటి : బీజోత్పత్తి (కావ్యార్థ సముత్పత్తి) ని ఉపక్షేపము అందురు (నా. శా. 29- పు. 571). —బీజమును సూచించుటయే ఉపక్షేపము (ద. రూ. 1-26)-ఉదా 'వేణీ సంహారము'లో "నేను బ్రతికి ఉండగానే కౌరవులు స్వస్థముగా ఉందురు. (స్వస్థాభవంతి)' అన్నచోట (సా. ద. 6-పు. 152).

**ఉపగూహనము :** నిర్వహణ సంధికిగల 14 అంగములలో ఒకటి: అద్భుతమైన సంప్రాప్తిని ఉపగూహనము అందురు. (నా. శా. 19-పు. 576). ఉదా 'ప్రభావతి'లో ప్రద్యుమ్ననకు నారద దర్శనము వలన కలిగినది (సా. ద. 6-పు. 167).

**ఉపదిష్టము :** నాటక (నాట్య) మునకు గల 36 లక్షణములలో ఒకటి: చూ. ఉపపత్తి.

**ఉపన్యాసము :** ప్రతిముఖ సంధికి గల 13 అంగములలో ఒకటి: ఒక అర్థమును ఉపపత్తిచే సమర్థించుటను ఉపన్యాసము అనిరి. (నా. శా. 19-పు. 573). పరిచయములేదా తంత్రముతో కూడిన యుక్తి కారణముగా నాయికా నాయకుల అనురాగబీజము ప్రకటితమగుట ఉపన్యాసము (ద. రూ. 1-34) ప్రసాదమొందించుట ఉపన్యాసము ఉపపత్తి కృతమైన అర్థము ఉపన్యాస మని కొందరు. ఉదా 'రత్నావళి'లో బలునోటిది గర్భదాసి ఇది' అన్న చోట (సా. ద. 6-పు. 157).

**ఉపపతి :** శృంగార విషయమున 'రసమంజరి' చెప్పిన త్రివిధ నాయకులలో రెండవవాడు. ఇతడే రంకు మగడు. సదాచారభంగమునకు, చౌర్యరతికి ఇష్టపడువాడు. ఉపపతి ఐదు విధములు: అనుకూల, దక్షిణ, ధృష్ట, శఠ భేద ములు నాల్గు. ఐదవ భేదము ప్రోషిత ఉపపతి. చూ. నాయకులు.

**ఉపపత్తి :** నాటక (నాట్య) మునకుగల 36 లక్షణములలో ఒకటి: ప్రాప్తము లైన దోషములను ఉపపత్తి సహితముగా శమింపచేయుటను 'ఉపపత్తి' అనిరి. (ఇది అనుష్టుప్ వృత్తపాఠములోని 'ఉపదిష్టము' తో పాఠవిషయ మున భిన్నమైనను సమన్వయమైనది). శాస్త్రార్థమును గ్రహించి విద్వన్మనో రమమగునట్లు చక్కగా ఉపదేశించినది ఉపదిష్టము) (నా. శా. 16-పు. 449)

**ఉపరూపకభేదములు 1:** ఉపరూపకములనుగాని, జన్యరూపకములనుగాని నా.శా. పేర్కొనదు. అభినవభారతి పేర్కొన్న ఉపరూపకభేదములు:- నాటిక-ప్రక రణికల భేదములనేకాక గేయరూపకములని, నృత్త ప్రకారములని రాగకావ్య ములని అ. గు పేర్కొన్న ఉపరూపకములు: డోంబికా-భాణ-ప్రస్థాన-షిద్గక-భాణికా-ప్రేరణ-రామాక్రీడ-హల్లీసకములు.

అగ్నిపురాణము 'నాటకములు' అను పేరుతో చెప్పినవి 27 భేద ములు. అందులో మొదటి పది భరతుని దశరూపకములే. మిగిలినవి ఉప రూపకములు! తోటక-నాటికా-సట్టక. శిల్పక-కర్ణ-దుర్మల్లికా-ప్రస్థాన-

భాణికా-భాణీ-గోష్ఠి - హల్లీసక-కావ్య-శ్రీగదిత-నాట్యరాసక-ఉల్లోప్యక - ప్రేషణములు.

ఉపరూపకములను పెంపొందించిన ఖ్యాతికోహలునిది. అతడు మార్గ-దేశిభేదములతో చెప్పినవి ఇవి: మార్గరూపకములు 10: నాటిక, ప్రకరణిక, భాణిక, హాసిక, వ్యాయోగిని, డిమిక, కలోత్సాహవతి, చిత్ర, జుగుప్సిత, చిత్రతాల; వీటిలో నృత్త-గానములుండవు. ఇవిరూపకతుల్యములే. దేశిరూపకములు 10: డోంబిక, భాణము, ప్రస్థానము, షిద్గకము, భాణిక, ప్రేరణము, రామాక్రీడము, రాగకావ్యము, హల్లీసకము, రాసకము, ఇందులో చివరి ఆరును నృత్త ప్రకారములు.

'ఉపరూపకము' అను పదమును స్పష్టముగా పేర్కొన్న ప్రథముడు విశ్వనాథుడు. అతడు చెప్పిన ఉపరూపకములు 18, శారదాతనయుడు చెప్పినవి 20. రూపక, ఉపరూపక భేదములనే కాక జన్య రూపక భేదము లను కొందరు చెప్పిరి. ఆయాలక్షణ కర్తలు చెప్పిన రూపకముల మొత్తము లెక్క ఇట్లు చూడవచ్చును: భరతుడు పేర్కొన్నవి 10+జన్యరూపకములు 4+కోహలుడు చెప్పిన మార్గరూపకములు 10, ఈ మొత్తము 24. ఇంకను లెక్కపడిన రూపకములు 23: (1) రాసకము (2) నాట్యరాసకము (3) భాణము (4) డోంబి (క) (5) భాణిక (6) ప్రస్థానకము (7) ప్రేక్షణికము (ప్రేంఖణము) (8) హల్లీసకము (9) కావ్యము (10) పారిజాతకము (పారిజాతలత) (11) గోష్ఠి (2) శ్రీగదితము (13) విలాసిక (14) ఉల్లోప్యకము (15) నర్తనకము (16) ప్రేరణము (17) సల్లాపకము (18) శిల్పకము (19) కల్పవల్లి (20) షిద్గకము (21) దుర్మల్లిక (మత్తల్లి) (22) మల్లిక (మణికుల్యా) (23) రామాక్రీడము. ఈ మొత్తము 47. (నా. శా. 18-పు. 534-36).

*ఉపరూపకభేదములు-2* : రూపకభేదములని కొందరు, ఉపరూపకములని కొందరు ఆలంకారికులు పేర్కొన్నవి మొత్తము 47 అని (నా. శా. 18. పు 535). వీటిలో సా. ద. పేర్కొన్నవి 18. వాటికి వివరణలు లభించినవి. కొన్నిటి వివరణలు హిం. సా. కో. లో లభించినవి. మరికొన్ని : కర్ణ-కల్లోత్సాహవలు-ఛలిత-చిత్ర-చిత్రతాల-జుగుప్సిత-డిమిక-డోంబి (డోంబిక)-ద్విపది-పార (నృత్తపార్య)-భాణి-రాగకావ్య-శంపా-శింగక-హాసికలు. వీటి వివరణములింకను మృగ్యములు. వీటిలో కొన్ని 'జన్యరూపకములు' కొన్ని 'గేయరూపకములు.'

*ఉల్లాప్యము (ఉల్లోప్యకము)*: ఉపరూపకము (ఉల్లోప్యకము) ఇతివృత్తము దివ్యము, నాయకుడు ఉదాత్తుడు, అంకము ఒకటే, శిల్పకము యొక్క అంగములు-హాస్య-శృంగార-కరుణ రసములు ఉండును. యుద్ధక్రీడలతో నిండినదని కొందరందురు, అట్టిది గీతమనోహరముగా, నల్గురు నాయికలతో, మూడంకములతో ఉండును. (సా. ద. 6. పు-201).

*ఏకాంకిక :* ఇంగ్లీషులో ఉన్న (one act play) అను మాటను 'ఏకాంకిక' అని ఆధునికులు అనువదించుకొనిరి. కాని నా. శా. చెప్పిన దశరూపకము లలో ఏకాంకములు 5 ఉన్నవి: చూ. వ్యాయోగము, అంకము (ఉత్సృష్టికాంకము), ప్రహసనము, భాణము, వీధి. ఈఅయిదు ఏకాంకములు (నా. శా. 18-పు. 542).

*ఓజస్సు :* సంధ్యంతరములు 21. అందులో ఇదొకటి. ఓజస్సు అనగా తేజస్సు. పురుషులకుగల సత్వభేదములు 8 టిలో ఒకటిగా చెప్పబడినది. శత్రువులు చేయు అధిక్షేపముగాని, అవమానముగాని ప్రాణముపోయినను సరే సహింపక పోవుట తేజస్సు అనబడినది (నా. శా. పు-578-660).ఓజస్వితా సూచకమైన వచనమును ఓజస్సు అందురు. (హిం. సా. కో. పు. 860).

*కంచుకి :* అభ్యంతర (రాజాంతఃపుర) పరివారములో నపుంసకాదివర్గములో చేరినపాత్ర. కంచుకీయుడు. ఈపాత్రగతిని వయస్సును, అవస్థనుబట్టి, ప్రయోగించవలె. వృద్ధుడుకానిచో విష్కంభ (స్థిర) ములు, ఋజుస్థితములు, అర్ధతాల పరిమితములుగా ఎత్తి వేయునవియు అయిన పాదములతో బురదలో దిగబడినవానివలె ప్రయత్నముతో అవయవములను ఆకర్షించుచు నడవవలె. వృద్ధుడైనచో కంపించుచున్న దేహముతో విష్కంభనమే (ఊతకర్రయే) బలముగలవాడై అడుగులు మెల్లగా వేయుచుండవలె. కృశించిన వాడు కూడ పై విధముగానే మెల్లగా నడవవలె (నా. శా. 12-పు. 356).

*కథ :* చూ. ఇతివృత్తము (వృత్తము).

*కథక్‌నాట్యము :* నేడు ప్రసిద్ధికెక్కిన భారతీయ నాట్య (నృత్య) భేదములు ఐదు. వాటిలో ఇదొకటి: హిందూ-మొగలాయి కళాసమ్మేళనముగల నృత్యమిది. ఉత్తరహిందూస్థానములో బాగా ప్రచారములో ఉన్నది. నేటి భరత నాట్యములో హస్తాభినయము ప్రధానము కాగా దీనిలో పాదప్రచారము ప్రధానము. కథక్ నర్తకుడు ఏ తాళము నందైనను గంటల తరబడి నృత్యము చేయగలడు. ఇందు అర్థమునకు బదులు తాళగతికే ప్రాధాన్యము. (నా-శా. 4-పు. 142).

*కథాకళినాట్యము :* నేటి ప్రసిద్ధ నాట్యములు ఐదు. వాటిలో ఒకటి. ఇది మలబారుప్రాంతములో వికసించిన ఆధునికనృత్యకళ. ఉద్ధతమైన ఈ నృత్యము లలో వాచికము అప్రధానము. ఆంగికాభినయమునకే ప్రాధాన్యము. ఇది 3,4 శతాబ్దులక్రితమే ఆరంభమైనది. దీనిలో పాత్రల వేషధారణమునకు ఒక ప్రత్యేకత ఉన్నది. ఈ కళకు మూలము భరతనాట్యశాస్త్రమే. ఇది నృత్య నాటకకళగా రూపొందినది. రామాయణ, భారతకథలు ఈ కళద్వారా ప్రదర్శితములగును. (నా. శా. 4-పు. 142)

*కథాభేదములు :* చూ. ఇతివృత్తవిభజన.

*కథాసూత్రము :* కథావిశేషము, వృత్తి విన్యాసములతో, సంవాద సంభాషణ ములకు ఆధారములైన చేష్టాదుల ప్రకటనముతో సాగు కథాక్రమము.

ఉచితజ్ఞులైన రచయితలు, సూత్రధారులు (Directors), నటులు కథా సూత్రము తెగకుండ ప్రయత్నింతురు: ఇంగ్లీషులో దీనిని 'థీమ్' అందురు (హిం. సా. కో. పు 364).

*కథోద్ఘాతము :* ఆ ముఖాంగమునకు అంగములు ఐదు. వాటిలో ఒకటి. సూత్ర ధారుడు ప్రయోగించిన వాక్యమునుగాని; ఆ వాక్యార్థమునుగాని గ్రహించి పాత్ర రంగస్థలమున ప్రవేశించు పద్ధతిని కథోద్ఘాతము అందురు (నా. శా: 20-పు. 613).

ఉదా 'వేణీ సంహారము'లో పాండవులకు కౌరవులకు రెండు పక్షముల వారికి శుభములే కలుగుగాక అను అర్థములో సూత్రధారుడు మంగళ పాఠము పఠించి నిష్క్రమించుచుండగా "నేపథ్యమున) ఆఁ ఓరి దుష్ట హృదయుడా! వృథా మంగళ పాఠక! నేను బ్రతికియుండగా ధార్తరాష్ట్రులెట్లు స్వస్థులగుదురు" అని భీమసేనుడు ప్రవేశించుట (సా. ద. 6. పు 140)

*కన్యా :* నాయికా భేదము. చూ. పరకీయ.

*కపటము:* నాట్య (నాటక)మునకు 36 లక్షణములలో ఒకటి: అ. గు. అనుసరించిన ఉపజాతివృత్తపాఠము ప్రకారము: ఇతరుల వచనములను ఛలముచే అన్యథా గ్రహించుట లేదా అపలపించుట (అన్యార్థము కల్పించుట). దీనిని 'కపటము' అనిరి: (ఇది అనుష్టుప్ వృత్త పాఠములోని 'గర్హణ' నిర్వచనముతో భేదించినను సమన్వితమైనది:- ప్రయోజన వశముచే దోషములను గుణములు గాను, గుణములను దోషములను గాను కీర్తించుట 'కపటము' (నా. శా: 16-పు 448).

*కపటములు:* —సమవకారము అనురూపములో కూర్చదగిన కపటము (వంచన) మూడు విధములు:

1. వస్తుగత క్రమవిహితము: కార్యము సాధించు వారి దోషము లేకుండినను వంచకుడు చేయు మోసము 2. పరప్రయుక్తము: కార్యము సాధించువారి దోషముచే వంచకుడు చేయు మోసము: 3: దైవవశాగతము: ఇరువురి దోషము లేకుండగనే కాకతాళీయముగా (దైవవశమున) సంభవించు మోసము (నా. శా. 18 పు:—524).

*కరణము :* —ముఖ సంధికిగల 12 అంగములలో ఒకటి. ప్రకృతమైన అర్థము ప్రారంభమగుటను కరణము అనిరి (నా. శా. 19-పు.572)

ఉదా 'వేణి'లో భీముడు ద్రౌపదితో "దేవీ! కురుకులమును నాశన మొనరించుటకు నేను పోయెదను" అని (సా, ద. 6. పు. 155)

*కర్టెన్ రైజర్:* —(Curtain raiser): ఇంగ్లండులో అసలు నాటకము ప్రదర్శించుటకు ముందు ప్రేక్షకుల వినోదార్థము ప్రదర్శించు ఒక ప్రహసనాత్మకమైన ఏకాంకిక (నా. శా. 5-పు.180).

*కర్ణోక్తము :* — అపవారితములలో ఒకటి. వాచికాభినయమునకు సంబంధించిన—ఆకాశవచనాదులవంటి—చిత్రాభినయము; రంగముపై అంతకుపూర్వమే

ప్రదర్శితమైన దానిని మరల తప్పక చెప్ప వలసివచ్చినపుడు పునరుక్తతను పరిహరించుటకు చెవిలో చెప్పుటను 'కర్ణోక్తము' అందురు (నా. శా. 25. పు. 726). చెవిలో చెప్పిన రహస్యము తర్వాత సామాజికులకు వెల్లడి అగును.

*కలహాంతరిత:* —శృంగార నాయిక. చూ. నాయికలు అష్టవిధములు:

*కల్పవల్లి:* —ఉపరూపక భేదము. కూర్పులో ముఖ్యమైనవి: హాస్య, శృంగార ములు, ఉదాత్తుడైన నాయకుడు లేదా ఉపనాయకుడు: నాయిక అభిసారిక లేదా వాసకసజ్జిక; కథా రచనలో ఉదాత్తత, ముఖ-ప్రతిముఖ-నిర్వహణ సంధులు; లాస్యతత్త్వములు ఆవశ్యకములు అని భావ ప్రకాశనము చెప్పినది. ఉదా॥ మాణిక్యవల్లిక (హిం: సా. కో. పు. 227).

*కామెడీ:* — ఆహ్లాదరూపకము లేదా శుభాంత రూపకము, పాశ్చాత్య (గ్రీకు) నాటక భేదము. కథా సంవిధానములో విమర్శ, హేళన, హాస్యము ప్రధాన ముగా గ్రహించి రచించిన నాటకము. ఇటువంటి నాటక రచనలో అరిస్టాఫేనిస్ (Aristo phance) ప్రసిద్ధుడు. (క్రీ. పూ. 448-388 ప్రాంతము) (నా. శా. 1-పు. 25)

*కార్యము*[1]*:* —నాటక (నాట్య) మునకు భూషణప్రాయములైన 36 లక్షణము లలో ఒకటి. అ. గు అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ననుసరించి: దోషమును తొలగించి గుణమును లేదా గుణమును తొలగించి దోషమును కూర్చుటను కార్యము అందురు ఇది అనుష్టుప్ పాఠమందలి 'అర్థాపత్తి' పాఠముతో భిన్నమైనను సమన్వితమైనది. మాధుర్య సంపన్నముగా ఒక అర్థము చెప్పినప్పుడు వేరొక అర్థము ప్రతీయమానమగుట అర్థాపత్తి' (నా: శా. 16 పు. 449).

*కార్యము*[2]*:* —అర్థప్రకృతులు ఐదు, వాటిలో ఒకటి: చేతనులు (అనగా ప్రభు-మంత్ర-ఉత్సాహ శక్తుల నవలంబించు నాయక, పతాక-ప్రకరీ నాయకులు) సంపాదించు ఫలరూపమైన ఆధికారిక వస్తువును సాధించుటకు ఉపయోగించు ద్రవ్య-గుణ-క్రియాదులైన సమస్త సహకారి వర్గమును కార్యము అందురు. ఇచ్చట 'కార్య' శబ్దము ఉపాయ సామగ్రిని తెలుపునది. బీజ-బిందువులవలె ఇదియును ఇతివృత్తమంతట వ్యాపించును (నా. శా., 9. పు. 566)

*కార్యావస్థలు ఐదు:* — పంచకార్యావస్థలు. ఇవి కథా గమనమునకు సంబంధించిన క్రమదశలు నాటకరచయితలు, నటులు గుర్తించదగినవి, ఇవికవికల్పితములే అయినను నటగతములు గానే (అనగా నాయకుని చిత్తవృత్తులుగానే) భావించ వలె ఇవి నాటక—ప్రకరణము లందు ఉండును ఫలప్రాప్తికొరకు నాయ కుడు చేయు ప్రయత్నమే క్రమముగా ఈ అయిదు అవస్థలుగా పరిణ మించును. కాయిక. వాచిక, మనో వ్యాపార రూపములైన ఈ అయిదు అవస్థలు ఆధికారికేతి వృత్త భాగమునకు సంబంధించినవి: వీటి క్రమము మాత్ర్బగానిది: 1. ప్రారంభము: (ఆరంభము అని తర్వాతి పాఠము) ప్రధాన

ఫల ప్రాప్తిని గురించిన బీజమునకు (ఉపాయసంపదకు) అనుగుణమైన ఔత్సుక్యము హృదయములో నెలకొనుటకు ప్రారంభము అనిరి.

2. ప్రయత్నము (యత్నము అని తర్వాతి పాఠము): ఫలప్రాప్తి కనబడనప్పుడు ఆ ఫలమును గురించిన వ్యాపారమును మరింత ఔత్సుక్యముతో చేయుటను ప్రయత్నము అనిరి (ఈ ప్రయత్నముచే తప్ప ఇతరములచే ఫల ప్రాప్తి లభించదను నిశ్చయమునకు వచ్చుటచే ఇందులో ఉపాయ సంబంధమైన స్మరణ-ఉత్కంఠాదులు ఎడతెగక సాగును).

3. ప్రాప్తి సంభవము: (ప్రాప్త్యాశ అని తర్వాతి పాఠము) కొంచెముగా, భావమాత్రముగా ఫలము ప్రాప్తించుటకు ప్రాప్తి సంభవము అనిరి. (ఇందులో ఫలప్రాప్తికి సంబంధించిన సంభావన, అసంభావన కూడ ఉండును. నిశ్చయించుకొనిన ఉపాయముచే విశిష్ట ఫలప్రాప్తి సంభావనా మాత్రముగ స్థాపితమగునని తెలియవలె).

4. నియతఫలప్రాప్తి (నియతాప్తి అని తర్వాతి పాఠము): సహకారి సామగ్రీసహితమైన ఆ ముఖ్యోపాయము వలన ఫలప్రాప్తి తప్పక కలుగునని భావించుటను నియత ఫలప్రాప్తి అనిరి (అనగా ఈ ఉపాయముచే ఈ నాయకునకు ఈ ఫలము సిద్ధించునని నెడి నిశ్చయ జ్ఞానము కలుగుట).

5. ఫలయోగము (ఫలాగమము అని తర్వాతి పాఠము): ఇతివృత్తము చివర నాయకుడాశించినదియు, నాయకునకు ఉచితమగునదియు అయిన ఫలము సమగ్రముగా సిద్ధించుటను ఫలయోగము అనిరి.

**కావ్యము :** ఉపరూపకము. ఏకాంకము, హాస్యసంకులము; ఆరభటి లేదు, ఖండమాత్ర-ద్విపద-భగ్నతాళములతో శోభిల్లును. వర్ణమాత్ర — ఛడ్డలిక లుండును. శృంగారసూచన లుండును. నాయికా నాయకులు ఉదాత్తులు. సంధులు : ముఖ - ప్రతిముఖ - నిర్వహణములు. ఉదా। యాదవోదయము (సా. ద. 6. పు. 201).

**కావ్యసంహారము :** నిర్వహణ సంధికిగల 14 అంగములలో ఇదొకటి. వరదాన సంప్రాప్తి కావ్యసంహారము అనబడును. (నా.శా. 19. పు. 577) ఉదా। సర్వసాధారణముగా లభించును "నీకు ఇంకను ఏమి ప్రియమును చేయవలయును" వంటి వాక్యము (సా.ద. 6—పు 168).

**కుమారాధికృతులు :** రాజుకు ఉండవలసిన బాహ్యపరివారములలో ఒకవర్గము. రాజపుత్ర రక్షణోద్యోగులు : అప్రమత్తులు, స్నేహభావుకులు, నిపుణులు, మధ్యస్థులు, సర్వశాస్త్రార్థ సంపన్నులు అయినవారు కుమారాధికృతులుగా ఉండవలె (నా.శా. 24 పు. 710).

**కుమారికలు :** ఆభ్యంతర (రాజాంతఃపుర) పరివారములో ఒకవర్గము. అప్రాప్త రతి సంభోగ, అసంభ్రాంత, అనుద్ధత, నిభృత, లజ్జావతి అయిన బాలను కుమారి అనిరి (నా.శా. 24. పు. 708).

**కులట :** నాయికాభేదము. చూ. పరకీయ.

**కులస్త్రీ :** (నాయిక): నా. శా. పేర్కొన్న చతుర్విధ నాయికలలో ఒకతి : ఉదాత్త, నిభృత అయిన నాయిక కులజాంగన (నా. శా. 24. పు. 705). చూ. నాయికలు.

**కూచిపూడి నాట్యము :** నేడు ప్రసిద్ధికెక్కిన భారతీయ నాట్యభేదములు ఐదు : వాటిలో తెలుగుదేశమున పుట్టిపెరిగిన నృత్యకళ ఇది. మాచుపల్లి కైఫియత్ (క్రీ.శ. 1502) ప్రకారము తెలియవచ్చిన చారిత్రక విషయము: సిద్ధవటం సీమకు సమ్మెట గురువరాజు పాలకుడై ప్రజలను దారుణముగా హింసించుచుండెను. అతని దారుణకృత్యములకు కూచిపూడి భాగవతులు నాట్యరూపమిచ్చి విజయనగరప్రభువగు వీరనరసింహరాయల ఎదుట ప్రదర్శించిరి. వీరనరసింహరాయల జోక్యముతో గురువరాజు కృత్యములు మానినవని ఆకైఫియత్ చెప్పుచున్నది.

16 వ శ. ప్రాంతమున నారాయణతీర్థులవారి శిష్యుడైన సిద్ధేంద్రయోగి కూచిపూడి బ్రాహ్మణులకు నృత్యకళను నేర్పెను. దానినే పారిజాతము లేదా భామాకలాపము అని అందురు. ఇంతేకాక నృత్యప్రధాన నాటకములు (యక్షగానములు) కూడ వీరు ప్రదర్శింతురు. తెలుగుదేశమున పెంపొందిన విశిష్టకళలలో కూచిపూడి నాట్యము ఒకటి. ఉదా భామాకలాపములో ఇతివృత్తము నామమాత్రమైనదే అయినను నృత్యభంగిమలతోనే ఎంతోకాలము ఆకర్షించుట ఈ నాట్యవిశేషము. భరతనాట్యము 2-3 గంటల కాలములో నిర్వర్తింపబడుచుండగా భామాకలాపము పూర్తిగా ప్రదర్శించుటకు నాలుగైదు రోజులకంటె ఎక్కువ కాలమే పట్టును. అటువంటి కళను ఇప్పుడు తక్కువ వ్యవధిలో ఒకేపాత్రతో నిర్వర్తించుచున్నారు (నా.శా. 4 పు. 140).

**కెథార్సిస్ :** అరిస్టాటిల్ ఈ పదమును నిర్వచించలేదు. విషాద రూపకములు ప్రదర్శించు శోక, భయ సంక్షోభములను చూచుచున్న ప్రేక్షకులు తమలో అంతకుముందున్న లౌకికములైన భయములను మరచి (ఏడ్చుచున్న శిశువులు ఊయల ఊపుటూపుల వేగమును చూచి తమ ఏడ్పును మానినట్లు) ఒకవిధమైన మానసికశాంతిని పొందుదురని పాశ్చాత్య (గ్రీకు) ఆలంకారికుల అభిమతము. ప్రేక్షకులలో ఉన్న శోక, భయావస్థలను క్షాళనము చేయు నాటకీయ క్రియాకలాపమునే వారు కెథార్సిస్ అనినట్లు తెలియుచున్నది. (నా. శా. 6. పు. 230).

**కైశికీవృత్తి :** నాట్య (నాటక)ములకు మాతృకలైన నాలుగు వృత్తులలో ఒకటి. సుకుమారవస్త్రమాల్యాదులచే చిత్రమైనది. గీత, నృత్త, బాహుళ్యము గలది; స్త్రీ పాత్రలు మాత్రమే ప్రయోగించుటకు నిర్దిష్టమైనది. కామోపభోగము (రతి) చే జనించునది అగువ్యాపారము కైశికీవృత్తి. ఈ వృత్తి భేదములు నాలుగు. చూ. 1. నర్మము. 2. నర్మస్ఫుంజము. 3. నర్మస్ఫోటము. 4. నర్మగర్భము. (నా. శా. 20 - పు. 617).

స్త్రీపురుషుల శృంగారచేష్టలు తెలుపునటన అని (ద.రూ. 2-47-50).

స్త్రీపాత్రల విలాస, నృత్య, గీత బాహుళ్యము గలది అని (సా. ద. 6. పు. 169)

*కైశికీవృత్తిలేని రూపకములు :* కైశికీవృత్తి ప్రధానముగాలేని రూపకములు; శృంగారోచితమైన వృత్తి కైశికి. పూర్ణవృత్తి రూపకము లనదగినవి నాటకము, ప్రకరణము ఈ రెండే. తక్కిన 8 అపూర్ణవృత్తి రూపకము లని, కైశికీవృత్తి ప్రధానముగాలేనివని వీటిలో హాస్యముగూడ అప్రధానము, గానే ఉండునని తెలియవలె. అయినను వీరరసప్రధానములైన ముద్రా రాక్షసము వంటి నాటకములుగూడకొన్ని కైశికీవృత్తి రహితము లుగా ఉన్న విశేషము తెలియదగినది. (నా.శా. 18-పు. 512).

*కోరస్ :* బృందగానము. రూపక ప్రదర్శనమునకు ముందు కొందరు కలసి పాడెడి పాట. ఈ బృందగానముచేయువారే రూపకమునకు సాక్షిభూతులైన ప్రేక్షకులుగా ఉండుచు క్రమముగా రూపకములోని పాత్రలుగా మారు చుందురు. గ్రీకు దేశమున అలెగ్జాండర్ నాటికి కోరస్ అవతరించినది (నా శా.పు. 25, 65).

*క్రమము :* గర్భసంధికి గల 11 అంగములలో ఒకటి : భావనా బలముచే ఒక వస్తువుయొక్క పరమార్థమును గ్రహించుట క్రమము (నా.శా. 19 - పు. 574). అభిలషించిన ఫలమును అందుకొనుటకొరకే మనస్సు అతిశయముగ ఉత్తలపడుటను క్రమము అనిరి (ద. రూ. 1-39). ఉదా శాకుంతలములో రాజు :- 'యుక్తముగదా మూయమరచిన కంటితో నేను ప్రియను చూచుట' అని (సా. ద. 6 - పు. 159).

*క్రీడనీయకము :* దృశ్యము, శ్రవ్యము అయిన క్రీడ (=నాట్యము, నాటకము) (నా. శా. పు. 4, 5, 865).

*క్రోధము :* సంధ్యంతరములు 21. అందులో ఒకటి: దీని వివరణ మన్యగ్రంథము. చూ. సంధ్యంతరములు.

*క్షమ :* నాట్య (నాటక) మునకు గల 36 లక్షణములలో ఒకటి : అ..గు. అనుసరించిన ఉపజాతివృత్తపాఠము ప్రకారము : పరుషములు, క్రోధ జనకములు అయిన దుర్జనులాడిన మాటలు విని సభలో పీడితుడయ్యును కోపము తెచ్చుకొనకుండుటను 'క్షమ' అనిరి. (ఇది అనుష్టుప్‌వృత్త పాఠము లోని 'విశేషణ' నిర్వచనమునకు భిన్నపాఠమైనను సమన్వితమైనది. "ప్రసిద్ధ ములు, ప్రధానములు అయిన పెక్కు అర్థములను విడిచి విశేషముగా ఒక్క దానిని పేర్కొనుట అనగా కోపముతో చేసిన నింద - దీనిని విశేషణము అనిరి) (నా. శా. 16 పు 448).

*క్షిప్తి :* చూ. ఆక్షిప్తి.

*క్షోభము :* నాట్య (నాటక) మునకుగల 36 లక్షణములలో ఒకటి. చూ. పరిదేవనము.

**ఖండిత** : శృంగారనాయిక. చూ. నాయికలు అష్టవిధములు

**ఖేదము** : విమర్శ సంధికిగల 13 అంగములలో ఒకటి: శారీరకముగా, మానసికముగా కలిగిన శ్రమ ఖేదము (నా. శా. 19 - పు. 575). ద. రూ. దీనిని గుర్తించదు.-ఖేదమునకు ఉదా॥ "మాలతీ మాధవము"లో "దళిత హృదయం గాఢోద్వేగం, ద్విధాతునభిద్యతే" (గాఢమైన ఉద్వేగము గుండెను పగుల్చుచున్నది. కాని అది రెండుగా చీలుటలేదు) (సా.ద. 6 పు. 164).

**గండము** : వీథ్యంగము, వీథి అను రూపకమునకు గల 13 అంగములలో ఒకటి. సంరంభకృతమైన ఆవేగము, వివాదము, అపవాదము ఇవి కారణముగా కొంచెము అసమాప్తముగా ఇచ్చిన సమాధానము గండము అనబడును (నా.శా. 18 పు. 580).

ప్రస్తుతమునకు సంబంధించినదే అయినను హఠాత్తుగా ఇంకొక విషయముపై అనిన మాటను గండము అనిరి. ఉదా॥ ఉత్తరరామచరితములో రాముడు సీతను తలచుకొని "ఈమె నా గృహలక్ష్మి" నా కనులకు అమృతము వంటిది...సరేకాని ఎంతకును సహించరాని విరహమొక్కటి లేకున్న బాగుండెడిది" అని (ద.రూ. 3-18).

**గణిక 1:** (నాయిక) చూ. సామాన్య.

**గణిక 2:** (నర్తకి) నాటక ప్రయోక్తల (సంఖ్య 9) లో ఒకతి: గణిక కళా ప్రయోగములో ఆచార్యుల మెప్పువడసినది. లీలా - హావ - భావ-సత్త్వ-వినయ- మాధుర్య సంపన్న, చతుష్షష్టి కళాన్విత, నృత్తోపచార (రాజోపచార), స్త్రీదోషవర్జిత, ప్రియవాదిని, ప్రియకథాకుశల, స్ఫుటావయవ, దక్ష, జితశ్రమ. ఇటువంటి గుణములు గల నర్తకి అరుదుగా లభించును. (నా. శా- 35. పు-855).

**గమ్యా:** సంభోగమునకు వావి అయిన స్త్రీ చూ. అగమ్యా:

**గర్భసంధి:** ఆధికారిక (ప్రధాన) ఇతివృత్తమున కుండవలసిన అయిదు ప్రధాన సంధులలో మూడవది. బీజము యొక్క ప్రాప్తి (ఉద్భేదము), అప్రాప్తి, మరల అన్వేషణ ఈ మూడింటికి కూడలియైన కథాభాగమునే గర్భసంధి అందురు. ఇందు బీజము (ప్రాప్తిని-ఉద్భేదమును-అనగా) ఫలజననాభిముఖ్యస్థితిని పొందును. అనగా బీజము ముఖ సంధిలో ఉత్పన్నమై, ప్రతిముఖ సంధిలో ఉద్ఘాటితమై, గర్భసంధిలో ఫలోన్ముఖమగునని సారాంశము, ఇందు ప్రాప్తి సంభవావస్థ ఉండును కాబట్టి అప్రాప్తిని ప్రధానముగాను, ప్రాప్త్యంశమును అప్రధానముగాను సూచించవలె. విమర్శసంధిలో ప్రాప్తికి ప్రాధాన్యమును అప్రాప్తి అంశమునకు న్యూనతయు కల్పించవలసి ఉండును. ఈ సంధికి అంగములు 13. చూ 1. అభూతాహరణము 2. మార్గము 3. రూపము 4. ఉదాహరణము 5. క్రమము 6. సంగ్రహము 7. అనుమానము 8. ప్రార్థన 9. అక్షిప్తి 10. తోటకము 11. అధిబలము 12. ఉద్వేగము 13. విద్రవము (నా.శా. 19-పు. 573) ప్రార్థన, విద్రవము వీటికి బదులుగా

ద.రూ. సంభ్రమము, లక్షణము వీటిని చెప్పినది (ద. రూ. 1-37,38) లక్షణమునకు లక్ష్య, లక్షణములు లభించవు.

*గర్భాంకము:* అంకమునందు ప్రదర్శించు వేరొక అంకము అనగా నాటకము నందు ఇంకొక నాటకమును ప్రదర్శించుట. రంగద్వారము, ఆముఖము, బీజము, ఫలము వీటితో కూడినది, (సా ద. 6-పు 135). నా. శా. (22-పు. 661) చెప్పిన నాట్యాయిత లక్షణము ఇట్లే ఉన్నది. దీనిని నేడు అంత ర్నాటకము అనుచున్నారు.

*గర్హణము:* నాట్య (నాటక)మునకు భూషణ ప్రాయములైన 36 లక్షణము లలో ఒకటి: చూ. కపటము.

*గీతవిధి:* పూర్వ రంగ (బహిర్యవనిక) అంగములు 10. అందులో ఒకటి: దేవతలను కీర్తించుట కొరకు నిర్దిష్టమైన గేయపఠన కార్యక్రమమును గీతవిధి అనిరి (నా.శా: 5-పు-158).

*గుణకీర్తనము:* నాట్య (నాటక) మునకు భూషణ ప్రాయములైన లక్షణములు 36. అందులో ఒకటి: అ. గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకా రము: వివిధార్థ సముద్భవములైన గుణములను కీర్తించుచు దోషములను కల్పించకుండుట "గుణకీర్తనము'' (ఇది అనుష్టుప్ వృ. పా. లోని గుణ కీర్తనముతో సమన్వితమైనది: లోకములోని గుణాతిశయమైన అనేకుల నామ ములతో ఒకనినే నిర్దేశించుట గుణకీర్తనము) (నా.శా.16-పు. 444:)

*గుణాతిపాతము:* నాట్య (నాటక) మునకు భూషణ ప్రాయములైన 36 లక్షణ ములలో ఒకటి: చూ: గుణానువాదము.

*గుణానువాదము:* నాట్య (నాటక)మునకు భూషణ ప్రాయములైన 36 లక్షణ ములలో ఒకటి. అ. గు. ఉపజాతి వృత్తపాఠము ప్రకారము: హీనులను ఉత్తములతో పోల్చుటను 'గుణానువాదము' అనిరి. (అనుష్టుప్ వృ.పా.లోని గుణాతిపాతము ఇదే, సమన్వితమైనది: ఉపమానరూపములై వివిదార్థములలో ఉన్న మధుర, ఉదాత్తాది గుణముల సాదృశ్యముతో ఉపమేయములో గుణములను కల్పించుట 'గుణాతిపాతము') (నా.శా. 16-పు.445):

*గుప్త:* నాయికాభేదము. చూ. పరకీయ.

*గుహ్యాగూహనము:* సంధ్యంగ ప్రయోజనము సంధ్యంగములను తగినట్లుగా కూర్చుటకు ఉద్దేశించిన 6 ప్రయోజనములలో ఒకటి. గోప్యార్థములను గోపనము చేయుటయే అనగా కప్పి పుచ్చుటయే గుహ్యా గూహనము (నా.శా.19-పు.570)

*గేయపదము:* లాస్యాంగములు 10. వాటిలో ఒకటి. నాయికగాని, గాయని గాని ఆసనముపై ఉండి వాద్యసహితమైన శుష్కగానము (అభినయశూన్య మైనది) చేయుటను గేయపదమందురు. ఉదా॥ నాగానందమునందు ప్రథ మాంకములో మలయవతి వీణపై పాడుట. ప్రియుని గుణగణములను గేయ

రూపమున పాడుచు సాంగోపాంగముగా అభినయించు విధానమును గూడ గేయ పదమందురు (నా.శా. 19.పు. 581)

*గేయరూపకములు*: హేమచంద్రుని విభజనప్రకారము కావ్యము రెండువిధములు. 1. ప్రేక్ష్యము 2. శ్రవ్యము. ప్రేక్షములు అభినేయములు, శ్రవ్యములు అనభినేయములు. ప్రేక్ష్యములు పాఠ్య, గేయ భేదములచే రెండు విధములు. నాటికాసట్టకాదులతోపాటు దశవిధరూపకములు గూడ పాఠ్యము లగుచున్నవి.

డోంబికా-భాణ-ప్రస్థాన-శింగక-భాణికా-ప్రేరణ-రామాక్రీడ-హల్లీసక-రాసక-గోష్ఠి-శ్రీ గదిత-రాగకావ్య-శంపా-ఛలిత-ద్విపది మొ॥ గేయ రూపకములు. మసృణ, ఉద్ధత, మిశ్రభేదములచే గేయ కావ్యములు మూడు విధములు (నా. శా. 18-పు 536).

*గోత్రస్ఖలితము*: సంధ్యంతరములు 21. అందులో ఒకటి: ఈర్ష్యా విప్రలంభమునందు అంతటను ఉపయుక్తమగునది గోత్ర స్ఖలితము (నా. శా.19—పు 578). పేరును వ్యతిక్రమముగా చెప్పుటను గోత్రస్ఖలితము అందురు. (హిం.సా.కో: పు 860) ప్రియురాలి ఎదుట పొరపాటున పరకాంత పేరెత్తుట (క్రీడాభిరామము 57)

*గోపుచ్ఛాగ్రతుల్యత్వము*: ఇతివృత్త నిర్మాణమున గోపుచ్ఛము (ఆవుతోక - చివరికుచ్చు) మొదట సన్నముగా, మధ్యలావుగా, చివర చాలా సన్నముగా ఉన్నట్లే బీజము ఆదిలో అల్పమైనను తర్వాత విస్తరించినదై నిర్వహణములో సమాప్తినందవలె. గోపుచ్ఛాగ్రమనగా క్రమ సూక్ష్మాంగమని కొందరనిరి. మరికొందరు గోపుచ్ఛములో కొన్ని వెంట్రుకలు పొట్టిగా, కొన్ని పొడవుగా ఉన్నట్లే కొన్ని కార్యములు ముఖసంధిలోనే సమాప్తము లగునని, మరికొన్ని ప్రతిముఖ, గర్భ, అవమర్శ సంధులలో సారభూతములై నిర్వహణ సంధిలో పరిసమాప్తినందునని అందురు (నా.శా. 18 పు: 520).

*గోష్ఠి*: ఉపరూపకము. ప్రాకృత పురుషులు 9 లేదా 10 మంది ఉందురు. గర్భ విమర్శ సంధులుండవు. వచనము ఉత్కృష్టము కాదు. కామ శృంగారమే ప్రధానము. ఒకే అంకము. వృత్తి కైశికి ఉదా॥ రైవతమదనిక (సా.ద. 6. పు. 200)

*గ్రథనము*: నిర్వహణ సంధికిగల 14 అంగములలో ఒకటి. కార్యములను ఉపక్షేపము అనగా అవి జ్ఞాతములుగా సూచితములైన కార్య విశేషములన్నింటిని ఏ కార్థములగునట్లు కూర్చుటను గ్రథనము అనిరి (నా.శా.19-పు576). కార్యసాఫల్యమును వాచా సూచించుట గ్రథనము. ఉదా॥ వేణీసంహారములో దుశ్శాసనుని వధ విని ద్రౌపది వేణి సవరించుకొనబోగా భీముడు "దేవీ నీకా తొందర యేల! నేనే నా చేతులతో నీ వేణిని సవరింతును" అనుట. (ద. రూ. 1-51).

*గ్రీకు నాటక శాల*: ప్రాచీన గ్రీసుదేశమున నాట్య (నాటక) శాలల నిర్మాణము లేదు. ఏదో ఒక కొండలోయలో డయొనిసస్ గ్రీకుల (ప్రకృతి దేవత) ఉత్స

వము జరుగుచుండెడిది. డయొనిసస్ గుడికి ముందు వృత్తాకారముగా ఒక నృత్తరంగము (dancing-floor) ఉండెడిది. దానిపై 20-30 వేల మంది ప్రేక్షకుల వరకు కూర్చొనువారు. క్రమముగా నాటకశాలవేరై నేపథ్య గృహము తదితరములు ఏర్పడినవి (నా. శా. 2-పు. 64,65)

*గ్రీకునాటకోత్పత్తి*: డయొనిసస్-బేకస్ (గ్రీకుల ప్రకృతి దేవత)ను ఆరాధించు సందర్భమున గ్రీకు ప్రజలు గుమిగూడి పాటలు పాడెడివారు (కోరస్-బృందగానము అవతరించుటకు ఇదే మూలము). ఈ పాటలు అప్పటికప్పుడే కల్పించిపాడెడివారు. ఏరియాన్ (Arion అను సంగీతవేత్త)కాలమునుండియే ఆ పాటలు కవులువ్రాయు ఆచారమేర్పడినది. క్రమముగా ఆపాటలు పాడుటకు నాయకుడు, బృందము, ఆ గాయకులేనటులై వేర్వేరు కృత్రిమ ముఖములతో వివిధ భూమికలతో నటించుట, చారిత్రక గాథలు, ఇతిహాసములు, ట్రాజెడీ, కామెడీ రూపములుగాఅవతరించుట జరిగినది.(నా.శా.1-పు.24-25)

*గ్రీకు రూపక ప్రదర్శనము*: అది ప్రభాతకాలమున జరిగెడిది. పోటీ ప్రదర్శనములు జరిగెడివి: నాటకపు పోటీలలో ఎస్కిలస్ 13 సార్లు, సోఫోక్లిస్ 18 సార్లు ప్రథమములుగా నెగ్గివచ్చిన ఉదంతములున్నవి (నా.శా.27.పు.763).

*గ్రీకు రూపకప్రాబల్యావాదము*: క్రీ. పూ. 5, 4 శతాబ్దులనాటికే గ్రీకు రూపకములు విశిష్టత నార్జించుకొని ప్రామాణిక దశకెక్కినవి(ఇవి మతప్రాతిపదికపై రచితమైనవని తెలియవలె). సంస్కృత రూపక రచన క్రీ. పూ 200-క్రీ.శ. 200 మధ్యకాలములో జరిగినదని "భారతీయ రూపకములకు గ్రీకు రూపకములు మూలములు" అని కొందరి వాదము. ఈ వాదము సరియైనదికాదను అభిప్రాయములును ఉన్నవి. చూ. ఎ. బి. కీత్ రచించిన సంస్కృత రూపకము (Sanskrit Drama).

*గ్రీకుల నృత్యము*: గ్రీకులు మొదట నృత్తకళను (డయొనిసస్ ఉత్సవములను సందర్భములుగా చేసుకొని) వృద్ధిపరచిరి. ఈ నృత్తములో కేవలము గాత్ర విక్షేపమే కాక పాటకూడ ఉండెడిది. "డిథీరాంబ్" అనునది ఒకరకమైన పాట. ఈ 'ఆట పాట' ప్రక్రియయే గ్రీకు నాటకోత్పత్తికి మూలము.

*చతుర్థ పతాకాస్థానకము*: పతాకా స్థానకములు 4. ఇది నాలుగవది: ఇంకొక అర్థమును సాధించునట్లు సుశ్లిష్టముగా కావ్యమునందు ఉపయుక్తమైన రెండర్థములుగల వాక్యమును చతుర్థ పతాకాస్థానకము అందురు (నా. శా. 19. పు. 567)

*చారి*: పూర్వరంగాంగములు రెండు విధములు (1) అంతర్యవనికాంగములు 9 (11) బహిర్యవనికాంగములు 10. 'చారి' బహిర్యవని కాంగములకు చెందినది: శృంగారాభినయమును చారి అందురు.

*చిత్రపదము*: లాస్యాంగము. అ. గు. గుర్తించని విశేషపాఠము. మదనపరవశ అయిన స్త్రీ ప్రియుని ఆకృతిని చూచి మనస్సును వినోదింపచేసికొనుటను (వి) చిత్రపదము అందురు (నా. శా. 19పు 583).

*చిత్రము*: సంధ్యంతరములు 21. అందులో ఒకటి. దీని వివరణ మృగ్యము. చూ. సంధ్యంతరములు,

*చిత్రాభినయము*: వచనగతము (వాచికము): ఆకాశవచన-ఆత్మగత-అపవారితక-జనాంతిక-కర్ణోక్తములు ప్రదర్శించు సమయమున చిత్రమైన నటన చేయివలసివచ్చును. అందుచే దీనిని చిత్రాభినయము అనిరి (నా.శా)

*చూర్ణము*: గద్యము. ద్వివిధ కావ్య రచనలలో ఒకటి (నా. శా)

*చూళిక*: అర్థోక్షేపకములు (విష్కంభాదులు) 5, అందులో ఇదొకటి: యవనిక లోపల ఉన్న సూతాదులు అర్థమును (కథా విశేషమును) వివిధములుగా సూచించు పద్ధతిని చూళిక అందురు. (నా. శా. 19. పు 579).—తెరవెనుక నున్న పాత్రలు వర్తమాన, భావి కథార్థములను సూచించు పద్ధతిని చూళిక అనిరి (ద. రూ. 1-61).

*చేటుడు*: నాయక సహాయులలో ఒకడు. నాటక ప్రయోక్తలలో ముఖ్యులైన వారిలో ఒకడు: కళాప్రియుడు, బహుకథా కుశలుడు, విరూపుడు, గంధ సేవకుడు మాన్యా మాన్య విశేషజ్ఞుడు అయిన వాడే చేటుడు అని (నా.శా. 35. పు. 855)-శృంగార విషయమున నాయికా నాయకులను కూర్చుటలో నేర్పరి చేటుడు అని (ర. మ. 2-118).

*ఛందస్సు*: నాటకాదులలో పద్యములుండుట భరతాదులు ఇష్టపడినదే. ఆయా వృత్త భేదములచే ఆయారసములు ద్యోతకములగునని ఇటు భారతీయులు, అటు పాశ్చాత్యులు అభిప్రాయపడిరి (నా.శా. 15పు 438) చూ క్షేమేంద్రుని "సువృత్త తిలకము".

*ఛలము*: వీథ్యంగములు 13, వాటిలో ఒకటి. ప్రయోజనాంతరమును ఉద్దేశించిన సమాధానము ఒకరికి రోష జనకమును, మరియొకరికి హాస్యజనకమును, ఇంకొకరికి అభిసంధి జనకమును అయినచో ఛలము(నా. శా. 18 పు 530). ప్రియమువలె భాసించు అప్రియ వాక్యములు ప్రయోగించి మోసగించుటయే ఛలము (ద.రూ.3-17). ఉదా॥ వేణీ సంహారములో భీమార్జునులు "కర్తాద్యూతచ్ఛలానాం" అనిన సందర్భము (సా. ద. 6. పు 196).

*ఛాదనము*: విమర్శ సంధికి గల 13 అంగములలో ఒకటి. దుష్టమైన అర్థము కూడ, కలిగిన అవమానముచే బహుమానింపబడినచో ఆ వాక్యార్థమును ఛాదనము అందురు. (నాటక లక్షణ రత్నకోశము ననుసరించి దీనిని 'సాదనము' అనుట సమంజసమని డా. ఘోష్ అభిప్రాయపడెను. కాని అవమాన కళంకమును ఆచ్ఛాదించున దగుటచే 'ఛాదనము' అనుటయే యుక్తము (నా.శా. 19 పు. 575).

కార్య సాధనము నాశించి అవమానములు ఓర్చుట ఛాదనము ఉదా॥ వేణిలో అర్జునుడు "అప్రియాణికరోత్యేష=వీడు అప్రియములు సేయుగాక" అనిన సందర్భము (సా. ద. 6 పు. 65).

*జనాంతికము*: ఆకాశవచనాదులైన వాచికాభినయ (చిత్రాభినయ) భేదములలో

ఒకటి; కార్యవశమున ప్రక్కన ఉన్న పాత్రలు వినరానిది జనాంతికము. గూఢార్థయుక్తములై నియతశ్రావ్యములైన జనాంతిక వాక్యములను పాత్రధారి త్రిపతాకాహస్తముచే వినిపించునప్పుడు ఆ మాటలకు సంబంధించిన పాత్రలు తప్ప మిగతా వారు వినవచ్చును (నా. శా. 25 పు 725- ద. రూ. 1-65). ఇది ఏకాంత భాషణమని ప్రేక్షకులు గ్రహించుటకు పట్టునది త్రిపతాహస్తకము. బొటన వ్రేలిని వంచి, చూపుడు వ్రేలు మొదట గుచ్చి, ఉంగరపు వ్రేలిని వంచి మిగిలిన వ్రేళ్ళను చాచి పట్టుహస్తము. 'జనాంతికము' అని మెల్లగా భాషింపరాదు, పెద్దగానే మాట్లాడవలె (కా. క. ఉపక్రమణిక).

*జన్యరూపకములు:* భరతుడు చెప్పిన రూపకములు 10 మాత్రమే. తర్వాత 'నాటిక' అనురూపకము నా. శా.లో ప్రక్షిప్తమైనట్లున్నది. 'ప్రకరణిక' కూడ అటువంటిదే. అ. గు. వీటిని వ్యాఖ్యానించెను. నాటక-ప్రకరణముల ఉచిత సంయోగముచే పెక్కు రూపకములు జనించును. ఇవే జన్య రూపకములు. అ. గు; నాటకాదులను వ్యాఖ్యానించుట వలన కోహలాదులు చెప్పిన తోటక-సట్టకాదులకు లాక్షణికుల అంగీకారము లభించినట్లే (నా.శా. 18 పు. 509)

నాటకము నుండి వీధివరకు ఉన్న దశవిధ రూపకములకు వరుసగా-నాటిక, ప్రకరణిక, చిత్ర, చిత్రతాల, డిమిక, జుగుప్సిత, వియోగిని, హాసిక, భాణిక, కలోత్సాహవతి-ఇవి జన్య రూపకములై కోహలుని వింగడింపులో మార్గరూపకములైనవి (నా. శా. 18 పు. 144).

*జవనిక:* యవనికకు పర్యాయపదము రాజశేఖరుడు (క్రీ. శ. 10 వశ.) తన కర్పూరమంజరి (ప్రాకృతభాషా రూపకము)లో అంకములు అనుటకు బదులు 'జవనికాంతరములు' అన్నాడు. యవన (గ్రీసు, పర్షియా, ఈజిప్టు మొ|) దేశములనుండి దిగుమతి అయిన వస్త్రముచే తయారైన తెర అని దీని అర్థము. జవనిక శబ్దము కూడ సంస్కృతమే అని సమర్థించిరి (నా. శా. 5-పు 185).

*జాయప సేనాని:* నృత్త్యరత్నావళికర్తయైన జాయ(జాయన-జాయప) సేనాని కాకతీయ గణపతి దేవుని వద్ద గజసైన్యనాథుడుగా ఉండి క్రీ. శ. 1253-54 ప్రాంతమున 'నృత్తరత్నావళి' 'గీత రత్నావళి' అను గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది. నృత్త రత్నావళిలో ముఖ్యమైన భాగములు రెండు (i) మార్గ వృత్తము (భరతాదుల ననుసరించి చెప్పినది) (ii) దేశివృత్తము. మతంగుని బృహద్దేశిని అనుసరించి చెప్పినది (నా. శా. 4. పు. 146)

*జ్ఞాతయౌవన:* నాయిక, దశాభేదము చూ. ముగ్ధ.

*ట్రాజెడీ :* చూ. విషాదరూపకము.

*డిమము :* దశవిధ రూపకములలో ఐదవది. లక్షణము 1. ఇతి వృత్తము: ప్రఖ్యాతమైనదై ఉండవలె 2. నాయకుడు: ప్రఖ్యాతుడు, ఉదాత్తుడు

కావలె 3. అంకములు: 4 ఉండవలె. 4. సంధులు: అవమర్శము తప్ప తక్కిన నాలుగు ఉండవలె 5. వృత్తులు: సాత్వతి, ఆరభటి ఈ రెండు కూర్చవలె 6 రసములు: శృంగార, హాస్యములు తప్ప మిగిలిన ఆరు ప్రదర్శించవచ్చు. 7 విశేషములు: ఇతివృత్తముదీప్తరసోపేతముగా, నానాభావోప సంపన్నముగా, దేవ-నాగ-యక్ష-రాక్షస-పిశాచ చరిత్ర సంయుక్తముగా, ఉండవలె. దీనిలో 16 గురు పురుషులుందురు. దీని జన్య రూపకము 'డిమిక' (నా.శా 18 పు.143)-కైశికి తప్ప మిగతావృత్తులు కూర్చవచ్చు. రౌద్ర రసము అంగి. ప్రస్తావనాదులు నాటకమునకు వలెనే (ద రూ. 3.57-59)-విష్కంభక, ప్రవేశకములు లేవు. ఉదా॥ 'త్రిపురదాహము' డిమము (సా. ద. 6. పు. 194)

*డ్రమెటిక్ ఐరనీ:* పాశ్చాత్యుల Dramatic Irony భారతీయాలంకారికులు వ్యాఖ్యానించిన 'పతాకాస్థాకము' వంటిది. పతాకాస్థానకము భావ్యర్థ సూచకముగా ఉండవలెనని ధనికాదులు తెలిపిరి. ఇది సంఘటనము అందు గాని, సన్నివేశములందుగాని, శబ్దము నందుగాని, వీటి మిశ్రమందుగాని గాని వ్యక్తమగుచుండును. ఎచ్చట Ignorance of the sequel on the part of the personages represented clashes w.th the knowledge of it on the part of the audience" అనునది జరుగునో అచ్చట Dramatic Irony ఉండును. (నా. శా. .9 పు. 566)

తాపనము : ప్రతిముఖ సంధికిగల 13 అంగములలో ఒకటి; అపాయమును దర్శించుట తాపనము అనబడును (నా.శా.19 పు. 573) ఉదా॥ రత్నావళిలో సాగరిక:— "... ప్రేమ విషమముగానున్నది, ఇక మరణమొక్కటే నాకు శరణము" (సా.ద. 6. పు. 156).

తుల్యతర్కము : చూ. ఆక్రందము.

తృతీయ పతాకాస్థానకము: పతాకా స్థానకములు 4. ఇది మూడవది; అస్ఫుటముగా ఉన్న అర్థమును అభిప్రాయాంతరముతో ప్రయుక్తమై ప్రకృతాన్వయము సముచితమగు ప్రత్యుత్తరముచే విశేష నిశ్చయ సహితముగా స్ఫుటమొనరించు వాక్యము మూడవ పతాకాస్థానకము అనబడును ( నా. శా. 19. పు. 567). ఉదా॥ వేణీ సంహారములో దుర్యోధనుని ఊరుభంగమైన వార్త విన్నప్పుడు ధర్మరాజు, కంచుకితో ఆత్రముగా మాట్లాడు సన్నివేశము (సా. ద. 6. పు. 143).

తోటకము : గర్భసంధికిగల 13 అంగములలో ఒకటి : ఆవేగముతో కూడిన వచనము తోటకము (నా. శా. 19. పు. 574). రోషావేశముతో కూడిన వచనము త్రోటకము ఉదా॥ చండకౌశికములో కౌశికుడు:- "ఆ ఇప్పటికిని స్వర్ణదక్షిణలు చెల్లలేదేమి? " (సా. ద. 6. పు. 160).

త్రిగతము 1 : త్రికము, పూర్వరంగ (బహిర్యవనిక) అంగములలో ఒకటి. సూత్రధారుడు, విదూషకుడు, పారిపార్శ్వకుడు ఈముగ్గురు ప్రదర్శింపబోవు రూపకమును సూచించుటకై చేయు హాస్యయుత, వాగ్వివాదయుత సంభాషణ (నా. శా. 5. పు 160). చూ. నాందిసూత్రధారుడు.

త్రిగతము 2 : వీథ్యంగములు 13. వాటిలో ఒకటి : హాస్యమైనను, కాకున్నను ఒకే ప్రతివచనమునకు శబ్దసారూప్యముచేతను, వాక్యాదులచేతను అనేకార్థములు తోచినచో దానిని త్రిగతము అనిరి (నా. శా. 18. పు. 530) శబ్దసామ్యముచే ఒకేపదమునకు మూడర్థములు వచ్చుట త్రిగతము. పూర్వరంగములో ముగ్గురు పాత్రలమధ్య సంభాషణమని కొందరు (ద. రూ. 3. 16). —శ్రుతిసామ్యముచే అనేకార్థములు (ప్రశ్నలు, ఉత్తరములు కలగలుపుగా) యోజించుట త్రిగతము. ఉదా॥ విక్రమోర్వశీయములో రాజు "సర్వక్షితిభృతాంనాథ" అనిన పద్యము (సా. ద. 6. పు. 195).

త్రిమూఢకము : లాస్యాంగములు 10, వాటిలో ఒకటి. లలితమైన పదములతో, సమవృత్తములతో అలంకృతమైనదై, పురుష భావాఢ్యమైన నాట్యమును త్రిమూఢకము అందురు. 'రత్నావళి' ద్వితీయాంకములో దీనికి ఉదాహరణమున్నది (నా. శా. 19. పు. 583).

త్రివిధనాయికలు : చూ. స్వీయ, పరకీయ. సామాన్య.

త్రివిధనాయికలు : స్వీయ, పరకీయ, సామాన్యఈత్రివిధ—నాయికలు ప్రకారాంతరమున ప్రతి ఒక్కరు మూడు విధములగుచున్నారు. 1. అన్యసంభోగదుఃఖిత : తననాయకుడు అన్యస్త్రీతో సంభోగించినందుకు

దుఃఖించునది. 2. వక్రోక్తిగర్వితః దీని అవాంతర భేదములు రెండు (i) ప్రేమగర్విత, నాయకునకు తనయందున్న ప్రేమను తలచి గర్వించునది. (ii) సౌందర్యగర్వితః తనకున్న సౌందర్యమునకు గర్వించునది. 3. మానవతి దీని అవాంతరభేదములు మూడు. (i) లఘుమాన (ii) మధ్యమమాన. (iii) గురుమాన. నిర్వచనములు, ఉదాహరణములు సులభముగా ఊహించవచ్చు. (ర. మ. 1 33-38).

*త్రివిధపతులు* : త్రివిధనాయకులు. నాయకుల 'దివ్యా' దివిభజన జాతి సంబంధమైనదని, 'ధీరోదాత్తా' దివిభజనలో కూడ జాతిప్రసక్తి ఉన్నదని ప్రాచీనమైన ఈ విభజనను నిరసించి, నాయకుల అవస్థలు, (ఉత్తమాది) ప్రకృతిభేదములు మాత్రమే పరిగణించి ఆధునిక మతమును స్థాపించిన 'రసమంజరి' పతులు (నాయకులు) మూడు విధములన్నది. చూ. పతి, ఉపపతి, వైశికుడు.

*త్రివిధపతులు-ప్రోషితులు* : నాయక భేదాంతరములు. ప్రియను విడిచి దేశాంతరము పోవువారు ప్రోషితులు. వీరు మూడువిధములు: 1. ప్రోషిత పతి 2. ప్రోషిత ఉపపతి. 3. ప్రోషిత వైశికుడు(ర. మ. 2. 112-114). లక్ష్య లక్షణములు సులభముగా గ్రహించవచ్చు.

*త్రోటకము* : ఉపరూపకము. 5-7-8-9 అంకములుండును. దివ్యాదివ్యుడు నాయకుడు. ప్రతి అంకమున విదూషకుడుండును. శృంగారము అంగిరసము సప్తాంకమునకు ఉదా॥ స్తంభితరంభము, పంచాంకమునకు ఉదా॥ విక్రమోర్వశీయము (సా. ద. 6. పు. 200).

*దండము* : సంధ్యంతరములు 21. అందులో దండము ఒకటి: అవినయమును చూచి, గ్రహించి బెదరించుటనుగాని, మందలించుటనుగాని దండము అందురు (హిం. సా. కో. పు. 360).

*దక్షిణుడు* - నల్గురు శృంగార నాయకులలో ఒకడు: అనేక స్త్రీలయందుసమమైన అనురాగముకలవాడు (సా. ద. 3-35). ఉదా॥ శ్రీకృష్ణుడు. చూ. నాయకులు.

*దశరూపకములు* : లక్షణ భేదములచే నాట్యము (రూపము లేదా రూపకము) పది విధములు : లక్షణములకు చూ. 1. నాటకము 2. ప్రకరణము 3. అంకము 4. వ్యాయోగము 5. భాణము 6. సమవకారము 7. వీథి 8. ప్రహసనము 9. డిమము 10. ఈహామృగము (నా. శా. 18. పు. 508).

*దాక్షిణ్యము* : నాట్య (నాటక) మునకు భూషణ సదృశములైన 36 లక్షణములలో ఒకటి: చూ. యాచ్ఞ.

*దివ్యా* : మానవ, మానవేతర జాతి భేదములచే గుర్తించిన చతుర్విధనాయికలలో ఒకతి : ధీర, లలిత, ఉదాత్త, నిభృత లక్షణములుగల నాయిక దివ్య. నా. శా. (24. పు. 705).

*దుర్మల్లిక* ; మత్తల్లి, ఉపరూపకము. అంకములు 4, కైశికీ - భారతులుండవు గర్భసంధిలేదు, నాగరవాసులైన చతురులు పాత్రలు, నాయకుడు, హీన

కులుడు, విటక్రీడామయమైన ప్రథమాంకము 3 నాడికలలో ప్రదర్శితము కావలె. ద్వితీయాంకము 5 నాడికలలో, తృతీయాంకము 6 నాడికలలో (పీఠమర్దవిలాసము) పదర్శితముకావలె. నాగరిక జనులు క్రీడించు చతుర్థాంకము 10 నాడికలలో చూపవలె. ఉదా॥ బిందుమతి (సా.ద. 6 పు. 204).

*దూత* : దౌత్యము అని పాఠాంతరము. సంధ్యంతరములు 21. అందులో ఒకటి దీనివివరణ మృగ్యము. చూడు. సంధ్యంతరములు.

*దూతలు* . చూ. నాయక సహాయులు.

*దూతికలు* : చూ. నాయిక సహాయులు 1-13.

*దూతీకృత్యము* : అనేకకారణములు పేర్కొని నాయికా నాయకుల శృంగార సంబంధమునకు ప్రోత్సాహనముచేయుట, సందేశమును తు-చ తప్పకుండ చెప్పుట సరిగా ఆమె (నాయిక) భావమును ప్రకటించుట అనునవి దూతిక చేయవలసిన ముఖ్యమైన పనులు, మరియు నాయిక (నాయకుని) యొక్క కుల-భోగ-ధనాధిక్యములను అధికముగా పొగడి, అతని కోరికను నివేదించి సమాగమోపాయములను సూచింపవలె. అకామ ప్రవృత్త లేదా క్రుద్ధురాలు అయిన స్త్రీలతో సంగమము కలిగించరాదు. ఉపాయ రహితముగా సంగమమును కలిగించరాదు. ప్రథమ సమాగమమును (గాంధర్వ వివాహ-వేశ్యా-పునర్భూసంగమములను) రాత్రి సమయమున జరుగు ఉత్సవమున, ఉద్యానమున, మిత్రవేశ్మమున, ధాత్రీగృహమున, సఖీగేహమున, శూన్యాగారమున ఏర్పాటుచేయవలె జబ్బుగా ఉన్నవారిని చూడవలెనన్నట్లు లేదా ఆహ్వానముచే వెళ్ళినట్లు మిషను కల్పించి, విధిపూర్వకముగా ఉపాయసహితముగా ప్రథమ సమాగమమును కల్గించవలె. (నా. శా. 23-పు. 691).

*దూతీగుణములు* : నాయికా నాయకులను ప్రోత్సాహనము (సంముఖీకరణము) చేయుటలో కుశల, మధుర కథాయుత, దక్షిణ, కాలజ్ఞ, లడహ (ప్రగల్భ) సంవృతరహస్య (రహస్యమును దాచగలది), అయిన స్త్రీని దూతికగా పంపవలె, జడత్వము, రూపసంపద, ధనాతురతగల వ్యక్తిని దూతగాగాని, దూతికగాగాని ఎన్నడును నియోగించరాదు. (నా. శా. 23 పు. 691).

*దృశ్యము* : ప్రదర్శించుటకు వీలైన కథాఘట్టము చూ. రంగము, రంగాలంకరణము.

*దృష్టము* : నాట్య (నాటక) మునకు భూషణప్రాయములైన లక్షణములు 36 అందులో ఒకటి. చూ. సారూప్యము.

*దృష్టాంతము* : నాట్య (నాటక) మునకు భూషణ ప్రాయములైన లక్షణములు 36. అందులో ఒకటి: అ. గు. అనుసరించిన ఉపజాతి వృత్త పాఠము ప్రకారము : పూర్వము ఉపలబ్ధమైన విషయముల నిదర్శనముచే ప్రకృతమునకు వాటి సామ్యమును ఉపపాదించుటను దృష్టాంతము అనిరి. (అనుష్టుప్ పాఠములలోని దృష్టాంత నిర్వచనము ఇట్లు సమన్వితమగుచున్నది: హేతువుచే పక్షమునందు సాధ్యమును సాధించునప్పుడు సహాయకారియును,

సర్వలోక మనోగ్రాహియును అగు నిదర్శనము దృష్టాంతము) (నా.శా, 16. పు. 447).

**దేవులు** : ఆభ్యంతర (రాజాంతఃపుర) పరివారములో చేరిన స్త్రీలు: మహాదేవి (పట్టపురాణి) గుణములుగలవారే అయినను ఆ సంస్కారము లేనివారు. గర్వితలు, అతిసౌభాగ్యవతులు, పతిసంభోగతత్పరలు, శుచులు, నిత్యోజ్జ్వలాకారలు, ప్రతిపక్షమునందసూయకలవారు, వయోరూప గుణాఢ్యలు అయినవారు దేవులు (నా. శా. 24. పు. 706).

**ద్యుతి (ధృతి)** : విమర్శ సంధికిగల 13 అంగములలో ఒకటి: తిరస్కార సహితమైన వాక్యమును ద్యుతి లేదా ధృతి అనిరి. (నా.శా. 19. పు. 575) క్షోభోద్రేకములు జనించునట్లు చేయుచర్య ద్యుతి. ఉదా॥ వేణీసంహారములో భీముడు దుశ్శాసనుని చంపి "నృపశువులు మట్టిపాలయిరి" అనిన వాక్యము (ద. రూ. 1-46).

**ద్రవము** : అభిద్రవము. విమర్శ సంధికిగల 13 అంగములో ఒకటి: గురుతిరస్కారమును ద్రవము అనిరి. (నా. శా. 19. పు. 575). ఉదా॥ ఉత్తరరామచరితములో యాగాశ్వ బంధన సందర్భమున లవకుశులు రామలక్ష్మణుల నధిక్షేపించుట (ద. రూ. 1-46).

**ద్విజుడు** : నాయక సహాయుడు ; చతుర్విధ నాయకులకు శృంగార విషయమున ఉండు సహాయకులుగా చతుర్విధ విదూషకులు ఉందురు. ధీరలలితులైన నృపనాయకులకు విదూషకుడుగా ఉండువాడు ద్విజుడు. చూ. నాయక సహాయులు.

**ద్వితీయ పతాకా స్థానకము** : పతాకాస్థానకములు 4. ఇది రెండవది: ప్రకృతమునకు సంబంధించి సాతిశయముగా, శ్లిష్టముగా (రెండర్థములువచ్చునట్లుగా) చెప్పిన వాక్యమును రెండవ పతాకాస్థానకము అనిరి. ఆవాక్యములో ప్రకృతమునకు అప్రకృతమునకు రెంటికిని ఉచితమైన అర్థము ఉండవచ్చునని (నా. శా. 19. పు. 567), ప్రకృతమునకు, అప్రకృతమునకు సరిపోవు రెండర్థములు గల వాక్యములన్నియు దీనికి ఉదాహరణములే అగును.

**ద్విమూఢకము** : లాస్యాంగములు 10, వాటిలో ఒకటి. గీతాంగకములైన ముఖ-ప్రతిముఖములతో, చతురశ్ర పదక్రమముతో, శిష్టమైన రసభావములతో, విచిత్రార్థములతో కూడిన నాట్యమును ద్విమూఢకము అందురు. ఉదా॥ 'రత్నావళి' లోని ద్వితీయాంకము, –శుభార్థ గీతాభినయము, చతురశ్రపదక్రమము, స్పష్టభావరసోపేతము. వ్యాజచేష్టలుగలది ద్విమూఢకము అనిమరొక పాఠము. (నా. శా. 19. పు. 582),

**ధర్మి** : అభినయ ధర్మములు రెండువిధములు చూ. 1. లోకధర్మి 2. నాట్యధర్మి

**ధీరము॥ నాయికలు** : నాయకుని విషయమై కోపభావమును ప్రకటించుట, అట్లు ప్రకటించుటలో ప్రణయ భావమును అధికముగనో, అల్పముగనో కనబర

చుట. ఈ రెండంశములదృష్ట్యా నాయికలకు అబ్బిన ధైర్యాధైర్యములు ప్రధానముగా విభజించి ఆలంకారికులు చూపిన భేదములు 5:1. ధీర:— నాయకుని విషయమై తనకోపమును అస్పష్టముగ-వ్యంగ్యమైన చేష్టలద్వారా-ప్రకటించు నాయిక 2. ధీరాధీర:- కోపమును స్పష్టముగకొంత, అస్పష్టముగకొంత ప్రకటించు నాయిక 3. అధీర:- కోపమును స్పష్టముగా ప్రకటించు నాయిక. 4. జ్యేష్ఠ:- ప్రకటించు కోపభావములో ప్రణయ భావమును అధికముగా కనబరచు నాయిక. 5. కనిష్ఠ: ఆకోపభావములో ప్రణయభావమును అల్పముగా కనబరచు నాయిక. కలిపి చూచినపుడు ఈ ఐదుగురి భేదములు 6:1. ధీర—జ్యేష్ఠ (చూ. 'ధీర' స్వభావము 'జ్యేష్ఠ' స్వభావము కలసిన నాయిక. తక్కిన భేదము లిట్లే గ్రహించవచ్చు) 2. ధీర-కనిష్ఠ, 3. ధీరాధీర-జ్యేష్ఠ, 4. ధీరాధీర-కనిష్ఠ, 5. అధీర-జ్యేష్ఠ, 6. అధీర-కనిష్ఠ, (స్వీయలో అంతర్భేదములైన) మధ్యను, ప్రగల్భను; (పరకీయలో అంతర్భేదములైన) పరోఢను, కన్యను ఈ నల్గురిని విడివిడిగా ధీర-జ్యేష్ఠాది 6 భేదములలో పరిగణించినారు. (ర.మ. 1—11). చూ. నాయికలు (వారిసంఖ్య).

*ధీరలలితుడు :* నాయకుడు. రాజకులీనుడని నా. శా. (పు. 704). నిశ్చింతుడు, కళాసక్తుడు, సుఖి, మృదుస్వభావుడుఅని (ద. రూ. 2-3). ఉదా॥ వత్సరాజు చూ. నాయకులు.

*ధీరశాంతుడు :* నాయకుడు. ధీరప్రశాంతుడు బ్రాహ్మణ, క్షత్రియవణిగ్వర్గములకు దేనికో ఒకదానికి చెందినవాడని అందరు చెప్పిరి. ఉదా॥ 'మాలతీ మాధవము' లో మాధవుడు, 'మృచ్ఛకటికము' లో చారుదత్తుడు. (ద. రూ. 2-3), నాయకులు'అమాత్య విప్రవణిజామేకం కుర్యాచ్చనాయకం'(నాట్యశాస్త్రము) మాధవుఁడు క్షత్రియుఁడు. చారుదత్తుడు బ్రాహ్మణుడు. పుష్పభూషిత ప్రకరణమున వణిజుఁడు. నాయకుడు.

*ధీరోదాత్తుడు :* నాయకుడు. సేనాపతి, అమాత్య వర్గములకు చెందినవాడుకావలెనని నా. శా. (పు. 704). మహాసత్త్వుడు, అతిగంభీరుడు, క్షమావంతుడు, అవికత్థనుడు (పొగడుకొననివాడు), స్థిరుడు, అహంకారము తెలియనీయనివాడు, దృఢవ్రతుడు కావలెనని ఉదా॥ జీమూతవాహనుడు, శ్రీరాముడు అని (ద.రూ. 2-4) వీటితోపాటు కులీనుడుగా ఉండవలెనని (సా.ద. [illegible]). ప్రతాపరుద్రునివంటి ధీరుడై ఉండవలెనని (ప్ర.రు.పు. 19), చూ. నాయకులు

*ధీరోద్ధతుడు :* నాయకుడు. దివ్యవర్గమునకు చెందినవాడని నా.శా.(పు 704). దర్పమాత్సర్యములు గలవాడు, మాయావి, అహంకారి, చండస్వభావుడు, వికత్థనుడు (పొగడుకొనువాడు) అని (ద. రూ. 2-5) ఉదా॥ పరశురాముడు రావణుడు. ద. రూ. చెప్పిన లక్షణములుండుటచే విద్వాంసులు ఇతనిని ధీరోద్ధతుడనిరి. (సా. ద.) చూ. నాయకులు.

*ధృతి :* నిర్వహణ సంధ్యంగము చూ. ద్యుతి.

*ధృష్టుడు :* నల్గురు శృంగార నాయకులలో ఒకడు : నాయిక విషయమున తప్పు చేసియు నిర్భయముగా ఉండువాడు, చేసినతప్పు తెలియుచున్నను అబద్ధ మాడువాడు (సా. ద. 3-36). చూ. నాయకులు.

*ధ్రువాగానము :* ఋక్కులు, పాణికలు, గాథలు, సప్తరూపములు వీటిని 'ధ్రువలు' అందురు. ఇవి నానా ఛందములననుసరించి ఉండును. వాక్య-వర్ణ-అలంకార-యతి-పాణి-లయలు ధ్రువము (స్థిరము) గా గలది కాబట్టి దీనిని ధ్రువ అనిరి. ఏకవస్తుకము ధ్రువ ద్వివస్తుకము, గీతి, త్రివస్తుకము మద్రకము, చతుర్వస్తుకము చతుష్పదము. ధ్రువాంగములు 18. వస్తువును, ప్రయోగమును; ప్రకృతిని, భావమును, రసమును, ఋతువును, దేశమును, కాలమును; అవస్థను, వయస్సును తెలిసి ధ్రువను ప్రయోగించవలె. విశేషములకు (నా. శా. 32)

*నటి 1. :* నటుని భార్య (కావచ్చు కాకపోవచ్చు). పూర్వరంగమందే నట-విదూషక-పారిపార్శ్వకులతోపాటు ప్రవేశించి వారితోపాటు కథా సూచనకు సంబంధించిన కార్యము నిర్వర్తించునది. (నా. శా. 20. పు. 612).

*నటి 2 :* దూతికలలో ఒకటి, చూ. నాయిక సహాయులు.

*నటుడు :* పాత్ర, అభినేత, ప్రయోక్త, ప్రయోజకుడు (ఇవి పర్యాయపదములు). నాటక ప్రయోక్తలలో ముఖ్యుడు. జరిగినలోక వృత్తాంతమును రస-భావ-సత్త్వయుక్తముగా నటించగలవాడు నటుడు. (నా.శా. 35పు 856)

*నటుని గుణములు :* ప్రయోక్తగా దగిన నటుడు ఉజ్జ్వలుడై, రూపవంతుడై, ఉపకరణ క్రియాదక్షుడై, మేధావియై, విధానజ్ఞుడై, స్వకార్య కుశలుడై, దృఢశరీరుడై ఉండవలె (నా. శా. 35. పు. 854).

*నర్తకి :* ఆభ్యంతర (రాజాంతఃపుర) పరివారములో ఒకతి: హేలా-భావ విశేషములు, సత్త్వాభినయములు తెలిసినది, మాధుర్య స్వభావముకలది, ఆద్య కళలో నైపుణ్యము సంపాదించినది, అంగాంగ సౌందర్యముకలది, చతురమైన బుద్ధికలది, స్త్రీదోషములు లేనిది, ప్రగల్భములాడునది, అలసతలేనిది, నానాశిల్పములు, నృత్త-గీత విద్యలునేర్చినది. రూప-గుణ-ఔదార్య-సౌభాగ్య శీలములుకలది. పేశల-మధుర-స్నిగ్ధ-అనువాదిక-చిత్రకంఠములు కలది. స్త్రీలలో సాటిలేనిది అయినదే నర్తకిగా ఉపయోగించును. చూ. గణిక.

*నర్తనకము :* ఉపరూపక భేదము. కూర్పులో ముఖ్యమైనవి:- లలితాభినయముతో కూడిన నర్తకి నాట్యమే నర్తనకము. నాట్యదర్పణముకూడ ఇట్లే చెప్పినది. ఈ నర్తనకము మూడువిధములు: 1. లాస్యము (కేవల శృంగార రసోపేతము) 2. శమ్యము (కిన్నర విషయకలాస్య నృత్యము) 3. ద్విలితము (శృంగారమో. వీరమో ప్రధానముగాగలది). గర్భసంధి, విమర్శసంధులు; మాగధి, శౌరసేనిభాషలు; ఉత్తమ, అధమ నాయకులు; భారతీ, ఆరభటీ వృత్తులు ప్రయోగించవలె అని భావప్రకాశము చెప్పినది-ఉదా॥ నృసింహ విజయము (హిం. సా. కో. పు. 403).

*నర్మగర్భము* : కైశికీ వృత్తికిగల 4 అంగములలో ఒకటి: శృంగారమునకు ఉపకరించు విజ్ఞాన—రూప—శోభా—ధనాది గుణములను కార్యవశమున రహస్యముగాఉంచి నాయకుడు ప్రచ్ఛన్న రూపుడై వ్యవహరించుట నర్మగర్భము (నా.శా. 20. పు. 618). నాయకుడు దాపున ఉండిచేయు ప్రణయ వ్యవహారము నర్మగర్భము ఉదా॥ మాధవుడు మాలతిని మరణప్రయత్నమునుండి వారించుట (సా. ద. 6. పు. 171).

*నర్మద్యుతి* : ప్రతిముఖ సంధికిగల 13 అంగములలో ఒకటి: దోషమును కప్పిపుచ్చుటకై చేసిన హాస్యము నర్మద్యుతి. (నా. శా. 19. పు. 573). హాస్యముతో కలిగిన తృప్తియే నర్మద్యుతి (ద. రూ. 1-34).ఉదా॥ రత్నావళిలో సాగరిక:—(బొమముడిదాల్చి ఇంచుకనవ్వి)"సుసంగతా! ఇప్పటికిని ఎగతాళి మానవు" అన్న సందర్భము (సా. ద. 6. పు. 156).

*నర్మము1.* : కైశికీవృత్తికిగల 4 అంగములలో ఒకటి: వీరరస సహితమై విశుద్ధ వ్యాపారములతో శృంగారమును స్థాపించు హాస్య ప్రధానమైన వచనము నర్మము. అట్టిహాసవచన భేదములనుబట్టి నర్మము మూడువిధములు: 1. ఈర్ష్యనో క్రోధమునో సూచించునది. 2. పరులను ఉపాలంభించునది. 3. మోసముతో పరుల హృదయమును లోగొనుటకు ఉపయోగించునది. (నా. శా. 20. పు. 6 7) ప్రియురాలిని అనునయించుటకు ఉపయోగించు హాస్యగర్భమైన వచనము నర్మము. హాస్య, హాస్యేతరములైన దీని భేదములు 18. వీటికి మూల రూపములు మూడు:- 1. వాగ్రూపము 2. వేషరూపము 3. చేష్టారూపము (ద. రూ. 2.48-50) కేవల హాస్యమునకు ఉదా॥ రత్నావళిలో వాసవదత్త:- "(ఫలకమును చూచినవ్వుచు) నీప్రక్కనఉన్నది ఎవతె?" అనుసందర్భమున; శృంగార హాస్యమునకు శాకుంతలములో శకుంతల:- 'అసంతుష్టుడేని అతడేమిచేయును? అన్నప్పుడు రాజు 'ఇట్లు చేయును' అని ముద్దుపెట్టుకొనుటకు ప్రయత్నించుట. శకుంతల పెడమొగముపెట్టుట; సభయహాస్యమునకు రత్నావళిలో 'సుసంగత...నేనీవృత్తాంతమును దేవికి నివేదించెద' అనినచోట (సా. ద. 6. పు. 170).

*నర్మము2* : ప్రతిముఖ సంధికిగల 13 అంగములలో ఒకటి: క్రీడార్థము చేసిన హాస్యమును నర్మము అనిరి. (నా. శా. 19. పు. 573). ఉదా॥ సాధారణముగ లభించునదే.

*నర్మసచివుడు* : శృంగార విషయమున నాయక సహాయుడు (ర. మ. 2-116). చూ. నాయక సహాయులు.

*నర్మస్ఫుంజము* : కైశికీవృత్తికిగల 4 అంగములలో ఒకటి: ప్రేయసీప్రియులు అన్యోన్యాను రాగమును వ్యక్తముచేయు వాక్యములతోను, వేషములతోను తొలిసారిగా కలిసికొనియు పూర్వనాయిక కారణముగా ఉదయించిన భయముచే వెంటనే విడిపోవుటను నర్మస్ఫుంజము అనిరి. (నా.శా.20. పు. 617).

సుఖారంభము, భయాంతము అయిన నవసంగమమును "నర్మ స్ఫూర్జము" అనిరి. ఉదా మాళవిక సంకేతస్థలమున నాయకుని అభిసరించిన సన్నివేశమున (సా. ద. 6. పు. 170).

నర్మస్ఫోటము : కైశికీ వృత్తికిగల 4 అంగములలో ఒకటి : భయ-హాసాది వివిధ భావముల రసస్థితికి అందని అంశములచే శృంగారము వైచిత్ర్య సహితమైనచో దానిని నర్మస్ఫోటము అనిరి. (నా, శా. 20 పు 618). రసస్థితి కందని భావావేశములుపొడముట నర్మస్ఫోటము. ఉదా మాలతీమాధవములో "గమనమలసమ్—నడక అలసము, దృష్టిశూన్యము, ఒడలు నసిలేదు, ఊర్పు అధికము" అన్న సందర్భమున (సా. ద. 6. పు. 171).

నవోఢ :– నాయిక, దశాభేదము. చూ. ముగ్ధ.

నాంది : పూర్వరంగములో నిర్వర్తించు బహిర్యవనికాంగములు 10. వాటిలో ఒకటి నాంది. నాంది ఆశీర్వచనయుక్తమై ఉండవలెనని, శ్లోకములో పద సంఖ్య 8 (త్ర్యశ్రపూర్వ రంగమందు), 12 (చతురశ్ర పూర్వరంగమందు) ఉండవలెనని భరతుడనెను. తర్వాత దీని ప్రయోగమును, పదసంఖ్యనుగురించి నానానియమములు బయలుదేరి వివాదాస్పదములైనవి వసంతరాజీయకర్త కుమారగిరి రెడ్డి వివరించిన (కాటయవేముని శాకుంతల వ్యాఖ్యలో ఉదాహృతమైన) నాందీ లక్షణమే ప్రాముఖ్యముగా అంగీకరింపబడినది. వివిధ లక్షణ కర్తలనియమములను సమన్వయించి చూచినచో నాంది: 1. రూపక ప్రయోగారంభమునందు విధిగా చదివి తీరవలె.

2. నాందిలో ఆశీర్వచనము లేదా నమస్క్రియ కావ్యార్థ సూచనముతోకలిసి ఉండవలె. 3. నాందీశ్లోకము మంగళప్రదముగా, దేవ—నృప—ద్విజ—సభా—కవి—నటాదులకు శుభముకోరునదిగా రచితమై ఉండవలె. 4 ఇది 6 పదములతో లేదా 8 లేదా 0 లేదా 12 లేదా 18 లేదా 22 పదములతో కూర్చినదై ఉండవలె. 5. సూత్రధారుడు మధ్యమస్వరములో దీనిని చదువుచుండగా ప్రతిపాదాంతమున పారిపార్శ్వకులు "ఏవమస్తు" (అట్లేఅగుగాక) అనుచుండవలె 9. చంద్రనామాంకితముగా చంద్ర—శంఖ—అబ్జ—కోక—కైరవాది పదములుగాని వాటి పర్యాయ పదములుగాని ఇందులో కూర్చవలె 7. చిత్రపూర్వరంగమందు నాందీ పదాంతరములందు తాండవమునుకూర్చవలెనని కొందరందురు 8. కవి రచితమైన శ్లోకము (పద్యము) లేనప్పుడు సూత్రధారుడు దానిని రచించుకొని పఠించవలె.

నేటినాంది : నేటి నాటక ప్రారంభములో తెలుగువారు ఏదో ఒక శ్లోకమునో, పద్యమునో, (పరాబ్రహ్మ పరమేశ్వరవంటి) పాటనో పాడుచున్నారు. ఇదియేనేటి నాంది. ఇక కవి—కథా—పాత్రాది వివరములను ప్రకటన పత్రముల ద్వారానో, మైకులద్వారానో తెలుపుచున్నారు. భరతుడాశించిన రంగప్రసాధనము (సభారంజకత్వము) నేమ ఇట్లు మారినది.

(నా. శా. అధ్యా. 1-5 పు. 10-11, 158, 167, 183-85). వాస్తవమునకు "రంగద్వారము" నకు ముందే నాందీ పాఠము (మంగళపాఠము) జరుగుచున్నది. కావున కొందరనినట్లు నాంది, రంగద్వారము ఈ రెండు ఒకటిగా భావించుటకు వీలులేదు. (హిం. సా. కో. పు. 406, నాంది).

*నాందీపాఠకులు* : వీరుముగ్గురు: సూత్రధారుడు (నాందిని పఠించువాడు). ఇద్దరు పారిపార్శ్వికులు "ఏవమస్తు" = (అట్లే అగుగాక) అనువారు (నా. శా. 5. పు. 158).

*నాందీసూత్రధారుడు* : నాందిని మధ్యమస్వరములో పఠించును (ప్రతిపాదాంతమున పారిపార్శ్వికులు "ఏవమస్తు = అట్లే అగుగాక అనుచుందురు). కవి రచితమైన నాంది (శ్లోకమో, పద్యమో) లేనప్పుడు సూత్రధారుడు దానిని తానే రచించి పఠించవలె. నాంద్యంతమున "త్రిగతము" : నాద్యంతమున విదూషకుడు ఆకస్మికముగా ప్రవేశించి సూత్రధారునివద్దనిలిచి అసంబద్ధకథాలాపములు ప్రారంభించును. సూత్రధారుని నవ్వించుచు, అతనిపై ఆకస్మికమైన ఆరోపణలుచేసి ఏమికథ? ఎందుకు? ఎవరు జయించిరి వంటి ప్రశ్నలు (కథకు సంబంధించినవే అయినను కొంత అసంబద్ధముగా తోచునవి) సూత్రధారుని అడుగును. సూత్రధారుని సమాధానములో ప్రదర్శింపబోవు నాటక కథ ప్రేక్షకులకు కొంత అర్థమగుచుండును. పారిపార్శ్వకుడు విదూషకునితో వాదించుచుండును. విదూషకుడు అతని వాదమును ఖండించుచుండును. ఈ ముగ్గురు సంభాషణను కల్పించుకొని చేయు ఈ కథాలాపమునకు 'త్రిగతము' అనిపేరు. ఇట్లు తమ సరస సల్లాపములతో నాటక కథను కొంత సూచించుచు అందరును ఒకేసారినిష్క్రమింతురు. తరువాత ప్రస్తావనాదులు నిర్వహించుటకు (నాటక విషయమును కొంత విస్తరముగా సూచించుటకు) తిరిగి ఇదే సూత్రధారుడు ప్రవేశించవచ్చు. ఇతనిని స్థాపకుడు అనిరి. చూ. స్థాపకుడు (నా. శా. పు. 163-70, 491, 856, 859).

*నాంద్యంతము* : నాంద్యంతమునప్రస్తావనాదులు (అముఖము మొ॥)నిర్వర్తించుటకు సూత్రధారుడే "స్థాపకుడు" అయి మరల రంగమును ప్రవేశించును. రూపకవృత్తిని సమస్తమును స్థాపించువాడు కావునఇతనిని స్థాపకుడు అనిరి. రంగసిద్ధికొరకు కావ్యవస్తు నిరూపణము (స్థాపనము)చేయువాడే ఈస్థాపకుడు. ఈస్థాపకుడు, సూత్రధారుడేనని, స్థాపకుడను పేరుతో మరల రంగమును ప్రవేశించి ప్రస్తావనను (అనగా ప్రదర్శించబోవు రూపకమును గురించి సామాజికులకు పరిచయము చేయుకార్యక్రమమును) నడపునని గుర్తించుకొనవలె. విశేషములకు చూ. స్థానకుడు.

*నాచురలిజమ్* : (Naturalism) నాట్యధర్మి, లోకధర్మిదృక్పథములతో సరిచూడదగిన మూడు ఇజములలో ఒకటి : పాశ్చాత్య నాటకరంగములో 19 వశ. చివర ప్రాధాన్యమునకు వచ్చినవాదము: ఇది రియలిజమ్‌లో ఉన్నదాని కంటెను అధికమైన స్వాభావికతను, యథార్థతను వాంఛించినది. రియలిజమ్

కొంతలో కొంత సంభావ్యతకు స్థానమిచ్చినది. కాని నాచురలిజమ్ వ్యావహారిక భాషతోపాటు లోకవ్యవహారమున ఉన్నదానిని ఉన్నట్లుగా ప్రదర్శించవలెనని ప్రబోధించినది. అనగా 'లోకధర్మి' ఇందు మితిమీరినది. ఈవాదమును (భారతీయులంగీకరించుట అటుంచి) పాశ్చాత్య విమర్శకులే ఖండించిరి.

*నాటకప్రయోక్తలు* : నాటక ప్రయోగమును నిర్వహించుటకు, ఆయాముఖ్య పాత్రలు ధరించుటకు అర్హులైనవారు తొమ్మండుగురు చూ. 1. సూత్రధారుడు 2. పారిపార్శ్వకుడు 3. నటుడు 4. విటుడు 5. శకారుడు 6. విదూషకుడు 7. చేటుడు 8. గణిక 9. నాయిక.

*నాటకభాష* : రూపక ప్రయోగమునకు, రచనకు నా. శా. నిర్దేశించిన భాషా భేదములు నాలుగు: 1. అతిభాష:- వైదికశబ్ద బాహుళ్యముగల సంస్కృత భాష, దివ్యపాత్రలకొరకు ఉద్దేశించినది 2. ఆర్యభాష:- నిత్యవ్యవహారములో ఉండు సంస్కృతముకంటె కొంచము విలక్షణమైనది, రాజపాత్రలకుద్దేశించినది. 3. జాతిభాష, ఇది రెండువిధములు (అ) ప్రాకృతభాష:- దీనినే మ్లేచ్ఛ భాష అనిరి (ఆ) సంస్కృతభాష:- భారతవర్షాశ్రితమైనది 4. యోన్యంతరీ భాష:-నాట్యధర్మినిఅనుసరించి ఉపయోగించు పశుపక్ష్యాదులసాంకేతికభాష

సంస్కృత భాషనుపయోగించు పాత్రలు:- దివ్యులు, ధీరోదాత్తాది నాలుగు వర్ణముల నాయకులు; బౌద్ధ, జైన పరివ్రాజకులు, భిక్షువులు, శ్రోత్రియులు, యతులైన లింగస్థులు, ఆయాకాల–అవస్థాదులననుసరించి పట్టపురాణులు, గణికలు, శిల్పకారికలు మొ. ప్రాకృత భాషనుపయోగించు పాత్రలు:-శాపగ్రస్తులైన దివ్యులు, వేషాంతరమున ఉన్నవారు, భాగవతులు, పూజారులు, తాపసులు, బాలబాలికలు, స్త్రీలు, నీచులు, నపుంసకులు, సంసారహీనులందరు. దేశభాషలు ఉపయోగించుపాత్రలు:- బర్బర, కిరాత, ఆంధ్ర, ద్రవిడజాతులు, తదితరులు. విశేషములకు చూ. (నా.శా.17.పు.485)

*నాటకము 1* (పదనిర్వచనము): పూర్వానువృత్తచరితమై (పూర్వవృత్తము వస్తువుగాగలదై): సాంగోపాంగగతిక్రమములతో, తమస్వభావమును విడిచి పాత్రల స్వభావమును ప్రదర్శించునటుల చేష్టలతో కూడినదై; అట్లే సామాజికులు (ప్రేక్షకులు) గ్రహించునదైనది కావున దీనిని నాటకము అనిరి. "పూర్వానువృత్తచరితం నాటకం నామ తద్భవేత్; యస్మాత్ స్వభావం సంత్యజ్య సాంగోపాంగ గతిక్రమైః, ప్రయుజ్యతే, జ్ఞాయతేచ తస్మాద్వై నాటకం స్మృతం" (నా. శా. 19. 145, 146).

*నాటకము 2 (నాట్యము)* : నాట్యశాస్త్ర రచననాటికి 'నాట్యము' అనుపదమును ప్రదర్శనమునకుద్దేశించిన దశవిధ రూప (క) ములకు పర్యాయముగా వాడుచుండిరి. (నాటకం, సప్రకరణం......దశమోనాట్యలక్షణే' నా.శా. 18, 2,3) దశవిధ రూపకములలో మొదటిదైన 'నాటకము' ఒక ప్రత్యేక లక్షణము కలదే అయినను దీనినికూడ 'అభినవభారతి' రచనాకాలము నాటికే మిగతా తొమ్మిది దృశ్యకావ్యములకు పర్యాయముగా వాడినట్లు తెలియు

చున్నది. అయాప్రాచీన లక్షణ కర్తల వ్రాతలమేరకు ఇట్లు నాట్యము, నాటకము, రూపము, రూపకము పర్యాయపదములుగానే కన్పించుచున్నను అమరసింహుని కాలము (క్రీ. శ. 4వ శ.) నాటికే నాట్యము నృత్యము (dance) నకు పర్యాయపదమైనది(నా.శా.లో నృత్యమను పదము ప్రక్షిప్తమే అయినట్లు తెలియుచున్నది. (నా. శా, పు. 19. 510, 513, 583).

*నాటకము 3 :* దశవిధరూపకములలో మొదటిది. లక్షణము: 1. ఇతివృత్తము: ప్రఖ్యాతమైనదై ఉండవలె. 2. నాయకుడు: ప్రఖ్యాతుడు, ఉదాత్తుడు, రాజర్షి అయిఉండవలె. 3. అంకములు – 5 నుండి 10 వరకు ఉండవచ్చు. 4. సంధులు: పంచసంధులతో కూర్చవలె 5. వృత్తులు: నాలుగు వృత్తులు ఉండవలె 6. రసములు: శృగారమో, వీరమో అంగిరసముగా తక్కినవి అంగరసములుగా ఉండవలె 7. విశేషములు: పతాకా, ప్రకరీ నాయకులు దివ్యులుకావచ్చు. నాటకము, ప్రకరణము ఈరెంటిలోని అంకములు బహు జనపరివారములతో ఉండరాదు, నలుగురైదుగురు కార్యపురుషులున్నచో చాలును. నానారస(సుఖ, దుఃఖ) ములతోకూడిన రాజులచరితమే ఇందుండ వలె. సర్వరూపముల అంశములు దీనిలో కన్పించవలె. దీని జన్యరూపకము "నాటిక" (నా. శా. 18. పు. 143).

*నాటకములు ఐదు :* సుబంధువు విశ్లేషించిచెప్పిన ప్రకారము నాటకములు ఐదు విధములు: చూ. 1. పూర్ణనాటకము 2. ప్రశాంత నాటకము 3. భాస్వర నాటకము 4. లలిత నాటకము 5. సమగ్రనాటకము.

*నాటకీయలు :* అభ్యంతర (రాజాంతఃపుర) పరివారములోని స్త్రీలు. నాట్యకళా కుశలలు, రూపయౌవన సంపన్నలు అయిన స్త్రీలు నాటకీయలుగా నియు క్తులుకావలె. (నా. శా. 24 పు. 706).

*నాటి (క) :* జన్యరూపకము సా. ద. దీనిని ఉపరూపకము అన్నది. భరతుడు 10రూపకములనుచెప్పి ఈ నాటి (క) పేరుకూడాచెప్పెను. నాటక-ప్రకర ణముల సంయోగముతో ఇది జనించినది. వస్తువుకల్పితముగా, నాయకుడు రాజుగా, నాలుగు అంకములతో స్త్రీపాత్ర బాహుళ్యముగా, రచితమగునని లలితాభినయ-సుఘటితాంగ—వివిధనృత్య గీత వాద్య—రతి సంభోగ వర్ణన— దంభమయ కృత్యములతో దీనిని కూర్చవలెనని భరతముని చెప్పెను. ఇది ఇతివృత్త విషయమున ప్రకరణానుసారి, నాయక విషయమున నాటకాను సారి అయి, నాయికల విషయమున మహాదేవి మానిని అయి, ముగ్ధ నాయిక అయి ఉండవలెనని ద. రూ. నాయకుడు ధీరలలితుడు, రసము శృంగారము, వృత్తికైశికి, అవమర్శతప్ప మిగతా సంధులు ఉండవలెనని భావప్రకాశనము (హిం. సా. కో. పు. 421).

*నాట్యధర్మి :* కవి, నట వ్యాపారమందలి వైచిత్రియే నాట్యధర్మి. ఇతిహాసా దులలో ఉన్న అర్థములు, ఆయాపాత్రల ప్రకృతులు (చిత్తప్రవత్తులు, భావ ములు) గ్రహించి కవిచేసినకల్పనతోకూడినది; రమ్యములై, ప్రేక్షకులను

ఆకర్షించు అభినయములతో కూడినది; నాట్య (నాటక) లక్షణములతో కూడినది; స్వర, అలంకార యోజనతో కూడినది; పాత్రగతమైన వేషాకృతులతో కూడినది (అనగా స్త్రీ పురుషవేషము ధరించినను, పురుషుడు స్త్రీ వేషము ధరించినను వారి అసలు రూపము ఏమాత్రము కనిపించక ఆపాత్ర రూపముతో అమరివచ్చినది) అయిన నాట్యము (నాటకము) నాట్య ధర్మికి చెందినది. నాట్యధర్మికి ఆధారభూతమైనది లోకధర్మియే. "సర్వస్య సహజో భావః స్వరోవ్యాభి నయోఽర్థతః, అంగాలంకార చేష్టాతు నాట్యధర్మి ప్రకీర్తితా" సారాంశము :- 1. కేవలము అభినయముచే సూచింపదగు (పర్వతములు, వాహనములు మొ) వాటికి రూపకల్పనచేయుట 2. సమీప మందే మాట్లాడినను వినబడనట్లుండుట, మాట్లాడని దానిని వినునట్లుచేయుట (అపవారితముల ద్వారా) 3. ఒకే నటుడు వివిధ భూమికలు ధరించుట (గమ్యతో ఒక భూమిక అగమ్యతో వేరొకటి మొ.) 4. సుఖ-దుఃఖ రూప మైన లోకస్వభావమున ఆతోద్య—హాస్య విన్యాసములతో ప్రదర్శించుటమొ। అన్నియు నాట్యధర్మి లక్షణములు (నా. శా. 13. 381-85).

**నాట్యపరిభాష** : చూ. సంబుద్ధి విధానము (దీనినే సా. ద. నాట్యభాష అన్నది)

**నాట్యము** : సుఖదుఃఖ సమన్వితమైన ఈ లోకస్వభావమును అంగాభినయము (తదితర అభినయములు, గీత—వాద్య—నృత్త—నృత్యములు) మొ వాటితో ప్రదర్శించుకళ. నృత్తకళ మొదటిదని, తర్వాత ఈ నాట్యకళా రూపమేర్పడినదని, క్రీ. శ. 4వ శ. నాటికే నాట్య—నృత్యములు పర్యాయపదము లైనవని తజ్జ్ఞుల వ్యాఖ్యలు చెప్పుచున్నవి (నా.శా.పు. 20). నాట్య-నాటక పదములుకూడ పర్యాయములైనవి. చూ. నాటకము 2. 'అవస్థానుకృతి ర్నాట్యమ్' కావ్యమందు నిబద్ధమైన నాయికా నాయకుల అవస్థలను చతుర్విధ అభినయములద్వారా అనుకరించుటయే నాట్యము (ద. రూ. 1-7).

**నాట్యరాసకము** : ఉపరూపకము. ఒకేఅంకము, తాళలయాన్వితము. నాయకుడు ఉదాత్తుడు. ఉపనాయకుడు పీఠమర్దుడు. సశృంగార హాస్యముల౦గి. నాయిక వాసక సజ్జిక. ముఖ, నిర్వహణ సంధులు, లాస్యాంగకములు 10 ఉండును. ఇందులో ప్రతి ముఖ సంధి ఉండకూడదని కొందరందురు. రెండుసంధులున్న దానికి ఉదా నర్మవతి, నాల్గు సంధులున్న దానికి ఉదా విలాసవతి (సా. ద. 6. పు. 201).

**నాట్యవస్తువు** : నాట్య నాటకములకు ఆధారముగా స్వీకరించు ఇతివృత్తము : ప్రసిద్ధ చరితమునుగాని, ఉత్పాద్య వస్తువునుగాని రూపకమునకు గ్రహించవలెనని నా. శా. లోని దశరూపాధ్యాయము చెప్పుచున్నది. ప్రత్యక్ష చరితమును అనగా వర్తమాన వస్తువును (నాట్య—నాటక రచనకుగాని, ప్రయోగమునకుగాని) స్వీకరించరాదనుట స్పష్టము. ప్రత్యక్ష చరితము చూచువారలకు రాగ-ద్వేషాదులు కలుగునని, వారు దానితో తాదాత్మ్యము చెందలేరని, తాదాత్మ్యము లేనిచోట రసాస్వాదనము లేదని ఒకదృ

క్ప్రథము. కాని దేవతలు దైత్యులను జయించిన పూర్వకథను అనుకరించుచు భరత సుతులు ప్రయోగించిన నాట్యమును చూచిన దైత్యులుదానిని ప్రత్యక్షచరితముగానే భావించి క్షోభపడిరని అ. గు. ని. అభిప్రాయము (నా. శా. 1. పు. 2 ).

*నాట్య (కావ్య) వృత్తులు :* ఇవి నాట్య (కావ్య) మునకు మాతృకలు : సర్వ కావ్యములకు (అభినేయములుగాని, అనభినేయములుగాని వాటికి) వృత్తులే మాతృకలు. వృత్తులు అనగా కవిహృదయ వ్యవస్థితములైనచేష్టలు. కావ్యము లన్నియు ఉత్పన్నములగుటకు ఈవృత్తులే కారణములు. వృత్తులు, వృత్త్యంగములు సర్వకావ్యములందును ఉండునని సారాంశము. ప్రయోగమునుబట్టి చూచినచో దశరూపములును ఈ వృత్తులనుండి జనించినవే. 'జాతు'లచేతను 'శ్రుతుల' చేతను స్వరములు 'గ్రామ' భేదములకు కారణమైనట్లే వృత్తి భేదములచే కావ్యబంధ భేదములు సిద్ధించుచున్నవి. షడ్జ – మధ్యమ గ్రామములు రెండును పూర్ణస్వరములు (సర్వస్వరసహితములు) అయినట్లే నాటక- ప్రకరణములనెడి కావ్య బంధములు రెండును సర్వవృత్తులతో కూడినవి అగుచున్నవి. అంతేకాక ఈ రెండు నానాబంధ సమాశ్రయములుగా (ఇతివృత్త, నాయకాది భేదములతో) ఉండును. తక్కినరూపకములు (వీథి- -సమవకార- ఈహామృగ-ఉత్సృష్టి కాంక- వ్యాయోగ-భాణ-ప్రహసన-డిమములు) ఎనిమిదింటిని కైశికీవృత్తిని చేర్చకుండా ప్రయోగించవలె. విశేషములకు చూ. వృత్తులు.

*నాట్య (కావ్య) శరీరము :* భాష, ఛందస్సు, ఇతివృత్తము (కథావస్తువు) ఈ మూడుకలిసి మెలసి నాట్య (కావ్య) మునకు శరీరప్రాయమగుచున్నవి : (1. వాచి యత్నస్తు కర్తవ్యో నాట్యస్యైషాతనుఃస్మృతా నా శా. 14-2; 2. ఛందోహీనోనశబ్దోఽస్తి నచ్ఛందశ్శబ్దవర్జితమ్ నా. శా. 14. 45; 3. ఇతి వృత్తంతు నాట్యస్య శరీరం పరికల్పితమ్ నా. శా. 19-1). భాషకు సంబంధించినంతవరకు, 1, అర్థనిర్మాపకత్వము 2. అర్థ తాదాత్మ్యము, 3. అర్థరూపతాధ్యాసము 4, అర్థైక జ్ఞాన నివేశిత్వము 5. అర్థోపరంజకత్వము 6. అర్థనిమిత్తము- వాగాత్మకములైన ఇట్టి శబ్దములే ఇతివృత్తార్థముతో సమాన యోగక్షేమత్వమును పొందుచున్నవి (అ. భా. సం. 3 పుట. 2). ఇక ఛందస్సునకు కట్టుబడని శబ్దముగాని, శబ్దములేనిదే ఛందస్సుగాని ఉండదని ఈ రెంటి సంయోగమే నాట్య (కావ్య) మునకు వన్నె తెచ్చునని తెలియవలె. మిగిలిన నాట్య (కావ్య) శరీరభాగము ఇతివృత్తము. ఇది పంచసంధులలో విభక్తమైనది. చూ. సంధులు ఐదు.

*నాట్యాచార్యుడు :* నృత్త, నృత్య కళలను నిర్దేశించు ఆచార్యునికి, నాట్య (నాటక) ములోని సూత్రధారునికి, ఆధునిక యుగములో దర్శకుడు (Director) గా కనిపించుచున్న వ్యక్తికి చెప్పిన లక్షణములన్నియు ఇంచుమించు ఒకేకోవకు సరిపడుచున్నవి. నాట్య (నాటక) సిద్ధి అంతయు సూత్ర

ధారుని సామర్థ్యము మీదనే ఆధారపడి ఉండునని మరువరాదు. చూ. సూత్రధారుడు.

*నాట్యాయితము :* చూ. గర్భాంకము.

*నాట్యాలంకారములు :* చూ. ముప్పదియారు నాటక లక్షణములు.

*నాట్యోక్తులు :* చూ. సంబోధనలు.

*నాడిక :* నాళిక, నాడి=24 నిమిషములకాలముఅనగాముహూర్తములోసగము. సమవకారము అను రూపకముయొక్క కథలో ఏకత ఉండదు. అది పెరిగి పోకుండుటకు (దానికథ 18 నాడికలలో ముగియవలెనని)కాలనిర్ణయముచేయ నైనది. ప్రహసన (కామశృంగార సంబంధి.) - వీథి (వీథ్యంగములలోనిది)- కపట—విద్రవ-క్రియాసహితమైన ప్రథమాంకము 12 నాడికల కాలములో, అట్లే కూర్చిన ద్వితీయాంకము 4 నాడికల కాలములో, వస్తువునుముగించు తృతీయాంకము 2 నాడికలకాలములో ప్రదర్శించవలె.(నా.శా.18-పు.562).

*నామకరణము :* పాత్రలపేర్లు:- వేశ్యలపేర్ల చివరదత్త-సిద్ధ-సేనవంటిపదములు, వైశ్యుల పేర్లచివర ప్రాయికముగా దత్తపదము ఉండవలె. చేటులకు, (వసంతుడు మొ వానివలె) చేటికలకు (మధుకరిక మొ) వర్ణ్యమగుప్రవర్త ననుబట్టి పేర్లుండవలె. రూపకముపేర్లు:- నాటకమునకు గర్భితార్థ ప్రకాశ ముగా పేరుండవలె. (రామాభ్యుదయము మొ ). ప్రకరణాదులకు నాయికా నాయకుల పేర్లనుబట్టి పేర్లుండవలె. (మాలతీ మాధవము మొ ). నాటికా— సట్టకాదులకు నాయికలనుబట్టి పేర్లుండవలె(రత్నావళి, కర్పూరమంజరిమొ ) (సా. ద. పు. 174). 'మృచ్ఛకటిక' మొ పేర్లనుబట్టి ఈ నియమము సడలి నట్లు తెలియుచున్నది

*నాయక గుణములు :* కావ్యనాయకుడు ప్రసిద్ధవంశీయుడై, వీరుడై, కర్ణ-శిబి -జీమూతవాహన-దధీచి మొ వారివలె త్యాగశీలియై ఉండవలె 1. శోభ, (అధీనులపట్ల, అధికులపట్లస్పర్థ), 2. విలాసము (ఉల్లాసమైన స్వభావము) 3. మాధుర్యము (సంక్షోభములో చిక్కుబడకుండుట) 4. గాంభీర్యము (ఏపరిస్థితిలోను చెదరకుండుట) 5. స్థయిర్యము (స్థిరబుద్ధి) 6. తేజస్సు (ప్రాణముపోయినను అవమానము సహింపక పోవుట) 7. లలితము (సహజ మైన శృంగారచేష్ట) 8. ఔదార్యము(మంచివారియందు ఉదారస్వభావము) ఈ ఎనిమిది విధములైన సాత్త్వికగుణములు గలవాడై ఉండవలె (ద. రూ. 2-10-14) ఇవి సాధారణ లక్షణములు. విశేషములకు చూ. నాయకులు.

*నాయక వ్యాపారము :* ఫలప్రాప్తికై నాయకుడు చేయుయత్నము. ఈవ్యాపా రము (కవికల్పించినదే) క్రమముగా అయిదు అవస్థలలో (ఆరంభమునుండి ఫలాగమమువరకు) ఉండును. చూ, కార్యావస్థలు.

*నాయక సహాయులు :* నాయకులకు శృంగారసహాయులైన విదూషకుల భేద ములు 4:1. లింగి (ఋషి), ధీరోద్ధతుడైన (దివ్యనాయకునకు సహాయుడుగా ఉండువాడు 2. ద్విజుడు (వీరుడు), ధీరలలితుడైన (నృప) నాయకునకు సహాయుడుగావచ్చువాడు. 3. రాజాజీవి, ధీరోదాత్తుడైన(సేనాపతి/అమాత్య

నాయకునకు సహాయుడుగా వచ్చువాడు. 4. శిష్యుడు, ధీరప్రశాంత (బ్రాహ్మణ—వణిజ) నాయకునకు సహాయుడుగా వచ్చువాడు. (నా. శా. 24-పు. 704). ఇంకను శృంగార సహాయులు, చూ. పీఠ మర్దుడు, విటుడు, విదూషకుడు (ద. రూ. 2-8). చేటాదులు (ఆదిపదముచే మాలాకార, రజక తాంబూలిక, గాంధిక ప్రభృతులు. సా. ద 3-పు. 37), నర్మసచివుడు (ర.మ. 2-116). వీరిలో పీఠమర్దాదులు ఉత్తములు, విటవిదూషకాదులు మధ్యములు, శకారాదులు అధములు. అంతఃపురసహాయులు:- మరుగుజ్జులు, షండులు, కిరాతులు, మ్లేచ్ఛులు, ఆభీరులు, శకారులు. అర్థచింతన సహాయుడు: మంత్రి. దండసహాయులు:- అనగా దుష్టశిక్షణలో సహాయపడువారు అంతరంగమిత్రులు, కుమారులు, సామంతసైనికులు, ఆటవికులు. ధర్మ సహాయులు:- ఋత్విక్కులు, పురోధసులు, బ్రహ్మవిదులు. తపస్సంపన్నులు. దూతలు, వీరు మూడు విధములు:- నిసృష్టార్థుడు (స్వీయప్రజ్ఞచే వార్తను నిర్వహించువాడు) మితార్థుడు (మితమైన విషయములనే మాట్లాడి ప్రభు కార్యము తీర్చువాడు), సందేశహారకుడు (ప్రభు సందేశమును పూర్తిగా చెప్పువాడు) (సా. ద. 3. పు. 37-40).

*నాయకాభాసుడు :* ఎన్నిసైగలు చేసినను ప్రియభావము తెలియనేరనివాడు నాయకాభాసుడే కాని నాయకుడుకాడు. (ద. మ. 2-115). ఉదా ఋశ్యశృంగుడు.

*నాయకుడు :* ప్రధాన పాత్రధారి: కథలో వ్యసని అయిగాని, దుఃఖితుడైగాని చివరకు అభ్యుదయమును పొందినవాడే నాయకుడు. అనేకులకు వ్యసన—అభ్యుదయములు రెండును కలిగినప్పుడు అందులో వ్యసన—అభ్యుదయములు పరిపుష్టముగా ప్రాప్తించినవాడు ప్రధాన నాయకుడు : రామ, సుగ్రీవ, విభీషణులలో రాముడుప్రధాననాయకుడు(నా.శా.పు.563, 625, 705,856). కథలోవచ్చు పురుషపాత్రలు నాయకులు. ఆయానాయకులను, వారి ఉత్తమ మధ్యమ, అధమ ప్రకృతి లక్షణములను; (దివ్య, మానవ) జాతి, వృత్తిలక్షణములను; ఆయాస్త్రీపాత్రలతో వారికిగలసామాజిక సంబంధములను; కథలో వారు నిర్వర్తించు ప్రధాన, సహాయక, ప్రతికూల సన్నివేశములను బట్టి వివిధ ఆచార్యులు వివిధములుగా వర్గీకరించి నాయక భేదములుచూపిరి. ఇట్లు నానా విధములుగాచేసిన వర్గీకరణములలో, చెప్పిన లక్షణములలో ఆయా ఆచార్యుల మతభేదములుగూడ గమనింపదగినవి. ఉదా ధీరోద్ధతులు దివ్యులని, ధీరోదాత్తులు సేనాపతులు లేదా అమాత్యులు అనినా.శా. (34. పు. 704)- నాయక సహాయులలో పీఠమర్దుని లక్షణము చెప్పుచు పతాకకు (ఉపకథకు) నాయకుడై, నాయకునియందు భక్తిగలవాడై, గుణములలో నాయకునికన్న కొంచెము కిందిమెట్టున ఉన్నవాడు(రామాయణములో సుగ్రీవునివంటివాడు) పీఠమర్దుడు అని దశరూపకము (2.8)—అలిగిన చెలువను అలుకదీర్చువాడు పీఠమర్దుడు అని రసమంజరి (2.116).

రెండు గ్రంథములు ఇట్లురెండువిధముల చెప్పుచున్నవి. విశేషములిట్లుగ్రహింపదగినవి. సుప్రసిద్ధ ఆచార్యులు చెప్పిన నాయక భేదములు తెలియుటకు చూ. నాయకులు, శృంగారనాయకులు, నాయక సహాయులు, ప్రతినాయకుడు మొ.

*నాయకులు - భేదములు* : కావ్యనాయకులు నాలుగు విధములు: 1. ధీరోద్ధతులు (దివ్యులు) 2. ధీరలలితులు (రాజులు) 3. ధీరోదాత్తులు (సేనాపతులు, అమాత్యులు), 4. ధీరప్రశాంతులు (బ్రాహ్మణ-వణిజులు) నాయకుల జాతి, వృత్తి లక్షణములను, సంఘములో వారికిగల అంతస్తునుబట్టి నా. శా. (24. పు. 704) ఈ వరుసలో చేసిన విభజన ఇది. తర్వాతి లక్షణకర్తలు తమదృష్టి భేదమునుబట్టి ధీరోద్ధత, ధీరోదాత్త నాయకులలక్షణము కొంచెము మార్చిచెప్పి నాయకుల ప్రకృతులనుబట్టి నాయికలతో వారికిగల సామాజిక సంబంధమునుబట్టి ఇంకను విశేషించి చెప్పిరి. 1. ధీరోదాత్తుడు 2. ధీరోద్ధతుడు 3. ధీరలలితుడు 4 ధీరశాంతుడు, చతుర్విధ నాయకులను ఈ వరుసలో చెప్పుకొనుటే సంప్రదాయమైనట్లు చూతుము. ఈ నల్గురు నాయకులు వారి శృంగార ప్రకృతులనుబట్టి ప్రతిఒకడు 1. అనుకూలుడు 2. దక్షిణుడు 3. ధృష్టుడు 4. శఠుడు అని తిరిగి నాల్గువిధములు ఈ విధముగా వీరు 16. గురు. ఉత్తమ, మధ్యమ, అధమ భేదములనుబట్టి ఈ 16 గురు ఒక్కొక్కడు మూడు విధములు. ఇట్లు మొత్తము నాయక భేదములు 4×4×3=48. (సా. ద. 3-పు. 37)-'రసమంజరి' ధీరోదాత్తాది భేదములను ప్రస్తావించదు. అది చెప్పినట్లు నాయక భేదములు 3 : చూ. 1. పతి 2. ఉపపతి 3. వైశికుడు. పతి ఉపపతి, ఈ ఇద్దరు అనుకూల, దక్షిణ, ధృష్ట, శఠభేదములచే 8 గురు. వైశికుడు : ఉత్తమ, మధ్యమ, అధమ భేదములచే మూడువిధములు. భేదాంతరములలో పతి, ఉపపతి, వైశికుడు ప్రోషితులై మూడు విధములు. శఠుని అంతర్భేదములు రెండు: 1. మాని 2. చతురుడు (ర. మ. 2-99-114). ప్రతినాయకుడు, నాయకాభాసుడు విశేషభేదములు.

*నాయిక* : ప్రధాన పాత్రధారిణి, నాయకుని పత్ని లేదా ప్రియఅని సాధారణముగా గ్రహింపదగినది. నాటక సమాజ సభ్యులలో ఒకతిగా ఎన్నదగిన నాయిక రూప-గుణ-శీల-యౌవన-మాధుర్య-శక్తిసంపన్న; విశద, స్నిగ్ధ, మధురస్వభావ, పేశలవచన, నాట్యకళాభియోగ్యయై ఉండవలె. చూ. నాయికలు వివిధభేదములు.

*నాయికలు-అష్టవిధములు* : వీరేశృంగార నాయికలు. త్రివిధ నాయికలశృంగార అవస్థలు ప్రధానముగాచేసి చూచినప్పుడు వారి విధములు 8 (నా. శా. 22 పు. 675). 1. ప్రోషితభర్తృక 2. ఖండిత 3. కలహాంతరిత 4. విప్రలబ్ధ 5. విరహోత్కంఠిత 6. వాసకసజ్జ 7. స్వాధీన పతిక 8. అభిసారిక అని ఆలంకారికులు గుర్తించిన అష్టవిధ శృంగార నాయికలు. ముగ్ధ, మధ్య, ప్రగల్భ, (ప్రౌఢ); పరకీయ; సామాన్య; ఈ ఐదు నాయికల శృంగార

అవస్థాభేదములలోనే అష్టవిధనాయికులను గుర్తించ వచ్చునని, వీరి ఉత్తమ మధ్యమ, అధమ ప్రకృతులుగూడా గుర్తింపదగినవని, "ప్రవత్స్యత్పతిక" తొమ్మిదవనాయిక అయి ఈవర్గములోనే చేరదగినదని రసమంజరి చెప్పినది. 1. ప్రోషిత భర్తృక:- కార్యాంతరాసక్తుడై ప్రియుడు దేశాంతరము వెడలగా కేశ సంస్కారాదులు వదలి విరహార్త అయిన నాయిక (గమనిక:-విరహోత్కంఠిత, విప్రలబ్ధ, కలహాంతరిత వీరి శృంగారావస్థకు కారణము ప్రియుడు దేశాంతరము వెడలుటకాదు). ఈనాయిక చేష్టలు దశావస్థలు. ముగ్ధాదిభేదములతో ఇది ఐదు విధములు (i) ముగ్ధ-ప్రోషిత భర్తృక. అనగా ముగ్ధలక్షణములు, ప్రోషిత భర్తృక లక్షణములు గలది. గలది. ఇట్లే ఇతరములు గ్రహించవచ్చు. (ii) మధ్య-ప్రోషిత భర్తృక (iii) ప్రగల్భ (ప్రౌఢ)- ప్రోషిత భర్తృక (iv) పరకీయ-ప్రోషిత భర్తృక (v) సామాన్య-ప్రోషిత భర్తృక. 2. ఖండిత:- తనతో కలసి ఉండవలసిన తగిన సమయములో ప్రియుడు ఇంకొక నాయికతో కలసి ఉండి తర్వాత తనవద్దకు రాగా దుఃఖార్త అయిన నాయిక. దీనిచేష్టలు: అస్ఫుటమైన మాటలు, చింత, సంతాపము: నిట్టూర్పు, మౌనము, కన్నీరు విడుచుట. మొదటి దానివలెనే ముగ్ధాదిభేదములతో ఇది ఐదు విధములు. (ముగ్ధ-ఖండిత మొ ) 3. కలహాంతరిత: పతితో కలహించి, తిరస్కరించి అతడు వెడలి పోగా దుఃఖించునది. చేష్టలు: భ్రమ, సంతాపము, మూర్ఛ, జ్వరము, పలవరింత మొ మొదటిదానివలెనే దీనిభేదములు ఐదు (ముగ్ధ-కలహాంతరితమొ।) 4. విప్రలబ్ధ: దూతినిపంపి, సంకేతమును చెప్పినప్పటికిని ప్రియుడు ఏకారణముచేతనైన రాకుండుటవలన వంచనకుగురియైన నాయిక. చేష్టలు ఖండిత వంటివే. మొదటిదానివలెనే ముగ్ధాది భేదములతో ఇది ఐదు విధములు (ముగ్ధ-విప్రలబ్ధ మొ।). 5. విరహోత్కంఠిత :- ప్రియుడు గడువు దినము నాటికి రాకున్నను, సంకేతస్థలమునకు రాకున్నను దుఃఖించునది. చేష్టలు: అప్రీతి, ఆవులింతలు, జ్వరము, ఒడలు విరుపులు, వణకు, ఏడ్పు, తనఅవస్థను ఇతరులకు చెప్పుట మొ . మొదటిదానివలెనే దీనిభేదములు ఐదు (ముగ్ధ-విరహోత్కంఠిత మొ .) 6. వాసకసజ్జ (వాసకసజ్జిక):- వాసకము (వారము, లేదా తగిన సంకేతస్థలము) ఏర్పరచి, అలంకరించుకొని, ఆవాసకమునకు ప్రియుడు రానందుకు దుఃఖించునది: చేష్టలు: చెలుల ఎగతాళికి చిరాకు; దూతితో ప్రశ్నలు, ఎదురుచూపులు, మొదటిదానివలెనే దీనిభేదములు ఐదు (ముగ్ధ—వాసకసజ్జ మొ॥). 7. స్వాధీనపతిక:- ప్రియుని తన కనుసైగలలో వర్తించువానిగా, తనను విడిచిపోనివానిగా, ఆకర్షించు నాయిక. చేష్టలు : వినోదయాత్రలు, విహారములు, సంతోషములు, మొదటి దానివలెనే దీనిభేదములు ఐదు (ముగ్ధ — స్వాధీనపతిక మొ .) 8. అభిసారిక:- ప్రియునిచెంతకు తానై పోవునది లేదా ప్రియుని తనవద్దకే రప్పించుకొను నేర్పుగలది. చేష్టలు: సమయానుకూలమైన మాటలు, వేష

ములు. మొదటిదానివలెనే దీనిభేదములు ఐదు (ముగ్ధ - అభిసారిక మొ.) (i) జ్యోత్స్నాభిసారిక (వెన్నెలలో కలసిపోవు వేషాలంకార ములు ధరించునది) (ii) తమిస్రాభిసారిక (చీకటిలో కలసిపోవు వేషాలంకారములు ధరించునది) (iii) దివసాభిసారిక (పట్టపగలు వీధివారికన్నుగప్పి అభిసరించివచ్చునది). ఈ మూడు 'పరకీయాభిసారిక' లోనే కనిపించు అవాంతరభేదములు. 9. ప్రవత్స్యత్పతిక:- ప్రవత్స్యత్=దేశాంతరము పోవుటకు సిద్ధమైన, పతికా=భర్తగలది కావున దీనికి పై 8 నాయికల లక్షణముల (చేష్టల) సామ్యములుండవు. దీనిచేష్టలు: స్వరవికారముగలమాటలు, నిర్వేదము మొ॥. మొదటి దానికివలెనే దీనిభేదములు ఐదు(ముగ్ధ-ప్రవత్స్యత్పతిక మొ।) ఇది తొమ్మిదవ నాయికగా గణింపదగినది అని (ర. మ. 2-40-87).

**నాయికలు—వివిధభేదములు** : కావ్యనాయికలు నాలుగువిధములు 1. దివ్య 2. నృపపత్ని 3. కులస్త్రీ 4. గణిక. నాయికల జాతి, వృత్తి లక్షణములను కలుపుకొని నా. శా. (24. పు. 705) ఈ విభజనచేసినది. నా. శా. విశేషముగా చెప్పిన నాయికలు (అనురక్త, విరక్త మొ। వారు) తర్వాతి లక్షణకర్తలు చెప్పిన వివిధనాయికా భేదములలో కలసిపోయినట్లు తలపవచ్చు. లాక్షణికు లందరు ఒప్పుకొన్నట్లు నాయికల ముఖ్యభేదములు మూడు : 1. స్వీయ 2. పరకీయ 3. సామాన్య. నాయికల వయస్సు, ప్రకృతులు, నాయకులతో వారికిగల సామాజిక సంబంధమును బట్టి ప్రాచీనులు విశ్లేషించిన ప్రకారము స్వీయభేదములు 12, పరకీయభేదములు 2, సామాన్య ఒకతె మొత్తము 16 గురు. ఆధునికులైన భానుదత్తాదుల విశ్లేషణ ప్రకారము స్వీయభేదములు 13 : (ముగ్ధ 1. జ్ఞాతయౌవన, అజ్ఞాత యౌవన అని ముగ్ధ రెండు విధములు - మధ్యలు 6 :- ధీరజ్యేష్ఠ, ధీరకనిష్ఠ, ధీరాధీరజ్యేష్ఠ, ధీరాధీర కనిష్ఠ, అధీరజ్యేష్ఠ, అధీరకనిష్ఠ- ప్రగల్భలు అనగా ప్రౌఢలు 6:- మధ్యనాయికకువలెనే ధీరజ్యేష్ఠాదిభేదములతో) పరకీయభేదములు 12: (పరోఢ భేదములు 6, కన్యభేదములు 6 ఇవిగూడ ధీరజ్యేష్ఠాది భేదములే). సామాన్య 1. ఇట్లు మొత్తము నాయికలు 13+12—1=26 (ర. మం. మొదటి ప్రకరణము పు. 42-43). 'లోల' మరొక నాయిక. కొంచెము వయస్సుమళ్ళినది రతిక్రీడలందు అభిలాషపూర్తిగా తొలగనిది. (కా. సం. పు. 70). శృంగార ప్రకృతులనుబట్టి నాయికల భేదములు 8. చూ. నాయికలు అష్టవిధములు. ప్రవత్స్యత్పతిక ఒకతె ర. మం. చెప్పిన 9వ శృంగార నాయిక. ఉత్తమ, మధ్యమ, అధమ ప్రకృతులనుబట్టి, ఆప్రకృతుల అవాంతర భేదములనుబట్టి ర. మం. చెప్పినని మరికొన్ని భేదములు, చూ. త్రివిధనాయికలు-ప్రకారాంతరములు

**నాయిక సహాయలు** : దూతికలు, నాయికా నాయకుల శృంగార సంబంధమునకు తమతమ నైపుణ్యములతో తోడ్పడు సహాయినులు 1. కథిని (కథలు చమత్కారముగ చెప్పునది) 2. లింగిని (చిత్రకారిణి) 3. ప్రాతివేశ్య (పొరుగిం

టిది) 4. సఖి 5. దాసి 6. కుమారి (బాల ధాదికూతురు) 7. కారు శిల్పిని (కుమ్మరిది, చాకలిది, కంచరిది మొ.), 8. ధాత్రి 9. పాషండిని (వ్రతస్థురాలు,సన్యాసిని) 10. రంగోపజీవిని 11. నటి 12. తాంబూలిక 13. గాంధిక స్త్రీ మొ|. నాయికానాయకులకు జాబులుఅందించుట మొ పనులుచేయుదురు కళాకౌశలము, ఉత్సాహము, భక్తి, చిత్తజ్ఞత, పరిహాస విజ్ఞానము మాటకారితనము మొ॥. లక్షణములననుసరించి ఈ దూతికలను ఉత్తమ, మధ్యమ, అధమ భేదములలో చూచుకొనవచ్చు (నా. శా. 23. పు. 691— ధ.రూ, 2-29—సా. ద. 3. పు. 65).

నాయికా నాయకులు-ప్రకృతులు : స్త్రీ, పురుష పాత్రల ప్రకృతులు ఉత్తమ-మధ్యమ-అధమ భేదములచే మూడు విధములు 1. ఉత్తమ పురుషప్రకృతి : విశాల విజ్ఞానము, నానా కళాభిజ్ఞత, దాక్షిణ్యము, ఉన్నత లక్ష్యము, త్యాగము, మొ|. సుగుణములుగల పురుషునిది ఉత్తమప్రకృతి 2. మధ్యమ పురుష ప్రకృతి:— లోకోపకారబుద్ధి, చాతుర్యము, విజ్ఞాన మాధుర్యము మొ॥ గుణములుగల పురుషునిది మధ్యమ ప్రకృతి 3. అధమ పురుషప్రకృతి : పరుషవాక్యములు, దుశ్శీలము, కృతఘ్నత, అలసట మొ దుర్గుణములుగల పురుషునిది అధమ ప్రకృతి. 1. ఉత్తమ స్త్రీ ప్రకృతి: మృదుభావము, స్థిర చిత్తము, స్మితభాషణము, పెద్దలయెడ వినయము, పరివారమునందు దయ గాంభీర్యము మొ|. గుణములుగలది ఉత్తమనాయిక. 2. మధ్యమస్త్రీప్రకృతి: ఉత్తమ నాయికకన్న కొంతతక్కువ అర్హతలుగలది మధ్యమ నాయిక. 3. అధమస్త్రీప్రకృతి అధమ పురుషప్రకృతికి పోలికగల గుణములుగలది అధమ నాయిక (నా. శా. 24. పు. 702—703).

నాయికాభేదములు—సంఖ్య : ప్రాచీనులు లెక్కించిన త్రివిధనాయికా భేదములు 16 (స్వీయలు 13, పరకీయలు 2, సామాన్య 1). ఈ 16 నాయికలను 8 శృంగారావస్థలలో (ప్రోషిత భర్తృకాది భేదములతో) లెక్కించి వారిసంఖ్య 128 అనిరి. వారిని ఉత్తమ, మధ్యమ, అధమ ప్రకృతులలో లెక్కించి ఆసంఖ్య 384 అనిరి వారిని దివ్య, దివ్యాదివ్య, అదివ్య అను జాతిభేదములతో లెక్కించి నాయికల భేదములు మొత్తము 1152 అనిరి. (దివ్యకు శచి, దివ్యాదివ్యకు సీత, అదివ్యకు మాలతి ఉదా అనిరి). ఈ ప్రాచీనమతము 'రసమంజరి' కర్తకు నచ్చలేదు. నాయికా నాయకులను జాతిభేదములతో లెక్కించుట సబబుకాదని వారిని అవస్థా భేదములతో, ఉత్తమ, మధ్యమ, అధమ ప్రకృతిభేదములతో, మాత్రమే లెక్కించి ఆధునిక మతమును స్థాపించెను. అతడు గణించిన ప్రకారము త్రివిధ నాయికా భేదములసంఖ్య 26 (చూ. నాయికలు). శృంగారావస్థలు ప్రధానముగా చెప్పిన అంతర్భేదములు 8 (చూ. నాయికలు—అష్టవిధములు, ప్రవత్స్యత్పతిక ఒకతి. ర.మ. గణించిన విశేషనాయిక). నాయక భేదములనుగూడ జాతులలో చూపక వారి అవస్థ

లను, ఉత్తమాది ప్రకృతులను మాత్రమే పరిగణించి త్రివిధపతులు' అనెను (చూ. పతి, ఉపపతి, వైశికుడు వారిభేదములు).

*నాళిక* : వీథ్యంగములు 13, వాటిలో ఒకటి: హాస్యముతో కూడిన సమాధానము (ప్రహేళిక), ఇతరులను వంచించునది నాళిక అనబడును (నా.శా.18 పు. 529) అర్థము తెలియని - పదమో; వాక్యమో-కూడ హాస్యజనకమగు చుండును అదేనాళిక (ద. రూ. 3-19)ఉదా। ముద్రారాక్షసమున చారశిష్య సంవాదము.

*నిదర్శనము* : నాట్య (నాటక) మునకు భూషణ ప్రాయములైన లక్షణములు 36. అందులో ఒకటి. చూ. ఆశీస్సు.

*నిబద్ధము* : ఛందోబద్ధమైన కావ్యము (న. శా.)

*నియతఫలప్రాప్తి* : చూ. నియతాప్తి.

*నియతాప్తి* : పంచకార్యావస్థలలో ఒకటి. నియత ఫలప్రాప్తి (నా. శా. పాఠము). సహకారి సామగ్రీ సహితమగు ముఖ్యోపాయమువలన ఫలప్రాప్తి తప్పక కలుగును అని భావించుట నియత ఫలప్రాప్తి అనబడును (అనగాఈ ఉపాయముచే ఈ నాయకునకు ఈఫలము సిద్ధించుననెడి నిశ్చయజ్ఞానము) (నా. శా. 19. పు. 564).

*నిరుక్తము* : నాట్య (నాటక) మునకు భూషణ ప్రాయములైన లక్షణములలో ఒకటి. అ. గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము ఇది రెండు విధములు. 1, తథ్యానిరుక్తము 2. అతథ్యానిరుక్తము: ప్రసిద్ధి నాశ్రయించి ఒకశబ్దముయొక్క నిర్వచనమును సాధించినచో 'తథ్య నిరుక్తము' అనిరి. దీనికి విపరీతమైనది 'అతథ్యానిరుక్తము' (అనుష్టుప్ వృత్తపాఠములోని 'నిరుక్తము' నకు ఇది భిన్నమైనను సమన్వితమైనది. పూర్వోక్తమైన అర్థసిద్ధికొరకు దోషరహితమైన వాక్యమునుచెప్పుట నిరుక్తము) (నా. శా 16. పు 445).

*నిరోధము* : ప్రతిముఖ సంధికిగల 13 అంగములలో ఒకటి : వ్యసనమును పొందుటను నిరోధము అనిరి. (నా. శా. 19. పు. 573). ఉదా। చండకౌశికములో రాజు: "నిక్కముగా నేను జాల్మడనై" అని వ్యసనము పొందిన భాగము.

*నిర్ణయము* : నిర్వహణ సంధికిగల 14 అంగములలో ఒకటి: అనుభూతమైన అర్థమును చెప్పుటను నిర్ణయము అనిరి. (నా. శా. 19 పు. 576). ఉదా। 'వేణీసంహారము' లో భీముడు తాను దుర్యోధనాదులను ఎట్లు చీల్చిచంపినది ధర్మరాజుతో చెప్పు సందర్భము.

*నిర్వహణసంధి* : ఆధికారిక (ప్రధాన) ఇతివృత్తమున నుండవలసిన అయిదు ప్రధాన సంధులలో అయిదవది. బీజ సంబంధమైన ఉత్పత్తి-ఉద్ఘాటన-ఉద్భేదన- గర్భనిర్భేదము (భంగపాటు) అనెడు నాలుగు అవస్థలతో కూడినది! నానా భావ జన్యములైన హాస-శోక-క్రోధాది చమత్కారములతోకూడి

నది; ముఖసంధి మొ వాటిలోని ప్రయోజనములు (పరస్పరముసంబంధించి ఉన్నట్లుగాని, అవియన్నియు ప్రధాన ప్రయోజనముతో సంబంధించి ఉన్నట్లుగాని సుస్పష్టముగా భాసించవు కావున) వాటికిగల పరస్పర సంబంధమును విశదముచేయుచు వాటికి ప్రధాన ఫలముతోగల సంబంధమును నిశ్చయించెడి కథాభాగమును నిర్వహణసంధి అందురు. దీని అంగములు 14; చూ. 1. సంధి 2. విబోధము 3. గ్రథనము 4. నిర్ణయము 5. పరిభాషణము 6. ధృతి 7. ఆనందము 8. సమయము 9. ప్రసాదము 10. ఉపగూహనము 11. భాషణము 12. పూర్వవాక్యము 13. కావ్యసంహారము 14. ప్రశస్తి. (నా. శా. 19 పు. 576).

*నృత్తము—నాట్యము—నృత్యము* : 1. నృత్తము: మొదట జనించిన అభినయ కళ, కరణ-అంగహార సంపన్నమైనది, ఇది అర్థములను బోధించదు, అవయవవిన్యాసములతో కూడియుండును. 2. నాట్యము: నృత్తము తర్వాత ఏర్పడినది, సుఖదుఃఖ సమన్వితమైన ఈ లోకస్వభావమును అంగాది అభినయములచే ప్రదర్శించుకళ. తరువాతి కాలమున నాట్యము, నాటకము పర్యాయపదములుగా చెల్లినవి. 3. నృత్యము: నా.శా. లో కనబడు 'నృత్య' శబ్దము ప్రక్షిప్తమని, ఇది తర్వాత ఏర్పడిన ప్రక్రియ అని తెలియుచున్నది. నృత్తములోని అంగవిన్యాసము, నాట్యములోని అభినయము కలిపినచో నృత్యమగునని, ఈసమ్మేళనమును భరతుడేచేసి యున్నను 'నృత్యము'అను ప్రక్రియను ప్రత్యేకించి పేర్కొనలేదని తర్వాత కోహలుడు చెప్పిన ఉపరూపకములకు ఈ నృత్యమే ఆధారమని తెలియుచున్నది. (నా. శా. పు. 19, 20, 283).

*నేపథ్యము* : ఆహార్యాభినయ ప్రాధాన్యమును చెప్పుచు నా. శా. నైపథ్యము నాల్గువిధములన్నది. 1. పుస్తకర్మ (model work) ఆయారంగముల కావశ్యకములైన వస్తువుల నిర్మాణము 2. అంగరచన: ఆయావేషములకు తగిన విధముగా రంగులుపూసుకొనుట, మీసములు గడ్డములు మొ కూర్చుకొనుట 3. అలంకారము: వేషధారణకు తగిననగలు. దండలు, వస్త్రాదులు కూర్చుకొనుట 4 సంజీవము: పశుపక్ష్యాదులు మొ సజీవముగా ఉన్నట్లు చూపుటకు ఏర్పాట్లుచేయుట మొ (నా. శా. 21. పు. 627) వేషధారణము చేయుగదిని నేడు నేపథ్యము అనుచున్నారు,

*పటము* : యవనిక, తెర

*పతాక* : ఇతివృత్త విషయమున ఆరంభాది అవస్థలు అయిదు ఉన్నట్లే బీజాది అర్థ ప్రకృతులు అయిదుఉన్నవి. అందులో ఇదిమూడవది. ప్రధాన ఫలమునకు ఉపకారకమగునట్లుగా పథానేతి వృత్తమువలెనే కల్పించెడి వృత్తము 'పతాక' అనబడును. (సుగ్రీవవిభీషణాదుల రాజ్య ప్రాప్తి ఇందుకు ఉదాహరణము. ఈ ఉదాహరణమే "ప్రధానేతి వృత్తమువలె" అనుచోట వివక్షితమైన సాదృశ్యము). (నా. శా. 19. పు. 565) పతాక అనగా ఉపకథ లేదా

ప్రాసంగికేతివృత్తము= ప్రసంగవశాత్తు వచ్చిన ఉపకథ. దీనికి ప్రధాన నాయకునితో సంబంధముండును. అయినను దీని నాయకుడు వేరు ఉదా రామాయణములో సుగ్రీవునికథ. (ద. రూ. 1-13), పతాక వేరు, పతాకా స్థానకము వేరు.

*పతాకాస్థానకము* : అర్థప్రకృతులలో ఒకటి అయిన పతాకకు, ఈ పతాకా స్థానకమునకు ఏసంబంధమునులేదు. ఒక అర్థము నిగూఢముగా ఉండగా దానిని స్ఫురింపజేయు అర్థము కలదానిని పతాకాస్థానకము అందురు. పతా కాస్థానకము భావ్యర్థసూచకముగా ఉండవలెనని ధనికాదులు తెలిపినారు. ఈపతాకా స్థానకము పాశ్చాత్యుల Dramatic Irony వంటిది. ఇది నాలుగు విధములు: చూ. ప్రథమ, ద్వితీయ, తృతీయ చతుర్థ పతాకా స్థానకములు (నా. శా. 10. 566-67). చేయుచున్న ప్రసంగములో రాబోవు కథాంశము సూచితమైనచో అదే పతాకాస్థానకము (ద. రూ.)

*పతి* : శృంగార విషయమున 'రసమంజరి' చెప్పిన త్రివిధనాయకులలో మొదటి వాడు: శాస్త్రసమ్మతముగా సతిని, వివాహ విధిపూర్వకముగా గ్రహించి గృహస్థుడై ఉండువాడు. పతి ఐదు విధములు: అనుకూల, దక్షిణ, ధృష్ట, శఠ, భేదములు నాల్గు. ఐదవ భేదము ప్రోషితపతి (ప్రియను విడిచిదేశాంత రము పోయినవాడు) చూ. నాయకులు.

*పదోచ్చయము* : నాట్య (నాటక) మునకు భూషణప్రాయములైన 36 లక్షణ ములలో ఒకటి: అ. గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము: తాత్పర్యార్థము సమానముగా ఉండియు, వాచ్యార్థము భిన్నముగా ఉండు పదములచే నానార్థగ్రథితముగా ఒకవస్తువును ప్రశంసించుటను పదోచ్చయము అందురు. (అనుష్టుప్‌వృత్తపాఠములోని 'పదోచ్చయ' నిర్వచనముకంటె ఇది భిన్నమైనను అర్థము మాత్రము ఒకటే అని అ.గు చెప్పెను:"బహుపద ములను మరికొన్ని పదములతోగూడ సదృశార్థముగా ప్రయోగించుట పదో చ్చయము" (నా. శా. 16. పు, 446).

*పద్యనాటకము* : పోయెటిక్ డ్రామా (Poetic drama) అను ఇంగ్లీషు మాటకు తెలుగు సమానార్థకము. నాటకలక్షణములతోకూర్చిన ఛందోబద్ధమైన రచన అని అర్థము. కావ్యత్వము గద్యనాటకములందును, పద్యనాటకములందును ఉండును. అందుకే భారతీయాలంకారికులు నాటకమును దృశ్య కావ్యము అనిరి. ప్రాచీన భారతీయ రూపకములెన్నో పాద్యములుగా రచించుట ఒక సంప్రదాయమైనది. నృత్య, గీత కళలు ఆధారముగా నాటక ప్రక్రియ వెలసినట్లు అన్నిదేశములవారు అంగీకరించినదే. పద్యబాహుళ్యముగల రచ నను లేదా పూర్తి పద్యములతోనే రచించిన నాటకమును పద్యనాటకము అనిరి. (హిం. సా. కో. పు. 254).

*పరకీయ-భేదములు* : త్రివిధ ముఖ్యనాయికలలో పరకీయ రెండవది. వివాహిత అయినను, కాకున్నను ఇతర పురుష సాంగత్యమును కోరునది. అయినను

వేశ్యవలె; స్వతంత్రురాలుకాదుకనుక ఈనాయికను పరకీయ అనిరి. పరకీయ రెండువిధములు: 1. పరోఢ:- భర్త అధీనములోఉండినను రహస్యముగా పర పురుష సాంగత్యమునకు పోవునది. దీనికే 'అన్య' అని మరొకపేరు. 2. కన్య:- తల్లి తండ్రి అధీనములోఉండి పురుషసాంగత్యమునకు రహస్య ముగా పోవునది. పరోఢకు ఉదా తారాశశాంకములో తార. కన్యకు ఉదా మాళవికాగ్నిమిత్రములో మాళవిక. ఈ నాయిక రుద్రటుని మతములో కన్యక, భోజుని మతములో అనూఢ "రసమంజరి" విశేషముగా చెప్పిన పర కీయ-భేదములు:- 3. గుప్త,- తనరంకును దాచునది గుప్త. ఇది మూడు విధములు: వృత్త సురతగోపన (చేసినరంకునుదాచునది), వర్తిష్యమాణసురత గోపన (చేయబోవు రంకునుదాచునది), వృత్తవరిష్యమాణ సురతగోపన (పై రెండురకముల రంకును దాచునది.)4. విదగ్ధ:- రంకుతనములో నేర్పరి విదగ్ధ. ఇది రెండు విధములు వాగ్విదగ్ధ (మాటకారి అయి విటులను ఆకర్షిం చునది) క్రియావిదగ్ధ (రంకుకు తగిన బొంకును నేర్చినది) 5. లక్షిత:- చెలి కత్తెలు కనిపెట్టలేని రంకుతనము నేరనిది కావున ఇది లక్షిత. 6. కులట:- జారుల ఇండ్లకు సంచరించునది. 7. అనుశయాన:- కోరిక తీరకపోగా కీడు కలుగుట వలన పశ్చాత్తాపపడునది. 8. ముదిత:- కోరిక తీరినందుకు సంతో షించునది. 9. పతివంచక-: భర్తను మోసగించునది. 10:- సాహసిక:- తన రంకు తీర్చుకొనుటకు ఏపనికైనను సాహసించునది. (ర. మ. 1-22-30),

*పరికరము :* ముఖ సంధికిగల 12 అంగములలో ఒకటి: ఉత్పన్నార్థము కొలదిగా విస్తరింపబడుటను పరికరము అనిరి. (నా. శా. 19. పు. 571). బీజమును పోషించుట పరికరము (ద. రూ. 1-27). ఉదా। వేణీ సంహారములో భీముడు "ప్రవృద్ధంయద్వైరం"= కౌరవుల విషయమున ఏవైరము నాకు శిశుత్వమందే పెరిగెనో, దానికిఎవ్వరును కారణముకాదు (సా.ద.6.పు.152).

*పరిచారికలు :* ఆభ్యంతర (రాజాంతఃపుర) పరివారములో చేరిన సేవికలు: 1. శయ్యాపాలి (శయ్య నలంకరించునది) 2. ఛత్రధారిణి 3. వ్యజనధారిణి 4. సంవాహిక (కాళ్ళుపట్టునది, 5. గంధయోక్త్రి) 6. ప్రసాధిక (అలంకర ణము చేయునది 7. ఆభరణయోక్త్రి) 8. మాల్యసంయోజిక అనువారు పరిచారికలు (నా. శా. 24. పు. 707).

*పరిదేవనము :* నాట్య (నాటక)మునకు భూషణప్రాయములైన 36 లక్షణములలో ఒకటి. అ, గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము: ప్రయో జనవశమున మరియొక పేరుతో చెప్పబడినవి, ప్రసిద్ధార్థములు, అయిన దోష ములను అన్యసంబంధములుగా కల్పించుటను పరిదేవనము అనిరి. (అనుష్టుప్ పాఠములలోని 'క్షోభము' తో భిన్నమైనను సమన్వితమైనది. "తాను దోష రహితుడైనను విచిత్రార్థములైన పరదోషములను తనయందాపాదించుకొను టను క్షోభము అనిరి. దీనినే భోజుడు 'పరివాదనము' అనెను. ఇది అనుష్టుప్ వృత్తపాఠములోని "అనుక్తసిద్ధి" తోగూడా సమన్వితమైనది. ఒక విషయ

మును ప్రస్తావించుట వలన మిగిలిన అర్థమంతయు చెప్పనవసరము లేకయే ప్రతీతమగుటను అనుక్తసిద్ధి అనిరి.

*పరిన్యాసము* : ముఖసంధికిగల 12 అంగములలో ఒకటి: కావ్యార్థము సుస్పష్టముగా నిర్దిష్టమగుటను పరిన్యాసము అనిరి. (నా శా. 19. పు. 571). పోషించిన బీజము మొలకెత్తుట పరిన్యాసము (ద. రూ. 1-27). ఉదా 'వేణీసంహారములో "చంచద్భుజభ్రమిత చండగదాభిఘాత" ముతో దుర్యోధనునిచంపి అతని నెత్తురంటిన చేతులతో దేవీ! నీశిరోజములను భీముడు సవరించును" అన్నచోట (సా. ద. 6. పు. 153).

*పరిభావన* : ముఖసంధికిగల 12 అంగములలో ఒకటి: జిజ్ఞాసాతిశయముతో కూడిన ఆవేగమును వర్ణించుటను 'పరిభావన' అనిరి. (నా. శా. 19. 572). అద్భుతమైన ఆవేశమును వర్ణించుట పరిభావన (ద. రూ. 1-29).

*పరిభాషణము* : నిర్వహణ సంధికిగల 14 అంగములలో ఒకటి; అపరాధములను పరస్పరము వెల్లడిచేయుటను పరిభాషణము అనిరి. (నా. శా. 19. పు. 576) 'పరిభాషా మిథోజల్పః' (ద. రూ.1. 52) ఉదా। యుద్ధము ముగిసినతర్వాత భీముడు ద్రౌపదితో "నిన్ను ఆతీరున చూచి అపహసించిన భానుమతి ఏదీ! (చనిపోయినదనుట).

*పరివర్తకము* : సాత్త్వతీ వృత్తికిగల నాలుగుభేదములలో ఒకటి: హృదయ సంఘర్షముచే చేయదలచిన కార్యము విడిచి, కారణాంతరముచే వేరొకకార్యముచేయుటను 'పరివర్తకము' అనిరి. (నా. శా. 20-పు 6.6). వృద్ధికి ఉన్ముఖమయిన కార్యమునువిడిచి ఇంకొకి కార్యము చేపట్టుట పరివర్తకము (ద. రూ. 2-55).

*పరివాదనము* : చూ. పరిదేవనము.

*పరిసర్పము* : ప్రతిముఖ సంధికిగల 13 అంగములలో ఒకటి: కనిపించి మరల కనుమరుగైన ప్రకృతార్థమును అనుసరించుటను 'పరిసర్పము' అనిరి. (నా.శా. 19. పు. 572) ఉదా 'శాకుంతలము' లో 'అభ్యున్నతాపురస్తాత్' అనిన సందర్భము.

*పరోఢ* : చూ, పరకీయ.

*పర్యుపాసనము* : ప్రతిముఖ సంధికిగల 13 అంగములలో ఒకటి: కోపించిన వారిని అనునయించుటను పర్యుపాసనము అనిరి. (నా. శా. 19. పు. 563). ఉదా। 'రత్నావళి' లో విదూషకుడు:- "ఓయి కోపము చేయకు ఇదిగోఅది అరటి ఇంటిలోనికి పోయినది'' అనిన సందర్భము. (సా ద. 6. పు. 157).

*పశ్చాత్తాపము* : నాట్య (నాటక) మునకు భూషణ ప్రాయములైన 36 లక్షణములలో ఒకటి: అ. గు, అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము: తొందరపాటుతో అకార్యమును చేసిగాని, కార్యమునుచేయకగాని మనస్సులో సంతాపము చెందుటను పశ్చాత్తాపము అనిరి. (ఇది అనుష్టుప్ వృత్తపాఠ

ములోని 'విచారము' తో సమన్వితమైనది. 'అప్రత్యక్షార్థములను సాధించుటకు చెప్పిన అర్థమునననుసరించి అనేకవిధములవిచారముచేయుట 'విచారము' కాని అ గు. ని సమన్వయము ప్రకారము అనేకార్థ విచారము 'విచారము') (నా. శా. 16. పు. 448).

*పాత్ర (ము)* : చూ. అభినేత.

*పాత్రోచిత భాష* : చూ. నాటక భాష.

*పారిజాతకము* : పారిజాతకళ, ఉపరూపక భేదము. కూర్పులో ముఖ్యమైనవి: ఒక అంకము; ముఖ-నిర్వహణసంధులు; రసము శృంగారము; ఉదాత్త నాయకుడు, దివ్యుడు లేదా క్షత్రియుడు; నాయిక కలహాంతరిత, భోగిని, స్వకీయ, గణిక ఏదైన ఉండవచ్చు; దండ రాసకములో నిపుణులైనవారు 4-8 వరకు ఉండవలె; విదూషకుడు ఉండవచ్చు లేకపోవచ్చు అని భావప్రకాశనము చెప్పినది— ఉదా:- గంగతరంగిక (హిం.సా.కో.పు. 490).

*పారిపార్శ్వకుడు* : నాటకప్రయోక్తలలోఒకడు: సూత్రధారునికంటెకొంచెము తక్కువ లక్షణములుగలవాడు, మధ్యమ ప్రకృతి గలవాడు. సూత్రధారుని సహరుచడు. చూ. త్రిగతము, ప్రరోచన.

*పీఠమర్దుడు* : శృంగార విషయమున నాయకసహాయులలో ఒకడు: పతాక (ఉపకథ) కు నాయకుడు కాదగినవాడు, నాయకునివంటి గుణవిశేషములు కొన్ని ఉండి నాయకుని భక్తితో అనుసరించువాడు (ద. రూ. 2-8). ప్రాసంగికేతి వృత్తము (పతాకవంటి ఉపకథ)లో నాయకునికి సహాయుడు: ఉదా। రామాయణములో సుగ్రీవుడు (సా. ద. 3-పు. 87). అలిగిన నాయికను అలుకదీర్చి నాయకునికి కూర్చువాడు పీఠమర్దుడు అని(ర.మ. 2-116).

*పురోధసులు* : రాజుకు ఉండవలసిన మంత్రి పురోధసులు (మంత్రులు, పురోధసులు) : కులీనులు, నానాశాస్త్ర విదులు, స్నేహపాత్రులు, శత్రువులకు అభేద్యులు, దేశీయులు, వినీతులు, ధార్మికులు అయినవారు మంత్రి పురోధసులుగా ఉండవలె. (నా. శా. 24. పు. 710).

*పుష్పగండిక* : లాస్యాంగములు 10, వాటిలో ఒకటి. పాడదగిన గేయమును వివిధనృత్తములతో, పురుషచేష్టలతో ప్రదర్శించుటను పుష్పగండికఅందురు. సఖుల వినోదార్థము స్త్రీ పురుష వేషమును ధరించి లలితముగా సంస్కృతమును పఠించుట 'పుష్పగంధిక' అని మరొకపాఠము (నా.శా.19.పు. 582).

*పుష్పము* : ప్రతిముఖ సంధికిగల 13 అంగములలో ఒకటి: విశేష సూచకమగు వచనమును పుష్పము అనిరి. (నా.శా. 19. పు. 573). ఉదా రత్నావళిలో విదూషకుడు రాజు చేయిపట్టుకొని "ఓయి, వయస్యుడా! ఈమెను అపూర్వ శ్రీని-పొందితివి" అన్నసందర్భము (సా. ద. 6. 157).

*పూర్ణనాటకము* : సుబంధువు చెప్పినఅయిదువిధముల నాటకములలో మొదటిది ఇందులో అయిదు సంధులు, వాటి అంగములతోసహా, ఉండును. ఉదా: కృత్య రావణము. (నా. శా. 18. పు. 541).

*పూర్ణవృత్తిరూపకములు* : నాటకము, ప్రకరణము ఈరెండును పూర్ణవృత్తి రూపకములు. (కైశికీప్రధానములు) తక్కిన ఎనిమిది అపూర్ణవృత్తి రూపకములు (కైశికీవృత్తి అప్రధానముగా గలవి). (నా. శా. 18. పు. 52)

*పూర్వరంగము-అంగములు* : రూపక ప్రదర్శనమునకు పూర్వమే రంగవిఘ్నోపశాంతి కొరకుచేయునది పూర్వరంగము. ఇందు నిర్వర్తించు కార్యములకే అంగములనిపేరు. ఇవి రెండువిధములు 1. అంతర్యవని కాంగములు అనగా తెరలోపల నిర్వర్తించు వాద్య, పాఠ్య ప్రసంగములకు చెందినవి 9: ప్రత్యాహారాదులు, ఇవి నాటకరచయితలు తెలుసుకోవలసినంత అవసరమైనవికావని వాటిని గురించి ఈకోశములో వ్రాయలేదు. (చూ. నా. శా. 5. పు. 155) 2. బహిర్యవనికాంగములు అనగా తెరవెలుపల నిర్వర్తించు క్రియలు 10 చూ. గీతవిధి, ఉత్థాపనము, పరివర్తనము, నాంది, శుష్కావకృష్ట, రంగద్వారము, చారి, మహాచారి, త్రిగతము, ప్రరోచన. పూర్వరంగమునకు అంతర్యవని కాంగములు 9, బహిర్యవని కాంగములు 10 (మొత్తము 19) చెప్పబడినవి. ప్రయోగవశమున వీటిలో ఎన్నిటినైనను మానివేయవచ్చును. నాంది ఒకటి నిత్యము (నాంద్యంతే సూత్రధారః అనునది ప్రతిరూపకాదిలో చూడదగినది.)

*పూర్వవాక్యము* : నిర్వహణ సంధికిగల 14 అంగములలో ఒకటి: యథోక్తార్థ ప్రదర్శనము (పూర్వము చెప్పినదానిని మరలస్మరించుట)ను పూర్వవాక్యము అనిరి. (నా. శా. 19. పు. 577)—జరిగిన సంగతిని తలచి హెచ్చరించుట పూర్వవాక్యము. ఉదా। వేణీసంహారములో భీముడు 'ఏదీ! అభానుమతి ? పాండవభార్యను ఇప్పుడు హేళనముసేయు మనుము' అనిన సందర్భము (సా. ద. 6. పు. 168).

*పృచ్ఛ* : నాట్య (నాటక)మునకు భూషణ ప్రాయములైన 36 లక్షణములలో ఒకటి. అ.గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము: అభిప్రాయ ద్యోతకములగు కాక్వాదులతోకూడిన వాక్యములచే తనను గాని, ఇతరులను గాని ప్రశ్నించునట్లు మాట్లాడుటను పృచ్ఛ అనిరి. (అనుష్టుప్ వృత్తపాఠములోని 'పృచ్ఛ' నిర్వచనమునకు ఇదిసమానమే) (నా. శా. 16. పు. 447)

*ప్రకరణనాయిక* : ప్రకరణము అను రూపకములోని నాయిక. (ఉదాత్తుడుకాని నాయకుని ఇతివృత్తము): ఇందులోని నాయికకు కులస్త్రీ లక్షణములు తక్కువగాను, వేశ్యాలక్షణములు అధికముగాను ఉండవచ్చును. మందకులస్త్రీ చరితము ఇతివృత్తము కాబట్టి నాయిక వేశ్య లేదా కులాంగన కావచ్చు. కులస్త్రీ భాష శౌరసేని, వేశ్యభాష సంస్కృతము. కులస్త్రీ ఆచారము వినయము, వేశ్య ఆచారము మొదటిదానికి విపరీతము. నాయకుడు గృహస్థుడైనచో నాయిక కులస్త్రీ, అట్లుకానిచో నాయిక వేశ్యగా ఉండవలె. లేదా వేశ్యతో సంబంధము కల్పించవలె. (నా శా. 18. పు. 521).

*ప్రకరణము* : దశవిధ రూపకములలో రెండవది. లక్షణము 1. ఇతివృత్తము:

కవికల్పితమైనదికావలె, అనార్షము లేదా ఆహార్యము కావచ్చు. 2. నాయకుడు: విప్ర-వణిక్-సచివ-పురోహిత-సార్థవాహులలో ఎవరో ఒకరు కావచ్చు. 3. అంకములు: 5 నుండి పదివరకు ఉండవచ్చు 4. సంధులు: పంచసంధులతో కూర్చవలె 5. వృత్తులు: నాలుగు వృత్తులతో కూర్చవలె 6. రసములు శృంగారము అంగిరసము 7. విశేషములు: ఎన్నో లక్షణములందు ఇదినాటకతుల్యమే అయినను ఇందు దివ్యుల, ఉదాత్తుల చరితము వర్ణితము కారాదు. రాజోచిత సంభోగముతో దీనిని ప్రదర్శించరాదు. దాసుల, విటుల, వేశ్యల శృంగారమునకే ఇందు ప్రాధాన్యము. నాయకుడు గృహస్థుడైనప్పుడు నాయిక కులజాంగన కావచ్చుగాని ఆనాయికకు మండకుల స్త్రీ చరిత్రమే ఉండవలె. (నా. శా 18. పు 520–21) ఇదిత్రివిధము. శుద్ధము, వికృతము సంకీర్ణము (ద. రూ. 3 42) – ఉదా విప్రనాయకము మృచ్ఛకటికము, అమాత్యనాయకము మాలతీ మాధవము, వణిఙ్నాయకము పుష్పభూషితము (సా. ర. 6. పు. 190).

*ప్రకరణిక* : జన్య రూపకములలో ఒకటి: ఇందులో సార్థవాహాదులు నాయకులుగా ఉందురనియు ఇది కైశికీవృత్తి ప్రధానముగా ఉండుననియు 'అభినవభారతి' గుర్తించినది. (నా. శా. 18. పు. 522). ఇది ఉపరూపకమని సా. ద. ఉదా మృగ్యము (సా. ద. 6 పు. 204).

*ప్రకరి* : ఇతివృత్తవిషయమున, అర్థప్రకృతులు ఐదు. అందులో ఇదినాల్గవది: కేవలము పరార్థము కొరకే (అనగా పరుల ప్రయోజనమును సాధించుటకే) కల్పితమైన వృత్తము (రామాయణములో జటాయువు వృత్తమువంటిది) ప్రకరి అనబడును. (నా. శా. 19. పు. 565). ప్రాసంగికేతివృత్తమే కొంచెములో ముగియునది అయినచో దానిని ప్రకరి అనిరి. ఉదా। రామాయణములో శబరికథ (ద.రూ.1.13). ప్రధాన కథకు పుష్టినిచ్చు చిన్నకథ ఉండు భాగమునే ప్రకరి అనిరి (హిం. సా. కో. పు. 506).

*ప్రకాశము* : అపవారితములలో ఒకటి : అందరు వినదగినట్లు చెప్పు పద్ధతి (ద. రూ. 1-64).

*ప్రకాశ్య ప్రకాశనము* : సంధ్యంగ ప్రయోజనములు 6. అందులో ఇది ఆరవది ప్రకాశమొనర్పదగు అర్థములను ప్రకాశింపజేయుట దీనిలక్షణము. (నా. శా. 19, పు. 570).

*ప్రఖ్యాతము* : మూడు విధములైన నాటక వస్తువులలో ఒకటి: పురాణముల ద్వారా ప్రసిద్ధమైన కథను ప్రఖ్యాతము అనిరి. (ద రూ. 1–'6).

*ప్రగమనము* : ప్రగయణము. ప్రతిముఖ సంధికిగల 13 అంగములలో ఒకటి: ఉక్తిప్రత్యుక్తి రూపమైన వాక్యమును ప్రగమనము అనిరి. (నా. శా. 19. పు. 573). ఉదా విక్రమోర్వశీయములో ఊర్వశి: "జయము జయముమహారాజునకు జయము అనగా రాజు: జయమనగ నాదె" అను సందర్భము (సా. ద. 6. పు. 156).

*ప్రగల్భ* : ప్రౌఢ, స్వీయనాయిక భేదములు 13. వాటి ప్రధాన భేదములలో (ముగ్ధ, మధ్య, ప్రగల్భ) మూడవనాయిక. సంభోగక్రియలో విశేషానుభవము సంపాదించి నేర్పరి అయినది కనుక ప్రగల్భ లేదా ప్రౌఢ అనిపించుకొన్నది. ఈనాయిక రతిప్రీతిమతి,సురతానంద సమ్మోహవతి(సంభోగములో ఒడలుమరచునది)అగుచున్నది. అలవడిన ధైర్యాధైర్యములను బట్టి ప్రగల్భ విధములు 6: ధీర-జ్యేష్ఠ, ధీర-కనిష్ఠ; ధీరాధీర-జ్యేష్ఠ, ధీరాధీర-కనిష్ఠ; అధీర-జ్యేష్ఠ, అధీర-కనిష్ఠ(ర.మ.1-10) చూ. నాయికలు, ధీర మొ నాయికలు

*ప్రచ్ఛేదకము* : లాస్యాంగములు 10, వాటిలో ఒకటి. నిండు వెన్నెలలోతమ వాంఛలను భరింపలేని స్త్రీలు ప్రియులను—వారు విప్రియకారులైనప్పటికిని-కలియుటను ప్రచ్ఛేదకము అందురు. (నా. శా. 19. పు. 582).

*ప్రతినాయకుడు* : కథలోని ముఖ్యనాయకునకు ప్రతిపక్షమై ఉండువాడు ధీరోద్ధతలక్షణములుగలవాడు ప్రలోభి, మొండి, దుర్వ్యసని, పాపకృత్యములే తలపెట్టువాడు. ఉదా శ్రీరామునకు రావణుడు, ధర్మజునకు దుర్యోధనుడు (ద. రూ: 2—9).

*ప్రతిముఖ సంధి* : ఆధికారిక (ప్రధాన) ఇతివృత్తమున కుండవలసిన అయిదు ప్రధాన సంధులలో రెండవది: ముఖ సంధిలో నిష్పన్నమైన బీజము అవాంతర కారణములచేమరుగుపడినప్పుడుఆబీజము మరల ఉద్ఘాటితము (సుస్పష్టము అయినచో ఆకథాభాగము "ప్రతిముఖ సంధి" అనబడును. (ముఖసంధిలో కన్పట్టిన బీజము విరోధిసన్నిధానముచే నష్టమైనట్లు మరుగుపడి ఉండును. అప్పుడు మట్టిపెల్లను తొలగించినచో కిందనుండు బీజాంకురము బైటకు వచ్చినట్లుగా ఇందు బీజము స్పష్టముగా కనిపించును). దీనిఅంగములు 13: చూ. 1. విలాసము 2. పరిసర్పము 3. విధూతము 4. తాపనము 5. నర్మము 6. నర్మద్యుతి 7. ప్రగమనము 8. నిరోధము 9. పర్యుపాసనము 10. పుష్పము 11. వజ్రము 12. ఉపన్యాసము 13. వర్ణసంహారము.

*ప్రతిషేధము 1.* : నాట్య (నాటక)మునకు భూషణప్రాయమైన 36 లక్షణములలో ఒకటి. అ. గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము : నిషిద్ధ (విపరీత)కార్యములందు ప్రవర్తించువారిని కార్యజ్ఞులు నివారించుటను ప్రతిషేధము అనిరి. (ఇది అనుష్టుప్ వృత్తపాఠములోని 'లేశము' తో సులభముగా సమన్వితమైనది: వాక్యకుశలులు సద్మశార్థములను ప్రతిపాదించుచు ఉపాయ సహితముగా వాక్యార్థమునుచెప్పుట లేశము (నా.శా.16. పు.447).

*ప్రతిషేధము 2.* : నిషేధము. విమర్శసంధికిగల 13అంగములలోఒకటి: అభీష్టార్థసిద్ధి భంగపడుటను "ప్రతిషేధము" అనిరి. (నా. శా. 19. పు. 575).ఉదా "ప్రభావతి"లో ప్రభావతిని అసురపతి తోడ్కొని పోయినాడని విదూషకుడు చెప్పగా ప్రద్యుమ్నుని మానసముభంగపడు సన్నివేశము(సా ద.6 పు.164).

*ప్రతిహారులు* : ఆభ్యంతర (రాజాంతఃపుర) పరివారములో ఒకవర్గము: సంధి-

విగ్రహ సంబద్ధమై, వివిధచారులవలన తెలిసిన కార్యమును నివేదించువారు ప్రతిహారులు. (నా. శా. 24. పు. 707).

**ప్రతీక్ష** : సస్పెన్స్. నాటకమును చూచుచున్న ప్రేక్షకులు (లేదా కథనుచదువు చున్న పాఠకులు) అడుగడుగున సంభ్రమాశ్చర్యములకు గురియగుచు "ముందేమి జరుగనున్నదో ఇంకనుచూతము" అను ఊగిసలాట మనస్తత్వముతో, ఎంతో కుతూహలముతో ఆకథయందే ఉత్సుకతను చూపుచుందురు. ప్రేక్షకులలోను, పాఠకులలోను కథాసంబంధమైన ఇట్టి ఉత్సుకతను కలిగించిన సామర్థ్యమురచయితది. ఆఉత్సుకతనుఇంగ్లీషులో సస్పెన్స్ (suspense) అందురు. తెలుగులో దీనిని నేడు ప్రతీక్ష అనుచున్నారు.

కథారచనాగతమైన ఈ ప్రతీక్ష ప్రాచీన భారతీయ కావ్యశాస్త్ర వేత్తలు గమనించినదే దానినొకనిర్దిష్టమైనపరిభాషతో వారుపేర్కొనకున్నను రూపక ప్రదర్శనలో 'ఆరంభము' నుండి 'నియతాప్తి' వరకు నిర్వహించుటకు నిర్దేశించిన కార్యావస్థలలో ఈ ప్రతీక్ష ఇమిడియున్నది. అనగా 'ఫలాగమము' వరకు ముఖ్యమైన కథారహస్యములను గుప్తముగా ఉంచుచు పోవుటకే సంధులు, సంధ్యంగములు తోడ్పడుచున్నవి.

ప్రతీక్ష నిర్వహించుపద్ధతి రెండువిధములు 1. ఆరంభమునుండిఅంతము వరకు వివిధ కథాఘట్టముల విచిత్ర సన్నివేశములందే ప్రేక్షకుల (పాఠకుల) మానసికమును ఊగిసలాటలో ఉంచి, కథ ఎట్లు సమాప్తి అగునో తెలియకుండ దాచిదాచి హఠాత్తుగా కథాసమాప్తిలో దానిరహస్యమును ఆశ్చర్యజనకముగా వెల్లడించుట. 2. పాత్రల సంభాషణద్వారా కథారహస్యము కొంత ప్రేక్షకులకు (పాఠకులకు) తెలిసినను తమతమ లక్ష్యములు సాధించుటకు అయాముఖ్యపాత్రలు ప్రదర్శించు పట్టుదలలు ఆధారముగా కథను సాగించి అసలు రహస్యమును చివరకు వెల్లడిచేయుట. షేక్స్పియర్ నాటకములలో ఈ రెండవ పద్ధతి ఉన్నదని తజ్ఞుల అభిప్రాయము.

విడంబన–ప్రతీక్ష (Ironic_suspense) మూడవపద్ధతిఅని, షేక్స్పియర్ రచించిన "మేక్ బెత్" నాటకములో దీని ప్రయోగమును చూడవచ్చునని పాశ్చాత్య విమర్శకుల అభిప్రాయము. (హిం. సా. కో. పు 378)

**ప్రత్యుత్పన్నమతిత్వము** : చూ. సంధ్యంతరములు.

**ప్రథమ పతాకాస్థానకము** : పతాకాస్థానకములు 4 ఇది మొదటిది: ఉద్దిష్టమగు ప్రయోజనముకంటె ఎక్కువ ఉపకారి అగుటచే ఉత్కృష్టమైన వేరొక అర్థము అచింతితముగా సంపన్నమగుటను ప్రథమ పతాకాస్థానకము అనిరి (నా. శా. 19. పు. 566). ఉదా రత్నావళిలో రాజు సాగరిక కంఠమున ఉన్న లతాపాశమును వదలుము అనిన సందర్భము (సా.ద. 6 పు. 143).

**ప్రదానము** : దానము (పాఠాంతరము). సంధ్యంతరములు 21. అందులో ఒకటి: తన ప్రాతినిధ్యమును తెల్పు భూషణాదికములను సమర్పించుటను ప్రదానము అందురు. (హిం. సా. కో. పు. 860).

*ప్రపంచము* : వీథ్యంగములు 13. వాటిలో ఒకటి: అసత్యములు, పరస్పర సంస్తవయుక్తములు, హాస్య జనకములు, ఒకే ప్రయోజనమును సాధించునవి అయిన సమాధానములను ప్రపంచము అనిరి. (నా. శా. 18. పు. 580) మిథ్యారూపమైన పరస్పర వాక్యము, హాస్యకారి అయినదానిని ప్రపంచము అనిరి. ఉదా॥ విక్రమోర్వశీయములో వలభియందలి చేటి - విదూషకుల అన్యోన్య వచనము (సా. ద. 6. పు. 195).

*ప్రయత్నము* : చూ. యత్నము.

*ప్రయోక్త* : చూ. అభినేత.

*ప్రయోగమునందు రాగప్రాప్తి* : సంధ్యంగ ప్రయోజనములు 6. అందులో ఇది మూడవది: ప్రయోగమును రక్తికట్టించుటను బట్టి దీనిని తెలియవలెను, (నా. శా. పు. 570).

*ప్రయోగాతిశయము* : ఆముఖ (ప్రస్తావన) అంగములు ఐదు. అందులో ఇదొకటి: నాట్య (నాటక) మునకు సంబంధించిన వస్తువును సూత్రధారుడు ప్రస్తావనలో ప్రయోగింపగా దానిననుసరించి పాత్రప్రవేశించు పద్ధతిని 'ప్రయోగాతిశయము' అనిరి. (నా. శా. 20. పు. 614). సూత్రధారుడే పాత్రను ప్రవేశపెట్టు ప్రస్తావన విధానమును ప్రయోగాతిశయమందురు. ఉదా॥ శాకుంతలములో సూత్రధారుడు దుష్యంతుని ప్రవేశమును సూచించుట మొ॥ 'ఏష రాజేవదుష్యంతస్సారంగేణాతి రంహసా'

*ప్రరోచన 1* : పూర్వరంగ సంబంధి. బహిర్యవనికాంగములు 10. అందులో ఒకటి. ఉపాయహేతు, యుక్తులతో కావ్యార్థసూచనచేసి ప్రయోగింపబోవు రూపకమునందు సామాజికులకు ప్రీతికలుగునట్లు చేయుపద్ధతిని ప్రరోచన అనిరి. (నా. శా. 5. పు. 158).

గమనిక : పూర్వరంగ (బహిర్యవనిక) అంగమైన ఈ ప్రరోచన, భారతీవృత్తికి అంగమైన ప్రరోచన, విమర్శసంధికి అంగమైన ప్రరోచన, నాంది, ఈ నాల్గింటి లక్షణములు ఒకేమూసలోనివిగా తోచును.

*ప్రరోచన 2* : భారతీవృత్తికిగల 4 అంగములలో (అంశములలో) ఒకటి : (పూర్వరంగ బహిర్యవనికాంగములలో ప్రయుక్తమగునదిదియే) : జయమును అభ్యుదయమును సూచించునది, మంగళావహము, విజయప్రదము, సర్వపాపప్రశమనము అగుదానిని ప్రరోచన అనిరి. (నా.శా. 20-పు.612). నాందియేభారత్యంగనిరూపణమున 'ప్రరోచన' అయినది.(నా శా 5.పు.158)

*ప్రరోచన 3* : విమర్శ సంధికిగల 13 అంగములలో ఒకటి: నిర్వహింపబోవు అర్థమును ముందుగా ప్రదర్శించుటను ప్రరోచన అనిరి. (నా.శా.పు.576).

*ప్రవత్స్యత్పతిక* : 'రసమంజరి' చెప్పిన 9వ శృంగార నాయిక. ఇక కొన్ని క్షణములలో నాయకుడు దేశాంతరము వెళ్లుననగా విచారించునది. ప్రోషితభర్తృక లక్షణమునకును దీనికిని భేదమున్నదని పూర్వాలంకారికులనిరి . స్వర వికారముగల మాటలు, బెదరుచూపులు, పతిప్రయాణము విఘ్నముకావలె

నను కోరిక, నిర్వేదము, కన్నీళ్ళు మొ॥ ఈ నాయిక లక్షణములు (ర. ప్రసం. 1. 82, 83)

*ప్రవృత్తకము* : ఆముఖ (ప్రస్తావన) అంగములు ఐదు. అందులో ఒకటి : సూత్రధారుడు కాలప్రవృత్తిని (ఏదైనా ఒక ఋతువును) ఆశ్రయించి వస్తువర్ణన చేసినచో దానిని అనుసరించి పాత్రప్రవేశించు పద్ధతిని ప్రవృత్తకము అనిరి. ఉ॥ ఆయా నాటకములందలి ప్రస్తావనలలో లభించునవే.

*ప్రవేశక ప్రయోజనములు* : ప్రవేశకము, (1) కాలోదయమును సూచించునదై (2) గూఢార్థములను వ్యాఖ్యానించునదై (3) కార్యవిశేషములను తెలుపునదై (4) పంచాంగానుష్ఠానములను సూచించునదై, (5) రాబోవు అంకములోని ఇతివృత్తమును సూచించునదై ఇట్లే వివిధ అర్థములను సూచించునదై ఉండవలె. (నా.శా.)

*ప్రవేశకము* : అర్థోపక్షేపకములు ఐదు. అందులో ఒకటి : అంకము ముగించిన తర్వాత ఒక నెలలోపలనో లేదా సంవత్సరములోపలనో జరిగిన కార్యమును సూచించుకథాభాగములను ప్రవేశకములు అందురు. అంకములందు ప్రత్యక్షముగా చూపరాని కథను హృదయమందు ప్రవేశించునట్లు చేయునది కావున ఇది ప్రవేశకమనబడినది. ప్రవేశకము రెండంకములమధ్య కూర్చవలె. ప్రతి అంకాంతమందును బిందువు సూచితమగుచుండును. ఆ బిందు విషయమును విస్తరించిచూపుటకై ప్రకరణ—నాటకములలో అంకములమధ్య ప్రవేశకమును కల్పింతురు. ఇది ఉత్తమ, మధ్యమ పాత్రలచే ప్రయుక్తము కారాదు. ఉదాత్తవచనసహితముకారాదు. ప్రయోగమునననుసరించి ప్రాకృత-భాషావ్యవహారములేఇందు కర్తవ్యములు. (నా.శా. 18.పు. 517) నీచ పాత్రలు, నీచభాషగలది ప్రవేశకము (సా.ద. 6.పు 145)

*ప్రశస్తి* : నిర్వహణ సంధికిగల 14 అంగములలో ఒకటి: రాజుకు, దేశమునకు శాంతినికోరుటను ప్రశస్తి అనిరి. (క్రమముగా ఇది 'భరతవాక్యము' పేర మారినది). నిర్వహణలో చివరి అంగములైన ఉపసంహార-ప్రశస్తులు ఒకటే క్రమమున రావలసియుండును (సా.ద. 6.పు 168).

*ప్రశాంతము* : సుబంధువు చెప్పిన ఐదు నాటక భేదములలో ఒకటి : ప్రశాంతరస భూయిష్ఠమైన ఈ భేదము సాత్వతీవృత్తి ప్రధానము. (ఉదా: స్వప్నవాసవదత్త) నా.శా.పు. 541).

*ప్రసంగము* : విమర్శ సంధికిగల 13 అంగములలో ఒకటి : గురువులను కీర్తించుటను ప్రసంగము అనిరి. (నా.శా. 19. పు 575). ఉ॥ మృచ్ఛకటికములో చారుదత్తుని వధ్య స్థానమునకు కొనిపోవు సందర్భమున గురు కీర్తనములో ఈ లక్షణమున్నది (సా.ద.6.పు. 168).

*ప్రసాదము* : నిర్వహణ సంధికిగల 14 అంగములలో ఒకటి : శుశ్రూషాదుల వలన కలిగిన ప్రీతిని ప్రసాదము అనిరి. (నా.శా. 19.పు 576). ఉ వేణీ సంహారములో భీముడు ద్రౌపదికి తలవెండ్రుకలు ముడుపు సన్నివేశము. (సా.ద. 6 పు 167).

*ప్రసిద్ధ నాట్యములు(నృత్యములు)* : నేటి భారతదేశమున ప్రసిద్ధికెక్కిననాట్య (నృత్య) భేదములు ఐదు : చూ 1. కూచిపూడినాట్యము 2. భరతనాట్యము 3. కథాకళి 4. కథక్ 5. మణిపురి.

*ప్రసిద్ధి* : నాట్య (నాటక)మునకు భూషణప్రాయమైన 36 లక్షణములలో ఒకటి : చూ. ఆఖ్యానము, అనునీతి.

*ప్రస్తావన* : ఇది రెండు విధములు : 1. ఆముఖము ప్రస్తావన అనబడినది. ఇది స్థాపనలో ఒకభాగము. ఉద్ఘాత్యకాదులు దీని అంగములు. భారతీవృత్తికిగల నాలుగు అంగములలో ఆముఖము అను ప్రస్తావన ఒకటి. ఇందులో కార్యము పూర్వరంగాభిముఖముగా నడచును. ప్రరోచనలో, ఋతువర్ణన, పాత్ర ప్రవేశ సూచన మొ ఉండును. ఈ అన్నిటిని కవియే రచించును. చూ. ఆముఖము.

2. పూర్వరంగాంగమైన ప్రస్తావన మరొకటి : దీనిలో కవి తటస్థుడు. ఇది కవి రచించినదికాదు. దీనిలో స్థాపకుడు స్వతంత్రుడై ధ్రువా గానాదుల కర్తయై పూర్వరంగమును కార్యాభిముఖముగా నడుపును (నా. శా. 20. పు 618).

*ప్రస్థానకము* : ప్రస్థానము, ఉపరూపకము. నాయకుడు దాసుడు, ఉపనాయకుడు అంతకన్న తక్కువవాడు, నాయిక దాసి, వృత్తికైశికి (భారతిగూడ), సురాపాన సమాయోగముతోనే ఉద్దిష్టార్థము నెరవేరును, రెండంకములు, లయ తాళాదుల విలాసములుండును. ఉదా శృంగార తిలకము. (సా.ద. 6-పు 201)

*ప్రహసనము 1.* : దశవిధ రూపకములలో 8వది. లక్షణము 1. ఇతివృత్తము : కవి కల్పితమైనదై ఉండవలె. 2. నాయకాదులు : శుద్ధ ప్రహసనములో భగవత్తాపసాదులు; సంకీర్ణ ప్రహసనములో వేశ్యా, చేట, నపుంసకాదులు ఉండవలె 3. అంకములు : ఒకటిమాత్రమే 4. సంధులు: రెండు; ముఖ సంధి, నిర్వహణ సంధి 5. వృత్తులు : భారతి మాత్రము 6. రసములు : ఒకటి, హాస్యము మాత్రము 7. విశేషములు : ప్రహసనము రెండు విధములు : 1. శుద్ధ ప్రహసనము : భగవత్-తాపస-విప్ర-శాక్యాదుల హాస్య వాదములతో, కుత్సితపురుషులతో, ఒకే ఒకని చరిత్రముతో కూడినది 2. సంకీర్ణ ప్రహసనము : వేశ్యా-చేట-నపుంసక-ధూర్త-బంధకీసంకులమైనది.

ప్రహసనములలో లోకవ్యవహారసిద్ధమైన వార్త, దంభము, ధూర్తుల (కృత్రిమ తాపసుల, విటుల) ప్రతివాదములు ఉండవలె. అవసరమునుబట్టి వీథ్యంగములు కూర్చవలె (నా.శా. 18.పు 543) — దీనిలో విష్కంభ, ప్రవేశకములు లేవు. ప్రహసన భేదములు 1. శుద్ధప్రహసనము ధృష్టనాయకుడు (తపస్వి/సన్యాసి/బ్రాహ్మణుడు) కలది ఉదా కందర్పకేళి 2 సంకీర్ణము :- ఎవరినైన నాయకునిచేసి రచించినది ఉదా ధూర్తచరితము వివిధ ధృష్టుల చరితము సంకీర్ణమని కొందరు ఉదా లటకమేళకాది. వేశ్యా-బంధకి-నపుంసక-విట-ధూర్తులు నైసర్గిక వేష - భాషా - చేష్టితములతో వ్యవహరించినది సంకీర్ణమని భరతముని 3. వికృతము : షండ-కంచుకి-తాపసులు, భుజంగ-నట-భటాదుల వేష, భాషల ననుకరించి వ్యవహరించినది. ఇది సంకీర్ణములోనే చేరినదని ముని (సా.ద. 6-పు 199).

*ప్రహసనము 2.* : భారతీవృత్తి అంగములు (అంశములు) నాలుగు. అందులో ఒకటి : భారతీవృత్తి వాగ్వ్యాపారరూపమైనది. హాస్యసన్నివేశములు, విచిత్ర వార్తాలాపములు ప్రహసనము పేరుతో భారతీవృత్తి అంశములలో ఒకభాగముగా పరిగణింపబడినవి (హిం.సా.కో. పు. 424. భారతి).

*ప్రాడ్వివాకులు* : రాజుకు ఉండదగిన బాహ్యపరివారములో ఒకవర్గము. ధర్మాసనమందు నియుక్తులు కాదగినవారు: వ్యవహారవిదులై, అర్థతత్వవేత్తలై, బహుశ్రుతులై, ధార్మికులై, సమదర్శులై నడవగలిగినవారే ఈ పదవికి అర్హులు (నా.శా.పు. 710).

*ప్రాప్తి 1.* : ముఖసంధికిగల 12 అంగములలో ఒకటి: సుఖపెట్టు వస్తువు. లభించుట ప్రాప్తి (నా.శా. 19-పు. 572). ఉదా। 'వేణీసంహారము'లో ద్రౌపది (భీముని మాటవిని): "నాథా! పూర్వమెప్పుడును విననిది సుమా ఈ మాట, మరలమరల చెప్పుము" అనిన సందర్భము (సా.ద. 6-పు 154).

*ప్రాప్తి 2.* : నాట్య (నాటక)మునకు భూషణప్రాయమైన 36 లక్షణములలో ఒకటి అగు. అనుసరించిన ఉపజాతివృత్తపాఠము ప్రకారము : అవయవ చిహ్నమునుచూచి భావమును అనుమానించుటను ప్రాప్తి అనిరి. (అనుష్టుప్ వృత్తపాఠము 'ప్రాప్తి'కిగూడ ఇదేనిర్వచనమున్నది). (నా.శా.16-పు448).

*ప్రాప్తిసంభవము* : పంచకార్యావస్థలలో ఒకటి. చూ. ప్రాప్త్యాశ.

*ప్రాప్త్యాశ* : పంచకార్యావస్థలలో ఒకటి ప్రాప్తిసంభవము అని నా.శా. పాఠము : కొంచెముగా, భావమాత్రముగా ఫలము ప్రాప్తించుట ప్రాప్తి సంభవము (ఇందులో ఫలప్రాప్తినిగురించిన సంభావనతోపాటు అసంభావన గూడ ఉండును. నిశ్చయించుకొనిన ఉపాయముచే విశిష్ట ఫలప్రాప్తి సంభావనా మాత్రముగా స్థాపితమగునని తెలియవలె). ఉదా రత్నావళి 4వ అంకములో ఏకాంతసంగమరూపమైన ఫలప్రాప్తి ప్రాప్త్యాశ (సా.ద.6-పు.149).

*ప్రారంభము* : పంచకార్యావస్థలలో ఒకటి. చూ. ఆరంభము.

*ప్రార్థన* : గర్భసంధికిగల 13 అంగములలో ఒకటి: రతి, హర్ష, ఉత్సవ ములను గురించిన ప్రార్థన 'ప్రార్థన' (ఈ అంగమును కొందరు గణించరు). (నా.శా.పు. 574). ఉదా రత్నావళిలో రాజు సాగరికను ప్రియసంగమము కొరకు ప్రార్థించు సన్నివేశము (సా.ద.6-పు. 160).

*ప్రాసంగికము* : ఇతివృత్తము మరొక విభజన ప్రకారము రెండువిధములు. 1. ఆధికారికము : ప్రధాన (ఫలయోగముగల) ఇతివృత్తము 2. ప్రాసంగికము : (పతాక, ప్రకరి) ఇది ప్రధాన ఇతివృత్తమునకు ఉపకరణముగా కల్పించిన వృత్తము. మొదటిదానిలో ప్రధానమైన ఐదుసంధులు ఉండును. రెండవదాని (పతాక) లోనివి అనుసంధులు అనబడును. చూ. ఆధికారికేతివృత్తము.

*ప్రియము* : నాట్య (నాటక)మునకు భూషణప్రాయములైన 36 లక్షణములలో ఒకటి. అ.గు. అనుసరించిన ఉపజాతివృత్తపాఠము ప్రకారము : ఆదియందు క్రోధజనకము, అంతమందు హర్షప్రవర్ధకము, ఆశీర్వాద సమన్వితము అయిన వచనము 'ప్రియము' (ఇది 'యాచ్ఞా' నిర్వచనమునకు సమానమే. అ.గు. దీనిని అనుష్టుప్ పాఠములోని 'భ్రంశ' నిర్వచనముతో కష్టపడి సమన్వయించెను. వాచ్యార్థమును విడిచి, అన్యార్థమును ఆశువుగా చెప్పుట 'భ్రంశము' (నా.శా. 16.పు. 448).

*ప్రియోక్తి* : నాట్య (నాటక)మునకుభూషణ ప్రాయములైన 36 లక్షణములలో ఒకటి. చూ. ప్రోత్సాహనము.

*ప్రేంఖణము* : ప్రేక్షణికము, ఉపరూపకము. గర్భ-అవమర్శలుండవు, నాయకుడు హీనుడు, సూత్రధారుడుండడు, ఒకే అంకము, విష్కంభక-ప్రవేశకములు లేవు, నియుద్ధములు - రోషభాషణములుండును, నాలుగు వృత్తులుండును, నాంది, ప్రరోచన నేపథ్యముననే ముగింతురు (సా.ద.6-పు202).

*ప్రేరణ* : ఉపరూపకభేదము. కూర్పులో ముఖ్యమైనవి : 'రామాక్రీడము'తో పాటు దీనినిగూడ అ.భా. ఉల్లేఖించినది. ప్రహేళికలతో హాస్యప్రాయమైన ఉపరూపకమును ప్రేరణ అనిరి (హిం.సా.కో.పు. 543) ఉదా మృగ్యము.

*ప్రేషణికలు* : ప్రేషణకారికలు, ఆభ్యంతర (రాజాంతఃపుర) పరివారములో ఒకవర్గము : రహస్యదూతీ కృత్యముకొరకు నియమింపబడినవారు ప్రేషణికలు (నా.శా.పు. 707).

*ప్రోత్సాహనము* : నాట్య (నాటక)మునకు భూషణప్రాయమైన 36 లక్షణము లలో ఒకటి. అ.గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము : ఉత్సాహవర్ధకములు, స్పష్టములు, సాదృశ్యముతో కూడినవి, ప్రసిద్ధములు

అయిన వచనములచే ఒక అజ్ఞాత విషయమందు ఉత్సాహమును కల్పించి నచో దానిని ప్రోత్సాహనమనిరి. (ఇది అనుష్టుప్‌పాఠములోని 'ప్రియోక్తి' తో సమన్వితమైనది : ప్రసన్నమైన మనస్సుతో పూజ్యులను పూజించు నప్పుడు తన మనస్సులోని హర్షమును వెల్లడిచేయుటకు చెప్పెడి మాటలను 'ప్రియోక్తి' అనిరి. (నా.శా. 16.పు 444).

*ప్రోషిత భర్తృక :* శృంగారనాయిక చూ. నాయికలు అష్టవిధములు.

*ప్రౌఢ :* ప్రౌఢ, ప్రగల్భనాయికల లక్షణములను రసమంజరి కలిపిచెప్పినది. ప్రౌఢ పురుషాయిత ప్రవీణతగలది, ప్రగల్భ పూర్ణయౌవనముగలది అని కా.సం. (పు.69-70). చూ. ప్రగల్భ.

*ఫలయోగము :* పంచకార్యావస్థలలో ఒకటి. చూ. ఫలాగమము.

*ఫలహేతువులు :* అర్థ ప్రకృతులు. అర్థమనగా ఫలము. ప్రకృతులనగా ఉపాయములు. కాబట్టి అర్థప్రకృతులు ఫలహేతువులు (ఫలసాధనోపాయ భేదములు). అని సారాంశము. ఇవి ఇతివృత్త విభాగములు కావు. ఇతివృత్త మందంతటను వ్యాపించు ఉపాయములు. చూ. అర్థప్రకృతులు.

*ఫలాగమము :* పంచ కార్యావస్థలలో ఐదవది (ఫలయోగము అని నా.శా. పాఠము). ఇతివృత్తము ముగియుచోట నాయకుడాశించినది, నాయకునకు ఉచితమైనది అయిన ఫలము సమగ్రముగా సిద్ధించుటను 'ఫలయోగము' అనిరి (నా.శా. 1-పు 563). ఉదా। రత్నావళిలో రాజునకు ఫలాగమము. (సా.ద. 6-పు 149).

*బహిర్యవనికాంగములు :* యవనిక వెలుపల నిర్వర్తింపబడు అంగములు 10 : చూ. 1. గీతవిధి 2. ఉత్థాపనము 3. పరివర్తనము 4. నాంది 5. శుష్కావకృష్ట 6. రంగద్వారము 7. చారి 8. మహాచారి 9. త్రిగతము, ప్రరోచన, (నా.శా. 5-పు 158). నాంది; తర్వాత త్రిగతము, ప్రరోచన (ప్రస్తావన రూపములో) ప్రతిరూపకమునందునిర్వర్తించుటతప్పనిసరి అయినవి. మిగతా అంగములు వీలునుబట్టి నిర్వర్తించవచ్చు.

*బాహ్యానాట్యము :* నాట్య (నాటక)మునకు మరొకవిభజనము రెండువిధములు: 1. ఆభ్యంతర నాట్యము : ఉద్భటము కానిది, సంభ్రమాదులు లేనిది శాస్త్ర లక్షణ సమ్మతమైనది. 2. బాహ్యానాట్యము : ఆచార్యునివద్ద సుశిక్షితులు కానివారు, సంప్రదాయమునెరుగనివారు ప్రయోగించునది (నా.శా. 22-పు 664). ఇది తెలుగులో ప్రసిద్ధముగా వినవచ్చుచున్న 'బయలాట' అను మాటకు సరిపోవుచున్నది. నా.శా. నాడు ప్రయోగించుచున్న యక్షగాన ములవంటి ప్రక్రియనుచూచి ఈ విభజన జరిగియుండును. యక్షగానముల వంటి ప్రక్రియలు బాహ్యానాట్యకళ నుండియే వెలువడి వికసించినట్లు తలపవచ్చు.

*బాహ్యాపరివారము* : రాజాస్థానములో, ప్రభుకార్యములలో నియమించిన పరివారము చూ. 1. రాజు (యువరాజు) 2. సేనాపతి 3. పురోధసులు 4. సచివులు 5. ప్రాడ్వివాకులు 6. కుమారాధికృతులు (సభాస్తారులు= మాన్యులుకూడ) (నా.శా. 24-పు 709-11).

*బిందువు* : ఐదు అర్థప్రకృతులలో రెండవది. ఇతివృత్త విషయమున సాధించ వలసిన ఫలమునకు ఉద్దేశించిన రెండవ ఉపాయము (ప్రకృతి). బీజమునకు (అనగా ప్రయోజనమునకు లేదా ఉపాయానుష్ఠానమునకు) విచ్ఛేదము కలిగి నప్పుడు అట్లు విచ్ఛేదముగాని, ఆటంకముగాని, జరుగకుండుటకు కారణమైఫలప్రాప్తి పర్యంతము నీటిమీది తైలబిందువువలె సర్వవ్యాప్తి అగునది బిందువు (బీజము ముఖసంధిలోనే ఉద్భవిల్లి వికాసముపొందు చుండును. బిందువు తదనంతరము ప్రవర్తిల్లును. రెంటికిని భేదమిదే. అయినను ఫలపర్యంతము వ్యాపకములై ఉండు సంబంధము గుర్తుంచు కొనవలసినది) (నా.శా. 19-పు 565) ఉదా రత్నావళిలో మన్మథ పూజ సమాప్తి కాగానే బీజము విచ్ఛిన్నమైనది. అప్పుడు "చంద్రుని పాద ములనుం బోలె ఉదయుని పాదములను" అను మాటను విని సాగరిక (హర్షముతో) ఏమి! ఈయన ఆ ఉదయన నరేంద్రుడా! — ఇత్యాది అనంతరార్థ హేతువు? పొడమిన చోట బిందువ్యాప్తిని చూతుము (సా.ద. 6-పు 149).

*బీజము* : ఐదు అర్థ ప్రకృతులలో మొదటిది. ఉపాయానుసంధానమైనదై, ఆదిలో స్వల్పమాత్రముగా నాటబడి, తర్వాత బహుప్రకారములుగా విస్తరించునదై, ఫలయోగమువరకు ఉండుదానిని బీజము అనిరి. బీజము దాని దశలు : 1. ముఖసంధిలోనే ఇది ఆరంభావస్థతోకూడి ఉత్పత్తి అగును. 2. ప్రతి ముఖసంధిలో అవాంతర కారణములచే మరుగుపడిన బీజము మట్టి పెల్లను ప్రక్కలుచేసి పైకివచ్చు మొక్కవలె కనిపించును. 3. గర్భసంధిలో బీజము ఫలోన్ముఖమగుచుండును. 4. విమర్శసంధిలో బీజము మరల భంగ పాటుకు గురి అగును (అందుకే నాయకాదుల పోరాటములు, ప్రయత్నములు ఇందు జరుగును. విమర్శ=విఘ్నము అని ఇక్కడి అర్థము). 5. నిర్వహణ సంధిలో బీజము యొక్క ఉద్ఘాటన, ఉద్భేదనాదులు తెలియదగిన అవస్థలు కనిపించును. బీజ, బిందువుల భేదసామ్యములకు చూ. బిందువు (నా.శా. 19-పు 563). ఉదా। వేణీ సంహారములో ద్రౌపదీ కేశ సంయమన హేతువు, భీమసేనుని కోపముచే పెంపొందిన యుధిష్ఠిరుని ఉత్సాహము (సా.ద.6.పు. 147).

*బృందగీతి* : కొందరుకలసి సామూహికముగా పాడెడిపాట. గ్రీకు రూపకములలో బృందగీతి (కోరస్)కి అధికస్థానమున్నది. ఆధునికయుగములో భారతీయ నాటకములలోగూడ దీనికి అధికప్రాధాన్యము లభించినది.

*భయము* : సంధ్యంతరములు 21. అందులో ఒకటి. దీని వివరణ మృగ్యము చూ. సంధ్యంతరములు.

*భరతనాట్యము(నృత్యము)* : నేడు ప్రసిద్ధికెక్కిన భారతీయ నాట్యభేదములు ఐదు: అందులో ఇదొకటి (అసలు భరతనాట్యమనగా భరతముని నాట్య శాస్త్రములో చెప్పిన రూపకదర్శన విధానమని ప్రాచీనమైన అర్థము). ఇది ఆధునికమైనది. దీనినే 'సదిర్ నాట్యము' లేదా 'తంజావూరునాట్యము' అందురు. ఇచ్చట నాట్యమనగా నృత్యమే. 'భరత'మనగా భావ-రాగ-తాళ-సమ్మేళనమని అర్థము. తంజావూరు రాజగు శరభోజీ (క్రీ.శ. 1789-1824) కాలములో ఇది ఆరంభమైనది: అలరింపు, జతిస్వరము, శబ్దము, వర్ణము, పదము, తిల్లాన ఈ క్రమముఏర్పరచి దీనిని సువ్యవస్థితము చేసినారు. సాధారణముగా ఒకే నర్తకి 2-3 గంటలసేపు నృత్యముచేయును. గురువు (నట్టువనార్) చెలికత్తెగా వ్యవహరించును. క్షేత్రయ్య పదములు, కీర్తనలు, అష్టపదులు, శ్లోకములు మొ వాటిని ఇందులో అభినయింతురు. నేడీనాట్యము అంతర్జాతీయ ఖ్యాతిని గడించినది (నా.శా. 4-పు. 141).

*భరతవాక్యము* : భారతీయ నాటకము 'భరతవాక్యము'తో ముగియుట ఆచారము. ప్రభువులకు, ప్రజలకు, దేశమునకు శాంతి-సుఖితములు కోరుట భరతవాక్య సారాంశము. ఎన్నో అంగములు వివరించిన నా.శా.లో భరత వాక్యమునకు వివరణలేదు. నిర్వహణసంధి అంగములలో చివరిదైన 'ప్రశస్తి' లక్షణమునుబట్టి చూచినచో (నృపునకు, దేశమునకు శాంతిని కోరుట 'ప్రశస్తిగదా!) భరతవాక్యసారాంశము అందున్నది. ప్రశస్తినే భరత వాక్యముగా పరిగణించినట్లు అ గు.ని వ్రాతవలన తెలియుచున్నది (నా.శా. 19-పు. 577).

*భరతుడు* : 'భరత'శబ్దమునకు నటుడు అను అర్థము నా.శా.లోనే ఉన్నది. 'అభినవభారతి'గూడ అట్లేచెప్పినది : "భరత శబ్దేన ఉపచారతః తద్విద్యా యోని సంబంధః సూచ్యతే" భరత (నాట్య) విద్యతో సంబంధము గలవారిని ఔపచారికముగా (లక్షణచే) భరతులు అనుట జరిగినది (నా.శా. 12-పు. 348).

*భరతోపకారకులు* : నాట్య (నాటక) ప్రదర్శనమునకు కావలసిన ఉపకరణములు సిద్ధము చేయువారు: ముకుటకారులు, ఆభరణకారులు, మాల్యకారులు, వేషకరులు, చిత్రకరులు, రజకులు, కారువులు (శిల్పులు) కుశీలవులు, వివిధ ఆతోద్య (వాద్య) కళానిపుణులు. వీరిని భరతోపకారకులు అనిరి (నా.శా. 35-పు 856.)

*భాణము:* దశవిధరూపకములలో 9వది. లక్షణము : 1. ఇతివృత్తము:- కల్పితము 2. నాయకుడు:- ధూర్తుడు లేదా విటుడు 3 అంకములు:- ఒక్కటి మాత్రమే 4. సంధులు - రెండు, ముఖ - నిర్వహణలు 5. వృత్తి. భారతి 6. రసములు :- శృంగారము అంగి, విస్మయము

అంగము 7. విశేషములు :- ఇందు లాస్యాంగములు విధిగా ఉండును. ఏకపాత్ర హార్యము. నటుడుతానను భవించిన విషయములను (ఆత్మానుభూత శంసి) లేదా ఇతరులనుభవించిన విషయములను (పరసంశ్రయ వర్ణన) ఆకాశ పురుష భాషిత యుక్తముగా వర్ణించును. (నా.శా. 16-పు 542). ధూర్తుల వ్యవహారములను చమత్కారముగా ప్రదర్శించగల ఒకే ఒక నటుడు దీనిని నిర్వహించును. ఆ నటుడు విశేషజ్ఞుడు కావున 'ఆకాశ భాషితము' వంటి వాచికాభినయములతో ప్రశ్నోత్తరములు తనవే చేసుకొని చమత్కారముగ నటించును. (ద.రూ. 3.49-51) — భాణభేదములు రెండని నా. శా. (ఆత్మానుభూతశంసి, పరసంశ్రయవర్ణన). ఇవి పది విధములని భావప్రకాశనము : 1. గేయపదము 2. స్థిత పాఠ్యము 3. ఆసీనము 4. పుష్పగండిక 5. ప్రచ్ఛేదకము 6. త్రిమూఢము 7. సైంధవము 8. ద్విమూఢకము 9. ఉత్తమోత్తమకము 10. భావ్యము. కాని వీటిలో 1-9 లాస్యాంగములై ఉన్నవి. ఉదా సంస్కృతరచనలు మృగ్యము, భారతేందు హరిశ్చంద్రుని హిందీ రచనలు లభ్యము (హి.సా.కో.పు. 588).

**భాణిక :** జన్యరూపకము. ఉపరూపకమని సా.ద. ఇందులో వేషము రుచిరము, సంధులు ముఖ-నిర్వహణములు, కైశికీ-భారతీయుక్తములైన అంకములు, నాయిక ఉదాత్తురాలు, నాయకుడు హీనుడు, అంగములు 7 : ఉపన్యాసము, విన్యాసము, విబోధము, సాధ్వసము, సమర్పణము, నివృత్తి, సంహారము. ఉదా కామదత్త.

**భామాకలాపము :** కూచిపూడి నృత్యనాటక కళ తెలుగువారి ప్రత్యేక నాట్య నైపుణ్యమునకొక ఉదాహరణము. ఇందులోని 'భామాకలాపము' అంతర్జాతీయ ఖ్యాతిని తెచ్చుకొన్నది. ఈ కలాపములో భామ(సత్యభామ) గంటల కొలది, లేదా రోజుల తరబడి చేయు అభినయము నృత్యవిద్యలో సాటిలేని ప్రక్రియగా నిలచినది. దాక్షిణాత్యుల నృత్య-గీత పక్కిని భరతుడు ప్రత్యేకముగా పేర్కొన్న అంశము స్మరింపదగినది. (నా.శా. 4.పు 145).

**భారతీవృత్తి :** నాట్య (నాటక) మాతృకలైన వృత్తులు నాలుగు. అందులో మొదటిది : భారతి అనగా వాగ్వ్యాపారము. వాచికాభినయమునకు అధిక ప్రాధాన్యముండి, (నటనకు ప్రాధాన్యము తగ్గి) కేవలము సంభాషణమే విశేషముగా ఉన్నచోట భారతీవృత్తి ఉండును. సంస్కృత పాఠ్యమును ఉపయోగించుచు కేవలము పురుషులే దీనిని ప్రయోగించవలె. —భారతీవృత్తి నాలుగు విధములు చూ. 1. ప్రరోచన² 2. ఆముఖము 3 వీథి² 4 ప్రహసనము². విధములనుటచే ఇవి నాలుగు ప్రకారములనరాదు. నాలుగుఅంశములుగా గుర్తించవలె. అనగా భారతీవృత్తిని ఈ అంశములలో చూడవచ్చు — అష్టార్థవికల్పమైన భారతీవృత్తి :- ప్రరోచన, వీథి, ప్రహసనము ఇవి మూడు; ఆ ముఖాంగములు ఐదు కలుపుకొని భారతీ

వృత్తి ఎనిమిది భాగములని డా. ఘోష్ గ్రహించెను (నా.శా. 20-పు. 611-14). — భారతీవృత్తిని అన్ని రసములకు ప్రయోగించవచ్చు ద.రూ. 2.62).

*భావికము* : లాస్యాంగము. అ.గు. గుర్తించని విశేషపాఠము. మదనపరవశ అయిన స్త్రీ స్వప్నమున ప్రియుని చూచి వివిధభావములను ప్రకటించుటను భావికము లేదా భావితము అందురు. (నా.శా. 19 పు. 583).

*భాషణము* : నిర్వహణ సంధికిగల 14 అంగములో ఒకటి : సామదానాదులతో కూడిన సంభాషణమును భాషణము అనిరి. (నా.శా. 19-పు. 577). ఉదా। చండకౌశికములో ధర్ముడు 'కావున రమ్ము ధర్మలోకము నధిష్ఠింపుము' అనిన సందర్భము (సా.ద. 6-పు. 168).

*భాసనము* : నాట్య (నాటక)మునకు భూషణ ప్రాయములైన 36 లక్షణము లలో ఒకటి. అ.గు. అనుసరించిన ఉపజాతివృత్తపాఠము ప్రకారము అనేః కార్థములను ప్రకాశింపజేయునదై, బహువిధ ఉక్తులు, యుక్తులుగలదై ఒక భావమును భాసింపజేయు వాక్యమును 'భాసనము' అనిరి (అనుష్టుప్ వృత్త పాఠమైన 'మాల'తో ఇది భేదించిననుసమన్వితమైనది: ఈప్సితార్థసిద్ధి కొరకు అనేక ప్రయోజనములను కీర్తించుటను 'మాల' అనిరి.) (నా.శా. 16-పు. 447).

*భూషణము* : నాట్య (నాటక)మునకు భూషణప్రాయములైన 36 లక్షణము లలో ఒకటి. అ.గు. అనుసరించిన ఉపజాతివృత్తపాఠము ప్రకారము : దేశ-స్థానకాలాదుల ఔచిత్యమును తెలిసి, (కటకాది ఆభరణములను శరీరము నందలంకరించునట్లుగా) గుణ-అలంకారాదులచే కావ్యమునలంకరికచుటను 'భూషణము' అనిరి. (అనుష్టుప్ వృత్తపాఠములోని 'భూషణ' నిర్వచనము నకు ఇది సమానమే) (నా.శా. 16-పు. 442).

*భేదము 1.* : ముఖసంధికిగల 12 అంగములలో ఒకటి: సంఘాత భేదము అనగా పాత్రలు స్వప్రయోజన నిర్వహణార్థమై రంగమునుండి నిష్క్రమించుటకు విడివడుట (నా.శా. 19-పు. 572). ఉదా॥ వేణీ సంహారములో భీముడు 'కావుననే ఇప్పటినుండి నేను మీతో వేరైతిని' అనిన సందర్భము (సా.ద. 6-పు 155).

*భేదము 2.* : సంధ్యంతరములు మొత్తము 21. అందులోఒకటి : కపటవచన ముల ద్వారా మిత్రులమధ్య భేదమును కల్పించుటను భేదము అందురు (హిం.సా.కో.పు. 860).

*భోగినులు* : అభ్యంతర (రాజాంతఃపుర) పరివారములోని స్త్రీలు. రూప-శీల ములు గల సుకుమారలు, మధ్యస్థలు ప్రతిపక్షమందు అసూయలేనివారు), సహనశీలలు అయిన స్త్రీలు భోగినులు (నా.శా. 24-పు. 706).

*భ్రంశము* : నాటక (నాట్య)మునకు గల 36 లక్షణములలో ఒకటి. చూ. ప్రియము.

*భ్రాంతి* : సంధ్యంతరములు మొత్తము 21. అందులో ఒకటి. దీని వివరణ మృగ్యము. చూ. సంధ్యంతరములు.

*మంత్రి* : రాజుకు ఉండవలసిన బాహ్య పరివారములో ముఖ్యులు మంత్రి-పురోహితులు. వీరి లక్షణములు సమానముగా చెప్పబడినవి. చూ. పురోహితులు. నాయకునకు అర్థచింతన సహాయులలో మంత్రి ఒకడు.

*మణిపురి నృత్యము* : ఆధునిక భారతదేశమున ప్రసిద్ధములైన నృత్యభేదములు ఐదు. అందులో ఒకటి. ఇది భారతదేశమునకు సంబంధించిన నృత్యము. అస్సాం, బెంగాల్ ప్రాంతములలో ప్రచారమందున్నది. దీనిలో శాస్త్రరీతులకంటె లోకరీతులకే అధిక ప్రాధాన్యము. చైతన్యుని వైష్ణవముతో దీని ఆదరము హెచ్చినదన వచ్చు. అంగ-ప్రత్యంగముల విలాస విక్షేపములు ఇందులో ప్రధానము. వేషము, లాస్యము, ఇవే ప్రధానమైన నృత్యమిది (నా.శా. 4-పు. 143).

*మదము* : సంధ్యతరములు మొత్తము 21. అందులో ఒకటి. దీనికి వివరణ మృగ్యము. చూ. సంధ్యంతరములు.

*మధ్యా* : స్వీయ నాయిక విభేదములు 13. వాటి ప్రధాన భేదములు మూడింటిలో (ముగ్ధ, మధ్య ప్రౌఢ)లో రెండవ నాయిక. శృంగార విలాసములు, సిగ్గుచేష్టలు సమానముగా ఉండి ఈ రెంటిమధ్య వికసించు నాయిక మధ్య. క్రమముగా అతి విస్రబ్ధనవోఢ అగుచున్నది (చూ ముగ్ధ). అనగా వల్లభుడు అపరాధి అయినప్పుడు ధైర్యమున్నచో వక్రోక్తులతో మందలించును, ధైర్యమలవడనిచో నిష్ఠురములాడును. అలవడిన ధైర్యా ధైర్యములనుబట్టి 'మధ్య' విధములు 6 : ధీర-జ్యేష్ఠ, ధీర-కనిష్ఠ; ధీరాధీర-జ్యేష్ఠ; ధీరా-ధీర కనిష్ఠ అధీర-జ్యేష్ఠ, అధీర-కనిష్ఠ. (ర.మ.1-9). నాయికలు—వివిధ భేదములు, ధీర మొ. నాయికలు.

*మనోరథము* : నాట్య (నాటక)మునకు భూషణప్రాయములైన 36 లక్షణములలో ఒకటి. అ.గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము : హృదయములో ఉన్న భావమును-సుశ్లిష్టార్థముగా-అన్యాపదేశ కథలతో ప్రకాశింపజేయుటను మనోరథము అనిరి. (పేరు, నిర్వచనము, రెండు పాఠములందు సమానమే). (నా.శా. 16-పు. 446).

*మల్లిక* : మణికుల్యా, ఉపరూపక భేదము. కూర్పులో ముఖ్యమైనవి : శృంగార రసము; కైశికీవృత్తి; రెండంకములు; విట, విదూషకులు; గర్భ-విమర్శ సంధులు; కథాంశములను గుప్తముగా పోషించుచుపోయి రహస్యమును చివరకు ఉద్ఘాటించు పద్ధతి; ఇట్టివి ఉండవలెనని భావ ప్రకాశనము చెప్పినది. (హిం.సా.కో. పు 624) ఉదా . మృగ్యము.

*మహత్తరులు* : అభ్యంతర (రాజాంతఃపుర) పరివారములోని స్త్రీలు. అంతః పురములలో సకల రక్షణలు చూచుకొనుచు, అభివృద్ధినికోరుచు స్తుతి, స్వ_స్త్య యనములు చేయుచుండువారు ((నా.శా. 24-పు 707).

*మహాచారి* : పూర్వరంగ (బహిర్యవనిక) అంగములలో ఒకటి : రౌద్రాభి నయము మహాచారి అనబడును (నా.శా. 5-పు. 159).

*మహాదేవి* : అభ్యంతర (రాజాంతఃపుర) పరివారములో మొదటి వ్యక్తి : మూర్ధాభిషి_క్త (పట్టపురాణి), కుల–శీల–గుణ సమన్విత, సర్వసమ, పతివ్రత, ధీర అయినది మహాదేవి (నా.శా. 24-పు. 706).

*మహానాటకము* : నాటకమే – పతాకాస్థానములన్నిటితోను, పది అంకముల తోను అమరినచో పండితుల వ్యవహారములో అదిమహానాటకము అనిపించు కొన్నది (సా.ద. 6-పు. 191). ఉదా బాల రామాయణము.

*మానవతి* : నాయికాభేదము. చూ. త్రివిధనాయికలు-ప్రకారాంతరములు.

*మాయ* : సంధ్యంతరములు మొత్తము 21. అందులో ఒకటి. దీనికి వివరణ మృగ్యము చూ. సంధ్యంతరములు.

*మార్గము* : గర్భసంధికిగల 13 అంగములలో ఒకటి : యథార్థతత్వమును చెప్పెడి వచనమును మార్గము అనిరి. (నా.శా. 19-పు. 574). ఉదా చండ కౌశికములో రాజు "భగవానుడా! భార్యా, తనయ, విక్రయముచేత ఆర్జిం చిన దీనిని పుచ్చుకొమ్ము. శేషముకొరకు చండాలునికైనను నన్ను అమ్మి కొనియెదను" అనిన సందర్భము (సా.ద. 6-పు. 158).

*మాల* : చూ. భాసనము.

*మిథ్యాధ్యవసాయము* : నాట్య (నాటక)మునకు భూషణప్రాయములైన 36 అలంకారములలో ఒకటి. అ.గు. అనుసరించిన ఉపజాతివృత్త పాఠము ప్రకారము : పారమార్థికములుగాని అర్థములకు సమానములైన అర్థాంతర ములను నిర్ణయించుటను మిథ్యాధ్యవసాయముఅనిరి. (అనుష్టుప్ వృత్తపాఠ మైన 'విపర్యయము'తో సమన్వితమైనది : ఊహించినవి, చూచినవి, ఎవరో ఇదివరకు చెప్పినవే అయిన అర్థముల తత్వమును సందేహించి అన్యథా పరికల్పించుట విపర్యయము) (నా.శా 16-పు 445).

*మిశ్రము* : మూడు విధములైన నాటక వస్తువులలో ఒకటి : కొంత ప్రఖ్యాత మైనది, కొంత కవి కల్పించినది అయిన కథను మిశ్రము అనిరి (ద.రూ. 1-15). ఉదా॥.

*ముఖసంధి* : ఆధికారిక (ప్రధాన) ఇతివృత్తమునకు ఉండవలసిన అయిదు ప్రధానసంధులలో మొదటిది : నానార్థ-రససంభవమైన బీజోత్పత్తి ఈ సంధి లోనే జరుగును. ఆరంభము అను కార్యావస్థతోకూడి ఉండు కథా భాగము. దీని అంగములు 12 : 1. ఉపక్షేపము 2. పరికరము 3. పరిన్యాసము

4. విలోభనము 5. యుక్తి 6. ప్రాప్తి 7. సమాధానము 8. విధానము 9. పరిభావన 10. ఉద్భేదము 11. కరణము 12. భేదము.

**ముగ్ధ** : స్వీయనాయిక భేదములు 13. వాటిప్రధాన భేదములుమూడింటిలోమొదటి నాయిక : తన సిగ్గు చేష్టలతో మనోహరమైన విలాసములు చూపునది, సంభోగ క్రియలో కోపముచూపినను మెత్తని మనస్సుగలది, నూతన వస్త్రాలంకారము లందు ప్రీతి చూపునది. ఈనాయిక అవాంతర (భేదములు చెప్పలేదు కాని కొన్ని) దశలు చెప్పినారు : 1. జ్ఞాతయౌవన (యౌవన రేఖలు బాగా అమరినది) 2. అజ్ఞాత యౌవన (యౌవన రేఖలు బాగా అమరనిది) 3. నవోఢ (కాలక్రమముగా లజ్జాభయములను విడుచుచు సంభోగమున కిష్ట పడునది) 4. విస్రబ్ధనవోఢ (బెదురుతీరి మగనియందు విశ్వాసవంతురాలై వ్యవహరించునది) (రం. 1-4). చూ. నాయికలు.

**ముదిత** : నాయికాభేదము. చూ. పరకీయ.

**ముప్పదియారు నాటక లక్షణములు** : నాట్య (నాటక)మునకు భూషణప్రాయ ములుగా చెప్పిన లక్షణములు 36. ఇవి భావములను (విభావాను భావ వ్యభి చారులను), అర్థములను ఆశ్రయించి ఉండును. ఈ 36 లక్షణములకు రెండు విడిపాఠములున్నవి : అనుష్టుప్ వృత్త పాఠమొకటి. అభినవగుప్తునకు పూర్వ మున్నవారు దీనిని అనుసరించిరట. ఉపజాతివృత్తపాఠము మరొకటి. అభినవ గుప్తాదులు దీనినే అనుసరించిరి. ఈ రెండు పాఠములందును 36 లక్షణముల పేర్లకు, నిర్వచనములకు భేదములున్నవి. రెంటిలోను 17 లక్షణముల పేర్లు మాత్రమే సమానముగా ఉన్నవి, 8 లక్షణముల నిర్వచనములు మాత్రమే సంవదించుచున్నవి. అ.గు. ఎంతో ప్రయత్నించి ఈరెండుపాఠములకు సమన్వ యము చేకూర్చెను. (36 నాటక లక్షణములని, 33 నాట్యాలంకారములని సా.ద.కర్త విడివిడిగా గ్రహించినవాటిలో అనుష్టుప్, ఉపజాతి వృత్త పాఠ ములు చూడవచ్చు). అ.గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము ఆ 36 లక్షణముల పేర్లు ఇవి : 1. భూషణము 2. అక్షరసంహతి 3. శోభ 4. అభిమానము 5. గుణకీర్తనము 6. ప్రోత్సాహనము 7. ఉదాహరణము 8. నిరుక్తము. 9. గుణానువాదము 10. అతిశయము 11. హేతువు 12. సారూప్యము 13. మిథ్యాధ్యవసాయము 14. సిద్ధి 15. పదోచ్చయము 16. ఆక్రందము 17. మనోరథము 18. ఆఖ్యానము 19 యాచ్ఞ 20. ప్రతి షేధము 21. పృచ్ఛ 22. దృష్టాంతము. 23. భాసనము 24. సంశయము 25 ఆశీస్సు 26. ప్రియము 27. కపటము 28. క్షమ 29. ప్రాప్తి 30. పశ్చా త్తాపము 31. అనువృత్తి 32. ఉపపత్తి 33. యుక్తి 34. కార్యము 35. అను నీతి 36. పరిదేవనము (చూ. అయా ఆరోపములు). వీటికి వివరణలువ్రాసిన చోటనే అ.గు. సమన్వయించిన అనుష్టుప్ పాఠములనుగూడా వ్రాయనైనది.

మహాపురుషులకుండు సహజలక్షణములవలెనే ఈ లక్షణములు కావ్యము

నకు సహజధర్మములని, ఇవి కవి శిక్షార్థము చెప్పబడినవని తెలియవలె. "లక్షణ బలమువలననే (ఉపమాది)అలంకారములు వైచిత్ర్యముయుతములగును" అని భట్టతౌతుని అభిప్రాయము. ఉదా। గుణానువాదము అనెడి లక్షణ యోగముచే 'ప్రశంసోపమ' — అతిశయమనెడి లక్షణముచే 'అతిశయోక్తి' సిద్ధించుచున్నవి. తక్కినవి ఇట్లే ఊహించవచ్చునని అ.గు. గూడ అభిప్రాయపడెను. (నా శా. 16-పు 441-43).

నాట్యాలంకారములను ప్రత్యేకముగా పేర్కొనుట గతానుగతికమైన న్యాయమని, ఇందులో కొన్ని గుణ-అలంకార-భావ-సంధ్యంగాదులలో అంతర్భూతములైనప్పటికిని నాటకమున అవశ్యముగా ప్రయోగింపవలసినవని తెలియుచున్నది (సా.ద 6-పు. 191).

*మృదవము* : వీథ్యంగములు 13. అందులో ఒకటి. కథాప్రసక్తిలో కలిగిన వివాదము హేతువుగా, గుణములను దోషములుగా దోషములను గుణములుగా నిరూపించెడి సమాధానములను చెప్పు విధానమును మృదవముఅనిరి. (నా.శా. 18-పు. 530). ఉదా మాళవికలో "ఆమె రూపసౌందర్యము నాకిప్పుడు దుఃఖమునకే అయినది" అనిన సందర్భము (సా.ద. 6-పు. 198).

*యక్షగానము* : చూ. బాహ్యనాట్యము.

*యత్నము* : పంచకార్యావస్థలలో ఒకటి (ప్రయత్నము అని నా.శా. పాఠము) ఫలప్రాప్తి కనబడనప్పుడు ఆ ఫలమును గురించిన వ్యాపారము మరింత ఔత్సుక్యము (కుతూహలము)తో చేయుట యత్నము అనబడినది. ఈ ప్రయత్నముచే తప్ప ఇతరములచే ఫలప్రాప్తికాదు అను నిశ్చయమునకు వచ్చుటచే ఇందులో ఉపాయసంబంధమైన స్మరణ-ఉత్కంఠాదులు ఎడతెగక సాగును (నా.శా. 19.పు 564)- ఫలమును పొందుటకు ఆత్రపడు వ్యాపారము ప్రయత్నము-ఉదా రత్నావళిలో "అట్లైన వేరు దర్శనోపాయము లేదని ఎట్లో ఒకట్లు చిత్తరువువ్రాసినాకోరినట్లు చేసెదను". అనిన సందర్భము (సా ద. 6.పు 149).

*యవనిక* : చూ. జవనిక

*యాచ్ఞ* : నాట్య (నాటక)మునకు భూషణప్రాయములైన 36 లక్షణములలో ఒకటి : అ.గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము : ఆదిలో కోపమును కలిగించునవియైనను అంతమున హర్షమునుకలిగించు హితవాక్యములను ప్రియవాక్యములతో మేళవించి, ప్రబోధించుటను యాచ్ఞ అనిరి (అనుష్టుప్ వృత్తపాఠములోని 'దాక్షిణ్య' నిర్వచనమునకిది భిన్నమే అయినను సమన్వితమైనది : "హితములును, ప్రసన్నములును అయిన వాక్యములతో లేదా చేష్టలతో ఇతరులను అనువర్తించుట దాక్షిణ్యము) (నా.శా. 16-పు 446).

*యుక్తి* 1 : ముఖ సంధికిగల 12 అంగములలో ఒకటి : కర్తవ్యతా - నిశ్చయ

మును 'యుక్తి' అనిరి. దీని ప్రయోజనము వస్తు ప్రకాశనము (నా.శా. 19-పు 571)

ఉదా 'వేణీ సంహారము లో' భీమ సహదేవుల సంభాషణము "శత్రుకులమును సమయించుట లోకమున లజ్జాకరము. భార్యను సభలో సిగపట్టి ఈడ్చుట లజ్జాకరము కాదు" అను భీముని వచనమువరకు (సా.ద. 6-పు 153).

*యుక్తి 2.*: నాట్య (నాటక)మునకు భూషణప్రాయములైన 36 లక్షణములలో ఒకటి. అ.గు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము: పరస్పర శోభారూపములై, అనుకూల్యములై, ఉత్కృష్టములైన అర్థముల సంబంధము సాధించుటను 'యుక్తి'అనిరి (ఇది అనుష్టుప్ వృత్త పాఠమైన 'అభిప్రాయము'తో భిన్నమైనను సమన్వితమైనది: "సాదృశ్యమువలన అభూతపూర్వమైన ఒక అర్థమును లోకహృదయగ్రాహి అగునట్లుగా కల్పించుట 'అభిప్రాయము) (నా శా. 16-పు 449).

*రంగద్వారము*: పూర్వరంగసంబంధి, బహిర్యవనికాంగములలో ఒకటి: రంగమునకు ప్రవేశమువంటిది, వాచిక-ఆంగిక అభినయములు ఇక్కడ నుండియే ప్రారంభమగును. కావున దీనిని రంగద్వారము అనిరి. ఉత్థాపనము (నాందిపాఠకుల రంగప్రవేశము)తో చేయు ప్రారంభము సర్వ ప్రయోగములకు సామాన్యమైనది (నా.శా. 5-పు 159).

*రంగము*: నటులు నటించు ప్రదేశము (రంగస్థలము). రంగము అనగా ప్రేక్షకులు కూర్చుండు స్థలమని—ప్రేక్షకులు అనిగూడ—అర్థమున్నట్లు కాళిదాసు వాక్యమున్నది: "అహో రాగబద్ధ చిత్తవృత్తిరాలిఖిత ఇవ సర్వతోరంగః" (అభి.శా.ప్రస్తా.) రంగమనగా "నట కుశీలవ వర్గము" అని అభినవగుప్తుని వ్యాఖ్య ఉన్నది. (నా.శా. 1-పు. 21). అంకములోని కథను కొన్ని రంగములు (దృశ్యములు)గా విభజించుట నేటి నాటక కర్తలు అనుసరించుచున్న పద్ధతి. రంగము అను పదమునకు నేడు రూఢి అర్థములు రెండున్నవి: 1. నటులు నటించు రంగస్థల ప్రదేశము 2. అంకములో ప్రత్యేకదృశ్యభాగముగా కవి విభజించుకొన్న కథాంశము.

*రంగమున నిషిద్ధములు*: రంగముపై ప్రత్యక్షముగా ప్రదర్శింపగూడని సన్నివేశములు: యుద్ధము, రాజ్యభ్రంశము, మరణము, నగరపు ముట్టడి, సలిలక్రీడలు మొ ప్రదర్శనకు అసాధ్యములు కావున వాటిని ప్రవేశకాదులతో సూచించవచ్చు. ఆలింగన చుంబనాదులు, అలంకరణము, భోజనము, శయనము తదితర లజ్జాకరములు, జుగుప్సాకరములైన పనులు రంగముపై ప్రదర్శించరాదు.(తల్లి-కొడుకు, అత్త-అల్లుడు. అన్న-చెల్లెలు మొ కుటుంబ సభ్యులు కలసి కూర్చుండి నాటకప్రదర్శనమును చూచుచుందురని భరతుడు సూచించుచు ఇవి రంగ నిషిద్ధములు అనెను) వస్త్రాపహరణాదులు జరుగుచున్నట్లు నటించునప్పుడు దీపములుతొలగించవలె. (నా.శా 19,22 అధ్యా).

*రంగాలంకరణము :* గ్రీకునాటక వ్యవస్థకు, భారతీయనాటక వ్యవస్థకు పరస్పర సంబంధమున్నదని కొందరందురు. గ్రీకునాటక ప్రదర్శనకు తగిన రంగాలంకరణ పద్ధతిని ప్రవేశపెట్టిన ప్రథముడు సోఫోక్లిస్ (క్రీ.పూ. 496-409) అని తెలియుచున్నది. రంగస్థలాలంకరణము, దృశ్యములమార్పు ఈ రెంటి విషయమున నా.శా.లో వివరణలులేవు. అయినను ఆనాటి వీలునుబట్టి నా.శా. రంగస్థలాలంకరణమును గురించి నిర్దేశించిన విశేషములు కొన్ని చూడదగినవి : మూడువిధములైన నాట్యమండపములు నిర్మించవలె. (అధ్యా. 2). రంగపీఠమునందు కక్ష్యలను ఏర్పరచవలె. నగరములు, నదులు, ఆశ్రమములు, అడవులు పర్వతములు, సాగరములు, సప్తద్వీపములు ఒకచేమిటి భూతలము, ఆకాశము, ఇతర పాతాళ లోకాదులు మొ। అన్నియును కక్ష్యా విభాగముఁచేతనే నిర్దేశించవలె. *అభ్యంతరకక్ష్య:* ముందుగా రంగమును ప్రవేశించిన పాత్రలు నిలుచుటకులేదా కూర్చుండుటకు వీలైన ప్రదేశము. *బాహ్యకక్ష్య:* రంగముపై తర్వాత ప్రవేశించినవారు బాహ్యకక్ష్యనుండి వచ్చినట్లు భావించవలె. *మధ్యమకక్ష్య:* బాహ్యాభ్యంతర కక్ష్యల నడిమి భాగము. రంగస్థలము మూలనుండి ప్రవేశించి స్వగతాదులు నిర్వర్తించి పోవు పాత్రలు ఈ కక్ష్యనుగడచి అభ్యంతర కక్ష్యలోనికి పోదురు. అదివ్య పాత్ర ప్రవేశ–నిష్క్రమణాదులు: భరతుడు (నటుడు) నిలిచి ప్రయోగము నడుపుచుండు దిక్కును తూర్పుదిక్కుగా పరిగణించవలె. రంగమున ప్రవేశించి నిర్వర్తించవలసిన దానిని నిర్వర్తించిన తర్వాత ఈ పాత్రలు ప్రవేశించిన ద్వారమునుండియే నిష్క్రమించవలె, మరల రావలసినచో అదే ద్వారమునుండి రావలె. పాత్రలకుగల మధ్యమ–సన్నిహిత దూరములు కూడ కక్ష్యాభేదములచేతనే నిర్దేశించవలె. *దివ్యపాత్రల ప్రవేశ నిష్క్రమణాదులు:* దివ్యపాత్రలు (స్వర్గ, కైలాసాది వాసులు, అప్సరోగణములు, రాక్షసగణములు మొ।) నటించు స్థలములకన్నిటికి (హిమాచలము, మేరువు, పాలసముద్రము మొ ) కక్ష్యావిభాగములందు ఆయా ఉచిత స్థలములు నిర్దేశించవలె. రసభావములు నాటక దృష్టియందే ప్రతిష్ఠితములై ఉన్నవి కావున దివ్యుల అనిమిషత్వము ప్రదర్శించరాదు.——మన ఆధునిక స్థలాలంకరణపద్ధతి పాశ్చాత్యుల ననుసరించివచ్చినదే. ప్రతిరంగమునకు దృశ్యములను కూర్చు నేటి పద్ధతి సినిమాల ప్రభావమువలన వచ్చినది (నా.శా. అధ్యా. 1 పు 25, అధ్యా. 13).

*రాజనర్తకి :* చూ. నర్తకి.

*రాజు :* బాహ్య — అంతఃపుర పరివార సమేతుడు, సకల నీతివిదుడు, శూరుడు, శుచి, కృతజ్ఞుడు, మహోత్సాహుడు, అప్రమత్తుడు, అవ్యసని, ప్రియభాషణుడు మొ రాజసలక్షణములుగల వ్యక్తి. (నా.శా. 24-పు. 709)

*రామాక్రీడము* : ఉపరూపకభేదము. అ.గు. ఉల్లేఖించినది (అ.భా.పు. 183). క్రతు వర్ణనతో కూడిన ఈ రూపకములో స్త్రీలకే అధిక ప్రాధాన్యము (హిం.సా.కో.పు 703).

*రాసకము* : ఉపరూపకము. పాత్రలు ఐదుగురు, ముఖ-నిర్వహణములు సంధులు, భాషా విభాషలు రెండు, భారతి-కైశికి వృత్తులు, సూత్రధారుడు లేడు, ఒకే అంకము, వీథ్యంగములుండును, నాంద్శ్లిష్టము, నాయిక ప్రసిద్ధురాలు, నాయకుడు మూర్ఖుడు, ఉత్తరోత్తరముగా నాయకుని గొప్పతనము విని పించును. ఇందులో ప్రతిముఖసంధి ఉండునని కొందరందురు. ఉదా మేనకాహితము (సా ద. 6-పు. 202).

*రూపకభేదములు* : నా.శా. ( 8-పు. 508) లక్షణభేదములను, ప్రయోగ పద్ధతిని నిర్దేశించి చెప్పిన రూపకముల సంఖ్య 10 : చూ. 1. నాటకము 2. ప్రకరణము 3. అంకము 4. వ్యాయోగము 5. భాణము 6. సమవకారము 7. వీథి 8. ప్రహసనము 9. డిమము 10. ఈహామృగము. వీటి సంకీర్ణత్వముచే జనించిన వాటిని ఉపరూపకములని, జన్యరూపకములని, రూపకములని తర్వాతివారు వ్యవహరించిరి. హేమచంద్రుడు, భోజుడు వీరిద్దరు నాటిక, సట్టకము ఈ రెంటిని రూపకములుగానే పేర్కొనిరి. బోధాయనుడు పార, సల్లాపకము అను రెంటిని రూపక జాతిలోనే చేర్చిచెప్పెను. 'పార' అను దాని పూర్తిపేరు 'నృత్తపారము' అని శ్రీ మానవల్లి కవి వ్యాఖ్యానించిరి (నా.శా. 8-పు 508, 535). చూ. ఉపరూపక భేదములు.

*రూపకము-కావ్యము* "నాట్య-రూప-రూపకములనెడి ఈ మూడు శబ్దములు (ఇంద్ర-పురందర-శక్ర శబ్దములవలె) ఏకార్థములగుచున్నవి. ప్రవృత్తి నిమిత్త భేదముచే పేర్లు వేరగుచున్నవి" అని ధనికుని వ్యాఖ్యవలన తెలియుచున్నది. పై మూడు శబ్దములకు పర్యాయములుగా ప్రాచీనులు నాటక-ప్రేక్ష్య-కావ్య శబ్దములు వాడిరి. ఆ ఆరింటినికలుపుకొని సాధారణముగా ఆలంకారికులందరు 'దృశ్యకావ్య' శబ్దమును వాడిరి. కవికృతములైన సాహిత్యప్రక్రియలెన్నో 'కావ్యములు'గానే పూర్వులు వ్యవహరించుచు వచ్చినట్లు తెలియుచున్నది (నా.శా. 18-పు. 532).

ప్రయోగము (ప్రదర్శన)లో రాణించనిదానికి రూపకమనియో, నాటకమనియో పేరున్నను అది పేరుకు మాత్రమే రూపకము. వాస్తవమునకు అది శ్రవ్యకావ్యమే.రూపమును-అనగా ప్రదర్శనను-ఆరోపించునదే రూపకము (సా.ద. 6-పు 133).

*రూపము* : గర్భసంధికిగల 13 అంగములలో ఒకటి : విచిత్రార్థముల సమ్మేళనమునందలి వితర్కము రూపము అనబడినది (ఈ అంగములో ఉచితానుచితముల నిర్ణయము జరుగదు. అది యుక్తి అను అంగములో జరుగును. రెంటికిగల భేదమిది — రూపమనగా ఆకారము ఆకారమునందు 'ఇది ఇట్టిది'

అను విశేష ప్రతిపత్తి ఉండును. అటువంటిదే ఇందుండును. కావున ఇది రూపము అనబడినది). (నా.శా.19-పు 574) వితర్కముతో కూడిన వాక్యమే రూపము. ఉదా రత్నావళిలో రాజు: "మనస్సుచలించుట ప్రకృతిసహజము —అయినను మన్మథబాణములకుగురి యైనదెట్లు" అనిన సందర్భము (సా.ద. 6-పు 159).

*లక్షిత* : నాయికా భేదము. చూ. పరకీయ.

*లాస్యాంగములు* : నాటకమునకు (సంధ్యంగములేకాక) 'లాస్య' విధియందు చెప్పిన అంగములు కూడ ఉపయుక్తములగుచున్నవి. లాస్యాంగములు సంధ్యంగములవంటివి కావు. సంధ్యంగమనగా సంధికి ఒక అంగము లేదా దాని భాగము అని అర్థము. లాస్యము అంగముగాగలది లాస్యాంగము అని-వీథ్యంగమువలె — అర్థముచెప్పుట సమంజసము (డా. ఘోష్). కావున పది లాస్యాంగములు అన్నప్పుడు లాస్యభేదములు పది అని తెలియవలె. 'లాస్యాంగము' అనగా ఒక విధమైన 'ఏకాంకిక' అని స్థూలముగా గ్రహించవచ్చు. లాస్యాంగము, భాణమువలె, ఒకేపాత్రతో ప్రయోగింపదగినది. కైశికీవృత్తి ప్రధానమై, రసోపకారియైన లాస్యము పదివిధములలో ఉన్నది (దీని విధములు 12 కావని పది మాత్రమే అని అ.గు.). పది విధములైన లాస్యము చూ. 1. గేయపదము 2. స్థిత పాఠ్యము 3. ఆసీనము 4. పుష్పగండి(థి)క 5. ప్రచ్ఛేదకము 6. త్రిమూఢకము 7. సైంధవకము 8. ద్విమూఢకము 9. ఉత్తమోత్తమకము 10. ఉక్తప్రత్యుక్తకము (నా.శా. 19-580)

*లింగి*: నాయక సహాయుడు. చూ. నాయక సహాయులు.

*లేఖ* : సంధ్యంతరములు 21. అందులో ఒకటి. దీనికి వివరణ మృగ్యము. చూ. సంధ్యంతరములు.

*లేశము* : 36 నాటక లక్షణములలో ఒకటి చూ. ప్రతిషేధము.

*లోకధర్మి* : అభినయము లోకధర్మి, నాట్యధర్మి అని రెండు విధములు : ఇది మొదటిది : సహజమైన భావములను (స్థాయి-వ్యభిచార్యాదులు) ప్రకటించునది అనగా కవి కల్పించిన వైచిత్రిలేనిది; లోక ప్రసిద్ధములైన స్వభావములను, వ్యవహారములను ప్రదర్శించునది; నానాస్త్రీ-పురుషాశ్రయమైనది (స్త్రీ పాత్రల వేషములకు స్త్రీలు, పురుషపాత్రల వేషములకు పురుషులు గలది) లోకధర్మికి చెందిన అభినయము. ఇది రెండు విధములు : 1. చిత్తవృత్తి నిరూపణాత్మకము ఉదా 'గర్వము' నిరూపించుటకు పతాక హస్తము నొసలువరకు ఎత్తుట 2. బాహ్యావయవ రూపాత్మకము ఉదా పద్మము మొ॥ నిరూపించుటకు పద్మకోశాది హస్తములను పట్టుట. (నా.శా. 13-పు 380). చూ. నాట్యధర్మి.

*వక్రోక్తి గర్విత* : నాయికాభేదము .చూ. త్రివిధ నాయికలు, ప్రకారాంతరములు.

*వజ్రము* : ప్రతిముఖ సంధికిగల 13 అంగములలో ఒకటి: ప్రత్యక్ష పారుష్యము గల వాక్యమును వజ్రము అనిరి. (నా.శా. 19-పు 573)

ప్రత్యక్ష నిష్ఠురము వజ్రము (సా.ద. 6 పు157), అనగా సమక్షముననే నిష్ఠురోక్తులాడుట. ఉదా సాధారణముగా లభ్యములే.

*వధము* : సంధ్యంతరములు 21. అందులో ఒకటి : దుష్టులను అణచిపెట్టుటను వధము అందురు (హిం.సా.కో.పు. 860).

*వర్ణసంహారము* : ప్రతిముఖ సంధికిగల 13 అంగములలో ఒకటి: చాతుర్వర్ణ్యము=వివిధ పాత్రల సమ్మేళనమును వర్ణసంహారము అనిరి. (నా.శా. 19-పు 573). ఉదా। మహా వీర చరితములో "ఇది ఋషుల పరిషత్తు, ఈయన వీరుడు," అని వివిధ వర్గములవారిని సూచించిన వాక్యము' (సా.ద. 6-పు 158).

*వస్తువు* : కావ్యవస్తువు చూ. ఇతివృత్త విభజన.

*వస్తూత్థాపనము* : ఆరభటీ వృత్తికిగల నాల్గు అంగములలో ఒకటి: సర్వ రసములను (వివిధ స్థాయి-వ్యభిచారిభావములను) సంగ్రహముగా నిబంధించిగాని, అగ్నిప్రమాదాలు కల్పించిగాని, అవి కల్పించకుండగాని, రాబోవు కథాంశమును హృదయ గోచరము చేయుటను వస్తూత్థాపనము అనిరి. (నా,శా. 20-పు. 619).

మాయ, ఇంద్ర జాలములతో చూపిన కథా ఘట్టము వస్తూత్థాపనము (సా.ద. 6-పు. 172). ఉదా రామాయణములో మారీచుడు లేడి రూపమును దాల్చుట మొ ఊహించవచ్చు.

*వాక్కేళి* : వీథ్యంగములు 13. అందులో ఒకటి, రెండు లేదా అంతకుమించిన ప్రశ్నలకు ఒకే సమాధానమిచ్చుట వాక్కేళి అనబడును (నా.శా.18-పు. 580). రెండుమూడు ఉక్తి, ప్రత్యుక్తులతో కూడిన హాస్యవిషయము వాక్కేళి. ఉదా భిక్షోమాంస నిషేవణం ప్రకురుషే? కింతేనమద్యంవినా?: భిక్షుడా, మాంసము తిందువా? సారాయిలేనిచో మాంసమెందుకు? సారాయి కూడనీకుప్రియమా? అహా, రంగసానులుగూడ ఉన్నప్పుడే. సానిధనము కోరునుగదా! నీకుధనమెక్కడిది? జూదమాడనా, దొంగతన మైనాచేయనా! అవి కూడనీవుచేయుదువా? భ్రష్టునికి గతియేమున్నది?" దీనిలో ఇద్దరి వాక్కేళి ఉన్నది (సా.ద. 6 పు-196).

*వాచికాభినయము* : నాల్గు విధములైన అభినయములలో ఒకటి: నాట్య (నాటక) ఇతివృత్తమునకు కూడ వాక్స్వరూపమే ముఖ్యాధార మగుచున్నది కావున వాక్కు నాట్య (నాటక) మునకు శరీరప్రాయమైనది. ఆతోద్య-గీత-అభినయములకు కూడ వాక్కు ఆశ్రయమగుచున్నది. సకలకళలు, శాస్త్రములు. తత్వములు, వాఙ్నిష్ఠములే అగుచున్నవి. భరతుడు వాచికాభినయ ప్రాధాన్యమును విశేషముగాచర్చించి అది 12 విధములు అన్నాడు: ఆలాప-ప్రలాప-విలాప-అనులాప-సంలాప-అపలాప-సందేశ-అతిదేశ-నిర్దేశ- వ్యపదేశ

ఉపదేశ- అపదేశములు (నా.శా. 22-పు 661-62). దృశ్యకావ్య ప్రక్రియ నుండి వేఱుబడి క్రమముగా వేరొక ప్రక్రియయై నిలిచిన శ్రవ్యకావ్యము నకు వాచికాభినయమే మాతృక అని తజ్ఞుల అభిప్రాయము.

వాసకసజ్జ : శృంగారనాయిక. చూ. నాయికలు-అష్టవిధములు.

విచారము : 36 నాటకలక్షణములలో ఒకటి. చూ. పశ్చాత్తాపము.

విటుడు : నాటక ప్రయోక్తలలో ఒకడు అని (నా.శా. 35-పు. 855) శృంగార విషయమున నాయక సహాయులలో ఒకడు: నృత్యగీతాదులలో ఒకే ఒక విద్యయందు నిపుణుడై, నాయకునకు ఉల్లాసము కలిగించువాడు (ద.రూ. 2-8), సంభోగరక్తి ఉండి సంపదలేనివాడు, మోసగాడు, మాట కారి, నానావేషములు వేయుటలో సమర్థుడు (సా.ద.3-పు. 37). కామతంత్ర కళను తెలిసినవాడు విటుడు (ర.మ. 2-117). భాణములోని ఏక పాత్రా భినయమును విటుడో, నటుడో చేయవచ్చు (హిం సా.కో.)

విదగ్ధ : నాయికాభేదము. చూ. పరకీయ.

విదూషకుడు : శృంగార విషయమున నాయక సహాయుడు. సంస్కృత రూపక ములందు ఇతనిదొక ముఖ్యమైన హాస్యపాత్ర. శృంగార వ్యాపారములందు నాయకునకు సహాయుడుగా ఉండును. జాతికి బ్రాహ్మణుడు, ఆకారములో పొట్టి, గూని, వికారమైన ముఖము, బట్టతల మొ ఉన్నవాడు. తిండిపోతు. విదూషక పదమునకు రెండర్థములున్నవి:విగ్రహమును (కలహమును)సంధిచే దూషించు (పోగొట్టు) వాడు అని ఒకటి, విప్రలంభములో వినోదము కలిగించి, దానిని మరపించువాడు అనిమరొకటి. శృంగార విషయమున నలుగురు నాయకులకు సహాయకులుగా ఉండు విదూషకులు నాలుగు విధములు (లింగి, ద్విజుడు, రాజాజీవి, శిష్యుడు) చూ. నాయకసహాయులు (నా.శా. 24-పు 704; 36-పు 865)

విద్రవము : గర్భసంధికిగల 8 అంగములలో ఒకటి: శంకా-భయ-త్రాసములు కలిగించు కథాంశమును ఆశంకించుటను (సంభవించునేమో అని ఊహిం చుటను) 'విద్రవము' అనిరి (నా శా. 9-పు 574). ఉదా హఠాత్తుగా ప్రవేశించిన భయంకరాకారమును గాని, అట్టి సన్నివేశమునుగాని చూచి ఇతర పాత్రలలో పొడచూపు భయసందేహము లన్నియు దీనికి ఉదా హరణములు.

విద్రవములు : సమవకారము అను రూపకమున కూర్చదగినవి. ఇవి మూడు రకములు 1. యుద్ధము, వరదలు 2. వాయువు, అగ్ని, ఏనుగులు, వీటిదాడి 3. నగరపుముట్టడి మొ। ప్రజలను చెదరగొట్టు ప్రమాదములను విద్రవములు అందురు (నా.శా. 18-పు. 524).

విధానము : ముఖసంధికిగల 12 అంగములలో ఒకటి: సుఖ దుఃఖములు సమ్మి శ్రితములుగా వర్ణించిన విధానమును 'విధానము' అనిరి, (నా.శా.19-పు572)

ఉదా। బాలచరితములో వత్సా! నీ ఉత్సాహాతిశయమును, నీబాల్యమును చూడగా నామనస్సు ఒక్కసారిగా హర్ష-విషాదములకు గురిఅయినది” అనిన సందర్భము (సా.ద. 6-పు 154).

*విధూతము* : ప్రతిముఖ సంధికిగల 13 అంగములలో ఒకటి: చేసిన అనునయమును మొదట అంగీకరించకుండుటను విధూతము అనిరి (నా.శా.19-పు 573). ఉదా॥ శాకుంతలములో “అంతఃపుర విరహ పర్యుత్సుకుని రాజర్షిని మీరు నిర్బంధింపకుడు” అనిన సందర్భము (సా.ద. 6-పు 156).

*విపర్యాయము* : 36 నాటక లక్షణములలో ఒకటి. చూ. మిథ్యాధ్యవసాయము.

*విప్రలబ్ధ* : శృంగారనాయిక. చూ. నాయికలు అష్టవిధములు.

*విబోధము* : నిర్వహణ సంధికిగల 14 అంగములలో ఒకటి (నిరోధము అని దీని పాఠాంతరమట కాని ఆపేరుగల అంగము ప్రతిముఖసంధికి ఉన్నది). యుక్తితో కార్యమును అన్వేషించుటను ‘విబోధము’ అనిరి (నా.శా.19-పు. 576). కార్యమును అన్వేషించుట విబోధము. ఉదా। ‘వేణీసంహారములో భీముడు: అన్నా! నన్నొకక్షణము విడువుము. యుధి:—ఇంకనుఏమి మిగిలియున్నది? భీముడు:—గొప్పదే మిగిలియున్నది (దుర్యోధనుని ఆక్షణమే వధించుట అని సారాంశము) (సా.ద. 6-పు 166).

*విమర్శసంధి* : ఆధికారిక (ప్రధాన) ఇతివృత్తమునకు ఉండవలసిన అయిదు ప్రధాన సంధులలో నాల్గవది. దీనికే అవమర్శసంధి అని మరొకపేరు. ‘విమర్శ’ అనుపదము విఘ్నము/సందేహము అను అర్థములందు ఇచ్చట ప్రయుక్తమైనది. ఫలోన్ముఖమైన బీజార్థము లోభ-క్రోధ-వ్యసనములచే సందేహాస్పదమయ్యెడి కథా భాగమును విమర్శసంధి అనిరి. ఫలప్రాప్తిని వాంఛించు నాయకాదులు తీవ్రమైన కారణములు తగిలి విఘ్నపడి, భంగపడి ఆవిఘ్నమునుండి విముక్తి పొందుటకై తమశక్తినంతయు వినియోగించుట ఇందు జరుగును. దీని అంగములు 13: చూ. అపవాదము 2. సంఫేటము 3. ద్రవము 4. శక్తి 5. వ్యవసాయము. 6. ప్రసంగము 7. ద్యుతి 8. ఖేదము 9. ప్రతిషేధము 10. విరోధనము 11. ఆదానము 12. ఛాదనము 13. ప్రరోచన (నా.శా.19-పు 575).

*విరక్త* : ఒక నాయిక. చూ. అనురక్త.

*విరహోత్కంఠిత* : శృంగార నాయిక, చూ. నాయికలు-అష్టవిధములు.

*విరోధనము* : విమర్శ సంధికిగల 13 అంగములలో ఒకటి: కార్యము నాశనమగునంత పర్యంతమునకు వచ్చుట లేదా సంరంభముతో కూడిన ఉత్తరోత్తర భాషణము ‘విరోధనము’ (నా.శా.పు 19-పు 575). కార్యమునకు భంగముకలుగునట్లగుటవిరోధనము-ఉదా ‘వేణీసంహారములో యుధిష్ఠిరుడు:— “భీష్మ మహాసముద్రమునుదాటి, ఎట్టకేలకు ద్రోణాగ్నిని ఆర్పి.......... జయము స్వల్పావశిష్టమై యుండగా భీముడు ప్రియసాహసుడు మాటచేత

మనల నందరను ప్రాణ సంశయమునం గూర్చినాడు" అనినవాక్యము (సా.ద. 6-పు 164).

*విలాసము* : ప్రతిముఖ సంధికిగల 13 అంగములలో ఒకటి: రతిభోగ సంబంధ మైన కోరికను 'విలాసము' అనిరి. (నా.శా. 19-పు. 572).
ఈకోరిక నాయికా నాయకులది ఎవరిదైన కావచ్చు. ఉదా శాకుంత లములో "కామం ప్రియాన సులభా" అను పద్యము.

*విలాసిక* : ఉపరూపకము శృంగార బహుళమైన ఏకాంకిక, పదిలాస్యాంగ ములు. విట విదూషకపీఠ మర్దులు కలది, గర్భ-విమర్శ సంధులు లేనిది. నాయ కుడు హీనుడు, వృత్తములు స్వల్పములు, నేపథ్యములు ప్రశస్తములు. దీనిపేరు 'వినాయిక' అనికొందరు పఠింతురు. ఇది దుర్మల్లికలో అంతర్భావ ముగా కొందరు చెప్పుదురు. (సా.ద 6-పు 203).

*విలోభనము* : ముఖసంధికిగల 12 అంగములలో ఒకటి: గుణములను వర్ణిం చుటను 'విలోభనము' అనిరి. (నా.శా. 19-పు. 571). ఇది 'స్వభావోక్తి' అలంకారము వంటిది. ఉదా। శాకుంతలములో "గ్రీవాభంగాభిరామం" వంటివి.

*విశేషణము* : 36 నాటకాలంకారములలో ఒకటి. చూ॰ క్షమ.

*విషాదరూపకము* : ప్రాచీన పాశ్చాత్య రూపకములు సాధారణముగా రెండు విధములు. 1. విషాదరూపకము (Tragedy) 2. ఆహ్లాద రూపకము (Comedy) వీటిలో ప్రధానమైనది విషాద రూపకము. క్రీ పూ. 354లో విషాద రూప కముల పోటీలు ప్రారంభమై ఆ ప్రక్రియ ఎంతో వికసించినది. గద్యరూప ముగాని, పద్య రూపముగాని ఇది ఉండవచ్చు. ఉన్నత వర్గమునకుచెందిన నాయకుడు కొన్ని అపమార్గములకు (అసూయ, ద్వేషము, అత్యాశ, అహం కారము మొ। వాటికి) గురియై దుశ్శీలుడగుట, అశ్లేచచ్చుట దీని ఇతివృత్త స్వరూపము. ఇట్టి చిత్రణ వల్లనే సామాజికులలో శీలము పెరుగుట కవకాశ మున్నదని తజ్ఞుల విశ్వాసము. చూ. ఆహ్లాద రూపకము.

*విష్కంభ(క)ము* : అర్థోపక్షేపకములు ఐదు. అందులో ఒకటి: దీనిని ఎప్పుడును మధ్యమ పాత్రలు (పురోహిత, అమాత్య, కంచుకులుమొ) ప్రయోగించవలె. ప్రవేశకమువలె రంగస్థలమున ప్రదర్శింపరాని కథాభాగమును సంగ్ర హముగా ప్రదర్శించు విభాగము. విష్కంభ పాత్రలు సంస్కృతములో సంభాషించవలె. ఇది రెండు విధములు: 1 శుద్ధవిష్కంభము: మధ్యమపాత్రలు ప్రయోగించునది 2. సంకీర్ణ విష్కంభము: మధ్యమ పాత్రలు, నీచపాత్రలు కలసి ప్రయోగిచునది. సంధులనో, అర్థములనో సంక్షేపముగా సూచిం చుటకే విష్కంభము ప్రయోగించవలె. ప్రయోజనము ననుసరించి మొదటి అంకము మధ్య (ప్రస్తావన, అంక ప్రారంభముల మధ్య) గాని, రెండంక ముల మధ్యగాని దీనిని ప్రయోగించవచ్చు (నా.శా. 18-పు 521).

*వి[స్రబ్ధనవోఢ* : నాయిక, దశాభేదము, చూ. ముగ్ధ.

*వీథి 1.* దశవిధ రూపకములలో చివరిది. లక్షణము: 1. ఇతివృత్తము. కల్పిత మైనదిగా ఉండవలె 2. నాయికా నాయకాదులు: ఉత్తమ, మధ్యమ, అధమ ప్రకృతులలో ఎవరైనను కావచ్చు. 3. అంకములు: ఒకటి 4. సంధులు రెండు: ముఖసంధి, నిర్వహణసంధి 5. వృత్తులు: ఒకటి, అల్పస్థాయిలో ఉన్న కైశికి 6. రసములు, అన్ని రసములు ప్రయోగించవచ్చు 7. విశేష ములు: ఒక పాత్రచేగాని, ఇద్దరు పాత్రలచేగాని దీనిని ప్రయోగించవచ్చు. వీథ్యంగములు 13. చూ. 1. ఉద్ఘాత్యకము 2. అవలగితము 3. అవస్యంది తము 4. నాళిక 5. అసత్ప్రలాపము 6. వాక్కేళి 7. ప్రపంచము 8. మృదవము 9. అధిబలము 10. ఛలము 11. త్రిగతము 12. వ్యాహారము 13. గండము (నా.శా. 18-పు 528).

*వీథి : 2.* భారతీ వృత్తి అంగములు (అంశములు) నాలుగు అందులో ఒకటి: భారతీవృత్తి వాగ్వ్యాపార రూపమైనది: నటి, విదూషక పారి పార్శ్వ కాదులు సూత్రధారునితో ప్రదర్శింప బోవు రూపకమును గురించి ప్రసం గించు విచిత్ర వాక్యములు, వార్తాలాపములు వీథి పేరుతో భారతీ వృత్తి అంశముగా గుర్తింపబడినవి (హిం సా.కో. పు-424, భారతీ)

*వృత్తాంతానుపక్షయము* : సంధ్యంగ ప్రయోజనములు 6. అందులో ఒకటి : ఇతివృత్తము క్షయము నొందక చక్కగా కొనసాగుటకు ఉద్దేశించినది (నా.శా. 19-పు. 570).

*వృత్తులు* : నాట్య (నాటక) మునకు మాతృకలైన వృత్తులు నాలుగు: చూ. 1. భారతీవృత్తి (అంగములు4) 2. సాత్వతీవృత్తి (అంగములు4) 3. కైశికి వృత్తి (అంగములు4) 4. ఆరభటీవృత్తి (అంగములు4). సర్వకావ్యములకు వృత్తులే మాతృకలు. జాతుల చేతను, శ్రుతులచేతను స్వరములు 'గ్రామ' భేదములకు కారణమైనట్లే, వృత్తి భేదములచే కావ్యబంధ భేదము లేర్పడు చున్నవి. గ్రామములలో షడ్జ-మధ్యమములు రెండును పూర్ణస్వర సహితము లైనట్లే రూపకములలో నాటక-ప్రకరణములు రెండును సర్వవృత్తి నిష్ప న్నములు అగుచున్నవి. తక్కిన 8 రూపకముల రచనలలో కైశికీవృత్తికి ప్రాధాన్యము లేదు. వృత్తి అనగా వాక్-మనః-కాయ వ్యాపారముల వైచిత్ర్యముతో కూడిన చేష్ట ఈ చేష్టలు జీవలోకసహజములు.

ఇవి లౌకి కావేశముల వలన సంభవించును. కావ్య, నాట్య (నాటక) ములందు కవులకు, సామాజికులకు కలుగునది లౌకికావేశము. దీనినే సాహిత్య పరిధిలో 'రసము'గా గుర్తించిరి. గమనిక:– ఈ నాలుగు వృత్తు లను దృశ్యకావ్య కర్తలు, శ్రవ్యకావ్య కర్తలు రెండు వర్గముల వారును ప్రయోగింతురు. ప్రదర్శనకు (నటనకు) అనుకూలముగా గ్రహించినంత వరకు ఇవినాట్య వృత్తులు, లేదా దృశ్య కావ్య వృత్తులు అగుచున్నవి.

అప్పుడివి నటగతములగు చున్నవి. శ్రవ్య కావ్యమంతయు రచనాశ్రయమే. కావున అందులో ప్రయోగించు వృత్తులు రచనాగతములగు చున్నవి. 'వృత్తులు' శ్రవ్యకావ్య లక్షణములుగా ఎట్లు నిర్వచింప బడినవో చూచి రెండు పక్షముల భేదములను గ్రహించ వలసినది (నా.శా.అధ్యా 20).

వృద్ధ : అభ్యంతర (రాజాంతఃపుర) పరివారములో ఒకతి; రాజుల పూర్వ సంప్రదాయము తెలిసినది పూర్వరాజుల చరిత్రలు చెప్పునది. (నా శా. 24-పు 708).

వేశ్యా : చూ, సామాన్య.

వైశికుడు : శృంగార విషయమున 'రసమంజరి' చెప్పిన త్రివిధ నాయకులలో మూడవవాడు. వేశ్యాసంభోగమునందు మిక్కిలి ఆసక్తిగలవాడు ఇతడు నాల్గు విధములు: 1. ఉత్తమవైశికుడు; పియ ఎంత కోపించినను ఆమెనే సేవించువాడు 2. మధ్యమ వైశికుడు: కోపించిన ప్రియ మనోభావమును గుర్తించువాడు 3. అధమ వైశికుడు: కమ క్రీడలో భయము, లజ్జ, దయ ఏదియులేనివాడు. చూ. నాయకులు.

వ్యవసాయము : విమర్శ సంధికిగల 13 అంగములలో ఒకటి: ప్రతిజ్ఞాతమైన ప్రయోజనమును సాధించు హేతువు సిద్ధించుట 'వ్యవసాయము' (నా.శా. 19-పు 575). ప్రతిజ్ఞ (కార్యనిర్దేశము) హేతువు (సాధననిర్దేశము) వీటి మేళనమే వ్యవసాయము. ఉదా "కౌరవులను నిశ్శేషముగా వధించినవాడు, దుశ్శాసనుని నెత్తురు తాగినవాడు, దుర్యోధనుని తొడలు విరుగగొట్టినవాడు భీముడు ఇదే శిరస్సుతో మొక్కుచున్నాడు" ఈవాక్యములో ప్రతిజ్ఞ, హేతువు స్పష్టముగా కనబడుచున్నవి (సా.ద. 6-పు 162)

వ్యాయోగము : దశవిధ రూపకములలో 6 వది. లక్షణము. 1. వస్తువు: ప్రఖ్యాతమైనదికావలె 2. నాయకుడు. ప్రఖ్యాతుడైన రాజర్షి (దివ్యుడు కారాదు) 3. అంకములు: ఒకటి, ఒక రోజులో జరిగినకథ 4 సంధులు : మూడు, గర్భ-అవమర్శసంధులు ఉండవు 5. వృత్తులు: మూడు, కైశికి ఉండదు 6. రసములు: వీర-రౌద్రములు, ఇవి దీప్తరసములు 7. విశేష ములు పండెండుగురుపురుషులుందురు స్త్రీలు తక్కువగా ఉండవలె. యుద్ధ-నియుద్ధ-ఆధర్షణ-సంఘర్షణలు వర్ణితములు కావలె యుద్ధ సన్నివేశము లుండుటవలన, పురుషపాత్రలు విశేషముగా ఉండుటవలన దీనిని వ్యాయోగము అనిరి. (నా శా. 18-పు. 526)

వ్యాహారము : వీథ్యంగములు 13. వాటిలో ఒకటి: ముందు ముందు ప్రత్యక్షముకాబోవు అర్థమును దైవ వశమున స్ఫురింపజేయు సమాధానము లేదా నాయకుని ఎదుట స్పష్టముగా చెప్పి దానిని ఆశంకిత మగునట్లుగా చేయుటను 'వ్యాహారము' అనిరి. ఇందులో కొంచెము హాస్యము ఉండవచ్చు (నా.శా. 18-పు 530). ఇతరుల విషయమున హాస్యక్షోభకరమైన వాక్యము

వ్యాహారము. ఉదా మాళవికాగ్నిమిత్రములో లాస్య ప్రయోగముముగిసి మాళవిక నిష్క్రమించునప్పుడు విదూషకునకు గణదాసునకు జరిగిన సంభాషణ.

*శకారుడు* : నాటక ప్రయోక్తలలో ముఖ్యులైన తొమ్మిది మందిలో ఒకడు 'శ' కారబహుళమైన భాషగలవాడు, ఉత్తమపదవి నధిష్ఠించియున్నను హీనమైన ఆశయము గలవాడు శకారుడు (ప్రతిజ్ఞా చాణక్యములో మహాకవియైన భీముడు రాజైన వింధ్యకేతువును 'శకారుడు' అనివ్యవహరించెను). ఇతని వేషము ఉజ్జ్వల వస్త్రాభరణములు, భాషమాగధి, స్వభావము బహు వికారములు పుట్టించునది, అనిమిత్తములైన కోప-ప్రసాదములు గలది (నా.శా. 35-పు 854) రాజుకు అంతఃపుర సహాయులలో ఒకడు, అనూఢా భ్రాతయై రాజస్యాలకుడు అనిపించుకొన్నవాడు శకారుడు (సా.ద.3-3 6).

*శక్తి* : విమర్శ సంధికిగల 3 అంగములలో ఒకటి: కోపించినవారిని ప్రసన్నులుగా చేసుకొనుటను శక్తి అనిరి (నా శా. 19-పు 575).
విరోధమును చల్లార్చుట శక్తి అనగా శత్రువులవంటి ప్రతిబంధములను తొలగించుకొనుటయే శక్తి (ద.రూ. 1-46). 'వేణి'లో "కుర్వంత్వాప్తా హతానాం రణశిరసి జనా వహ్నిసాద్దేహభారా" అనుపద్యము.

*శఠుడు* : నల్గురు శృంగారనాయకులలో ఒకడు: ఒకనాయిక యందే బద్ధానురాగము గలవాడై ఇతర నాయికలకు గూఢముగా విప్రియము చేయువాడు (సా.ద. 3-పు 36). శఠుడు రెండు విధములు: 1. మాని: నాయికపై అలిగి, తన అలుకను వ్యాజముచే సాధించువాడు 2. చతురుడు: సంభోగాభిలాషను స్ఫుటముగా చెప్పక మాటలచేతనైనను, పనిచేతనైనను సైగలు చేయువాడు (ర.మ. 2-109-'11). చూ నాయకులు.

*శిల్పకము* : ఉపరూపకము. అంకములు 4, వృత్తులు 4, శాంత, హాస్యములు తప్ప మిగతారసములు, నాయకుడు బ్రాహ్మణుడు. శ్మశానాది వర్ణనలు, ఉపనాయకుడు తక్కువవాడు, దీనికి అంగములు 27: ఆశంస-తర్కము-సందేహము-తాపము-ఉద్వేగము-ప్రసక్తి - ప్రయత్నము-గ్రథనము-ఉత్కంఠ - అవహిత్థ- ప్రతిపత్తి-విలాసము-ఆలస్యము-వామత్వము- ప్రహర్షము-అశ్లీలము మూఢత - సాధనానుగమము-ఉచ్ఛ్వాసము-విస్మయము - ప్రాప్తి-లోభము-విస్మృతి-సంఫేటము-విశారదత్వము- ప్రబోధనము-చమత్కృతి. ఉదా కనకావతీ మాధవము (సా.ద 6-పు 203).

*శిల్పకారికలు* : ఆభ్యంతర (రాజాంతఃపుర) పరివారములో ఒక వర్గము: నానాశిల్ప విచక్షణలైనవారు, పూలనుండి అత్తరు తయారుచేయువారు, చతురలు, చిత్రకళాకౌశలము గలవారు శిల్పకారికలు (నా.శా. 24-పు706). సైరంధ్రీ, కుబ్జలు మొదలగువారు.

*శిష్యుడు* : నాయక సహాయుడు. చూ, నాయకసహాయులు (నా.శా.24-పు704)

*శుభాంత రూపకము* : చూ. ఆహ్లాదరూపకము.

*శుష్కావ (వ) కృష్టధ్రువ* : పూర్వరంగ (బహిర్యవనిక) అంగములలో ఒకటి: శుష్కాక్షరములచే ప్రయుక్త మగుటవలన దీనికీపేరుఇట్లు వచ్చినది. ఇదిజర్జరస్తుతి పూర్వకమై ఉండును (నా.శా. 5-పు. 159).

*శృంగారనాయకులు* : శృంగార ప్రకృతులను బట్టి జరిగిన నాయకుల విభజన నాల్గు విధములు: చూ. 1. అనుకూలుడు 2. దక్షిణుడు 3. ధృష్టుడు 4. శఠుడు.

*శృంగారనాయికలు* : చూ. నాయికలు-అష్టవిధములు.

*శోభ* : నాట్య (నాటక) మునకు భూషణ ప్రాయములైన 36 లక్షణములలో ఒకటి. అ గు. అనుసరించిన ఉపజాతివృత్త పాఠము ప్రకారము: ప్రసిద్ధము లైన అర్థములతో పాటు సమముగా అప్రసిద్ధములు లేదా అనుచితములు అయిన అర్థములుగూడ ఉచితముగ, విచిత్రముగ, హృద్యముగ నిబంధించినచో దానిని 'శోభ' అనిరి. (పేరు, నిర్వచనము అనుష్టుప్ పాఠములో గూడ ఇట్లేఉన్నది) (నా.శా. 16-పు. 444).

*శ్రీగదితము* : ఉపరూపకము. ఇతి వృత్తము ప్రసిద్ధము, ఒకేఅంకము, నాయకుడు ప్రఖ్యాతుడు-ఉదాత్తుడు, నాయిక ప్రసిద్ధురాలు, గర్భ-విమర్శ సంధులుండవు, భారతీవృత్తి బహుళము, శ్రీ (లక్ష్మి) శబ్దముతో సంకులమై ఉండును కనుక శ్రీగదితము అని విద్వాంసులనిరి. ఉదా। క్రీడారసాతలము (సా.ద. 6-పు 202).

నాయిక (నటి) లక్ష్మిదేవి రూపమున వచ్చును కావునదీనిని శ్రీగదిత మనిరి (హిం.సా కో. పు-840).

*షిద్గకము* : షిద్గకము, ఉపరూపక భేదము. అ.గు. ఉల్లేఖించినది. "పతిలేదా నాయకుని ఉద్ధత వ్యాపారమును నాయిక సఖుల సమక్షమున ప్రదర్శించుట, చరిత్ర, దానిచర్చ మసృణముగానో, ధూర్తముగానో ఉండుట వలన దీనిని షిద్గకము అనిరి," (అ.భా.). భావప్రకాశనము చెప్పిన ప్రకారము చూచినచో ఈలక్షణము 'శ్రీగదితము' తోసంవదించు చున్నది. షిద్గకము 'ప్రస్థానకము' లోనే అంతర్గతముగా కొందరు చెప్పిరి (హిం సా.కో.పు-845) ఉదా మృగ్యము.

*సంకరము* : ఇతివృత్త భేదము. ఇతివృత్తము ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము అని మూడు ప్రధానభేదములను చెప్పిన ద.రూ. కర్త విశేష ముగా ఈనాల్గవ భేదమును చెప్పెను: దివ్య, మర్త్య జాతులకు చెందిన నాయికా నాయకులతో కూర్చిన ఇతివృత్తమును సంకరము అనిరి (ద.రూ. 1-15). ఉదా విక్రమోర్వశీయము.

*సంక్షిప్తకము* : ఆరభటీ వృత్తికిగల 4 అంగములలో ఒకటి: అన్వర్థములైన శిల్పములు, విపులములైన పుస్తములు (సెట్టింగులు), విచిత్రమైననేపథ్యము మొ॥ వాటిచే సంజ్ఞా మాత్రముగ వస్తువులను సూచించుటను సంక్షిప్తకము

అనిరి. (నా.శా. 20-పు. 6 9). శిల్పముల సహాయముతోగాని ఇతరయుక్తుల తోగాని వస్తురచనను సంక్షిప్తము చేయుట సంక్షిప్తము. ఉదా ఉదయన చరితములో కిలింజహస్తిని ప్రయోగించుట. పోయిననాయకుని స్థానమును మరొక నాయకు డాక్రమించుటగూడ సంక్షిప్తియే. ఉదా వాలిమరణా నంతరము ఆపదవికి సుగ్రీవుడు వచ్చుట (సా.ద. 6-పు 173).

*సంగ్రహము :* గర్భసంధికిగల 13 అంగములలో ఒకటి: సామ-దానాదులతో నెరవేరు కార్యమును సంగ్రహము, అనిరి. (నా శా. 19-పు. 574).

ఉదా। రత్నావళిలో రాజు:— "సరియే వయస్యుడా, ఇదిగోనీకు పారి తోషికము" అనికడియమిచ్చు సన్నివేశము. (సా.ద. 6-పు 159).

*సంఘాత్యము :* సాత్వతీ వృత్తికిగల 4 అంగములలో ఒకటి: సామము మొ ఉపాయశక్తిచేగాని, అర్థశక్తిచేగాని, దైవ వశమునగాని, స్వీయదోషము వలన గాని సంఘాతము భేదింపబడుటను 'సంఘాత్యము' అనిరి. (నా.శా. 20-పు. 616). ఉదా ముద్రారాక్షసమున చాణక్యుడు రాక్షస సహాయులను స్వబుద్ధిచే భేదించుట, విభీషణుడు రావణునినుండి దైవవశమునవిడి వడుట ఇట్లే అర్థము, తదితర శక్తియుక్తులచే చేయుభేదనోపాయములన్నియు ఉదాహరణములే (సా.ద. 6-పు 172).

*సంచారికలు :* అభ్యంతర (రాజాంతఃపుర) పరివారములోని వారు: అంతః పురములో అన్ని కక్ష్యలందును, ఉద్యానవనములందును, దేవాలయము లందును, క్రీడా ప్రాసాదములందును సంచరించుచు సేవకా వృత్తిని నిర్వర్తించువారిని, ప్రతిజాముకు గంటలు కొట్టువారిని సంచారికలు అనిరి. (నా.శా. 24-పు 707).

*సంధి 1 :* నిర్వహణ సంధికిగల 14 అంగములలో ఒకటి: ముఖసంధిలో చెప్పిన కావ్యార్థము ఫలోన్ముఖమై సన్నిహితమైనకార్యమును సంధి అనిరి. (నా.శా. 19-పు 576). దాగిన బీజము మరల వికసించునట్లు చేయుట సంధి.

ఉదా। 'వేణి'లో భీముడు "యజ్ఞవేది సంభూతురాలా! సుడియుచున్న బాహువుచే...కైసేయును అనినేనన్నమాట జ్ఞప్తిఉన్నదా!" అనినసం దర్భము (సా.ద.6-పు 166).

*సంధి 2:* రూపకవస్తువును ఆంతరంగికముగా విభక్తమైన విభాగమును 'సంధి' అనిరి. నిర్వచనమునకు, వివరణలకు చూ. సంధి-అంకము, సంధిలోపము, సంధులు ఐదు.

*సంధి-అంకము :* వీటిపరస్పర సంబంధములు, భేదములు: ఆధికారిక (ప్రధాన) ఇతివృత్తమునకు కూర్చవలసిన ముఖాది సంధులు ఐదు. అంకములు, నాటక-ప్రకరణములందు 5-10 వరకు ఉండవచ్చు. ఒకసంధి ఒకఅంకము నతిక్ర ఆక్రమించవచ్చు, తరువాతి అంకమునకు సాగవచ్చు. ఒకే అంకమున రెండు సంధులు కూర్చవచ్చు. ముఖాది సంధివిభాగము ఇతివృత్తమునకు

సంబంధించిన అంతర విభాగము.అవాంతరవస్తుసమాప్తిని సూచించుటకుగాని, నటుల, ప్రేక్షకుల విశ్రాంతికొరకుగాని చేసిన అంకాది విభజన బాహ్యా విభాగము నాటక-ప్రకరణములలో 5 సంధులు తప్పక ఉండును.('పతాక' లోకూడ ఒకటి-రెండు సంధులుండవచ్చు. ఇవి అనుసంధులని తెలియవలె). కథ ఎటువంటిదైనను ఆద్యంతములు గలదై ఉండునుగదా! కావున ఏ రూపకములో ఏసంధులు లోపించినను రెండుసంధులు, ముఖ-నిర్వహణములు మాత్రము తప్పవని తెలియవలె. ఒకే అంకముగల రూపకము ఈ రెండు సంధులను ఇముడ్చుకొనవలసినదే (నా.శా. 9-పు. 597) విశేషములకు చూ. సంధిలోపము, సంధులు ఐదు, సంధ్యంగములు.

*సంధిలోపము* : ఆధికారిక (ప్రధాన) ఇతివృత్తములో ముఖ్యముగా నాటక-ప్రకరణములలో పంచసంధులు ఉండవలసినవే. అయినను నాటక రచన, నిర్వహణ, వీటి అనుకూలమును బట్టి కొన్ని సంధులు లోపించవచ్చు. అట్లు లోపించు సంధులలో ఒకటి అయినప్పుడు అవమర్శసంధి అగును, రెండు అయినప్పుడు అవి గర్భ-అవమర్శలు అగును, మూడు అయినప్పుడు అవి ప్రతిముఖ-గర్భ-అవమర్శలు అగును. ఇతివృత్తమెంత చిన్నదైనను ముఖ-నిర్వహణ సంధులు రెండును అందుండ వలసియుండును. కావున రూప కములందు సంధిలోపము ప్రతిముఖ—గర్భ—అవమర్శల వరకే పరిమితమగు చున్నది. ప్రాసంగికేతి వృత్తమున ఈసంధులు ఉండవు (అందుండునవి అను సంధులు) (నా.శా. 19—పు. 569).

*సంధులు ఐదు* : ఆధికారిక (ప్రధాన) ఇతివృత్తము యొక్క అంతర విభాగము 5 రకములుగా అయినది. ఈవిభాగములకే 'పంచ సంధులు' అనిపేరు.

*సంధి—నిర్వచనము* :—సంధి పదమునకు నా.శా.లోనిర్వచనములేదు. ధనంజయుని నిర్వచనమిట్లున్నది. "అర్థ ప్రకృతయః పంచ పంచావస్థా సమన్వితా, యథాసంఖ్యేన జాయంతే ముఖాద్యాః పంచసంధయః అంతరైకార్థసంబంధః సంధిరేకాన్వయేసతి, ముఖప్రతిముఖేగర్భః సావమర్శోపసంహృతి" (ద.రూ. 1—22,23). అర్థప్రకృతులు అయిదు, కార్యావస్థలు అయిదు క్రమముగా వీటిని కలుపునవే ముఖాది పంచసంధులు. అనగా అర్థ ప్రకృతులలో, కార్యావస్థలలో అంతర్భూతమై వ్యాపించిన కార్యసామగ్రిని ఏకముఖమునకు చేర్చుటయే సంధి, అని తాత్పర్యము. ధనికుని వ్యాఖ్య ఇట్లున్నది: "ఏకేనప్రయోజనేనాన్వితానాం కథాంశానా మవాంతరైక ప్రయోజన సంబంధః సంధిః" దీనికి డా పి.ఎస్.ఆర్. అప్పారావు చేసిన సమన్వయ వ్యాఖ్య ఇట్లున్నది: సంధులు (కథాభాగములు) అన్నియుప్రధాన ఫలమును సాధించుటకు తోడ్పడుచున్నవి. అనగా ఒక సంధి ఇంకొక సంధికి దారితీయుచు క్రమముగా అవి ఫలసిద్ధిని కలిగించుచున్నవి. ఇట్లివి ప్రధాన ఫలసాధకము లగుటయేకాక అవాంతర ఫల సాధకములు కూడ అగుచున్నవి.

ఒకసంధిపూర్తి అయినదనగా కథలో కొంతభాగము ముగిసినదన్నమాట. అనగా అప్పటికి ఏదో కొంత ఫలము సాధింపబడినదని తలపవచ్చు. ఇట్లు ఆయాసంధులందు సాధింపబడిన అవాంతర ఫలములే నాటకాంతమున మహా ఫల రూపమున పర్యవసించును. సంధి అనగా రెండుగాని, మూడుగాని కలసి నదిఅని సాధారణార్థము. ఒక కార్యావస్థను, ఒక అర్థప్రకృతిని ఇముడ్చు కొన్నకథా భాగమే సంధి అని గ్రహించుట సమంజసము. 'ఆరంభము'నుండి 'ఫలాగమము' వరకు కవి విభజించుకొన్న ఏ కథలోనైనను వ్యాపించిన ఐదు సంధులు ఇట్లు గ్రాహ్యములగుచున్నవి: 1. నాయకాదులకు అభిలాష జనింపజేసి వారి మనస్సున. దానిని నాటించు కథాభాగము మొదటిది. 2. ఆ అభిలాషను వ్యక్తముచేసి దానిని సిద్ధింపచేసి కొనుటకు నాయకాదులు ప్రయత్నము మొదలుపెట్టెడి కథాభాగము రెండవది. 3. ప్రయత్నము ఫలించు విషయమున ఆశా-నిరాశలు రెండును కలిగెడి కథాభాగము మూడవది. 4. ప్రయత్నము ఫలించుననెడి నిశ్చయము కలిగెడి కథాభా గము నాల్గవది. 5. ఫలము సిద్ధించెడి కథాభాగము ఐదవది. వీటినే ఆలం కారికులు 'పంచసంధులు' అనిరి. చూ. క్రమముగా ముఖ-ప్రతిముఖ-గర్భ-విమర్శ-నిర్వహణ సంధులు.

*సంధ్యంగములు-ప్రయోజనములు :* సంధి అనునది మొత్తముకథలో ఒకభాగము కాగా సంధ్యంగములు అనునవి ఆసంధిలోని వేర్వేరు అంశములగు చున్నవి. సంధ్యంగములు విభావ - అనుభావ-వ్యభిచారి రూపములే అని నాట్య దర్ప ణము చెప్పినది. (నా.ద. పు-115). వీటిని యుక్తముగా ప్రయోగించిన కవియే కథకు నిండుదనము చేకూర్చును, అట్లే వీటిని గుర్తించిన నటులే రసవంతముగా అభినయించగలరు. అప్పుడే ప్రేక్షకులు కథాగమనమును గ్రహించగలరు. కథాగమనమునందు అవస్థలున్నట్లే, ఇతి వృత్తమునందు సంధులున్నట్లే, సంధులకు అంగములుండి తీరును. 'నాట్యదర్పణము'లో చూచినట్లు సంధ్యంగముల నిర్వచనములను పరిశీలించినచో అవియన్నియు ఆయా ముఖ్యపాత్రలు ప్రకటించు భావములై ఆయాకథాంశముల సారాం శములు అగుచున్నవి. ప్రయోజన విశేషము నాశించి లక్షణకర్తలు చేసిన విభ జనలో ఇవి 'సంధ్యంగములు'గా పరిగణన కెక్కినవి. ఇది గమనించ వలసినది.

సంధ్యంగముల సంఖ్య 65. కానితర్వాతివారు వీటిని 64 వరకే గణించిరి: గర్భసంధిలోని 'ప్రార్థన' అనుదానిని ధనంజయాదులు విడిచిరి. విమర్శ సంధ్యంగమైన 'ప్రరోచన'ను కొందరు విడిచిరి. నిర్వహణ సంధ్యంగమైన 'ప్రశస్తి'ని, కొందరు విడిచిరి (తర్వాత భరతవాక్యమైనదిదే). "భాషణము (62) సంగ్రహము (31)' అను సంధ్యంగములకు అర్థభేదములేదు. అభినవ గుప్తుడుగూడ సంధ్యంగములు 64 గా గణించుట కిదే కారణమై యుండును. సంధ్యంగములకు నా.శా.లో ఉదాహరణములు లేవు. అ.గు. మాత్రము ఆయా నాటకములనుండి ఉదాహరణములు సమకూర్చెను. సింగభూపాలుడు

ఒక్క బాలరామాయణము నుండియే అన్నిటికి ఉదాహరణములిచ్చెను 64 సంధ్యంగములకు పత్యేక ఆరోపములలో వివరణలు ఈయనైనది.

ఉత్తమకవి రచనలో (ధ్వని వచ్చిపడినట్లే) సంధ్యంగములు స్వాభావికముగా వచ్చిపడును. తజ్ఞులైన ప్రేక్షకులు, పాఠకులు వాటినిగుర్తించెదరు. భారతీయ నాటక లక్షణకర్తలు కనుగొన్న విశిష్ట లక్షణములు ఈసంధ్యంగములు. *సంధ్యంగముల ప్రయోగము:* 1. వీటిని నా.శా.;ద.రూ. చెరొక క్రమముతో చెప్పుటయే గాకకొన్నిటి విషయములో పేర్లు, నిర్వచనములు సరిపడునట్లుచెప్పలేదు ఉదా॥ విమర్శసంధ్యంగములు 13,10 పేర్లవరకురెండు గ్రంథములు. ఏకీభవించుచున్నవి. నా.శా. పేర్కొన్న భేదము-ప్రతిషేధము-ఛాదనము,ఈమూడింటికి బదులుగా ద.రూ. విద్రవము-ఛలనము—విచలనము, ఈమూడింటిని పేర్కొన్నది. ఇటువంటి భేదములను పరిగణించక ఉచితజ్ఞుడైన కవి తాను స్వీకరించినకథను, దాని అనుకూలమునుబట్టి తనక్రమమును చూచుకొనవచ్చు. 2. ఒక సంధిలో చెప్పిన అంగములన్నియు అందులో ఉండవలెనన్న షరతులేదు. కథకు అవసరమైనంతవరకే కవి సరిచూచు కొనవచ్చు. 3. ఒకే సంధ్యంగమును అదేసంధిలో-ఆ సన్నివేశదీప్తిని ఆశించి-మూడు సార్లవరకు ప్రయోగించవచ్చు. ఎక్కువసార్లు ప్రయోగించుట వైరస్యము. 4. రెండు సంధ్యంగములను కలిపి ఒకేచోట ప్రయోగించవచ్చు. 5. ధనంజయాదులు సంధ్యంగములను భిన్న క్రమములో చెప్పినట్లే వాటిపేర్లను, నిర్వచనములను కొన్నిటిని భిన్నముగా చెప్పినారు.

సంధ్యంగ ప్రయోజనములు:— సంధ్యంగములను ప్రయోగించుటలో నా.శా. ఆశించిన ప్రయోజనములు 6. చూ. 1 ఇష్టార్థ రచన 2. వృత్తాంతానుపక్షయము 3. ప్రయోగమునందు రాగప్రాప్తి 4. గుహ్యగూహనము 5. ఆశ్చర్యాభిఖ్యానము 6. ప్రకాశ్యప్రకాశనము.

***64 సంధ్యంగములలో ప్రధానములు, అప్రధానములు:*** బీజార్థముతోసంబంధముండుటయేసంధ్యంగముల ముఖ్యలక్షణముకాబట్టి 1. ముఖసంధిలోఉపక్షేప-పరికర-పరిన్యాస—యుక్తి—ఉద్భేద—సమాధానములకు 2. పతిముఖసంధిలో పరిసర్ప—ప్రగమన—వజ్ర—ఉపన్యాస—పుష్పములకు 3. గర్భములో అభూతాహరణ—మార్గ—త్రోటక—అధిబల—క్షేపములకు 4. విమర్శలో అపవాద — శక్తి—వ్యవసాయ — ప్రరోచన—ఆదానములకు 5. నిర్వహణలో ఒకేక్రమమున రావలసిన ఉపసంహార— ప్రశస్తులకు ప్రాధాన్యము. ఇతరములను కవి వీలునుబట్టి చొప్పించవచ్చు, మానవచ్చు (సా.ద. 6-పు. 168). ప్రాయికముగా సంధ్యంగములు ప్రధాన పాత్రలు ప్రయోగించ వలసినవి. ప్రక్షేపాదులు అప్రధాన పాత్రలు ప్రయోగించవచ్చు.

*…ధ్యంతరములు :* సంధ్యంగములు 64. "వీటి బిగువు సడలకుండ మధ్యమధ్య మరికొన్ని సంధులను కూర్చవలె. అవియే సంధ్యంతరములు" (అభినవ

గుప్తుడు, సింగభూపాలుడు.) సంధ్యంతరముల సంఖ్య 21: 1. సామము 2. భేదము 3. దండము 4. ప్రదానము 5. వధము 6. ప్రత్యుత్పన్నమతిత్వము 7. గోత్రస్ఖలితము 8 సాహసము 9. భయము 10. హ్రీ (ధీ అని పాఠాంతరము) 11. మాయ 12. క్రోధము 13. ఓజస్సు 14. సంవరణము 15. భ్రాంతి 16. హేత్వపధారణము (అవధారణము పాఠాంతరము) 17. దూత 18. లేఖ 19. స్వప్నము 20. చిత్రము 21. మదము. — భరతుడుగాని, అ.గు. గాని వీటికి లక్ష్యలక్షణములు చెప్పలేదు. వీటికి ఉదాహరణములిచ్చిన సింగభూపాలుడు "దశరూపకకారుడు అనాలోచితముగా ఈ సంధ్యంతరములకు సంధ్యంగములందు అంతర్భావమును చెప్పెను. అది నాకు సమ్మతముకాదు" అనెను. సంధ్యంగములవలె సంధ్యంతరములు కూడ విభావాను భావవ్యభిచారి స్వరూపములే అనితెలియుట యుక్తము. (నా.శా. 19-పు 578). వీటిలో కొన్నిటి వివరణలు హిం.సా.కో. లోలభించినవి.

**సంఫేటము 1.** : ఆరభటీ వృత్తికిగల నాలుగు అంగములలో ఒకటి: వివిధ సంరంభములు, నానావిధ యుద్ధ-నియుద్ధ-కపటాదులు, శస్త్ర ప్రహారములు - మొ వాటితో కూడినది 'సంఫేటము' (నా.శా. 20-పు. 619). క్రోధావేశపరులైనవారు ఇద్దరు పరస్పరము ఢీకొనుట సంఫేటము (సా.ద. 6-పు 178). ఉదా॥ ఆయా యుద్ధకథా ఘట్టములందు సులభముగా లభించును.

**సంఫేటము 2.** : విమర్శ సంధికిగల 13. అంగములలో ఒకటి: రోషముతో కూడిన వాక్యమును 'సంఫేటము' అనిరి (నా.శా. 19-పు.575). రోషముతో కూడిన భాషణమును సంఫేటము అనిరి (సా.ద. 6-పు. 161). ఉదా "(సక్రోధముగా) ఓరిపాపాత్ముడా!" ఇత్యాదులన్నియు ఉదాహరణములే.

**సంబోధనలు** : సంస్కృత నాటకముల ననుసరించి ఉత్తమ, మధ్యమ, అధమ ప్రకృతులుగల పాత్రలు పరస్పరము సంభాషించునప్పుడు పిలుచుకొను సంప్రదాయములు.

1. పురుషులను సంబోధించు విధములు: స్త్రీ పురుషులందరు దేవతలను మహర్షులను పూజ్యులను భగవన్! అని — మహర్షి పత్నులను భగవతి! అని—బ్రాహ్మణుని ఆర్యా! అని—పార్థివుని మహారాజా! అని-ఉపాధ్యాయుని ఆచార్యా! అని—వృద్ధుని తాతా! అని పిలువవలె. ఋషులు, బ్రాహ్మణులు రాజును రాజా! అని, లేదా పేరుబెట్టి—అమాత్యుని సచివా!/అమాత్యా! అని పిలువవలె. హీనజనులు సచివుని ఆర్యా! అని - సంతోషసమయములోఉపయోగించుచాటుపద్యాదులలోఉత్తములనుగూడ పేరుబెట్టి-పిలువ వచ్చు. స్త్రీ పురుషులందరు మాన్యుని మహానుభావా! అని - అన్ని తరగతుల రాజోద్యోగులను వారివారి పదవుల పేర్లుబెట్టి - కొంచెముతక్కువవారిని మార్షకా!/మారిషా! అనిపిలువవలె. ఉత్తమ వర్గమునకు చెందిన సములు తమ సములను పేర్లుబెట్టి పిలువవచ్చు. ఇతరులు తమ సములను వయస్యా! అనవచ్చు. అందరు తపస్విని, ప్రశాంతుని 'సాధు' పదముతో

సంబోధించవలె.—యువరాజును స్వామీ! అని—ఇతర రాజకుమారుని భర్తృదారకా! అని—రాకుమారుల కంటెతక్కువ వారిని సౌమ్యా! భద్రముఖా! అని—ఇతరులను (కర్మశిల్ప—విద్యాజాతులను) తగినపేర్లతో పిలువవలె.—సౌగతులను భదంతా! అని—క్షపణకులను వారివారి సంప్రదాయమును బట్టి—పాశుపతులను భాపూషన్! భాసర్వజ్ఞా అనిపిలువవలె. సూతుడు రథికుని ఎల్లప్పుడు ఆయుష్మన్! అని—తండ్రి సుతుని, గురువు శిష్యుని వత్సా! పుత్రకా! తాతా! అని లేదా పేరుబెట్టి పిలువవలె. భృత్యులు, ప్రజలు, రాజును దేవా! అని—పరిజనులు సార్వభౌముని నిత్యము భట్టా! అని—విదూషకుడు రాజును రాజా!/వయస్యా అని, రాజ్ఞిని, చేటిని భవతీ! అని—రాజు విదూషకుని వయస్యా! అని లేదా పేరుబెట్టి పిలువవలె. యువతి పతిని ఆర్యపుత్రా! అని—తక్కినవారు పతిని ఆర్యా! అని—పతి రాజైనప్పుడు మహారాజా! అని—తమ్ముడు అన్నను ఆర్యా! అని—అన్న తమ్ముని వత్సా!/తాతా! అని పిలువవలె.

2. స్త్రీలను సంబోధించు విధములు: అందరు తపస్వినులను, దేవతలను భగవతీ! అని—గురుభార్యను, స్థానీయను (కొంచెము వయస్సుమళ్ళిన దానిని) భవతీ! అని—గమ్యను (సంభోగ నిషేధము లేనిదానిని) భద్రా! అని—వృద్ధురాలిని అంబా! అని—అక్కను భగినీ! అని—చెల్లెలిని వత్సా! అని—పూజ్యురాలిని, వ్రతినినిని, బ్రాహ్మణిని ఆర్యా! అని—పత్నిని (సహధర్మచారిణిని) ఆర్యా! అని లేదా ఆమె తండ్రిపేరునో పుత్రుని నామమునో కలిపిగాని పిలువవచ్చు. స్వపరిజనులు రాజపత్నిని భట్టినీ!/ స్వామినీ!/ దేవీ. అని—రాజైనను, పరిజనులైనను పట్టమహిషిని దేవీ! అని, భోగినులను స్వామినీ! అని పిలువవలె. ప్రేష్యలు రాజకుమారిని భర్తృదారికా! అనిపిలువవలె స్త్రీలు ఉత్తమ ప్రేష్యను హంజా! అని, పరిజనులు వేశ్యను అజ్జుకా! అని, వేశ్యమాతను అత్తా! అని పిలువవలె రాజులేదా ఇతరులు భార్యను శృంగారమందు ప్రియా! అని పిలువవలె. పురోధస — సార్థవాహులు భార్యను ఎల్లప్పుడు ఆర్యా! అని పిలువవలె. సమానులు సఖులను పరస్పరము హాళా! అనిపిలువవచ్చు (నా శా. 7-పు.488-9 ).

3. శృంగార విహారములలో స్త్రీలు ప్రియుల నడవడిని బట్టి ఉపయోగించు పదములివి స్త్రీలు ఇష్టనాయకుల విషయమున:- ప్రియమైన చేష్టలు, మర్యాదగల మాటలు, ఋజువర్తనము గలనాయకుని ప్రియా! అని—ఇతర స్త్రీల దంతక్షత, నఖక్షతముల చిహ్నములులేని నాయకుని కాంతా! అని—కోపమువచ్చినను ప్రియురాలిని ఏమియు అనక, సరళముగా మాట్లాడు నాయకుని వినీతా! అని—మాన, మాత్సర్యములు లేనివాడై, సర్వకార్యములందు ప్రియురాలికి రక్షకుడై, హితము కోరువాడైన నాయకుని స్వామీ!/ నాథా! అని—ప్రియురాలి అభిప్రాయము తెలిసికొని, శయన క్రియను నిపుణముగా జరుపు నాయకుని జీవితమా! అని—కులీనుడు, ధీరుడు, దక్షుడు,

వాగ్విశారదుడు, సఖులమధ్య ప్రశంసనీయుడు, దక్షిణుడు అయిన నాయకుని నందనా! అని సంబోధించవలె. ఇంక స్త్రీలకు కోపము పుట్టించు ప్రియుల విషయమున:-వికత్థనుని, అసహ్యమైన చేష్టలు గలవానిని దుశ్శీలా! అని-ఆలోచింపక యేకొట్టు వానిని, తిట్టువానిని దురాచారా! అని-మాటల మాధుర్యమే చూపి, క్రియాశూన్యుడైనవానిని శఠా! అని-వలదన్న పనిసే వాలాయించి చేయువానిని వామా! అని - సరసమైన నఖక్షతాది చిహ్నములు గలిగి, పొందిన స్త్రీని పొగడువానిని, అతిమానిని వికత్థనా! అని - పరస్త్రీసంభోగ చిహ్నములతో వచ్చి, వలదన్నను మీద బడువానిని నిర్లజ్జా! అని-తాను తప్పు చేసినప్పుడు కోపించిన నాయికను ఓదార్పకయే బలాత్కారముగా సేవించు నాయకుని నిష్ఠురా! అనిఇట్లే ఆయాపురుషుల నడవడిని బట్టి అప్రీతి సూచకములైన సంబోధనలు చేయవచ్చు (నా.శా. 22-పు. 682-84). నా.శా. కాలమునాటి సంబుద్ధి విధానమునకు తర్వాతి విధానమునకు అక్కడక్కడ మార్పులు చేర్పులు వచ్చినవి. ఈ సంబుద్ధి విధానమునే సా.ద. నాట్యపరిభాష అనినది.

*సంలాపకము 1* : సల్లాపకము, సాత్వతీవృత్తికిగల నాలుగు అంగములలో ఒకటి: ఆధర్షణ సహితముగాగాని, ఆధర్షణ రహితముగా గాని, ఇతరుల నధిక్షేపించి మాట్లాడుటను 'సంలాపకము' అనిరి. ఉదా వేణీసంహారము (అం.3)లో సూతుడు అశ్వత్థామతో "అశ్వత్థామ హతుడయ్యెనని పృథాసూనుడు స్పష్టముగాపలికి ఆ సత్యవచనుడు మెల్లగా గజము అని పలికెను." మొదట పృథాసూనుడని తర్వాత సత్యవచను డనుట (అ భా. శివసం.పు. 98) (నా శా. 20—పు. 616).

సంలాపకము 2 : ఉపరూపకము. అంకములు 3—4, నాయకుడు పాషండుడు, శృంగార—కరుణములు మినహా ఇతర రసములు; ముట్టడులు, ఛలము, సంగ్రామము, విద్రవము మొ ప్రదర్శితములగును. భారతి,—కైశికి తప్ప మిగతా వృత్తులుండును. ఉదా మాయాకాపాలికము (సా.ద. 6—పు 202)

*సంవరణము* : సంవృత్తి అని పాఠాంతరము సంధ్యంతరములు 21· అందులో ఒకటి: తనకథనమును కప్పిపుచ్చుటను సంవరణము అందురు (హిం సా. కో.పు. 860).

*సంశయము* : నాట్య (నాటక) మునకు భూషణప్రాయములైన 36 లక్షణములలో ఒకటి. అ.గు. అనుసరించిన ఉపజాతివృత్త పాఠము ప్రకారము: అనేక విధముల విచారణములుచేసి, తత్త్వార్థము పరిజ్ఞాతము కాకుండగనే వాక్యమును పూర్తిచేయుటను 'సంశయము' అనిరి. (అనుష్టుప్ పాఠములో దీనిపేరు, నిర్వచనము ఇట్లే ఉన్నవి) (నా శా. 16—పు. 447).

సంస్కృత *రూపకచరిత్ర* : పాశ్చాత్య రూపక చరిత్రను పేర్కొన్నంత నిష్కర్షగా సంస్కృత రూపక చరిత్రను పేర్కొనుటకు తగిన ఆధారములు

లభించవు. రూపకముల కర్తృత్వము, కాలము విషయమున అనుమానము లెన్నో మిగిలినవి. అయినను శ్రీ ఎ.బి.కీత్ రచించిన "The Sanskrit Drama" (1924), డా. ఎస్. డే. రచించిన "A History of Sanskrit-Literature" (1947) సంస్కృత రూపక చరిత్రను తెలుపు ప్రధాన గ్రంథములు: లభించిన ప్రథమ సంస్కృత రూపకము అశ్వఘోషుని "శారీపుత్ర (శారద్వతీపుత్ర) ప్రకరణము" ఇది మధ్యఆసియాలో దొరికినది. శారీపుత్ర, మౌద్గల్యాయనులకు బుద్ధుడు దీక్షనిచ్చుట ఇందులోని ఇతివృత్తము. సలక్షణ మైనరూపకమిది. అశ్వఘోషునికాలము క్రీ.పూ. మొదటిశతాబ్ది. 'శారీపుత్ర ప్రకరణము' ఉన్నతాళపత్రములలోనే మరిరెండు శిథిల రూపకములున్నవి. ఒకదానిలో బుద్ధి, ధృతి, కీర్తి వంటి సాంకేతిక పాత్రలున్నవి. ఇది ప్రబోధ 'చంద్రోదయము' వంటిది. రెండవది 'మృచ్ఛకటిక, వంటిది.

భాసుడు: కాలము క్రీ. పూ. 100-క్రీ.శ. 400 మధ్యఅంచనా. క్రీ.శ. 1912లో ఇతనివి 13 రూపకములు లభించినవి. ఇదే 'భాసనాటక చక్రము'. నా.శా. లక్షణములకు సరిపడని ఘట్టములు భాసుని రూపకములందున్నవి. కాబట్టి ఇతడు నా.శా. రచనకు పూర్వుడని కొందరు, నా.శా. లక్షణములు తెలిసియే కొత్త సంప్రదాయమును సృష్టించుటకు అట్లు రచించెనని కొందరు అభిప్రాయపడిరి. తర్వాత కాళిదాసు (క్రీ.శ.4వశ.), శూద్రకుడు (క్రీ.శ. 6–7శ.), మహేంద్ర విక్రమవర్మ (క్రీ.శ.620), శ్రీహర్షుడు (క్రీ.శ.9వశ.), విశాఖదత్తుడు (కాలము తెలియదు), భట్టనారాయణుడు (కాలము తెలియదు), భవభూతి (8వశ.), మురారి (కాలము సరిగా తెలియదు), రాజశేఖరుడు (క్రీ.శ 850-920) మొ॥ వారు ప్రసిద్ధ సంస్కృత రూపకరచయితలు (నా.శా. 18-పు. 554-59).

*సఖి :* చెలికత్తె, నాయిక నమ్మకమునకు పాత్రమైనది. నాయికను అలంకరించుట, వేళాకోళము చేయుట మొ దీనిపనులు (ర మం.2-91).

*సట్టకము :* ఉపరూపకము. పాఠ్యమంతయు ప్రాకృతము. ప్రవేశక విష్కంభకములుండవు. అద్భుతరసము ప్రచురము. అంకములకు జవనికలు అని పేరు. తక్కినవి నాటిక లక్షణములకు సరిపోవునవే. ఉదా॥ కర్పూరమంజరి (సా.ద. 6-పు 290)

*సమగ్రనాటకము :* సుబంధుపు వింగడించి చూపిన ఐదు నాటక భేదములలో ఒకటి: దీనికి సర్వలక్షణములుండును ఉదా మహానాటకము (నా.శా. 18-పు. 541).

*సమయము :* నిర్వహణ సంధికి గల 14 అంగములలో ఒకటి. దుఃఖము తొలగుటను 'సమయము' అనిరి. (నా.శా. 19-పు. 576). ఉదా॥ రత్నావళిలో వాసవదత్త (రత్నావళిని కౌగిలించు కొని "ఊరడిల్లుము చెల్లెలా! ఊరడిల్లుము" అనినసందర్భము.

*సమవకారము* : సమవాకారము. దశవిధ రూపకములలో మూడవది. 1. వస్తువు: ప్రఖ్యాతమైనదై ఉండవలె. 2. నాయకులు: 12గురు ప్రఖ్యాతులు, ఉదాత్తులు 3. అంకములు మూడు: 4 సంధులు: నాలుగు, అవమర్శము ఉండదు. 5. వృత్తులు: నాలుగు, కైశికి ఉండదు 6 రసములు: రెండు; వీరముఅంగి, శృంగారము అంగము 7. విశేషములు: మూడు కపటములతో మూడు విద్రవములతో మూడు శృంగారములతో కూడినదైన సమవకార ప్రదర్శనము మొత్తము 18 నాడికల కాలములోముగియవలె. ప్రతిఅంకము లోను భిన్నార్థములుండవలె: అనగా ప్రతి అంకమునందు (ఉపాయ విషయమున) ఒక కపటము, (వ్యాపత్తిసంభావనా విషయమున) ఒకవిద్రవము, (ఫలవిషయమున) ఒక శృంగారము ప్రయోగించవలె ప్రతి అంకమునందు వస్తువుముగియవలె ప్రతి అంకమున 12గురు నాయకులుండ వలెనని కొందరు; నాయక—ప్రతినాయక తత్సహాయులతో కలిపి మొత్తము మీద అంకమునకు నలుగురేసి, వెరసి 12గురు నాయకులుండవలెనని కొందరు అభిప్రాయపడిరి. 'సం' శబ్దమునకు నాతిసంబద్ధమని, 'అవ' శబ్దమునకు కించిత్సంబద్ధమని అర్థములు. అనగా సమవకారము కథాదృష్టితో ఏకతలేని దని సారాంశము. (నా శా. 18—పు. 523.24).

*సమాధానము* : ముఖసంధికి గల 12 అంగములలో ఒకటి. బీజార్థము ప్రధాన నాయక గతముగా సూచిత మైనచో దానిని 'సమాధానము' అనిరి (నా.శా. 19-పు 572). ఉదా 'వేణి'లో యుధిష్ఠిరుని కోపాగ్ని కౌరవ కాననమును దహించుచున్నది (యత్సత్యవ్రత భంగభీరుమనసా. క్రోధజ్యోతిరిదం మహత్కురువనే యౌధిష్ఠిరం జృంభతే) అనినసందర్భము.

*సవ్రీడస్మితము* : తనగుట్టు తెలిసిపోయినదని గ్రహించి సిగ్గుపడుచు నవ్విన చిరునవ్వు.

*సాత్త్వతీవృత్తి* : నాట్య (నాటక) మునకు మాతృకలైన వృత్తులు నాలుగు. 2. వది సాత్త్వతీ వృత్తి: సత్త్వము (మనోవ్యాపారము) ప్రధానముగ గలది సాత్త్వతి. కృతకములైన బాష్పాదులు, ముఖరాగములు మొ సత్త్వజన్యములైన వృత్తులు (చేష్టలు). హర్షభావము అధికముగా గలది, శోక భావములు లేనిది అయిన మానసవ్యాపారమును సాత్త్వతీవృత్తి అనిరి. దీని అంగములు నాలుగు. చూ. 1. ఉత్థాపకము 2. పరివర్తకము 3. సంలాపకము (సల్లాపకము) 4, సంఘాత్యము.

*సాత్త్వికాభినయము* : 4 విధములైన అభినయములలో ఒకటి. సత్వజన్యమైన వృత్తి (చేష్ట) సాత్త్వికము. నటదృష్టితో చూచినపుడు పరగతసుఖ-దుఃఖ భావనచే భావితమైన అంతఃకరణము సత్త్వము' (ధనికుడు). 'సత్త్వహీనమైన అభినయము అధమము (నా.శా. అధ్యా22). సాత్త్వికాభినయమే జ్యేష్ఠా

భినయము. చిత్తవృత్తి రూపమైన సత్త్వము రోమాంచ, అస్రాదులచే ఆయా అవస్థలందు గ్రాహ్యమగుచుండును. అంగజములుగానే తోచినను పరస్పర సముద్భవహేతువులైన భావ - హావ - హేలాదులకు సత్త్వమే మూలము. విశేషములకు చూ. (నా.శా. అధ్యా. 22).

సామము : సంధ్యంతరములు 21. అందులోఒకటి: స్వీయానువృత్తిని వ్యక్తము చేయు ప్రియవాక్యమునకు సామము అనిపేరు. (హిం.సా.కో. పు. 860).

సామాన్య : (నాయిక) నా.శా. చతుర్విధ నాయికలలో చేర్చి 'గణిక'గా పేర్కొన్న నాయికఇది: లలితమైన, ఉదాత్తమైన లక్షణములు కలది గణిక (నా.శా. 24-పు. 705). తరువాతి లక్షణకర్తలు దీనిని 'సామాన్యనాయిక' (సాధారణస్త్రీ=వేశ్య) అని వ్యవహరించగా ఇదేపేరు బహుళ ప్రయోగములో ఉన్నది.—'సాధారణస్త్రీగణికా.' వేశ్యనాయిక కళావతి, కుయుక్తులుగలది. ఈనాయికను 'ప్రహసన' మందుకాక 'ప్రకరణము' నందు ప్రవేశపెట్టవచ్చు. దివ్యుడు నాయకుడుగా ఉన్నచో 'సామాన్య'ను నాయికగా చేయరాదు (ద.రూ. 2-21,22)—సామాన్యనాయిక ధీరయై, కళానిపుణయై ఉండును. ఇది రక్త అయినను, విరక్త అయినను దీనితో సంభోగము దుర్లభము. దీనికిధనమే ముఖ్యముగాని, పురుషుల గుణ-అవగుణములతో పనిలేదు. ధనహీనుడైన ప్రియుని వెడలగొట్టుటకు వేశ్యమాత ఉండును. (సా.ద. 3-పు. 48). లక్షణ కర్తలెందరో సామాన్యను ఏకైక నాయికగానే గుర్తించిరి కాని 'రసమంజరికర్త' ఈ నాయికకుగూడా భేద ప్రకారములు చెప్పినాడు:-సామాన్య నాయికగూడ అన్యసంభోగదుఃఖిత, వక్రోక్తిగర్విత, మానవతి, ప్రోషితభర్తృక, ఖండిత, కలహాంతరిత, విప్రలబ్ధ, విరహోత్కంఠిత, వాసకసజ్జ, స్వాధీనపతిక, అభిసారిక, ప్రవత్స్యత్పతిక అని 12 విధములైనది (ర మ.).

సారూప్యము : 36 నాటక లక్షణములలో ఒకటి. చూ. అభిమానము.

సాహసము : సంధ్యంతరములు 21 అందులో ఒకటి. దీని వివరణ మృగ్యము. చూ. సంధ్యంతరములు.

సిద్ధి : నాట్య (నాటక) ములకు భూషణప్రాయములైన 36 లక్షణములలో ఒకటి. అ.గు. అనుసరించిన ఉపజాతి వృత్త పాఠము ప్రకారము: ప్రసిద్ధార్థముల మధ్య ఒక అప్రసిద్ధార్థమును చొనిపి హేతుపురస్సరముగా దానికి సాధారణత్వమును కల్పించు పద్ధతిని 'సిద్ధి' అనిరి (అనుష్టుప్ వృత్తపాఠములోగూడ దీనికిదే పేరున్నది. దీని నిర్వచనమును అ.గు. సమన్వయించలేదు "తానుకోరిన అర్థము సిద్ధించుట కొరకు స్పృహణీయములు. అతర్కితోపలబ్ధములు అయిన ప్రయోజనాంతరములను కీర్తించుట 'సిద్ధి' అని అనుష్టుప్ పాఠము). (నా.శా. 16-పు. 446).

*సుకుమారరూపకములు :* ప్రయోగ (ప్రదర్శన) విశేషములను బట్టి దశరూపకములు ఆవిద్ధములని, సుకుమారములని రెండువిధములు. నాటకము, ప్రకరణము, భాణము, వీథి, అంకము ఈ ఐదు సుకుమార ప్రయోగమునకు ఉద్దేశించిన రూపకములు. వీటిలో వచ్చువారధికముగా మానవపాత్రలే. సుకుమారములు 5, ఆవిద్ధములు 4. మొత్తము 9. మిగిలిన 'ప్రహసనము' ఈరెండు విధములలో దేనికి చెందినదో నా.శా. చెప్పదు (నా.శా. 18-పు. 379). చూ. ఆవిద్ధరూపకములు.

*సూచ్యము :* ఇతివృత్త సంబంధి. చూ. ఇతివృత్తవిభజన.

*సూత్రధారుడు :* నాటకప్రయోక్తలలో ముఖ్యనిర్దేశకుడు. సంగీత, సాహిత్యకళల మర్మము, ప్రయోగము తెలిసిన కుశలుడు. నానాశాస్త్ర నైపుణ్యములలో సుశిక్షితుడు. ధార్మిక, లౌకిక విద్యా విశారదుడు. నాటకనిర్వహణములో ఆచార్యుడు. నాటకసమాజములో ఇతడే పెద్ద. ప్రయోక్తలందరు ఇతని సూచనల ననుసరించియే నాటక ప్రదర్శనలో సహకరింతురు. గాన-వాద్య-పాఠ్య- అభినయముల సూత్రము తెలిసినవాడు కావున సూత్రధారుడైనాడు. పాశ్చాత్య నాటక సమాజములో ఇతనినే డైరెక్టర్ అనిరి. (నా.శా. అధ్యా 1,17;35-పు. 163-70,491,854,56,59). బొమ్మలాట మాత్రమే ఉన్న అతిప్రాచీన కాలములో ఆబొమ్మలకు కట్టిన దారములను (సూత్రములను) లాగి ఆడించువాడు కనుక సూత్రధారుడు అని ఒకనిర్వచనమున్నది. సూత్రధారుని పరోక్ష విధులు నాటక వ్యవస్థలో ఆరంభము మొదలు సమాప్తి వరకు అంతర్భూతములై ఉన్నవి. ఇతని ప్రత్యక్ష విధులు రెండు, చూ. నాందీసూత్రధారుడు, స్థాపకుడు.

*సేనాపతి :* 1. ధీరోదాత్త నాయక వర్గమున కెక్కినవాడు అని (నా.శా.24-పు. 704). 2. రాజుకు ఉండవలసిన బాహ్య పరివారములోని అధికారిగా ఇతడు సకలనీతి సంపన్నుడు, కులోద్భవుడు, నిత్య జాగరూకుడు, రాజుకు అనురక్తుడు, దండయాత్రా కాల విశారదుడు అయి ఉండవలెనని (నా.శా. 24-పు. 710).

*సైంధవకము :* లాస్యాంగములు 10, వాటిలో ఒకటి. వీణా వాద్యముతో, ప్రాకృత వచనముతో, విభ్రష్ట సంకేతముగల పాత్రతో కూడిన నాట్యమును సైంధవకము అందురు. ఉదా॥ "రత్నావళి" లోని ద్వితీయాంకము— రూపవాద్యములుండి, పాఠ్యములేనిది సైంధవకము అని మరొక పాఠమున్నది (నా.శా. 19-పు. 582).

*సైరంధ్రి :* గౌరవసఖి, రాజస్త్రీలను అలంకరించుట వరకే దీనిపని. అంతఃపురములో గౌరవస్థానముననుండు పరిచారిక.

*స్థాపకుడు :* నాందీపాఠమును నిర్వర్తించి; విదూషక-పారిపార్శ్వకులతో కలసి సరససల్లాపముల ద్వారా కథా సూచనను కొంతచేసి వారితోపాటు నిష్క్ర

మించిన సూత్రధారుడే తిరిగి ప్రవేశించవచ్చు. అట్లు రెండవసారి ప్రవేశించిన సూత్రధారుని స్థాపకుడు అందురు. 'నాద్యంతమున' ప్రవేశించు సూత్రధారుడు (లేదా అతనిబదులు వచ్చునటుడు) రూపకవృత్తిని సమస్తమును స్థాపించువాడు కావున ఇతనిని 'స్థాపకుడు' అనిరి. ఇతనితో నటీ-విదూషక-పారిపార్శ్వులు కాదులుందురు (నా.శా. 5.పు. 178.74) వీరు నాటకవిషయము, నాటకకర్త, నటులు. కథ మొ। సామాజికులకు రంజించునట్లుగా ప్రసంగింతురు. ఈ భాగమంతయు కవి రచితమై ఉండును. బహిర్యవనికాంగమైన 'ప్రరోచన' ఇదే. 'ప్రస్తావన' (ఆముఖము) ద్వారా వీరు నిర్వర్తించు నాటక విషయమైన ప్రసక్తిలో. సూచనలలో మూడు ఆముఖాంగములలో ఏదో ఒకటి: కథోద్ఘాతమో, ప్రవృత్తకమో, ప్రయోగాతిశయమో ప్రయోగమునకు వచ్చినట్లు గుర్తించవచ్చు. సూత్రధారుడు నటితోగాని, మారిషుని (పారిపార్శ్వకుని) తోగాని, విదూషకునితోగాని చేయు సల్లాపములో భారతీ వృత్తికి అంశములైన 'ప్రహసన' లక్షణములైనను, 'వీథి' లక్షణములైనను గ్రహించవచ్చు. ఈ ప్రస్తావనలో సూత్రధారాదులు ప్రశ్న-సమాధాన పద్ధతిలో చేయు హాస్యప్రసంగములలో 13 వీథ్యంగములలో 'ఉద్ఘాత్యకాదు'లను కొన్నిటిని గ్రహించవచ్చు. ప్రస్తుత నాటకేతివృత్తమును స్థాపించుటకు వచ్చిన ఈస్థాపకుడు 'ఉదాత్తరాఘవము'లోవలె వస్తుసూచన, 'రత్నావళి' నాటికలోవలె బీజసూచన, 'అభిజ్ఞాన శాకుంతలము' లోవలె పాత్రసూచన చేయవలె. భారతీ వృత్తిద్వారా కావ్యార్థసూచన చేయుటయే స్థాపకునివిధి. కథలోనిముఖ్య పాత్రల వేషములకు అనుగుణమైన వేషముతో ఇతడు రావలె. అనగా కథలోని పాత్రలు దివ్యులైనచో దేవతల వేషముతో, మనుష్యులైనచో మనుష్యవేష-భూషలతో ఇతడు కనిపించవలె.

అతి ప్రాచీనకాలములో 'బొమ్మలాట' మాత్రమే ప్రదర్శించెడివారు. అప్పుడు సూత్రధారుడు (దారముపట్టి బొమ్మలాడించువ్యక్తి) మంగళశ్లోకాదులు చదివి నిష్క్రమించువాడుగా, స్థాపకుడు (బొమ్మలను తెరకు నిలబెట్టువాడు) కథాంశములను సూచించు వాడుగా ఉండిరట. రానురాను బొమ్మల స్థానములో సజీవులైన నటులు ప్రవేశించినారు. స్థాపకునితో అవసరము లేకపోయినది. సూ తధారుడు మాత్రము ఆ పేరుతోనే మిగిలినాడు. స్థాపకుడు నిర్వర్తించు 'ప్రస్తావన' కార్యక్రమము సూత్రధారుని విధియైనది (హిం.సా కో. పు. 936).

స్థాపనము : ప్రస్తావనాదులతో నాటక కథను పరిచయము చేయుట చూ. స్థాపకుడు.

స్థితపాఠ్యము ; లాస్యాంగములు 10. వాటిలో ఒకటి: ఒకఒంటరి యువతి

శృంగార పరవశత్వముతో ఆ రసానుగుణమైన ప్రాకృతమును పఠించుటను స్థిత పాఠ్యము అనిరి. ఉదా। 'రత్నావళి' నాటిక ద్వితీయాంకములో సాగరిక వచనములు. ఈస్థితపాఠ్యము బహుచారీ సహితమై, పంచపాణి-కళాన్సారియై ఉండవలె (నా.శా. 19-పు. 582).

*స్వగతము* : చూ. ఆత్మగతము.

*స్వప్నము* : సంధ్యంతరములు 21. వాటిలో ఒకటి. దీని వివరణ మృగ్యము. చూ. సంధ్యంతరములు.

*స్వాధీనభర్తృక* : స్వాధీనపతిక శృంగార నాయిక. చూ. నాయికలు - అష్టవిధములు.

*స్వీయ* : త్రివిధ ముఖ్య నాయికలలో స్వీయ మొదటిది, కులస్త్రీ (నా.శా.), వివాహితఅయి పతివ్రతగా ఉండునది. భర్తను సేవించుట, శీల రక్షణము, ఆర్జవము, క్షమ ఇవి ఈనాయిక లక్షణములు. ఉదా సీత. ఒకవంక వయస్సునుబట్టి, మరొకవంక శృంగార స్వభావమును బట్టి ఈనాయిక ప్రధాన భేదములు 3: ముగ్ధ, మధ్య, ప్రగల్భ. అంతర్భేదములు కలుపుకొని 'స్వీయ' భేదములు మొత్తము 13: *ముగ్ధ* 1. *మధ్య*, ధీరత్వ అధీరత్వములను బట్టి దీని అంతర్భేదములు3:(ధీర-జ్యేష్ఠ,ధీర-కనిష్ఠ,ధీరాధీర-జ్యేష్ఠ,ధీరాధీర-కనిష్ఠ,అధీర జ్యేష్ఠ,అధీర-కనిష్ఠ) *ప్రగల్భ* లేదా *ప్రౌఢ*. మధ్యకు ఉన్నట్లే దీనిఅంతర్భేదములు 6. ముగ్ధ 1 +మధ్య 6+ప్రగల్భ 6=13 (ర.మ. ప్రథమ ప్రకరణము).

*హల్లీసకము* : ఉపరూపకము. ఒకేఅంకము, 7-8 స్త్రీపాత్రలు, పురుషుడొకడు, ఉత్తమభాష, కైశికీవృత్తి. ముఖ-నిర్వహణసంధులు, గీతలయాత్మకము ఉదా॥ కేళీరైవతకము (సా.ద. 6-పు. 204).

*హేతువు* : నాట్య (నాటక) మునకు భూషణప్రాయములైన 36 లక్షణములలో ఒకటి. అగు. అనుసరించిన ఉపజాతి వృత్తపాఠము ప్రకారము: వాడుకలో ఉన్న అనేకార్థములను ప్రతిపాదించి వాటిపై అనాదరము చూపి, అసాధారణమైన ఒక అర్థమును ప్రామాణికముగా నిర్ణయించుటను 'హేతువు' అనిరి (అనుష్టుప్ పాఠములో గూడ ఇదేపేరుతో ఉన్నది. ఆ పాఠము ఇట్లు సమన్వితమైనది: ప్రయోజన వశమున ఇష్టార్థమును సాధించుటకు మనోగ్రాహి అగునట్లు ఉపపత్తి సహితముగా చెప్పెడి వాక్యమును హేతువు అనిరి) (నా.శా. 16-పు. 445).

*హేత్వపధారణము* : హేత్వవధారణము అనిపాఠాంతరము సంధ్యంతరములు 21. అందులో ఒకటి: ఏదోప్రయోజనము నాశించి ఏదోనిశ్చయమును చేయుటను హేత్వపధారణము అందురు. (హిం.సా.కో. పు. 860).

*హ్రీ* : ధీ అనిపాఠాంతరము. సంధ్యంతరములు 21. అందులో ఒకటి: ఇష్టసిద్ధి సమకూడునంతవరకు ఉండు చింతను హ్రీఅందురు (హిం.సా.కో.పు860).




# 3
# అలంకార విభాగము

*అక్రమము* : వాక్యదోషము, వివ, క్రమము తప్పుట అక్రమము. ఉదా॥ ఇతని కీర్తి, శౌర్యకాంతులకు సూర్య, చంద్రకిరణములు సాటియా? కీర్తి కాంతి చంద్రకాంతితో, శౌర్యకాంతి సూర్యకాంతితో సాటియా, అనిచెప్పవలసినది తారుమారైనది. ఇదిదోషము (కా.సం. 4.28). దీనిని విద్యానాథుడు 'క్రమభ్రష్టము' అని, వామనుడు 'అపక్రమము' అని వ్యవహరించిరి. ఇది రెండు విధములు: 1. శబ్దాక్రమము: పై ఉదాహరణము 2. అర్థాక్రమము: ఉదా॥ తురంగమునుగాని, మాతంగమునుగాని వీనికిమ్ము. ఈవాక్యములో ప్రధానార్థమైన మాతంగము తురంగము తర్వాతి స్థానమున చేరినది. (అదే, పు. 464).

*అక్రియ* : వాక్యదోషమని కా.సం. దీనిని సా.ద. మొ అర్థదోషముగా పరిగణించినది. చూ. సాకాంక్షము.

*అతద్గుణము* : అర్థాలంకారము. లక్ష. సన్నిహితముగా ఉన్న అన్యవస్తు గుణమును స్వీకరింపక తనగుణముసే నిలుపుకొనుట అతద్గుణము. ఉదా రాజహంసా! నీవు గంగలో ఈదినను, యమునలో ఈదినను నీరంగులో వచ్చిన మార్పేమియులేదు. (కా.ప్ర.). లోకన్యాయమూలమైన అర్థాలంకారము. మొదట వివేచించినది మమ్మటుడు. (హిం.సా కో.).

*అతిమాత్రము* : అర్థదోషము. 'అనుచిత దోషము' అని సా ద. మొ . వివ. లోకాతీతమైన అర్థము అతిమాత్రము. ఉదా చనుగొండలు ('పాతాళమివనాభిస్తే, పర్వతావివచస్తనౌ వేణీదండః పునరయం కాళిందీ పాత సన్నిభః.(నీనాభిపాతాళమువలె ఉన్నది, నీస్తనములు పర్వతములవలె ఉన్నవి, నీవేణీదండము కాళిందీ ప్రవాహమువలె ఉన్నది) వంటివి అతిమాత్ర దోషములు ఆంధ్ర ప్రబంధములలో ఇవిమిక్కిలి? (కా సం.4. పు. 498).

*అతిశయోక్తి* : అర్థాలంకారము. లక్ష. లోకప్రసిద్ధమై ఉన్న వస్తువు యొక్క స్థితిని అతిక్రమించి చెప్పుట అతిశయోక్తి. కవిప్రౌఢోక్తియే దీనికి జీవితము. ఉదా॥ (సంబంధాతిశయోక్తినుండి) ఈపట్టణము మేడలు చంద్రమండలమును తాకుచున్నవి. (చంద్రా. 34.) సాదృశ్యగర్భ-అభేదప్రధాన-అధ్యవసాయ మూలకములైన అర్థాలంకారములలో అతిశయోక్తి ఒకటి దీనిని మొదలు వివేచించిన భామహుడు, లోకసిద్ధమైన దానిని ఒకనిమిత్తము నాశ్రయించి అతిశయముగా చెప్పుటయే దీనిలక్షణముగా గుర్తించెను. వివ

ణనో, విశేషమునో ఆశ్రయించి లోకసిద్ధమైన దానిని అతిక్రమించి చెప్పుట అతిశయోక్తి అని దండి అభిప్రాయము. ఇదిమౌలికమైన అలంకారమని, దీని సౌందర్యము కాల్పనికమైన అభేద (అధ్యవసాయ) రూపములో చూడ తగినదని ఆలంకారికు లెందరో అభిప్రాయపడిరి. క్రమముగా వికసించిన ఈ అలంకారమునకు రుయ్యకుడు చెప్పిన భేదములు 5: 1. భేదమున్న చోట అభేదమున్నట్లు, 2. అభేదమున్న చోట భేదమున్నట్లు. 3. సంబంధమున్న చోటసంబంధము లేనట్లు, 4 సంబంధము లేనిచోట సంబధమున్నట్లు, 5 కార్య కారణముఖు తలకిందులైనట్లు కల్పించి వర్ణించుట అతిశయోక్తి. వీటిలో 1, 5 భేదములు మమ్మటుడు అంగీకరించనివి. 3 వదానికి అతడు చెప్పిన ప్రకారము వేరుగా ఉన్నది. విశ్వనాథుడు, విద్యానాథుడు రుయ్యకునే అనుసరించిరి. (తెలుగులో భట్టుమూర్తి విద్యానాథుని అనుసరించెను). 'అతిశయోక్తి లక్షణమును ప్రత్యక్షముగా చెప్పకున్నను జయదేవుడు దీనికి చెప్పిన భేదములు 6. అప్పయ దీక్షితుడు కలిపినవి 2. మొత్తము 8: అక్రమాతిశయోక్తి, అత్యంతాతిశయోక్తి, చపలాతిశయోక్తి, సంబంధాతిశయోక్తి, భేదకాతిశయోక్తి, రూపకాతిశయోక్తి, అసంబంధాతిశయోక్తి, సాపహ్నవాతిశయోక్తి. చివరి రెంటిని కలిపిన అప్పయ దీక్షితుడు వీటిక్రమమును కొంత అటుఇటు మార్చినాడు (హిం సా.కో.) *1. రూపకాతిశయోక్తి*.. లక్ష. ఉపమానము మాత్రము చెప్పి ఉపమేయమును (వర్ణ్యమును) మరుగు పరచినచో రూపకాతిశయోక్తి. ఉదా నల్లకలువల జతనుండి వాడియైన బాణములు వెలువడుచున్నవి. (చంద్రా.31.). ఇట ఉపమానములు (నల్లకలువలజత) మాత్రము చెప్పబడినవి. ఉపమేయములు (కన్నులు) చెప్పబడలేదు. ఉపమేయములకు ఉపమానరూపతచే అధ్యవసాయము. ఉపమేయమునిట్లు మరుగుపరచుటను విషయ నిగరణమందురు. *2. సాపహ్నవాతిశయోక్తి*. లక్ష. అతిశయోక్తియే అపహ్నుతితో కూడినచోట సాపహ్నవాతిశయోక్తి ఉదా రాజా! అమృతము నీమాటలయందుండగా భ్రాంతిపరులు దానిని చంద్రుని యందు చూతురు (చంద్రా. 32). చంద్రునిలో ఉన్నది అమృతము కాదని చెప్పుటచే పర్యస్తాపహ్నుతి గర్భితముగాఉన్నది. ఇట్టిలక్షణముసుబట్టి సాపహ్నవాతిశయోక్తిని గుర్తించవచ్చు. *3. భేదకాతిశయోక్తి*. లక్ష. ఒకేజాతివస్తువులకు భేదము లేకున్నను భేదమున్నదని చెప్పినచో భేదకాతిశయోక్తి, ఉదా అతని గంభీరమే వేరు, అతని ధైర్యమేవేరు (చంద్రా. 33). గాంభీర్య ధైర్యములు లోకములో వివిధవ్యక్తులయందు చూతుము. వాటి లక్షణములనుబట్టి అవి ఒకేజాతివై భేదములేనివై ఉండును. అయినను 'అతనివివేరు' అనగా వాటిలో భేదమున్నదని చెప్పుట వలన ఇది భేదకాతిశయోక్తి. *4. సంబంధాతిశయోక్తి*. లక్ష. రెండు వస్తువులకు సంబంధము లేనిచోట సంబంధమున్నదని వర్ణించినచో సంబంధాతిశయోక్తి. ఉదా ఈ పట్టణము మేడలు చంద్రమండలమును తాకుచున్నవి (చంద్రా. 34).

వాస్తవముగా మేడలకు, చంద్రమండలమునకు సంబంధము (స్పర్శ, కూడిక) బొత్తిగాలేదు. అయినను సంబంధమున్నదని చెప్పుట వలన ఇది సంబంధాతిశయోక్తి. *5 అసంబంధాతిశయోక్తి*. లక్ష. సంబంధ మున్నప్పటికిని సంబంధము లేదని వర్ణించినచో అసంబంధాతిశయోక్తి, ఉదా రాజా! నీవు దాతవై ఉండగా యాచకులు కల్పవృక్షాదులను ఆదరించరు (చంద్రా ౩౫), అడిగినవారి కోరికలు నెరవేర్చు కల్పవృక్షములకు, యాచకులకు సంబంధమున్నది. అట్లున్న సంబంధము లేదని వర్ణించుట వలన ఇది అసంబంధాతిశయోక్తి. *6. అక్రమాతిశయోక్తి*. లక్ష. కార్య కారణములు ఏకకాలమందే జరిగినట్లు వర్ణించుట అక్రమాతిశయోక్తి. ఉదా॥ రాజా! నీబాణములు వింటి నారిమీద ఎప్పుడు పడునో, అప్పుడే శత్రువులు భూమిపై పడుదురు (చంద్రా. ౩౫). వింటికి తొడిగిన బాణము వెడలిపోయి శత్రువులకు తాకినప్పుడు వారు భూమిపై ఒరిగినట్లు చెప్పినచో కారణము ముందు, కార్యము తర్వాత ఏర్పడినట్లుండెడిది. ఆ విధముగాచెప్పక రాజా! నీవుబాణములు అల్లెతాటిపై తొడిగిన వెంటనే శత్రువులు ఒరిగిపోవుదురు అని కార్య కారణములను ఒకే కాలమందు ఏర్పడినట్లు చెప్పుటవలన ఇది అక్రమాతిశయోక్తి. *7. చపలాతిశయోక్తి*. లక్ష. కారణ ప్రసక్తి మాత్రముతోనే కార్యముత్పత్తి అయినదని చెప్పినచో చపలాతిశయోక్తి. ఉదా॥ పెనిమిటి 'ప్రయాణమై పోవుచున్నాను, అని అనగానే యువతికి ఉంగరము కడియమాయెను (చంద్రా. ౩౬). నాయకుడు 'వెళ్ళెదను' (ఇంకను వెళ్ళలేదు) అనెను. ఇది కారణప్రసక్తి. ఆ ప్రసక్తి మాత్రముననే ఆమె వ్రేలి ఉంగరము దండచేతికి కడియమగునంతగా ఆ యువతి కృశించినది (ఇదికార్యము.) ఇట్లు వర్ణించుట వలన ఇది చపలాతిశయోక్తి. *8. అత్యంతాతిశయోక్తి*. లక్ష. కారణము ముందు చెప్పి, తర్వాత కార్యమును చెప్పుట క్రమము. ఈక్రమము మార్చి చెప్పుట అత్యంతాతిశయోక్తి ఉదా నాయిక కోపము పోయినది. తర్వాత నాయకుడు ఆమెను ఊరడించెను (చంద్రా. ౩౭), ఊరడించుట కారణము. ఇదిమొదలు జరుగవలసినది. కోపము పోవుట కార్యము, ఇది తర్వాత జరుగవలసినది. ఈవిధముగా చెప్పక విపరీతముగా చెప్పుట వలన ఇది అత్యంతాతిశయోక్తి.

**అత్యుక్తి** : అర్థాలంకారము. లక్ష. అసత్యముతో అయినను, ఆశ్చర్యకరములుగా చేసి వర్ణించుట అత్యుక్తి. ఉదా॥ నీ ప్రతాపాగ్నిచేత ఎండిపోయిన సప్త సాగరములు నీశత్రురాజుల స్త్రీల కన్నీళ్ళతో నిండినవి (కువ)1. శౌర్యాది సంబంధమైన 'అత్యుక్తి' ఇటువంటిది 2. సంపద సంబంధి అయిన అత్యుక్తి 'ఉదాత్తము'. —అతిశయోక్తిలో అసదుక్తి (కొద్దిఅసత్యము) మాత్రము ఉండును. దీనిలో అత్యంతాసదుక్తి(మిక్కిలిఅసత్యము) ఉండును. రెంటికిగల భేదమిది అని చంద్రికా వ్యాఖ్య—అతిశయోక్తి వర్గమునకు చెందినది అని హిం.సా.కో.

**అధికపదత్వము** : వాక్యదోషము. చూ. అధికోపమ[2].

**అధికపదము** : వాక్య దోషము. వివ. అనవసరములనిపించు పదములు చేరిన వాక్యము అధికపదము. ఉదా। 'కమలారి-కళాకలిత విలాస సముల్లసద లఘు-యశోవిభవశాలియగు నితడు' (కా.సం. 4.30) 'కమలారి యశోవిభ వశాలి' అన్నంతవరకు చాలు. కావలసిన అర్థము బోధపడును. 'కళా... అలఘు' పదసముదాయము అధికమై అనవసరమైనది. ఇదిదోషము.

**అధికము** : అర్థాలంకారము. లక్ష. ఆధారాధేయములలో ఒకదానిని మిక్కిలి పెద్దదిగాను, ఇంకొకదానిని మిక్కిలి చిన్నదిగాను వర్ణించుట అధికాలంకారము. ఉదా (i) విశాల విశ్వమునకు ఆశ్రయుడైన పరమాత్ముడు నీహృదయ మందున్నాడు. నీహృదయ వైశాల్య మింతంత అనరానిది (ర. గం.). లోకముల కన్నిటికి ఆధారమైన భగవంతుని కంటె ఆధేయమైన హృదయము పెద్దదని వర్ణితమైనది. (ii) రామా! శబ్ద బ్రహ్మము ఎంత విస్తారమో, అంతకంటె విస్తారమైన నీ అనంత కల్యాణ గుణములు భక్తుల వాక్కుల యందు విశ్రాంతి బొందినవి. ఆధేయముకంటె ఆధారము మిక్కిలి విస్తృతమని వర్ణించనైనది (చంద్రా. 91)—అతిశయోక్తి వర్గమునకు చెందిన అర్థాలంకారము. మొదట వివేచించినది రుద్రటుడు. తర్వాతి వారు అతని ననుసరించిచెప్పిరి (హిం.సా.కో.).

**అధికోపమ[1]** : అర్థదోషము. వివ. అల్పవస్తువును అనల్ప వస్తువుతో పోల్చుట అధికోపమ. ఉదా 'పునుకవట్టిన పేనీశుఁబోలును' (కా.సం. 4.44) పునుక పట్టినపేను అల్పము, ఈశ్వరునితో పోల్చిదానికి అధికత్వమంటగట్టినట్లైనది. ఇదిదోషము.

**అధికోపమ[2]** : వాక్యదోషము. వివ. ఉపమానములో అధికపదము చేర్చి చెప్పినది అధికోపమ. ఉదా 'అతివ పల్లవితలతాభ' (కా.సం. 4.33). ఆకోమలి తీగవలె ఉన్నది అన్నచాలు 'పల్లవిత' పదమధికమై దోషమైనది. ఈదోషమును సా.ద. కర్త 'అధికపదత్వము' అన్నాడు.

**అధ్యవసాయమూలకము** : అధ్యవసాయమనగా ఉపమేయమును అధఃకరించి ఉపమానముగానే చెప్పుట. చూ. ఉత్ప్రేక్ష, అతిశయోక్తి. ఇవిఅధ్యవసాయ గర్భములు లేదా అధ్యవసాయమూలకములు.

**అనన్వయము** : అర్థాలంకారము. ఇతరముతో సంబంధము లేనిది అని శబ్దార్థము. లక్ష. ఒక వస్తువు= సాటిలేదని చెప్పుటకై దానిని దానితోనే పోల్చుట 'అనన్వయము'. ఉదా॥ రాముని వంటివాడు రాముడే. ఇది సాదృశ్యగర్భ - భేదాభేదప్రధాన శబ్దాలంకారములని (హిం.సా.కో.) కాని దండిమతమున ఇది ఉపమాభేదము. ఇది స్వతంత్రమైన అలంకారమని భామహుడు మొ॥ విశ్వనాథుని వరకు అంగీకరించిరి. దీనిలక్షణ నిర్వచనములో వామనుడు, జయదేవుడు ఏకీభవించిరి. 'ఉపమానోపమేయత్వం యదేకస్యైవ వస్తునః' (చంద్రా. 5.) దీనికి గాథాసప్తశతిలోని ఒక ఉదాహరణము సర

సముగా సరిపడుచున్నది 'చక్కదనముగల్గు చానలు జగములో, ఎందరున్న గాని యేమి ఫలము? ఒడలి చెలువులోన ఎడమసగంబుతో కుడిసగంబె సాటి గూడుచెలికి' ఎటుపోల్చినను ఆచెలికి సాటి ఆచెలియేగాని ఇతరము పొసగదని భావము చూ. అనన్వయము-లాట.

అనన్వయము-లాట : అనన్వయములో శబ్దార్థముల పునరుక్తి కనిపించుచున్నది (గగనం గగనాకారం సాగరస్సాగరోపమః, రామరావణయోర్యుద్ధం రామ రావణయోరివ). పైకి కనిపించు ఈ శబ్దార్థ పౌనరుక్త్యమును బట్టి దీనిని కొందరు సాదృశ్యగర్భ—భేదాభేద ప్రధాన శబ్దాలంకారము అనిరి (హిం.సా. కో.) వాస్తవమునకు ప్రధానముగా ఇందున్నది అర్థపౌనరుక్త్యమే. ఉదా ధర్మజునకు ధర్మజుడే సాటి అన్నను, ధర్మజునకు కౌంతేయాగ్రజుడే సాటి అన్నను అనన్వయమే అగుచున్నది. కాని 'అనన్వయము'లోను శబ్దపునరుక్తి ఉన్నప్పుడే ఆ ఉపమేయమునకు (వస్తువునకు) అదే ఉపమానము అను అర్థము పాఠకులకు వెంటనే స్ఫురించును. కావున కవులు దీనిని శబ్దపౌనరుక్త్యముగా ప్రయోగించుట గూడ జరిగినది. శబ్దపౌనరుక్త్యమానుషంగికము. భిన్న సమన్వయముతో కూడిన శబ్దార్థపౌనరుక్త్యమును లాటానుప్రాసలో విధిగా కూర్చవలసినదే. శబ్దపరివృత్తిని సహింపకుండుట లాటానుప్రాస లక్షణము. శబ్దపరివృత్తిని సహించుట అనన్వయాలంకార లక్షణము. ఈరెంటికి గల భేద మిది (సా.ద. 10. కాణేవ్యాఖ్య. పు. 110).

అనభిహితవాచ్యము : వాక్యదోషము. చూ. వాచ్యవివర్జితము.

అనర్థకము : పదదోషము. చూ. నిరర్థకము.

అనవీకృతము : అర్థదోషము. వివ. అదేఅర్థము వచ్చునట్లు కొన్నిసార్లు చెప్పుట, అటుల చెప్పిన దానిలో నూతనత్వము లేకుండుట అనవీకృతము. ఉదా 'చక్కదనమున కొకవింత చక్కదనము, జవ్వనంబున కొకవింత జవ్వనంబు, విభ్రమంబున కొకవింత విభ్రమంబు గలిగెనద్దివ్య కుసుమంబు కతనచెలికి' (పారిజా.). ఇట 'ఒకవింత' అనుపదము మూడుసార్లు పడినది. అన్నిసార్లు ప్రయోగించి సాధించిన నవీనత ఏమియులేదు. (కా.సం. 4.పు. 503).

అనియమ పరివృత్తము : అర్థదోషము. వివ. అనియమము చెప్పుకొనవలసిన చోట నియమము చెప్పుట. ఉదా। 'అవర్తపవనాభిస్తే, నేత్రేనీలసరోరుహే, భంగాశ్చ వళయస్తేన, త్వం లావణ్యాంబువాపికా' నీనాభి ఆవర్తమే, నీనేత్రములు నల్లగలువలు, నీవళులు తరంగములు, నీవు లావణ్యాలవాపివి. ఇట నీనాభి ఆవర్తమే అను నియమము కూడదు (కా.సం. 4-పు. 504). మిగతా వాక్యములలో లేనట్లే ఏవార్థకము మొదటి వాక్యములో ఉండనవ సరములేదు.

అనుగుణము : అర్థాలంకారము. లక్ష. ఒకవస్తువు తనకున్న గుణమునే పరసన్నిధి వలన మరింత ఎక్కువగా పొందినట్లు వర్ణించుట అనుగుణము ఉదా। నల్లగలు -

వలు ఆకామిని కడగంటి చూపుల వలన అధిక నీలిమ నొందెను. (చెవిసందున చెక్కిన పూలు ఇవి. చంద్రా. 143) —లోకన్యాయమూలమైన అర్థాలంకారము. మొదట చెప్పినది జయదేవుడు. *అనుగుణము-మీలితము.* ఈరెంటికి గల భేదములు: పరసన్నిధి వలన స్వగుణోత్కర్ష చూపుట 'అనుగుణము', సాదృశ్యమువలన ఒక గుణము అధిక గుణమున్న దానిలో కలిసిపోవుట 'మీలితము' (హిం.సా.కో.).

***అనుచితము*** : అర్థదోషము. చూ. అతిమాత్రము.

***అనుచితార్థము*** : పదదోషము. వివ. ప్రస్తుతమునకు అనుచితమైన అర్థమిచ్చు పదము. ఉదా। "శూరా అమరతాం యాంతి పశుభూతారణాధ్వరే" శూరులు రణ యజ్ఞమున పశువులై మరణించి అమరత్వమును పొందుచున్నారు. పశువులను యజ్ఞములో బలాత్కారముగా పట్టి తెచ్చి వధింతురు (అవిశౌర్యము ను ప్రకటించుటలేదు). శూరులు యుద్ధమున అట్లుగాక, తుదివరకును పోరాడి చత్తురు. అదివీరధర్మము 'పశుభూతాః' అను పదప్రయోగము వీర ధర్మమును కళంకపరచుచున్నది కాబట్టి దోషము ఇది కా. ప్ర., సా ద. చెప్పినది (కా.సం. పు. 461).

***అనుజ్ఞ*** : అర్థాలంకారము. లక్ష. దోషమునందు గుణమును చూచి దోషమే కావలయునని కోరుకొనుట అనుజ్ఞ ఉదా బ్రహ్మదేవుడా! చేతులు జోడించి నిన్నొకటి వేడెదను. దున్నుకొని బ్రతుకువారిలో జన్మమిచ్చినను సరేకాని వారు విష్ణుభక్తి పరాయణులుగా ఉన్నచాలు (ర.గం.) విష్ణుభక్తి ముఖ్యము గాని వృత్తి ముఖ్యము గాదని అర్థము. దీనిని వివేచించినది జయదేవుడే. (చంద్రా. 134).

***అనుప్రాస భేదములు*** : విభిన్నమైన అనుప్రాసలను సంస్కృతాలంకారికులు స్వతంత్రాలంకారములుగా వివేచించిరి. కా.సం పు. 550 లో పేర్కొన్నవి ఇవి: అనుప్రాసము ఛేక, వృత్తి, శ్రుతి, అంత్య, లాట భేదములచే ఐదు విధములు (సా.ద.)—శ్రుతి, వృత్తి, వర్ణ, పద, నామ (ప్రాదిపదిక), లాట భేదములచే ఆరువిధములు (భోజుని స.కం.) - లాటానుప్రాసము రెండు విధములు: పదావృత్తి, ప్రాతిపదికావృత్తి; పదావృత్తి రెండు విధములు: ఏకపదావృత్తి, బహుపదావృత్తి; ప్రాతిపదికావృత్తి మూడువిధములు: ఏక సమాసవృత్తి (ఒకేసమాసములో రెండు పదములుండుట), భిన్నసమాస వృత్తి (రెండు పదములు భిన్నసమాసములలో ఉండుట), సమూహాసమాస వృత్తి (సమాసములో ఒక పదము, ఇంకొక పదమసమాసములో ఉండుట). లాటానుప్రాసమిట్లు మమ్మటాదులు చెప్పిన ప్రకారము ఐదు భేదములు.

***అనుప్రాసము*** : శబ్దాలంకారము (వర్ణవిన్యాసము) లక్ష. రసానుగతమై, ప్రకృష్ట మైన వర్ణవిన్యాసమునే 'అనుప్రాసము'గా స్వీకరించుట ఉచితమనిరి. "ప్రకృష్టో వర్ణవిన్యాసో రసాద్యనుగతోహియః, సోఽనుప్రాసస్సచచ్ఛేక వృత్త్యుపాధి గతోద్విధా" రసము విభావాదుల చేతనే వ్యజ్యమాన మగుచు

న్నను కొన్ని వర్ణములకు కొన్ని రసములను వ్యక్తము చేయగల గుణము న్నది. సరళభావ ప్రకటనకు సరళాక్షరములు, పరుషభావ ప్రకటనకు పరుషాక్షరములు ఉపయోగించుట స్వాభావికము. కాబట్టి అనుప్రాసములో రసానుగతమైన వర్ణవిన్యాసముండుట యుక్తమని తజ్జ్ఞులు అపేక్షించిరి (కా.సం.పు. 548). అనుప్రాసము రెండు విధములు. చూ. ఛేకానుప్రాసము, వృత్త్యనుప్రాసము, అను ప్రాసభేదములు.

*అనుమానము :* అర్థాలంకారము. లక్ష. సాధనమును (హేతువును) బట్టి సాధ్యమును నిశ్చయించుట అనుమానాలంకారము. ఉదా గూండ్లకు చేరుకొన్న పక్షులు, ముకుళితము అగుచున్న తామరపూలు, పూచుచున్న జాజిపూలు సూర్యాస్తమయమును తెలుపుచున్నవి. ఇట సూర్యాస్తమయముసాధ్యము, గూండ్లకు చేరుకొన్న పక్షులు మొ॥ సాధనములు. *అనుమానము-కావ్యలింగము,* ఈ రెంటికిగల భేదములు: 'కావ్యలింగము'లో హేతువు (సాధనము) 'కారక' రూపముగా ఉండును, అనుమానములో 'జ్ఞాపన' రూపముగా ఉండును. హేతువున బట్టి సాధ్యమును సాధించితినని కవియే అనుమానాలంకారములో చెప్పును. కావ్యలింగములో సాధ్యహేతువులు చెప్పి అనుమానమును సాధించుకొనుమని పాఠకులకు వదలివేయును (ఆ.వి.స. 2-పు. 502).

*అనువాదాయుక్తము :* అర్థదోషము. వివ. విధికి అనుగుణమైన అనువాద్యమును చెప్పుట, యుక్తముకాని అనువాదము చేయుట దోషము. ఉదా 'అరే!... విరహిప్రాణదమన!...ప్రచలదల! నీలోత్పల! సఖే! సఖేదోఽహం, మోహం శ్లథయ.' విరహిప్రాణదమనమా! మిత్రమా! నీలోత్పలమా! నేను ఖేదపడుచున్నాను, మోహమును సడలింపుము:—ప్రార్థనా రూపమున ఉన్న విధి ఇది. 'విరహి ప్రాణదమన!...మోహంశ్లథయ!' ఇవి అనుగుణములు కాని అర్థములు. విరహిప్రాణదమనము చేయునది మోహమును సడలించ జాలదు. ఇది దోషము. (కా.సం. 4—పు. 507).

*అన్యార్థము :* పదదోషము, నిత్యము. వివ. రూఢిలేనిది అన్యార్థము ఉదా సమానులు = తుల్యులు, మానసహితులు అని రెండవ అర్థము కావచ్చుకాని దానికి రూఢి ఏమాత్రములేదు 'అసమర్థము' వలె దీనికి యోగ రూఢి గూడ చెల్లదు. రెండవ అర్థమున వాడినచో 'అవాచక' దోషము.(కా.సం.పు.453).

*అన్యోన్యము :* అర్థాలంకారము. లక్ష. రెండు వస్తువులు ఒకదానితో మరొకటి ఉపకారము పొందినట్లు చెప్పినచో అన్యోన్యాలంకారము. ఉదా రాత్రి చేతచంద్రుడు శోభించుచున్నాడు, చంద్రుచిచే రాత్రి శోభించుచున్నది (చంద్రా. 93)—ఇది వాస్తవ వర్గమునకు చెందిన అర్థాలంకారమని రుద్రటుడు, విరోధమూల వర్గమునకు చెందినదని రుయ్యకుడు. దీని భేదములు మూడు (అభిధీయమానము. ప్రతీయమానము, ప్రతీయమానాభిధీయమానము) అని భోజుడు. రెండువస్తువులు ఒకే క్రియద్వారా పరస్పరము

విశేషత్వమును ఉత్పన్నము చేయుటయే దీని భేదములకు కారణమని విశ్వనాథుడు (హిం.సా.కో.).

అన్యోన్యోపమ : చూ. ఉపమేయోపమ.

అపక్రమము1 : వాక్యదోషము. చూ. అక్రమము.

అపక్రమము2 : అర్థదోషము. చూ. వాక్యదోషములలో చేరిన 'అక్రమము'. కావ్యపాత్రలు శాస్త్రాచారములకు భిన్నముగ నడచినట్లు చెప్పట గూడ అపక్రమ దోషమే అని కా.సం. వ్యాఖ్య. (పు. 489).

అపదయుక్తము : అర్థదోషము. వివ. ప్రకృతార్థమునకు విరుద్ధమైనదై అస్థాన సంబంధమైన అర్థము అపదయుక్తము. ఉదా . బాలరామాయణములో జనకుడన్నమాట! 'అతని ఆజ్ఞను దేవేంద్రుడు శిరసావహించును, రాజధాని సాటిలేని లంకాపురి, దేవదేవుడైన ఈశ్వరునికి భక్తుడు, శాస్త్రములు అతని కనుసైగలో మెలగును, బ్రహ్మవంశములో జన్మించినాడు, ఇటువంటివాడు సీతకు వరుడౌట మెచ్చవలసినదే కాని రావణుడు అనుమాట కానిమాట. సర్వగుణములు ఒక్కచోట కూడవుగదా!':—చివరిమాట రావణునకు సీత నీయవచ్చునని తోపింపజేయుచున్నది. అందువలన ఇది అపదయుక్తము (కా.సం. 4. పు. 505).

అపహ్నుతి : అర్థాలంకారము. అపహ్నవమనగా మరుగుపరచుట. లక్ష. విషయమును (ఉపమేయమును) మరుగు పరచిగాని, నిషేధించిగాని, లేదని చెప్పిగాని ఇంకొకవస్తు (విషయి=ఉపమాన) ధర్మమును దానికి ఆరోపించుట అపహ్నుతి'. ఉదా ఇది దుందుభిధ్వనికాదు, త్రిపురములను జయించిన రుద్రుని కల్పాంత ఢక్కారవము (ప్ర.రు.) ఇట దుందుభి ధర్మమైన ధ్వనిని అపహ్నవించి దానికి సదృశమైన ఢక్కయొక్క ధర్మమైన రవము దాని యందు ఆరోపించబడినది. సాదృశ్యగర్భ-భేదాభేద-ఆరోపమూలకములైన అర్థాలంకారములలో ఇదొకటి. మొదలు దీనిని వివేచించినది దండి. రుయ్యకాదులు, విశ్వనాథుడు విద్యానాథుడు మొ దీని భేదములు మూడనిరి. జయదేవుడు, అప్పయదీక్షితులు వివేచించి చెప్పిన ప్రకారము దీని భేదములు 6: శుద్ధాపహ్నుతి, హేత్వపహ్నుతి, పర్యస్తాపహ్నుతి, భ్రాంతాపహ్నుతి, ఛేకాపహ్నుతి, కైతవాపహ్నుతి. *1. శుద్ధాపహ్నుతి.* ఉదా ఇది చందమామ కాదు ఆకాశగంగలోని పద్మము(చంద్రా. 21). వర్ణనీయవస్తువుచంద్రుడే అయినను చంద్రుని స్వధర్మము మరుగుపరచబడినది, కాబట్టి శుద్ధాపహ్నుతి. *2.* హేత్వపహ్నుతి. లక్ష. శుద్ధాపహ్నుతినే యుక్తియుక్తముగా చెప్పినచో హేత్వపహ్నుతి అగుచున్నది. ఉదా। ఒకవిరహిణి స్వగతము: ఈ ప్రకాశించునది ఏమిటి? చంద్రుడనుకొందమా, దారుణముగా ఉన్నాడు. దారుణముగా ఉన్నాడు కాబట్టి సూర్యుడనుకొందమా! రాత్రిసమయమున సూర్యు

డెట్లు వచ్చును, కనుక ఇది సముద్రమునుండి పైకి వచ్చిన బడబానలము (చంద్రా. 22). చంద్రుని ధర్మము నపహ్నవించి బడబానల ధర్మము ఆరోపించుటకు వలసిన కారణములు చెప్పబడినవి కాబట్టి హేత్వపహ్నుతి. 3. పర్యస్తాపహ్నుతి. పర్యస్తమనగా విపర్యాసము (వ్యత్యస్తము). చెప్ప వలసిన విధముగా చెప్పక భిన్నముగాచెప్పుట. లక్ష. ఒకవస్తు ధర్మమును నిషేధించి దానిని వర్ణనీయవస్తువు నందారోపించుట పర్యస్తాపహ్నుతి, ఉదా ఇతడు చంద్రుడుగాడు, ప్రేయసి ముఖము చంద్రుడు. (చంద్రా. 23). ఉపమానమైన చంద్రునిధర్మము నిషేధింపబడినది. 4 భ్రాంతాపహ్నుతి. లక్ష. ఇతరులు శంకించినప్పుడు నిజముచెప్పి భ్రాంతిని పోగొట్టుట భ్రాంతాపహ్నుతి, ఉదా వక్త్రి: చెలీ! తాపమెక్కువై వణకిపోవుచున్నాను. చెలి: దేనివలన? జ్వరము వలననా? వక్త్రి: కాదు మన్మథుని వలన (చంద్రా. 24). వక్త్రి నిజముచెప్పి చెలికత్తె భ్రాంతిని వారించినది. 5. ఛేకాపహ్నుతి. లక్ష. ఛేకుడనగా నేర్పరి, అతని నేర్పరితనమును కప్పిపుచ్చగలుగుట ఛేకాపహ్నుతి. నేర్పరులు శంకించినప్పుడు వారినిగూడ మాయచేసి, నిజముదాచి చెప్పగలుగుట ఛేకాపహ్నుతి. ఉదా॥ నాయిక: రొదచేయుచు నాపదములకు తగుల్కొనెను. చెలికత్తె: నీకాళ్ళపై పడినది నీకాంతుడా? నాయిక: కాదు, అందె. (చంద్రా. 25). 6. కైతవాపహ్నుతి. లక్ష. వ్యాజము, మిష, కైతవము, ఛలము మొ॥ పదములచేత అపహ్నవమున్నచో అది కైతవాపహ్నుతి, ఉదా స్త్రీల యొక్క చూపులను వ్యాజముచే మన్మథుని బాణములు వెలువడుచున్నవి (చంద్రా. 26). ఇట స్త్రీల వీక్షణత్వము అపహ్నవింపబడి వ్యాజశబ్దముచేత మన్మథ బాణత్వ మారోపింప బడినది కాబట్టి కైతవాపహ్నుతి.

అపహ్నవమూలకము : అపహ్నవము అనగా కప్పిపుచ్చుట. కప్పిపుచ్చుట ప్రధానముగా గలది అపహ్నవ మూలక అలంకారము.

అపుష్టార్థము : పదదోషము. వివ. అర్థపుష్టిలేని పదము, ప్రకృతమునకుపయోగింపని పదము అపుష్టార్థము. ఉదా దశాననుడనుటకు 'వింశత్యర్ధాననుడు' అనుట దశరథుడనుటకు 'వింశత్యర్ధరథుడు' అనుట అపుష్టదోషములు-సా.ద., కా.ప్ర. దీనిని అర్థదోషముగా పరిగణించినవి (కా.సం. 4. 6) దీనిని కా.ప్ర. అర్థదోషముగా చెప్పినది (కా.సం. పు. 461).

అపూర్ణము : వాక్యదోషము. వివ. సమాపక క్రియతో అన్వయించని వాక్యము అపూర్ణము. ఉదా॥ "శైలేష్వస్మాకమావాసో, వన్యైషా్వచ్ఛ్వసితావయం; మృగైర్బంధు మతశ్చాస్మాన్ పశ్యన్ధాతా ప్రమోదతాం": మానివాసములు శైలములు, వన్యాహారముతో మేమూపిరిగొని యున్నాము, మృగబాంధవులమగు మమ్ము జూచుచు విధి ప్రమోద పడనిమ్ము—ఇట శైల వాసులమును, వన్యవృత్తులమును, మృగ బాంధవులమును అగు మమ్ము జూచి విధి

ప్రమోద మొందనిమ్ము అని ఉద్దిష్టార్థము. 'చూచుచు' అను శతృ్రంతము పై శ్లోకవాక్యములో ఈవిధముగా అన్వయించుటలేదు. 'మృగైర్బంధు మతశ్చా స్మాన్' అనుదానితోనే అన్వయించుచున్నది. మిగిలిన రెండు వాక్యములతో అన్వయింపకున్నది. కాబట్టి అసంపూర్ణము (కా.సం. 4. వ్యా పు. 468).

*అప్రకృతము* : చూ. అవయనములు నాల్గు.

*అప్రతీతికము* : పదదోషము, అనిత్యము. వివ. ప్రాచీనశాస్త్ర, పురాణములలో తప్ప వ్యవహారమున లేనిది అప్రతీతికము. ఉదా వృషాకపి = శివుడు, విష్ణువు—అజా=మాయ (ఇదివైదికశబ్దము). శాస్త్ర పరిభాషకుచెందిన పదములు రసప్రధానమైన కావ్యరచనలో ప్రయోగించినచో రాణించవని ఆలంకారికుల హెచ్చరిక. (కా.సం.415). కావ్యరచనలో అడుగడుగున తమ వ్యుత్పత్తి శక్తిని చూపువారిని, శాస్త్రీయ పరిభాషను విస్తారముగా ప్రయోగించు వారిని 'విద్వాంస ఏవ తేన కవయః' అని ఆలంకారికులు విమర్శించిరి.

*అప్రయుక్తము* : పదదోషము, అనిత్యము. వివ. కవులు ప్రయోగించదగనిది, అప్రసిద్ధమైనది అయిన పదము అప్రయుక్తము, ఉదా ఐలబిల, దుశ్చ్యవన వంటి పదములు (కా.సం. 4.5) లక్ష్యము అనుపదమునకు బదులు 'లక్షము' అనుట, లక్ష్యీభూతము అనుటకు బదులు 'లక్షీభూతము' అనుట అప్రయుక్తము 'ఆముక్తమాల్యద' వంటి కావ్యములలో ఇట్టి దోషములధికము. శ్లేషాదులలో ఇట్టివి దోషములు కావు (కా.సం.పు. 448).

*అప్రయోజకము* : పదదోషము. వివ. అనవసరమైన విశేషణములుంచుట అప్రయోజకమే. ఉదా . హరుడు అను విశేష్యమునకు 'భూతివిభాధవళిత హరుడు' అనిప్రయోగించి సాధించిన మనోహరార్థమేమియు లేదు. ఇట్టివి 'అపుష్టార్థ' దోషములో చేరినవే (కా.సం. 4.16). కా.ప్ర., సా.ద. ఈదోషమును తెలుపలేదు, దీనిని 'అపుష్టార్థము'గా గణించిరి (కా.సం.పు. 461).

*అప్రస్తుత ప్రశంస* : అర్థాలంకారము. లక్ష. అప్రస్తుతమైన విషయము చెప్పి ప్రస్తుత విషయము - గమ్యమానముగా - స్ఫురింప చేసినచో అప్రస్తుత ప్రశంస, ఉదా। కఠిన పాఠములను మరల మరల చదివి పరీక్ష సాధించిన వారే సమర్థులు. 'సమర్థులు' అట్లుచేయుదురు అని అప్రస్తుతముగా చెప్పినను మీరుగూడ అట్లే సాధింపుడు అని ప్రోత్సహించుచు పరీక్షతప్పిన వారినుద్దేశించి ప్రస్తుతము (గమ్యమానము)గా చెప్పు కొనుమాట ఇది. ఇది ఐదు విధములు. *1. కారణనిబంధన*. లక్ష. ప్రస్తుతముగా చెప్పదగినది కార్యమే అయినను ఆకార్యమునుచెప్పకదాని కారణమును వర్ణించుట.అనగాకారణమును నిబంధించి(వర్ణించి) కార్యము స్ఫురింపజేయుట, ఉదా ప్రయాణకార్యమును ఎందుకుమానితివనితనమిత్రుడడుగగాఒకడుచెప్పినకథనము:"సుందరీ! వెళ్ళిన

వారుమరలరారా! చింతింపకు అనినేనంటిని—అప్పుడునా ప్రియురాలుకన్నీటి నాపుకొని నవ్వినది అది భావి మరణోత్సాహమును సూచించినది." ప్రయాణమును మానుకొన్నది ప్రస్తుత కార్యము.అది సూచిత మగునట్లుగా కారణ రూపమైన సమాధానము నిబంధించి చెప్పిన విధమిది. దీనిని కారణ నిబంధనాఽప్రస్తుత ప్రశంస అందురు. *2. కార్యానిబంధన* : లక్ష. కారణము ప్రస్తుతమైనప్పుడు దానిని వర్ణింపక కార్యమును వర్ణించుట, ఉదా 'అంచల గర్వభంగమగు నా సతియానవిలాసముంగనన్' ప్రస్తుత వర్ణనకు కారణమైనది నాయికనడక. అది సూచిత మగునట్లు 'అంచలకు గర్వభంగమగును' అని అప్రస్తుత కార్యము ఇక్కడ వర్ణితమైనది. ఇది కార్యనిబంధనాఽప్రస్తుత ప్రశంస. *3. సామాన్యానిబంధన.* లక్ష. విశేషము ప్రస్తుత మైనప్పుడు దానిని వర్ణింపక సామాన్యమును నిబంధించి చెప్పుట, ఉదా॥ "పాదాహత మైనను ధూళిలేచి తలపై కెక్కును. అవమాన పడియును స్వస్థుడుగా ఉన్న వానికంటె ధూళిమేలుగదా!" శిశుపాలుని వలన అవమాన పడియు స్వస్థుల ముగా ఉన్నమనకంటె దుమ్ముమేలు అని బలరాముడు కృష్ణాదులతో అన్న మాట ఇది. 'మన బ్రతుకు హీనమైనది' అని చెప్పవలసినది ప్రస్తుతము, అది విశేషరూపము. దానిని వర్ణింపక 'పాదాహతమైనధూళి'ని అనగా అప్రస్తుత మైన సామాన్యమును నిబంధించి చెప్పుట వలన ఇది సామాన్య నిబంధనాఽ ప్రస్తుత ప్రశంస. *4. విశేషనిబంధన* : లక్ష. సామాన్యము ప్రస్తుతమైన ప్పుడు దానిని వర్ణింపక దాని విశేషమును వర్ణించిచెప్పుట, ఉదా లేడిని తన ఒడిలోనే పెట్టుకొన్నను చంద్రుని మృగలాంఛనుడు అనిరి. లేళ్ళను క్రూర ముగా హింసించు సింహమును మృగరాజు అనిరి. మెత్తగా ఆదరించువాని కంటె మొత్తువాడే అధికుడని లోకము కీర్తించునని చెప్పవలసినది సామాన్యము, అదేప్రస్తుతము. దానిని చెప్పక అప్రస్తుతమైన విశేషమును నిబంధించి చెప్పుటవలన ఇది విశేషనిబంధనాఽప్రస్తుత ప్రశంస. *5. సారూప్యానిబంధన.* "ననలుమొనలెత్తెఁ, దేనెనుజినికెం, జిగురాకుగండె, జెదరెనలితతుల్, చనవున నీ *పూఁదీగకు* ఘనమైన వసంతుపొందు గలుగగబోలున్"రతి భోగము ననుభవించిన యువతిని వర్ణించుటయే ప్రస్తుతము. దానిని వర్ణింపక అదిగోచరించునట్లు దాని సారూప్యమైన పూదీగను వర్ణించి అదిఅప్రస్తుతముగా అన్వయించునట్లు చేయుటవలన ఇది సారూప్య నిబంధనాఽప్రస్తుత ప్రశంస. (కా.సం. 5-పు. 670-72).

*అప్రస్తుతము* : చూ. అవయవములు.

*అభేదప్రధానము* : చూ. సాధర్మ్యవిధములు.

*అమతపరార్థము* : వాక్యదోషము- సా.ద.కర్త మొ పేర్కొన్నది. వివ. 'అర్థ' పదమునకు ఇట, రసము అను అర్థము గ్రహించవలె. ప్రాకరణికమైన రసమునకు విరుద్ధమైన-రససమావేశము అమతపరార్థ దోషము. ఉదా "రామ

మన్మథశరేణ తాడితా, దుస్సహేన హృదయే నిశాచారీ;గంధవ్రద్రుధిరచంద నోక్షితా, జీవితేశవసతిం జగామసా". తాటక శ్రీరాముని బాణములు తగిలి యమలోకమునకు పోయినదని ప్రాకరణికమైన అర్థము;వాసనగల రక్తమను, చందనమును పూసుకొని ప్రియునింటికి అభిసారికయై పోయినదని ఇత రార్థము. విరుద్ధరసములైన బీభత్స, శృంగారములను కలిపిరచించినది కాబట్టి ఇది దోషము (కా.సం.4.పు,484).

అరీతి : వాక్యదోషము. వివ. రసమునకు అనుచితమైన రీతి గలది అరీతి వాక్యము. ఉదా ఆయువతి అందము విటజన హృదయములను గ్రహిం చుట యందు పట్టుదలగల చూపులతో సమగ్రమైనది అని మృదువుగా చెప్పు టకు మారుగా 'విటజన హృదయ గ్రసనా గ్రహ గ్రహిళ దృష్టి సమగ్రోద గ్రమతివ శృంగారము' అని క్లిష్టబంధరీతిలో చెప్పుట దోషము (కా.సం. 4-32). శృంగార రసమునకు కోమల పదబంధము గల రచన అనుకూలము. రస—రీతుల సంబంధము తెలియుటకు చూ.కా.సం. ద్వితీయాశ్వాసము. ఈ దోషమునే సా.ద. కర్త మొ॥ వారు 'వర్ణ ప్రతికూలతా దోషము' అనిరి.

అర్థదీపనము : కావ్యగుణము చూ. అర్థవ్యక్తి.

అర్థదోషములు : అర్థమనగా 1. శబ్దముచే బోధ్యమైనది, ఇదిమూడు విధములు (వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యము) 2. వస్తువు 3. భావము లేదా రసము 4. ఇంద్రియ గోచరమగు విషయము (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధసం బంధమైనది) 5. కారణము 6. న్యాయము 7. వ్యవహారము. కావ్యపరిధిలో సుప్రయోగము చేయవలసినవి ఇవి. అర్థగతములైన దోషములు అర్థ దోష ములు. 'కావ్యాలంకార సంగ్రహము' పేర్కొన్న అర్థదోషములు 17. చూ. 1. హీనోపమ 2. అధికోపమ 3. అసమోపమ 4. అఖ్యాతోపమ 5. పరు షము 6. వ్యర్థము 7. ఏకార్థము 8. సంశయము 9. అపక్రమము 10. విరుద్ధము 11. విరసము. 12. అతిమాత్రము 13. హేతురహితము 14. నిరలంకృతము 15. అశ్లీలము 16. సహరచ్యుతము 17. భిన్నము— 'కావ్యప్రకాశము, సాహిత్యదర్పణము" పేర్కొన్నవి 13. చూ. 1. వ్యాహ తము 2. గ్రామ్యము 3. అనవీకృతము 4. సనియమ పరివృత్తము 5. అని యమ పరివృత్తము 6. సవిశేష పరివృత్తము 7. అవిశేష పరివృత్తము 8. సాకాంక్షము 9. అపద యుక్తము 10. ప్రకాశిత విరుద్ధము 11. విధ్య యుక్తము 12. అనువాదాయుక్తము 13. త్యక్తపునస్స్వీకృతము (నిర్ము క్తపునరుక్తము). వెరసి 30. పద, అర్థ, పదాంశ, సమాస, వాక్య, రస గత ములైన దోషములను వివేచించినప్పుడు వీటి విభజన సరిగాలేనట్లు కొంత తోచును. భిన్న కాలములలో ఉన్న ఆయా ఆలంకారికుల భిన్నదృక్కోణములు కారణములుగా వెలువడిన విశేషములు అన్లే గ్రహించవలె.

అర్థవ్యక్తి : కావ్యగుణములు 10. వాటిలో ఆరవది. దీనికే అర్థదీపనమని పేరు.

వివ. అర్థము స్ఫుటముగా గోచరింప జేయగల రచన అర్థవ్యక్తి. ఉదా 'నలు వొందు నమరేంద్రు నాగంబు సాటిగా, సామజంబుల నెల్ల సంతరించి; విఖ్యాతి కెక్కిన వెలిమావుసాటిగా, సైంధవంబుల నెల్ల సవరణించి...... తే స్వర్గ సృష్టికి ప్రతిసృష్టి సలుపుకీర్తి, వసుధ కౌశికగోత్ర పావనుడవైన నీకతగుగాక మరి అన్యనృపుల కగునె? సరసగుణహార! ఓబయ నరసధీర! (కా.సం. 4.64). నరసరాజు తనరాజధానీ నగరమును స్వర్గమువలె నిర్మించి నాడని, విశ్వామిత్రుని గోత్రమునకు చెందినవాడు కాబట్టి సృష్టికి ప్రతిసృష్టి చేయగలిగినాడని కవిచేసిన వర్ణనలో అర్థస్ఫూర్తి ఉన్నది.

అర్థశ్లేష—శబ్దశ్లేష : వీటి విషయమై వాదములు, నిశ్చయములు చూ. అర్థాలం కారములు, శబ్దాలంకారములు.

అర్థాంతరన్యాసము : అర్థాలంకారము. లక్ష. సామాన్య మైన ఒక అర్థముచెప్పి దానిచే విశేషార్థమునుగాని, విశేషము చెప్పి సామాన్యార్థమునుగాని సమర్థిం చుట అర్థాంతర న్యాసము. ఉదా. (i) గుణవంతమైన వస్తువు యొక్కసాహ చర్యముచే స్వల్ప వస్తువుకూడ గౌరవము పొందును. పూవులతో కూడి ఉండుట వలన దారమునుగూడ శిరస్సున ధరింతురు (చందా. 120). ఇట సామాన్యముచే విశేషము సమర్థింపబడినది. నరసభూపాలా! నీ కీర్తి నీలా కాశమున చరించినను స్వచ్ఛముగా ప్రకాశించుచున్నది. పరిశుద్ధు డెక్కడ ఉన్నను తన స్వచ్ఛతను గోల్పోడు (కా.సం. 5 186). విశేషముచే సామా న్యము సమర్థింపబడినది అనుపపద్యమానముగా (పొసగని విధమున) తోచు అర్థమును ఉపపద్యమానముగా చేయుటకై అనగా సమర్థించుటకై అర్థాం తరములు (ఇతర అర్థములు) తెచ్చి ఉంచుటను అర్థాంతరన్యాసము అం దురు —సాదృశ్యగర్భ—గమ్యౌపమ్యాశ్రయ వర్గమునకు చెందిన అర్థాలం కారము. ప్రాచీనులు వివేచించినదే. దీని రెండు విధములలో సాధర్మ్య వైధ ర్మ్యములు చూడదగినవి. కార్యకారణములను సమర్థించుట గూడ ఇందులోనే చేరునని సా.ద. కర్త అభిప్రాయము. కొందరు దీనిని 'కావ్యలింగము' గానే గుర్తించిరి. సమర్థకమైన హేతువున్నచోట అర్థాంతర న్యాసమని, నిష్పాదక హేతువున్నచోట కావ్యలింగమని సా ద. కర్త అభిప్రాయము. ఇది గూడ విమర్శకు గురి అయినది (హిం సా.కో).

అర్థాంతరన్యాసము—దృష్టాంతము : ఈరెంటికిగల భేదము: రెండు వాక్యార్థము లుండి ఒక దానిని ఇంకొకటి సమర్థించుట రెంటిలో స్థూలముగా కన్పిం చుచున్నది. కాని అర్థాంతర న్యాసములోఉన్న సమర్థ్య, సమర్థకములలోఒకటి సామాన్యమై రెండవది విశేషమై ఉండుట, దృష్టాంతములో బింబప్రతిబింబ భావము ప్రధానమై సామాన్యమును సామాన్యమే, విశేషమునువిశేషమే సమర్థించుట ప్రత్యేక లక్షణములని తెలియదగినది (హిం.సా.కో).

అర్థాపత్తి : అర్థాలంకారము. చంద్రాలోకము దీనిని 'కావ్యార్థాపత్తి' అనెను.

లక్ష. ఒక అర్థము సిద్ధింపగా దానిచే తుల్య కారణమువలన నిస్సంశయముగా, సహజముగా, ఇంకొక అర్థము సిద్ధించుట 'అర్థాపత్తి' ఉదా॥ తన హృదయమునే చీల్చుకొని వచ్చిన ఈ కలికి గుబ్బలు ఇతరుల హృదయమును చీల్చునని వేరుగచెప్పనేల? ఈ అలంకారము 'కైముతికన్యాయము' చే సిద్ధించినది (కిముత=వేరుమాట చెప్పనేల?). 'దండాపూపన్యాయము'చే అర్థాపత్తి సిద్ధించినది. ఎలుకలు దండమును భక్షించినవి అనుటచే దండమునందున్న అపూపములను గూడ భక్షించినట్లే అర్థము వచ్చును. ఈ అలంకారములో సిద్ధించు అర్థమటువంటిదే (కా సం. 5.పు. 681-82). జయదేవుడు దీనిని గుర్తించలేదు. మమ్మటాదులు దీనిని స్వతంత్రా లంకారముగా స్వీకరించలేదు. రుయ్యకాదులు గుర్తించి దీని భేదములు చెప్పిరి: సిద్ధించు అర్థము, ప్రకృతముచే ప్రకృతము; అప్రకృతముచే అప్రకృతము; ప్రకృతముచే అప్రకృతము; అప్రకృతముచే ప్రకృతము అని 4 విధములు. వీటిలో ఒక్కొక్కటి సిద్ధించు అర్థము యొక్క సమ-న్యూన-ఆధిక్యములు అను 3 భేదములచే $4 \times 3 = 12$. మరల అవి భావత్వ—అభావత్వములచే వెరసి 24. కువలయానందము దీనిని గురించి చెప్పినను, విశేషములకు అలంకార సర్వస్వము చూడదగినది (ఆ.వి.స. 2.పు. 503) - వాక్యన్యాయ మూలమైన అర్థాలంకారమిది. మొదట భోజుడు, తర్వాత రుయ్యకుడు దీనిని వివేచించిరి (హిం.సా కో.)

*అర్థాలంకారములు* : అర్థమును చమత్కృతము చేయువాటిని లేదా అలంకృతము చేయువాటిని అర్థాలంకారములనిరి. ఏదైనా ఒక అలంకారము ఉన్న వాక్యములో ఆపదములు మార్చి ఇతర పదములుంచినను పూర్వమున్న అలంకారత్వము చెడకున్నచో (శబ్దపరివృత్తిని సహించినచో) దానిని అర్థాలంకారముగా గుర్తించవచ్చు. ఈస్వభావమునకు భిన్నమైనది శబ్దాలంకారము. అనగా అర్థనిర్భరము, శబ్దనిరపేక్షము అయినది అర్థాలంకారమని సారాంశము. అర్థాలంకారములు లేని కావ్యములో శబ్దసౌందర్యమునకు మనోహరతగాని, ప్రభావ పూర్ణతగాని అబ్బదనిరి. 'అలంకరణ మర్థానా మర్థాలంకార ఇష్యతే, తం వినా శబ్ద సౌందర్యమపినాస్తి మనోహరమ్' (అగ్ని పు. 343) విశేషములకు చూ. శబ్దాలంకారములు.

*అలంకారము* : 'అలం' అనగా భూషణమని అర్థము. అలంకృతము చేయుదానిని, లేదా భూషితము చేయుదానిని అలంకారమనిరి. 'అలంకృతిః అలంకారః. కరణ వ్యుత్పత్త్యా పునః అలంకార శబ్దోఽయముపమాదిషు వర్తతే' (వామనవృత్తి 1.1.2). అలంకారము కావ్యమునకు బాహ్యశోభాకరమైన ధర్మము. ఈధర్మమునకు గల ఫలరూపము కావ్యమునలంకరించుటయే కాబట్టి 'అలంకారము' అనునది శబ్దార్థ సౌందర్యమునకు ప్రాచీనులు ఏర్పరచిన పేరు.

*అలంకారములసంఖ్య* : మొత్తము అలంకారములు ఇన్ని అని నిర్ధరించుట కష్టము: వాటి సంఖ్య పెరుగుచువచ్చినది. అప్పయదీక్షితుని తర్వాత కొత్త అలం

కారముల ప్రయోగము జరుగలేదనికాదు, వాటిని వింగడించిచూపు ఉత్సాహ మెవ్వరికి లేక పోయినదనవలె. 'అనంతాహి...అలంకారాః' (ధ్వన్యా.3-43 వృ.). 'వాగ్వికల్పము' అనంత విధముల సాగుచుండును కాబట్టి అలంకార భేదములు పెరుగుచునే ఉండును. తెలుగు నాట్య శాస్త్ర కర్త (నా.శా. 16 పు. 463) సేకరించిన అలంకార సంఖ్య ఇట్లున్నది: భరతుడు (క్రీ.పూ.200-క్రీ.శ. 300) తన నా.శా.లో పేర్కొన్న శబ్ద, అర్థ అలంకారములు 1+3=4; భామహుడు (క్రీ.శ. 600–750) తన కావ్యాలంకారములో పేర్కొన్నవిపై క్రమమున 2+36=38; దండి (క్రీ.శ.600–750) కావ్యాదర్శములోనివి 2+35=37; ఉద్భటుడు (క్రీ.శ. 750–850) కావ్యాలంకార సారసంగ్రహ ములో చెప్పినవి 4+37=41; వామనుడు (క్రీ.శ. 779-813) కావ్యాలం కార సూత్రములో చెప్పినవి 2+31=33; రుద్రటుడు (క్రీ.శ. 825-875) కావ్యాలంకారములోచెప్పినవి 5 + 68=73; భోజుడు (క్రీ.శ.1005-1054) సరస్వతీ కంఠాభరణములో చెప్పిన శబ్ద, అర్థ, మిశ్ర (ఉభయ) అలంకార ములు24+24+24=72; మమ్మటుడు (క్రీ.శ.1050-1101) కావ్యప్రకాశము లో భోజుని క్రమమున చెప్పినవి 6+59+2=67; రుయ్యకుడు (క్రీ.శ. 1135–1150) అలంకార సర్వస్వములో పై క్రమమున చెప్పినవి 9+73+2= 84; జయదేవుడు (క్రీ.శ. 1200–1250) చంద్రాలోకములో చెప్పిన శబ్ద, అర్థ అలంకారములు 6+100=106; విద్యానాథుడు (క్రీ.శ. 14వశ. ప్రథమ భాగము) ప్రతాపరుద్రయశోభూషణములో చెప్పిన శబ్ద, అర్థ, మిశ్ర అలం కారములు 5+66+2=73; విశ్వనాథుడు (క్రీ.శ. 1300–1380) సాహిత్య దర్పణములో చెప్పినవి పై క్రమమున 11+75+2=88; అప్పయ దీక్షితుడు (క్రీ.శ. 1554–1626) కువలయానందములో చెప్పినవి అర్థాలం కారములు మాత్రమే 124. ఉభయ (మిశ్ర) అలంకారముల వివేచన భోజునితో ప్రారంభమైనది. మమ్మట, రుయ్యక, విద్యానాథ, విశ్వనాదులు అతని వివేచనను పరిమితముగాపరిగణించిరి. అప్పయ దీక్షితుడు శబ్దాలంకారములను అసలే తడవలేదు. అలంకార వికాసములో వచ్చిపడిన క్రమ పరిణామదశలను, వాటిసంఖ్యా విశేషములను, వివిధ చర్చలను తెలియ గోరువారుహిం.సా.కో. చూడవచ్చు.

*అలంకారవర్గీకరణము* : ఉక్తివైచిత్ర్య భేదమును బట్టియే అలంకారములు ఒక్కొక్కటి తమ ప్రత్యేకతను తెలుపును. వీటి విభజనకు ఆధారమైన తత్త్వము భామహాలంకారములోనే పొడుకొన్నను, ప్రప్రథమముగా అలం కారములను ప్రథమ వర్గము, ద్వితీయ వర్గము అని ఇట్లు ఆరు వర్గములుగా విభజించిన ప్రయత్నము ఉద్భటునిదే. అతని విభజన ఆనాటికి సరిపడిన ఒక మామూలు పద్ధతి. అలంకారములను సశాస్త్రీయ దృష్టితో వర్గీకరించినమొట్ట మొదటి ప్రయత్నము రుద్రటునిది. ఆయా అలంకారముల మూలతత్త్వము

లను వివేచించిన రుద్రటుడు తననాటికి కనిపించిన అర్థాలంకారముల నన్నిటిని నాల్గు వర్గములలో ఇమిడ్చిచూపినాడు: వాస్తవవర్గము, ఔపమ్యవర్గము, అతిశయవర్గము, శ్లేషవర్గము: రుద్రటుడు (క్రీ శ. 825–875) విభజించిన అర్థాలంకారములు *1*. వాస్తవవర్గము. వాస్తవమనగా ఇట వస్తు స్వరూప కథనమని అర్థము. 'వాస్తవమితి తజ్ఞేయం క్రియతే వస్తు స్వరూపకథనమ్ యత్' (కావ్యాలంకారము. 7.10.). ఈవర్గములో చేరినవి 23: సహోక్తి–సముచ్చయ–జాతి – యథాసంఖ్య - భావ-పర్యాయ - విషయ-అనుమాన-దీపక - పరికర - పరివృత్తి - పరిసంఖ్యా–హేతు–కారణమాలా–వ్యతిరేక–అన్యోన్య–ఉత్తర–సార–సూక్ష్మ–లేశ–అవసర–మీలిత – ఏకావళులు. వీటి భేదముల సంఖ్య అధికము కాబట్టి ఈవర్గమునకు ప్రథమస్థాన మిచ్చినాడనవచ్చు. *2*. ఔపమ్య వర్గము: ఒకవస్తు వర్ణనమును స్పష్టతరముచేయుటకు దానికి సమమైన రెండవ (అప్రస్తుత) వస్తువును వర్ణించుట జరిగినది. ఆ'ఔపమ్యము' అలంకారమైనది. ఇది స్వరూపసామ్య కథనము. 'సమ్యక్ప్రతి పాదయితుం స్వరూపతో వస్తు తత్సమానమితి' (అదే 8.2.) ఈవర్గములో చేరినవి 21: ఉపమా– ఉత్ప్రేక్షా - రూపక - అపహ్నుతి - సంశయ - సమాసోక్తి - మత–ఉత్తర - అన్యోక్తి– ప్రతీప-అర్థాంతరన్యాస–ఉభయన్యాస-భ్రాంతిమాన–ఆక్షేప–ప్రత్యనీక–దృష్టాంత-పూర్వసహోక్తి–సముచ్చయ-సామ్య–స్మరణములు (ఒకటి తక్కువున్నది). *3*. అతిశయవర్గము: లోకవాడుకను బట్టి ఒక అర్థమునకుగాని, ధర్మమునకుగాని నియమముండును. ఆనియమమునకు విపర్యయముగా (తలకిందులుగా) చెప్పనది అతిశయాలంకారము 'యత్రార్థ ధర్మనియమః ప్రసిద్ధబాధాద్విపర్యయంయాతి' (అదే. 9.1.). ఈవర్గములో చేరినవి 12: పూర్వ-అసంగతి-పిహిత-విశేష-ఉత్ప్రేక్షా-విభావనా–తద్గుణ–అధిక–విరోధ–విషమ-వ్యాఘాత-అహేతు-అతిశయములు (ఒకటి ఎక్కువపడినది). *4*. శ్లేషవర్గము: అనేకార్థములైన పదములుగల ఒకే వాక్యము అనేకార్థ బోధకమైనచో అది శ్లేషాలంకారము. 'యత్రైకమనేకార్థైర్వాక్యం రచితం పదైరనేకస్మిన్, అర్థేకురుతే నిశ్చయమర్థశ్లేషః సవిజ్ఞేయః' (అదే,10.1) ఈఅర్థశ్లేష భేదములు 10: అవిశేష-విరోధ-అధిక-వక్ర - వ్యాజ–ఉక్తి–అసంభవ – అవయవ–తత్త్వ – విరోధా భాసములు (హిం.సా.కో.)–రుద్రటుని ఈచతుఃకక్షా విభాగము మిక్కిలి సరసమైనదని, స్వాభావికమైనదని కీ.శే. శ్రీకొమర్రాజు లక్ష్మణరావు అనిరి (ఆ.వి.స.2.పు. 480). రుద్రటుని తర్వాత రుయ్యకుడు (12వశ.) అలంకారముల మూల తత్త్వములను శోధించి వాటిని ఇంకను యుక్తి యుక్తముగా విభజించవలెనని తలచి ఐదువర్గము తేర్పరచినాడు. 1. సాదృశ్య గర్భములు 2. విరోధ మూలకములు 3 శృంఖలాబంధములు 4. న్యాయమూలములు 5. గూఢార్థ ప్రతీతి మూలకములు - విద్యాధరుడు (14వశ.) చేసిన విభజన ప్రకారము

అలంకార వర్గతత్త్వములు నాల్గు: 1. వస్తుప్రతీతి: సమాసోక్తి మొ. 2. ఔపమ్యప్రతీతి: రూపకము మొ॥ 3. రసభావప్రతీతి: రసవత్ మొ।. 4. అస్ఫుట ప్రతీతి: ఉపమాదులు. తర్వాతివారు రుయ్యకుని విభజననను సవరించి చెప్పిరి (హి.ంసా కో.) ఆయా అలంకారముల వర్గవిశేషములను ఈ కోశము చూపినది.

**అలంకారవికాసము :** ప్రాచీన విజ్ఞానమునకు ఆధారములైన వేదములలో శబ్దార్థ చమత్కృతులుగల ప్రయోగములున్నవి. అలంకారమని చెప్పకున్నను ఋగ్వేదము 'ఉపమ'ను పేర్కొన్నది (1-7-32-15; 5-3-34-9). నిరుక్తము తృతీయాధ్యాయము 'ఉపమ'ను వ్యాఖ్యానించినది. 'నిర్దేశన-ఆశీ' వంటి శబ్దములుగూడ పరిశీలించదగినవి. (హిం.సా.కో.) చూ. ఉపమాలంకార లక్షణము, ఉపమాభేదములు.

**అలంకారశాస్త్రము :** ప్రాచీన భారతీయులు లౌకిక వాఙ్మయమును కావ్య వాఙ్మయమని, శాస్త్ర వాఙ్మయమని రెండు విభాగములుగా పరిగణించిరి. కావ్య వాఙ్మయమునకుగూడ శాస్త్ర మేర్పడసాగినది. గార్గ్యుడు, యాస్కుడు మొ వారు 'ఉపమ'ను శాస్త్రీయ దృష్టితో చర్చించిరి. కావ్య వాఙ్మయమునకు ఏర్పడిన శాస్త్రమునే వాత్స్యాయనుడు 'క్రియాకల్పము' అన్నాడు. 'క్రియ' అనగా కావ్యగ్రంథమని 'కల్ప' మనగా విధానమని అర్థము. 'భామహాలంకారము' తర్వాతనే 'అలంకార శాస్త్రము' అను వ్యవహారము ప్రాచుర్యమున కెక్కిన దనవచ్చు. ఈ శాస్త్రమునే రాజశేఖరుడు 'సాహిత్యవిద్య' అన్నాడు. కావ్యసౌందర్య మునకంతకు అలంకారమే కారణమన్నవారి అధిక సంఖ్యా ప్రాబల్యమును బట్టి ప్రాచీనులు దీనిని అలంకార శాస్త్రమనిరి. దానినేనేడు సౌందర్య శాస్త్రమని కొందరు, కావ్యశాస్త్రమని కొందరు అనుచున్నారు (హిం.సా.కో.).

**అలంకార సంప్రదాయము :** కావ్యసౌందర్యమునకు అలంకారములే మూలకారణమన్నవారు అలంకార సంప్రదాయవాదులు. భామహాచార్యునితో ప్రారంభమైనదీ సంప్రదాయము. దీనికి అనుయాయులు బయలుదేరిరి. 'తదేవమలంకారా ఏవ కావ్యే ప్రధానమితి ప్రాచ్యానాం మతమ్' (అ.స.). భరతాదుల రససిద్ధాంతము, తర్వాతివారి ధ్వని సిద్ధాంతము, అలంకారవాదుల గ్రంథములలో అవి అలంకారాంతర్గతములైనవి. రుద్రటుడు (9వశ.) మూడువిధములైన ప్రతీయమానార్థములు (వస్తుధ్వని, అలంకారధ్వని, రసధ్వని) అలంకారములే అన్నాడు. 'తదిత్థం త్రివిధమపి ప్రతీయమాన మలంకారతయా'. ఈ సంప్రదాయ వాదులు రసముపేర, ధ్వనిపేర అలంకారములు కల్పించిరి. ధ్వని సంప్రదాయమువారు అలంకార వాదమును ఖండించి కావ్యాత్మ 'రస-ధ్వని' అనిరి.

**అలంకార్యము :** అలంకారము, అలంకార్యము ఈరెండు పదములను గురించిన

చర్చ ప్రాచీనమైనదే. భామహ-దండి-వామనాదులు వీటిని చర్చించి రెంటికి భేదము లేదనిరి. కావ్యాత్మ (కవితలో ప్రధానముగా గుర్తించ వలసిన అంశము) అలంకారమే అన్న పక్షమువీరిది. రస-ధ్వని సంప్రదాయవాదులు చర్చించి తేల్చిన దానిని బట్టి శబ్దార్థములు ప్రత్యక్షముగా, రసము మౌలికముగా 'అలంకార్యములు', ఉపమారూపకాదులు 'అలంకారములు'. ఉపమాది అలంకారములు రసరూపమైన అలంకార్యమును అలంకృతము చేయునని ఈపక్షమువారి అభిప్రాయము. మమ్మటుడు గూడ ఇదే పక్షమై చెప్పినాడు. 'ఉపకుర్వంతి తం సంతం యే ఽంగద్వారేణ జాతుచిత్, హారాది వదలంకారాస్తే...' (కా.ప్ర 8.67). హారములు, భూషణములు మొ. స్థూలముగా శరీర సౌందర్యమునకు పోషకములై అంతస్సౌందర్య వికాసమునకు తోడ్పడినట్లే అలంకారములు ప్రత్యక్ష రూపమున శబ్దార్థములను అలంకృతము చేయుచు మౌలికముగా రసమును వర్ధిల్ల జేయును. ఈసిద్ధాంతము ననుసరించి ఉపమాదులు అలంకారములై, శబ్దార్థములు ప్రత్యక్ష రూపమున, రసము మౌలిక రూపమున అలంకార్యములైనవి. పాశ్చాత్య కావ్య శాస్త్రజ్ఞులలో అభివ్యంజనావాదులు వస్తువును స్వాభావికముగా వర్ణించుటయే అలంకార్యము అనిరి. ఇదేవిషయమున కుంతకుని అభిప్రాయము తెలియదగినది. స్వభావ వర్ణనము అలంకారమైనది. అదే అలంకార్య మగుట అసంభవము. స్వభావవర్ణన అలంకారమే అగుచున్నదని, శబ్దార్థములు అలంకార్యములై అ రెంటికి వక్రోక్తి అలంకార మగుచున్నదని కుంతకుని అభిప్రాయము (హిం సా.కో.).

**అల్పము** : అర్థాలంకారము. లక్ష. సూక్ష్మమైన ఆధేయముకంటె సూక్ష్మతరమైన ఆధారము చెప్పినచో అల్పాలంకారము. ఉదా॥ వనితా! ఉంగరము నీ చేతికి జపమాల అయినది. చేయి ఆధారము, ఉంగర మాధేయము. చేయి కృశించినదని భావము. ఒక విరహిణిని గురించి అతిశయోక్తిగా చెప్పిన మాట కావచ్చుఇది (చంద్రా. 92). జయదేవుని అనుసరించి కువలయానందము దీనిని పేర్కొన్నది.

**అవజ్ఞ** : అర్థాలంకారము. లక్ష. ఒకవస్తువు యొక్క గుణమువలన ఇంకొక వస్తువుకు గుణము, దోషమువలన దోషము అంటనిచో అవజ్ఞ. గుణమువలన గుణము అంటకుండుటకు ఉదా (i) చెంబును సముద్రములో ముంచినను దానిలో ఇమడవలసినంత నీరేకముడును (అపారమైన జలము గలిగియుండుట సముద్రగుణము, అదిచెంబుకు రాలేదు). దోషమువలన దోషమంటకుండుటకు ఉదా (ii) పద్మములు ముకుళించినంత మాత్రమున అమృతకిరణుడైన చంద్రునకు కలుగు దోషము (నష్టము) ఏమియులేదు (చంద్రా. 133).-విశేషోక్తిలో అంతర్భూతము కాదగిన అలంకారము. ఉల్లాసాలంకారమునకు విపరీతము. చంద్రాలోకమే దీనికి స్వతంత్రాలంకారత్వము ఇచ్చినది (హిం.సా.కో.).

**అవయవములు** : ఉపమలో, ముఖ్యముగా పూర్ణోపమలో, ఆలంకారికులు గుర్తించినవినాల్గు అంగములు. వీటినే జయదేవుడు ఉపాదానములు అన్నాడు: 1. ఉపమానము, వర్ణించదలచిన వస్తువునకు పోలికగా తెచ్చుకొన్న మరొక వస్తువు. దీనినే అవర్ణ్యము, అప్రస్తుతము, అప్రకృతము, విషయి అని వ్యవహరించిరి. 2. ఉపమేయము, వర్ణించదలచిన వస్తువు. దీనినేవర్ణ్యము, ప్రస్తుతము, ప్రకృతము, విషయము అని వ్యవహరించిరి. 3. సమానధర్మము= సాధర్మ్యము లేదా సాదృశ్యము (పోలిక), ఏగుణమును బట్టి ఉపమానోపమేయములను పోల్చెదరో ఆగుణమునకే సమానధర్మము అనిపేరు. 4. ఉపమావాచకము, వాచకము అనగా శబ్దము. ఏ శబ్దము ఉపమానోపమేయముల సమానధర్మమును సూచించునో అదే ఉపమావాచకము. ఉదా॥ వలె, వంటి, భంగి, మాదిరి, కైవడి, మాడ్కి, పగిది, పోల్కి, తెరగున, విధమున, తీరున, క్రియ (కా.సం. 5.పు 570). ఈనాల్గు అవయవములు అమరిన లక్షణమున్నదే 'పూర్ణోపమ' (హిం.సా.కో.; ఆ.వి.సం 2). ఉదా. ఆ అబ్బాయి ముఖము చందమామవలె అందముగ ఉన్నది. ఉపమేయము (ముఖము), ఉపమానము (చందమామ), ఉపమా వాచకము (వలె), సమానధర్మము (అందము) ఈ నాల్గు అవయవములతో అమరినది కాబట్టిఇది పూర్ణోపమ. చూ. సాదృశ్యము—సాధర్మ్యములు.

**అవర్ణ్యము** : చూ. అవయవములు.

**అవాచకము** : పదదోషము. చూ. అన్యార్థము.

**అవిమృష్ట విధేయాంశము** : పదదోషము. వివ. ప్రధానమైన అర్థము విధేయముగా (అప్రధానముగా) తోచునట్లు చెప్పినచో ఆపదము లేదా సమాసము అవిమృష్ట విధేయము. ఉదా 'నవనవ సంఫుల్లలతాంతము, వసంతము'. దీనిలో 'వసంత' పదము ప్రధానార్థము అనువాద్యము, 'నవ...తము' అనునది విధేయము. విధేయపదము ముందై, అనువాద్యపదము తరువాతిదైనది. విధేయాంశస్థానమును విమర్శించుకొనక చేసిన ఇటువంటి ప్రయోగము దోషము. ఇట్లే 'వాడుమూర్ఖుడు': 'వాడు' అనువాద్యము, 'మూర్ఖుడు' విధేయము. దోషము లేని ప్రయోగమిది. 'మూర్ఖుడువాడు'- అన్నప్పుడు విధేయము మొదట అనువాద్యము తర్వాత వచ్చిపడినవి. ఇది దోషము (కా.సం.4.20).

**అవిశేషపరివృత్తము** : అర్థదోషము. వివ. విశేషములేకుండ చెప్పవలసిన చోట విశేషసహితముగా చెప్పుట దోషము. ఉదా సముద్రము వజ్రములకు నిధి అని చెప్పగూడదు. సముద్రము రత్ననిధి అనవలె (కా.సం.4. పు. 504).

**అశరీరము** : వాక్యదోషము. చూ. సాకాంక్షము.

**అశ్లీలము**[1] : అర్థదోషము. వివ. పాఠకులకు, శ్రోతలకు అసహ్యముగా తోచు అర్థము అశ్లీలము. ఉదా 'పద్మిని సరసాంగజ గృహము పద్మసౌరభము

గలది' (కా.సం.4,52) సరసాంగజ గృహము=తనసరసమైన అంగము పుట్టిన చోటు, అంగంజాయతే యస్మాత్ అని విగ్రహము: పద్మసరస్సు పద్మపరిమళముగలది అని తాత్పర్యము. కాని పద్మినీజాతి స్త్రీయొక్క మన్మథ గృహము పద్మపరిమళముగలదను అశ్లీలము వెంటనే తోచుచున్నది. ఇది దోషము (అదే. పు. 500).

**అశ్లీలము[2] :** పదదోషము, అనిత్యము. వివ. వినగానే అసభ్యమైన రెండవ అర్థమును స్ఫురింప జేయునది. అసభ్యార్థమును సూటిగానే తగిలించునది అశ్లీల పదము. ఇది మూడు విధములు: వ్రీడాకరము, జుగుప్సాకరము, అమంగళ శంకాకరము ఉదా॥ (i) ఆ జట్టులో 'గుద్ద'గల వారుకొందరు, గుద్దలేనివారు కొందరు (గుద్దుటకు చేతనైన వారని వక్త ఉద్దేశించినను వినునప్పుడు వ్రీడాకరము) (ii) గోపీనాథ్ అని పిలుచుటకు బదులు 'గోపీ' అనిపిలుచుటలో 'పీయి' అర్థముతోచు అవకాశమున్నది (ఇదిజుగుప్సాకరము) (iii)"అవిధవవుగా వర్ధిల్లుము" అని సుమంగళిని దీవించుట అమంగళ శంకాకరము —'నగుప్త, లక్షిత, సంవృతాని' అనివామనుడు గుప్తములై, లక్షితములై, సంవృతములైతోచు అసభ్యార్థములు అప్రసిద్ధములు కాబట్టి అవి దోషములు కావని వామనుడనెను. (నగుప్తలక్షిత సంవృతాని): బెల్లము=గుడము, పురుషచిహ్నము, అని గుప్తార్థము–జన్మభూమి=పుట్టిన దేశము, లక్షణచేగుహ్యార్థము–భగవతి, పూబోడి వీటిలో భగ, బోడి అనునవి సంవృతములు అనగా లోకవ్యవహారమున గౌరవప్రదములుగానే వినిపించుచున్నవి. ఇటువంటివి దోషములు కావు. (కా.సం.4.పు. 454–55).

**అసంగతి :** అర్థాలంకారము. లక్ష. కార్య కారణములు వేరువేరు స్థలము లందు గాని, విరుద్ధస్థలములందు గాని కనిపించునట్లు చెప్పుట అసంగతి. ఉదా। గాయపడిన వారికే ఆయాసముండునను మాటకల్ల. ఈచిన్నదాని చెక్కిలిపైగల దంతక్షతము సవతులకు వేదన కల్గించినది. జయదేవుడు ఒప్పిన ప్రకారము ఇది మూడు విధములు 1. కార్య కారణములకు విరుద్ధముగా భిన్న దేశ కాలపాత్రలలో చెప్పుట అసంగతి. దీనికిపై ఉదాహరణము. 2, ఒకచోట ఉచితముగా చేయవలసిన దానిని మరొకచోట చేయుటవలన అనుచితత్వము వచ్చినదని చమత్కరించి చెప్పుట అసంగతి ఉదా కృష్ణా! భూమిని అపారిజాతము (అప-అరి-జాతము) చేయగోరి స్వర్గమునే అపారిజాతముచేసితివి. (ఇంద్రుడు కృష్ణుని ఉపాలంభించినది) 3. ఒక కార్యము చేయ బూనిన వానికి వేరొక విరుద్ధ కారణమును వర్ణించుట అసంగతి ఉదా కృష్ణా! భూమిని ఉద్ధరించుటకు పూనిన నీవు తద్విరుద్ధముగా భూమిని ఉద్భేదించితివి (వరహావతారమున అని అర్థము. ఇదిగూడ ఇంద్రుడు కృష్ణుని ఉపాలంభించినదే).

**అసంభవము :** అర్థాలంకారము. లక్ష. అర్థనిష్పత్తికి (సిద్ధికి) అసంభావ్యత్వము

చెప్పుట అసంభవము. ఉదా। గొల్లపిల్లవాడు కొండనెత్తునని ఎవరెరుగుదురు!—(చంద్రా. 79) గొల్ల పిల్లవాడు కొండ ఎత్తుట అసంభవనీయము అనగా సంభవించునని ఊహించరానిది. అర్థనిష్పత్తి కొండ ఎత్తుట. ఇట్టి అసంభవనీయము సంభవమగునని ఎవరెరుగుదురు! అని సారాంశము. ప్రదీప—ఉద్ద్యోతముల వ్యాఖ్యలను బట్టి ఇది స్వతంత్రాలంకారము గాదు. 'విరోధాలంకారము'లో చేరినది (అ.వి.స.2) విరోధ మూలకమైన అలంకారము అని ప్రాచీనులు (హిం.సా.కో.).

అసమము : అర్థాలంకారము. లక్ష. ఉపమానమును సర్వథా నిషేధించుట అసమము. ఉదా సత్యభాషణమున హరిశ్చంద్రుని పోలినవాడులేడు. ఆయా గుణములందు ఆవస్తువుకు అదేసాటి దానివలె ఇంకొకటి లేదు అనిచెప్పుటలో వాచ్యచమత్కార మున్నది. అసమత్వము అనన్వయములోను ఉన్నను అక్కడ వ్యంగ్యమైన ఉపమానము నాశ్రయించి ఉన్నది. 'ఉపమానోపమేయత్వం యదేకస్యైవ వస్తునః' అని అనన్వయ లక్షణము. రూపక, దీపకాదులలో ఉపమ వ్యంగ్యము; అనన్వయములో ఉపమానము వ్యంగ్యము. 'అసమము'లోని ప్రకృత వస్తువు నందు వాచ్యచమత్కారమున్నది. జగన్నాథుడుతప్ప ఇతరు లెవ్వరును దీనిని గుర్తించలేదు. (అ.వి.స.2.పు.509).

అసమర్థము : పదదోషము, నిత్యము. వివ. ఒకపదమునకు యౌగికార్థములు (వ్యుత్పత్త్యర్థములు) రెండున్నను ప్రసిద్ధార్థమునందే దానిని ప్రయోగించుటమేలు. అప్రసిద్ధమైన అర్థమున ప్రయోగించినచో అసమర్థదోషమగును. ఉదా। సముద్రము అనుటకు బదులు 'శరధర' పదము, శంఖము అనుటకు బదులు 'పంకజ' పదము ప్రయోగించరాదు (కా.సం.4.8.) కాని శ్లేషలో ఇది సహ్యామే అనితెలియవలె.

అసమోపమ : అర్థదోషము. వివ. పోలిక బొత్తిగా కుదురనిది అసమోపమ. ఉదా 'హలధరుఁడు మేరుగిరి వోలెనలరును' (కా.సం.4.45). బలరామునకు మేరు పర్వతముతో సామ్యము బొత్తిగా కుదురనిది. బలరాముడు తెల్లనివాడు, నల్లని వస్త్రములు ధరించువాడు. మేరువు బంగారుకొండ, పచ్చని రంగు గలది. సామ్యము సమముగా లేనందున దోషము.

అసాధువు : పదదోషము. చూ. చ్యుతసంస్కారము.

అస్థానపదదోషము : వాక్యదోషము. చూ. వ్యాకీర్ణము.

అస్థానసమాసము : వాక్యదోషము. వివ. స్థానముగాని స్థానమున సమాసముపయోగించుట అస్థానసమాసము. ఉదా శత్రువులను నేనిపుడే దునిమెదననీ వీరుడు 'వికట భ్రుకుటీ విపుల క్రోధాంధుడయ్యెను' (కా.సం.4.59). వీరుని మాటలలో కోపము వ్యక్తము కావలసినది. అతని కోపోద్రేకమును తెలుపు మాటలు సమాసమునందు వేయవలె. అటులవేయక అతని కోపాకృతివర్ణనములో వేసిన సమాసము స్థానముగాని చోట పడినదనీ అది దోషమని మూల

కర్త చెప్పినది. ఒకానొకచోట ఇది గుణమని వ్యాఖ్యాత అన్నారు (అదే. పు.473).

*అస్ఫుట ప్రతీతము* : ప్రతీయమానము స్ఫుటముకానిది. విద్యాధరుని విభజనము ననుసరించి ఉపమాదులు 'అస్ఫుట ప్రతీతి' వర్గములో చేరినవి. అనగా ఉప మాదులలో ఏదియు ప్రతీయమానముగాదు (కా.సం.5.పు. 564).

*ఆక్షేపము* : అర్థాలంకారము. లక్ష. మొదట ఒక విషయమును చెప్పి దానికి చింతించి, చెప్పిన దానికి నిషేధము ఆభాసముగా చెప్పినచో ఆక్షేపాలంకా రము. ఉదా శ్వాస అనుమానముగా ఉన్నది, కాళ్ళు చేతులు చల్లబడినవి, చూపు నిలచి పోయినది, అయ్యో! ఆమె కథ ఇది—ఆసంగతి ఎందుకులే, ఇంకొక విషయము మాట్లాడుకొందము' (ర.గం) దూతిక నాయకుని వద్దకు వచ్చి నాయిక విరహస్థితిని చెప్పినది. అంతవరకు ఒక విషయము. 'ఆసంగతి ఎందుకులే' అని చెప్పినదానికి నిషేధము (ఈనిషేధము అవాస్త వమే). నాయకుని జిజ్ఞాస హెచ్చించుటయే దీని ఉద్దేశము. వట్టి నిషేధమా క్షేపముకాదు. అది వాస్తవము కానిది (నిషేధాభాసము)గా ఉండి, రెండవ అర్థమునకు పర్యవసించి, ఒక విశేషము స్ఫురింప జేసినచోటనే దీనికి అలంకా రత్వము వచ్చును. ఇది రెండు విధములు. 1. ఉక్తనిషేధాభాసము: అనగా ఒకసంగతి చెప్పి దానిని నిషేధించుట (పైనఇచ్చిన ఉదా ). 2. వక్ష్యమాణ నిషేధాభాసము: అనగా చెప్పదలచుకొన్నదానిని నిషేధించినట్లు చేసి తర్వాత ఆసంగతి చెప్పుట. ఈఅలంకారమునకు నానావిధ లక్షణము లేర్పడినవి (చూ. చంద్రా. 68-70, కా.సం. 5.168—170) దీనికి వామనుడు చెప్పినలక్షణము 'ప్రదీపము' తోసరిపడుచున్నది (అ.వి.స. 2. పు. 500).—(సాదృశ్యాగర్భ- గమ్యోపమ్యాశ్రయవర్గమునకు చెందిన అర్థాలంకారమిది.) ప్రాచీనులు వివేచించినదే. నిషేధమిషతో కనిపించు కవుల ఉక్తివైచిత్ర్యమిది. నిషేధా భాసమై చివరకు విధిరూపముగా పరిణమించుట దీనిలక్షణమని భామహాదుల నిరి. దీని రెండు భేదములు మమ్మటుడు చెప్పినవే. (విశేషములకు చూ.హిం. సా.కో.పు.96)

*ఆఖ్యాతోపమ* : అర్థ దోషము. వివ. ప్రసిద్ధముగాని వస్తువును ఉపమాన ముగా వేయుట ఆఖ్యాతోపమ. ఉదా 'వదనము కుముదము మాడ్కి నున్నది' (కా సం.4.45).ముఖమునకు కమలముఉపమాన మగుట ప్రసిద్ధము, కలువపూవును ఉపమానముగా వేయుట దోషము.

*ఆర్థి* : 'పూర్ణోపమ' మొదటి విభజనలో రెండు ప్రకారము లైనది (శ్రౌతి,ఆర్థి) తర్వాత 'శ్రౌతి' విధములు 3, 'ఆర్థి' విధములు 3, వెరసి పూర్ణోపమ భేద ములు 6. చూ. ఉపమా భేదములు (మమ్మటాదుల విభజన).

*ఆవృత్తిదీపకము* : అర్థాలంకారము. జయదేవుడు చెప్పిన ప్రకారము ఇదిమూడు విధములు *1. పదావృత్తిదీపకము.* లక్ష. దీపకములో పదము ఆవృత్తమగుట

దీని లక్షణము, ఉదా। 'వర్షత్యంబుదమాలేయం, వర్షత్యేషాచ శర్వరీ' (చంద్రా. 41). ఒక విరహిణి చెలికత్తెనుచూచి ఈమేఘమాల వర్షించుచున్నది, ఈరాత్రి వర్షప్రాయముగా ఉన్నది, అనుచున్నది. 'వర్షతి' అను ఒకే పదము - వర్షించుచున్నది, వర్ష (సంవత్సర) ప్రాయమగు చున్నది అను అర్థములతో—రెండు సార్లు ఆవృత్తి అయినది కాబట్టి ఇది పదావృత్తి దీపకము. *2. అర్థావృత్తిదీపకము.* లక్ష. అర్థములువేరై పదమొకటే ఆవృత్తి అయినట్లు మొదటి ఉదాహరణములో చూచితిమి. పదములు వేరైనను ఒకే అర్థము ఆవృత్తి అగుట ఈరెండవ దాని లక్షణము. ఉదా। కదంబములు వికసించెను, కొండమల్లెలు పూచెను. *'వికసించెను, పూచెను'* అనునవి పద భేదములే అయినను రెండుచోట్ల ఒకే అర్థము (విచ్చెను అను అర్థము) ఆవృత్తి అయినది. ఇట్టిది అర్థావృత్తి దీపకము. *3. పదార్థోభయావృత్తి దీపకము.* లక్ష. పదముతో పాటు అర్థము గూడ ఆవృత్తి అగుట దీని లక్షణము. ఉదా చాతకములు మదించు చున్నవి, నెమళ్ళు గూడ మదించు చున్నవి. 'మదించుచున్నవి' అను పదము, దాని అర్థము రెండును ఆవృత్తములయినవి. ఇట్టిది ఉభయావృత్తి దీపకము (చంద్రా. 41—45). ఆవృత్తి దీపకములో ప్రస్తుతా ప్రస్తుతముల ప్రసక్తిలేదు.

*ఉత్తరము* : అర్థాలంకారము. లక్ష. ప్రశ్నోత్తరముల గూఢాన్వయము కొంత, చిత్రాన్వయము కొంత కలిసి ఉత్తరాలంకారము. ఇది రెండు విధములు: *1. గూఢోత్తరాలంకారము.* (i) సమాధానమును బట్టి ప్రశ్ననూహించుకొనుట ఒకవిధము. ఉదా 'ఇవి మనవారి కుశలవార్తలు' (మనవారి బ్రతుకు లెట్లున్నవి? అను ప్రశ్న ఎవరో అడిగినట్లు ఊహ్యాము) (ii) ప్రశ్నోత్తరములు మాలా రూపముగా ఉండి సామాన్యులు చెప్పలేని సమాధానములుండుట ఇంకొొకపద్ధతి. ఉదా॥ ఏది విషమము? దైవగతి — ఏదిసుఖము? సుక్షత్రము - ఏది దుఃఖము? ప్రజలు దుర్వర్తనులుగా ఉండుట (భారతములో యక్ష ప్రశ్నలు దీనికి మంచి ఉదాహరణము). *2 చిత్రోత్తరాలంకారము.* (i) ప్రశ్న రూపములోనే ఉత్తరముండుట. ఉదా పూవులేమావి గుమ్మకు పొడమకుండు (పూవులు ఏమంవి గుమ్మకు పొడమకుండును? అని ప్రశ్న — పూవు లేమావి (లేతమామిడి) గుమ్మకు పొడమకుండును అని ఉత్తరము. ఏద్దీశునకు వాహనము' వంటివి ఇట్టివే. (ii) రెండు రకములైన ప్రశ్నలకు ఒకేమాట ఉత్తరముగా ఉండుట ఇంకొక పద్ధతి. ఉదా। రైతులు ఆశించునదేది? విడెమును దేనితో కొరుకుదురు? ఈ రెండు ప్రశ్నలకు 'పంట' అని ఉత్తరము (పంట=ఫలసాయము, దంతముచేత అని రెండర్థములు) — లోకన్యాయ మూలమైన అర్థాలంకారము. రుద్రటుడు మొదట వివేచించి వాస్తవవర్గములో చేర్చినాడు. జవాబులకు సంబంధించిన చమత్కారమే ఇందులో ఉన్నది (హిం.సా.కో.). వీటి శబ్దశ్లేషమూలకత్వము గూడ చూడదగినది.

ఉత్ప్రేక్ష : అర్థాలంకారము. లక్ష. ఉపమానగతములైన జాతి — క్రియా — గుణ—ద్రవ్యనిమిత్తములచే ఉపమేయమును ఉపమానముగా సంభావించుట (ఊహించుట) ఉత్ప్రేక్ష. దీని ప్రముఖ భేదములు మూడు 1. స్వరూపోత్ప్రేక్ష. ఇదే వస్తూత్ప్రేక్ష. లక్ష. ఒక వస్తువుకు ఇంకొకవస్తువు యొక్క తాదాత్మ్యము సంభావించుట వస్తూత్ప్రేక్ష. ఇది రెండు విధములు ఉదా (i) ఈ చీకటి చక్రవాకి యొక్క విరహాగ్నినుండి పుట్టిన పొగ అని తలచెద—(ఉక్తవిషయ వస్తూత్ప్రేక్ష) చీకటి నల్లగా ఉండును. పొగ నల్లగా ఉండును. ఉపమాన గుణము (పొగకుగల నల్లదనము) చీకటికి ఉండుటచే ఉపమేయమైన చీకటి ఉపమానముగా ఉత్ప్రేక్షింపబడినది. ఉదా (ii) అంగములకు పూతపూయుచున్నట్లు, ఆకాశము కాటుకను వర్షించుచున్నట్లు (చీకటివ్యాపించుచున్నది అని అర్థము. ఇట విషయము అనగా ఉపమేయమైన తమోవ్యాపనము చెప్పబడలేదు కాబట్టి అనుక్తవిషయ వస్తూత్ప్రేక్ష). 2. హేతూత్ప్రేక్ష. లక్ష. హేతువు కాని దానిని హేతువుగా భావించుట హేతూత్ప్రేక్ష. ఇదిరెండు విధములు ఉదా (i) కాంతా! నీమృదుపదములు భూమిపై మోపుటవలన అరుణములుగా ఉన్నవని తలచెద - పదములు సహజముగా ఎఱ్ఱనివి. వాటి ఎఱ్ఱదనమునకు హేతువుకాని భూనిక్షేపణము హేతువుగా చెప్పుట వలన హేతూత్ప్రేక్ష.చరణములకు భూనిక్షేపము సిద్ధముకాబట్టి ఇది సిద్ధ విషయము. ఉదా॥ (ii) యువతీ! నీముఖ కాంతిని పొందగోరి చంద్రుడు పద్మముతో విరోధము పెట్టుకొన్నాడు. - ముఖకాంతిని పొంద గోరుట హేతువుగా ఉన్నది. కాని చంద్రుడచేతనము, అట్లు కోరుట అసంభవము, హేతువు సిద్ధము కాదు, కాబట్టి అసిద్ధవిషయ హేతూత్ప్రేక్ష. 3. ఫలోత్ప్రేక్ష. లక్ష. ఫలముకాని దానిని ఫలముగా చెప్పినచో ఫలోత్ప్రేక్ష. ఇది రెండు విధములు: (i) సిద్ధవిషయ ఫలోత్ప్రేక్ష. ఉదా వనితా! కుచములను ధరించుటకై నీనడుము బంగారు గొలుసులచే బిగింపబడినట్లున్నది. ఇట నడుము కుచములను ధరించుట సహజసిద్ధమైన విషయమే. బంగారు గొలుసుగా అధ్యవసింపబడిన వళిత్రయముచే కాదు. కాబట్టి వళిత్రయ రూపమైన బంగారుగొలుసు కుచధారణమునకు ఫలముకాదు. ఇట్లు ఫలము గాని దానిని ఫలముగా ఉత్ప్రేక్షించుట వలన ఇది ఫలోత్ప్రేక్ష. కుచధారణము సిద్ధము కాబట్టి సిద్ధవిషయ ఫలోత్ప్రేక్ష. (ii) అసిద్ధవిషయ ఫలోత్ప్రేక్ష. ఉదా। సుందరీ! నీపదముతో ఐక్యము పొందుటకు పద్మము నీటిలో తపస్సు చేయుచున్నది - పద్మము 'జలవాసము' అను జలవాస తపస్సు చేయుటకు సుందరీ పదైక్య ప్రాప్తి ఫలము కానేరదు. ఆ ఐక్యప్రాప్తి సిద్ధించునది కాదుకాబట్టి ఇది అసిద్ధ విషయ ఫలోత్ప్రేక్ష (చంద్రా. 27-30). అధ్యవసాయ గర్భమైన అలంకారమిది. అభేద ప్రాధాన్యాలంకారములలో రూపకాదులు ఆరోపగర్భములు, ఉత్ప్రేక్ష. అతిశయోక్తి మొ . అధ్యవసాయ గర్భములు. ఉపమేయమును దిగమ్రింగుటచే, ఉపమానమునకును దానికిని ఏర్పడు అభేద ప్రతి

పత్తియే అధ్యవసాయము అని అలంకార సర్వస్వకారుని వివేచన. అభిన్నముగ ప్రతిభాసించు అధ్యవసాయము సిద్ధమని, సాధ్యమని రెండు విధములు. అసత్యమైన ఉపమానము సత్యముగా స్ఫురించినచో అదిసిద్ధము. ఉపమానము యొక్క అసత్యప్రతీతి ఉన్నచో అది సాధ్యము. మొదటిది ఉత్ప్రేక్షలో, రెండవది అతిశయోక్తిలో కనిపించును.

ఉపమానము ప్రసిద్ధమైనచో అది ఉపమాలంకారమని, అట్లుగాక అది అప్రసిద్ధమో, కవికల్పితమో అయినచో అది ఉత్ప్రేక్షాలంకారమని విద్యానాథాదులు వివేచించిరి. ఉత్ప్రేక్షకు గల వాచ్య, గమ్య (ప్రతీయమాన) భేదములు తెలియదగినవి. ఉత్ప్రేక్షా వాచకములు:— అటులు, పోలె, తలచెద, ఒకో! వంటిపదములు గలది వాచ్యోత్ప్రేక్ష. అవి లేనిది గమ్యోత్ప్రేక్ష. ఈ రెండిటి విభజనము అనేక విధములుగా ఉన్నది. (అ) వాచ్యోత్ప్రేక్ష భేదములు మొదలు 4. (జాతి, క్రియా, గుణ, ద్రవ్యములు) ఈ నాల్గు భావ-అభావభేదములతో 8. ఇవి గుణనిమిత్త - క్రియానిమిత్త భేదములతో 16. ఇవి ఉపాత్త- అనుపాత్త భేదములతో 32. ఇవి స్వరూప, హేతు, ఫల భేదములతో $32 \times 3 = 96$ వాచ్యోత్ప్రేక్షలు.(ఆ) గమ్యోత్ప్రేక్ష గూడ మొదలు జాతి—క్రియా - గుణ - ద్రవ్యములతో నాల్గు భేదములు. ఇవి స్వరూప, హేతు, ఫల భేదములతో $4 \times 3 = 12$. ఇవి భావ - అభావ భేదములతో $12 \times 2 = 24$. ఇవి గుణ-క్రియా భేదములతో $24 \times 2 = 48$. — ఇట్లు వాచ్యోత్ప్రేక్షలు 96, గమ్యోత్ప్రేక్షలు 48 వెరసి ఉత్ప్రేక్ష భేదములు144. విశేషములకు రసగంగాధరము, అలంకార కౌస్తుభము మొ॥ గ్రంథములు చూడదగినవి. (ఆ.వి.స.2.పు.193-94). సాదృశ్యగర్భ- అభేదప్రధాన-అధ్యవసాయ వర్గమునకు చెందిన అలంకారము. భామహాదులు దీనిని వివేచించి విభజించిన విధము వేరు (హిం.సా.కో.). విశేషములకు చూ.కా.సం.

**ఉదాత్తము :** అర్థాలంకారము. లక్ష. వస్తు సమృద్ధినిగాని, ఉదాత్తుల చరిత్రను అంగముగా (ఉపలక్షణముగా) గాని వర్ణించుట ఉదాత్తము. ఉదా॥ (i) రత్న స్తంభములలో కనబడు ప్రతిబింబములు ఆవరించిన రావణుని హనుమంతుడు అతికష్టము మీద తెలిసికొనెను (ఆంధ్ర. చంద్రా.) ఇట వస్తు సమృద్ధి వర్ణితమైనది. ఉదా। (ii) శివునికి, అర్జునునికి యుద్ధము జరిగిన పర్వత శిఖరమిది, (చంద్రా. 161). ఇక్కడ పర్వత శిఖరవర్ణనము అంగి, ఉదాత్తుల చరిత్ర అంగముగా వర్ణితమైనది - గూఢార్థ ప్రతీతి ముఖాలకమైన అలంకారము. ప్రాచీనులు వివేచించినదే. ఉదాత్తమనగా ఒక వస్తువును ఉత్కర్షముగా గ్రహించుట (హిం.సా.కో.).

**ఉదాహరణము :** అర్థాలంకారము. లక్ష.ఇది అర్థాంతర న్యాసాలంకారమునుపోలి ఉండును. దానియందువలె సామాన్యమును సమర్థించుటకు దీనియందువిశేష ముండును. ఆవిశేషము చూపుటకు నిదర్శనము, దృష్టాంతము వంటిపదములు

ఇందుండును. ఉదా। సద్గుణశాలి ఆపదలో ఉన్నను ఉపకారమే చేయును. మూర్ఛచెందినదైనను, చచ్చినదైనను మనకు ఉపకరించు పాదరసమే ఇందుకు నిదర్శనము - వలె, నిదర్శనము, దృష్టాంతము వంటిపదములు దీనిలోఉండును. అర్థాంతర న్యాసములో ఈపదములుండవు కాబట్టి వీటికి గల భేదము ఇట్లు తెలియవచ్చు. - 'నిదర్శన' 'దృష్టాంత' అలంకారములలోని రెండు వాక్యార్థములకు బింబప్రతిబింబభావ సంబంధమున్నది. దీనిలో అట్లు లేదుకాబట్టి ఇది స్వతంత్రాలంకారమని జగన్నాథుడు; 'వలె' వంటి పదములను బట్టి ఇది ఉపమాలంకారమే అని పూర్వులు అనిరి (ఆ.వి.స.2.పు.509).

*ఉన్మీలితము* : చూ. మీలితాలంకారము. ఉదా। (ii)

*ఉపమ* : అర్థాలంకారము. ఉపమ అనగా సాదృశ్యము. కనుక సాదృశ్య మూలకములై వికసించిన అలంకారముల కన్నిటికి ఉపమాలంకారము పాదైనది. లక్ష:— ఒక పదార్థమును మరొక పదార్థముతో పోల్చిచెప్పుట 'ఉపమ'. ఉదా॥. ఆ అమ్మాయి ముఖము చందమామవలె అందముగ ఉన్నది. ఇట్లు చెప్పుట వలన 1. ఉపమేయము (ముఖము) 2. ఉపమానము (చందమామ) 3. సమానధర్మము (అందము) 4. ఉపమా వాచకము (వలె); ఈ నాల్గు అవయవములు ఉన్నవి కావున ఇది 'పూర్ణోపమ'. నాల్గుఅవయవములలో ఒకటిగాని, రెండుగాని, మూడుగాని లోపించినట్లు చెప్పినచో అదిలుప్తోపమ అగును). పూర్ణోపమకు మరొక ఉదాహరణము 'కృష్ణా! నీకీర్తి హంసవలె ఆకాశగంగలో స్నానము చేయుచున్నది' (కువల;ఆ.వి.స.2;హిం సా.కో.).

*ఉపమ-అనన్వయ-ఉపమేయోపమ-రశనోపమ* : 1. ఉపమానోపమేయముల సామ్యము చెప్పుట ఉపమ. 2. ఒకే వస్తువు అదే ఉపమేయమై, అదే ఉపమానమై ఉండుట అనన్వయ లక్షణము. 3. వస్తువులు రెండు, ఒక దానికి రెండవదే సాటి మూడవది కాదనుట ఉపమేయోపమ లక్షణము (సుగంధి, నయనానంది, మదిరామదపాటలం; అంభోజమివ వక్త్రంతే త్వదాస్యమివపంకజం - భామహ. 3.38 - ఖమివజలం జలమివఖం, హంసశ్చంద్ర ఇవ హంస ఇవచంద్రః; కుముదాకారాస్తారా స్తారాకారాణి కుముదాని — అలం.స.). 4. ఉత్తరోత్తరముగా ఉపమేయమునకు ఉపమానత కలుగుచుండుట రశనోపమ లక్షణము: (చంద్రాయతే శుక్ల రుచాపి హంసో, హంసాయతే చారుగతేన కాంతా; కాంతాయతే స్పర్శసుఖేనవారి, వారీయతే స్వచ్ఛతయా విహాయః — (సా.ద. కాణేవ్యాఖ్య 10 పు111). '...పతికి, ఫణితివలె మతి, యమ్మతిభాతి చేత,చేత వలెఁగీర్తి స్వచ్ఛమైచెలఁగుచుండు (కా.సం.పు. 582).

*ఉపమలసంఖ్య* : 1. భరతముని చెప్పిన ఉపమా భేదములు 5, (2.) ఆచార్య దండి చెప్పినవి 32.(3) మమ్మటాదులు చెప్పినవి 25 (విశేష భేదములు5). విశేష భేదములు ఐదింటిని దండిచెప్పిన సంఖ్యతో గుణించినపుడు ఉపమా

భేదములు 160, మమ్మటాదుల సంఖ్యతో గుణించి నపుడు ఉపమాభేద ములు 125. చూ. ఉపమా భేదములు - ఇంకొక విభజన.

*ఉపమాదోషములు* : ఉపమానోపమేయముల వర్ణనలో ఏర్పడు దోషములు ఉపమా దోషములు. ఇవిపది. 1. జాతిగత న్యూనత్వము: బంగారమును ఇత్తడితో పోల్చుట, ఉత్తములను అధములతో పోల్చుట. 2. జాతిగతాధి క్యము. పైదానికి వ్యత్యస్తము. 3. ప్రమాణగత (పరిమాణగత) న్యూ నత్వము: సూర్యుని నిప్పుకణముతో పోల్చుట 4. ప్రమాణగత- ఆధిక్యము: పైదానికి వ్యత్యస్తము. నాభిపాతాళమువలె ఉన్నదనుట మొ . 3,4 సంఖ్య గలవి కవిసమయ ప్రసిద్ధిని బట్టి దోషములు కావనిరి. 5. ధర్మగత న్యూ నత్వము: రెంటిలో ఒకవస్తు ధర్మమును తక్కువచేసి చెప్పుట 6. ధర్మగత— ఆధిక్యము: రెంటిలో ఒకవస్తు ధర్మమును ఎక్కువచేసి చెప్పుట 7. లింగ భేదము: ఉపమానోపమేయములకు, విశేషణ విశేష్యములకు లింగభేదము చెప్పుట 8. వచన భేదము: లింగ భేదము వలెనే వచన భేదము చెప్పుట 9. అసాదృశ్యము. సదృశములుగాని వస్తువులను పోల్చుట 10. అసంభవము. అసంభవములైన వాటితో ఉపమించుట. మొ॥. కవి సంప్రదాయమును బట్టి లింగ, వచన భేదములు గూడ దోషములు కావని దండి సమర్థించినాడు (కా.సం.5.పు. 583-87).

*ఉపమానము* : చూ. అవయవములు.

*ఉపమాప్రయోజనములు* : ఇవి మూడు 1. స్తుతి, ఎవరినైనను స్తుతిచేయు సందర్భమున 'ఉపమ'ను ఉపయోగించి యుక్తమైన అర్థమును, ప్రయోజన మును సాధించవచ్చు. ఉదా ప్రేమగల భార్య అమృతము వంటిది. ఇట్లే ఇతరములు 2. నింద, ఉదా . సంపద మద్యము వంటిది. 3. బోధ, ఉదా॥. ఆకాశములో బండివలె కనిపించు చుక్కల వరుసయే రోహిణీ నక్షత్రము. (ఆ.వి.స. 2. పు. 485).

*ఉపమాభేదములు* : ఉపమ అలంకారముగా వికసించిన ప్రకారము 'అలంకార వికాసము' అను ఆరోపము (ఎంట్రీ) లో కొంత చూడదగినది. భరతముని చెప్పిన ఉపమా భేదములు 5:-1. *ప్రశంసోపమ*, ఉదా బహుకష్టసాధ్యమై మూర్తిమంతమైన సిద్ధిని చూచి సంతోషించెడి మునివలె ఆవిశాలాక్షినిచూచి రాజు సంతోషించెను (ఉపమానమును ప్రశంసించిన విధమిది). *2. నిందో పమ*, ఉదా వనమునందు దావదగ్ధమైన కంటకిత ద్రుమమును లత ఆశ్ర యించు కొన్నట్లు ఆమెసర్వగుణ హీనుడైన కర్కశ స్వరూపుని ఆశ్రయించి ఉన్నది (ఉపమానమును నిందించిన విధమిది) *3. కల్పితోపమ*, ఉదా దాన జలములను స్రవింపజేయుచున్నవై, లీలా మంథరగాములైన మతంగజ ములు జంగమ పర్వతములవలె విరాజిల్లు చున్నవి (ఉపమానమును కల్పిం చిన విధమిది). *4. సదృశోపమ*, ఉదా పరచిత్తానురోధివగు నీవు నేడు

చేసినపని అతిమానుష కర్ముడవగు నీకేతగినది. (ఇక్కడ ఉపమేయమునకే ఉపమానత్వము కల్పించుట జరిగినది). *5. కించిత్ సదృశోపమ,* ఉదా॥ సంపూర్ణ చంద్రవదన, నీలోత్పల దళేక్షణ, మత్తమాతంగ గమన అయిన ఈ నాసఖి ఇదే వచ్చినది (సాదృశ్యమును సమాసములో ఇమిడ్చిన విధమిది) తానుచెప్పిన ఉపమా లక్షణములు సంగ్రహములని కావ్యములనుండి, లోకమునుండి గ్రహించ దగిన లక్షణములు, భేదములనేకములున్నవని భరతుడన్నాడు (నా.శా. 16.పు. 451).

*దండి:ఉపమాభేదములు:-* సాదృశ్య గర్భములైన అలంకారములన్ని ఉపమా భేదములే అని ఎందరో ఒప్పుకొనిరి. సమానధర్మ భేదములను బట్టి దండి చెప్పిన ఉపమాభేదములు 32:-

1. ధర్మోపమ: ఉదా చెలీ! నీ అరచేయి పద్మమువలె ఎఱ్ఱగ ఉన్నది. 2. వస్తూపమ: ఉదా నీముఖము పద్మమువలె ఉన్నది (దీనిలో ధర్మము ప్రతీయమానము) 3. విపర్యాసోపమ: ఉదా నీముఖమువలె పద్మము వికసించి ఉన్నది (దీనినే ఇతరులు ప్రతీపాలంకారము అనిరి). 4. అన్యోన్యోపమ: ఉదా నీముఖము పద్మమువలె, పద్మము నీముఖమువలె ఉన్నది (దీనినే ఇతరులు ఉపమేయోపమ అనిరి). 5. నియమోపమ: ఉదా నీముఖము కమలమునే పోలును, ఇంకొక దానిని పోలదు. 6. అనియమోపమ: ఉదా నీముఖము పద్మమును అనుకరించుచున్నది, దానిని అనుకరించు ఇతర పదార్థములుండిన ఉండుగాక. 7. సముచ్చయోపమ: ఉదా కాంతిచేతనే కాక ఆహ్లాదకత్వము చేతగూడ నీముఖము చంద్రుని పోలుచున్నది. 8. అతిశయోపమ: ఉదా నీముఖమును నీయందే చూచితిని, చంద్రుని ఆకాశమందేచూచితిని. 9. ఉత్ప్రేక్షితోపమ: ఉదా ఈమె ముఖసౌందర్యము నాయందే కలదని చంద్రుడు గర్వించ నక్కరలేదు. పద్మములో కూడ అది ఉన్నది. 10. అద్భుతోపమ: ఉదా॥ పద్మము విభ్రాంతనయనమైనచో నీముఖ సౌందర్యమును పొందవచ్చు. 11. మోహోపమ: ఉదా బిత్తరి! చంద్రుని చూచి నీముఖమనుకొని దానివైపునకు పోయితిని 12. సంశయోపమ: ఉదా ఇది లోపల తిరుగుచున్న భ్రమరములు గలపద్మమా? లోలేక్షణములు గల నీముఖమా? అని నాచిత్తము డోలాయమానమగుచున్నది. 13. నిర్ణయోపమ: ఉదా చంద్రుడు నిగ్రహింపగల పద్మకాంతి చంద్రునికి సిగ్గు కల్గించునదిగా ఉండదు. చంద్రుడే సిగ్గు పడగల కాంతి గలది కావున ఇది నీముఖమే. 14. శ్లేషోపమ: ఉదా॥ నీముఖము శిశిరాంశు ప్రతి స్పర్థియై, శ్రీగలదై, సురభిగంధియై పద్మమువలె ఉన్నది. 15. సమానోపమ: ఉదా ఈ ఉద్యానమాల బాలికవలె సాల కాననశోభిని (సాలవృక్షములశోభ, కురులతో గూడిన ముఖశోభ ఈరెంటికి సమానత్వము ఊహించవచ్చు). 16. నిందోపమ: ఉదా॥ కమలము పరాగ పూర్ణము, చంద్రుడుక్షయి, నీముఖము వాటితో సమానమైనను, వాటికంటె ఉత్కర్ష శాలి. 17. ప్రశంసోపమ:

ఉదా॥ బ్రహ్మకు పుట్టినిల్లయిన పద్మము; శివుడు శిరస్సునధరించు చంద్రుడు నీముఖముతో సమానములు. 18. అచిఖ్యాసోపమ: ఉదా॥ నీముఖముచంద్రుని తో సమానమని నా అభిప్రాయము. అదిగుణమో! దోషమో! 19. విరోధోపమ: ఉదా శతపత్రము, శరచ్చంద్రుడు, నీముఖము ఈ మూడింటికి పరస్పర విరోధమున్నది. 20. ప్రతిషేధోపమ: ఉదా॥ కళంకి, జడుడు అయిన చంద్రునకు నీముఖముతో ప్రతిస్పర్థించు శక్తి ఎప్పుడును ఉండదు. 21. చటూపమ:- ఉదా॥ నీముఖము మృగేక్షణాంకితము; చంద్రుడా, మృగాంకితుడు అయినను నీతోసమానుడే కాని అధికుడుగాడు. 22. తత్త్వాఖ్యానోపమ: ఉదా। ఇది పద్మము కాదు, ముఖమే; ఇవి తుమ్మెదలుకావు, కన్నులే. 23. అసాధారణోపమ: ఉదా। చంద్ర - అరవిందములు కాంతి నతిక్రమించి నీముఖము తనకు తానేసాటి అయినది. 24.- అభూతోపమ: ఉదా॥ ఒక చోట కుప్పవోసిన అన్ని పద్మముల కాంతిపుంజమువలె నీముఖము శోభించుచున్నది (దీనిని కొందరు ఉత్ప్రేక్ష అనిరి). 25. అసంభావితోపమ:- ఉదా నీ ముఖము నుండి కఠిన వాక్యములు వచ్చుట; చంద్రబింబము నుండి విషము వచ్చుటవలె, చందనమునుండి అగ్ని వచ్చుటవలె ఉండును. 26. బహూపమ: ఉదా చందనోదకము, చంద్రాంశువు, చంద్రకాంతము మొ॥ వాటివలె నీస్పర్శ చల్లగా ఉండును. 27. విక్రియోపమ: ఉదా॥ సుందరి! నీముఖము చంద్రబింబము నుండి త్రవ్వి తీసినట్లు, పద్మము యొక్క గర్భము నుండి లాగి తీసినట్లు ఉన్నది. 28. మాలోపమ: ఉదా ఎండ సూర్యునకు, సూర్యుడుపగటికి, పగలు ఆకాశమునకు సౌందర్యమును గూర్చినట్లు, విక్రమము నీయందు లక్ష్మిని గూర్చినది. 29. వాక్యార్థోపమ:- ఇదిరెండు విధములు. ఉపమా వాచకము ఒకటే ఉన్నది ఒక భేదము, ఒకటి కన్నమించి యున్నది మరొకభేదము. ఉదా (i) చంచలనేత్రములు, పొటమరించిన దంతకాంతిగల నీముఖము - భ్రమద్భృంగము, ఈషల్లక్ష్య కేసరములు గల పంకజమువలె తోచుచున్నది. ఉదా। (ii) ఆచెలి తామర తీగవంటిది. మధుకరము వంటినేను, పద్మము వంటిదాని ముఖమునకే మరిగితిని. 30. ప్రతివస్తూపమ: ఉదా రాజులలో నీవంటి వాడులేడు. పారిజాత వృక్షము రెండవ రకమైనది లేనేలేదుగదా! 31. తుల్యయోగోపమ: ఉదా రాజా! స్వర్గమును రక్షించుటకు ఇంద్రుడు, భూమిని రక్షించుటకు నీవు జాగరూకులై యున్నారు. అతడు అసురులను, నీవు అధికార మదాంధులను నిర్మూలించుటలో నిపుణులు, 32. హేతూపమ: ఉదా రాజా! నీకాంతి చంద్రుని, తేజస్సు సూర్యుని; ధైర్యము సముద్రుని అనుకరించినది.

మమ్మటాదుల ఉపమా భేదములు:- మమ్మటుడు చెప్పిన ఉపమా భేదములు - పూర్ణ, లుప్త - వాటిభేదాంతరములు (పూర్ణకు 6 లుప్తకు 19) వెరసి 25. మమ్మటుని కావ్య ప్రకాశముపై 'ఉద్యోతము' అను వ్యాఖ్యను రచించిన నాగేశభట్టు ఈ పూర్ణ, లుప్త వంటి విభజన వ్యాకరణ విషయమే

కాని అలంకార విషయము కాదనెను ('వస్తుతోఽయం పూర్ణా,లుప్తావిభాగో వాక్య, సమాస;క్యచ్, క్యజాది ప్రత్యయ విశేష గోచరతయా శబ్దశాస్త్ర వ్యుత్పత్తి కౌశల పరత్వాదత్ర శాస్త్రేన వ్యుత్పాద్యతా మర్హతీ త్యాహు:' ఉద్యోతము). అయినను మమ్మటుడు మొదలు తెలుగులో భట్టుమూర్తి వరకు ఒక వర్గమువారు ఈ విభజనను పేర్కొనిరి. దీని నిక్కడ దిక్ ప్రదర్శన ముగ చూడవచ్చు. ఉపమ మొదలు రెండు విధములు: 1. పూర్ణ: అవయవ ములు నాల్గు కలసి వచ్చినది పూర్ణ. ఉదా॥ ఆ అమ్మాయి ముఖము చంద మామవలె చక్కగ ఉన్నది. 2. లుప్త: ఉపాదానములు నాల్గింటిలో ఒకటి గాని, రెండుగాని, మూడుగాని లోపించినది లుప్త. ఉదా ఆ అమ్మాయి ముఖము చందమామవలె ఉన్నది. దీనిలో సమానధర్మము లోపించినది.

'పూర్ణోపమ' మొదలు రెండువిధములు:-'శ్రౌతి','ఆర్థి'-శ్రుతి మాత్రము వలననే ఇది 'ఉపమ' అని బోధపడెనేని అది 'శ్రౌతి'; అర్థమువలనబోధపడు ఉపమ 'ఆర్థి'. సంస్కృతమున *ఇవ, యథా* మొ॥ శబ్దముల వలనగాని, వతి ప్రత్యయము వలన గాని బోధపడు ఉపమ 'శాబ్ది'. తుల్య, సదృశాది శబ్ద ములు ప్రయోగించినను వత్యర్థక కల్పప్రత్యయము వలనను 'ఆర్థి'అగును. 'చంద్రఇవ సుందరంముఖం' (చంద్రునివలె చక్కని ముఖము) అనునది 'శ్రౌతి' - 'చంద్రేణ తుల్యంముఖం' (చంద్రునితో తుల్యమగు ముఖము) అనునది 'ఆర్థి'. ఈ'వతి' ప్రత్యయమువలన కలుగునది కేవలము సంస్కృత వ్యాకరణము ననుసరించిన భేదమే. ఈభేదము తెలుగు 'ఆర్థి'లో సంభవిం చదు. ఎందుకనగా, సంస్కృతములోవలె వతి ప్రత్యయముతో ఏర్పడు తెలుగు తద్ధితరూపము లేదు. దానికి బదులుగా తెలుగులో 'కల్ప' ప్రత్య యమును ఉపయోగించ వచ్చునని భట్టుమూర్తి అన్నాడు (క అలతద్ధితముల యందున్, దెలియ వతి ప్రత్యయంబు తెలుగున లేమిన్, గలిగిన కల్ప ప్రత్యయ మలరుచు నయ్యార్థియంద యదిగన్పట్టున్-కా సం.5.11.). తెలు గులో 'తద్ధితగత పూర్ణార్థి'ని చంద్రకల్పుడు, మేరుకల్పుడు వంటి ప్రయో గములలో చూచుకొనవచ్చు. తెలుగులో వలె, పోలె మొ॥. ఉపమావాచ కములు 'శ్రౌతి'కి; జోడు - పోలిక - సరి - సంగడి - ఉద్ది - ఈడు-సాటి- పగిది - కరణి మొ . 'ఆర్థి'కి సూచకములని చెప్పవచ్చు. తెలుగులో పూర్ణ- శ్రౌతికి ఉదా॥. అధిపుడు కందర్పుడును బోలె అలరుచుండు. ఈపూర్ణ - శ్రౌతి తిరిగి వాక్యగతము, సమాసగతము, తద్ధితగతము అని మూడు విధ ములు. పూర్ణ - ఆర్థికి ఉదా . అధిపుడు శౌర్యమునందు రఘురామ సన్ని భుడు. ఇదిగూడ వాక్యగతము, సమాసగతము, తద్ధితగతము అని మూడు విధములు (చంద్రునివలె అన్నప్పుడు వాక్యగతము, చంద్రోపముడు అన్న ప్పుడు సమాసగతము, చంద్రకల్పుడు అన్నప్పుడు తద్ధితగతము). పూర్ణ - శ్రౌతిలోగల మూడు విధములను అక్కడి, ఉపమ వాక్యగతమా? సమాస గతమా? తద్ధిత (కల్పప్రత్యయ) గతమా అని ప్రశ్నించుకొని తేల్చుకొన

వచ్చు. అశ్లేపూర్ణ - ఆర్థిలోగల మూడు భేదములను తెల్పుకొనవచ్చు. ఇట్లీ పూర్ణోపమ (శ్రౌతి 3, ఆర్థి 3) మొత్తము భేదములు 6.

లుప్తోపమ మొదటి విధములు 7: 1. ఉపమానలుప్త 2. ధర్మలుప్త 3. వాచకలుప్త (ఈమూటిలో ఉపమేయము లోపింపదు.) 4. ధర్మ-వాచకలుప్త 5. ధర్మ-ఉపమానలుప్త 6. వాచక-ఉపమేయలుప్త 7. ధర్మ-ఉపమాన - వాచకలుప్త. పూర్ణోపమకు చెప్పిన అవయవములు నాల్గింటిలో 1-3 వరకు ఏదిలోపించినను 'లుప్తోపమ' అగును. లోపించిన అవయవమును బట్టి, అవయవ సంఖ్యను బట్టి పరిశీలించి లుప్తోపమకు లక్షణోదాహరణములు చూచుకొనవచ్చు. ఈ 7 భేదములుతిరిగి 19 భేదములైన ప్రకారమిది: ఉపమానలుప్తలు 2 (వాక్యగ,సమాసగ); ధర్మలుప్తలు 5 (వాక్యగతశ్రౌతి, వాక్యగతార్థి, సమాసగతశ్రౌతి, సమాసగతార్థి, తద్ధితగతార్థి); వాచకలుప్తలు6(సమాసగత,కర్మక్యచ్ గత,ఆచారక్యచ్ గత,క్యఙ్గత.కర్మణముల్గత, కర్తృణముల్గత); ధర్మవాచకలుప్తలు 2 (క్విబ్గత, సమాసగత), ధర్మోపమానలుప్తలు 2 (వాక్యగ, సమాసగ); వాచకోపమేయలుప్త 1 (క్యచ్ ప్రత్యయము ఉండబట్టి) త్రిలుప్త 1 (ఉపమాన, ఉపమావాచక, సాధారణ ధర్మము ఈమూడులోపించినది). లోపించిన అవయవమును బట్టిసాదృశ్య - సాధర్మ్యములను ఇముడ్చుకొన్న వాక్య, సమాస, ప్రత్యయాదులను బట్టి ఈ 19 భేదముల లుప్తోపమల లక్షణోదాహరణములను గ్రహించవచ్చు (కా.ప్ర.10.).

*ఉపమా భేదములు—ఇంకొకవిభజన:-* విభాగప్రియులు ఉపమకు చూపిన అవాంతర భేదములు 5: *వ్యంగ్యావస్తూపస్కారిక:—* వ్యంగ్య రూపమున ఉన్న వస్తువునకు ఉపస్కారముకాగల ఉపమ (సదృశార్థము), ఉదా ఎల్లప్పుడును పరోపకారచింతయేకలిగి పరిశుద్ధమైన అంతఃకరణములు గల మహాత్ముల వచనములు ఔషధములవలె మొదట చేదుగా తోచును (మహాత్ముల వచనములు 'ఔషధములవలె' అను ఉపమ, 'పరిణామమున సుఖప్రదములగును' అనువ్యంగ్యార్థము వ్యక్తముచేయును. (ర.గం). *వ్యంగ్యాలంకారోపస్కారిక:—* వ్యంగ్యరూపమున ఉన్న అలంకారమునకు ఉపస్కారముకాగల ఉపమ (సదృశార్థము), ఉదా మచ్చవలె ఉన్నకస్తూరి బొట్టుగల నీముఖమును చూచి బాలచకోరములు ఉల్లాసముచే వికసించిన రెక్కలనుండి చంచూపుటములు కదలించుచున్నవి ('మచ్చవలె' అనునది ఉపమ, బాలచకోరములు ఆశపడుటచే ముఖము చంద్రుడని వ్యంగ్యార్థమును వ్యక్తముచేయుచున్నది. కస్తూరిబొట్టు చంద్రునిలోని మచ్చగా ఆరోపితమైనది. (ర.గం.). *వ్యంగ్యరసోపస్కారిక:-* వ్యంగ్యరూపమున ఉన్నరసమునకు ఉపస్కారము కాగల ఉపమ (సదృశార్థము), ఉదా అచ్చట పెద్దలున్నందు వలన సిగ్గు పడుచు నన్ను చక్కగా చూచుటకువీలులేక ఆచెలి ఓరచూపులను విసరెను. విచ్చీ విచ్చని కమలములను బోలిన ఆకన్నులను నేను మరువగలనా? 'కమలము

లను బోలిన' అనునది ఉపమ. ఆకన్నులను నేను మఱువగలనా? అనుచోట విప్రలంభ శృంగారము ధ్వనింపచేయుచున్నది (ర.గం.). *వాచ్యవస్తూపస్కారిక:—* వాచ్య రూపమున ఉన్న వస్తువునకు ఉపస్కారముకాగల ఉపమ (సదృశార్థము), ఉదా శరత్కాల చంద్రుని వంటి నీముఖము నాకనులను శిశిరములుగా జేయుగాక 'శరత్కాలచంద్రుని వంటి, అనునది ఉపమ, కనులు శిశిరములుగా ఆశించుట అను వాచ్యమునకు ఉపస్కారకము (ర.గం.). *వాచ్యాలంకారోపస్కారిక:—* వాచ్య రూపమున ఉన్న అలంకారమునకు ఉపస్కారమైన ఉపమ (సదృశార్థము), ఉదా శిశిరముచే సరోరుహము, పగటిచే చంద్రమండలమువలె చక్కనిదే అయినను నీ ముఖము రోషముచే శోభించుటలేదు (ఇక్కడ దీపకాలంకారము వాచ్యము, ఉపమాలంకారము ఉపస్కారకము (ర.గం.). ఈ ఐదువిశేషభేదములను దండిచెప్పిన 32 భేదములతో గుణించి ఉపమాభేదములు 160 అను పక్ష మొకటి; మమ్మటుడు చెప్పిన 25 భేదములతో గుణించి ఉపమా భేదములు 125 అనుపక్షమింకొకటి (ఆ.వి.స.2.పు. 489). ఇక కా.సం. పేర్కొన్న ఉపమా భేదములు గూడ తెలియదగినవి. ఇవి ఆరు:

*1. వస్తుప్రతివస్తూపమ.* లక్ష. పూర్ణోపమలో సాధారణ ధర్మవాచక మొకటి మాత్రమే ఉండును. దీనిలో అవిరెండుండును. ఉదా నరసరాయలు జన్మించుటతో సూర్యవంశము కొత్తగా వికసించు నందనవనమువలె 'పరిష్కృతమైనది, భూషితమైనది': చివరిరెండు సాధారణ ధర్మవాచకములు. *2. బింబప్రతిబింబోపమ.* లక్ష. ఉపమేయమునకు కొన్ని ధర్మములు, ఉపమానమునకు కొన్ని ధర్మములు, భిన్నశబ్దములచే భిన్నార్థకములుగా చెప్పి వాటిపరస్పర సాదృశ్యములతో అభేదాధ్యవసాయము చేయుట. ఉదా శౌర్యయుతమై, ఆయత కరవాలమైన నరసరాజు హస్తము ఫణామణి కాంతియుతమై దీర్ఘజిహ్వాయుత మైన సర్పమువలె ఉన్నది. 'శౌర్య - ఫణామణికాంతి' ధర్మముల సాదృశ్యము గ్రహించవచ్చు. *3. సమస్త వస్తు విషయోపమ.* లక్ష. ఉపమానోపమేయములు సర్వావయవ వ్యాప్తములై ఉండుట. ఉదా ఆయువతితామర తీగవలె, దాని ముఖము తామరపూవువలె, దానిప్రియుడు గండు తుమ్మెదవలె ఉండుటలెస్స. *4. ఏకదేశవర్తినీ-ఉపమ.* లక్ష. ఉపమించి చెప్పక ఉపమను స్ఫురింపజేయుటవలన సర్వావయవ వ్యాప్తిలోపించి ఏకదేశవర్తిని అగును. ఉదా ఈసరస్సులకు కలువరేకులన్ని కన్నులవలె, తామర పూవులన్ని ముఖములవలె, జక్కవ పక్షుల జంటలు చన్నులవలె అమరినవి. ఇటస్త్రీలు సరస్సులవలె ఉన్నారు అనిచెప్పినచో 'సమస్త వస్తు విషయోపమ' గా మారును. *5. మాలోపమ.* లక్ష. ఉపమానములు ఒక దండలోని పూవులవలె వెనువెంట అమరుట. ఉదా రావణునివలె, దుర్యోధనునివలె, ముసోలినివలె, హిట్లరువలె పలు వర్గములను పలురకములుగా బాధించుచున్న

అతనిని గూర్చి ప్రసంగించుటయే కష్టము. 6. రశనోపమ. లక్ష. రశన అనగా ఒడ్డాణము. ఒడ్డాణము గజ్జెలవలె ఒకదానితో ఒకటి లంకె పడిన ఉప మానములున్నది రశనోపమ. ఉదా మనస్సువలె మాట, మాటవలెచేత, చేతవలెకీర్తి, అతని వ్యక్తిత్వము కొనియాడ దగినది. ఈ ఉపమాభేదములన్నిటి పారు వేసి చూచినపుడు పూర్వులు చెప్పినవాటిలో కొన్నిటిని తర్వాతి వారు మరల చెప్పినట్లు, భేదాంతరములు కొన్ని చెప్పినట్లు తెలియును.

*ఉపమారూపకము* :- రూపకాలంకార విశేషము. లక్ష. మొదట ఉపమ, తర్వాత రూపకము ఉండుట ఉపమా రూపకలక్షణము. 'శ్లిష్టపరంపరితము' మినహా 'అశ్లిష్టపరంపరితము'లో అన్నిచోట్ల ఉపమా సమాసమే చెప్పుకొనవలె. సిద్ధాంత దృష్ట్యా వ్యస్తరూపకమే కాని సమస్తరూపకము అనునదిలేదు. సమస్తరూపకములో ఉపమాలంకారమునే చూచుచున్నాము 'ముఖచంద్రాదీనాంతు ఉపమాసమాసాత్ నరూపకత్వం యుక్తం' అని వామనుడు. అనగా 'ముఖచంద్ర' మొ॥ పదములందు 'చంద్రఇవముఖం' అని ఉపమాసమాసమునే చేయవలె. రూపకము చేసినచో ఉత్తర పదార్థ ప్రాధాన్యముచేవర్ణనీయ వస్తువుకు (ఉపమేయమునకు) గౌణత్వము వచ్చును. 'చతుర్దశలోక వల్లికందః' వంటి పరంపరిత రూపకము 'ఉపమారూపకము' గానే వామనుడు ఉదాహరించెను. చతుర్దశలోక వల్లికందః=వల్లులవంటి పదునాల్గు లోకములకు కంద భూతుడు అని అర్థమేకాని చతుర్దశ లోకములు అను వల్లులకు కందము అనికాదు (కా.సం.5.పు. 595).

*ఉపమాలంకారలక్షణము* : నా.శా. కంటె పూర్వమున్న రచనలలో ఉపమను గురించిన ప్రసక్తి ఉన్నది. చూ. అలంకారవికాసము. కావ్యగతమైన ఉపమను మొట్టమొదట వ్యాఖ్యానించినది భరతుడే 1. కవివ్యాపారములో ఏదైన ఒక వస్తువును (ఉపమేయమును) సాదృశ్యము (ఉపమానము)చే ఉపమించుటయే ఉపమ. ఈ ఉపమ గుణమును, ఆకృతిని ఆశ్రయించి ఉండును. "యత్కించిత్కావ్యబంధేషు సాదృశ్యే నోపమీయతే, ఉపమానామ విజ్ఞేయా గుణాకృతి సమాశ్రయా". ఈ ఉపమాన ఉపమేయభావము నాల్గు విధములు: (i) ఒక ఉపమేయమును ఒక ఉపమానముతో పోల్చుట, ఉదా॥ ముఖము శశితుల్యము (ii) అనేక ఉపమేయములను ఒక ఉపమానముతో పోల్చుట, ఉదా. నక్షత్రములు శశాంకునివలె ప్రకాశించుచున్నవి (iii) ఒక ఉపమేయమును అనేక ఉపమానములతో పోల్చుట, ఉదా శ్యేన-బర్హిణ-గృధ్రముల కనులవంటి కనులు కలిగి ఉన్నది. (iv) అనేక ఉపమేయములను అనేక ఉపమానములతో పోల్చుట, ఉదా జగములు మేఘములవలె ఉన్నవి. ఇది ఉపమానోపమేయముల సంఖ్యాభేదములచే ఏర్పడిన విభజనము (నా.శా.16.పు. 450-51). తర్వాత వచ్చిన ప్రముఖ లాక్షణికుల అభిప్రాయము లిట్లున్నవి. — 2. దేశము, కాలము, క్రియ ఇవి కారణములుగా ఉపమానము వేరైనను దానితో ఉపమేయమునకు గుణలేశము చేతనైనను

సామ్యము చెప్పినచో అది ఉపమ అగును (భామహుడు)—3. ఉపమానోప మేయములు దేశకాలాదులచే భిన్నములైనను వాటికి మనోహరమైన సాధర్మ్య మున్నచో ఉపమ అగును (ఉద్భటుడు)—దండి,వామన,మమ్మటా దులు ఇట్లే అభిప్రాయపడిరి.—4. ఉపమానోపమేయముల సాధర్మ్యములో భేదాభేదములు సమానముగ ఉన్నచో ఉపమ అగును (రుయ్యకుడు)—5. ఉపమానము, ఉపమేయము ఈ రెండిటి యందును సౌందర్యమూలక మైన సాదృశ్యమున్నప్పుడే ఉపమ (జయదేవుడు)—6. వాక్యార్థమునకు ఉపస్కారమై, సుందరమైన సాదృశ్యముగలదేఉపమ(జగన్నాథుడు)—7. ఉపమానో పమేయములకు ధర్మసంబంధమైన సామ్యమును వాచ్యముగ ఒక్కసారి చెప్పుట ఉపమ(విద్యానాథుడు)—8.క గుణధర్మకర్మములనుల్బణమయ్యెడు వస్తువునకుఁబరువడిఁదుల్య ప్రణయనముఁ జేయునెయ్యది గణుతింతురు దానినుపమగా బహువిధులన్ (విన్నకోటపెద్దన)—9. సీ ఉత్ప్రేక్షవలె నసిద్ధోపమ కాక నన్వయముకై వడిన నభిన్నంబుగాక, హీనోపమయుఁ బోలె నిలనహృద్యముగాక యుపమాన మనఘమై యుండెనేని, శ్లేషంబువలెఁ బదశ్లిష్ట మాత్రముగాక సార్థమై యల రూపకాదులక్రియ, వ్యంగ్యంబుగాక సామ్యము వాచ్యమగునేని నౌపమ్యముప్రతీపమట్లుదలపఁ - గ్రమవిపర్యాస సహితంబుగాకయున్న నలరునుపమేయ కోపమయట్లు సామ్య ధర్మమిరు మారు వరుసలఁ దడవకున్ననుపమయగు దీని భేదంబులుగ్గడింతు"అని (భట్టు మూర్తి) చెప్పిన నిర్వచనము సమగ్రమైనది. 'సాధర్మ్యముపమాభేదే' (భేదమున్నవాటికి సాధర్మ్యము చెప్పుట ఉపమ) అని మమ్మటుడు చెప్పిన లక్షణము సంక్షిప్తముగా, సొంపుగా ఉన్నది. ఉపమ భేదాభేద ప్రధానమని రుయ్యకుడు చెప్పినమాటగూడ అదే. భిన్నములైన రెండు పదార్థములకు సాధర్మ్యము (పోలిక) చెప్పుటయే ఉపమ అని, ఉపమానోపమేయములకు భేదము, సామ్యము ఉండవలెనని సారాంశము (ఆ.వి.స.2.పు. 485—86).

***ఉపమావాచకము*** : చూ. అవయవములు.

***ఉపమేయము*** : చూ. అవయవములు నాల్గు.

***ఉపమేయోపమ*** : అర్థాలంకారము. దీనికే అన్యోన్యోపమ, పర్యాయోపమ అని పేర్లు. లక్ష. రెండువస్తువులను (వాటినిపోలిన మూడవవస్తువు లేదని చెప్పుటకై) ఒకదానితో రెండవ దానిని (పరస్పరము) పోల్చుట 'ఉపమేయోపమ' ఉదా॥ సజ్జనుల మనసు మేఘోదకము వంటిది, మేఘోదకము సజ్జనుల మనసువంటిది. (ఆ.వి.స.2.పు. 489). దండి, రుద్రటుడు, భోజుడు వీరిమత మున ఇది ఉపమాభేదము. కాని సాదృశ్యగర్భ - భేదాభేద ప్రధానమైన ఈ అర్థాలంకారము స్వతంత్రమైనదని భామహుడు మొ॥ విశ్వనాథుని వరకు అంగీకరించిరి (హిం.సా.కో).

***ఉపాదానములు*** : చూ అవయవములు.

***ఉభయాలంకారములు*** : శబ్ద, అర్థ అలంకార విభజన రెండు విధములని సాధార

ణమే. కొందరు ఉభయాలంకారములని మూడవ విభజన చేసిరి: పునరుక్త వదాభాసము, పరంపరిత రూపకము, లాటానుప్రాసము ఇవి ఉభయాలం కారములని, అనుప్రాసాదులు శబ్దాలంకారములని, ఉపమాదులు అర్థాలం కారములని విభజించిరి (కా.సం.4.వ్యా.పు. 547). భోజుడు తన సరస్వతీ కంఠాభరణములో శబ్ద, అర్థ, ఉభయాలకారములని విభాగించి ఒక్కొక్క తెగలో 24 అలంకారములు చేర్చినాడు. ఉభయాలంకారములలో ఉపమా దులు చేర్చినాడు. అలంకారముల నన్నిటిని ఉభయాలంకారములనవచ్చునని, శబ్దార్థములు రెండును లేనిది ఏఅలంకారము ఏర్పడదని తర్వాతి వారు వాదించి ఉభయాలంకార విభాగమును అంగీకరించలేదు. (ఆ.వి.సం. 2. పు. 475).

**ఉల్లాసము :** అర్థాలంకారము. లక్ష. ఒకవస్తువు యొక్కగుణ - దోషములచేత అన్యవస్తువునకు అవి కలిగినట్లు వర్ణించుట. ఇదినాల్గు విధములు: 1. గుణముచే గుణము: ఉదా ఏపతివ్రతయైనను నాయందు స్నానమాడి నన్ను పవిత్రు రాలిని చేయుగాక అని గంగానది కోరుచున్నది. 2. దోషముచే దోషము. ఉదా పాపులైన రాక్షసులు నడచిన వింధ్యారణ్యపు దారులు అపవిత్రములా యెను. 3. గుణముచే దోషము. ఉదా॥ సజ్జనుల నాశ్రయించకుండుట ధనము నకుగల భాగ్యహీనత్వము. ధనలోభము లేకుండుట సజ్జనుల గుణము. ఆ గుణము కారణముగా ధనమునకు వారి ఆశ్రయము లభించదు. ధనమునకుగల ఈలోపము దోషము. అని అర్థము. 4 దోషముచే గుణము. ఉదా॥ చావక మిగిలినదే రాజసేవకులకు లాభము. రాజులకు క్రౌర్యము అను దోషముం డుట సాధారణము. దానిచే చావకుండుటయే సేవకులకులాభము. అలాభమే గుణము (చంద్రా. 130-132) — జయదేవుడు వివేచించిన అలంకారము. రసగంగాధరము, కువలయానందము దీనిని ఒప్పినవి. (హిం.సా.కో.).

**ఉల్లేఖము :** అర్థాలంకారము. లక్ష. వస్తువు ఒకటే అయినను గ్రహీతల భేద మును బట్టికాని, విషయాశ్రయమైన భేదమును బట్టికాని వివిధములుగా తోచి నచో అది 'ఉల్లేఖము' 1. గ్రహీతల భేదమునకు ఉదా రాజులందరు లక్ష్మీ నివాసమని, శత్రువర్గము పరాక్రమాతిశయమునకు గని అని, విద్వాంసులు విద్యావిలాస వైభవమని, (శ్రీకాకతీంద్రి) నగరమును (ఏకశిలా నగరమును) పొగడుదురు. (ప్ర.రు.) 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, అధ్యాత్మవిదులు వేదాంత మనియు' అను భారతావతారికలోని పద్యమిట్టిదే. 2. విషయా శ్రయ భేదమునకు ఉదా 'రవిబింబంబుపమింపఁ బాత్రమగు ఛత్రంబై, శిరోరత్నమై, శ్రవణాలంకృతియై' (భాగ.) అట్లే వామనుడు పెరుగు చుండగా ఆసూర్యబింబము క్రమముగా దిగిచివరకు అతని పాదపీఠిఅయినదని వర్ణన. ఇటువంటిది విషయాశ్రయభేదము (కా.సం.5. 602).—సాదృశ్య గర్భ - అభేదప్రధాన ఆరోపమూలకములైన అర్థాలంకారములలో ఇదొకటి మొదటిసారి రుయ్యకుడే దీనిని వివేచించెను. దీని రెండు ప్రకారములు చెప్పి

నది గూడ అతడే. మమ్మటాదులతో పాటు సా.ద. కర్త ఈరెండు భేదము లను స్పష్టముగానే గుర్తించినాడు (హిం.సా.కో).

*ఊర్జస్విదలంకారము :* అర్థాలంకారము. లక్ష. రసాభాసముగాని, భావాభాసము గాని గుణీ భూతముగా (అంగముగా) వర్ణితమైనచో ఊర్జస్విదలంకారము. ఉదా। నీశత్రురాజుల కాంతలు అడవిలో పరుగెత్తుచుండగా వారిని దోచు కొనుటకై అడ్డము వచ్చిన కిరాతులు వారి ఎదుటనిలిచి, వారి సౌందర్యము నకు ముగ్ధులై వచ్చినపనిని మరచి చూచుచుండిరి. ఇట కిరాతులు రాజస్త్రీల సౌందర్యమున కాశపడుట 'శృంగారాభాసము'. అదిరాజ విషయకమైన రతి (అంగి)కి అంగము కాబట్టి ఊర్జస్వి. (ఆ.వి.స.2.పు. 507) రసవదాది వర్గము నకు చెందిన అలంకారమిది.

*ఏకార్థము :* అర్థదోషము. వివ. ఒకే అర్థముగల వాక్యమునుగాని, పదమునుగాని మరల ప్రయోగించుట ఏకార్థక దోషము. ఉదా। అతడు సుగుణఖని, చరిత్ర శోభి (కా.సం. 4.47). సుగుణవంతుని చూచి అతనికి చరిత్ర ఉన్నది అందురు. చరిత్ర గల వ్యక్తికి సుగుణములుండుట చూతుము. ఏకార్థముచే బోధించు రెండు మాటలుండుట దోషము.

*ఏకావళి :* అర్థాలంకారము. లక్ష. పూర్వ పూర్వమునకు ఉత్తరోత్తరము క్రమము తప్పకుండ విశేషణమై ఉన్నచో ఏకావళి అలంకారము. ఇది రెండు విధములు (i) విధిరూపము. ఉదా। దేవా! ధర్మముచే నీబుద్ధి పరిశుద్ధమైనది, బుద్ధిచే సంపదలు నియతములైనవి, సంపదలచే సకలజనులు సంతుష్టులయిరి. సకల జనులచే నీకీర్తి సకలలోకములకు వ్యాపించినది. (ర.గం). (ii) నిషేధ రూపము. ఉదా। 'అది సభయేప్రియం బెనగ ఆర్యులు నిల్వరయేని'=పెద్దలు లేనిది సభకాదు, ధర్మము చెప్పనివారు పెద్దలుకారు, సత్యము లేనిది ధర్మము కాదు; కపటముతో కూడినది సత్యముకాదు (భార.ఉద్యో). పూర్వపూర్వము ఉత్తరోత్తరమునకు విశేషణ భావముగా ఉన్న లక్షణము పై ఉదాహరణ ములలో చూడవచ్చు (ఆ.వి.స.2 పు.501). - శృంఖలామూలకములైన అర్థాలంకారములలో ఒకటి. రుద్రటుడు వివేచించినది. విశ్వనాథుడు గూడ అట్లే అనుసరించి చెప్పెను (హిం.సా.కో.). 'గృహీతముక్తరీత్యార్థ శ్రేణిరే కావళీమతా' (చంద్రా. 102) గృహీతముక్తరీతి అనగాకూర్చుచున్న అర్థ ముల వరుసలో గ్రహించిన దానిని విడిచిపెట్టుపద్ధతి. పూర్వపూర్వములకు ఉత్తరోత్తరములుగాని, రెండవవాటికి మొదటివిగాని విశేషణభావములై ఉం డుట దీనిముఖ్య లక్షణము.

*ఓజస్సు :* కావ్యగుణములు 10. వాటిలో తొమ్మిదవది. వివ. గాఢసమాస బంధము (అనగా క్లిష్టసమాసములు, రేఫయుక్తములు, మహాప్రాణ యుక్త ములు(ర్భ).(భ, ఘ, ఝ, ము। వర్ణబాహుళ్యముగలరచన) గలది ఓజోగుణము. ఉదా। '...గీ॥ రాజమాత్రుండె వసుధాధి రాజమకుటనికట వికట మహానీల వికర సుకర మధుకర కరంబితాంఘ్రి పద్మద్వయుండు సరసగుణహారి,

ఓబయనరసశౌరి (కా.సం. 4.69). 'గాఢబంధత్వమోజః' అని వామనుడు. దీనికి 'కర్ణాటక్షితిపాల మౌక్తికసభాగారాంత రాకల్పిత స్వర్ణస్నానగతి ప్రసిద్ధకవి రాట్సంస్తుత్య చారిత్ర! దుగ్ధార్ణోరాశిగభీర! ప్రాహ్ణాముఖ మధ్యాహ్న పరాహ్ణార్చితాపర్ణావల్లభ! రాజశేఖరమణీ! పంటాన్వయగ్రామణీ!' (కాశీఖండము. 7. 266) వంటిపద్యములు మంచి ఉదాహరణములు.

*ఔదార్యము :* కావ్యగుణములు 10. వాటిలో ఏడవది. వివ. కొన్ని సంయుక్తాక్షరములతో కూర్చిన రచన ఔదార్యము (కా.సం.4.65).దీనికిఉదాహరణము సులభగ్రాహ్యామే, 'వికటత్వముదారతా' అనగా కూర్పుతో వర్ణములు నటించినట్లు రచించుట ఔదార్యమని వామనుడన్నాడు. ఉదా॥ 'అటజని కాంచె భూమిసురుడంబరచుంబి శిరస్సరజ్ఝరీ పటల ముహుర్ముహుర్లుఠద భంగతరంగ మృదంగ'...(మ.చ.). ఈ రచనలో చుంబన వ్యాపారమునకను కూలముగా బిందుపూర్వక గకారబంధము, మృదంగధ్వనికి స్ఫోరకముగా బింధుపూర్వక గకారబంధము, నటనాను రూపముగా టకారబంధము ఉన్నది. ఇదే వికటత్వము. ఈ వికటత్వము గలకూర్పు ఔదార్యము (అదే.పు.584).

*కవిసమయములు :* సమయమనగా సంప్రదాయము, సంప్రదాయముననుసరించి కవులు ప్రయోగించు ఆచారములు,మర్యాదలు మూడువిధములు: 1. ఉన్న ధర్మమును నిబంధింపక వర్ణించుట,2. లేనిధర్మమును నిబంధించి వర్ణించుట, 3. నియతముగా కొన్ని ధర్మములను కొన్నిచోట్లనే నిబంధించి వర్ణించుట. ఉదా తామరమొగ్గలకు ఆకుపచ్చదన మున్నను దానిని నిబంధింపక వర్ణించుట; నదులలో కమలములు, కలువలు లేకున్నను నిబంధించి వర్ణించుట; నెమలి నృత్యమును, కేకలను వర్షాకాల వర్ణనలోనే నిబంధించుట మొ ఇంతే కాక శరత్కాలమేఘము, మందారపుష్పము, అమృతము మొ॥ తెల్లనివని; శస్త్రము, పాపము, అపకీర్తి మొ నల్లనివని; రౌద్రభావము, చకోరపక్షి, ఏనుగుఒడలిమీది మచ్చలు ఎర్రనివని; జీవము, కింజల్కము, చక్రవాకపక్షి పసుపుపచ్చని వని; సూర్యునీ రథాశ్వములు ఆకుపచ్చనివని వర్ణించుట, ఆయా ఋతువులను అనుసరించి ఆయా వాతావరణములలో పశు, పక్షి,లతా గుల్మాదులలో కనిపించు చైతన్యము, మార్పులు వర్ణించుట, అన్నివర్గముల ప్రజల జీవనసరళిని చిత్రించుట మొ . కవిసమయములే. కవిసమయములు మార్చుటకు వీలులేదని, ఔచిత్య దృష్టితో క్రొత్తవాటిని సృష్టించుకొనవచ్చు నని శాస్త్రాధికార పక్షమువారి అభిప్రాయము (కా.సం.4.పు.490-96)వీటిని అతిక్రమించిన ఉదాహరణములు ఉన్నవి.

*కాంతి -* కావ్యగుణములు 10. వాటిలో ఎనిమిదవది. వివ. విచిత్రమైన వర్ణపదావృత్తి, మృదువైన కూర్పుగల రచన కాంతి. ఉదా॥ 'నెలవంక తోడివెన్నెల వంక గలమేటి నెలవంక రహితాంశు నియతి దెగడి;......కపురాలవన్నె చొక్కపురాల నగుమేని కపురాలపోతు బింకంబునణచి (కా.సం.4.67)

నీకీర్తి ప్రకాశించినదని రచించిన ఈ సీసములో క్రింది గీట్లుగల వర్ణపదావృత్తుల వంటివే నాల్గు చరణములలోను అమరినవి. ఇది కాంతి గుణము. అనుప్రాసకాదు, దగ్గరగా ఉండి ఏర్పడిన రెండక్షరముల ఆవృత్తి అను ప్రాస. సమానమైన అచ్చులు సముచిత స్థలమున ఉండి ముక్తాయింపువలె వినబడుట కాంతి. ఇది యమక భేదము కావచ్చు (అదే.పు.585).

*కారక దీపకము* : అర్థాలంకారము. దీపకాలంకార భేదము. రుద్రటుడు మొ. వారితోపాటు జగన్నాథుడు స్వీకరించినది. లక్ష. ఒకేకర్త అనేక క్రియలతో అన్వయించినచోట కారక దీపకము. ఉదా రాజా! ధనమిచ్చుటకు, కీర్తి సంపాదించుటకు నీవు నిపుణుడువు (ర.గం.) దీనిలో 'ధనమిచ్చుట' (తనను రక్షించుట) అను క్రియ ప్రకృతము, రెండవ క్రియ అప్రకృతము (ఆ.వి. స.2.పు. 495). జయదేవుడు దీనిని ప్రత్యేకాలంకారముగా చెప్పెను, ఉదా పాంథుడు పోవును మరల వచ్చును! చూచును, అడుగును (చంద్రా.114). క్రియలన్నియు ఒకే కర్తతో అన్వయించినవి. పనులన్నియు ఒక్కసారి జరిగినవికావు కాబట్టి ఇది సముచ్చయాలంకారముకాదు దీపకమే.

*కారణమాల* : అర్థాలంకారము. లక్ష. అనుగుణములైన కార్యకారణములకు గల 'శృంఖల' కారణమాల. ఇది రెండు విధములు 1. పూర్వపూర్వములు ఉత్తరోత్తరములకు కారణ ములుగా చెప్పు పద్ధతి ఒకటి. ఉదా విద్యచేతను వినయంబు, వినయమునను బడయు పాత్రత, పాత్రతవలన ధనము, ధనము వలనను ధర్మంబు, దానిచేత నైహికాముష్మిక సుఖంబులందు నరుడు. 2. ఉత్తరోత్తరములు పూర్వ పూర్వములకు కారణములుగా చెప్పుపద్ధతి రెండవది. ఉదా॥ నరకములు పాపముచేత, పాపము దారిద్ర్యముచేత, దారిద్ర్యము దానమీయ కుండుటచేత సంభవించును కాబట్టి దానశీలివిగా ఉండుము (చంద్రా. 100–101). శృంఖలామూలకములైన అర్థాలంకారములలో ఒకటి. రుద్రటుడు వివేచించినట్లు తెలియును. సా.ద. కర్త పూర్వులననుసరించి చెప్పెను (హిం.సా.కో.).

*కావ్యలింగము* : అర్థాలంకారము. లక్ష. ఒక విషయమును సమర్థించుటకు దానికి కారణముగా ఇంకొక విషయమును చెప్పుట 'కావ్యలింగము'. ఉదా నేను మన్మథుని గెల్చితిని (ఎట్లు?) నామనస్సునందు శంకరుడున్నాడు. దీనిలో పూర్వ వాక్యమునకు ఉత్తర వాక్యము హేతువు. తర్కములో చెప్పదగిన లింగము (హేతువు) వేరు. ఇది కావ్యములో చెప్పదగిన లింగము కాబట్టి కావ్యలింగ మనిరి. (చంద్రా. 118)—తర్కన్యాయ మూలమైన అర్థాలంకారము. దీనిలో చెప్పుహేతు కథనము ఒక్క పదముతో చెప్పవచ్చు, ఒక్క వాక్యముతో చెప్పవచ్చు. (హిం.సా.కో.)—దీనిలో వైచిత్ర్యములేదు కాబట్టి ఇది అలంకారము కానేరదని జగన్నాథుడనెను.

*కావ్యార్థాపత్తి* : చూ. అర్థాపత్తి.

*క్రమభ్రష్టము* : వాక్యదోషము. చూ. అక్రమము.

*క్లిష్టము* : పదదోషము. వివ. దూరార్థము, అన్వయక్లిష్టతగల పదము క్లిష్టము. ఉదా మన్మథునివంటి అందగాడు అనిచెప్పుటకు 'పవనాశనేంద్ర ధర మకుటాలంకారమణి జనకవరపుత్రీరమణ కుమార రూపదీపితుడు' అనుట. (కా.సం.4.17.)—ఓ శెప్తదానా! అను అర్థములో 'పర్వత జ్యేష్ఠపుత్రికా పతివిరోధి అన్న పెండ్లాము అత్తనుగన్న తండ్రి (సముద్రుడు) ప్రేమ తోడుత పెంచిన పెద్దబిడ్డ' (జ్యేష్ఠాదేవి) అని చెప్పిన చాటువు ఇంకొక ఉదాహరణము.

*గమ్యార్థము - ధ్వన్యర్థము* : గమ్యార్థ మైనప్పుడు వాచ్యమెట్లైనదను ప్రశ్న వచ్చినది. దీనికి రుయ్యకుడు సమాధానము చెప్పినాడు. కార్య కారణములకు అన్యోన్యాశ్రయ మైన సంబంధముండుట తెలిసినదే. కార్యము వ్యక్తమైన చోట కారణము సూక్ష్మ రూపమున దానికదే స్ఫురించుచున్నది. కార్యము ద్వారా వ్యక్తమై కారణమును స్ఫురింప జేయునది గమ్యము. ఇట్లు ఒక వంక వ్యక్తమగుటలో దీనికి అభిధార్థముతో సంబంధమున్నది. 'ధ్వనికి అభిధార్థముతో సంబంధములేదు (హిం.సా.కో.పు. 488).

*గర్భితము* : వాక్య దోషము. చూ. వాక్యగర్భితము.

*గుణములు* : గుణశబ్దమునకు విశేషమని, శోభాకరమైన ఆకర్షకధర్మమని, దోషాభావమని అర్థము. కావ్యపరిధిలో రసధర్మములైన గుణములుశబ్దాశ్రయములు కావచ్చు, అర్థాశ్రయములు కావచ్చు. భరతాదుల ననుసరించియే మమ్మటుడు (రసస్యాంగినోధర్మాః) గుణములు రసమునకు అంగరూప ధర్మములని నిర్వచించెను. మానవుల వ్యక్తిత్వ వికాసమునకు అవసరమైన గుణములవంటివే కావ్య గుణములు. అలంకారములు అనిత్యములు. గుణములు నిత్యములు'కావ్యశోభాయాఃకర్తారోగుణాః,తదతిశయహేతవస్త్వలంకారాః, పూర్వేనిత్యాః' (వామనుడు). గుణముల నిత్యా నిత్యత్వములను గురించి ఆలంకారికులు వాదులాడిరి. చూ. గుణాలంకారాదులు, శబ్దగుణములు, అర్థగుణములు, గుణముల సంఖ్య.

*గుణవిభజన* : కావ్యగుణములను విభజించి వాటి సంఖ్యను వివేచించుటలో ఆలంకారికుల దృక్కోణ భేదములున్నవి. భరతుడు వివేచించినవి 10: 1.శ్లేష 2. ప్రసాదము 3. సమత 4. సమాధి 5. మాధుర్యము 6. ఓజస్సు 7. సౌకుమార్యము 8. అర్థవ్యక్తి 9. ఉదారత 10. కాంతి (నా.శా.16.పు.456-58) —వీటినే 'దశప్రాణములు' అని దండి సమాధి-కాంతి మొ॥ వాటిని తన దృక్పథముతో కొంత భిన్నముగ వివరించెను. ఈపదింటిని ఒప్పిన వామనుడు శబ్ద, అర్థభేదములచే వీటి సంఖ్య 20 అన్నాడు. భోజుడు చెప్పిన గుణముల సంఖ్య 24. వీటిలో పూర్వులు చెప్పిన 10 మినహాయిస్తే: ఉదాత్తరణము, ఓజస్త్వము, ప్రేయము, సుశబ్దత, సౌక్ష్మ్యము, గాంభీర్యము, విస్తారము, సంక్షేపము, సమ్మితత్వము, భావికము, గతి, రీతి, ఉక్తి, ప్రౌఢి. ఇవి 14. (స.సూ.నా.శాస్త్రి చూపిన పాఠము వేరు). భోజుడు ఈ 24 గుణములను

బాహ్య, ఆభ్యంతర, వైశేషిక భేదములతో మరల విభజించి నిర్ణయించిన సంఖ్య 72. బాహ్యగుణములన్న వాటిలో అధిక సంఖ్య శబ్ద గుణములదే, ఆభ్యంతరములన్నవి అర్థగుణములు. మూడవతెగకు చెందినవి దోషములే అయినను ఆలంకారికులు చేసిన విశేష చర్చాప్రసంగములలో అవి వైశేషిక గుణములైనవి.—అగ్నిపురాణము శబ్ద, అర్థ ఉభయ భేదములతో పేర్కొన్న గుణముల సంఖ్య 18. వీటిలో శబ్దగుణములు 6: శ్లేష, లాలిత్యము, గాంభీర్యము, సుకుమారత, ఔదార్యము, ఓజస్సు. అర్థగుణములు 6: మాధుర్యము, సంవిధానము, కోమలత, ఉదారత, ప్రౌఢి, సామయికత. శబ్దార్థోభయములు 6: ప్రసాదము, సౌభాగ్యము, యథాసంఖ్యము, ప్రాశస్త్యము, పాకము, రాగము. తర్వాతి ఆలంకారికులు గుణముల సంఖ్య తగ్గించుటే ఉచితమని భావించినారు.—కుంతకుని వివేచన భిన్నమైనది. అతడు అనివార్య సామాన్యములన్నవి రెండు గుణములు (ఔచిత్యము, సౌభాగ్యము), విశిష్టములన్నవి నాల్గుగుణములు (మాధుర్యము, ప్రసాదము, లావణ్యము, అభిజాత్యము). రసధర్మ రూపములైన గుణములను మాత్రమే అంగీకరించిన ఆనంద వర్ధనుడు మూడు మానసికావస్థలు (ద్రుతి, దీప్తి, వికాసము) ఆధారములుగా అంగీకరించినవి మూడు గుణములు: మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము. వామనుడు స్వీకరించిన10 గుణములలో ఆనందవర్ధను డొప్పినవి ఉన్నవి. మమ్మటుడు దశగుణములను విమర్శించి మూడింటిని ఒప్పినాడు. (హిం.సా కో.) తెలుగు సాహిత్యాచార్యులు భరతాదుల ననుసరించి దశ గుణములను స్వీకరించిరి.

*గుణాలంకారాదులు* : 1. గుణము - అలంకారము: 'అత్రపక్షేకవి వ్యాపార భేదాద్గుణాలంకార లక్షణ విభాగః' కవివ్యాపారమనగా కవిఅనుసరించిన వాగ్వ్యాపారము (ఫణితి, గుంఫనము, బంధము, వక్రోక్తి) ననుసరించి గుణ-అలంకార - వృత్తి - రీతిలక్షణములకు భేదము ఏర్పడినవి. వీటిమధ్యగల పరస్పర సంబంధ విశేషములను డా.వి. రాఘవన్ బాగాచర్చించిరి చూ. 'Some-concepts of Alankara Sastra'. ఆయా రసానుకూలములగు గుణముల నాశ్రయించనిదే రసము వ్యక్తముకాదు. అనగా గుణములన్నియు రసాభివ్యక్తికి తోడ్పడుచున్నవి. రసోపస్కారము గాని శబ్దార్థవైచిత్రి ఉండవచ్చు గుణాలంకారములకు గల ముఖ్య భేదమునిట్లుగుర్తించవచ్చు. *2. గుణము-దోషము:* అలంకారములు అనిత్యములని చెప్పిన వామనుడు గుణములు రస ధర్మములు కాబట్టి నిత్యములనెను. కాని 'సన్నివేశ విశేషాత్తు దురుక్తమపి శోభతే' (భామహుడు) 'అనుసంధాన శూన్యస్య భూషణం దూషణాయతే, సావధానస్యచక వేః దూషణం భూషణాయతే' (రా.శే. కావ్యమీమాంస). ఆయా దేశకాల పాత్రల అభిరుచి భేదములను బట్టి ఒకనాటి గుణము, ఒక నాటికి దోషము కావచ్చునని, గుణదోషముల నిత్యానిత్య వ్యవస్థ నిర్ణయించ వీలులేదని వివిధచర్చల సారాంశము. *3. గుణము - వృత్తి:* గుణములకు

వృత్తులకు పరస్పరమున్న సంబంధమును చర్చించిన భోజుడు 'నగుణేభ్యో నవృత్తిభ్యః పృథక్త్వేనావభాసతే' అన్నాడు. (సరస్వతీ కంఠాభరణము. 2.87). *4. గుణ-వృత్తి-రీతులు :* గుణ, వృత్తులకు భేదము చెప్పుటకు వీలు పడదని భోజుడనెను. రీతులెప్పుడును వృత్తుల నాశ్రయించియే ఉండునని తేలినది (కా.సం.2.వ్యా.పు.173). కవి వాగ్వ్యాపార భేదములతో ఏర్పడిన గుణాలంకారాదులు కలసిమెలసి రసోపస్కారకము లగుచున్నవని, స్థూల దృష్టితో వీటికి భేదము లేర్పడినవని సారాంశము.

*గూఢార్థము :* పదదోషము, నిత్యము. వివ ఉద్దేశించిన అర్థము గూఢముగా ఉన్న పదము. ఉదా 'శోణితము'=నెత్తురు, ఎరుపు అని రెండర్థములున్నవి. (వ్యుత్పత్తిచే ఏర్పడినవికావు. రెండున్నవిగదా అని అప్రసిద్ధమైన 'ఎరుపు'. అను అర్థమున వాడ రాదనిరి. శ్లేషరచనలో వాడవచ్చు (కా.సం.పు.452).

*గూఢోక్తి :* అర్థాలంకారము. లక్ష. ఒక విషయము ఒకరికి చెప్పదలచి, అది చుట్టు పట్లవారు గ్రహించకుండు నట్లుగా, శ్లేషచే గూఢముగా చెప్పుట గూఢోక్తి. ఉదా వృషభమా! క్షేత్రపాలకుడు వచ్చుచున్నాడు,దూరముగా పొమ్మి - పరదారతో క్రీడించుచున్న ఒక కాముకుని హెచ్చరించుటకు చెప్పిన మాట ఇది. 'క్షేత్రపాలక' పదములో గూఢార్థమున్నది. క్షేత్ర పాలకుడు=పొలము కాపరి అని ఒక అర్థము. క్షేత్రమనగా స్త్రీ, పాలకుడనగా దానిభర్త. (చంద్రా. 158). గూఢార్థప్రతీతి వర్గములో చేరిన అలంకారము, అప్పయ దీక్షితుడు ఒప్పినది (హిం సా.కో.).

*గూఢోత్తరము :* అర్థాలంకారము. జయదేవుడు దీనిని స్వతంత్రాలంకారముగా పేర్కొనెను చూ. ఉత్తరాలంకారము - మొదటి విధము.

*గ్రామ్యము*[1] : అర్థదోషము. వివ. స్త్రీపురుషులు అసభ్యమైన అర్థములు వచ్చు నట్లు మాట్లాడుట గ్రామ్యము. ఉదా 'నీ చనుగొండలు కూలిపడినవేమే? ఎందుకు?' అనినాయకుడడుగగా 'కింద తవ్వినచో కూలిపడవామరి?' అని నాయిక సమాధానము. ఇది సురత గోష్ఠిలో గుణమే అగును. ఇటు వంటి సందర్భములలో ఇంకను వైవిధ్యముగల వక్రోక్తులతో మాట్లాడుకొనుటయే ఉచితము. (కా.సం.4.పు.502).

*గ్రామ్యము*[2] : పదదోషము. వివ. నాగరికులు, శిష్టులు అయినవారి వ్యవహార ములో లేని భాష కావ్య రచనలో రాణించదు. కాళ్ళు అనుటకు బదులు 'కాల్లు' అని; చన్నులు లేదా చళ్ళు అనుటకు బదులు 'సళ్ళు' అని, 'సండ్లు' అని గ్రామీణ పామరజనుల వ్యవహారము. గుణపక్షమున. నాటకరచనలో పాత్రోచితమైన భాష ప్రయోగించవలె. అధమపాత్రలకు గ్రామ్యభాష ఉపయోగించవచ్చు. (కా.సం.4.10)—ఆధునికకవులు సాధారణ ప్రజల కొరకు ఉద్దేశించి రచించ కవితలో పూర్వులు గ్రామ్యములని బహిష్కరించిన పదములను కోకొల్లలుగా వాడుచున్నారు. బహుళ ప్రజల సమ్మతినిబట్టి,

నేటి భాషాభిజ్ఞుల మెప్పుదలను బట్టి పదప్రయోగము చేయుట యుక్తము.

*చిత్రకవిత్వము* : 'చిత్రాలంకార' రూపభేదములైన శబ్దాలంకారములు. చూ. బంధకవిత్వము.

*చిత్రకావ్యము* : అనుప్రాసాదులు గలది శబ్ద చిత్రము. రెండుమూడర్థములు గలది అర్థచిత్రము. ఈరెండు లక్షణములు గలది ఉభయచిత్రము. శబ్దార్థ చిత్రములు (అలంకారములు), బంధ, చిత్రరచనలు బహుళముగా గలదిచిత్ర కావ్యము. శబ్దాలంకార రచన అధిక మైనచో రసమునకు పుష్టిలభించదు. బంధ, చిత్ర రచనలు చెవులలో గింగురులు పుట్టించి ఆలోచింపనీయవు కాబట్టి అవి కవితలేకావు అని రసభావ ప్రాధాన్యమును అభిలషించినవారు చిత్ర కావ్యమును నిషేధించిరి. 'ప్రాయశో యమకే చిత్రే రసపుష్టి ర్నదృశ్యతే' వంటి వాక్యములు శబ్దార్థవైచిత్రి బాహుళ్యమునునిషేధించుటకు చెప్పినవే. పాఠకులు విని మరచిపోవు లక్షణమున్నది అనగా 'కర్ణేగతం శుష్యతి కర్ణ ఏవ సంగీతకం సైకత వారిరీత్యా' (శివ.త.1.17) అన్నట్లున్నది శబ్దవైచిత్రి కాదనిరి.

*చిత్రోత్తరము* : అర్థాలంకారము. జయదేవుడు దీనిని స్వతంత్రాలంకారముగా వివేచించెను. చూ. ఉత్తరాలంకారము-రెండవ విధము.

*చ్యుతసంస్కారము* : పదదోషము. వివ. వ్యాకరణ శాస్త్రము అనుమతించని దుష్టరూపమిది. ఉదా కమలాకాంతుడు అనుటకు మారు 'కమలకాంతుడు' అనుట; కరుణావారిధి అనవలసినదానిని'కరుణవారిధి'అనుట (కా.సం.4.11). దీనినే వామనుడు అసాధువు అనెను.

*ఛందోభంగము* : వాక్య దోషము. వివ. పద్యములో గణము తప్పినచో దానిని ఛందోభంగమందురు. ఉదా॥ క. ఛందము యతియుందప్పిన - ఛందో యతి భంగములగు సంగతినితడు - కుందేందు విశదయశుఁడై - ముందుగఁ బూజించినాఁడు నరహరినన౯గన్ (కా.సం.4.36): రెండవపాదము చివర గణ భంగమునకు, నాల్గవ పాదము యతి భంగమునకు ఉదాహరణములు.

*ఛేకానుప్రాసము* : శబ్దాలంకారభేదము, దీనినే పదానుప్రాస మనిరి. లక్ష. ఇది ద్వివర్ణావృత్తి. '...ఎడలేక రెండు రెండక్షరంబులెనయు నియమంబు ఛేకమౌ' (కా.సం.4.73). రెండు రకముల అక్షరములుగల జంటలు వెను వెంట అనేక పర్యాయములు అనేకవిధములుగా ఆవృత్తి అయినచో అది ఛేకానుప్రాసము. ఆ హల్లుల జంటలలో స్వరసాదృశ్యము పాటించ వలసిన నియమములేదు. ఉదా శ్లో. ఆదాయకమల గంధానంధీ కుర్వన్ పదే పదే భ్రమరాన్, అయమేతి మందమందం కావేరీవారి పావనః పవనః. దీనిలో 'గంధానంధీ - వేరీవారి - పావనః పవనః' ఈహల్లులజంటలు ఛేకమునకుదా హరణములు. వీటిలో వ్యంజన సాదృశ్యమేకాని స్వరసాదృశ్యము లేదు. కాని 'పదేపదే-మందమంద' ఈజంటలలో స్వరసాదృశ్యమున్నది. ఇట్టువంటిది

ఆనుషంగికముగా రావచ్చును. అంతేకాని అది ఛేకమునకు నియమముకాదు (కా.సం.4.పు.548-49).

*ఛేకోక్తి* : అర్థాలంకారము. లక్ష. లోకోక్తిని అర్థాంతరగర్భితముగా చెప్పినచో ఛేకోక్తి. ఉదా పాముకాళ్ళు పాముకే తెలియును (చంద్రా. 157). ఒక రహస్య వృత్తికి చెందిన ఇద్దరిని గురించి మాట్లాడునప్పుడు అసంగతి వాని తోటి వానికే తెలియును, ఇతరులకు తెలియదను అర్థములో దీనిని వాడుదురు. ఇదొక గౌణాలంకారము, కువలయానందము ఒప్పినదే (హిం.సా.కో.).

*జాతి* : చూ. స్వభావోక్తి.

*తద్గుణము* : అర్థాలంకారము. లక్ష. ఒకవస్తువు తనగుణమును (ధర్మమును) విడిచి అన్యవస్తు గుణమును గ్రహించినట్లు వర్ణించుట తద్గుణము. ఉదా। నీ బులాకి ముత్యము నీపెదవికాంతిచే పద్మరాగ మగుచున్నది (చంద్రా.189) ముత్యము తనతెల్లదనమును విడిచి పద్మరాగ గుణమును పొందినది. లోక న్యాయమూలమైన అర్థాలంకారము. గుణమనగా ఇక్కడ రంగు, రూపము అని అర్థము. మొదట రుద్రటుడే దీనిని వివేచించి అతిశయ వర్గములో చేర్చినాడు (హిం.సా.కో.).

*తిరస్కారము* : అర్థాలంకారము. లక్ష. గుణవంతమైన వస్తువును గూడ దోష విశేష భయముచే ఒల్లకుండుట తిరస్కారము. ఉదా భగవద్భక్తి వశించు అవకాశమున్నది కాబట్టి రాజ్యసుఖము నాకక్కరలేదు (అ.వి.స.2.పు.510). —విశేషాలంకారములో చేరినది, జగన్నాథుడు ప్రతిపాదించినది. (హిం.సా.కో.).

*తుల్యయోగిత* : అర్థాలంకారము. లక్ష. కేవలము ప్రకృతములకు (ఉపమేయములకు) గాని, కేవలము అప్రకృతములకు గాని (గుణ, క్రియాది రూపమైన) ఏకధర్మాన్వయము చెప్పినచో తుల్యయోగిత అగును. ఉదా। చంద్రోదయము కాగానే పద్మములును, జారిణుల ముఖములును ముకుళితములైనవి. (చంద్రా. 39). దీనిలో పద్మములు ముఖములు, రెండును ప్రకృతములే, 'ముకుళితములైనవి' అను క్రియతో అన్వయించినవి.—సాదృశ్యగర్భము, గమ్యౌపమ్యాశ్రయము పదార్థగతముగా కనిపించు అలంకారమిది. 'తుల్యయోగిత' అనగా ఉపమేయోపమానములకు పరస్పర సమానయోగము (సంబంధము, అన్వయము) చేకూర్చునది అని అర్థము. భామహాదులు దీనిని వివేచించిరి ఇది ఔపమ్యగర్భముగా ఉండవలెనని ఉద్భట, రుయ్యక, విద్యాధరాదులు చెప్పిరి. విశ్వనాథుడు రుయ్యకాదుల ననుసరించి చెప్పెను "పదార్థానాం ప్రస్తుతానా మన్యేషాం వా యదా భవేత్, ఏకధర్మాభి సంబంధః స్యాత్తదా తుల్యయోగితా" (హిం.సా.కో). ఈ అలంకారమునకు ముఖ్య భేదములు మూడు: 1 వర్ణ్యావర్ణ్యైక ధర్మాన్వయరూప (ఇది కేవల ప్రకృత

గోచర, కేవల - అప్రకృత గోచర అని రెండు విధములు), హితాహిత వృత్తి తౌల్యరూప, ఉత్కృష్ట సమీకరణోక్తరూప. *1. వర్ణ్యావర్ణ్యైక ధర్మాన్వయరూప* (i) కేవల ప్రకృతగోచర. లక్ష. కేవలము ప్రకృతములకు మాత్రమే ఏకధర్మాన్వయము చెప్పుట. ఉదా॥ చంద్రోదయ వర్ణనమగుటచే పద్మములును, జారిణుల ముఖములును ముకుళితములైనవి. దీనిలో. పద్మములు, ముఖములు రెండును ప్రకృతములే. 'ముకుళించినవి' అను క్రియవలన వాటి ఏకధర్మాన్వయము గోచరమగుచున్నది. కాబట్టి ఇది 'కేవల ప్రకృతగోచర—తుల్యయోగిత.' (ii) కేవల - అప్రకృత గోచర. లక్ష. కేవలము అప్రకృతములకు మాత్రమే ఏక ధర్మాన్వయము చెప్పుట. ఉదా॥. సఖి! నీశరీర మార్దవమును చూచినంతనే మాలతీలత, చంద్రరేఖ, అరటిమాను ఈ మూడింటి కాఠిన్యము తెలియును. ఇచ్చట శరీర మార్దవము వర్ణ్యము. మాలతీలతాదులు అవర్ణ్యములు. వీటికి కాఠిన్య రూపమైన ఏక ధర్మాన్వయమున్నది (చంద్రా. 39,40). *2. హితాహితవృత్తితౌల్యరూప.* లక్ష. శత్రువుల యందును, మిత్రుల యందును సమానవృత్తి వర్ణితమగుట, ఉదా। రాజా! నీవు శత్రువులకును, మిత్రులకును పరాభూతి నిచ్చితివి శత్రువులకు పరాభూతి (పరాజయము) ఇచ్చితివి; మిత్రులకు పరాభూతి (పరా= ఉత్కృష్టమైన భూతి=సంపూర్ణైశ్వర్యము) ఇచ్చితివి అని అర్థము. వాస్తవమునకు రాజుశత్రు, మిత్రులయందు సమానముగా వర్తించలేదు 'పరాభూతి' అను శబ్దసామ్యము ననుసరించి ఉన్న ఇక్కడి అలంకారము విచార్యమని తజ్ఞుల అభిప్రాయము (చంద్రా. 41). *3. ఉత్కృష్టసమీకరణోక్తరూప.* లక్ష. వర్ణించదలచిన వ్యక్తులనుగాని, వస్తువునుగాని ఉత్కృష్ట గుణములు గల వాటితో సమానము చేసి వర్ణించుట. ఉదా . ఇంద్రుడు, యముడు, వరుణుడు, కుబేరుడు వీరందరు లోకపాలకులే. రాజా! నీవునులోక పాలకుడవే. ఇంద్రాదులకుగల లోకపాలన అను ధర్మము ఉత్కృష్టమైనది. అది ఇంద్రాదులతోపాటు రాజునందు సమానముగా ఉన్నదని వర్ణితమైనది కాబట్టి ఇది ఉత్కృష్ట సమీకరణోక్తరూప-తుల్య యోగిత (చంద్రా. 42.).

*త్యక్తపునస్స్వీకృతము :* అర్థ దోషము. దీనినే 'నిర్ముక్తపునరుక్తము' అని గూడ అందురు. వివ. నిరాకాంక్షముగా పూర్తియైన అర్థమును (విషయమును) కారకాంతరముచే మరల చెప్పుట దోషము. ఉదా లక్ష్మీదేవితన భర్త కథను తనతండ్రికి చెప్పుమని కీర్తిని పంపుచున్నది: "ఖడ్గలత రాగా వృతాంగియై శత్రువుల కంఠములనే ఆలింగనము చేసి కొనుచున్నది. అది మాతంగ గణముల మీద పడుచుండగా పరులుచూచుచునే ఉన్నారు. అటువంటి(అసతియైన) దాని యందాసక్తుడై నీయల్లుడు (విష్ణువు) యుక్తాయుక్త విచారములేక వర్తిల్లుచున్నాడు. నీకీసంగతి తెలియనీ —అతడునన్ను తనభృత్యులకిచ్చివేసినాడు" అని 'లక్ష్మి' చెప్పిన సందేశమునుగొని 'కీర్తి' సముద్రుని

వద్దకువెళ్ళెను:—ఇట 'నీకీసంగతి తెలియనీ' అనుటతో విషయము నిరాకాంక్ష ముగా ముగిసినది. తర్వాత కారకాంతరముతో మరల చెప్పినది దోషము (కా.సం.4.పు.507).

*దశ ప్రాణములు* : భరతాదులు ఒప్పిన 10 కావ్యగుణములనే దండి దశప్రాణ ములనెను.

*దీపకము* : అర్థాలంకారము లక్ష. ప్రకృతములకును, అప్రకృతములకును గుణ క్రియారూపమైన ఏకధర్మాన్వయము దీపకము. దీనిలో ఔపమ్యము గమ్యమే. ఉదా సుజనులు పరోపకారమును, శూరులుశస్త్రమును, లోభులు ధనమును, కులసతులు వినయమును ప్రాణము పోయినను వదలరు (ర.గం.). దీనిలో సుజనుల పరోపకారము ప్రధానముగా చెప్పదలచినప్పుడు అది ప్రస్తు తమై మిగిలినవి అప్రస్తుతములగును. ఇట్లే శూరుల శస్త్రము మొ. ఆయా సందర్భముల ననుసరించి ప్రస్తుతములు కావచ్చు. ప్రస్తుతాప్రస్తుతములుఏవి అయినను అవి 'ప్రాణము పోయినను వదలరు' అను క్రియతో అన్వయము పొంది వాటి సాధారణ ధర్మసామ్యమును దీపింపచేయుచున్నవి. ఇంకొక ఉదా ఏనుగు మదముచేతను, రాజు ప్రతాపము చేతను *ప్రకాశించును*. ఏను గును వర్ణించునపుడు ఏనుగు ప్రధానమై ప్రస్తుతమగును, రాజు అప్రస్తుత మగును. అట్లే రాజుగూడ ప్రస్తుతము కావచ్చు. ఈ రెండు ఎటు మారినను 'ప్రకాశించును' అను క్రియతో ఏకధర్మ సామ్యమును వ్యక్తము జేయు చున్నవి. (చంద్రా.48). — సాదృశ్యగర్భ-గమ్యౌపమ్యాశ్రయ - వర్గము నకు చెందిన ఈ అర్థాలంకారము'దీపకన్యాయము'పై ఆధారపడినది. గుమ్మ ములో పెట్టిన దీపము అవతలి వస్తువులను, ఇవతలి వస్తువులను దీపింప చేసినట్లే ఒకేక్రియ ప్రస్తుత, అప్రస్తుతములకు అన్వయించుట దీనిలక్షణము. ఇట్లు వర్ణ్యావర్ణ్యముల ధర్మైక్యము దీపింపజేయు లక్షణమున్నది కాబట్టి దీనిని దీపకమనిరి. దీనిని మొదట చెప్పినది భరతుడే. అయినను దీని ప్రస్తుతా ప్రస్తుత విశేషములను చెప్పలేదు. దీనిలో ఉపమానోపమేయములు అంత ర్భూతములుగా ఉండవలెనని ఉద్భటుడు, వామనుడు అనిరి. 'ఉపమానోప మేయ వాక్యేష్వేకా క్రియా దీపకమ్' (కా సూ.వృ). దీని ఇంకొక భేదము 'కారకదీపకము' అని రుద్రటుడు చెప్పెను ప్రస్తుతాప్రస్తుతముల తుల్యత వరకే 'దీపకము' అని జయదేవుడు, ఇది తుల్యయోగితలో అంతర్గతమని జగన్నాథుడు చెప్పిరి (హిం.సా.కో). దీని ఔపమ్య గమ్యత్వమును గురించి విశ్వనాథుడు చెప్పడు (సా.ద.కా తేవ్యా.పు.162). దీని ముఖ్యభేదములు మూడు. చూ. 1. ఆవృత్తిదీపకము 2. కారక దీపకము 3.మాలాదీపకము.

*దీపకము - తుల్యయోగిత* : ఈ రెండలంకారముల లక్షణభేదములు తెలియ దగి నవి. 1. ప్రకృతాప్రకృతముల ధర్మైక్యము క్రియతో అన్వయించుట దీపకాలంకార మగును. 2. కేవలము ప్రకృతములకుగాని, కేవలము అప్రకృ తములకుగాని గుణ, క్రియాది రూపమైన ఏకధర్మాన్వయము చెప్పినచో

తుల్యయోగితా లంకారమగును. ఔపమ్య గమ్యములుగా మాత్రమే ఈరెం టికి వర్గసంబంధమున్నది.

*దుశ్శ్రవము* : పదదోషము. చూ. పరుషము.

*దృష్టాంతము* : అర్థాలంకారము. లక్ష. ఉపమానోపమేయభావములుగల రెండు వాక్యార్థములు వేరై వాటి ధర్మములు గూడవేరై ,నను ఆరెండు ధర్మములకు బింబప్రతిబింబభావము నిర్దేశించి చెప్పినచో దృష్టాంతాలంకారమగును. బింబప్రతిబింబ భావమనగా ఉపమేయవాక్యమునకున్న అవయవములన్ని ఉపమానవాక్యమునకుండుట. ఉదా రాజా! నీవే కీర్తిమంతుడవు, చంద్రుడే కాంతిమంతుడు ఈరెండు వాక్యములలోను ఉపమానోపమేయ భావమున్నది. కీర్తి ధర్మము, కాంతి ధర్మము భిన్నములని తెలియుచున్నది. అయినను రాజుదేకీర్తి, చంద్రునిదే కాంతి అని నిర్దేశించి చెప్పట వలన ఈభిన్నధర్మములు బింబ ప్రతిబింబ భావనతో సమానత్వమును పొందినవి కాబట్టి ఇది దృష్టాంతాలంకారమైనది (చంద్రా. 47) — దృష్టాంతము అనగా ప్రామాణికమైన అర్థమును నిర్దేశించి చూపునది. సాదృశ్యగర్భమై గమ్యౌపమ్యాశ్రయ వర్గమునకు చెందిన అలంకారమిది. ఉద్భటుడు, రుద్ర టుడు దీనిని వివేచించిరి. వస్తువులకున్న భిన్నసాధర్మ్యములను ప్రతిబింబ భావముతో చెప్పినచో దృష్టాంతాలంకారమని విశ్వనాథుడు దీనిని టూకీగా నిర్వచించెను. (హిం.సా కో).

*దృష్టాంతాదులు* : దృష్టాంతము, ప్రతివస్తూపమ, దీపకము, తుల్యయోగిత, అర్థాంతరన్యాసము, ఈఅలంకారముల పరస్పర సంబధము, భేదము తెలియ దగినది. 1. *దృష్టాంతము-ప్రతివస్తూపమ*: రెంటిలోను ఔపమ్యము (పోలిక) గమ్యమే. ఉపమానోపమేయ భావములుగల రెండు వాక్యార్థములలో ఉన్న భిన్న ధర్మములు బింబప్రతిబింబ భావనతో చెప్పినచో దృష్టాంతమగును. ప్రతివస్తూపమలోను ఉపమానోపమేయ భావములుగల రెండు వాక్యములుం డును. కాని ఆరెండు వాక్యార్థముల సామ్య ధర్మము ఒకటే అయినను అది భిన్న శబ్దముల ద్వారా ప్రకటితమగును. సాధారణ ధర్మము దృష్టాంత ములో 'బింబప్రతిబింబ' భావమై, ప్రతివస్తూపమలో'వస్తుప్రతివస్తు' భావమై ఉండునని తెలియవలె 2. *దృష్టాంతము-దీపకము*: రెంటిలోను ఉపమానము గమ్యమే అయినను ప్రకృతాప్రకృతముల భిన్నధర్మములు బింబప్రతిబింబ భావనతో సమానత్వమును పొందినట్లు చెప్పినచో దృష్టాంతాలంకారమగును. ప్రకృతా ప్రకృతముల భిన్నధర్మములను ఒక క్రియతో పొత్తుపరచి చెప్పి నచో దీపకాలంకారమగును. 3. *దృష్టాంతము - తుల్యయోగిత*: కేవలము ప్రకృతములకుగాని, కేవలము అప్రకృతములకుగాని గుణ, క్రియాది రూప మైన ఏక ధర్మాన్వయము చెప్పినచో తుల్యయోగిత. దృష్టాంత లక్షణము భిన్నమైనది. గమ్యౌపమ్య లక్షణమొక్కటే వీటి వర్గ సంబంధమునుకలుపు చున్నది. 4. *దృష్టాంతము-అర్థాంతరన్యాసము*: దృష్టాంతములోని ప్రకృతా

ప్రకృతములు రెండును సామాన్యములే కావచ్చు. లేదా విశేషములు కావచ్చు. అర్థాంతరన్యాసములోవలె సామాన్యముచే విశేషమును గాని, విశేషముచే సామాన్యమును గాని సమర్థించు లక్షణము దృష్టాంతములో ఉండదు. దృష్టాంతాలంకారమునకు ఇంకను యుక్తమైన ఉదాహరణములు కావలెనన్నచో చూ. (సా.ద.10-పు.168, కాణేవ్యాఖ్య). ప్రతివస్తూపమ, దృష్టాంతము ఇవి సాధర్మ్య, వైధర్మ్యభేదములచే ద్వివిధములు. చూ. కా.సం. 5 పు.654.

దోషములు : కవుల ప్రయోగములో పద, పదాంశ, అర్థ, వాక్య, రసాదులకు సంబంధించిన తప్పులను దోషములనిరి. ఏరకమైన దోషమైనను కావ్యములో ముఖ్యభాగమైన రసమునకే భంగము కల్గించును. 'రసాపకర్షకాదోషాః' (సా.ద.). చూ. పదదోషములు, పదాంశ దోషములు, అర్థదోషములు, వాక్యదోషములు, రసదోషములు.

నిదర్శన : అర్థాలంకారము. లక్ష. సమానములైన రెండు వాక్యార్థములకు (వస్తువులకు, ప్రకృతాప్రకృత ధర్మములకు) ఐక్యారోపము చేసిచూపినచో నిదర్శనాలంకారము. ఉదా। దాత సౌమ్యత, పూర్ణచంద్రుని అకళంకత. దానమిచ్చు వ్యక్తికి సౌమ్యగుణముండుట అసంభవము, చంద్రుడు కళంకరహితుడై ఉండుట అసంభవము ఇట ప్రకృతాప్రకృతములకు ఐక్యారోపము (అదే ఇది అని అభేదము). కాబట్టి ఇది నిదర్శనాలంకారము (చంద్రా. 48). ఇట్లు చేసిన ఐక్యారోపములో ఆరెండు అసంభవత్వముల 'సాదృశ్యము' బింబప్రతిబింబ భావమై పర్యవసానమున తేలినట్లు గ్రహింపవలసినది. దీనికి విశ్వనాథుని నిర్వచనము స్పష్టతరముగ ఉన్నది "సంభవన్ వస్తుసంబంధోఽసంభవన్ వాఽపికుత్రచిత్, యత్ర బింబానుబింబత్వం బోధయేత్సా నిదర్శనా" (సా.ద.10.61). సాదృశ్యగర్భమై గమ్యౌపమ్యాశ్రయ వర్గమునకుచెందిన అర్థాలంకారమిది. నిదర్శనము అనగా దృష్టాంతకరణము లేదా ఉదాహరణ ప్రదర్శనము అని అర్థము. "అభవన్, వస్తుసంబంధో భవన్వా యత్రకల్పయేత్, ఉపమానోపమేయత్వం కథ్యతేసా నిదర్శనా" అని ఉద్భటుడు (హిం.సా.కో). "సంభవతా అసంభవతావా వస్తుసంబంధేన గమ్యమాన మౌపమ్యం నిదర్శనా" అని రుయ్యకుడు. విశ్వనాథుడు ఉద్భటుని, రుయ్యకుని అనుసరించి చెప్పినట్లు రుజువైనది. ఉద్భటాదుల లక్షణము నంగీకరించినచో దీనికి రూపకాతిశయోక్త్యాదులందు అతివ్యాప్తి కల్గునని జగన్నాథుడనెను (ఆ.వి స.2.పు.496) దీనిలో ప్రకృతాప్రకృత ధర్మముల సంభవత్వ అసంభవత్వముల ప్రసక్తి నెత్తకయే జయదేవుడు చెప్పిన ప్రకారము ఈ అలంకారము మూడు విధములు: వాక్యార్థవృత్తి, పదార్థవృత్తి, సదసదర్థ బోధనరూప. *1.* వాక్యార్థవృత్తి. లక్ష. వాక్యార్థవృత్తి అనగా వాక్యార్థముల (వస్తువుల) సంబంధమునకు ఐక్యారోపము చెప్పుట. ఉదా దాత సౌమ్యత, పూర్ణచంద్రుని అకళంకత. ఇట ఒకవాక్యా

ర్థముపై మరొక వాక్యార్థము ఆరోపింపబడినది. కాబట్టి ఇది వాక్యార్థ వృత్తి-నిదర్శన. 2. పదార్థవృత్తి. లక్ష. పదార్థవృత్తి అనగా పదార్థ సంబంధమైనది. రెండు పదార్థముల (ఉపమానోపమేయముల) ధర్మములకు పోలిక అసంభవమే అయినను వాటికి ఐక్యారోపము కల్పించుట దీనిలక్షణము. ఉదా। నీనేత్రయుగళము నల్లగలువల లీలను దాల్చుచున్నది. నేత్రకాంతి ఒక పదార్థధర్మము, నల్లగలువల లీల (శోభ) మరొక పదార్థధర్మము. అది ఇది అగుట అసంభవమే అయినను ఐక్యారోపముచేసి చెప్పిన దానిలో సామ్యము బింబప్రతిబింబ భావమై పర్యవసాయి అగుచున్నది. ఒకపదార్థ ధర్మమునకు అన్యపదార్థ ధర్మారోపము జరిగినది కాబట్టి ఇది పదార్థవృత్తి—నిదర్శన.

3. సదసదర్థబోధనరూప. లక్ష. స్వాభావికముగా జరుగు ఒక కార్యములోని విశిష్టతను నిదర్శనముగా చూపి లోకమునకు మేలునో, కీడునో బోధించుట దీని లక్షణము. ఇది రెండు విధములు. (i) సదర్థబోధనరూప (మేలుసంగతిని చెప్పునది). ఉదా సంపదలకు ఫలము హితులనాదరించుటయే అని తెలుపుచు సూర్యుడు తానుదయించుచుండగానే పద్మములను కలకలలాడించును. సూర్యోదయముతో పద్మములు వికసించుట సంభవమే అయినను. ఆ కార్య విశిష్టతను నిదర్శనముగా చూపినకవి లోకమునకుమేలైన అర్థమునొకదానిని కల్పించినాడు. సంభవద్ధర్మముల ఐక్యారోపము, బింబప్రతిబింబభావమై పర్యవసానమున తేలిన సాదృశ్యము గ్రహింపదగినవి. (ii) అసదర్థబోధన రూప (కీడు సంగతిని చెప్పునది). ఉదా చంద్రోదయముకాగానే రాజవిరోధినశించును అనితెలుపుచు చీకటినశించును. మొదటిదానివలెనే దీనివివరణ గ్రహించవచ్చు. చీకటి (రాజవిరోధి=చంద్రవిరోధి).

*నిదర్శన—దృష్టాంతము* : ఈరెండలంకారముల లక్షణభేదము తెలియదగినది. 1. నిదర్శనలో ఉపమానోపమేయములైన రెండు వాక్యములు సాపేక్షములు (అన్వయ సంబంధము గలవి) 2. దృష్టాంతములోని రెండు వాక్యములు నిరపేక్షములు.

*నిరర్థకము* : లేదా అనర్థకము. పదదోషము. వివ. ప్రకరణ దృష్ట్యా నిరర్థకములై, పద్యపాదములు పూరించుటకు ఉపయోగించిన పదములు నిరర్థకములు. ఉదా లలి, పరగ, ఒగి, వంటి పదములను యతి, ప్రాసలు నిర్వహించుటకు, పాదాంతములు పూరించుటకు కవులు ప్రయోగింతురు. - వాక్యాలంకారములుగా వీటిని ప్రయోగించినచో దోషములు కావని వామనుడనెను. ఉదా। "తెలియనివన్ని తప్పులని.........భావ్యమెరుంగక పెద్దలైన వారల నిరసింతురా! ప్రగడరాణ్ణరసా! విరసా! తుసా! బుసా!" (తె.రా చాటువు) ఇట 'తుసా, బుసా,'లు వాక్యాలంకారములు. (కా.సం పు.450). తెనాలిరామకృష్ణుడు నరసకవిపై ఉమ్మివేసినట్లు సూచించు పదములివి అని కొందరు చెప్పిరి.

*నిరలంకృతి* : అర్థదోషము. వివ. రమణీయతలేనిది, నిరలంకృతి. ఉదా॥ ఈ రాజు బాహుయుతుడు-శ్లాఘ్యవిశేషణములేని వాక్యమిది. అనగా రమణీయమైన విశేషణము ఒక్కటైన లేనిది కాబట్టి నిరలంకృతి: 'ఇతని బాహుదండములు యమదండములు' వంటి ప్రయోగములు రమణీయములు (కా.సం.4, పు 500).

*నిరుక్తి* : అర్థాలంకారము. లక్ష శబ్దముల వ్యుత్పత్తిని బట్టి చమత్కారమైన అర్థములు కల్పించుట నిరుక్తి. ఉదా చంద్రా! నీచరిత్ర ఇట్లున్నది. నిజముగా నీవు దోషాకరుడవే (చంద్రా. 163) ఒక విరహిణి ఉపాలంభించిన విధమిది. చంద్రుడు దోషను (రాత్రిని)కల్పించువాడని ప్రసిద్ధార్థము. దోషములకు ఆకరమైనవాడని ఇక్కడ వ్యుత్పత్తిని బట్టి చమత్కృతి. ఇదొక గౌణాలంకారము, కువలయానందము ఒప్పినదే (హిం.సా.కో.).

*నిర్ముక్తపునరుక్తము* : అర్థదోషము. చూ. త్యక్తపునస్స్వీకృతము

*నేయార్థము* : పదదోషము, నిత్యము వివ. సంకేతార్థములను సూచించు శబ్దములుగూడ ప్రసిద్ధములై ఉండవలె. అట్లుగాక కవి కృత్రిమముగా నిర్మించుకొన్న స్వసంకేతమైన పదము నేయార్థము. ఉదా॥ వారు వ్యత్యస్త నవవృత్తులవలంబించిరి. 'నవ' అను పదమును వ్యత్యస్తముగా గ్రహించమని కవిసూచన. దాని ప్రకారము నవవృత్తి, 'వనవృత్తి' అగుచున్నది. ఇట్టి స్వసంకేతములు నిఘంటువులు బోధించనివి, రసభంజకములైనవి కాబట్టి దోషములు (ప్ర రు.5.14). సంకేతార్థమునకు బాధకలిగినచో రూఢి ప్రయోజనమును బట్టి లక్ష్యార్థమును గ్రహించవలె. సుప్రసిద్ధ సంకేతార్థముగాని, రూఢి ప్రయోజనముగాని లేని కవికల్పిత సంకేతార్థము నేయార్థము (కా సం.4 పు 449).

*న్యాయమూలకము* : ఒక న్యాయము మూలముగా వెలసినది అని అర్థము. అలంకారములలో 1. కావ్యన్యాయమూలకములు ఉన్నవి; వీటినే వాక్యన్యాయమూలకములందురు. అనగా మీమాంసాశాస్త్ర న్యాయములకు సంబంధించినవి. 2. లోకన్యాయ (వ్యవహార) మూలకములున్నవి 3. తర్కన్యాయమూలకములున్నవి, ఆయా అలంకారములు వివరించినచోట వాటి మూలములు చెప్పబడినవి.

*న్యూనపదత్వము* : వాక్యదోషము. చూ. న్యూనోపమ.

*న్యూనోపమ* : వాక్యదోషము వివ ఉపమానసామగ్రిలో కొరత. ఉన్నచో ఆదోషమును న్యూనోపమ అందురు ఉదా హైమవసనుడైన కృష్ణుడు మేఘనిభుడు' (కా.సం.4 33). ఇదిదోషము, బంగారు చేలము గట్టిన కృష్ణుడు మెరుగుదీగతో కూడినమేఘునితోతుల్యుడు అన్నచో ఉపమానము సరిపడును. దీనిని సా.ద.కర్త 'న్యూనపదత్వ' దోషమన్నాడు.

*పతత్ప్రకర్షము* : వాక్యదోషము. వివ. ఒకవాక్యము (లేదా. పద్యపాదము, భాగము) సరళశైలిలో, ఇంకొకటి పరుషపదములతో, ఇంకొకటి క్లిష్టబంధ

ముతో-వెనువెంట రచించుచుపోవుట. అనగా ఎత్తుగడలో ఉన్న శైలి పోను పోను వివిధరీతులలో పడిపోవుట పతత్ప్రకర్షదోషము. ఇది కొన్ని చోట్ల గుణము (కా.సం.4.పు.475).

*పదదోషములు :* పద (శబ్ద) గతములైన దోషములు 17. చూ. 1. అప్రయుక్తము 2. అపుష్టార్థము 3. నేయార్థము 4. అసమర్థము 5. నిరర్థకము 6. గ్రామ్యము 7. చ్యుతసంస్కారము 8. గూఢార్థము 9. అన్యార్థము 10. అశ్లీలము 11. అప్రతీతికము 12. అప్రయోజకము 13. క్లిష్టము 14. సందిగ్ధము 15. విపరీతధీప్రదము 16. అవిమృష్టవిధేయాంశము 17. పరుషము (కా.సం.4.పు.446). పదాంశ దోషములు 5 చూ. 1. పదాంశ దుశ్శ్రవము 2. పదాంశాశ్లీలము 3. పదాంశనేయార్థకము 4. పదాంశ నిహతార్థకము 5. పదాంశ-అవాచకము (కా.సం.4 పు.462).

*పదాంశదుశ్శ్రవము :* పదాంశదోషము. ఉదా "తద్గచ్ఛ సిద్ధ్యైకురు దేవకార్యం" ఇట 'సిద్ధ్యై' పదములో 'ద్ధ్యై' వర్ణము పదాంశము. ఒకే వర్ణము శ్రుతికటువుగా ఉన్నది కాబట్టి ఇది పదాంశ దుశ్శ్రవదోషము. రెండువర్ణములుదుశ్శ్రవముగా ఉన్నచోట పదదోషమని, ఒకే వర్ణము దుశ్శ్రవముగా ఉన్నచోట పదాంశదోషమని పండితుల అభిప్రాయము (కా.సం.4.వ్యా.పు.462)

*పదాంశదోషములు :* సమగ్రపదముగాక, పదములో ఏకదేశమైనది పదాంశము. పదమునందు ఏకవర్ణదోషము పదాంశదోషమని. ద్వివర్ణదోషము పదదోషమని పండితాభిప్రాయము. పదాంశదోషములుఐదు: చూ. 1. పదాంశ దుశ్శ్రవము 2. పదాంశాశ్లీలము 3. పదాంశనేయార్థకము 4. పదాంశ నిహతార్థకము 5. పదాంశ అవాచకము (కా.సం.4 పు.462).

*పదాంశనిహతార్థకము :* పదాంశదోషము. వివ. అప్రసిద్ధార్థమున ప్రయుక్తమైన పదాంశము పదాంశనిహతార్థకము. ఉదా. "ధాతుమత్తాం గిరిర్ధత్తే" 'మత్తా' శబ్దము ఇట ధాతువులుగలది అను అర్థములో ప్రయుక్తమైనది కాని దానికి 'మదిరాపాన మత్తురాలు' అను అర్థమే ప్రసిద్ధము. ఇటువంటి అప్రసిద్ధ ప్రయోగము దోషము (కా.సం.4.పు.463).

*పదాంశనేయార్థకము :* పదాంశదోషము. వివ. నేయార్థము పదాంశములో ఉన్నను దోషమే. ఉదా "సంగ్రామే నిహతాశ్శూరా వచోవాణత్వమాగతాః" - 'వచోవాణత్వము' (గీర్వాణత్వము = దేవత్వము) పొందిరి అన్న ప్రయోగములో 'గీః' శబ్దమును లక్షింప జేసిన వచశ్శబ్దము నేయార్థకము. అనగా కవి కృత్రిమముగా సృష్టించుకొన్న స్వసంకేతము (ఇట్టి ప్రయోగములకు రూఢిలేదు, ప్రయోజనము గూడాలేదు). (కా.సం.4 పు. 462).

*పదాంశాశ్లీలము :* పదాంశదోషము. ఉదా గుద్దంటద్రవిత్రవి (కళా.పూ.) 'గుద్దంట' పదములో'గుద' అశ్లీలద్యోతకముగా ఉన్నది.(కా.సం.4.పు.462).

*పదానుప్రాసము* : శబ్దాలంకార భేదము = ఛేకానుప్రాసము.

*పదాలంకారము* : పదము నిరర్థకమే అయినను వామనుని అభిప్రాయమును బట్టి కొన్నిచోట్ల అది పదాలంకార మగుచున్నది. ఉదా॥ మహాచ్ఛబ్దము కొన్ని చోట్ల దురర్థకము: మహాబ్రాహ్మణుడు = నింద్యుడైన బ్రాహ్మణుడు కాని 'మహాభారతము'లోని మహాచ్ఛబ్దము నిరర్థకము. అట్లే 'భీమసేన', 'చూతవృక్ష' పదబంధముల లోని సేన, వృక్ష పదములు నిరర్థకములే అయినను వీటిని పదాలంకారములని వామనాదులు చెప్పిరి (కా.సం.4.పు.450).

*పరికరము* : అర్థాలంకారము. లక్ష. విశేషణమును సాభిప్రాయముగా చెప్పినచో పరికరాలంకార మగును. ఉదా చంద్రుని శిరస్సున ధరించిన శివుడు మీ తాపమును పోగొట్టునుగాక. 'చంద్రుని శిరస్సునధరించిన' అను విశేషణము సాభిప్రాయము.చల్లనివానిని ధరించినవాడు మీతాపహరణమునకు సమర్థుడని అభిప్రాయము(చంద్రా.57).విశేషము వైచిత్ర్య సంబంధి అయిన అర్థాలంకారము. పరికరమనగా ఇక్కడ ఉపకరణము, శోభను అతిశయింపజేయు సామగ్రి అని అర్థము. రుద్రటునితో దీని వివేచన ప్రారంభమైనది. దీనిలో ఒకటికంటె ఎక్కువ విశేషణము లుండవలెనని విశ్వనాథుని అభిప్రాయము. దీని విశేషణములు వ్యంగ్యమును ప్రతిపాదించునవిగా ఉండవలెనని జగన్నాథుల అభిప్రాయము ఉదా॥ అంగరాజ! సేనాపతి! రాజవల్లభ! ద్రోణాపహాసి! కర్ణ! ఈ దుశ్శాసనుని భీమసేనుని నుండి కాపాడుము. (వే.సం.)—అశ్వత్థామ మాట ఇది. దుశ్శాసనుని కాపాడలేక పోయినచో కర్ణునికిగల ఆవిశేషణములు వ్యర్థములని వ్యంగ్యము స్ఫురించుచున్నది.

*పరికరాంకురము* : అర్థాలంకారము. లక్ష. విశేష్యమును సాభిప్రాయముగా చెప్పినచో పరికరాంకురాలంకారమగును. ఉదా॥ చతుర్విధపురుషార్థముల నిచ్చు దేవుడు చతుర్భుజుడు. నాల్గు హస్తములతో నాల్గు పురుషార్థముల నిచ్చుటకు సమర్థుడు అను అభిప్రాయము, దానిచమత్కారము 'చతుర్భుజుడు' అను విశేష్యమునందు ఇమిడి ఉన్నది. ఇట్లుండుట వలన దీనిని పరికరాంకుర మనిరి (చంద్రా.58). పరికరములో అంతర్భూతమగుఅలంకారము. జయదేవుడే దీనిని సంగ్రహించెను. విశేషణములో (పరికరములో) విశేష్యము రాకతప్పదు కాబట్టి దీనిని ప్రత్యేకాలంకారముగ గుర్తించవలసిన అవసరములేదని కొందరి అభిప్రాయము. (హిం.సా.కో).

*పరిణామము* : అర్థాలంకారము. లక్ష. విషయి (ఉపమానము) స్వతంత్రముగా కాక విషయ (ఉపమేయ) స్వరూపమును పొంది అనగా విషయముగా పరిణమించి ప్రకృతమునకు ఉపయోగించినచో (పరిణామార్థములో) 'పరిణామాలంకారము'. ఉదా॥ ప్రసన్నములైన నేత్రకమలములతో ఆ మధిరేక్షణ చూచుచున్నది (చంద్రా. 16). కమలము చూచుచున్నది కాని చూచు సామర్థ్యము దానికిలేదు. కమలము నేత్రముగా పరిణమించి చూచుచున్నది. ఈ అలంకారము రెండు విధములు: (i) *సామానాధికరణ్యపరిణామము*,

అనగా ఉపమానోపమేయములు సమాన విభక్తి యందుండునది. ఉదా॥ నీహేతి నీలాల నిచ్చెన. (ii) వైయధికరణ్య పరిణామము. అనగా ఉపమానోపమేయములు వివిధ విభక్తులలో ఉండునది. ఉదా॥ 'పున్నాగజాలకైర్హారాన్, కాంచీ కేసర దామభిః కర్ణికాః కర్ణికారైశ్చ విహర్తుం విదధుర్వనే'. తయువతుల వనవిహారమునకు హారాదులు స్వతంత్రోపయోగములుగాలేవు. (రతిలో అవిస్వతంత్రముగా ఉపయోగపడును గాని వన విహారమున కాదని భావము). అవి పున్నాగ జాలకాదులుగా పరిణమించి వనవిహారమున ఉపయోగించుచున్నవి. పున్నాగ జాలకాది ఉపమేయములు తృతీయాంతములు, హారాది ఉపమానములు ద్వితీయాంతములు. ఇది వ్యాకరణ దృష్ట్యా చేసిన విభజన, (కా.సం 5.పు.596_97) - సాదృశ్యగర్భ — అభేదప్రధాన-ఆరోప మూలకములైన అర్థాలంకారములలో ఇదొకటి. మొదట దీనిని రుయ్యకుడే వివేచించెను. మమ్మటుడు దీనిని గుర్తించడు, రూపకములోనే అంతర్భావము చేసినట్లున్నది. దీనికి సా.ద.కర్త నిర్వచనము అస్పష్టముగా ఉన్నది. చంద్రాలోక (కువలయానంద) నిర్వచనము బాగున్నది (హిం.సా.కో.).

**పరిణామము_రూపకము** : ఈ రెండలంకారముల లక్షణ భేదములు తెలియదగినవి. ఉపమేయ ధర్మమును ఉపమానము నందు అభేదముగా ఆరోపించినచో పరిణామాలంకారము, ఉపమాన ధర్మమును ఉపమేయమునందు అభేదముగా ఆరోపించినచో రూపకాలంకారము. ఉపమానము స్వతంత్రముగా ఉన్నచోటగాని, ఉదాసీనముగా ఉన్నచోటగాని ప్రకృత కార్యోపయోగము దానితోనే సిద్ధించినచోట, అది రూపకాలంకారమే అగుచున్నది (ఆ.వి.సం.2. పు.491).

**పరివృత్తి** : అర్థాలంకారము. లక్ష. తనవస్తువును ఇతరులకిచ్చి దానికి బదులుగా ఇతరుల వస్తువును పుచ్చుకొనుట పరివృత్తి (వినిమయము = వస్తువుల మార్పిడి). ఇది మూడు విధములు 1. సమము: ఇచ్చినది, పుచ్చుకొన్నదియు సమముగా ఉండుట. ఉదా॥ రఘుమహారాజు యాగముకొరకు(ఇంద్రాదులను తృప్తిపరచుటకు) భూమిని పిదికెను (పండించెను). ఇంద్రుడుసస్యముకొరకు (రాజును ప్రజలను తృప్తిపరచుటకు) ఆకాశమును పిండెను (వర్షింపచేసెను). (రఘు.) 2. అధికము: ఇచ్చినది ఎక్కువది, పుచ్చుకొన్నది తక్కువదిఅగుట ఉదా॥ ప్రతాపరుద్రుని శత్రురాజులు అడవులంబట్టి చెంచులకు తమ ఆభరణములిచ్చి వల్కలములు పుచ్చుకొనిరి (ప్రి.రు.). 3. న్యూనము: ఇచ్చినది తక్కువది, పుచ్చుకొన్నది ఎక్కువది అగుట. ఉదా॥ అతడు ఒక్కబాణమును విడిచి శత్రురాజుల సంపదలను నిశ్శేషముగా గ్రహించెను (చంద్రా.109)- వాక్యన్యాయమూలమైన అర్థాలంకారము. జయదేవుడు మొదటి భేదము (సమము) చెప్పలేదు. మూడవ భేదమునకు ఉదాహరణము ఈయలేదు. దీని మూడు భేదములు చెప్పినది మమ్మటుడు (హిం.సా.కో.).

**పరిసంఖ్యా :** అర్థాలంకారము. లక్ష. ఒక వస్తువును ఒకచోట విధించి (యంత్రణముచేసి) ఇంకొకచోట దానిని నిషేధించి (అదిలేదని, కాదని) వర్ణించినచో పరిసంఖ్య అని చంద్రాలోక మిచ్చిన నిర్వచనము. అట్లు నిషేధించుటలో వాచ్యముగానో, వ్యంగ్యముగానో చెప్పవచ్చునని మరి కొందరనిరి. ఇది నాల్గు విధములు 1. ప్రశ్నపూర్వక గమ్యమాన నిషేధ. ఉదా॥ భూషణమేది? యశస్సుకాని రత్నముకాదు (ఇట భూషణముయశస్సునందువిధింపబడి, రత్నమునందు నిషేధింపబడినది).2. ప్రశ్నపూర్వక వాచ్య(శబ్ద, కథన) నిషేధ. ఉదా సేవింపదగినదేది? పావనమైన గంగాతీరము (ఇతరులు అనగా బంధువులు మొ నిషేధము) 3. ప్రశ్నరహిత ప్రతీయమాననిషేధ. ఉదా॥ మహాపురుషులకు భక్తి శివునియందేకాని ఐశ్వర్యమందుకాదు, చింతకీర్తియందే కాని శరీరమందు కాదు. 4. ప్రశ్నరహిత వాచ్యనిషేధ. ఉదా రామ రాజ్యములో "పొలతుల వాలుచూపులయంద చాంచల్య మబలలనడుముల యందలేమి, కాంతాలకములంద కౌటిల్య సంచారము" (చాంచల్యము మొ ఇతర చోట్లలేవని వ్యంగ్యము. భాగ.) (ఆ.వి.స.2.పు.503;హిం. సా.కో.).

**పరుషము :** పదదోషము, అనిత్యము. వివ. శ్రుతి కటువులైన పదములు కృతి పరుషములగును. ఉదా 'కుద్ధేడ్జాపతి మూర్ధ ధృతార్ధోద్వధి పతిఁగొల్తు' అన్నచోట పరుషసంయుక్తాక్షర పదములున్నవి. ఇవి మృదువైన భక్తిభావమును ప్రకటించుట కసమర్థములైనవి. ఇట్టి పదరచనచే ఈ రసము అభివ్యక్తముకాదు కాబట్టి దోషము (కా.సం.4.21). ఈదోషమునే 'దుశ్శ్రవము' అనిరి.

**పరుషార్థము :** అర్థ దోషము. వివ. అర్థము పరుషముగా (శ్రుతికటువుగా) విన్పించినచో అది పరుషార్థదోషము. ఉదా మన్మథుడు వేమార్లు మంట బడినచో ఈభూవరుని సౌందర్యమునకు సరియగును (కా.సం.4.46). భావము బాగుగానున్నది కాని 'మంటబడు' అను శబ్దమే ఇట శ్రుతికటువుగా ఉన్నది. ఇది శబ్దదోషమనదగినది (అదేవ్యాఖ్య).

**పర్యాయము :** అర్థాలంకారము. లక్ష. (i) ఒకేవస్తువు అనేకాధారములందుగాని (ii) అనేకవస్తువులు ఒకే ఆధారమందుగాని వివిధకాలములందున్నట్లు పర్యాయము(క్రమము)గా వర్ణించినచో పర్యాయాలంకారము. ఉదా॥ (i) నరస భూపాలా! నీశౌర్యశిశువు శివునిలోఉండి కనువిప్పగానేర్చి, కుమారస్వామి నాశ్రయించి శక్తినిపుంజుకొని, శ్రీరామాదులనాశ్రయించి ఉచితమైనఅభ్యాసములెన్నో నేర్చి, భీముని వద్దపిడికిలి బట్టనేర్చి...ఇట్లుదినదినాభి వృద్ధినందినీ భుజము నాశ్రయించి కత్తిసామునేర్చినది (కా సం.5.218). దీనిలో ఒకే వస్తువు వివిధ ఆధారములందున్నట్లు వర్ణితమైనది. ఉదా (ii) శ్లో.మధురిమ రుచిరం వచఃఖలానా మమృత మహోప్రథమం పృథునవ్యనక్తి, అథకథయతి మోహహేతు మంతర్గతమివ హాలహాలంతదేవః—ఒకఖలవచనమునందే

అమృతము, విషము కాలభేదమున ఉన్నట్లు వర్ణితమైనది. (అదే పు 693)— వాక్యాన్వయమూలమైన ఈ అలంకారము రుద్రటుడు వివేచించినది. మమ్మటుడు, విశ్వనాథుడు దీని రెండు ప్రకారములు ఒప్పిరి (హిం.సా.కో.).

*పర్యాయము–విశేషము :* ఈ రెండలంకారముల వైశిష్ట్యములు కాలభేదమునుబట్టి తెలియదగినవి. ఒకే ఆధేయము (వస్తువు) వివిధ ఆధారములందు వివిధకాలములందున్నట్లు వర్ణించుట పర్యాయాలంకారము. ఒకే ఆధేయము వివిధ ఆధారములందు ఒకే కాలమున ఉన్నట్లు వర్ణించుట విశేషాలంకారము. చూ. విశేషాలంకారము రెండవ విధము.

*పర్యాయోక్తము :* అర్థాలంకారము. లక్ష. ప్రస్తుతమైన కార్యమును వర్ణించినప్పుడు ప్రస్తుతమే అయిన కారణము తోచెనేని పర్యాయోక్తాలంకారము. అప్రస్తుత ప్రశంసలో ప్రస్తుతము తోచును. ఇక్కడ ప్రస్తుత కార్యముతో ప్రస్తుత కారణమే స్ఫురించును. ఉదా నరసభూపాలా! నీశత్రురాజులఅంతః పురములలోని చిలుకలు గోడలకు చిత్రించిన రాజస్త్రీల చిత్రములపై కెగబడి 'చక్కెర చక్కెర' అని అరచుచున్నవి. నీదాడికి శత్రురాజుల పురములు పాడుబడినవని గమ్యమానమైన అర్థము. కార్యకారణములు రెండును ప్రస్తుతములే (కా.సం.5.177). గమ్యమును భంగ్యంతరముగా చెప్పుట పర్యాయోక్తము. కవిప్రతిభనుబట్టి ఇది వివిధములుగా ఉండవచ్చు. వ్యంగ్యము కంటె వాచ్యమే మనోహరము అన్నట్లు దీనిలో ఉన్న గమ్యార్థము- వాచ్యమునకు లొంగియున్నదై — ఆకర్షించును. వివక్షితార్థము అనగా చెప్పదలచిన అర్థము భంగ్యంతరముగా చెప్పుట పర్యాయోక్తము (ర.గం.).'పర్యాయేణ భంగ్యంతరేణ ఉక్తమేవ ఉక్తిః పర్యాయోక్తం' అని వ్యుత్పత్త్యర్థము——సాదృశ్యగర్భ గమ్యోపమ్యాశ్రయ వర్గమునకుచెందిన అర్థాలంకారమిది. పూర్వులు వివేచించినదే. దీనిలో వాచ్య—వాచక భావమునకు భిన్నమైన అర్థము ప్రకారాంతరముగా (పర్యాయేణ) చెప్పుట వలన ఆ అర్థము సంకేత రూపమున స్ఫురించును కాని అది 'ధ్వని' కాదు. దీనినే విశ్వనాథుడు 'భంగ్యాగమ్యం' అన్నాడు (హిం.సా.కో). ఒకమిష (వ్యాజము)తో ఇష్టసిద్ధి కలిగినచో అదిగూడ పర్యాయోక్తమే. ఉదా। 'మీరిక్కడ ఉండుడు, నేను మామిడి గున్నను చూడ పోదును.' అను మిషతో ఒక చెలికత్తె నాయికానాయకులు క్రీడించుటకు వీలుకల్పించి పోయినది (చంద్రా.64).

*పర్యాయోపమ :* చూ. ఉపమేయోపమ

*పాదయమకము :* శబ్దాలంకారము, యమకభేదము. లక్ష. '...రెండవపాదము, నాల్గవపాదంబు నొక్కనలువున దనరం జాలిన యమకము కృతులం దాలింపగ పాదయమకమగు' (కా.సం.4.79). ఉదా క. 'ఔరా! ఓబనృపాలకు మారా! మను! మదనసమ! రమాధుర్యుడవై; ధీరాన్నృసింహ కూడితి మారా మను మదనసమ రమాధుర్యుడవై' (అదే.4.80). కిందిగీట్లు గల పదములతో

ప్రారంభమైన 2,4 చరణములు తుల్యములు. లక్ష్య లక్షణములు ఇట సరి పడినవి. కా.సం. వ్యాఖ్యనుబట్టి పాదయమక భేదమునకుగల 11 భేదములలో ఇది ఐదవది అయిన 'సందష్టయమకము'. సందష్ట యమకమునకు భరతుడు చెప్పిన లక్ష్యలక్షణములువేరు: ప్రతిపాదమునకు మొదట రెండేసి వర్ణములో, పదములో సమానముగా ఉండుట సందష్టయమక లక్షణము. ఉదా॥ 'పశ్య పశ్య - యేనయేన-యేనయేన-తేనతేన' (నా.శా.16.76).

**విహితము :** అర్థాలంకారము. లక్ష. ఇతరుల వృత్తాంతమును కనిపెట్టిన వ్యక్తి యొక్క సాభిప్రాయచేష్ట పిహితము. ఉదా॥ భర్త ప్రాతఃకాలమున ఇల్లు చేరగనే భార్య అతనికి పక్కవేసెను. అతడు రాత్రిపరస్త్రీతో క్రీడించి అలసి నాడని తెలిసి, భార్య అట్లు సాభిప్రాయముగా చేసినది (చంద్రా. 151). ఇది అతిశయ వర్గమునకు చెందిన అలంకారమని రుద్రటుడు, మీలితాలంకార సంబంధమైన దని మమ్మటాదులు అనిరి (హిం.సా.కో.).

**పునరుక్తవదాభాసము :** శబ్దాలంకారము. లక్ష. భిన్నరూపములైన పదములకు పైకి ఒకే అర్థము ఉన్నట్లు భాసించుట, పర్యవసానమున అట్లు లేకుండుట దీని లక్షణము. ఉదా॥ 'కాకతిరాజు శ్రీపతి, పురుషోత్తముడు (ప్ర.రు.). 'పురుషోత్తమ' శబ్దార్థములు ఒకటే (విష్ణువు) అని మొదట కలుగు ప్రతీతి. కాకతిరాజు గొప్పధనవంతుడు, పురుషులలో ఉత్తముడు అనిపర్యవసానమున భిన్నార్థములు (కా.సం,4.వ్యా.పు.555). దీనిని మొదట వివేచించినది ఉద్భటుడు. మమ్మటాదులు అతని ననుసరించి దీని లక్షణమును పై విధముగా చెప్పిరి. జయదేవుడు దీనిని 'పునరుక్తప్రతీకాశము' అన్నాడు(హిం.సా.కో.).

**పునరుక్తి :** వాక్యదోషము. వివ. ఒకవాక్యములో ఒకసారి వాడిన శబ్దముగాని, అర్థము గాని మరల అదేఅర్థమున వాడినచో దానిని పునరుక్తిదోషమందురు. ఉదా॥ 'చక్రధరుడు చక్రాంచలముతో దనుజావళిని ద్రుంచును' (కా.సం.4. 26). దీనిలో 'చక్ర' శబ్దము పునరుక్తము. లాటానుప్రాసలో గాని (కమ లాక్షు నర్చించు కరములు కరములు); విషాద, విస్మయ, హర్ష, దైన్య, క్రోప, అవధారణ, ప్రసాదన, దయ వంటి అవస్థలను ప్రకటించు మాటలలో గాని (అయ్యయ్యో మొ॥); ఉద్దేశ్య ప్రతి నిర్దేశ్య విషయమునగాని (ఉదేతి సవితా తామ్రస్తామ్ర ఏవాస్తమేతిచ) పునరుక్తి దోషముకాదు (అదే వ్యాఖ్య.పు.467).

**పూర్ణోపమ :** ఉపమ రెండు విధములు: 1. పూర్ణోపమ 2. లుప్తోపమ. ఉపమించి (పోల్చి) చెప్పిన వాక్యములో నాల్గు అవయవములు ఉన్నచో అది పూర్ణోపమ. దీని భేదములు 6. చూ. ఉపమాభేదములు.

**పూర్వరూపము :** అర్థాలంకారము. లక్ష. స్వగుణమును విడిచి మరల స్వగుణ మును గ్రహించినచో పూర్వరూపము. ఉదా॥ శేషుడు శివుని కంఠస్పర్శచే నల్లబడిన వాడయ్యెను రాజా! నీకీర్తిచే మరల తెల్లబడెను (చంద్రా.140). శేషుడు మొదలు తెల్లనివాడు, పిమ్మట నల్లబడి, మరలకీర్తిగుణమైన తెల్లదన

మును పొందెను. ఇది లోకన్యాయ మూలమైన అలంకారము. జయదేవుడు స్థాపించినది (హిం.సా కో.).

*ప్రకాశితవిరుద్ధము* : అర్థదోషము. వివ. ఒక వాక్యముద్వారా వివక్షితమైన అర్థమునకు ప్రతికూలమైన అర్థము గోచరించినచో అది ప్రకాశిత విరుద్ధము. ఉదా , 'కుమారస్తేనరాధీశ! శ్రియం సమధిగచ్ఛతు'. రాజా! నీపుత్రుడు నీసిరిని బొందుగాక:—ఇట 'నీవుమరణింపుము' అను విరుద్ధార్థము ప్రకాశించుచున్నది కాబట్టి దోషము (కా.సం.4.పు.506).

*ప్రకృతము* : చూ. అవయవములు.

*ప్రక్రమభంగము* : వాక్యదోషము. వివ. వాక్యములోని పదములను ప్రారంభించిన క్రమమును తప్పించుట ప్రక్రమభంగము. ఉదా 'శౌరిదానవారి చక్రధారి; నభవు నమిత విభవు; ననవద్యచారిత్రు; విష్ణుగొల్తు,జిష్ణుఁగృష్ణుని' (కా.సం.4.25). మొదటి మూడుపదములు 'రి' వర్ణాంతములు, తర్వాతి రెండు'వు' వర్ణాంతములు, పిమ్మట అనవద్యచారిత్రు అని 'త్రు' వర్ణాంత పదమున్నది చివరి వరుసలో 'ష్ణు' వర్ణాంతముల మధ్య 'కొల్తు' పదము చేరినది. వాక్యములో పదవిన్యాసము ఇట్లున్నచో కొంత శ్రావ్యతలోపించునని తెలియుచున్నది. కానిఇట్టి ప్రక్రమభంగ దోషములుచేయని కవియే ఉండడు (అదే.పు.467).

*ప్రతివస్తూపమ* : అర్థాలంకారము. ఎదుటి వస్తువు యొక్క సామ్యధర్మము మొదటి వస్తువులో గమ్యమగుట అని అర్థము. లక్ష. ఉపమానోపమేయ భావము గల రెండు వాక్యార్థముల (వస్తువుల) ధర్మము ఒకటే అయినను అది భిన్నశబ్దములద్వారా ప్రకటితమగుట దీనిలక్షణము. ఉదా సూర్యుడు తాపముచే భ్రాజిల్లును, శూరుడు చాపముచే రాజిల్లును. ఇక్కడ రెండు వాక్యములలో భ్రాజిల్లు, రాజిల్లు అనుశబ్దములు వేరైనను అవి 'ప్రకాశించు' అను ఒక్కే ధర్మమును చెప్పుచున్నవి. శబ్దపునరావృత్తిని తప్పించు కొనుటకు కవి ఉపాయముతో చేసిన ప్రయోగమిది అని తెలియవలె. 'ప్రతివస్తు ప్రతి వాక్యార్థం ఉపమా సాధారణధర్మః యస్యాస్సా ఇతి వ్యుత్పత్తేరన్వర్థసంజ్ఞా" (చంద్రా, 46)—సాదృశ్యగర్భమై గమ్యౌపమ్యాశ్రయ వర్గమునకు చెందిన అర్థాలంకారమిది. భామహాదులు దీనిని ఉపమలో అంతర్భాగముగానే గణించిరి. ఇది స్వతంత్రమైన అలంకార మని మొదట వివేచించినవాడు ఉద్భటుడు. సామాన్యధర్మము ఒక్కటే రెండు వాక్యార్థములలో అంతర్నిహితమై భిన్నశబ్దముల ద్వారా ప్రకటిత మగుట దీనిలక్షణమని విశ్వనాథుడు చెప్పిన లక్షణము చంద్రాలోక లక్షణముతో సరిపడినది (హిం సా.కో.).

*ప్రతివస్తూపమ-ఉపమ* : ఈరెంటి భేదములు గమనించ దగినవి. 1. ఉపమలో ఔపమ్యము (పోలిక) వాచ్యము, ప్రతివస్తూపమలో అది గమ్యము. 2 ఉపమలో వాక్యమొకటే, ప్రతివస్తూపమలో రెండువాక్యార్థములుండును 3.ఉప

మలో ఉపమా వాచకములు (వలె, విధమున, కైవడి వంటి పదములు) సుప్రకటితములు, ప్రతివస్తూపమలో అవి అప్రకటితములు (సా.ద.10.పు. 166, కాణేవ్యాఖ్య).

**ప్రతిషేధము :** అర్థాలంకారము. లక్ష. ప్రసిద్ధమైన నిషిద్ధార్థమును క్రొత్తగా చెప్పుట ప్రతిషేధము. ఉదా జూదరీ! ఇది పాచికలతో జూద మాడుట కాదు, వాడి బాణములతోడి ఆట (చంద్రా. 164). యుద్ధము, జూదము ఈ రెండు సమానమైనవికావు. అయినను ఎదుటి జూదరిని అధిక్షేపించుటకై చెప్పినది —ఇదొక గౌణాలంకారము. 'విధి, ప్రతిషేధము' వీటి అలంకారత్వమును కువలయానందము చెప్పినది (హిం.సా.కో.).

**ప్రతీపము :** అర్థాలంకారము. లక్ష. ప్రతీపమనగా విపరీతము. ఉపమాలంకారమునకు విపరీతాలంకారము ప్రతీపము. ఉపమానోపమేయములను విపరీతములుచేసి వర్ణించుట దీని ముఖ్య లక్షణము. ఈ ప్రతీపము (విపరీతము) ఐదు విధములు. 1. ఉపమానోపమేయములను ఉపమేయోపమానములుగా చెప్పుట. ఉదా॥ బంగారమునిరాశతో నిప్పులోబడినగాని దానికి నీశరీరచ్ఛాయ రానేరదు (నీశరీరము బంగారము వంటిదనుట 'ఉపమ' ర. గం.). 2. ఉపమానము యొక్క అద్వితీయతను పరిహరించుటకు రెండవ సాదృశ్యము చెప్పుట. ఉదా మాహాత్మ్యమునకు ఎల్ల, గాంభీర్యమునకు పుట్టినిల్లు, రత్నముల కాశ్రయము అయినదినేనే. నాతో సాటి ఎవ్వడు? అని ఓ పాలసముద్రమా! తొందరపాటుతో తలపకుము. నీకు సమమైనవాడు దిల్లీశ్వరుడున్నాడు (ఆయాగుణములకు సముద్రముపమానము దానికి రెండవ సాదృశ్యము దిల్లీశ్వరుడని ర.గం.). 3. ఉపమేయము యొక్క అద్వితీయతను పరిహరించుటకు ఉపమానమును వ్యంగ్యముగా చెప్పుట. ఉదా ముద్దరాలా! నీకన్నుగవను తలచుకొని గర్వపడెదవేల? నీకన్నుల వంటి నల్లగలువలు ఒక్కొక్క కొలనిలో లెక్కకుమిక్కిలిఉన్నవి. 4. ఉపమానమును స్పష్టముగా తిరస్కరించుట. ఉదా దాని ముఖవిలాసము ముందు చంద్రుడెంత? పద్మమెంత? 5. సాదృశ్య విఘటనము (పోలికలేదని) కల్పించుట. ఉదా॥ సుందరి! వింటివా ఈ విపరీతము? నీముఖముతో చంద్రుడు సరిపోలునని జనులు వాడుకొందురట (కా.ప్ర.). ప్రాచీనులు చెప్పిన ఈ ప్రతీపాలంకార భేదములలో మొదటిమూడు 'ఉపమ' లోనివే. నాల్గవది 'ఆక్షేపాలంకారము' అని కొందరనిరి, ఐదవది 'అనుక్తవైధర్మ్య వ్యతిరేకము' అని ర.గం. (ఆ.వి.స.2.పు.505). లోకన్యాయమూలమైన అర్థాలంకారమిది. దీనిలో ఉపమానాపకర్షము 5 విధములుగా వర్ణితమగును. రుద్రటుడు దీనిని స్వరూపసామ్య వర్గములో చేర్చినాడు. దీనిలో ఉపమానమును నిషేధించుట లేదా తిరస్కరించుట ముఖ్యము అని మమ్మటుడు; ఉపమానమును హీనపరచి జయదేవుడు, ఉపమానమునకు ఉపమేయ రూపము కల్పించి కువలయానంద

కర్త చెప్పిరి. ఉపమానము వ్యర్థమని చెప్పట 'ప్రతీపము' అని సా.ద.కర్త. (హిం.సా.కో.).

*ప్రతీయమానము* : అర్థమునుగాని, రసమునుగాని, భావమునుగాని వ్యంగ్యముగా గోచరింపజేయునది.

*ప్రతీయమానవస్తుకము* : వస్తువును వ్యంగ్యముగా గోచరింపజేయునది (కా. సం.5.పు.564).

*ప్రతీయమానౌపమ్యము* : సామ్యమును వాచ్యముగా గాక వ్యంగ్యముగాతోపింపజేయునది (కా.సం.5 పు 563).

*ప్రత్యనీకము* : అర్థాలంకారము. లక్ష. శత్రువుల మీది కసితీర్చుకొనదలచి;అట్లు చేయలేక శత్రువుల బంధువులపై పరాక్రమించినట్లుచెప్పినచో ప్రత్యనీకము (అనికము=సైన్యము, ప్రత్యనీకము = సైన్యముతో సమానము). ఉదా। మనసా! మనోభవుని చంపిన శివునిమీద నీకున్న కోపముతో ఆతని భక్తుడనైన నన్ను సంసారమను బురదలో త్రోయుదువేల? నీపుత్రశోకమును కనబరచ వలసిన పద్ధతి ఇదియా? (మనస్సునకు పుత్రుడు మనోభవుడు=మన్మథుడు) ఈ అలంకారమునకు హేతూత్ప్రేక్షకు భేదములేదని, దానికిది భేదమని కొందరనిరి (ఆ.వి స.2 పు.504). లోకన్యాయ మూలమైన ఈ అర్థాలంకారమును రుద్రటుడాదిగా గుర్తించిరి (హిం.సా.కో.).

*ప్రమాణాలంకారములు* : అర్థాలంకారములు. లక్ష. నైయాయికుల ప్రమాణములు 4, వేదాంతులవి 6, మీమాంసకులవి 8, మీమాంసకుల 8 ప్రమాణములు తీసికొని అవి ఏ అలంకారములలో కనిపించునో వాటిని ఆ ప్రమాణముల పేరిటి అలంకారములనవలెనని కొందరి అభిప్రాయము. ఆఎనిమిది ఇవి: 1, ప్రత్యక్షము 2, అనుమానము 3, ఉపమానము 4, శబ్దము 5, ఐతిహ్యము 6, అర్థాపత్తి 7, అనుపలబ్ధి 8, సంభవము—వీటిలో 'ప్రత్యక్షము' 'భావికము' లోనిదిః అనుమానముః అందరు ఒప్పినదే. 'ఉపమానము' ఉపమయే. మిగిలినవి అలంకారములు కావని 'ఉద్ద్యోతము' (ఆ వి స 2 పు 514) హిం.సా.కో. వీటిని పేర్కొనదు.

*ప్రసాదము* : కావ్య గుణములు 10. వాటిలో రెండవది. వివ. ప్రసిద్ధములైన పదముల కూర్పుతో శిథిలబంధమైన శైలిని అమరించి పాంచాలీరీతికి అనుగుణముగా రచించుట ప్రసాదము. ఉదా 'ముంగిటి పెన్నిధాన; మిలు ముంగిటి కల్పక; మర్థికోటి ముంగొంగు పసిండి; చెంగటన కూడిన బంగరు కొండ; దొడ్డిలోనంగల గామధేనువు...నీవితరణంబు నృసింహ నృపాల శేఖరా' (కా.సం,459 )—'శైథిల్యం ప్రసాదః' అనివామనుడు దీనికి లక్షణముచెప్పి ఇది ఓజోగుణమునకు విపర్యయ రూపమన్నాడు. గుణవిపర్యయము దోషము కాబట్టి, ఓజోగుణ మిశ్రితమైనదే ప్రసాదగుణమని సిద్ధాంతీకరించినాడు (కా సం.4,పు.529). వామనుని సిద్ధాంతము సరిచూడదగినది:

దోషవిపర్యయములే కావ్యములో గుణములగుచున్నవి. "ఏతఏవవిపర్యస్తా గుణాః కావ్యేషు కీర్తితాః" (నా శా.17.95) అని భరత సిద్ధాంతము. 'విపర్యయ' మనగా అభావాత్మకతత్త్వమని భరతుని అభిప్రాయము. దీని అర్థము 'దోషాభావము' అని కొందరు, 'అన్యథాభావము' అని కొందరు, 'విపరీతభావము' అని మరి కొందరు చెప్పిరి. అ.గు. 'అభావ' మన్నాడు (హిం.సా.కో). ఏమైనను ఓజోగుణమునకు విపర్యయమైన ప్రతిది దోషము కానవసరము లేదుకాబట్టి 'ప్రసాదము' ఒక ప్రత్యేక గుణమే అగుచున్నది. కావ్యములను చదివించగల ఉత్తమగుణమిది.

*ప్రసిద్ధిత్యాగము* : వాక్యదోషము. దీనినే 'ప్రసిద్ధిహతము' అందురు. సా.ద.కర్త మొ పేర్కొన్నదిది. వివ. పశుపక్ష్యాదుల ధ్వనులకు, ఇతర వస్తువుల కదలికల ధ్వనులకు ప్రసిద్ధమైన అనుకరణ శబ్దములుండును. వాటిని త్యజించి కవులు స్వేచ్ఛగా ధ్వన్యనుకరణములు వేయుట దోషము. ఉదా పులి అరచును (అనగూడదు గాండ్రించును అనవలె). పేలాలు పుటపుట వేగును (అనగూడదు చిటపట వేగును అనవలె). ఈ విషయమున గూడ కవులు పొరపాట్లు చేసినట్లు సాక్ష్యములున్నవి (కా.సం.4.పు.482).

*ప్రసిద్ధివిరుద్ధము* : అర్థదోషము. చూ. విరుద్ధము.

*ప్రసిద్ధిహతము* : వాక్య దోషము. చూ. ప్రసిద్ధిత్యాగము.

*ప్రస్తుతము* : చూ. అవయవములు.

*ప్రస్తుతాంకురము* : అర్థాలంకారము. లక్ష. ఒక ప్రస్తుతమును చెప్పుచుండగా ఇంకొక ప్రస్తుతము స్ఫురించుట ప్రస్తుతాంకురము. ఉదా తుమ్మెదా! మాలతి ఉండగా ముండ్లతో కూడిన కేతకిని (మొగిలిపువ్వును) ఎందుకు కోరెదవు—ఒక ప్రియుని అతని ప్రియురాలు భ్రమరవ్యాజమున అన్న వాక్యమిది సౌందర్యవతిని, సులభముగా లభించుదానను నేనుండగా నన్ను కాదని కంటకప్రాయయు, సులభముగా లభించనిదియు అయిన పరకాంతను గోరుదువేల? అనిఅర్థము. తుమ్మెదచేష్ట, తనభర్తచేష్ట రెండును ప్రస్తుతమే కాబట్టి ఇది ప్రస్తుతాంకురము (చంద్రా.62) —ఇది 'అప్రస్తుత ప్రశంస' జాతికిచెందినది. దీనిని స్థాపించినది అప్పయ దీక్షితుడు (హిం సా.కో.).

*ప్రహర్షణము* : అర్థాలంకారము. లక్ష. ప్రయత్నములేకయే ఫలము లభించుట. ఇది మూడు విధములు 1. ఏప్రయత్నముచేయకుండగానే కోరికతీరుట. ఉదా తానువెదకవలె ననుకొన్నతీగ కాళ్ళకే చుట్టుకొనెను. 2. చేసిన ప్రయత్నముకంటె కావలసినదిఎక్కువ లభించుట. ఉ కొన్ని నీటి బిందువుల కోసము చాతక పక్షి వెదకుచుండగా మేఘము ప్రపంచమును జలమయము చేసెను. 3. ప్రయత్నము చేయుచుండగా ఆ ప్రయత్నముతో సంబంధము లేకనే ఫలము లభించుట. ఉదా। నిధులు కనిపెట్టు వేరును తవ్వుచుండగా నిధియే కనిపించెను. (ఆ.వి స.2.పు.510)—అపేక్షాకృతగౌణ వర్గమునకు చెందిన ఈ అలంకారమును జయదేవుడు వివేచించెను (హిం.సా.కో).

*ప్రేయోఽలంకారము* : అర్థాలంకారము. లక్ష. ఒక భావమును అన్యభావమునకు గాని, రసమునకుగాని అంగముగాచెప్పినచో అది ప్రేయోఽలంకారము. ఇదే భావాలంకారము. ఉదా। అంత్యకాలమున యముడు నామెడకు నాగపాశము తగిలించినప్పుడు ఓఫణిహార! నాకప్పుడు క్షణకాలమైనను నీపోలిక కలుగును. కాబట్టి నేను మరణావస్థలోను ఆనందమను భవింతును—దీనిలో భక్తిభావము (శివవిషయకరతి) అంగి, భక్తిరూపభావమునకు మరణావస్థ అనుభావము అంగము (ఆ.వి.స.2.పు.507). రసవదాది వర్గమునకు చెందిన అలంకారము. చూ. రసవత్ (హిం.సా.కో.).

*ప్రౌఢోక్తి* : అర్థాలంకారము. లక్ష. ఒక వస్తువు స్వాభావికముగా ఉత్కర్షగలదే అయినను, హేతువు కాని దానిని ఆవస్తువు యొక్క ఉత్కర్షకు హేతువు అని చెప్పుట ప్రౌఢోక్తి. ఉదా నీవు కుంకుమ నీళ్ళు పోసిపెంచిన లవలీలత ఇప్పుడు నీశరీరపు చాయను పోలుచున్నది—లవలీలత స్వాభావికముగా ఎఱ్ఱనిదే. అది ఎఱ్ఱదగుటకు కుంకుమనీళ్ళు పోయనక్కరలేదు. ప్రౌఢుల సంభాషణలో కొన్ని విచిత్రోక్తులు ఇట్లు వచ్చిపడును కాబట్టి ఇట్టి వాటిని ప్రౌఢోక్తులనిరి (ర.గం.)—గమ్యోపమ్యాశ్రయ వర్గమునకు చెందిన ఈ అలంకారమును జయదేవుడే మొదట వివేచించెను. (హిం.సా.కో.).

*బంధకవిత్వము* : శబ్దాలంకారములు. 'చిత్ర' నామకమైన శబ్దాలంకార భేదములే బంధాదులు. పద్మము, చక్రము వంటి చిత్రములను వ్రాసి, వాటిలో వర్ణములను బంధించి రచించు పద్ధతులు. ఇవే చిత్రబంధములు. 'గోమూత్రికా—అర్ధభ్రమ—సర్వతోభద్ర' చిత్ర బంధములను దండి వివేచించినాడు (కావ్యా.3.78-82). అగ్నిపురాణము 'బాణ - బాణాసన—వ్యోమ—ఖడ్గ—ముద్గర—శక్తి - మృదంగ - పద్మ-ముసల-అంకుశాది బంధములను గురించి వివేచించి ఇవి అనంతములన్నది "ఏతేబంధాస్తథా చాన్యేప్యేవం జ్ఞేయాః స్వయం బుధైః". మమ్మటుడు ఇవి 'కష్టకావ్యములు' అని ఖడ్గ - మురజ—పద్మ - సర్వతోభద్రములను మాత్రమే ఉదాహరించినాడు. కా.సం. లో ఉదాహరించినవి ఇవి:

1. పద్మబంధము. లక్ష. మొదలు కర్ణికను వ్రాసి దానికెనిమిదిదిక్కులందు ఎనిమిది దళములనువు పరచవలె(వీటిలో 4 దిగ్దళములు, 4 విదిగ్దళములు). నాల్గు దిగ్దళములలో స్రగ్ధరా వృత్తము యొక్క పాదాదులందున్న ఏడు వర్ణములను, పాదాంతము లందున్న ఏడువర్ణములను ప్రవేశ - నిర్గమ విధమున వ్రాయవలె. విదిగ్దళములలో పాద మధ్యముననున్న ఏడువర్ణములు లిఖించవలె. చదువునపుడు కర్ణికనుండి ప్రారంభించి ఉత్తరదిగ్దళమును చదివి, నిర్గమ—ప్రవేశములతో పూర్తి చేయవచ్చు. కా.సం. చూపిన పద్మబంధలక్షణమిది. కా.ప్ర., సా.ద, మొ చెప్పిన లక్షణములువేరు. పద్మబంధమునకు స్రగ్ధరా వృత్తమే నిబంధించవలెనను నియమములేదు. అనుష్టుప్

వృత్తముగూడ నిబంధించిరి (కా.సం.4.వ్యా.పు.558). పద్మబంధములలో అష్టదళ, ద్వాదశదళ, షోడశదళ భేదములున్నవి.. చూ. అప్పకవీయము. 2. చక్రబంధము. లక్ష. ఒక దానిలో ఒకటి చొప్పున పదిసున్నలు వ్రాసి, ఆరు రేకులు రచించి, ఆరేకులలో స్రగ్ధరావృత్త పాదములు మూడు వ్రాసి, నాల్గవపాదమును పెద్దసున్న (చక్రము) లో వ్రాసి, రేకులోని మూడవ అక్షరములను ఆరవ అక్షరములను కలిపి, కవి-కృతిపతుల పేర్లు పడునట్లు రచించినచో చక్రబంధమగును (ఇది అప్పకవీయ లక్షణము). కా.సం. ఇచ్చిన ఉదాహరణములోను 'మూర్తికవి' 'నారసింహాంకితం' అని కవి-కృతిపతుల పేర్లు వచ్చినవి (కా.సం.4.86). 3. గర్భకవిత్వము. లక్ష. (i) ఒక పద్యము మొదట, చివర కొన్ని అక్షరములు విడిచి చదివినచో ఇంకొక విధమైనపద్య మేర్పడుట (ii) అట్లే ఒకే వృత్తములో రెండు పద్యము లిమిడి ఉండుట (iii) ఒకే పద్యమును విరిచి చదివినపుడు అదేరకమైన పద్యముగాని, ఇతర విధమైనదిగాని ఇంకొకటి వెడలు నట్లుండుట మొ గర్భరచనలు. ఉదా సీ. 'మ-హితవిద్వజ్జన మండలీ వినుత సాహిత్య ప్రియంభావుకా - త్యుదార' (కా.సం.4,88). ఇది సీసపద్యము. హైఫన్ గుర్తులకు ఈవలావల ఉన్న అక్షరములను విడిచి చదివినప్పుడు 'మత్తేభము' గర్భవృత్తముగా ఉన్నట్లు తెలియును. ఈసీసము చివర రచించిన గీతము నుండి ప్రారంభించి 'గుణనిధీ!' అను పదము వరకు చదివినచో కందపద్యము వచ్చును.

4. ప్రహేళికలు. వివ. అర్థస్వరూపమును తెలుపక భావమును మాత్రము సూచించునది ప్రహేళిక. 'ప్రహేళయతి సూచయతి భావం నతు స్వరూపార్థ మితి ప్రహేళికా'. ఇది పొడుపుకథ వంటిది. క్రీడా-గోష్ఠీ-వినోదములకో, రహస్య వ్యవహారములకో పనికి రావచ్చు కాని ఇది అలంకారము కాదని సాహిత్యవేత్తల అభిప్రాయము. లక్ష. ఒకవర్ణమును తొలగించిగాని, ఒకటి అధికముగా వేసిగాని, కేవలము సున్నలు గుర్తులుగా ఉంచి ఆ పద్యమును గుర్తించుమనిగాని రచించు ప్రక్రియలివి. ఉదా (i) చ్యుతాక్షర: 'కూజంతి కోకిలాస్సాలే'. దీనిలో 'ర' కారముచ్యుతమైనది. రసాలమని అభిప్రాయము. (ii) దత్తాక్షర: 'యావనే ఫుల్లమంబుజం'. దీనిలో 'యా' వర్ణమధికముగా ఇచ్చినది. (iii) బిందుమతి: కొన్నిసున్నలు ఒక పద్యమునకు గుర్తులుగాపెట్టి ఆపద్యమును కనుగొనుమనుట. విశేషములకు చూ. ఆంధ్ర సాహిత్య దర్పణము.

భావశబలత : అర్థాలంకారము. లక్ష. భావశబలతను అంగముగా వర్ణించుట. ఉదా। '...దాని ముఖము కోపమున గూడ ఎంత చక్కగానుండెను! ధర్మజ్ఞులైన పెద్దలేమందురు? అది కలలోనైన దొరకునా? చిత్తమా, శాంతింపుము...' (అ.స.) దీనిలో క్రమముగా స్మరణము, అపవాదభయము, శంక, ధృతి ఈభావము లన్నియు కూడినవి కాబట్టి భావశబలత. ఈ వాక్యములో

విప్రలంభము అంగి, భావశబలత అంగమై అలంకారమైనది. (ఆ.వి.స.2.పు.508)—వర్గమునకు చూ. భావోదయము.

*భావసంధి* : అర్థాలంకారము. లక్ష. భావసంధిని ఇంకొకదానికి అంగముగా చెప్పుట. ఉదా। రాజా! యుద్ధసన్నద్ధులై వెడలు నీ వీరులు తమ ఎడమ చేతులతో ప్రియురాండ్ర బాష్పధారలను, కుడిచేతులతో శస్త్రధారలను తుడుచుచు కొంతసేపు ముగ్ధులైరి (అ.స.). ఇటరాజభక్తిభావము అంగి; ప్రియురాండ్రమీది ప్రేమ, యుద్ధకౌతుకము, ఈ రెండు భావములకు సంధి (పోటీ). ఈ 'భావసంధి' అలంకారము (ఆ.వి.స.2.పు.508)—భావోదయాది వర్గమునకు చెందిన అలంకారము. చూ. భావోదయము.

*భావికము* : అర్థాలంకారము. లక్ష. జరిగినదిగాని, జరుగబోవునదిగాని వర్ణించి అత్యద్భుత కథనము వలన పాఠకుల హృదయమునకు సాక్షాత్కరింపజేసినచో భావికము. ఇది రెండు విధములు. (i) *భూతభావికము*. జరిగిన కథాఘట్టము లను సాక్షాత్కరింప జేయునది. ఉదా। అతడు యుద్ధరంగమున వీరవిహారము చేయుచు పూర్వము ఇంద్రుడు వజ్రాయుధమును ధరించి కొండల రెక్కలు ఛేదించిన ఘట్టములను, మందర పర్వతము సముద్రమును అల్లకల్లోలముగా చిలికిన కథలను సాక్షాత్తుగా చూపెను (ii) *భావిభావికము*. జరుగబోవు దానిని సాక్షాత్కరింపజేయునది, ఉదా 'భావిభూషణ సంభారాం సాక్షాత్కుర్వే తవాకృతిమ్': ముందుభూషణ సంభారమును దాల్చునీ ఆకారమును సాక్షాత్కరించుకొనుచున్నాను (కా.సం.వి.పు.690). గూఢార్థప్రతీతి మూలకమైన అలంకారమిది. భూత, భవిష్యద్భావములు ప్రత్యక్షముగా దర్శించునట్లున్నచోట ఈ అలంకారముండును. భావికమునకు సా.ద. కర్త చెప్పిన లక్షణము సూటిగా అమరినది 'అద్భుతస్య పదార్థస్య భూతస్యాథ భవిష్యతః, ప్రత్యక్షాయమాణత్వం తద్భావిక ముదాహృతమ్' (హిం.సా.కో.). చూ. భావికము - స్వభావోక్తి మొ। వాటికిగల భేదములు.

*భావికము-స్వభావోక్తి మొ॥* : భావికము, స్వభావోక్తి, రసవత్, భ్రాంతి ఈ అలంకారముల భేదములు తెలియదగినవి: 1. భావికములో భూతకాలము నకో. భవిష్యత్తుకో సంబంధించిన అద్భుతవర్ణన ముఖ్యము. 2. స్వభావోక్తిలో ప్రస్తుతవస్తు ధర్మమును అసామాన్యముగ, స్వాభావిక చేష్టాసహితముగ వర్ణించుట ముఖ్యము. భావికములో భూత, భావి అర్థములు సాక్షాత్కరించు నట్లు వర్ణితమగును. 3. రసవదలంకారములో విభావాదుల ననుసరించి రసతత్వ దృక్పథముండును. 4. భావికములో భ్రాంతిలేదు (హిం.సా.కో., ఆ.వి.స.2.).

*భావోదయము* : అర్థాలంకారము. లక్ష. రసమునకుగాని, భావమునకుగాని భావ మును అంగముగా వర్ణించినచో భావోదయము. ఉదా। మిత్రులతో కలసి మధుపానము చేయుచున్న నీవైరులు నీపేరు విని ఉలికిపడిరి—ఇక్కడ రాజరతి భావము అంగి. ఉలికిపడినప్పటిది (భయము) భావోదయము. (ఆ.వి.స.2. పు. 508).—రసవదాది వర్గము వలెనే భావోదయాది వర్గమొకటి. దీనికి

సంబంధించిన అలంకారములు: భావోదయ, భావసంధి, భావశబలతలు. వీటిని రుయ్యకుడు వివేచించెను. తర్వాత సా.ద. కువలయానందము వీటిని చర్చించినవి (హిం.సా.కో.).

*భిన్నము* : అర్థదోషము. వివ. సంబంధము లేకుండచెప్పిన అర్థము భిన్నము. ఉదా 'ఈతనివిరోధి పృథివీశ్వరుఁడాపన్నుండై తననుదురువ నన్నలినజు వ్రాత శూన్యమని పలుకును' (కా.సం.4 54). తననొసట బ్రహ్మ వ్రాత లేకుండుటకు తాను పడుచున్న ఆపదకు సంబంధ మేమియులేదు. ఈ భిన్న సంబంధము దోషము. బ్రహ్మ వ్రాసిన చెడు వ్రాతకును ఆపన్నత్వమునకును సంబంధ ముండును.

*భిన్నలింగము* : వాక్యదోషము. వివ. ఉపమానోపమేయములు భిన్నలింగ ములలో ఉండుట దోషము. ఉదా॥ 'ఇంతి వనజారివలె ఉన్నది' (కా.సం. 4.38). ఉపమేయము స్త్రీ లింగము, ఉపమానము (వనజారి=చంద్రుడు) పుంలింగము. కొన్ని చోట్ల ఇదిదోషము కాదని దండి సమర్థించినాడు. ఉదా। కొజ్జావాడు స్త్రీవలె నడచును—ఇది భిన్నలింగమైనను సరసముగా ఉన్నది (అదే.పు.477).

*భిన్నవచనము* : వాక్యదోషము. వివ. ఉపమానోపమేయములు భిన్న వచన ములలో ఉన్నట్లు చెప్పుట దోషము. ఉదా। 'ఖడ్గమురగవరుల కరణినున్నది' (కా.సం. 4.38). ఖడ్గము సర్పములవలె ఉన్నది అన్న వాక్యములో ఉపమే యము ఏకవచనము, ఉపమానము బహువచనము.

*భేదాభేదములు* : చూ. సాధర్మ్యవిధములు.

*భ్రాంతిమదలంకారము* : లక్ష. సాదృశ్యము వలన ఒక వస్తువును చూచి ఇంకొక వస్తువుగా భ్రమించుట 'భ్రాంతిమంతము'. ఉదా॥ మిన్నుముట్టిన నరస భూపాలుని కీర్తిని చూచి అది ఆకాశగంగ అని (భ్రమపడి) హర్షించి అందులో సప్తర్షులు స్నానమాడదలచిరి. ఉపమానమైన గంగ హర్షానుభవమునకు కారణమైనది. స్మరణాలంకారమున స్మరణమేకాని అనుభవముండదు. భ్రాంతిలో అనుభవదశకొంత ఉన్నది. 'అంకము జేరి శైలతనయాస్తన దుగ్ధము లానువేళ' (మ.చ.) అన్నచోటగూడ భ్రాంతిమంతమే. ఇది రెండువిధములు. 1. అన్యోన్యవిషయక భ్రాంతి. ఉదా తుమ్మెద, మోదుగపువ్వని భ్రమించి చిలుక ముక్కుపై బడుచున్నది. అదినేరేడుపండని భ్రమించి ఆ చిలుక దానిని పట్టనుంకించు చున్నది 'పలాశముకుళ భ్రాంత్యా శుకతుండే పతత్యళిః। సోఽపి జంబూఫల భ్రాంత్యాతమళింధర్తుమిచ్ఛతి' (ఇది అన్యోన్యవిషయక= పరస్పర భ్రాంతి). 2. ఉత్తరోత్తర భ్రాంతి. ఉదా ఒక జవరాలు తనముఖ గంధమాఘ్రాణించి వచ్చిన తుమ్మెదను అదలించెను, ఆ తుమ్మెద ఆమెచూపులు నల్లకలువలనుకొని కన్నులపై వ్రాలెను. మరల ఆమె చేయి విదలింపగా ఆ చేయిని తామరపూవనుకొని భ్రమసి దానిపై వ్రాలెను. ఏమిచేసినను తన చేష్టను మానని తుమ్మెదను చూచి ఆ జవరాలునవ్వెను (కా.సం.5.పు.600).

సాదృశ్యగర్భ — అభేదప్రధాన - ఆరోపమూలకములైన అర్థాలంకార-
ములలో ఒకటి. మొదట రుద్రటుడే దీనిని ఔపమ్యాలంకారముగా గుర్తిం
చెను. సాదృశ్యము కారణముగా జనించిన భ్రాంతి (అజ్ఞానము) మాత్రమే
కాదు. ఉక్తిలో కవిప్రతిభ ఉన్నప్పుడే దీనికి అలంకారత్వము అని రుయ్యకుడు.
సా.ద.కర్తమొ వారు రుయ్యకుని అనుసరించి చెప్పిరి (హిం.సా.కో).

**మసృణత్వము :** చూ. శ్లేష (కావ్యగుణము).

**మాధుర్యము :** కావ్య గుణములు 10. వాటిలో మూడవది. వివ. సరసములైన
పదములతో, వాక్యములతో కూర్చిన రచన మాధుర్యము, ఉదా 'అనయము
మత్స్య యంత్రమునొక్కమ్మున శ్రీనరసింహుడేయగా, వెనుకకుజారి, పుల్ల
రచి, వేషముమార్చి, బిలంబుదూరి, కాననమునకేగి, సిగ్గుననణంగి, భరంపడి
పీగి, తావిషంబెనసి, నతిన్ భజించి, నదులీది, భ్రమించెను రాసులన్నియున్'
(కా.సం.4.60). నరసభూపాలుడు మత్స్యయంత్రమును భేదించినాడు. అది
వాస్తవమే అయియుండును. అది ఆధారముగా, నరపరాజు 12 రాసులలో
ఉన్న మీనరాశిని భేదించినాడని కవిచమత్కరించి 'మీనము' పాటునుచూచి
మిగతా రాసులు అలజడిపాలైనట్లు వర్ణించినాడు. మీనము ఎగిరిపడుట
చూచి మేషము వెనకకు పరుగెత్తినది, వృషభము గడ్డిగరచినది, మిథునము
వేషముమార్చినది, కర్కాటకముబిలముదూరినది, సింహముఅడవిబాటబట్టినది,
కన్యసిగ్గుపడి నక్కినది, తుల బరువెక్కివంగినది, వృశ్చికము విషము తిన్నది,
ధనుస్సు వంగిపోయినది, మకరము నదులలో బడినది, కుంభము దొల్లిపోయి
నది అని కవివర్ణన. దీనిలో రాసులపేర్లుగా ఉన్న వస్తువుల స్వాభావిక
వ్యాపారమును బట్టి కవి తనప్రౌఢోక్తిచే మాధుర్యగుణమును సంతరిం
చినాడు.

**మాలాదీపకము :** అర్థాలంకారము. లక్ష. దీపకము, ఏకావళి ఈరెండు కలిసి
ఏర్పడినది మాలాదీపకాలంకారము. ఉదా॥ మన్మథుడామె హృదయములో,
ఆమెహృదయము నీలో వసించెను. 'వసించెను' అనుక్రియ మన్మథునికి,
హృదయమునకు రెంటికి అన్వయించుచున్నది. ఇది దీపకలక్షణము. హృదయ
శబ్దము గ్రహించి విశువనైనది. ఇది ఏకావళి లక్షణము. వెరసి మాలాదీప
కము. (చంద్రా. 104)—దీపకసంబంధమైన శృంఖలామూలక అర్థాలం
కారమిది. మమ్మటాదులు దీనికి ప్రాచుర్యము కల్పించిరి. సా.ద. కర్త
చెప్పిన లక్షణము కంటె జయదేవాదులు చెప్పిన లక్షణమే స్పష్టతరముగా
ఉన్నది (హిం.సా.కో.).

**మాలాదీపకము—కారణమాల :** ఈరెండు అలంకారములలోను పూర్వము చెప్పిన
పదార్థములకు, ఉత్తరోత్తర వర్ణించిన పదార్థములకు సంబంధము స్థాపిత
మగునట్లు చూతుము. కాని ఈరెంటి ప్రత్యేకలక్షణములు గమనించదగినవి:
4, మాలాదీపకము: దీనిలోపూర్వముచెప్పినవాటికి, ఉత్తరోత్తరమువర్ణించిన

వాటికి విశేషణ—విశేష్యభావ సంబంధముండును 2. కారణమాల: దీనిలో పూర్వము చెప్పిన వాటికి, ఉత్తరోత్తర వర్ణించిన వాటికి కార్య - కారణ సంబంధముండును.

*మిథ్యాధ్యవసితి* : అర్థాలంకారము. లక్ష. మిథ్య అనగా పాలుకిక్కి. ఒకదాని మిథ్యాత్వము సిద్ధించుటకు ఇంకొక మిథ్యార్థము కల్పించుట మిథ్యాధ్యవసితి. ఉదా గగన పుష్పములు ధరించి వేశ్యను వశపరచుకొనును. వేశ్యావశ్యమగుట పాలుకిక్కి, గగనకుసుమమాలికను ధరించి దానిని వశపరచుకొనుట మీదు మిక్కిలి పాలుకిక్కి. మొదటి పాలుకిక్కి సిద్ధించుటకై రెండవ పాలుకిక్కి కల్పించ బడినది, (చంద్రా. 124)—కార్యకారణమూలకమైన అలంకారము జయదేవాదులు చెప్పినది (హిం.సా.కో.).

*మీలితము* : అర్థాలంకారము. లక్ష. ఒక వస్తువునకు గుణాధిక్యము వర్ణించి రెండవవస్తువు (సాధారణధర్మము వలన) మొదటి దానిలో కలిసిపోయినట్లు చెప్పుట మీలనము. ఉదా (i) పగడము వంటి పెదవులుగల నీవు తాంబూలము వేసికొంటివని తెలిసికొనుటెట్లు? (ర.గం.) అధరరాగకాంతిలో తాంబూలపు కాంతి అణగిపోయి భేదము తెలియనిదైనది. ఉదా (ii) రాజా! తెల్లగావ్యాపించిన నీయశస్సులో మునిగిపోయిన దేవతలు శీతమును బట్టి హిమవత్పర్వతమును గుర్తింతురు (ఉద్ద్యోతము). ఇట ప్రపంచమునకు కల్గిన ధావళ్య మాగంతుకము. ఇది 'ఉన్మీలితము'నకు ఉదాహరణ మని కొందరు. చూ. కువల (ఆ.వి.స.2.పు.505).—లోకన్యాయమూలమైన అర్థాలంకారము. మొదట ఇది రుద్రటుని కావ్యాలంకారములోనే కనిపించినది. 'మీలితం వస్తునోగుప్తిః కేనచిత్ తుల్యలక్షణా' అని సా.ద. చెప్పిన లక్షణము సరళముగా ఉన్నది (హిం.సా.కో.).

*ముక్తపదగ్రస్తము* : శబ్దాలంకారము, యమకభేదము. లక్ష. పద్యపాదము చివరగల పదముగాని, వర్ణసముదాయముగాని (తుల్యవర్ణములుగలదై) తర్వాతి పాదము మొదట మరల ఆవృత్తమగుచు పోవుట దీనిలక్షణము. ఉదా సుదతీనూతన మదనా! మదనాగతురంగ పూర్ణమణిమయ సదనా! సదనామయగజ రదనా! రదనాగేంద్ర నిభకీర్తిరస నరసింహా! (కావ్యం. 4.82). ఇది పాదాంత, పాదాది ముక్తపదగ్రస్తము (అంతాదికము) అని భట్టుమూర్తి. ఇది పాదభాగ యమక భేదము, ద్వివిధము. దీనినిదండి సందష్ట యమకమన్నాడు. 'అంతాదియమకము, ఆద్యంతయమకము' అని కావ్యప్ర. మె (కా.సం.4.వ్యా.పు.558). భట్టుమూర్తి వివరించిన దీని రెండవభేదము 'సింహావలోకన ముక్తపదగ్రస్తము' ముక్తపదగ్రస్త లక్షణమే ఉండి పద్య పాదాంతమున ఉన్నవర్ణ, పదములు పద్యాదినిగల వాటితో తుల్యములగుట దీని ప్రత్యేకత. సింహము కొంత దూరమునడచి తానుబయలుదేరిన స్థానము వైపునకు తిరిగిచూచునను వాడుకనుబట్టి ఈ యమకగతికీపేరు తగినది. ఉదా। క. 'మనవేటికి నూతనమా, తనమానిని ప్రేమతనకు దక్కుతినను మా;

నేనుమానకదయతనరం, తనరంతులుమాని నరసధవురమ్మనవే' (కా.సం.4.83). పద్యము చివరగల 'మనవే' భాగము పద్యాదిభాగముతో తుల్యమైనది. ఇది సింహావలోకన లక్షణము. అంతర్గతమైన యమకము ముక్తపదగ్రస్త లక్షణము.

ముద్ర : అర్థాలంకారము. లక్ష. ప్రస్తుతార్థము ఇచ్చుపదములతో సూచ్యార్థ సూచన చేయుట ముద్ర. ఉదా 'సాటిలేనిది సుమ్ము ఈ తేటగతి—తేట గీతిని వ్రాయుట ప్రస్తుతార్థము. దానిగణములలో దానిపేరు సూచించుట ముద్ర (ఆంధ్రచంద్రా. 137). ఇట్లే 'నవరత్నమాల' అను పద్యము వ్రాసి మారర్థములలో వేరువేరు రత్నముల పేర్లు కలిపి రచించుట మొ ముద్రాలం కారములే. ఇది అలంకారమేకాదు దీనిలో ప్రస్తుతోపస్కారక మేమియు లేదు అని ఝళికీకరు పండితుడు (ఆ.వి.స.2.) — ఒక గౌణాలంకారము (హిం సా.కో.)

*యతిభంగము :* వాక్యదోషము. వివ. పద్యపాదములో గల విరామ స్థానమున ఉండవలసిన వర్ణనియమము లేకుండుట యతిభంగము. ఉదా 'ముందుగ పూజించినాడు నరహరిననగన్' (కా.సం.4.36)

*యథాసంఖ్యము :* అర్థాలంకారము. లక్ష. మొదట ఒక వరుసలో చెప్పిన వస్తువులకు క్రమభంగము లేకుండునట్లుగా వాటి కనుగుణముగా అర్థములు అన్వయించునట్లు రెండవ వరుసలో చెప్పుట యథాసంఖ్యము. దీనినే 'క్రమాలం కారము' అందురు. ఉదా శత్రువులను, మిత్రులను, విపత్తులను గెలువుము, రంజిల్లజేయుము, నశింపజేయుము (చంద్రా. 106). వాక్యాన్వయమూలక మైన అర్థాలంకారము. భామహాచార్యుడు వివేచించినది. (హిం.సా.కో.).

*యమకభేదములు :* ఆదియమక— మధ్యయమక—అంత్యయమక - సర్వయమక. లక్షణములననుసరించి యమకాలంకార భేదములు వేలలెక్కలో ఉండునని సంస్కృతాలంకారికులే చెప్పి, యథామతియథాశక్తి ఆయా అలంకారికులు లక్ష్యలక్షణములిచ్చిరి. 'అసంఖ్యాకములు' అన్న యమక భేదములు గుర్తించుట, వాటిముఖ్య భేదములు తెలిసినవారికి సాధ్యమే. కా.సం 4 వ్యా.పు 551 లో పేర్కొన్నవివి: 1. పాదయమకము, 2. పాదభాగయకము. పాదయమక భేదములు పదకొండు: 1. ముఖయమకము (ఒకటి, రెండుపాదములు తుల్యములుగా ఉన్నది) 2. సందంశయమకము (ఒకటి, మూడు పాదములు తుల్యములైనది) 3. ఆవృత్తియమకము (ఒకటి, నాలుగు పాదములు తుల్యములైనది) 4. గర్భయమకము (రెండు, మూడు పాదములుతుల్యము లైనది) 5. సందష్టయమకము (రెండు, నాలుగు పాదములు తుల్యము లైనది) 6. పుచ్ఛయమకము (మూడు, నాలుగు పాదములు తుల్యము లైనది) 7. పంక్తియమకము (నాల్గు పాదములు తుల్యములైనది) 8. పరివృత్తియమకము (ఒకటి, నాల్గు పాదములు - రెండు, మూడు పాదములు

తుల్యములైనది) 9. యుగ్మయమకము (ఒకటి; రెండు - మూడు, నాల్గు పాదములు తుల్యములైనది) 10. సముద్గకయమకము లేదా సంపుట యమకము (పూర్వార్థ, ఉత్తరార్థముల ఆవృత్తి తుల్యములైనది. ఇది అర్థావృత్తి) 11. మహాయమకము (రెండు పద్యముల ఆవృత్తిగాని, శ్లోకముల ఆవృత్తిగాని తుల్యముగా ఉన్నది, ఇదిగణావృత్తి). 2. పాదభాగయమకములు లెక్కకు మిక్కిలి: పాదమును రెండుగా భాగించి ప్రథమభాగముల తుల్యత, ద్వితీయ భాగముల తుల్యత గణించవచ్చు. అట్లే పాదమునుమూడు, నాల్గు భాగములుగా విభజించి ఆయాభాగములలో ఆవృత్తి అయిన వర్ణ, పదముల తుల్యతను గణించి ఆది - మధ్య-అంత భేదములు, భేదాంతరములు వేనకువేలు ఉన్నట్లు చూడవచ్చు — లక్షణసారాంశము:- స్థూలదృష్టితో గణించినప్పుడు యమకము మూడు విధములు. విభిన్నార్థములుగలవర్ణ, పదావృత్తి, శబ్దార్థవృత్తివెంట అర్థావృత్తి (సముద్గక యమకము. నా.శా.16.69), గణావృత్తి (అనులోమ, ప్రతిలోమ, విలోమ, బంధకవిత్వాది శబ్దాలంకారములు) చూ. కావ్యాదర్శము; అప్పకవీయము మొ॥.

*యమకము* : శబ్దాలంకారము. లక్ష. యమకమనగాయుగ్మము (జంట) అని అర్థము. భిన్నార్థకములైన వర్ణ, పదావృత్తియమకమని తెలియదగినది. కాని కవుల ప్రయోగములలో కొన్నిచోట్ల నిరర్థక శబ్దములు గూడ ఆవృత్తమై యమకము పేరచెల్లినవి. ఆవృత్తములగు శబ్దములు భిన్నార్థకములుగా ఉండవలెనని మార్గదర్శకులైన ఆలంకారికులు ఆశించిరి. భరతాదుల పూర్వులే దీనిని వివేచించిరి. దీనికి భరతుని నిర్వచనము 'శబ్దాభ్యాసము' అన్నంతవరకే పరిమితమై అది పది భేదములలో వివక్షితమైనది. పాదాంత-కాంచీ - సముద్గ - విక్రాంత - చక్రవాళ - సందష్ట - పాదాది-ఆమ్రేడిత-చతుర్వ్యవసిత - మాలా యమకములు (నా.శా.16.68). సమాన శ్రుతి ప్రతీతిగలవై, భిన్నార్థములుగలవై, ఆవృత్తములగు వర్ణ, పదములు 'యమకము' అని భామహాచార్యుని సిద్ధాంతము (భామ.2.17). తర్వాతి ఆలంకారికులు భామహుని అనుసరించియే తమతమ వాక్యములలో యమకలక్షణమును చెప్పిరి. 'అర్థేసతి అర్థభిన్నానాం వర్ణానాం సా పునశ్శ్రుతిః' (కా.ప్ర.9.83). పద్యమునకు మొదటి పాదమున గలది ఆదియమకము, మధ్యపాదములందు గలది మధ్యయమకము, చివరిపాదమందు గలది అంత్యయమకము, అన్ని పాదములందు గలది సర్వయమకము. ఇట్లు ఆదియమక - మధ్యయమక - అంత్యయమక - సర్వయమక లక్షణముల ననుసరించి పెరిగి పెరిగి యమక భేదములు వేనవేలైనవి. *పంక్తియమకము*: ఉదా॥ 'రాజనందన రాజరాజాత్మజులసాటి, తలపనన్నయవేమ ధరణిపతికి' ఈసీసచరణములు నాలుగు ఇట్లే పునరావృత్తమై నాలుగు భిన్నార్థములు ఇచ్చును. చివరిగీతము 'భావభవభోగ సత్కళా భావములను' ఇట్లే పునరావృత్తమై 'యథాసంఖ్య' లక్షణముననుసరించి నాల్గు భిన్నార్థములతో పై సీసచరణార్థములకు సమన్వయము

ఘటించును కనుక దీనిని 'పంక్తియమకము' అనిరి (అనవేమారెడ్డిపై చెప్పిన చాటువు ఇది). చూ. యమక భేదములు.

యమకాదులు-వర్ణనియతి : యమకము, శ్లేష వీటిలో డ,ర,ల వర్ణములకు; బ,వలకు; శ,షలకు; న,ణలకు; సవిసర్గ,అవిసర్గ పదములకు; సబిందుక, అబిందుక పదములకు ఐక్యము చెప్పుకొనవచ్చు: 'భుజలతాం జడతా మబలాజనః' దీనిలో జలతాం, జడతాం భాగములలో ల,డలు భిన్నవర్ణములైనను యమక లక్షణముగానే పరిగణించిరి. ఇంకొకనియమము: పద్యమునకున్న నాల్గుపాద ములలో మూడుపాదాంత యమకములు చెప్పగూడదు, మూడు పూర్తి పాదములందును చెప్పగూడదు. 'యమకంతు విధాతవ్యం నకదాచిదపిత్రిపాత్' అని ఒక నియమము. కాని 'కావ్యాలంకారచూడామణి' కర్త త్రిపాద్యమకము నుదాహరించినాడు. ఇతర ఉదాహరణము: 'వీరరసాతిరేక! రణ విశ్రుత! వేమనరేంద్ర! నీయశం - భారభమాన తారకరహార విలాసము నీభుజామహం - భారభమాన తార కర హార విలాసము నీ పరాక్రమం — భారభమాన తార కర హార విలాసము చిత్రమారయన్' (శ్రీనాథుని చాటువు). అంగిరస పోషణమునకు యమకము, శ్లేషవంటి అలంకారములు సహకరించవని ఆధునికుల సిద్ధాంతము.

యుక్తి : అర్థాలంకారము. లక్ష. రహస్యమును దాచుటకై ఏదో ఒక యుక్తి చేసి ఇతరులను వంచించుట యుక్తి. ఉదా॥ నీ ప్రియురాలు నీ పటమును గీయుచుండగా ఇతరులు ప్రవేశించిరి. అది చూచి ఆవిడగీయుచున్న బొమ్మ చేతిలో పూవింటిని చిత్రించెను (చంద్రా. 155). పూవింటినిచిత్రించుటతో ఆ బొమ్మ మన్మథునిదైనది, తన రహస్యము దాచుటకు చేసిన యుక్తి ఇది. —సాధర్మ్య — బీజ సంబంధమైన అలంకారము అని హిం.సా.కో. ఇది 'వ్యాజోక్తి'లో చేరవలసినది అని ఝళకీకర్ పండితుడు.

రత్నావళి : అర్థాలంకారము. లక్ష. ప్రకృతమైన అర్థములను వరుసగా చెప్పు కొని పోయినచో రత్నావళి. ఉదా॥ 'ఓరాజా! నీవు చతురాస్యుడవు, లక్ష్మీ పతివి, సర్వజ్ఞుడవు (చంద్రా. 188). త్రిమూర్తులు వరుసగా పేర్కొనబడిరి. ఇది అలంకారమే కాదని 'ఉద్ద్యోతము'—ఒక గౌణాలంకారము. అప్పయ దీక్షితుడు ఒప్పినది (హిం.సా.కో.).

రశనారూపకము : రూపకాలంకార విశేషము. లక్ష. ఒడ్డాణము (రశన)లోని గజ్జెల వలె ఒకవరుసలో వివిధ ఆరోపములతో కూడి యుండుట ఈ రూపక లక్షణము. ఉదా॥ 'కిసలయ కరైర్లతానాం కరకమలై ర్కామినీదృశాం జగజ్జయతి నళినీనాం కమలముఖై ర్ముఖేందుభిర్యోషితాం మదనః' ముజ్జగములను జయించు మన్మథుని సాధన సంపత్తిని చెప్పిన ఈరచనలో-లతలయొక్క చిగురాకులు అను హస్తములు, యువతుల కరములు అను కమలములు మొ — ఆరోపములు కొన్ని రశనాకారమున అమరినవి. ఇది 'రశనారూప కము'. పేరు సార్థకము (కౌ.సం.5.పు.594).

రసదోషములు : రసములు విభావ, అనుభావ, వ్యభిచారి భావాదులచే వ్యక్త ములు గావలెనని, వాచ్యములు కాగూడదని అలంకారికులు మెచ్చిన నియమము. రసముల అంగాంగిభావ సంబంధము; పరస్పరానుకూల ప్రతికూల భావసంబంధము; ఉపబృంహణ, ఉపశమనయుక్తి తెలియనికవులురసదోషము పాలబడుదురు. రసదోషములు నానావిధములు. ముఖ్యముగా గమనించ వలసినవి ఇవి:—*1. స్వశబ్దవాచ్యా దోషము:*— ఉదా॥ యుద్ధరంగము 'బీభత్సరస' మయమైనది. ఇట రసశబ్దము వాచ్యమైనది. ఆరసము విభావాదుల వర్ణనముచే వ్యంగ్యము గావలయును. అట్లుగాక స్వశబ్దముచే చెప్పుట వలన ఆనందముకలుగదు. ఇది దోషము. ఇట్లే 'ఉత్సాహము' మొ స్థాయి భావములుగాని, 'వ్రీడ' మొ వ్యభిచారి భావములుగాని, స్వశబ్దములచేవాచ్యము లగుట దోషము. *2. అనుభావ, విభావములు అస్పష్టముగా తోపింపచేయుట దోషము.* ఉదా॥ 'మతిపోయినది, తికమకపాలైనది, పొర్లాడుచున్నది, అయ్యో! దానిని విషమదశ పరిభవించుచున్నది':—ఇట విభావములు అసలే తెలియవు, అవిలేవు. అనుభావము లున్నవి కాని అవి విరహ (విప్రలంభ) చేష్టలో! దుఃఖ (కరుణ) చేష్టలో! తెలియుట కష్టము. ఊహించి తెల్సుకొను లోపల రసాస్వాదమునకు అంతరాయము కలుగుచున్నది కాబట్టి ఇట్లు రచించుట దోషము. *3. ప్రతికూల రసభావాదులు వర్ణించుట దోషము.* ఉదా॥ 'ప్రియురాలా! ప్రసన్నురాలవుకావా? (ఇట శృంగారము స్ఫురించినది). కడచిన కాలము తిరిగిరాదుసుమా! (ఇటవైరాగ్యము స్ఫురించుచున్నది). శృంగారము, శాంతము ప్రతికూల రసములు. వీటి కలయిక దోషము. ఇట్లే ప్రతికూలములైన విభావాదులు కలియు సన్నివేశములు గ్రహించవచ్చు. *4. పునఃపునర్దీప్తి:*—వర్ణించిన రససన్నివేశమునే మరల మరల వర్ణించి, వెక్కసము చేయుటగూడ దోషమే. ఉదా కుమారసంభవ కావ్యములో రతి విలాపఘట్టము. *5. అనమయమున రసప్రకాశము:*— ఉదా॥ ఒకవంక తన పక్షమునకు చెందిన వీరులెందరో యుద్ధమున కూలుచున్నారు. నాయకుడైన దుర్యోధనుడుతనసతి భానుమతితో అంతఃపురమున ప్రణయకార్యకలాపముల లోనిమగ్నుడై ఉన్నాడు (వేణీసంహారము). ఇదిదోషమే. *6. అనమయమున రసవిరమణము:*—ఉదా॥ నాయికా నాయకుల ప్రణయానురాగము పరాకాష్ఠ కెక్కినది. అప్పుడు సమాగమోపాయము చూడవలసిన నాయకుడు ఇంకొక కార్యము వెంటబోయినాడు. ఇది రసవిరమణ దోషము. *7. అంగ రస విస్తరణము:* ఉదా॥ కథలో ప్రతినాయకుని కార్య సన్నివేశములు (అంగరసము) విస్తృతముగా వర్ణించుట, నాయకుని కార్య సన్నివేశములు (అంగిరసము) పరిమితముగా వర్ణించుట గూడ దోషమే. అయినను ప్రతినాయకుని గురించి అధికముగా వర్ణించి అంతఘనుని కథానాయకుడు జయించినాడని స్ఫురింపజేయుట గుణమే అగునని ఒక పక్షము వారిసమర్థన ఉదా॥ హయగ్రీవవధ. *8. అంగిరసమునుచౌచిత్యాదృష్టితోఅనుసంధింపకుంతుకు:*

:—ప్రధానరసమును తగినచోట్ల తగినంతగా చూపించకుండుట దోషమే. ఉదా తాపస వత్సరాజము. *9. ప్రకృతి విపర్యయము:—* ఇట ప్రకృతి అనగా పాత్ర స్వభావము. దానిని వర్ణించకుండుట దోషమే. మానవపాత్రల వర్ణన కొంత సులభమేకాని దివ్యపాత్రలను వర్ణించుటలో కాళిదాసు వంటి కవిగూడ పార్వతీ పరమేశ్వరుల సంభోగ వర్ణనము అతిగా చేసినాడని, అది తన తలిదండ్రుల రతివర్ణనము చేసినట్లే అయినదని కొందరు విమర్శించిరి. *10. రసమునకు ఉపకరించని దానిని వర్ణించుట:—*ఉదా 'కర్పూరమంజరి' అను నాటకములో మొదట రాజనాయికలు వసంత ఋతువును వర్ణింతురు. తర్వాత అదేఋతువును వందిమాగధులు వర్ణింతురు. రాజు తన నాయికలు చేసిన వర్ణనమును కాదని వందిమాగధులు చేసిన ఋతువర్ణనమును మెచ్చుకొనును. అది అచ్చటి రసమున కపకారమైనది. ఇట్లేకవులు రసదోషములను ఊహించవచ్చు. విరుద్ధరసములైనను (1) స్మర్యమాణములుగా నిబద్ధములైన చోట (2) సామ్యముచే వివక్షితములైనచోట (3) ప్రధాన భావమునకుగాని, మరొకరసమునకుగాని అంగములుగా వివక్షితములైనచోట దోషములు కావని ఆలంకారికులనిరి. విశేషములకు చూ. (కా.సం.4.పు.522-27).

*రసవదలంకారము :* అర్థాలంకారము. లక్ష. అంగిరసమునకు అంగముగా వర్ణించిన రసమే రసవదలంకారము. ఉదా॥ రాజా! నీశత్రువుల రాణులుస్వప్నములలో తమ పతులను కౌగిలించుకొని 'ప్రియా! నన్నువిడిచి దేశాంతరమునకు వెళ్ళితివా, దయావిహీనా! నీకు ప్రవాసము ఎట్లు రుచించినది' అని మేల్కాంచి, తమ కౌగిటిలో పతిలేకుండుట జూచి ఎలుగెత్తి ఏడ్చెదరు (అ.సం.).ఇటరాజవర్ణనమగుటచే రాజరతిభావముఅంగి, దానికి విప్రలంభము అంగము. ధ్వనివాదులు అంగిరసమును 'రసధ్వని' అని, అంగరసమును అలంకారమందురు. తదితరులు అంగాంగి రసములు రెంటిని అలంకారమే అందురు (ఆ.వి.స.2.పు.507). రసవదాది వర్గమునకు చెందినవాటిలోరసవత్, ప్రేయస్, ఊర్జస్వి, సమాహితములు ఉన్నవి. రస, భావములను భామహాదులు అలంకారములుగా చెప్పిరి. తర్వాతివారు వీటిని అలంకారములుగా గుర్తించక అపరాంగ వ్యంగ్యములో భాగములుగా చెప్పిరి. కాని రుయ్యక, విశ్వనాథ, అప్పయ దీక్షితులు వీటిని మరల వివేచించిరి (హిం.సా.కో.).

*రూపకము :* అర్థాలంకారము. లక్ష. ఉపమేయమును కప్పిపుచ్చక దానియందు ఉపమాన గుణమును ఆరోపించినచో 'రూపకము'. ఉదా అనీతి అను వృక్షమును ఛేదించుటకు ఇంద్రియనిగ్రహము గొడ్డలి. లక్షణవిశేషము: ఉపమేయోపమానములకు తాదాత్మ్యము (ఐక్యము) కల్పించుటలోనే దీని అలంకారత్వమున్నది. కాని ఆ ఐక్యములో ఉపమేయమును దాచగూడదు. సందేహ—అపహ్నుతి—భ్రాంతిమత్ - అతిశయోక్తి అలంకారములలో ఉపమేయమును దాచుటయే లక్షణము. రూపకములో అది జరగకూడదు. వీటి భేదములిట్లు గుర్తించవలె. ఉపమానము తనరూపమును

ఉపమేయమున కిచ్చుచున్నది కాబట్టి రూపకమైనది. 'ప్రబోధ చంద్రోదయ' నాటకమంతయు రూపకాలంకారమునకు ఉదాహరణము (ఆ వి. స.2.పు. 489). ఉపమేయమునకు రూపాంతర కల్పనము 'రూపకము'. అట్టి రూపాంతర కల్పనము ఉపమేయోపమానములకు సంబంధించిన అన్ని అవయములందుండుట, కొన్ని అవయములందే ఉండుట (ఏకదేశవివర్తి) అనెడి భేదములచే రూపకము రెండు విధములు (నా.శా.16.పు.462). రూపకము అనగా ఏకతా (అభేద) ప్రతీతి అని శబ్దార్థము. ఇది సాదృశ్యగర్భ — అభేద ప్రధాన - ఆరోపమూల - అర్థాలంకారము. ఉపమానోపమేయముల పరస్పర భేదములు తిరోభూతమైనప్పుడు కనిపించు సాదృశ్యమునే రూపకము అనిరి (హిం.సా.కో). — రూపకమున అభేదారోపమే కాని అభేదప్రతిపత్తి (అధ్యవసాయము=అభేదప్రాప్తి) లేదు. రూపకమున ప్రకృతము అప్రకృత స్వరూపముతో అన్వయించును. రూపకమున ఆరోపము రంజనమాత్రమే. రంజనమనగా రంగువేయుట (రంజనమనుమాట ఇక్కడ గౌణార్థములో ఉన్నది). రంగాయింపులో ఒకరంగు ఇంకొకరంగు రూపును దాల్పవచ్చు. కాని ఆరోపించిన రంగు అసలు వస్తువును దాచలేదు. ఉదాహరణములు ఆయారూపక భేదముల వద్దచూచి లక్షణములను గ్రహించవచ్చు. 'రూపమేవ రూపకం' రూపము యొక్క ఆరోపణమే రూపకము. దీనిని ఆంగ్లమున Metaphor అనిరి (కా.సం.5.పు.589). భరతుడు మొదలు అప్పయ దీక్షితుల వరకు చెప్పిన రూపకలక్షణములలో భేదములనేకములున్నవి. వాదోపవాదములున్నవి. ప్రసిద్ధ రూపక భేదములను మాత్రమే గ్రహించుట ఉచితము. *రూపకము, సాధారణ విభజన*. ఇది రెండువిధములు: చూ. 1. రూపకము-వాక్యగత 2. రూపకము - సమాసగత.—*రూపకము, మమ్మటాదుల విభజనలో మూడువిధములు*, అంతర్భేదములు వెరసి8:—నిరవయవము, సావయవము, పరంపరితము. వీటిలో నిరవయవము రెండు విధములు, చూ. 1 కేవల నిరవయవము 2. మాలా నిరవయవము. సావయవ రూపకము రెండు విధములు చూ. 3. సమస్తవస్తు విషయసావయవము. 4. ఏకదేశ వివర్తిసావయవము. పరంపరితము నాల్గు విధములు. 5. శ్లిష్ట కేవల పరంపరితము. 6. శ్లిష్ట మాలా పరంపరితము. 7. అశ్లిష్టకేవల పరంపరితము. 8. అశ్లిష్టమాలా పరంపరితము. *రూపకము-చంద్రాలోక విభజన:* మొదలు ఇది రెండు విధములు: అభేదము, తాద్రూప్యము. వీటిలో ఒక్కొక్కటి అధికము, న్యూనము, అనుభయము అని మూడు భేదములు. ఇట్లు ఈమొత్తము 6: చూ. 1: అధికాభేదము 2. న్యూనాభేదము 3. అనుభయాభేదము 4. అధిక తాద్రూప్యము 5 న్యూనతాద్రూప్యము 6. అనుభయతాద్రూప్యము.

*వాక్యగత:*- ఉపమాన ధర్మమును ఉపమేయమునకు ఆరోపించుట రూపక లక్షణము. ఇది సాధారణ విభజనలో రెండు విధములు: వాక్యగత,

సమాసగత, వాక్యగత రూపకాలంకారమునకు ఉదా ముఖము అనుపద్మము, విద్య అనుధనము మొ. చూ. రూ. సమాసగత.

*సమాసగత:–* ఉపమాన ధర్మమును ఉపమేయమునందు ఆరోపించుట రూపక లక్షణము. ఇది సాధారణ విభజనలో రెండు విధములు: వాక్యగత, సమాసగత. సమాసగత రూపకాలంకారమునకు ఉదా। విద్యాధనము, దుఃఖ సముద్రము మొ।. (వీటినే విద్య అనుధనము, దుఃఖము అను సముద్రము అని చెప్పినచో వాక్యగతములగును). సిద్ధాంత దృష్ట్యా వ్యస్తరూపకమే కాని సమస్త రూపకమనునదిలేదు. సమస్తరూపకములో ఉపమాలంకారత్వమే ఉన్నది "ముఖచంద్రాదీనాంతు ఉపమాసమాసాత్ నరూపకత్వంయుక్తం" అని వామనుడు.

*కేవలనిరవయవము:* మమ్మటాదులు చెప్పిన 8 విధముల రూపకాలంకారములలో ఇదొకటి. లక్ష. నిరవయవము = ఇతర రూపకములు అంగములుగా లేనిది (సావయవము = ఇతర రూపకములు అంగములుగా గలది). ఒక వాక్యములో ఒకే ఒక (కేవల) రూపకమునకు ప్రాధాన్యముండుట కేవలత్వము. ఉదా నీకీర్తిచంద్రిక బ్రహ్మాండమంతయు నిండి వెల్లివిరిసినది (కా.సం.5.48). ఇక్కడ కీర్తి అవయవికావచ్చు. కాని కేవలము దానికే చంద్రిక ధర్మము ఆరోపితమైనది. కాబట్టి 'కేవల నిరవయవము'–ఒకవాక్యములో రూపకములెన్ని ఉన్నను పరస్పర సాపేక్ష (సంబంధ)ము లేనిచో ఆ వాక్యము గూడ ఇదే శాఖకు చెందినది. ఉదా బుద్ధి అనునది దీపము, దానిచే అంతయు ప్రకాశవంతమగును; బుద్ధి లేమి చీకటి రాత్రి, దానిలో ఏమియు కానరాదు (ర.గం.). ఈ వాక్యములో రెండు రూపకములున్నను అవి పరస్పరము నిరపేక్షములు (అనగాదేనికదే విడివిడి అర్థమునిచ్చుచున్నది) కాబట్టి ఇది గూడ 'కేవల నిరవయవ' రూపకమే (బుద్ధి అను దీపము, వివేచన అను వెలుగునిచ్చును అన్నప్పుడు మొదటి రూపకము అవయవి, రెండవది అవయవము; అప్పుడిది సావయవరూపకమగును)

*మాలానిరవయవము:–* మమ్మటాదులు చెప్పిన 8 విధముల రూపకాలంకారములలో ఇదొకటి. లక్ష. నిరవయవము = ఇతర రూపకములు అంగములుగా లేనిది (సావయవము = ఇతరములు అంగములుగా గలది). కొన్ని రూపకములు ఒక వరుసలో అమరినదిమాల. పరస్పరసాపేక్ష (సంబంధ)ము లేని రూపకములవరుస 'మాలానిరవయవము'. ఉదా నీకీర్తి కైలాసగుహలందు, సరస్వతీ దేవిస్తనములందు, కల్పవృక్షములందు ఝురులై, సరులై, విరులై విలసిల్లును (కా.సం.5 44). ఇక్కడ కీర్తి అవయవి అయినను ఝురుల సరుల, విరుల ధర్మములు దానికే ఆరోపితములైనవి. ఈవాక్యము నుండి మూడు రూపకములను విడివిడిగా గ్రహించిచూచినప్పుడు ఈ రూపకములు పరస్పరము సంబంధించనివి, ఒక వరుసలో అమరినవి కాబట్టి 'మాలానిరవయవము'

*సమస్తవస్తు విషయసావయవము:—* మమ్మటాదులు చెప్పిన 8 విధముల రూపకాలంకారములలో ఇదొకటి. లక్ష. పరస్పర సాపేక్ష (సంబంధ)ములైన రూపకముల సముదాయము 'సావయవ రూపకము', ఆరోపించిన వస్తువుల నన్నిటిని శబ్దరూపమున స్పష్టము చేయునది 'సమస్తవస్తువిషయము'. ఉదా రాత్రి అను కాంత వెన్నెల అను చీరను, చుక్కలు అను నగలను, చీకట్లు అను వెండ్రుకలను ధరించిశోభించుచున్నది (ర.గం). దీనిలోనాల్గురూపకము లున్నవి. రాత్రిని స్త్రీగా రూపించిన మొదటిది అవయవి. మిగతవి మొదటి దానికి సంబంధించి ఉన్నవి కాబట్టి ఇది సావయవము. విషయమునకు సంబంధించిన ముఖ్యవస్తువులన్నియు స్పష్టములైనవి కాబట్టి 'సమస్తవస్తువిషయ సావయవము'.

*ఏకదేశవివర్తిసావయవము:—* మమ్మటాదులు చెప్పిన 8 విధముల రూపకాలంకారములలో ఇదొకటి. లక్ష. పరస్పర సాపేక్ష (సంబంధ)ము లైన రూపకముల సముదాయము 'సావయవరూపకము'. వాక్యములో చెప్పిన రూపకముల నన్నిటిని స్పష్టముచేయగలది 'సమస్తవస్తువిషయసావయవము', చెప్పిన వాటి సహాయముతో చెప్పనివాటిని ఊహింపజేయగలది 'ఏకదేశ వివర్తి సావయవము'. ఉదా నీఖడ్గము, ఒరఅనుపుట్టలో నుండి వెడలి శత్రు రాజుల ప్రాణములు అను గాలిని పీల్చును (కా.సం.5.41). ఒక రూపకము (ఒర అను పుట్ట) స్పష్టము. 'ఖడ్గము అనుపాము' అని చెప్పవలసినది చెప్ప లేదు. అయినను పాము గాలిమేయును అని ప్రయోగించు కవి సమయము ఆధారముగా ఖడ్గము పాము అని స్ఫురించుచున్నది. ఇటు వంటిది 'ఏకదేశ వివర్తిసావయవము'.

*శ్లిష్టకేవలపరంపరితము:—* మమ్మటాదులు చెప్పిన 8విధముల రూపకాలంకారములలో ఇదొకటి. లక్ష. శ్లేషార్థముండుట శ్లిష్టము; అవయవి అయిన రూపకార్థ మొక్కటే ప్రధానముగా ఉండుట కేవలము; ఒక రూపకము నందున్న ఆరోపమే ఇంకొక ఆరోపమునకు కారణమగుట పరంపరితము (ఆరోపపరంపర). ఉదా। ప్రతాపరుద్రుని ఖడ్గమను రాహువు శత్రురాజ మండలమును మ్రింగును (ప్ర.రు.): 'ఖడ్గరాహువు' అను రూపకము 'రాజ మండలము' అను శ్లిష్టరూపకమునకు కారణమైనది. రాజమండలము=రాజుల సమూహము, రెండవ అర్థము చంద్రమండలము (శ్లిష్టము). ఈ ప్రకార ముగా ఇది 'శ్లిష్టకేవల పరంపరితము.'

*శ్లిష్టమాలా పరంపరితము:—* మమ్మటాదులు చెప్పిన 8 విధముల రూపకాలంకారములలో ఇదొకటి. లక్ష. శ్లేషార్థముండుటశ్లిష్టము; వాక్యములోని రూపకములకు ఒక వరుస ఉండుటమాల; శ్లేష ఆధారముగా ఒక ఆరోపము ఇంకొక ఆరోపమునకు కారణమై అమరుట పరంపరితము. ఉదా। నరస భూపాలుడు కువలయము (భూవలయము) అను కువలయమును (కలువను) వికసింపజేయు హిమకరుడు. దాన జలము (దానధార) అను దానజలమునకు

(మదజలమునకు) దిగ్గజము. పద్మోత్సవము (పద్మా + ఉత్సవ = రాజ్యలక్ష్మీసౌభాగ్యము) అను పద్మోత్సవమునకు (పద్మవికాసమునకు) సూర్యుడు. నరసభూపాలుడు హిమకరుడు అన్నచో 'హిమకరుడు' అను రూపకమునకు కారణము 'కువలయము అను కువలయము' అను శ్లిష్టరూపకము. నరసభూపాలుడు 'దిగ్గజము' అన్న రూపకమునకు కారణము 'దాన జలము అను దానజలము' అను శ్లిష్టరూపకము. నరసభూపాలుడు 'సూర్యుడు' అను రూపకమునకు కారణము 'పద్మోత్సవము అను పద్మోత్సవము' అను శ్లిష్టరూపకము. ఈ రూపకములతో ఇది శ్లిష్టమాలాపరంపరితము (కా సం.5 47).

*అశ్లిష్టకేవల పరంపరితము*:— మమ్మటాదులు చెప్పిన 8 విధముల రూపకాలంకారములలో ఇదొకటి. లక్ష. ఇందులో శ్లేషఉండదు కాబట్టిఅశ్లిష్టము, అవయవి అయిన రూపకార్థమొక్కటే ప్రధానముగా ఉండుట కేవలము; ఒక రూపకమందున్న ఆరోపమే ఇంకొక రూపకమునకు కారణమగుట పరంపరితము. ఉదా శత్రుసేన అను కాంతారమునకు నీచేతిఖడ్గము దావాగ్ని శిఖ (కా.సం.5.48). 'ఖడ్గదావాగ్నిశిఖ' అను రూపకమునకు 'శత్రుసేనాకాంతారము' అను రూపకము కారణమైనది. ఒకే రూపక ప్రాధాన్యము అశ్లిష్టముగా ఉన్నది కాబట్టి అశ్లిష్టకేవల పరంపరిత రూపకము.'

*అశ్లిష్టమాలా పరంపరితము*:— మమ్మటాదులు చెప్పిన 8 విధముల రూపకాలంకారములలో ఇదొకటి. లక్ష. ఇందులో శ్లేషఉండదు కాబట్టి అశ్లిష్టము; వాక్యములోని రూపకములకు ఒక వరుస ఉండుట మాల; ఒక ఆరోపము ఇంకొక ఆరోపమునకు కారణమై అమరుట పరంపరితము. ఉదా హస్తమను సర్పమునకు కోర, శత్రువనశ్రేణికి సుడిగాలి,...జయలక్ష్మికి విలాసమైనకను బొమ, సంతుష్టయైన భూమి అను క్రీడామయూరి ఉండునట్టి వాసయష్టి, ప్రపంచమను ప్రాసాదమునకు గడియ అనదగిన కృపాణలతతో ప్రతాపరుద్రుడు విహరించుచున్నాడు (ప్రరు. .శ్లేషలేదు, రూపకములవరుస ఉన్నది, 'కృపాణలత' అన్ని రూపకములకు కారణమైనది కాబట్టి 'అశ్లిష్టమాలా పరంపరితము'.

*అధికాభేదము*:—జయదేవుడు చెప్పిన 6 రూపకాలంకారములలో ఇదొకటి. లక్ష. ఉపమానోపమేయములకు పూర్తిగా అభేదము ఆరోపించి చెప్పినది అభేదరూపకము. ఉదా॥ క్షణములో పురములను భస్మపటలము చేసిన ఈ రాజు సాక్షాత్తుశివుడే. పురములను భస్మముచేయుట అను సమానధర్మముచే రాజుకు, శివునకు అభేదము ఆరోపితమైనది కాబట్టి ఇది 'అభేదరూపకము'. అభేదముచెప్పుచు అధికత్వ మారోపించినచో అధికాభేదము ఉదా ఈ రాజు సమదృష్టితో విశ్వమేలుచున్నాడు మూడు కన్నులున్న శివునిది అసమదృష్టి అని, రెండు కన్నులున్న రాజుది సమదృష్టి అని చమత్కారముగాచెప్పుటచే రాజుకు శివునకు లేని అధికత్వము ఆరోపితమైనది కాబట్టి అధికాభేద రూప

కము" (చంద్రా.14). అభేదము ఆరోపించు వరకు రూపకాలంకారమే అని, అభేదప్రతిపత్తి (ప్రాప్తి) కల్పించుట అధ్యవసాయమని గుర్తుంచుకొనవలె.

*న్యూనాభేదము:—* జయదేవుడు చెప్పిన 6 రూపకాలంకారములలో ఇదొకటి. లక్ష. అభేదముచెప్పుచు న్యూనత్వము (తక్కువతనము) ఆరోపించుట న్యూనాభేదము. ఉదా। ఈ రాజు మూడవ కన్ను లేనిశివుడు. రాజుకు శివునకు అభేదమే అయినను శివునకున్న మూడవకన్ను రాజుకులేదని ఆరోపించుటలో ఇది 'న్యూనాభేద రూపకము'. (చంద్రా.13).

*అనుభయాభేదము:—* జయదేవుడు చెప్పిన 6 రూపకాలంకారములలో ఇదొకటి. లక్ష. ఉపమానోపమేయములకు అభేదము చెప్పుచు అధికత్వము గాని, న్యూనత్వముగాని ఆరోపింపకున్నచో అది అనుభయాభేదము. ఉదా। క్షణములో పురములను భస్మీపటలము చేసిన ఈరాజు శివుడే. దీనిలో అధిక త్వముగాని, న్యూనత్వముగాని ఆరోపించుట జరుగలేదు కాబట్టి 'అనుభయా భేదరూపకము' (చంద్రా.13) అనగా అభేదముగా చెప్పుటే అనుభయా భేదము.

*అధికతాద్రూప్యము:—* జయదేవుడు చెప్పిన 6 రూపకాలంకారములలో ఇదొకటి. లక్ష. ఉపమానము యొక్క తాద్రూప్యమును ఉపమేయమునకు ఆరోపించుట తాద్రూప్యరంజనము. అట్లు ఆరోపించుచు అధికత్వమారోపిం చుట అధిక తాద్రూప్యము. ఉదా ఈమె ముఖచంద్రుడు కళంకితుడైన చంద్రుని మీరినాడు. ఉపమేయమునకు ఆధిక్యము ఆరోపితమైనది కాబట్టి 'అధికతాద్రూప్యరూపకము' (చంద్రా. 15).

*న్యూనతాద్రూప్యము:—* జయదేవుడు చెప్పిన 6 రూపకాలంకారములలో ఇదొకటి. లక్ష. తాద్రూప్యము ఆరోపించుచు న్యూనత్వము కూడ చెప్పుట. ఉదా ఈమె పాలసముద్రమున పుట్టని అపరలక్ష్మి. అపరలక్ష్మి అనుట తాద్రూప్యము. పాల సముద్రమున పుట్టక మానవవంశములో పుట్టినదని చెప్పుటచే న్యూనత్వము. (చంద్రా. 15).

*అనుభయతాద్రూప్యము:—* జయదేవుడు చెప్పిన 6 రూపకాలంకారము లలో ఒకటి. లక్ష. తాద్రూప్యము ఆరోపించుచు అధికత్వముగాని, న్యూన త్వముగాని చెప్పకుండుట అనుభయ తాద్రూప్యము. ఉదా॥ ముఖచంద్రుడే నేత్రానందము కల్గించుచుండగా చంద్రునితోపనేమి? అనగా ముఖమునందు చంద్ర తాద్రూప్యము ఆరోపితమైనది (చంద్రా. 14).

**లలితము :** అర్థాలంకారము. లక్ష. ప్రకృత ధర్మియందు ప్రకృత వ్యవహారము చెప్పక దానికి ప్రతిబింబరూపమైన అప్రకృత వృత్తాంత వర్ణనము చేసినచో లలితము. ఉదా॥ లోకములో ఇంకొక చక్కని స్త్రీలేదా! సీత యేనా నీకు కావలసినది? రావణా! శ్రీగంధపు కొమ్మనులాగి కోడెనాగును నిద్రలేపితివి. —శ్రీగంధపు...లేపితివి, అని అప్రకృత వృత్తాంతవర్ణనము. దీని లక్షణము లో 'ప్రకృతధర్మి' అను పదముచే 'అప్రస్తుత ప్రశంస'కును దీనికిని భేదము

న్నది—ఎట్లన ప్రికృత ధర్మిఇందుకనబడుచున్నది. ప్రకృతా ప్రకృతములకు ఐక్యారోపము లేదు. కాబట్టి 'నిదర్శన' గాదు. 'భేదమునందభేదము' అను 'అతిశయోక్తి'లో పదార్థముచే పదార్థము యొక్క అధ్యవసాయముండును. దీనిలో వ్యవహారముచే వ్యవహారమునకు అధ్యవసాయము. (అ.వి.స.2.పు. 509)—గౌణవర్గమునకు చెందిన అలంకారము. పూర్వులు దీనిని 'నిదర్శన'లో అంతర్భాగ మనిరి, జయదేవాదులు స్వతంత్రాలంకార మనిరి (హిం.సా.కో.).

**లాటానుప్రాసము** : శబ్దాలంకారము. లక్ష. ఆవృత్తిని బట్టి శబ్దార్థముల పునరుక్తి ఏర్పడినను వాటికి తాత్పర్య భేదమున్నచో అది లాటానుప్రాసము. ఉదా "కమలాక్షునర్చించు కరములు కరములు' (భాగ.) ప్రసిద్ధమైన ఉదాహరణ మిది. విష్ణుదేవుని పూజించు కరములే శ్రేష్ఠములు, ఇతరములు కరములు గావని తాత్పర్య భేదమున్నది కాబట్టి లాటానుప్రాసము. 'లాట' దేశీయుల కిష్టమైనది కాబట్టి దీనిని లాట అనిరి. ఇది ఉభయాలంకారమని మమ్మటా దులు చెప్పిరి (కా.సం.4.పు.550).

**లుప్తోపమ** : ఉపమ రెండు విధములు: 1. పూర్ణోపమ 2. లుప్తోపమ. ఉపమ కున్న నాల్గు అవయవములలో 1-3 వరకు ఏదిలోపించినను "లుప్తోపమ" అగుచున్నది. ఈ ప్రకారముగ లుప్తోపమ మొదటి విభజనలో 7 విధములు. తర్వాత వాక్యగత, సమాసగత, ప్రత్యయగతాది భేదములతో సాదృశ్య లక్షణములను కలుపుకొని దీని భేదములు మొత్తము 19. చూ. ఉపమా భేదములు - మమ్మటాదుల విభజన.

**లేశము** : అర్థాలంకారము. లక్ష. గుణమునకు దోషము, దోషమునకు గుణము కల్పించినచో లేశము. ఉదా పక్షులన్నియు స్వతంత్రముగా జీవించుచుం డగా చిలుకా! నీకీపంజరబంధము నీ తీయనిపలుకులకు ఫలము (చంద్రా. 186).—"అప్రస్తుత ప్రశంస"కు చేరువగా ఉన్న ఒక గౌణాలంకారము, మొదలు వివేచించినది దండి (హిం.సా.కో.).

**లోకోక్తి** : అర్థాలంకారము. లక్ష. సామెతలతో సమర్థించి చెప్పినచో లోకోక్తి. ఉదా "అల్పబుద్ధివాని కధికారమిచ్చిన, దొడ్డవారి నెల్ల దొలగ గొట్టు, చెప్పుతినెడి కుక్క చెరకుతీపెరుగునా విశ్వ —ఒక గౌణాలంకారము, కువల యానందము ఒప్పినదే (హిం.సా.కో.).

**వక్రోక్తి**[1] : అర్థాలంకారము. లక్ష. కాకుస్వరముతో నైనను, శ్లేషతోనైనను అర్థాంతరము కల్పించినచో వక్రోక్తి. ఉదా (i) "వర్షాకాలము వచ్చు చున్నది నాప్రియుడురాడు" అని నాయికపలుకగా దానిసఖి "రాడు?" అన్నది, తప్పకవచ్చునని అర్థము. ఇచ్చటిది కాకుస్వరము (డువర్ణముమీది ఉకారము). నాయిక ఒక అర్థమున ప్రయోగించిన పదమునే దాని సఖికాకు స్వరముతో ప్రయోగించినది. కాకుస్వరము నాశ్రయించిన వక్రోక్తులిట్లు

గ్రహించవచ్చు. ఉదా (ii) చ. అపరిమితానురాగ సుమనోఽలసయైచిగు రాకుచేతులన్ దపసినిఁగౌఁగిలించె వనితా! యిదెరంభ; తలంప రంభతానపరిమి తానురాగ సుమనోఽలసయై చిగురాకు చేతులన్ దపసినిఁగౌఁగిలించు టుచితంబెగదా యన నవ్వెరంభయున్ (మను. 3). ఇది శ్లేషవక్రోక్తి. ఇది ప్రశ్నోత్తర రూపమున ఉండుటయే సౌందర్యావహము: తపసి=జడధారి అయినముని, గారచెట్టు; రంభ = అరటి చెట్టు, రంభ అనుదేవవేశ్య; ఇక్లే 'రాగ, సుమన' శబ్దములకున్న రెండర్థములు ఆధారముగా ఏర్పడిన వక్రోక్తి ఇది. ఈశ్లేష వక్రోక్తిలో సఖులు రంభను గురించి పరిహాసముగా సంభాషిం చినచమత్కారమున్నది. విశేషములకు చూ వక్రోక్తి²

*వక్రోక్తి² :* శబ్దాలంకారము. 'శబ్దార్థ వక్రత'యే కావ్యగరస్వతి మెచ్చిన అలం కారమని భామహాదుల సిద్ధాంత సంప్రదాయము. రుద్రటుడు దీనిని శబ్దాలం కారముగా వివేచించి శ్లేష, కాకువులుగా ఉన్న దీని రెండు భేదములను చెప్పెను (కావ్యా.2.14.15)-రుయ్యకుడు, జయదేవుడు వీరిద్దరుతప్ప మిగతా వారందరు ఇది శబ్దాలంకారమే అనిరి. 'వక్రత' అర్థగతమనుట ఒక దృక్ప థము. దానిని బట్టి ఇది అర్థాలంకారములలో చేరినది. శ్లేష భంగపదము, అభంగపదము అని రెండు విధములు. భంగపదమైన శ్లేష శబ్దవక్రత-అని; కాకువులో వినిపించు వక్తయొక్క కంఠస్వరము, కథనశైలి ఇవిగూడ శబ్ద వక్రతలే అని రుద్రట, మమ్మటాదుల దృక్పథము. దీనిని బట్టి ఇది శబ్దాలం కారములలో చేరినది. వక్రోక్తి సర్వాలంకారములకు ఆయువు పట్టు అని భామహుడు, ఇది 'ఉపమ'లో అంతర్భాగమే అని వామనుడు ('సాదృశ్యా ల్లక్షణా వక్రోక్తిః' కా.సూ.వృ.4.3.8), కావ్యకళకు జీవితమిదే అని కుంత కుడు అనిరి. చూ.హిం.సా.కో.లోని వక్రోక్తి సిద్ధాంతము.

*వర్ణప్రతికూలత :* వాక్యదోషము. చూ. అరీతి.

*వర్ణ్యము :* చూ. అవయవములు నాల్గు.

*వాక్యగర్భితము :* వాక్య దోషము. వివ. ఒక వాక్యములో వేరొక వాక్య మును దూర్చి చెప్పుట వాక్యగర్భిత దోషము. ఉదా। 'ఖలులా వెడమతుల తోడి సంగతి - కడుహితమిదినీకు - ఒనర్పగా వలదు' (కా.సం.4.41) అను వాక్యమున "నీకిదికడుహితము" అనునది వేరొకవాక్యము మధ్యన దూరినది. ఈదోషమును సా.దకర్త మొ 'గర్భితము' అనిరి. ఒకానొకచోట ఇది గుణమగును (అదే.వ్యా.పు.479).

*వాక్యదోషములు :* సంపూర్ణ వాక్యగతములైన దోషములని అర్థము. కా.సం. చెప్పినవి 22; కా.సం. లోలేనివి, సా.ద., కాప్ర. చర్చించినవి 3. ఇట్లీకేవల వాక్యగత దోషములు 25. చూ. 1. అక్రమము 2. విసంధి 3. ప్రక్రమ భంగము 4. పునరుక్తి 5. అసంపూర్ణము 6. వాక్యసంకీర్ణము 7. వ్యాకీ ర్ణము 8. అధికపదము 9. వాచ్యవివర్జితము 10. అరీతి 11. న్యూనోపమ 12. అధికోపమ 13. సమాప్తపునరాత్తము 14. అస్థానసమాసము 15. ఛందో

భంగము 16. యతిభంగము 17. పత్రప్రకర్షము 18. భిన్నలింగము 19. భిన్నవచనము 20. అక్రియ (అశరీరము) 21. సంబంధవర్జితము 22. వాక్యగర్భితము 23. హతవృత్తము 24. ప్రసిద్ధిత్యాగము (ప్రసిద్ధి హతము) 25 అమతపరార్థము (కా.సం.4.వ్యా.పు. 464, 48 -84).

**వాక్యసంకీర్ణము** : వాక్యదోషము. వివ. ఒక వాక్యములోని పదములతో ఇంకొక వాక్యములోని పదములు ముడివడి ఏర్పడినది వాక్యసంకీర్ణము. ఉదా। "పొగడుదురీ - భూకాంతుఁడు జనులెల్ల ననేకగుణాన్వితుడటంచు నిలలో" (కా.సం.28). ఇలలో ఈభూకాంతుడు అనేకగుణాన్వితుడు. ఇదొక వాక్యము. జనులెల్ల ఈతనిని పొగడుదురు. ఇది మరొకవాక్యము. ఈ రెండు వాక్యములలోని పదములు సంకీర్ణము లైనవి ఎట్లనగా మొదటి వాక్యములో రెండవ వాక్యములోని "పొగడుదురు" అను పదము పడినది. "ఇలలో" పదము మొదటి వాక్యములో ఉండదగినది. అది రెండవవాక్యములోపడినది. దీనినే సా.ద. సంకీర్ణము అన్నది

**వాక్యాలంకారము** : పదము నిరర్థకమే అయినను వాక్యాలంకారము కొరకు ప్రయోగించుట దోషము కాదని వామనుని అభిప్రాయము. చూ. నిరర్థకము.

**వాచ్యవివర్జితము** : వాక్య దోషము. వివ. తప్పక చెప్పవలసిన దానిని విడిచిన వాక్యము వాచ్యవివర్జితము. ఉదా "అతని బాహుదీప్తాసి అజిని అభవునైన దెగడు" అని చెప్పవలసినచోట "ఐన" అను పదమును విడిచి "అజినభవు దెగడు" అని చెప్పినచో దోషము (కా.సం.4.31). ఈ దోషమునే 'వాచ్యానభిధానము' అని సా.ద., 'అనభిహితవాచ్యము' అని కా.ప్ర. పేర్కొన్నవి

**వాచ్యానభిధానము** : వాక్యదోషము. చూ. వాచ్యవివర్జితము.

**వికల్పము** : అర్థాలంకారము. లక్ష. విరుద్ధములైన రెండు వస్తువులను ఒక దాని కొకటి మారుగ వికల్పించి చెప్పుట వికల్పాలంకారము. ఉదా చచ్చినచో స్వర్గమును పొందుదువు, గెలిచినచో భూమినేలుదువు (గీతావాక్యము). యుద్ధములో చచ్చుట, గెలుచుట ఈ రెండు విరుద్ధములు, సమాన ప్రాధాన్యములు. చచ్చినచో గెలుచుటకు వీలులేదు, గెలిచినవారు చావరు. ఈ తుల్యబల విరోధములకు చెప్పిన వికల్పము గ్రహించదగినది. "బ్రతుకనిమ్ము చావనిమ్ము నాపట్టువిడువను" వంటి వ్యవహార వాక్యములలో తుల్యబల విరోధమున్నను చమత్కారముగాని, ఉదాత్తమైన అర్థముగానిలేదు. అట్టివి అలంకారములుగావు. "ఉపమ"కు "వ్యతిరేకము" వలె "సముచ్చయము"నకు ఇది ప్రతిభటమైన అలంకారము. వికల్పించిచెప్పిన అర్థములకుగల ఔపమ్యమే ఇచటి అలంకార బీజము. (అ.వి.స.2.పు.503). వాక్యన్యాయ మూలమైన అలంకారము. వికల్పమనగా అదిగాకుండినచో ఇది అని అర్థము. తుల్యబల విరోధములను ఒకే కాలమున చెప్పవలె. దీనిని ప్రతిపాదించిన రుయ్యకుడు

దీనిలో ఉపమాభావము అవశ్యముగా ఉండవలెనన్నాడు. సా.ద., చంద్రా లోకములు చెప్పిన లక్షణములు సరిపడినవి (హిం.సా.కో.).

*వికస్వరము* : అర్థాలంకారము. లక్ష. ఒక విశేషము చెప్పి సామాన్యముతో దానిని సమర్థించి, అంతటితో తృప్తిపడక ఇంకొక విశేషమునుగాని, ఉపమానమునుగాని, అర్థాంతరన్యాసమునుగాని చెప్పుట వికస్వరము. ఉదా అనంత రత్నములకు నిలయమైన హిమాలయమునకు హిమము దోషము కాలేదు ఎన్నోగుణములున్నచోట ఒక దోషము, చంద్రునిలో మచ్చవలె, దోషము కానేరదు (కువల.). ఎన్నోగుణములున్నప్పుడు ఒక దోషము వాటిలో అణగి పోవును అని చెప్పినచో అర్థాంతరన్యాసమగును. 'చంద్రునిలోమచ్చవలె' అని ఉపమానము చెప్పబడినది కాబట్టి వికస్వరము. ఇది అర్థాంతరన్యాసమేగాని వేరుగాదని 'ఉద్ద్యోతము'. ఇది అర్వాచీనులు ఒప్పినది. కువలయానందము దీనిని స్వతంత్రాలంకారముగా చెప్పినది (హిం.సా.కో.).

*విచిత్రము* : అర్థాలంకారము. లక్ష. కోరిన ఫలమునకు విరుద్ధమైన ప్రయత్నము చేయుట విచిత్రము. దీనికి చిత్రాలంకారమని గూడపేరు. ఉదా। ఉన్నతిని కోరినవారు నమ్రులైరి. కోరినది ఉన్నతి. ప్రయత్నించినది నమ్రత్వము. కాబట్టి విచిత్రమైనది (చంద్రా. 89). అపేక్షాకృతమైన గౌణాలంకారము. కొందరు మాత్రమే దీనిని ఒప్పిరి. మొదటి వివేచన రుయ్యకునిది. (హిం. సా కో.).

*విధి* : అర్థాలంకారము. లక్ష. సిద్ధమైనదానినే కొత్తగా విధించుట విధి. ఉదా వసంతకాలమున చూడుము కోకిల కోకిలే అగును. (చంద్రా. 165). సమయము వచ్చినపుడు వస్తుగుణము తెలియునని చెప్పుటకు ప్రసిద్ధమైన కోకిలకు తిరిగి కోకిలత్వమును విధించుటవలన దాని మధురస్వరము స్ఫురించుచున్నది. ఇదొక గౌణాలంకారము (హిం సా.కో). చూ. 'ప్రతిషేధము'.

*విధ్యాయుక్తము* : అర్థదోషము. వివ. విధింపవలసిన దానిని విధింపకుండుట, యుక్తము కాని దానిని విధించుట దోషము. ఉదా॥ "ఆనందిత స్వపక్షోఽసౌ పరపక్షాన్ హనిష్యతి" (కా.సం.4 పు.506) స్వపక్షములను ఆనందపరచిన ఈరాజు పరపక్షములను సంహరించును. ఇక్కడ పరపక్షములను సంహరించి స్వపక్షములను ఆనందపరచును అని ఉండవలె. స్వపక్షములను ఆనందపరచుట విధేయము గావలసినది. అటులగాక పరపక్షసంహారణము విధేయమై పడినది.

*వినోక్తి* : అర్థాలంకారము. లక్ష. ఒకవస్తువు లేకుండుటచే ఇంకొక వస్తువుకు అరమ్యతగాని, రమ్యతగాని కలిగినదని చెప్పినచో వినోక్తి. (ఆ.వి.స.2.). ఉదా 1. 'తమలమువేయనినోరును; రమణుల చనుమొనల మీద రాయని మేనున్, కమలములులేని కొలకును, హిమధాముడులేని రాత్రి హీనము సుమతీ!' అరమ్యతకు ఉదాహరణమిది 2. దుష్టబుద్ధులులేకుండుటవలన ఈ సభ ప్రకాశించుచున్నది. రమ్యత ప్రస్తుతముచేసి చెప్పినదిది (చంద్రా. 55)— సాదృశ్యగర్భమై గమ్యౌపమ్యాశ్రయ వర్గమునకు చెందిన అర్థాలంకారమిది.

దీనిని మొదలుగుర్తించి వివేచించినవారు మమ్మటుడు, రుయ్యకుడు. ఈ అలంకారములో వినా, హీన, రహిత వంటి వాచకశబ్దములు ప్రయుక్తములగును (హిం.పా.కో).

*విపరీతధీప్రదము* : పదదోషము. వివ. ఉద్దేశించినదానికి విరుద్ధమైన అర్థమిచ్చు పదము ఉదా శివభక్తుడు అనుటకు మారుగా 'అంబికావిటాసక్తుడు' అనుట. తల్లికి మిండడైనవానికి భక్తుడు అను విరుద్ధార్థమే మొదటతోచును కాబట్టి ఇది దోషము (కా.సం.4.19). దీనినే 'విరుద్ధమతికృత్తు' అందురు (సా.ద.).

*విభావన* : అర్థాలంకారము. లక్ష. (లోకమున కారణములేకుండ కార్యముపుట్టదు కాని (కవిప్రౌఢోక్తిచే) కారణము లేకుండగనే కార్యముత్పత్తి అయినట్లు చెప్పినచో అది విభావనాలంకారము. దీనిలో కారణ విచారణ జరుగును (విభావ్యతే, విచార్యతే కారణమస్యాం) కాబట్టి విభావన అనివ్యుత్పత్తి. ఉదా। చెలీ! లక్కరసము పూయకున్నను నీపాదములెఱ్ఱగనే ఉన్నవి ఎఱ్ఱరంగు వేయకుండగనే ఎఱ్ఱబడినదెట్లు? అను ప్రశ్న రావచ్చు. ఆమె పాదములు స్వాభావికముగానే ఎఱ్ఱనివి అని సమాధానము (చంద్రా.72)-విరోధమూలకమైన ఈ అర్థాలంకారము భామహాదులు వివేచించినదే. దీని భేదములు ఆరు (చూ. చంద్రా.72-77). ఈ భేదములు అనావశ్యకములని జగన్నాథుని సిద్ధాంతము.

*విరసము* : అర్థదోషము. వివ. రస భావములకు ఉచితముకాని అర్థము విరసము. ఉదా॥ 'ఇతనిసమదవిద్వేషి తలోదరులు దరులందుఁగుందగ సరసములాడుదురు ప్రేమశబరులు' (కా.సం.4.50). ఇతనిశత్రుకాంతలు గుహాలలో చేరి ఏడ్చుచుండగా ఆటవికులైన శబరులువారితో సరసము లాడుచున్నారు అనిభావము. రాజకాంతలు తల్లులవంటివారు. అగమ్యలైనవారితో శబరులు సరసమాడిరని చెప్పుట విరసదోషము. ఇది 'రసాభాసము'లో చేరును (వ్యాఖ్య.పు.498).

*విరుద్ధమతికృత్తు* : పదదోషము. చూ. విపరీతధీప్రదము.

*విరుద్ధము* : అర్థదోషము., సా.ద కర్త మొ దీనినే "ప్రసిద్ధి విరుద్ధము"అనిరి. వివ. దేశకాలాదులకు ఉచితముకానిదై, లోకవిరుద్ధమైన అర్థము విరుద్ధము ఉదా॥ చైత్రము సముదంచితకైతకమైనది. చంపకవనము సమదవిలోలభ్రమరమైనది (కా.సం.4.49). చైత్రమాసములో మొగిలిపూవుండదు. ఇది కాలవిరుద్ధము. సంపెంగతోటలో తుమ్మెదలు తిరుగవు. ఇది కవిసమయ విరుద్ధము.

*విరోధమూలకము* : కారణము లేకున్నను కార్యము కలిగినట్లు చెప్పుట విరోధము. ఆవిధముగా చెప్పినది విరోధమూలకము.

*విరోధాభాసము* : అర్థాలంకారము. లక్ష. విరోధము లేకయే విరోధమున్నట్లు చెప్పుట విరోధాభాసాలంకారము. దీనికి విరోధాలంకార మనియుపేరు. ఉదా "కమలాకరంబయ్యు నమరు నీశౌర్యంబు ఘనరాజహంస భీకరతఁ దాల్చె" (కా.సం.5.125), కమలాకరము (సరస్సు) రాజహంసలకు భీకర

మైనది అనుపైపై అర్థములో విరోధము తోచినను, కమలా+కరము(విజయ లక్ష్మిని చేయునది అయిన నీశౌర్యము రాజశ్రేష్ఠులకు శ్రీకరమైనది) అను నర్థమున పర్యవసించి విజయలక్ష్మికి స్థానమైన అను అర్థాంతరముచే మొదటి విరోధార్థము తొలగి విరోధాభాసమైనది. (ఇది జాతిగుణ విరోధము). ఈ అలంకారములు పదివిధములు: జాతి, జాతి-గుణ-ద్రవ్య-క్రియలతో 4 విధములుగా; గుణము, గుణ-క్రియా-ద్రవ్యములతో 3. విధములుగా; క్రియ, క్రియా - ద్రవ్యములతో 2 విధములుగా; ద్రవ్యము ద్రవ్యముతో ఒక విధముగా విరోధము చెంది మొత్తము పదివిధములు. ఇది శ్లేషమూలకమైన అలంకారమని గమనించవలె. (పదివిధముల ఉదాహరణములకు చూ. కా.సం.5.పు. 638-645. విరోధమూలకమైన ఈ అర్థాలంకారము ప్రాచీనులు వివేచించినదే. దీని 10 భేదములు సా.ద.కర్త ఒప్పినవి. అప్పయదీక్షితుడు ఒప్పినది ఒకే విధము. (హిం.సా.కో.).

*వివృతోక్తి* : అర్థాలంకారము. లక్ష. శ్లిష్టమై, గుప్తమైన అర్థమునుకవి సూచించినను, బయల్పరచినను వివృతోక్తి. ఉదా వృషభమా! పరక్షేత్రమునుండి దూరముగా బొమ్ము. క్షేత్ర పాలకుడు వచ్చుచున్నాడు. 'గూఢోక్తి'తోపోల్చి చూడుడు. 'పరక్షేత్రము' అన్న చోట గుప్తార్థము బయలుపడి వివృతోక్తి అయినది. ఆ భాగము లేకున్నచో ఈ వాక్యము గూఢోక్తికి ఉదాహరణము (చంద్రా.154). వ్యాజోక్తికి సంబంధించిన అలంకారము. అప్పయదీక్షితుడు ప్రతిపాదించిన 17 అలంకారములలో ఇదొకటి (హిం.సా కో.).

*విశేషము* : ఇది మూడు విధములు 1. లక్ష. ప్రసిద్ధమైన ఆధారమును పేర్కొనక ఆధేయమును వర్ణించుట. ఉదా। కవులేల వంద్యులుకారు? వారు దివంగతులైనను విశిష్టగుణములుగల వారి వాక్కులీ లోకమును కల్పాంతము వరకు రంజింపజేయును(కవులులేకున్నను వారి కావ్యములున్నవి అని ప్రసిద్ధములైన ఆధారములు ఇట సూటిగా పేర్కొనలేదు. కా.ప్ర.) 2. ఆధేయమొక్కటే అయి అది వివిధ ఆధారములందు ఒకే కాలమున ఉన్నట్లు వర్ణించుట. ఉదా। ఆవిడ నీ హృదయములో, కన్నులలో, వాక్కులలో నివసించి ఉన్నప్పుడు మావంటి పుణ్యహీనలకు తావెక్కడ? (సపత్నియందెక్కువ ఆదరముగల పతితో పత్నియన్న మాట ఇది. కా.ప్ర) 3. ఒక కార్యము ప్రారంభము కాగా దానిచేత అశక్యమైన (కాదగని) ఇతర కార్యముగూడ అగుట. ఉదా॥ మొలిచె కమలము నిర్జరస్థలమునందు, కలువలుదయించె దానిపై, కానిపించె కనకలతపైనివెల్ల, ఆ కనకలతయు లేతయట, యేమియీయాశ్చర్యోత్పాతవితతి (కా.సం.5.పు.642). ఇదొకస్త్రీ వర్ణనము. మూడవలక్షణమునకు సరిపడినది.

*విశేషోక్తి* : అర్థాలంకారము. లక్ష. ప్రసిద్ధ కారణములెన్ని ఉన్నను కార్యము (ఫలము) ఉత్పత్తి కాలేదని చెప్పుట విశేషోక్తి. ఉదా। ఉపనిషత్తుల అర్థమును తెలిసితిని, భగవద్గీత పారాయణము చేసితిని, బ్రహ్మసూత్ర భాష్యమును వల్లించితిని, కాని విషయములనుండి మనస్సునుత్రిప్పలేనైతిని(ర.గం).

-విరోధమూలకమైన ఈ అర్థాలంకారము భామహాదులు వివేచించినదే.మమ్మ టుడు దీనిని మూడు విధములుగా వివేచించెను (అనుక్తనిమిత్త, ఉక్తని మిత్త, అచింత్యనిమిత్త). ఇతరుల ననుసరించిన సా.ద. కర్త దీనిభేదములు రెండనెను. జయదేవుని అనుసరించినవారు ఒకే విధమును స్వీకరించిరి. దీనికి కువలయానంద మిచ్చిన ఉదా॥ "అనురాగవతీ సంధ్యా దివసస్తత్పురస్సరః, అహో! దైవగతిశ్చిత్రా తథాఽపి నసమాగమః" (కువ.). సంధ్య అనురాగ వతి, ప్రియుడు ముందేఉన్నాడు. అయ్యో! దైవగతిఎంత చిత్రమైనది! వారిరువురికి సమాగమము లభించకున్నది (సంస్కృతభాషలో సంధ్యాశబ్దము స్త్రీలింగము, దివసశబ్దము పులింగము. అవి ఆధారముగా కల్పించిన చమత్కా రమిది).

*విషమము* : అర్థాలంకారము. లక్ష. అనురూపములు కాని రెంటికి ఘటన (సంబంధము) వర్ణించుట విషమాలంకారము. అననురూపములు అనగా సాదృశ్యము లేనివి. ఉదా. (i) నక్కఎక్కడ నాగలోకమెక్కడ. నక్క జిత్తు, నాకలోకపు ఎత్తు ఈ రెండు పోలికలేనివి. వీటిని ఘటించి చెప్పుట వలన విషమాలంకారము. (ii) 'క్వబత హరిణకానాం జీవితంచాతిలోలం, క్వచ నిశిత నిపాతా వజ్రసారాశ్శరాస్తే' (శాకుం.) వంటివి అనను రూపఘట నలు. జయదేవుని విభజన ప్రకారము ఈ అలంకారము మూడు విధములు. *1. విరూపఘటన*: అనను రూపములైన రెంటికి చేరిక చెప్పుట విరూప ఘటన. ఉదా పైన పేర్కొన్నవి *2. విరూపకార్యోత్పత్తి*: కారణమునకు విరూపమైన కార్యము పుట్టుట విరూపకార్యోత్పత్తి. ఉదా॥ నీ నల్లని కత్తి తెల్లనికీర్తిని ఉదయింపజేయుచున్నది. *3. అనర్థోత్పత్తి*: ఇష్టమైన కార్యము చేయబోయినప్పుడు ఇష్టసిద్ధికలుగకపోగా అనిష్టసిద్ధి కలుగుట అనర్థోత్పత్తి. ఉదా। భక్ష్యముల బుట్ట అనుకొని ఎలుక, పాముపెట్టెను కొరికినది పాము ఆ ఎలుకను తినివేసినది (చందాౖ. 84-85). విరోధమూలకమైన అర్థాలంకా రము. దీనిభేదములు నాల్గని మమ్మటుడు, రెండని రుద్రటుడు, రుయ్యకుడు చర్చించినారు. సా.ద., కువలయానందము ఒప్పిన భేదములు మూడే (హిం.సా.కో.).

*విషయము* : చూ. అవయవములు నాల్గు.

*విషయి* : చూ. అవయవములు నాల్గు.

*విషాదనము* : అర్థాలంకారము. లక్ష. ఇష్టపడిన దానికి విరుద్ధముగా జరుగుట విషాదనము, లేదా విషాదము. ఉదా చమురుపోసి వత్తిని ఎగదోయ దల చిన మాత్రముననే దీపము ఆరిపోయెను. ఇది విషమాలంకార భేదమని కొంద రనిరి (చంద్రా. 129). గౌణవర్గమునకు చెందినది, ప్రహర్షణమునకు ప్రతి ద్వంద్వి, జయదేవుడు వివేచించినది (హిం.సా.కో.).

*విసంధి* : వాక్యదోషము. వివ. విసంధి అనగా విరుద్ధసంధి, లాక్షణికులుప్రయో గింప గూడని సంధి (అపగతలక్షణ మన్నను, గ్రామ్యసంధి అన్నను ఇదే).

ఉదా 'అరిగెన్న పరగిరి కినుడు' (కా.సం.4.24). ఇట్టి విసంధులు మరికొన్ని : 'అన్నిష్టసఖ'=అన్+ఇష్టసఖ (నన్నయ) 'సర్వమున్నతని' (పోతన). పింగళి సూరన మొ వారి ప్రయోగములలోను చూడవచ్చు (అదే.వ్యా.పు.465). పద్య మధ్యమున విసంధిచేయుట దోషమగును.

*వృత్త్యనుప్రాసము* : శబ్దాలంకార భేదము, ఏకవర్ణావృత్తి. లక్ష. 'గీ. ఒక్క వర్ణంబుకడదాక నుద్ధరింప బరగుజృంభణ వృత్త్యనుప్రాసమయ్యె, (కా. సం.4.75). ఒకేవర్ణము ఎన్నో పర్యాయము లావృత్తి అయినచో అది వృత్త్యనుప్రాసము. ఉదా. 'అడిగెదనని కడువడి జను నడిగిన దనుమగుడ నుడువడని నడయుడుగున్ (భాగ.8.103). దీనిలో 'డ' వర్ణము ఒకటే కొన్నిసార్లు ఆవృత్తి అయినది.—ఒకటి, రెండు, మూడు, నాల్గు ఇట్లు వ్యంజనము కొన్నిసార్లు ఆవృత్తి అగుట వృత్త్యనుప్రాసలక్షణమే అనిరి. ద్వివర్ణా వృత్తిని మాత్రము ఒక్కసారియే చేయవలెనని, ఎక్కువసార్లుచేసి నచో అది ఛేకానుప్రాసమగుననిరి (కా.సం.4.వ్యా.పు.549).

*వ్యతిరేకము* : అర్థాలంకారము. లక్ష. ఉపమా నోపమేయములలో ఒకదానికి గుణాధిక్యముగాని, గుణాపకర్షముగాని చెప్పినచో వ్యతిరేకాలంకారమగును. ఉదా సత్పురుషులు కొండలవలె ఉన్నతులు, అయినను వారు స్వభావముచే కోమలులు. కొండలకులేని కోమలత్వము సత్పురుషులకు చెప్పుట వలన ఉప మేయమునకు చెప్పిన ఆధిక్యము స్పష్టమైనది (చంద్రా.52)—సాదృశ్యగర్భ — గమ్యౌపమ్యాశ్రయ - భేదప్రధాన వర్గమునకుచెందిన అర్థాలంకారము. ప్రాచీనులు గుర్తించినదే. వ్యతిరేకము అనగా ఆధిక్యము లేదా ఉత్కర్షఅని ఇక్కడ అర్థము. (హిం.సా.కో)—ఈ అలంకారమును ఉపమేయగతమైన ఉత్కర్షతచేతను, ఉపమానగతమైన అపకర్షత చేతను, ఈ రెంటి చేతను, ఈ రెంటిలో ఏదియు చెప్పకుండగను ఇట్లు నాల్గు విధములుగా చెప్పవచ్చు. ఈ నాల్గు తిరిగి ఆర్థ - శ్రౌత-ఆక్షిప్త భేదములచే పన్నెండు విధములు. ఈ పన్నెండు మరల శ్లిష్ట-అశ్లిష్ట భేదములచే ఇరవైనాల్గు విధములు అని మమ్మ టుని విభజన. ఉపమేయాధిక్యముగా చెప్పు లక్షణమును రుయ్యకుడు ఒప్ప లేదు. రుయ్యకుని అభిప్రాయమును మమ్మటుడు ఖండించెను (ఆ.వి.స.2. పు. 496).

*వ్యర్థము* : అర్థదోషము. వివ. ప్రయోజనములేని అర్థము తోచినచో అది వ్యర్థము. ఉదా 'అనిలతనయుఁడు ఫేనిలంబైన జలనిధిదాటెను' (కా.సం. 4.47). హనుమంతుడు సముద్రము దాటెను అన్నచాలు. 'ఫేనిలంబైన' (నురుగుగల) అను విశేషణము వ్యర్థము.

*వ్యాకీర్ణము* : వాక్యదోషము. వివ. భ్రాంతి జనకముగా అన్వయించువాక్యము వ్యాకీర్ణము. ఉదా। 'ఇడుడు తిలకముం గుంతలములఁ గాంతకును లతాంతం

టులు సెరువుడు' (కా.సం.4.29). 'తిలకమును కుంతలములయందిడుడు' అని భ్రాంతిజనకము. వాక్యరచన ఇట్లుండుట దోషము. దీనినే సా.ద. 'అస్థాన పదదోషము' అన్నది (అదే వ్యా. పు. 469).

**వ్యాఘాతము** : అర్థాలంకారము.లక్ష.ఒక కర్త ఒక కార్యమును ఒక ఉపాయముతో సాధింపగా (సాధింపబోగా) ఇంకొక కర్త అదే ఉపాయముతో అదే కార్యమును మొదటి ప్రయత్నమునకు విరుద్ధముగా సాధింపగా ఆ కార్యము వ్యత్యస్తమగుట వ్యాఘాతాలంకారము. ఉదా (i) తనదృష్టిచేత కాల్చిన మన్మథుని తమదృష్టిచేత బ్రతికించి శివుని జయించిన వారయిన స్త్రీలు కొని యాడ దగిన వారు (రాజశేఖరుడు). ఒక్క కార్యసాధనమే వివరీత సాధనముగ పరిణమించుటయు 'వ్యాఘాత' లక్షణమే. ఉదా (ii) బాల్యమని యుద్ధమునకు రావలదని అందురేల? బాల్యముననేకదా యుద్ధ విద్యనభ్యసించుట. (రాజుతో ఒక యువరాజు అన్నమాట ఇది. ఆ.వి.స.2.పు.501). విరోధమూలకమైన అర్థాలంకారము. భామహాదులు ఒప్పనిది. రుద్రటాదులు ఒప్పిరి. జయదేవునివలెనే సా.ద. కర్త దీని ప్రథమభేదమును ఒప్పుకొని ద్వితీయ భేదమునుగూడ వివేచించినాడు (హిం.సా.కో.).

**వ్యాజనింద** : అర్థాలంకారము. లక్ష. నిందవలన నిందయే స్ఫురించినచో వ్యాజ నిందాలంకారమగును. ఉదా ఒక్కతలను త్రుంచివేసిన శివుని అనవల యునుగాని, బ్రహ్మను అని ఏమి ప్రయోజనము. 'బ్రహ్మ చేతలన్నిపాడైన చేతలు' అని; శివుడు బ్రహ్మ శిరస్సులలో ఒక్క దానినేనరికినాడని; మిగతా శిరస్సులు గూడనరికి ఉండినచో పాపమయమైన ఈ ప్రపంచసృష్టి జరిగిఉండె డిది కాదని గమ్యార్థము. దీనిలో బ్రహ్మను, శివుని ఇద్దరిని నిందించుట, నిందవలన నింద స్ఫురించుట జరిగినది. ఇది వ్యాజనింద (చంద్రా. 67). వ్యాజస్తుతికి సంబంధించిన అర్థాలంకారము. జయదేవాదులు వివేచించినది.

**వ్యాజస్తుతి** : అర్థాలంకారము. లక్ష. పైకినిందగా తోచి పర్యవసానము స్తుతిగా తేలినను, పైకి స్తుతిగాతోచి పర్యవసానము నిందగా తేలినను దానిని 'వ్యాజస్తుతి' అందురు. ఉదా (i) పాపాత్ములకుగూడ స్వర్గమిచ్చుచున్నావు గంగా! నీకు వివేక మెక్కడిది? దీనిలో గంగను నిందించినట్లు తోచినను దాని మాహాత్మ్యము వర్ణించుటయే ముఖ్యోద్దేశము కాబట్టి వ్యాజస్తుతిలో ఇదొక పద్ధతి (చంద్రా. 65). (ii) కుకవులు పరోపకారపరాయణులు 'ఏమహాత్ములుగల్గ భూమీశసభలలోఁ గవులకు మిగుల విఖ్యాతిగల్గె' (కా.సం. 1.9). ఇది పైకిస్తుతిగా తోచినను నిజమునకునిందయే.—సాదృశ్యమూలక-గమ్యోపమ్యాశ్రయవర్గమునకు చెందిన అర్థాలంకారము ప్రాచీనులు వివేచించినదే. శబ్దశక్తి (అభిధ) స్వభావము కారణముగా నిందగాని, స్తుతిగాని, గమ్యమానమైనచోట 'వ్యాజస్తుతి' అని భామహుని నిర్వచనము: నిందలోస్తుతి, స్తుతిలోనింద అని తర్వాతివారు నిర్వచించిరి (హిం.సా.కో).

*వ్యాజోక్తి :* అర్థాలంకారము. లక్ష: వ్యాజోక్తి=కపటముతో కూడిన ఉక్తి, చమత్కారమైన అబద్ధము. సత్యమును దాఁచుటకై అసత్యమైన కారణము చెప్పుట వ్యాజోక్తి. ఉదా సఖి! గృహారామములోని పుప్పొడి దేహము నిండ బడి ధూసరవర్ణము గలదాననైతిని. ప్రియునితో కూడినపుడు అంటిన నేలదుమ్ము విషయము కప్పిపుచ్చుటకై చెప్పినమాట ఇది (చంద్రా.152.). గూఢార్థ ప్రతీతి మూలమైన అర్థాలంకారము. భామహాదులు స్వీకరించినదే (హిం సా.కో.). అపహ్నుతి-వ్యాజోక్తి. ఈ రెంటి భేదములు: అపహ్నుతిలో ప్రకృతాప్రకృతములకు సామ్యముండును. వ్యాజోక్తిలో అట్లుండదు.

*వ్యాహతము :* అర్థదోషము. వివ. మొదలు ఒకదానికి ఉత్కర్షమో, అపకర్షమోచెప్పి మరల దానినే భిన్నముగా చెప్పినచో వ్యాహతదోషము. ఉదా। '...కుందనపుటొడల్, కసుగందిన కందుకమన, వసివాళ్వాడెన్ నిదాఘ పరిపీడనచేన్' అని అపకర్షముచెప్పి 'కన్నెగేదంగిచెండునా గళుకులొలయు నావెలంది యొడల్...' అని తర్వాత దానికే ఉత్కర్షము చెప్పుట వలన వ్యాహతమైనది (కా.సం.4.వ్యా.పు.502).

*శబ్దాలంకారములు :* కేవలము శబ్దవైచిత్రి మాత్రమే ప్రధానముగా ఏర్పడినవి శబ్దాలంకారములు. శబ్ద ధర్మములు రెండు: శబ్దించుట, అర్థమిచ్చుట. శబ్ద (ధ్వని) ధర్మమును బట్టి ఏర్పడినవి శబ్దాలంకారములు. ఇవికావ్యమునకుకొంత సంగీతమును కూర్చును. అర్థము ఆధారముగా ఏర్పడినవి అర్థాలంకారములు. ఇట్లు శబ్దాలంకారములని, అర్థాలంకారములని ఇవి రెండు విధములైనవి. శబ్ద చమత్కృతి, అర్థచమత్కృతి ఈ రెంటివైచిత్రి ఏర్పడినచోట అది 'ఉభయాలంకారము' అని కొందరనిరి (హిం.సా.కో.). శబ్దాశ్రితమైన చమత్కారముతో ఏర్పడిన అలంకారములు వర్ణ, పద, వాక్యగతములై మూడు విధములైనవి. అనుప్రాసాదులు వర్ణాశ్రితములు, యమకాదులు పదాశ్రితములు, లాటానుప్రాసాదులు వాక్యాశ్రితములు. వీటిముఖ్యభేదములివి: అనుప్రాస, యమకము, పునరుక్తవదాభాసము, వక్రోక్తి, శ్లేష. శబ్దాలంకారములను ఎవరెన్ని విధముల విభాగించినను అవి మొత్తము పైవాటిలోనే అంతర్భాగము లగును (హిం.సా కో.). బంధ (చిత్ర), గర్భ, నిరోష్ఠ్య, ప్రహేళిక, అనులోమ విలోమాది భేదము లన్నియు శబ్దాలంకారములే.

*శృంఖలామూలము :* పూర్వాపరపదములకు (అర్థములకు) లంకె గలది అని అర్థము. దీనినే శృంఖలాబంధ, శృంఖలావైచిత్ర్యమూల మనిరి.

*శృంఖలాలంకారములు :* అర్థాలంకారములలోను కొన్ని శృంఖలాలంకారములున్నవి. లక్ష. వరుసగా నిబద్ధములైన అర్థములలో పూర్వపూర్వములకు ఉత్తరోత్తరములతోను; లేదా ఉత్తరోత్తరములకు పూర్వ పూర్వములతోను లంకె వేసి చెప్పుట 'శృంఖల'. ఇవి మూడు విధములు. చూ. కారణమాల, ఏకావళి, సారము (ఆ.భి.స.2.పు.501).

*శ్రౌతి* : 'పూర్ణోపమ' మొదటి విభజనలో రెండు ప్రకారములైనది (శ్రౌతి, ఆర్థి). తర్వాత 'శ్రౌతి' విధములు 3, 'ఆర్థి' విధములు 3, వెరసి పూర్ణోపమ భేదములు 6. చూ. ఉపమా భేదములు - మమ్మటాదుల విభజన

*శ్లేష*[1] : కావ్యగుణములు 10. వాటిలో మొదటిది. శ్లేషాలంకార లక్షణమునకు, దీని లక్షణమునకు సంబంధ మేమియులేదు. వివ. ఇట శ్లేష అనగా అ,ఇ,ఉ కారాంత శబ్దములు నిత్యసంధిలో అల్లుకొనిపోయి ఏకాకారముగా తోచుట. ఉదా 'అలావణ్య మగణ్య; మాగుణగుణం బవ్యాజ; మాతేజ ముద్వేలంబు ...(కా.సం.4.58). ఉకార సంధితో ఏకపదాకారముగా ఏర్పడిన ప్రకార మిది ఏకస్థానీయములైన వర్ణములు బహుళముగా ఉండుటవలన ఏకాకార ముగా భాసిల్లుట గూడ శ్లేషగుణమే.

*శ్లేష*[2] : అలంకారము. లక్ష. సాధారణముగా రెండర్థములు, కొన్నిచోట్ల నానార్థములును గల శబ్ద ప్రయోగము శ్లేష. ఉదా రాజు కువలయానంద కరుడు (రాజు=ప్రభువు, చంద్రుడు - కువలయము=భూవలయము, కలువ) ప్రభువు భూజనులకు ఆనందము నిచ్చువాడని ఒక అర్థము, చంద్రుడు కలు వలకు ఆనందము నిచ్చువాడని ఇంకొక అర్థము. శ్లేషలో అనేకార్థములు అనగా రెండుగాని, అంతకుమించిగాని అర్థములు ఉండవచ్చు. ఒక విభజన ననుసరించి శ్లేషమూడు విధములు: 1. ప్రకృతశ్లేష 2. అప్రకృతశ్లేష 3. ప్రకృతాప్రకృతశ్లేష: *1. ప్రకృతశ్లేష.* లక్ష. రెండర్థములును ప్రకృ తములే అగుచు విశేషణ విశేష్యములు శ్లేషించినచో అది ప్రకృతశ్లేష. ఉదా (i) నరసభూపాలా నీధర్మములు (విండ్లు) గుణభరితములై (సజ్యములై) శాస్త్రకలన (శస్త్రసంబంధమున) నిర్నిద్రములై ఉన్నవి. (ii) ధర్మములు (రాజధర్మములు) గుణములు (సంధివిగ్రహాదులు) శాస్త్రకలన (రాజనీతి సంబంధమున) నిర్నిద్రములై ఉన్నవని రెండవ అర్థము. రాజవర్ణనము ప్రధానము కాబట్టి రెండర్థములు ప్రకృతములే అయినవి. దీనిలో ధర్మములు విశేష్యములు తక్కినవి విశేషణములు. అవి రెండును విశ్లేషించినవి (కా.సం. 5.163) ఆంధ్ర భారతము ఆశ్వాసాంత పద్యములలో గల హరిహరనాథస్తుతి, రాఘవ పాండవీయము వంటి కావ్యములు దీనికి ఉదాహరణములు. *2. అప్రకృతశ్లేష.* లక్ష. విశేషణ విశేష్యములు శ్లేషించుటయేకాక, రెండ ర్థములును అప్రకృతములే అగుట దీని విలక్షణత. ఉదా శిరోగృహీత సన్మా ర్గులు, స్ఫురత్కటక సంపదులు, అగు మహాకుల మహీభృత్తులతో ఈ కాక తీంద్రుడు సమానుడు (ప్ర.రు.). దీనిలో కులపర్వతములకు, కులీనులైన రాజులకు సరిపడుచున్న రెండర్థములును ఉన్నవి. కాని ఆరెండును ప్రకృత ములుకావు. కాకతిరాజ వర్ణనమే ప్రకృతము. విశేష్య విశేషణగతమైన శ్లేషతో (రెండర్థములతో) కాకతిరాజును *ఉపమించుటయే* ఇక్కడ ప్రకృ తార్థము కాబట్టి ఆరెండు ఉపమానములు అప్రకృతములైనవి. *3. ప్రకృతా ప్రకృతశ్లేష.* లక్ష. విశేష్యము శ్లేషింపకుండుట, విశేషణములు శ్లేషించుట,

ఉపమతో సంకీర్ణమై ఉండుట దీని విలక్షణత. ఉదా 'మహిమున్ వాగను శాసనుండు సృజియింపన్' (వ.చ.) వంటివి. ఈపద్యములో ఆంధ్రవాఙ్మయ ప్రారంభ వికాసాదుల వర్ణన ప్రకృతము, ప్రపంచవర్ణన అప్రకృతము. ఈ మూడవ భేదము మమ్మటాదులు ఒప్పనిది. ఇంకొక విభజన ప్రకారము శ్లేష రెండు విధములు: శబ్దశ్లేష, అర్థశ్లేష. శబ్దము నాశ్రయించినది శబ్దశ్లేష. శబ్దశ్లేష రెండువిధములు: అభంగశ్లేష, సభంగశ్లేష. సభంగ-శబ్దశ్లేష 8 విధములని మమ్మటుని విభజన. *1. వర్ణశ్లేష*. లక్ష. స్వరములు విడగొట్టుట వలన రెండర్థములు ఇచ్చునది. ఉదా (i) వాడు మాధవుడు (విష్ణువు) (ii) వాడు ఉమాధవుడు (శివుడు). *2. పదశ్లేష*. లక్ష. పదములు విడగొట్టుట వలన రెండర్థములు ఇచ్చునది. ఉదా (i) పార్వతీ+పరమేశ్వరులు (పార్వతి, శివుడు) (ii) పార్వతీప+రమేశ్వరులు (శివుడు, విష్ణువు). *3. లింగశ్లేష*. లక్ష. లింగము నాశ్రయించి రెండర్థములు ఇచ్చునది ఉదా (i) కృష్ణవచనము, కృష్ణుని వచనము (పుంలింగము). (ii) కృష్ణ (ద్రౌపది) యొక్క వచనము (స్త్రీలింగము). *4. భాషాశ్లేష*. లక్ష. రెండుగాని రెంటికన్న ఎక్కువగాని భాషల నాశ్రయించినది ఉదా (i) 'మాయమ్మానసునీవే' — మా, అయం, మాన, సునీవే...ఇట్లు సంస్కృత పదవిభాగము చేయవచ్చు— మాయమ్మ, అన, సు, నీవే...ఇట్లు తెలుగు పదవిభాగము చేయవచ్చు. ఇదొకపద్ధతి. (ii) 'తా వినువారికి సరవిగ' ఇట్లు అనులోమముగా చదివినచో తెలుగు భాషాపద్యము,...గవి, రసకిరి, వా, అనువితా. ఇట్లు ప్రతిలోమముగా చదివినచో సంస్కృత భాషాపద్యము ఏర్పడును. (చూ. కళాపూర్ణోదయము మ.సూ.నా.శాస్త్రి పరిష్కృతము పు 464,472). ప్రకృతశ్లేషలో రెండర్థములును ప్రకృతములే కాబట్టి దానికి ఉదా 'రాఘవపాండవీయము' వంటి ద్వర్థి కావ్యములు చూడవచ్చు. *4. ప్రకృతిశ్లేష*: లక్ష. ప్రకృతిని అనగా ప్రత్యయ హీనమైనమూల రూపము నాశ్రయించినది. ఉదా। 'అయం సర్వాణి శాస్త్రాణి హృది జ్ఞేషు చ వక్ష్యతి'. (కా.ప్ర.). ఇట 'వక్ష్యతి' అను పదము 'వహ్, వచ్' అను రెండు ధాతువులకును భవిష్యత్కాల రూపము. ఈ పదమునకు 'వహించగలడు' వచించగలడు అని రెండర్థములు వచ్చునుకాబట్టి శ్లేష. తెలుగులో 'పండుకొనుము' వంటి మాటలలో ప్రకృతి శ్లేషనుచూడవచ్చు. *6. ప్రత్యయశ్లేష*: లక్ష. సంధివశమున ఏర్పడిన ఏకరూపమునకు భిన్నపురుషక్రియార్థముల నాశ్రయించినది. ఉదా 'త్వత్ప్రసాదాదహమము చితరుచిః స్యాన్నందితా సాతథామే' (కా.ప్ర.). స్యాం + నందితా = స్యాన్నందితా, స్యాత్ + నందితా = స్యాన్నందితా అని ఈసంధిరకములు రెండు. 'స్యాంనందితా' అనుపక్షమున ఉత్తమ పురుషకు, 'స్యాత్నందితా' అను పక్షమున ప్రథమ పురుషకు ఇట్లు భిన్నార్థములు వెడలును కాబట్టి ప్రత్యయశ్లేష. *7. విభక్తిశ్లేష*. లక్ష. విభక్త్యర్థము నాశ్రయించినది. ఉదా। 'సర్వస్వంహార సర్వస్యత్వం భవచ్ఛేదతత్పరః' (కా.ప్ర.). మొదటి అర్థములో

ఇది ఈశ్వరస్తుతి: (i) హేహార! సర్వస్య సర్వస్వంత్వం, భవచ్ఛేదతత్పరః త్వం. ఒక దొంగతన వృత్తినిగురించి తనకుమారునకు బోధించిన ఈ అర్థము రెండవది: (ii) సర్వస్య సర్వస్వంహార, త్వంఛేదతత్పరోభవ. మొదటిదానిలో 'హర' శబ్దము సంబోధన ప్రథమావిభక్తిలో ఉన్నది. అదే రెండవ దానిలో మధ్యమపురుష క్రియాపదమైనది. 8. వచనశ్లేష. లక్ష. వచనము నాశ్ర యించి రెండర్థము లిచ్చునది. ఉదా (i) ఉపాధ్యాయులు వచ్చిరి. గౌర వార్థమున ఒకే ఉపాధ్యాయునకు (ii) బహువచ నార్థమున అనేక ఉపాధ్యా యులకు నామ, క్రియల వచనములు సరిపడినవి. 'శ్లిష్' ధాతువునుండి 'శ్లేష' శబ్ద మేర్పడినది. శ్లిష్టమనగా అతికినది, కలిసినది, కూడినది. అని అర్థము. అనేకార్థములతో కూడుకొన్న శబ్దమును శ్లిష్టము అందురు. శ్లేషాలంకార మును అభిమానించిన వారిలో దండి ముఖ్యుడు. కొన్ని అలంకారములలో శ్లేష అంగముగా కనిపించినను 'శ్లేష' పేర ఒక స్వతంత్రాలంకారముండుట అవసరమని దండి అభిప్రాయము. మమ్మటుడు 'శుద్ధశ్లేష' తోపాటు ఇతర అలంకారములతో 'మిశ్రితమైనశ్లేష' కూడా గ్రాహ్యమే అన్నాడు. విశ్వ నాథాదులు మమ్మటుని అనుసరించిరి. జయదేవుడు ప్రకృత, అప్రకృత, ప్రకృతా ప్రకృతశ్లేషలను మాత్రమే చెప్పెను. సంస్కృతాలంకారికులు శ్లేషను విశేషముగా ఆదరించిరి. (హిం.సా కో).

**శ్లేష-ధ్వని :** ఈరెంటికిగల భేదము: శ్లేషలో శబ్దమునకు ఎన్ని అర్థములున్నను అవిమొత్తము అభిధాశక్తి నాశ్రయించియే ఉండి ఆయాప్రకరణగతములై విడివిడిగా తమ వాచ్యార్థములనే ఇచ్చును. ధ్వనిలోగూడ అనేకార్థములున్నను దానిలో మొదటి అర్థము మాత్రమే అభిధకు సంబంధించినది. తర్వాత ప్రక రణగతములై ప్రతీయమానములగు అర్థములు అభిధకుసంబంధిచినవికావు. వాటిని అర్థాంతరములు, వ్యంగ్యార్థములు అందురు. ఈరెంటికిగల ముఖ్య భేదమిది (హిం.సా.కో). ప్రకరణ నియమములేనిచోట రెండర్థములు వాచ్య ములేకాబట్టి అచ్చటిది శ్లేష. ప్రకరణ నియమమున్నచోట ధ్వని.

**శ్లేష-సమాసోక్తి :** ఈరెంటికిగల భేదము: ప్రకృతశ్లేషలో రెండర్థములును ప్రకృతములే, రెండును అభిధాశక్తియే కారణముగా వాచ్యములగును. అప్రకృతశ్లేషలో రెండర్థములును అప్రకృతములై ప్రధానమైన వస్తువర్ణ నమునకు ఉపమానములుగా ఉండును, అట్లు అప్రకృతములైన రెండర్థము లును అభిధాశక్తి కారణముగానే వాచ్యములగును. ఈరెండుశ్లేషలలోను విశే షణ విశేష్యములు రెండును శ్లిష్టములగును. సమాసోక్తిలో ప్రస్తుతార్థము వాచ్యముగా ఉండును, అప్రస్తుతార్థము స్ఫురించును, విశేషణమొకశే శ్లేషించును. ప్రకృతా ప్రకృతశ్లేషకును ఇదే లక్షణమున్నట్లు తోచినను సమాసోక్తిలో వలెగాక దీని రెండర్థములును అభిధనాశ్రయించి వెడలునని తెలియవలె. విశేషణ మొకశేశేషించుట ఈరెంటికిగల సమానలక్షణమైనను,

ప్రకృతా ప్రకృతశ్లేషలో రెండవ కథనము (ప్రతినాయక, నాయికాసంబంధ మైనది) వాచ్యము అగును. సమాసోక్తిలో రెండవ అర్థము అప్రస్తుతముగా స్ఫురించును. వాచ్యము కాదు. శ్లేషలో ఔపమ్యము వాచ్యమగుట అర్థపుష్టి యగును, సమాసోక్తిలో అది వాచ్యమగుట అపుష్టి. ఈ సూక్ష్మ భేదములు గ్రహించవలె (హిం.సా.కో).

*సంకరము* : అలంకార సంకరము: నీరక్షీరన్యాయమున ఒకదాని నొకటి ఆశ్రయించి కలిసిపోయిన అలంకార సమావేశమును సంకరము అనిరి. ఇది మూడు విధములు. (i) *అంగాంగిభావసంకరము*: ఒక అలంకారము ముఖ్యమై తక్కినవి దానికి అంగములుగా జేరి పరస్పర పోషకములగుట. ఉదా క. అసిజిహ్వాభయదంబై, యసమమహాబల విశేషహారియునై, యివ్వసుధ భవద్భుజ దండము, పొసగున్ ఫణిమాడ్కి నోబభూవరు నరసా! (కా.సం.ద. 236). ఇట 'అసిజిహ్వా' అనుచో రూపకము, 'మహాబల' (గొప్పబలము= గాలి) అనుచోశ్లేష, 'ఫణిమాడ్కి' అనుచో ఉపమ. ఇందలి రూపకము ఉపమను, శ్లేషను అనుగ్రహించుచున్నది. ఈ అలంకారములు పరస్పర సాపేక్ష ములై సౌందర్య పోషకములుగా ఉన్నవి. (కా.సం.ద.వి పు.702). (ii) ఏక వాచకానుప్రవేశసంకరము: ఒక్క వాచక శబ్దముతోనే రెండలంకారములు స్ఫుటములగుట. ఉదా మురారి వలన నిర్గతమై నరకనిరోధము చేయు చుండెడి చక్రధార గంగవలెనే నీతల మీదబడును (అం.చంద్రా.) ఇట'వలె' అను ఒక్కవాచకమే ఉపమను, శ్లేషను (నరకనిరోధము = నరకాసురవధ, గంగపక్షమున నరకలోకనివృత్తి) స్ఫుటము చేసినది. (iii) సందేహ సంకరము: ఒక అలంకారములో మరొక అలంకార లక్షణమున్నప్పుడు, రెంటిలో దేనినిగూడ ప్రమాణముగా నిశ్చయించుటకు వీలులేనప్పుడు అది సందేహ సంకరము. ఉదా నరసభూపాలా! నీకీర్తిమరాళి పాకారి తురగమును, రాకాకోకారి (చంద్ర) కళలను అనుకరించు కోమల కాంతిగలదై రంజిల్లును. ఇట 'కీర్తిమరాళి' అనునది అలంకారము. దానిని వివేచించుటెట్లు? 'కీర్తి అనుమరాళి' అని రూపకమా? 'మరాళివంటికీర్తి' అని ఉపమితసమాసముచే ఉపమాలంకారమా? ఏ ఒకదానిని సాధించుటకును ప్రమాణములు చాలవు కాబట్టి సందేహ సంకరము కువలయానందము మరిరెండు సంకరములను తెలిపినది: సమప్రాధాన్య సంకరము, సంకరసంకరము. చూ. (కా.సంద..పు. 706). నరసింహసంకరము: సంసృష్టి, అంగాంగిభావ, సంకర, ఏకవాచ కాను ప్రవేశసంకర, సందేహసంకర, సమప్రాధాన్య సంకరములకు 'నరసింహ సంకరము, అనిపేరు. నరసింహమూర్తి విగ్రహమున నరత్వసింహత్వములకు సమావేశమున్నట్లు, భిన్నాలంకారములకు ఏకత్రసమావేశముండుటచేవాటికి ఆపేరు పెట్టిరి. సంకరసంకరము నరసింహసంకరముకాదు(కా.సం.ద పు.709).

*సంకీర్ణము* : వాక్యదోషము. చూ. వాక్యసంకీర్ణము.

*సందిగ్ధము*[1] : అర్థదోషము. చూ. ససంశయము

*సందిగ్ధము*[2] : పదదోషము. వివ. అర్థనిర్ణయమున సందేహమునకు గురిచేయు పదము. ఉదా 'సమరవిజయుడు, ఇంద్రసన్నుతుడు ఈ రాముడు' అన్నప్పుడు, రాముడనగా పరశురాముడుగావచ్చు, శ్రీరాముడుగావచ్చు, బలరాముడుగావచ్చు, ఏరాముడు? ఇదిసందిగ్ధమే. పరశురాముడు, శ్రీరాముడు ఇద్దరు కలియు ప్రకరణములో గూడ సాధారణముగా 'రాముడు' అని ప్రయోగించుట పాఠకులను సందిగ్ధమున కీడ్చుటయే అగును. ఇట్టి పద ప్రయోగములో కవులు కొన్ని చోట్ల సావధానులై ఉండరని, అదిదోషమని ఆలంకారిక పక్షము (కా.సం.4.18).

*సందేహము* : అర్థాలంకారము. లక్ష. విషయి, విషయములకు (ఉపమానోపమేయములకు) గల సాదృశ్యము సమబలమైన సంశయములో పడినచో సందేహాలంకారము. ఉదా। 'రాకేందుబింబమో! రాజీవమో! మించుటద్దమో!లేకది ముద్దుమొగమొ!' (బిల్హ). ఇది మూడు విధములు. 1. శుద్ధ ఉదా (పైన చూపినది) 2. నిశ్చయగర్భ. ఉదా శ్రీరాముని శరీరకాంతినిచూచిఅరణ్యవాసులు ఇది యమునయా? కాదు, అది జలమయము. మరకతమణుల ప్రభయా? కాదు, దానికింత మాధుర్యమెక్కడిది? అనిసంశయగ్రస్తులైరి (ర.గం.). నిశ్చయము గర్భితముగా ఉన్నది నిశ్చయగర్భ. 3. నిశ్చయాంత. ఉదా ఇవి కల్పవృక్ష మంజరులతో కట్టిన హారములా? లేక కామధేనువు యొక్క పాలరాసులా? లేక ఉజ్జ్వల తరములైన చింతామణి స్ఫూర్తులా? లేకసుధారస కల్లోలములా? అని కొంతసేపు సందేహించి తుదకవి కాకతీయ ప్రతాపరుద్రుని స్మితప్రధానములైన కటాక్షములని నిశ్చయించిరి (ప్ర.రు.). సాదృశ్యగర్భ - అభేద ప్రధాన—ఆరోపమూలకములైన అర్థాలంకారములలో ఇదొకటి. భామహుడు దీనిని 'ససందేహ' మనెను. దండి దీనిని ఉపమాంతర్గతముగా గుర్తించెను. ఉద్భటుడు, మమ్మటుడు దండిని అనుసరించిరి. రుద్రటుడు దీనిని 'సంశయ' మనెను. రుయ్యక, వామన, విద్యాధర, విశ్వనాథులు 'సందేహ' మనిరి. (హిం.సా.కో).

*సంబంధవర్జితము* : వాక్యదోషము. వివ. ఇష్టమైన సంబంధములేనిది సంబంధవర్జితము. ఉదా। క.'...కరులు శైలములు; తురంగంబులు భంగంబులు; సమరాంబుధి వరతరణియితని యసిలతయనఁగన్ (కా.సం.4.40). సమరమను అంబుధిలో కరులు శైలములు, తురంగములు తరంగములు, అసిలత తరణి అను అన్వయ మిష్టము. ఇట 'సమరాంబుధి వరతరణి' అనుసమాసములో 'సమరాంబుధి' గుణీభూతమగుటచే 'కరులు' మొ వాటితో సంబంధము సంభవింపకున్నది, 'సమరాంబుధిన్' అని సప్తమ్యంతముచేసినచో ఈదోషము రాదు, ఈ దోషమునే దర్పణకారాదులు 'అభవన్మతయోగము' (ఇష్టసంబంధములేనిది) అనిరి (కా,సం,4 వ్యా,పు,476—77).

*సంభావన* : అర్థాలంకారము, లక్ష, ఒక అర్థము సిద్ధించుటకు 'ఇది ఇట్లయినచో' అని వితర్కించుట సంభావన, ఉదా రాజా! శేషుడు వక్త అయినచో

నీగుణములెన్నుటకు సమర్థుడగును (చంద్రా.123). ఇది అతిశయోక్తి లోనిదే కాని స్వతంత్రాలంకారము గాదని కొందరనిరి (ఆ వి.స.2 పు 511).

*సంసృష్టి* : అలంకార సమ్మేళనము: అనగా రెండుగాని అంతకుమించిగాని అలంకారములు తిలతండులన్యాయమున (పరస్పరసంబంధముండి లేనట్లు) కలిసియున్నచో ఆ కలయికను సంసృష్టి అనిరి. ఇది మూడు విధములు: (i) *కేవల-అర్థాలంకార సంసృష్టి*. ఉదా క. హారిదబలా కులగిరికుచ, వరచందన రజములగు భవత్కీర్తిరుచుల్, నిరవద్య సుధాంభోధి స్ఫురణంబు వహించె నోబ భూవరునరసా! (కా.సం.5.234). 'హారిదబలా' (హరిత్తులు అను అబలలు) అనుచో రూపకము. 'సుధాంభోధిస్ఫురణము' అనుచో సుధాంభోధి స్ఫురణము వంటి స్ఫురణము అని నిదర్శన. ఇవి రెండును పరస్పర నిరపేక్షములు కాబట్టి సంసృష్టి. (ii) *కేవల-శబ్దాలంకార సంసృష్టి*. ఉదా - 'వదనసౌరభలోభ పరిభ్రమద్భ్రమరసంభ్రమ సంభృతశోభయా; చలితయా విదధేకల మేఖలా, కలకలోఽలకలోల దృశాఽన్యయా'. దీనిలో పూర్వార్ధమున 'భ' కారవృత్త్యనుప్రాసము, తృతీయచరణమున 'ల' కారవృత్త్యనుప్రాసము, చతుర్థ చరణమున 'లకలో-లకలో'అనుచోట యమకము ఉన్నవి. ఈ అనుప్రాసయమకములు పరస్పర నిరపేక్షములు కాబట్టి సంకరము. (iii) *ఉభయాలంకారసంసృష్టి*. ఉదా 'ప్రతాపరుద్రదోర్దండోమండలాగ్రేన మండితః, దృశ్యతే సమరే వీరై రుత్ఫణః ఫణవానివ': దీనిలో పూర్వార్ధమున వృత్త్యను ప్రాసము, ఉత్తరార్ధమున ఉపమాలంకారము (ఫణవానివ) ఉన్నవి. ఇవిపరస్పర నిరపేక్షములు కాబట్టి సంసృష్టి (కా.సం.5.వి.పు 701).

*సనియమ పరివృత్తము* : అర్థదోషము. వివ. నియమముగా చెప్పవలసినచోట నియమము లేకుండ చెప్పుట. ఉదా 'ఆపాతసరసేభోగేనిమగ్నాః కిన్న కుర్వతే'; ఆపాతముగానే సరసమైన భోగమునమగ్నులైన వారేమిచేయరు? —ఇట "ఆపాతమేవసరసే" అను నియమము చెప్పవలె. "ఆపాతముగానే సరసము" అనగా పరిణామమున "విరసము" అను అర్థమురావలె. అప్పుడు నియమము చెప్పుకొనవలె. (కా.సం.4.వ్యా పు.504).

*సమత* : కావ్య గుణములు 10. వాటిలో ఐదవది. వివ. లలితములైన శబ్దార్థములు కూర్చి పద్యపాదము లన్నింటను రచనలో ఒక సమానత్వమును సాధించుట సమత. ఉదా "శరవేగములులేవె? చలయంత్ర పాఠీన పాటన క్రియకు నేర్పడవుగాక; చాతుర్యములులేవె? శారదాఖండారచోరకారశ్రీకి జోరవుగాక (కా.సం.4.62). ఈసీసపద్యము నాల్గు చరణములు పై తేటగీతితో సహా ఇట్లే సమతాగుణమును సంతరించుకొన్నది. ఈసమత వివిధములు. పద్యమును ఎట్లు నింబంధింపదలచు కొన్నను ఎత్తుగడనుండి తుదిదాక సమతను నిర్వహించవలె (అదే.వ్యా.పు.533).

*సమము* : అర్థాలంకారము. లక్ష. విషమ, సమ ఈరెండలంకారములు పరస్పరము వ్యతిరేకములు. అననురూపములైన రెంటినిఘటించి చెప్పుట విషమమైనది.

అనురూపములైన రెంటిని ఘటించి చెప్పుట సమాలంకార మగుచున్నది. జయదేవుడు చెప్పిన ప్రకారము దీని భేదములు మూడు *1. అనురూపఘటన:* అనురూపములైన రెంటిని ఘటించి వర్ణించుట. ఉదా రాజా! చంద్రిక చంద్రుని జేరినట్లు, గంగ చంద్రశేఖరుని బొందినట్లు కీర్తి తనకు అనురూపు డైననిన్ను ఆశ్రయించినది (కువల). విషమాలంకార ప్రథమభేదము (విరూపఘటనము) నకు ఇదివ్యతిరేకము. *2. సరూపకార్యోత్పత్తి:* కార్యకారణములకు సారూప్యము చెప్పుట. ఉదా॥ లక్ష్మీ! జలమున పుట్టిన నీకు నీచాసక్తత, సహజమేకదా! (చంద్రా.87) జలమునీచాశ్రయము=క్రిందికి ప్రవహించునది, నీచాశ్రయము లక్ష్మికిని, జలమునకును సమానము. కారణము నీచవంశజననము, కార్యము నీచాసక్తత. ఇట కార్యకారణములకు సారూప్యమున్నది. విషమాలంకార ద్వితీయ భేదము "విరూపకార్యోత్పత్తి". దానికి ఇదివ్యతిరేకము. *3. అనుకూలసిద్ధి:* ఇష్టమునకు అనుకూలముగా కార్యము నెరవేరుట. ఉదా బావా! వారణము కోరితివి, ద్వారపాలకుల చేత నీకు వారణము లభించెను. ఇదొక పరిహాసోక్తి. శబ్దశక్తి (శ్లేష) సహాయముతో అనుకూల సిద్ధి అయినట్లు గ్రహించవలె. కర్తకోరినది వారణము (ఏనుగు) ద్వారపాలకునిచే లభించినది వారణము (అడ్డగింపు). శ్లేషార్థముతో ఇష్టావాప్తి తీరినట్లు భావించివలె. విషమాలంకార తృతీయభేదము "అనర్థోత్పత్తి"కి ఇది వ్యతిరేకము (చంద్రా. 88). విరోధమూలక మైన అర్థాలంకారము. ప్రాచీనులు ఒప్పనిది. రుయ్యకాదులు స్వీకరించిరి. రుద్రటుడు, భోజుడు దీనిని "సామ్యము" అనిరి. మమ్మటుడు దీనిభేదములు రెండనెను. (హిం.సా.కో.).

**సమాధి**[1] : కావ్య గుణములు 10. వాటిలో పదియవది. వివ. ఒకవస్తువు ధర్మమును ఇంకొక వస్తువునకు ఆరోపించుట సమాధిగుణముఉదా బలిచక్రవర్తి నడిపింపగా, అడుగువెట్ట నేర్చిన దానకన్య కల్పవృక్ష ఫలముల రుచులు తెలిసికొని క్రమముగా పెరిగిపెద్దదై నిన్ను వరించినది (కా.సం.4.71). నరస రాయల హృదయములో ఉన్న దాతృత్వస్వభావమునకు బలిచక్రవర్తి, కల్పవృక్షము మొ ఇతరచోట్లగల ఈవిగుణములు ఆరోపించి చమత్కారపూర్ణముగా చెప్పిన పద్ధతి ఇది. వామనుడు చెప్పిన ప్రకారము "ఆరోహ అవరోహ క్రమస్సమాధిః," పద్యములోఆరోహక్రమమున దీర్ఘాది గుర్వక్షరములుండుట, అవరోహక్రమమున లఘువర్ణములధికముగా ఉండుట సమాధి గుణము.

**సమాధి**[2] : అర్థాలంకారము. లక్ష. ఒక కారణముచేత ప్రారంభమైన కార్యము ఆకస్మికముగా సంభవించిన కారణాంతరముచే (కాకతాళీయముగా) సుకర మగుట సమాధి. ఉదా దొంగవెంట పోలీసులు పరుగెత్తుచుండగా ఆ దొంగ జారి కాలువలోపడెను. పోలీసుల పట్టుదల మొదటి కారణము. దానిచే కార్యము సుకరము కాలేదు. దొంగ జారిపడునని పోలీసులు భావించలేదు,

కాకతాళీయముగా అట్లు జరిగినది. అకస్మాత్తుగా సంభవించిన ఆ కారణము వలన వారికార్యముసుకరమైనది. వాక్యన్యాయమూలమైన అర్థాలంకారమిది. ప్రాచీనులు వివేచించినదే. భోజుడుదీనిని 'సమాహితము' అనెను (హిం.సా.కో.).

*సమాధి—సముచ్చయాదులు* : సమాధి, సముచ్చయము, కావ్యలింగము ఈ అలంకారములకు గలసూక్ష్మభేదములు తెలియదగినవి. కాకతాళీయ న్యాయమున, సంభవించిన అన్య కారణము వలన కార్యము సుకరమైనట్లు చెప్పినచో 'సమాధి'. కారణము లన్నింటిని 'ఖలే కపోతన్యాయమున, (కళ్ళములో పావురములు ఒకేసారి వాలినట్లు లేదా ఎగిరినట్లు) కూర్చినచో సముచ్చయము. కారణము వివక్షిత మాత్రముగా చెప్పినచో 'కావ్యలింగము'. కారణముల సంఖ్యగాని, వాటిగుణప్రాధాన్యముగాని వివక్షితములు కావు (అ.వి. స.2.పు.504).

*సమానధర్మము* : చూ. అవయవములు, సాదృశ్య-సాధర్మ్యములు.

*సమాప్తపునరాత్తము* : వాక్యదోషము. వివ. సమాప్తమైన వాక్యము చివర మరల కొన్ని పదములుంచుట సమాప్త పునరాత్తము. ఉదా '—శాశ్వతున భవుంగమలాతుఁ గమలనాభుం గమలాపతిఁగొల్తు ముక్తికై—విభున్' (కా. సం.4.34). ముక్తి 'కై' అన్నచోట వాక్యార్థము ముగిసినది. తర్వాత 'విభున్' అను విశేషణము చేరి దోషమైనది.

*సమాసదోషములు* : వీటిని కా.ప్ర. విడిగా చర్చించినది. కాని ఇతరులెందరో పదగతములుగానే చూపిరి.

*సమాసోక్తి* : అర్థాలంకారము. సమాసోక్తి అనగా సంక్షేపముగా చెప్పుట. దీనిలో వ్యంగ్యార్థము గుణీభూతము. లక్ష. ప్రస్తుతము (వర్ణ్యము) చెప్పినప్పుడు కార్య, లింగ, విశేషణ సామ్యములవలన అప్రస్తుతము స్ఫురించినచో అదిసమాసోక్తి. ఉదా ఓగంగా! నీఒడిలో కూర్చొని తీయని పయస్సుతాగి తాగి, శ్రమభారమును మరచి నేనెప్పుడు హాయిగా నిద్రపోదును? (ర.గం). గంగానది స్తుతి ఇక్కడ ప్రస్తుతము. కాని ఒడిలోకూర్చొని, పయస్సుతాగి అను పదప్రయోగముల వలన గంగను తల్లిగా తనను కుమారునిగా భావించుకొనినట్లు అప్రస్తుతార్థ మొకటి స్ఫురించుచున్నది. 'అయమైంద్రీముఖం పశ్య రక్తశ్చుంబతి చంద్రమాః' (చంద్రా.56). చంద్రోదయ వర్ణన ప్రస్తుతము. తూర్పు (ఐంద్రి) ముఖమున చంద్రుడు ఎర్రగాపొడుచుచున్నాడని ప్రస్తుతార్థము. ఐంద్రీ (ఇంద్ర సంబంధిని అయినదాని) ముఖమును చంద్రుడు రక్తుడై చుంబించు చున్నాడని అప్రస్తుతార్థము. అనగా ఒకనాయకుడు పరకీయను ముద్దాడుచున్నాడను భావము అప్రస్తుతముగా స్ఫురించుచున్నది. "చంచచ్చంద్రకరస్పర్శ సమున్మీలితతారకా, అహో! రాగవతీ సంధ్యా జహాతిస్వయ మంబరమ్" (రామా కిష్కి. 30.46). సమాసోక్తికి

ఇట్టివి మంచి ఉదాహరణములు. దీనిలో అప్రస్తుతార్థము స్ఫురించుటకు కవి ప్రయోగించిన ఆయాశబ్దశక్తులే మూలముకావచ్చు. కానిఇందులో అప్రస్తుతమైన ఔపమ్యము (పోలిక) స్ఫురించ వలసినదే తప్ప అది వాగ్రూపమున ఉండకూడదు. సమాసోక్తి, శ్లేష, ధ్వని, సమాధిగుణము వీటి సంబంధ–భేద–వైశిష్ట్యములు జాగ్రత్తగాచర్చించి తేల్చుకోవలసినవి. దీని అలంకారత్వమునకు కారణమైన "విశేషణ సామ్యము' మూడు విధములు: 1. సాధారణము 2. ఔపమ్యగర్భము 3. శ్లిష్టము. వ్యవహార సమారోపమే సమాసోక్తి జీవితము. అదినాల్గువిధములు: 1. లౌకికవస్తువునందు లౌకికవ్యవహార సమారోపము 2. లౌకికవస్తువునందు శాస్త్రీయవస్తు వ్యవహార సమారోపము 3. శాస్త్రీయవస్తువునందు శాస్త్రీయవ్యవహార సమారోపము 4. శాస్త్రీయ వస్తువునందు లౌకికవస్తు వ్యవహార సమారోపము. ఉదా॥ కాకతీశ్వరునియందు సాలంకారయు, లసద్వర్ణయు, సగుణయు, రస నిర్భరయు అగు భారతీదేవి భావానుబంధినిగా ఉన్నది (ప్ర.రు). దీనిలో అలంకారశాస్త్ర సంబంధమైన వస్తువగు భారతికి చెప్పిన శ్లిష్ట విశేషణములు లౌకికనాయికా వ్యవహారమును స్ఫురింప జేయుచున్నవి. ఇట్లే ఇతర ఉదాహరణములు చూచుకొనదగినవి (ఆ.వి.స 2.పు.497) —సాదృశ్యగర్భ విశేషణవైచిత్ర్యమూల–గమ్యౌపమ్యాశ్రయ వర్గమునకు చెందిన అర్థాలంకారమిది. ప్రాచీనులు వివేచించినదే. సమాసోక్తిఅనగా కొంచెములోనేగొప్పగా చెప్పుట అని అర్థము. విశ్వనాథుని నిర్వచనము ననుసరించి "సమానమైన కార్య, లింగ, విశేషణములతో అప్రస్తుత వస్తు వ్యవహారమును ప్రస్తుత వస్తువుపై ఆరోపించుట సమాసోక్తి (సా.ద.10.56,57). ప్రస్తుతములో అప్రస్తుతము స్ఫురించుటయే సమాసోక్తి అని జయదేవుడు, అప్పయ దీక్షితుడు సూక్ష్మముగా చెప్పిరి (హిం.సా.కో).

*సమాసోక్తి–ధ్వని* : ఈరెంటికిగల భేదములు: సమాసోక్తిలోస్ఫురించు రెండవ అర్థము అప్రస్తుతము, విశేషణము శ్లేషించుట వలన జనించినది, అదిప్రకరణ గతము కానవసరములేదు. 'ధ్వని' అయిన అర్థము అప్రస్తుతముకాదు, ప్రకరణగతముగానే అది స్ఫురించును, ధ్వనిజనించుటకు అభిధార్థముగాని, విశేషణము శ్లేషించుటగాని కారణములుగావు. అది అర్థాంతరము, వ్యంగ్యార్థము. చూ. ధ్వని సిద్ధాంతము.

*సమాహితము* : అర్థాలంకారము. లక్ష. భావశాంతి ఇంకొకదానికి అంగముగా చెప్పినచో సమాహితము. ఉదా ఆవిడ ఏమిచేయునో చూతమని నేను మౌనముగా ఉంటిని. ఆవిడకోపము తెచ్చుకొనెను. నేను నవ్వితిని. ఆవిడ కన్నులలో నీరుతిరిగినది (కువల.). ఇక్కడ శృంగార రసము అంగి, 'కోప రూపభావశాంతి' అంగము.—రసవదాది వర్గమునకు చెందిన అలంకారమిది.

*సముచ్చయము* : అర్థాలంకారము. లక్ష. పదములఅర్థములకు ఒకే కాలమున, ఒకేచోట అన్వయము (యుగపదన్వయము) కూర్చుట సముచ్చయము. దీనికి చంద్రాలోకము చెప్పిన రెండు విధములు ఇవి. 1. ఒక కాలమున జరుగు కార్యముల నన్నిటిని కూర్చి చెప్పుట. ఉదా నీ శత్రువులు పారిపోవుదురు, వెనుకకు తిరిగి చూతురు, జారిపడుదురు. 2. ఒక కారణముతో కాగల కార్యమునకనేక కారణములు తోడ్పడినట్లు వాటిని కూర్చిచెప్పుట. ఉదా కులము, రూపము, యౌవనము, ధనము, విద్య అతనిని మదింపజేసినవి. (అతనిని మదింపజేయుటకు వాటిలో ఏ ఒకటైననుచాలి ఉండగా మిగతా వాటిని గూడకూర్చి చెప్పనైనది) వాక్యన్యాయమూలమైన అర్థాలంకారము 'వికల్పము'నకు ప్రతిపక్షమైనది. అదిగాని, ఇదిగాని అని వికల్పించి చెప్పుట దాని లక్షణము. అన్నిటిని కూర్చిచెప్పుట దీనిలక్షణము. రుద్రటాదులు వివేచించిచెప్పిన దీని మూడుభేదములకు, జయదేవుడు వివేచించి చెప్పిన రెండు భేదములకు వ్యత్యాసమున్నది. సా.ద. కర్త చెప్పిన దీని మూడు భేదములు (గుణయోగము, క్రియాయోగము, గుణ. క్రియాయోగము) రుద్రటాదుల ననుసరించి చెప్పినవి (హిం.సా.కో.).

*సవిశేషపరివృత్తము* : అర్థదోషము. వివ. విశేషసహితముగా చెప్పవలసినచోట విశేషము లేకుండ చెప్పుట. ఉదా ఈ రాత్రి అభిసారికలు నల్లని దుస్తులు ధరించి పోవుచున్నారు—ఈ రాత్రి అనుటకు బదులు 'ఈ చీకటిరాత్రిలో' అని సవిశేషముగా చెప్పినప్పుడే నల్లనిదుస్తులు ధరించిన అభిసారికలు (తమిస్రాభిసారికలు) బోధపడుదురు. అటుల చెప్పకుండుట దోషము (కా.సం.4. పు 504).

*ససంశయము* : అర్థదోషము. వివ. పాఠకులను సంశయమునకీడ్చు అర్థము (గల పదము) లుండుట ససంశయము. ఉదా॥. 'ధరణీవరు ధైర్యము నగముగెల్చు ...సతిమేను మించుహాసియించు' (కా.సం 4.48). ధైర్యనగములు, మేను మించులు అన్నచోట్ల కర్తయేదో కర్మయేదో తెలియదు. ఇది దోషమని మూలకర్త భావము. ప్రకరణమునుబట్టి సంశయము తొలగును, ఈ దోషమునే సా.ద. కర్త మొ . 'సందిగ్ధము' అనిరనివ్యాఖ్య.

*సహచరచ్యుతము* : అర్థదోషము. వివ. 'సరికిసరి' లేని వాటిని కూర్చి చెప్పినది సహచరచ్యుతము. ఉదా చంద్రునిచే ఆకాశముశోభిల్లు విధమున నురుగులచే సముద్రుడు శోభిల్లును. మొదటచెప్పినది ఉత్కృష్టమైనశోభ, రెండవది అపకృష్టము. ఈరెంటికి సాహచర్యము కుదురలేదు. ఇది దోషము (కా.సం. 4.పు 500)

*సహోక్తి* : అర్థాలంకారము. లక్ష. ఒక వస్తువునకు ప్రాధాన్యముచేత అన్వయము కలుగుచుండగా అప్రధానమైన ఇంకొక దానికి 'సహ, తో, కూడ' వంటి శబ్దార్థములతో అన్వయము కలుగవలె. అట్లు కలిగిన అన్వయము చమత్కారముగా ఉండవలె. ఉదా 1. అతని శత్రువులతో గూడ అతని

కీర్తి దిగంతములవరకు వ్యాపించెను. కీర్తి వ్యాపించుట ప్రధానము. శత్రువులు అప్రధానమే అయినను ఈ వాక్యములోని సహార్థబలముతో అతని శత్రువులు దిగంతముల వరకు పారిపోయిరి అని చమత్కారార్థము ఏర్పడినది కాబట్టి సహోక్తి. అతనికీర్తి, అతనిశత్రువులు ఈ రెంటికి ప్రస్తుతాప్రస్తుత సంబంధము లేదు. రెండును ప్రస్తుతములే. 'రాముడు లక్ష్మణునితో అడవికి పోయెను' అను వాక్యములో గూడసహార్థమున్నది కాని చమత్కారార్థము లేదు. ఇటువంటి వాక్యములలో అలంకారత్వము ఉండదు (చంద్రా.58). ఇది కార్యకారణ భావవైపరీత్యమనెడి అతిశయోక్తి అని కొందరి అభిప్రాయము (అ.వి.స.2). సాదృశ్య మూలక — గమ్యౌపమ్యాశ్రయ—భేద ప్రధాన వర్గమునకు చెందిన అర్థాలంకారము. ప్రాచీనులు గుర్తించినదే. సహోక్తిలో అతిశయోక్తి ఉండితీరవలె (మూలభూతాతి శయోక్తిర్యదా భవేత్) అని సా.ద. కర్తగూడ సమ్మతించెను. జయదేవుడు 'జనరంజనః' అని చెప్పిన సంకేతార్థ మటువంటిదే (హిం.సా.కో.).

*సాకాంక్షము :* అర్థదోషము. కా.సం.కర్త దీనిని 'అక్రియ' (అశరీరము) అనివాక్య దోషములలో చేర్చిరి. సా.ద.మొ ప్రకారము దీనివివ: క్రియను ఆకాంక్షించు అర్థము సాకాంక్షము. ఉదా '...దేశకాల పాత్రములని కొన్ని నాళ్ళు నిశితవ్యథ నొందియు తాళుకొంటి నాకమల దళాక్షిపై మమత' (రాయప్రోలు సుబ్బారావుగారి పద్యము):— 'దేశకాల పాత్రముల అనుకూలతకై' అను ఆకాంక్షను కోరుచున్నది (కా.సం.4.వ్యా.పు.505).

*సాదృశ్య—సాధర్మ్యములు :* ఉపమానోపమేయములకు సదృశమైనగుణ సంబంధమో, సధర్మమైన గుణసంబంధమో ఉండవలెనని ఆలంకారికు లాశించిరి. ఇందులో రెండు మతభేదములు వచ్చినవి. 1. 'సాదృశ్యము' వేరు, 'సాధర్మ్యము' వేరు అని ప్రాచీనుల అభిప్రాయము: ఉపమాప్రతియోగికము (ఉపమకు ప్రతికూలము), ఉపమేయానుయోగికము (ఉపమేయమునకు అనుకూలము) అయిన సంబంధము సాదృశ్యము అని; సాధారణధర్మ ప్రతియోగికము, ఉపమానోపమేయములకు అనుయోగికము అయిన సంబంధము అని భేదవాదుల అభిప్రాయము. 2. సాదృశ్య—సాధర్మ్యములకు భేదము పాటించనవసరము లేదని ఆధునికులైన మమ్మటాదుల అభిప్రాయము (అ.వి.స.2.పు.486).

*సాదృశ్యము:—* ఉపమాలంకారమునకు గల నాల్గు అంగములలో ఒకటి. ఉపమానోపమేయముల సమత్వమును వ్యంజించగల శబ్దమును సాదృశ్య వాచకమందురు (సమ, సదృశ, తుల్య, వలె, వంటి శబ్దములివి). వీటినే వాచక శబ్దములని, ఉపమావాచకములని అందురు. సాదృశ్యము రెండు విధములని అంగీకరించిరి: 1. రెండు వస్తువుల ఆకార—ప్రకార సామ్యమును చెప్పునది, వ్యంజించునది 2. రెండు వస్తువుల గుణమును బట్టిగాని, క్రియను

బట్టిగాని వాటి సామ్యమును చెప్పునది, వ్యంజించునది. దీనిలో ప్రభావ సామ్యము ప్రచ్ఛన్నముగా గాని, గౌణముగాగానిఉండవచ్చు.

సాధర్మ్యము:— ఉపమకుగల నాల్గు అంగములలో ఒకటి. ఉపమానోపమేయముల ధర్మసామ్యమును చూపునది. దీనినే సాధారణ ధర్మము, లేదా సమానధర్మము అందురు. ధర్మసామ్యమును బట్టి గూడ రెండు వస్తువుల సమానతను చెప్పుకొందురు. రెండు వస్తువులకు సాధర్మ్యము వాటి గుణములను బట్టి గాని, క్రియలను బట్టిగాని ఏర్పడుచున్నది. ఇక్కడ గుణ మనగా రూపు, రంగు మొ (హిం.సా.కో.). కాబట్టి ఈ సాధర్మ్యము 'సాదృశ్య' పదములోనే లీనమగుచున్నది. అందుకే ఆ రెండు పదములు ఒకటిగానే గ్రహించవలెనని ఆధునికులనిరి. చూ. సాధర్మ్యవిధములు.

సాధర్మ్యవిధములు : సాధర్మ్యమన్నను, సాదృశ్యమన్నను (ఆధునికుల అభిప్రాయమునుబట్టి) అర్థమొకటే, శబ్దభేదము మాత్రమే. చూ. సాదృశ్య—సాధర్మ్యములు. సాధర్మ్యము మూడు విధములు: 1. భేదప్రధానము=భేదప్రధాన—సాదృశ్యము. ఉపమానోపమేయములకు భేదమును, సామ్యమును గోచరింప జేయునది అని అర్థము. 2. అభేదప్రధానము = అభేదప్రధాన—సాదృశ్యము. ఉపమానోపమేయములకు భేదములేనట్లు గోచరింపజేయునది అని అర్థము. 3. భేదాభేదప్రధానము=భేదాభేదప్రధాన—సాదృశ్యము. ఉపమానోపమేయములకు కొంత భేదమున్నట్లు, కొంతలేనట్లు గోచరింప జేయునది అని అర్థము. దీనిలో సామాన్య ధర్మమును బట్టి అభేదభావము (కా.సం. 5.పు.565).

సామాన్యము : అర్థాలంకారము. లక్ష. రెండు వస్తువులకు భేదప్రతీతి ఉన్నను, అత్యంత సాదృశ్యము వలన వాటి భేదక ధర్మము (వ్యావర్తక ధర్మము) కనబడనట్లు వర్ణించినచో సామాన్యాలంకారము. ఉదా॥ పద్మాకరములో చొచ్చిన సుందరుల ముఖములు తెలిసికొన వీలులేక పోయెను. రెండు వస్తువుల సమధర్మములు అంత దగ్గర పోలికగా ఉన్నట్లు వర్ణితమైనది. మీలితము —సామాన్యము. ఈ రెంటికిగల భేదములు: మీలితాలంకారములో ఒకవస్తువు ఇంకొక వస్తువుయొక్క స్వరూపము లేకుండ జేయును. 'సామాన్యము'లో రెండు వస్తువులు విడివిడిగా కనబడునుగాని వాటి భిన్నధర్మములు కనబడనట్లు వర్ణిత మగును (చంద్రా. 146)—లోకన్యాయ మూలమైన అర్థాలంకారము. సామాన్యము అనగా ఇక్కడ సమాన భావమని అర్థము. దీనిని వివేచించినది మమ్మటాదులు (హిం.సా.కో.).

సారము : అర్థాలంకారము. లక్ష. ఉత్తరోత్తర వస్తువును ఉత్కర్షముగా వర్ణించుట సారాలంకారము. ఉదా "పనసతొనలకన్న, పంచదారలకన్న; జుంటి తేనెకన్న, జున్నుకన్న, చెరకు రసముకన్న చెలిమాట తీపురా విశ్వ". ఇది మూడు విధములు 1. శ్లాఘ్యగుణోత్కర్షము. పై ఉదాహరణమును పోలిన 'కావ్యేషు నాటకం రమ్యం' వంటివి. 2. అశ్లాఘ్యగుణోత్కర్షము. ఉదా॥

గడ్డిపరకకంటె దూదిచులకన, దూదికంటె యాచకుడు చులకన 3. ఉభయము. ఉదా॥ భూమిగొప్పది, అంతకంటె సముద్రము గొప్పది, అంతకంటె ఆకాశముగొప్పది, అంతకంటె ఆశగొప్పది (ఆ.వి.స.2 పు 602).—శృంఖలామూలకములైన అర్థాలంకారములలో ఒకటి. మమ్మటుడు వివేచించినది. ఉత్కర్షతో పాటు అపకర్ష వర్ణనగాని, ఒకే వస్తువును గురించిన ఉత్కర్ష వర్ణనగాని ఈ అలంకార లక్షణమని జగన్నాథుని అభిప్రాయము. రుయ్యకుడు దీనిని 'ఉదారము' అని, కొందరు 'వర్ధమానము' అని చెప్పుట గమనించదగినది (హిం సా.కో.) జయదేవుడు దీని మొదటి విధమును మాత్రమే చెప్పెను (చంద్రా. 105).

*సూక్ష్మము* : అర్థాలంకారము. లక్ష. సూక్ష్మమనగా సహృదయులకు మాత్రమే తెలియు సంగతి. దానికి సంబంధించిన వారికే తెలియునట్లు తన అభిప్రాయమును ఒక విధమైన చేష్టలతో (సైగలతో) తెలుపుట సూక్ష్మాలంకారము. ఉదా॥ నేను (కాముకుఁడు) చూచుచుండగా కామిని తన సీమంత మణిని వెంద్రుకలతో కప్పివేసెను. పాపటలోనిమణి సూర్యునకు, వెంద్రుకలు చీకటికి సంకేతములు. ప్రేయసీ ప్రియుల సమాగమకాలము చీకటి పడిన తర్వాత అని సూక్ష్మార్థము (చంద్రా. 150)—గూఢార్థప్రతీతి మూలమైన అర్థాలంకారము. భామహునికి ముందే దీనివివేచన జరిగినది. అర్థవైచిత్ర్యము లేదని భామహుడు దీనిని స్వీకరించలేదు. దండి ప్రభృతులు దీనిని గుర్తించిరి (హిం.సా.కో.).

*సౌకుమార్యము* : కావ్యగుణములు 10. వాటిలో నాల్గవది. వివ. సున్నలతో కూడివచ్చిన రచన సౌకుమార్యము. ఉదా చెందొవవిందు మందువలె చిందురుచిందగ, చందనంబు వెచ్చందన మొందు (కా.సం.4.61). ఇట్లు బిందు పూర్వకమైన వర్ణబంధమే దీనిలక్షణమని భట్టుమూర్తి చెప్పినాడు. 'అపారుష్యం సౌకుమార్యం' అని వామనుడు. పరుషత్వములేని బంధము (అక్షరములు పెటుకుగా వినిపించని రచన) సౌకుమార్యము అనదగినది (అదే.వ్యాఖ్య.పు.581).

*స్మరణ* : అర్థాలంకారము. లక్ష. ఒక పదార్థమునుగాని, విషయమునుగాని చూచినప్పుడు అదేసాదృశ్యము (పోలిక) గల ఇంకొకటి స్మరణకు వచ్చినచో 'స్మరణము'. ఉదా॥ ఇతడు చేయుదానములను చూచినచో భారతకథలోని కర్ణుడు తలపునకు వచ్చుచున్నాడు,—సాదృశ్యమూలకముకాని స్మరణము జ్ఞాపక మాత్రము. దానికి అలంకారత్వములేదు, 'మిత్రుని చూడగనే చిన్ననాటి ముచ్చటలు స్మరణకు వచ్చినవి' వంటి వాక్యములు సాదృశ్యమును బోధించునవికావు. కాబట్టి అవి 'స్మరణాలంకార' పరిధిలో చేరవు (ఆ.వి.స.2. పు.489).—ఇది సాదృశ్యగర్భ—భేదాభేదప్రధాన వర్గములో చేరిన అర్థాలంకారములలో ఒకటి, దీనిని మొదట గ్రహించినది రుద్రటుడు. "సాదృశ్యానుభావాద్వస్త్వంతరస్మృతిః స్మరణమ్" (అలం.స.).భోజుడొక్కడు మాత్రమే

దీనిని 'స్మృతి' అనెను. తక్కినవారందరు 'స్మరణము' అనిరి (హిం.సా.కో).

*స్మృతి-భ్రాంతి-సందేహములు* : ఈ మూడు అర్థాలంకారములకు గల భేదములు తెలియదగినవి. 1. స్మృతి: ఇదే స్మరణాలంకారము. దీనిలో వస్తు స్మరణమే కాని దాని అనుభవముండదు. ఉదా। ఇతడు చేయు దానములను చూచినచో భారతకథలో కర్ణుడు జ్ఞాపకమునకు వచ్చుచున్నాడు. 2. భ్రాంతిలో అనుభవదశ ఉన్నది. ఉదా। నరసభూపాలుని కీర్తినిచూచి ఇది ఆకాశగంగ అనుకొని హర్షించి సప్తర్షులు అందులో స్నానమాడదలచిరి (హర్షించుట అనుభవదశ). రూపకములో ఉపమానారోపము బుద్ధిపూర్వకముగా జరిగినది. దీనిలో అది భ్రాంతిజన్యము. 3. సందేహము: వస్తువును చూచినపుడు సాదృశ్యము సమబలమైన సందేహములో పడుట అనగా అదిగావచ్చునా? ఇదిగావచ్చునా! అని ఊగిసలాటలో పడుట. ఉదా॥ రాకేందుబింబమో! రవిబింబమో! ఇవివీటి మధ్యగల భేదములు.

*స్వభావోక్తి*: అర్థాలంకారము. లక్ష. జాతి-క్రియా—గుణ—ద్రవ్యస్వభావములను వర్ణించుట స్వభావోక్తి. (i) *జాతిస్వభావోక్తి* ఉదా . ఆకుపచ్చని రెక్కలు, ఎర్రనిముక్కులు, మువ్వన్నెచారల మెడలు మెరయుచుండగా మంజులోక్తులతో శోభిల్లుచున్నవి ఈ శుకములు. ఇటశుక జాతి వర్ణితమైనది. (ii) *క్రియా స్వభావోక్తి*: ఉదా ద్వి. 'తొలుకోడి కనువిచ్చినిలిచిమైవెంచి, జలజల ఱెక్కలుసడలించినీల్గి, గ్రక్కనఁగాలాచి కంఠంబు విచ్చి, ముక్కునని కలుసకొల్పికడుపు, వెక్కించి మెడసాచి నిక్కిమిన్సూచి, కుక్కుటో క్కోయనికూయకమున్న' (సోమనాథుని పం. చరిత్ర.2.). కోడికూసినప్పుడు దాని క్రియ అనగా చేష్టాదికము దీనిలో హృద్యముగా వర్ణితమైనది. క్రియా స్వభావోక్తి శ్రేష్ఠమైనదని ఆలంకారికు లెందరో అనిరి. (iii) *గుణస్వభావోక్తి*. ఉదా . అంగములను రోమాంచములుగాచేయుచు, చిత్తము నానందమున తేల్చుచు, నేత్రములకు ఆమీలనము కూర్చుచున్న ప్రేయసీస్పర్శ, అహా! ఎంత సుఖదాయక మైనది! ఇట గుణస్వభావము స్పర్శరూపమున వర్ణిత మైనది. (iv) *ద్రవ్యస్వభావోక్తి*. ఉదా గళమున గరళచ్ఛాయ, కరమునకపాలము, శిరమున అరుణజటలు ఒప్పగాశివుని చెలువు పొడకట్టెను. ఇటద్రవ్యస్వభావము శివరూపమున వర్ణితమైనది. ఈ ఉదాహరణములలో రెండవది తప్పమిగతావి కా.సం. వివరణకర్త చూపిన తెలుగు పద్యముల సారాంశములు. స్వభావోక్తిని కొందరు 'జాతి' అనిరి. స్వభావ, చేష్టాదుల చిత్రణగాని చమత్కారముగానిలేని కేవల వాస్తవ కథనము (గుర్రము గడ్డి తినును, సకిలించును, లద్దివేయును, వెనుకకాలితో తన్నును వంటి మాట)లో అలంకారత్వము లేదు. కవిమాత్రమే చెప్పదగిన సూక్ష్మ స్వభావ వర్ణన మాత్రమే 'స్వభావోక్తి' కాని రోజువారీ వ్యవహారములో చేరిన వాస్తవకథనము ఈ అలంకారము కాదని రుయ్యకుడు స్పష్టము చేసినాడు.—గూఢార్థ ప్రతీతిమూలమైన అర్థాలంకారము. భామహునికంటె పూర్వమే దీని వివేచన

జరిగినది. దీనిని పేర్కొన్న భామహుడు ఇది వక్రోక్తికి సన్నిహితముగా లేదని ఆదరించలేదు. స్వభావోక్తిని అలంకారముగా స్వీకరించవలెనా,వద్దా, అని వాదోపవాదములు బయలుదేరి చివరకిది ఉత్తమమైన అలంకారమని గుర్తించ బడినది. జాతి–క్రియా–గుణ–ద్రవ్యముల స్వభావమును వ్యాఖ్యానించి శాస్త్రము సామ్రాజ్యమైనది. వాటినే వర్ణించి తానుగూడ ఒక సామ్రాజ్య మగుటయే కావ్యము యొక్క అభీష్టము అను అర్థములో దండి స్వభావోక్తి పక్షమైచక్కగా చెప్పినాడు. "జాతిక్రియా గుణద్రవ్య స్వభావాఖ్యానమీదృశమ్, శాస్త్రేష్వస్యైవ సామ్రాజ్యం కావ్యేష్వప్యేతదీప్సితం" (కావ్యా.2.13).

హతవృత్తము : వాక్యదోషము. సా.ద. కర్త మొ వారు పేర్కొన్నది. వివ. రసానుకూలముగాని వృత్తమును (పద్యమును) స్వీకరించుటహతవృత్తము. ఉదా॥ శ్లో. 'హానృప! హాబుధ! హాకవిబంధో!' ఇది దోధకవృత్తము. రాజు మరణించగా అతనిబంధు వర్గము విలపించుఘట్టము. ఇదికరుణరసము. కరుణ రసమునకు ఎన్నుకోవలసినవి వియోగిని, మందాక్రాంత, పుష్పితాగ్రము మొ కాని హాస్యరస వ్యంజకమైన దోధకము తగదు. శృంగారమునకు చంపక, మత్తేభ, కంద, గీతాదులు రచింపక ఇతరము లెన్ను కొనుట; రౌద్ర, వీరములకు శార్దూలము మొ రచింపక ఇతరములు ఎన్ను కొనుట దోషము. ప్రాచీనాంధ్రకవు లెవ్వరును వృత్తౌ చిత్యమును పాటింపలేదు (కా.సం.4.వ్యా.పు.481). వృత్తములకును రసములకును గల సంబంధమును చర్చించుచు క్షేమేంద్రుడు సంస్కృత భాషలో 'సువృత్తతిలకము' రచించెను. ఆయారసములకు ఆయా వృత్తములు సూచించెను. కాని క్షేమేంద్రుని తర్వాత వచ్చిన సంస్కృత కవులైనను ఆ నియమములను కచ్చితముగా పాటింప లేదని 'యథాశక్తి యథామతి' అన్నట్లు రచించిరని పరిశోధనలలో తేలినది.

హీనోపమ : అర్థదోషము. వివ. అధికమైన వస్తువును అల్పవస్తువుతో పోల్చుట హీనోపమ. ఉదా 'శ్వానమును బోలెనితడు విశ్వాసి' (కా.సం.4.44). ఇతడు కుక్కవలె విశ్వాసము గలవాడు అను ఉపమానముచే అతనికి హీనత్వమంట గట్టినట్లైనది. ఇది దోషము.

హేతురహితము : అర్థదోషము. వివ. హేతువు చెప్పక ప్రయోగించినది హేతు రహితము. ఉదా 'సతిఁగనుగొని భృంగ పంక్తి చనుదెంచెను' (కా.సం. 4,51), తుమ్మెదలు వచ్చుటకు ఆమె ముఖపరిమళము కారణమని చెప్పలేదు కాబట్టి దోషము. అర్థము ప్రఖ్యాతమైనచోట ఈ దోషము చెల్లదు. ఉదా 'చంద్రంగతా పద్మగుణాన్న భుంక్తే' (కు.సం.) లక్ష్మిచంద్రుని ఆశ్రయించి పద్మగుణములను అనుభవించలేనందుకు కవిహేతువు చెప్పకున్నను 'చంద్ర' శబ్దముతో అది రాత్రి అని తెలియుచున్నది. ఇట హేతువు ప్రసిద్ధము (అదేవ్యా.పు.499).

హేతువు : అర్థాలంకారము. లక్ష. హేతుమంతము (కార్యము)తో పాటు హేతువు (కారణము)ను వర్ణించుట, హేతు, హేతుమంతములకు ఐక్యము వర్ణించుట. ఇట్లు ఈ అలంకారము రెండు విధములు. ఉదా॥ (i) చంద్రుడు స్త్రీల మానమును భేదించుటకై ఉదయించుచున్నాడు—కార్య కారణములు రెండును ఒకేవాక్యములో చెప్పినది. చంద్రోదయము హేతువు, స్త్రీల మానభేదనము హేతుమంతము. ఈ రెండువర్ణితమైనవి. ఉదా (ii) వేంకట ప్రభువుయొక్క కటాక్షములు విద్వాంసులకు లక్ష్మీవిలాసములు-కటాక్షములే లక్ష్మీ విలాసములు అని హేతు, హేతుమంతములకు ఐక్యము చెప్పబడినది (చంద్రా. 166). ఇది అతిశయోక్తిలో చేరినదని, భిన్నాలంకారము కాదని 'ఉద్ద్యోతము'

## అనుబంధము 1.

# శ్రవ్యకావ్య విభాగము-ఆకరగ్రంథములు

*ఆంధ్రకావ్యాలంకార సూత్రవృత్తి* (వామనుని కావ్యాలంకార సూత్రవృత్తికి ఆంధ్రానువాదము): వేదాల తిరువెంగళాచార్యులు. ముద్రణ 1955.

*ఆంధ్రధ్వన్యాలోకము* (సలోచన పరిభాషామతి సమేతము): ప్రథమోద్ద్యోతము 1958, ద్వితీయోద్ద్యోతము 1959, తృతీయోద్ద్యోతము 1964. ఆంధ్రీకృతి: పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి, ప్రచురణ: గ్రంథకర్త, విజయనగరము.

*ఆంధ్ర ప్రతాపరుద్రీయము* : విద్యానాథుని కృతికి అనువాదము: జమ్ములమడక మాధవరామశర్మ, ప్రచురణ: నవ్యసాహిత్య పరిషత్తు, గుంటూరు. ముద్రణ 1946.

*ఆంధ్ర ప్రతాపరుద్రయశోభూషణము* : విద్యానాథుని కృతికి ఆంధ్రానువాదము: చలమచర్ల రంగాచార్యులు, ప్రచురణ: శ్రీనివాసా పబ్లికేషన్స్, హైదరాబాదు. ముద్రణ 1972.

*ఆంధ్రరసగంగాధరము* : శ్రీశర్వాణీ వ్యాఖ్యాసహితము, వేదాలతిరువెంగళాచార్యులు. ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి, హైదరాబాదు: 1969 జూన్.

*ఆంధ్రసాహిత్యదర్పణము* : విశ్వనాథ కవిరాజ ప్రణీత గీర్వాణ గ్రంథమునకు అనువాదము: వేదము వేంకట రాయశాస్త్రిలు, ప్రకాశకులు: వేదము వేంకటరాయ శాస్త్రిలు అండ్ బ్రదర్సు, మద్రాసు. 1935.

*కావ్యప్రకాశము* : (సంస్కృతము తెలుగులిపిలో) మమ్మటవిరచితము, మల్లాది లక్ష్మణశాస్త్రి విరచిత బుధమనోరంజన వ్యాఖ్యతో, ప్రచురణ: వావిళ్ల రామస్వామిశాస్త్రి, ముద్రణ 1891 ఏప్రిలు.

*కావ్యప్రకాశము* : మమ్మట విరచితము. అనువాదకులు: జమ్ములమడక మాధవరామశర్మ, విమర్శినీవ్యాఖ్యతో, ముద్రణ 1958.

*కావ్యమీమాంసా* : (సంస్కృతము) రాజశేఖర విరచితము — ప్రకాశ (హిందీ) వ్యాఖ్యోపేతము, వ్యాఖ్యాత: డా॥ గంగాసాగర్ రాయ్, ప్రచురణ: చౌఖంబా విద్యాభవన్, వారణాసి, ముద్రణ 1964.

కావ్యాలంకార సంగ్రహము (నరసభూపాలీయము) : గ్రంథకర్త: రామరాజ భూషణుడు. వివరణకర్త: సన్నిధానము సూర్య నారాయణ శాస్త్రి. ప్రచురణ: యం. శేషాచలం అండ్ కంపెనీ మచిలీ పట్టణం, ముద్రణ (1) 1965 (2) 1969.

కావ్యస్వరూపమ్ : ఆంధ్ర వివరణ సమేతము. సంపాదకులు: స్వామి శివశంకర స్వామి, ఆచార్యపోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి. ప్రచురణ: ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, 1969.

ధనంజయుని దశరూపకము : సమూలము, ఆంధ్ర వ్యాఖ్యావిలసితము. వ్యాఖ్యాత: విద్వాన్ సరిపెల్ల విశ్వనాథశాస్త్రి. ముద్రణ 1967 ఏప్రిలు.

ధ్వన్యాలోకము : అభినవగుప్తవిరచితలోచన సహితము. ప్రకాశకులు:- జయకృష్ణ దాసహరి దాసగుప్త, చౌఖంబా సంస్కృత సీరీస్, బనారస్ సిటీ (బాలప్రియా దివ్యాంజనవ్యాఖ్యతో).

ధ్వనిసారము : జమ్మలమడక మాధవరామశర్మ. ప్రథమ ముద్రణ 1951.

నాట్యశాస్త్రము : గుప్తభావ ప్రకాశికా సహితము. డా పోణంగి శ్రీరామ అప్పారావు. 1959.

ప్రతాపరుద్రీయమ్ : రత్నాపణ సహితమ్. ప్రచురణ: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, చెన్నపురి-1954.

రసగంగాధరమణి (కావ్యమీమాంస) : జమ్మలమడక మాధవరామశర్మ. ముద్రణ 1965.

వక్రోక్తిసారము : జమ్మలమడక మాధవరామశర్మ, అభినవభారతి, గుంటూరు, ముద్రణ—ప్రమాది వసంతము.

సాహిత్యదర్పణము : విశ్వనాథ కవిరాజ ప్రణీతము. శ్రీరామచరణతర్కవాగీశభట్టాచార్య కృత టీకాసమేతము. ప్రచురణ: నిర్ణయ సాగర ప్రెస్, బొంబాయి-1902.

సాహిత్యదర్శనము : ఆచార్య కాకర్ల వెంకటరామనరసింహము; ప్రకాశకులు- కె. హరనాథ్ అండ్ బ్రదర్సు, విశాఖపట్టణం—1978.

## ENGLISH

Literary Criticism in Ancient India: by Dr. Ramaranjan Mukharji Pub: Sanskrit Pustak Bhandar, Calcutta-1966.

The Students Sanskrit-English Dictionary: by. V.S. Apte. 1965

అనుబంధము 2.

# పరిచ్ఛేద సహిత పరిభాషానుక్రమణిక

## అనుభావములు

అ

అంగజములు
అనుభావము
అయత్నజములు
అలంకారములు
అశ్రువు

ఔ

ఔదార్యము

క

కంపము
కాంతి
కిలికించితము
కుట్టమితము
కుతూహలము
కేళి

చ

చకితము

త

తపనము

ద

దీప్తి
ధైర్యము

ప

ప్రగల్భత
ప్రళయము

బ

భావము
బిబ్బోకము

మ

మదము
మాధుర్యము
మోట్టాయితము
మౌగ్ధ్యము

ర

రోమాంచము

ల

లలితము
లీల

వ

విచ్ఛిత్తి
విభ్రమము
విలాసము
విహృతము
విక్షేపము
వైవర్ణ్యము
వైస్వర్యము

శ

శరీరజములు
శృంగారచేష్ట
శోభ

స

స్తంభము
స్వభావజములు
సాత్త్వికభావము
స్వేదము

హ

హసితము
హావము
హేల

## అభిధాలక్షణాశక్తులు

## కవి - కావ్యములు



## కావ్యభేదములు

## కావ్యవిశేషములు

రసములు

## విభావములు



## వృత్తి, పాకము, శయ్య, రీతి

## వ్యంజనాశక్తి



## వ్యభిచారిభావములు

త

త్రాసము

ధ

దైన్యము
ధృతి

న

నిద్ర
నిర్వేదము

భ

భావధ్వని

మ

మతి
మదము
మరణము
ముదము
మోహము

ర

రోషము

వ

వితర్కము
విబోధము
విషాదము
వ్యభిచారిభావము
వ్యాధి
వ్రీడ

శ

శంక
శ్రమము

స

సంచారిభావము
సుప్తి
స్మృతి
స్వప్నము

హ

హర్షము

## శృంగారరసము

అ

అనౌచిత్యము
అభిలాషవిప్రలంభము

ఈ

ఈర్ష్యామానము
ఈర్ష్యావిప్రలంభము

క

కరుణవిప్రలంభము
కుసుంభరాగము

న

నీలీరాగము

ప

పూర్వరాగము
ప్రవాసవిప్రలంభము
ప్రణయమానము

భ

భవద్విప్రలంభము
భావశబలత
భావశాంతి
భావసంధి
భావాభాసము
భావివిప్రలంభము
భావోదయము
భూతవిప్రలంభము

మ

మంజిష్ఠారాగము
మానము(మానవిప్రలంభము)

ర

రసాభాసము

వ

విప్రలంభశృంగారము

## శృంగారావస్థలు



## స్థాయి భావములు

### అనుబంధము 3.

## నాటక, అలంకార విభాగము-ఆకర గ్రంథములు


*ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము* : 2వ సంపుటము సంపాదకులు: కొమర్రాజు వేంకట లక్ష్మణరావు. ఆంధ్ర పత్రికా ముద్రణాలయము, చెన్నపురి, 1934.

*ఆంధ్ర సాహిత్యదర్పణము* : (విశ్వనాథ కవిరాజు) అనువాదము: వేదము వేంకట రాయ శాస్త్రులు. ప్రకాశకులు: వేదమువేంకటరాయ శాస్త్రులు అండ్ బ్రదర్సు మద్రాసు. 1935

*కాదంబరీ కల్యాణము* : (నాటకము) ఉపక్రమణిక. కర్త: శిరోమణి సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి-1967.

*కావ్యాలంకార సంగ్రహము* : (నరసభూపాలీయము) గ్రంథకర్త: రామరాజభూషణుడు. వివరణకర్త: సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి, ప్రచురణ: యమ్. శేషాచలం అండ్ కంపెనీ, మచిలీపట్టణం, ముద్రణ. (1) 1965 (2) 1969.

*కువలయా నందము* : అప్పయ దీక్షితులు, నిర్ణయ సాగర్ ప్రెస్స్, బొంబాయి-1963.

*చంద్రాలోకము* : జయదేవుడు (బుధజనరంజనీ వ్యాఖ్య) వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులు అండ్ సన్సు; మద్రాసు-1938.

*దశరూపకము* : ఆంధ్ర వ్యాఖ్యాత: విద్వాన్ సరిపెల్ల విశ్వనాథ శాస్త్రి, ముద్రణ 1967.

*నాట్య శాస్త్రము* : గుప్త భావ ప్రకాశికా సహితము. డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు, 1959.

*ప్రతాపరుద్రీయము* : రత్నాపణ వ్యాఖ్యాసహితము. ప్రచురణ: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, చెన్నపురి-1954.

*రసమంజరి* : భాను దత్తుడు. ఆంధ్ర టీక, వేదంవేంకటరాయశాస్త్రి, ప్రకాశకులు: వేదం వేంకట రాయశాస్త్రి అండ్ బ్రదర్సు, మద్రాసు-1950.

*హిందీసాహిత్యకోశ్*—I : ప్రచురణ, జ్ఞాన్ మండల్ లిమిటెడ్, వారణాసి (రెండవ ముద్రణ).

*A Companion to Sanskrit Literature* : **by Suresh Chandra Banerji, Published by Motilal Banarasi Dass, Delhi, 1971**

*Some Concepts of the Alankara Sastra* : **by Dr. V Ragavan. Published by The Theosophical Publishing House, Adayar, Madras 1942**

# ఆలంకారికులు

**అప్పయదీక్షితుడు :** అప్ప, అప్పయ్య అని నామాంతరములు (ఇతనిసోదరుని పుత్రుడైన అప్పయ్యవేరు). జీవిత కాలము క్రీ.శ. 16 వశ. రచనలు: కువలయానందము, చిత్ర మీమాంస, వృత్తి వార్తికము, లక్షణరత్నావళి. ఇవికావ్య, నాటకాలంకార గ్రంథములు (C. S. L. PP. 15.)

**అభినవగుప్తుడు:** భరతమునికృతమైన నా.శా.నకు 'అభినవభారతి' అను పేరుగల వ్యాఖ్యానమును రచించిన అలంకారశాస్త్ర వేత్త. జీవిత కాలము 8 వశ. కాశ్మీరదేశపురాజు లలితాదిత్యుని ఆస్థానములో ఉన్నాడు. ఆనందవర్ధనుని ధ్వన్యాలోకమునకు ఇతడు 'లోచనము' అను వ్యాఖ్యనురచించెను. సాహిత్యాచార్యుడైన భట్టతౌతుని శిష్యుడు. తండ్రినరసింహుడు, తల్లి విమలకళ. ఇతని 'ఈశ్వర ప్రత్యభిజ్ఞా వివృతి విమర్శిని' క్రీ. శ. 1014-15 ప్రాంతములో రచితమైనదని, ఇతని జీవితకాలము 10 వశ. అని కొందరనిరి. ఇతడు రచించిన గ్రంథములు 24 (నా. శా. పీఠిక పు. 9-10). అభినవగుప్త రచితములని బయట పడిన గ్రంథములు మొత్తము 41 (C. S. L. PP. 1).

**అరిస్టాటిల్ :** గ్రీకుతత్త్వవేత్త. భరతునివలెనే అరిస్టాటిల్ (384-322 B. C.) కళ లోకవృత్తమునకు అనుకరణము అనెను—విషాదరూపకములలోనిసన్నివేశములన్ని శోకము, భయము ఈ రెంటి ద్వారా ఆయా ఉద్వేగముల 'కెథార్సిస్'నుసాధించునవికావలె, కళారంగములో జరుగుచున్న వికారముల క్షాళనమే 'కెథార్సిస్' అని రూపకభాగములు ఆరుగాచెప్పెను: 1. ఇతివృత్తము (Plot) 2. పాత్రలు (Characters) 3. శైలి (diction) 4. రంగాలంకరణాదులు (Spectacle) 6. సంగీతము (song). ప్రాచీన భారతీయులవలెనే అరిస్టాటిల్ రంగాలంకరణాదులను విశేషించి చెప్పలేదు.

**అరిస్టోఫేన్స్ :** గ్రీకుసుఖాంతరూపక (old comedy) రచనలో ప్రసిద్ధుడు C. 448-C. 388 B. C. లో ఉన్న నాటకకర్త.

**ఉద్భటుడు:** ఉద్భటాచార్యుడు, పేరును బట్టి కాశ్మీరియుడని తెలియుచున్నది. జీవితకాలము క్రీ.శ. 750-850. రచించిన గ్రంథములు: కావ్యాలంకార (సార) సంగ్రహము, భామహ వివరణము (భామహాలంకారమునకు వృత్తి). ఇతడు 'కుమార సంభవము' అను కావ్యమును రచించినట్లు ప్రతీహారేందు రాజు ఉల్లేఖించిన దానిని బట్టి తెలియుచున్నది (C. S. L. PP. 101).

**కుమారగిరిరెడ్డి :** 'వసంతరాజీయము'

అను నాట్యశాస్త్రమును సంస్కృతములో రచించిన రాజు. కాలము క్రీ.శ. 1400 ప్రాంతము. రాజధాని కొండవీడు (ఆంధ్రప్రాంతము). ఇతని గ్రంథము నుండి ఎన్నో (నాట్య) నాటక లక్షణములు స్వీకరించి ఇతనిబావమరది, సేనాని అయిన కాటయ వేముడు కాళిదాసునాటకములకువ్యాఖ్యలు రచించెను.

*కోహలుడు* : ఉపరూపకములను మార్గ-దేశిభేదములతో వింగడించి చెప్పిన నాట్యశాస్త్రవేత్త. భరతమునికి సన్నిహిత శిష్యుడు. ఇతని గ్రంథములు (కోహలరహస్యము, సంగీతమేరువు) లభించవు. 'తాళాధ్యాయము' అను గ్రంథ ప్రతి మాత్రము కొంతలభించినది. (C. S. L. PP. 59).

*జగన్నాథుడు* :- జగన్నాథ పండితరాయలు. ఆంధ్ర దేశీయుడు. షాజహాను దర్బారులో ఉన్నకాలమును బట్టి ఇతడు క్రీ.శ. 1628-58 మధ్య ఉన్నాడు. తండ్రి పేరు భట్టు, తల్లి లక్ష్మి. రచించిన అలంకార గ్రంథము 'రసగంగాధరము.' ఇతర గ్రంథములు:ఆసఫవిలాసము, జగదాభరణము, ప్రాణాభరణము. (నూర్జహాన్ సోదరుడైన అసఫ్ ఖాన్ గురించి రచించిన ప్రస్తుతి కావ్యములు). మనోరమాకుచమర్దనము (సిద్ధాంత కౌముదికిభట్టోజీ దీక్షితుడు రచించిన 'ప్రౌఢమనోరమ' వ్యాఖ్యకు ప్రతివ్యాఖ్య) మొ॥ అనేక గ్రంథముల ద్వారా ప్రసిద్ధుడు. (C. S. L. PP. 48).

*జయదేవుడు* : పీయూషవర్షుడని పేరందిన జయదేవుడు. జీవిత కాలము క్రీ.శ. 1200-1250. రచించిన గ్రంథము చంద్రాలోకము(అలంకారశాస్త్రము). (నా.శా.16.పు. 463).

*దండి* : ఆచార్యదండి. జీవితకాలము క్రీ.శ. 600-750. ఇతడు రచించిన కావ్యాదర్శము భామహాలంకారమువలెనే ప్రసిద్ధమైనది. ఇతర కృతులు: దశకుమార చరితము, అవంతిసుందరికథ (C. S. L. PP. 31).

*ధనంజయుడు* : 'దశరూపకము' అను నాట్య శాస్త్రమును రచించిన ఆలంకారికుడు. రచనాకాలము క్రీ.శ. 974-996 మధ్య. ఈ గ్రంథమునకు ధనికుడు 'అవలోకము' అను వ్యాఖ్యను క్రీ.శ. 1000 ప్రాంతములో రచించెను.

*నందికేశ్వరుడు* : 'అభినయ దర్పణము' అను నాట్య శాస్త్రమునకు కర్త. జీవితకాలము క్రీ.శ. 3వశ. ప్రాంతము. అభినయవిధానమంతయు నృత్యమునకుమాత్రమే పరిమితముచేసి చెప్పినాడు. తండు మహర్షి ఇతడేనని శ్రీ మానవల్లికవి అభిప్రాయము. నంది కేశ్వరుడు 'భరతార్ణవము'ను రచించెనవి, దాని సంక్షిప్తమే అభినయదర్పణమని తెలియుచున్నది. అభినయదర్పణ గ్రంథము వ్రాతప్రతులన్నియు తెలుగులిపిలోనే వ్రాసియుండుటను బట్టి ఇతడు తెలుగువాడేనని ఊహించుచున్నారు.

*పెద్దనార్యుడు*: చిత్రకవి పెద్దనార్యుడు

(క్రీ.శ.1550)రచించిన గ్రంథము 'లక్షణ సారసంగ్రహము' తృతీయాశ్వాసము మధ్యభాగమున 49 పద్య, గద్యములతో నాటకలక్షణములను చెప్పినాడు. నాటకము= రూపకము పర్యాయములుగా గ్రహించి, 16 రూపకముల పేర్లు చెప్పినాడు: నాటికా — సట్టక — త్రోటక-ఉపేక్షణ-గోష్ఠి-భాణికా-సల్లాపక-ప్రస్థాన—కావ్య—భల్లిస—రాసక — శ్రీగదిత — లాసికా— దుర్మల్లి — నాట్యరాసక — ఉల్లాప్యములు. వీటికిలక్ష్య, లక్షణములు చెప్పక 'పూర్వలసదలంకృతులు చూడుడు' అన్నాడు. (నా.శా. 18.పు.545).

*భట్టుమూర్తి* : రామరాజభూషణుడు అని నామాంతరము. ఆంధ్ర దేశీయుడు. జీవితకాలము క్రీ.శ. 16 వశ. రచించిన గ్రంథము నరసభూపాలీయము(అలంకారశాస్త్రము). వసు చరిత్ర మొ॥ ఇతర ప్రబంధముల ద్వారా సుపరిచితుడు.

*భరతముని* : భరతాచార్యుడు. నాట్య శాస్త్రకర్త. నా.శా. సంకలనకర్త అనికొందరిఅభిప్రాయము. జీవిత కాలము,నాట్యశాస్త్రరచనా కాలమును బట్టి క్రీ.శ. 300 కు పూర్వము (నా.శా.పీఠిక).

*భానుదత్తుడు* : 'రసమంజరి' అను అలంకార శాస్త్రకర్త. జీవిత కాలము, క్రీ శ.1450-1500మధ్య. మైథిలుడు. 'రసతరంగిణి' తదితర కృతులెన్నో రచించినాడు. కావ్యనాయికలను, నాయకులను వారి వయస్సును, స్వభావమును,సామాజిక సంబంధమును బట్టి ఇతడు విశ్లేషించి అధునిక మతమును స్థాపించెను. ఆవైశిష్ట్యమును 'రసమంజరి'లో చూడవచ్చు.

*భామహుడు* : భామహాచార్యుడు. జీవిత కాలము క్రీ.శ. 600-750. కాశ్మీర దేశీయుడైనట్లు తెలియుచున్నది. ఇతడు రచించినది 'భామహాలంకారము'. అలంకార సంప్రదాయమునకు మొదటి గ్రంథమిది.

*భోజుడు* : భోజరాజు. ఇతని రాజధాని ధారానగరము. సింధు రాజు కుమారుడు. జీవిత కాలము క్రీ.శ. 11 వశ. ఇతని గ్రంథములు: సరస్వతీ కంఠా భరణము, శృంగార ప్రకాశము. (ఈ రెండు అలంకార శాస్త్ర గ్రంథములు). సమరాంగణ సూత్రధారము (శిల్పశాస్త్రము), యుక్తి కల్పతరువు(నీతిశాస్త్రము) తత్త్వప్రకాశము (ధార్మిక గ్రంథము); రాజమార్తాండము (యోగసూత్రభాష్యము), రామాయణ చంపువును ఇతడే రచించినాడని చెప్పుదురు. (C. S. L. PP. 26).

*మమ్మటుడు* : మమ్మటా చార్యుడు. జీవిత కాలము క్రీ.శ. 1050-1101. రాజానక మమ్మట నామమును బట్టి కాశ్మీరియుడనిరి. ఇతడు రచించిన అలంకార శాస్త్రము 'కావ్య ప్రకాశము' విభిన్నకావ్య సిద్ధాంతములను సమన్వయించి 'ధ్వని' సిద్ధాంతమును బలపరచినదీ గ్రంథము. 'శబ్దవ్యాపారపరిచయము' అను గ్రంథము గూడ ఇతడు

రచించినట్లు తెలియుచున్నది (C. S. L. PP. 69).

*రుద్రటుడు* : రుద్రటాచార్యుడు. కాశ్మీరీయుడని తెలియుచున్నది. జీవితకాలము క్రీ.శ. 825-875. రచించినది 'కావ్యాలంకారము' (అలంకార శాస్త్రము). (C. S. L. PP. 85.).

*రుయ్యకుడు* : రాజానక రుయ్యకాచార్యుడు. కాశ్మీర దేశీయుడు. జీవితకాలము క్రీ.శ. 1135-1250. రచించిన గ్రంథము అలంకార సర్వస్వము.' సహృదయలీల' తదితర గ్రంథములితడు రచించినట్లు చెప్పుదురు (C. S. L. PP. 86).

*వల్లభరాయుడు* : వినుకొండ వల్లభరాయడు. జీవితకాలము క్రీ.శ. 1430. తెలుగుభాషలో మొదటిసారిగా రచితమైన 'క్రీడాభిరామము' అను 'వీథి'ని ఇతడు రచించెను. ఇది చంపూ కావ్య పద్ధతిలో రచితమైనది. మంచనశర్మ, టిట్టిభశెట్టి అను ఇద్దరుపురుష పాత్రల ద్వారా అనాటి ఓరుగల్లు పట్టణ విశేషములు, ప్రజల జీవితములు హాస్య, చమత్కృతులతో వర్ణించుటయే దీని ఇతి వృత్త సారాంశము.

*వామనుడు* : వామనాచార్యుడు. జీవితకాలము క్రీ.శ. 779-813. రీతి సంప్రదాయము ననుసరించి రచించిన గ్రంథము 'కావ్యాలంకార సూత్ర వృత్తి.' కాశ్మీర దేశపు రాజు జయాపీడునికి మంత్రిగా ఉన్నాడని వినికిడి. అష్టాధ్యాయికి 'కాశికావృత్తి' వ్యాఖ్యను రచించిన వారిలో ఒకడు వామనుని పేరున్నది (C. S. L. PP. 105). 

*విద్యానాథుడు* : అసలు పేరు, అగస్త్యుడు. విద్యానాథుడన్నది బిరుదనామము. ఓరుగల్లు రాజధానిగా ఏలిన ప్రతాపరుద్రుని ఆస్థానపండితుడు. ఆంధ్ర దేశీయుడు. జీవితకాలము క్రీ.శ. 14 శత–ప్రథమ భాగము. రచించిన గ్రంథము 'ప్రతాపరుద్రయశోభూషణము' (అలంకార గ్రంథము) (నా.శా. 16.పు.463).

*విశ్వనాథుడు* : విశ్వనాథ కవిరాజు. కళింగ దేశీయుడు. జీవిత కాలము 14 శత. రచించిన గ్రంథములు: 'సాహిత్య దర్పణము' (అలంకార శాస్త్రము). కావ్య ప్రకాశమునకు వ్యాఖ్య.

*వేంకటరాయశాస్త్రి* : వేదము వేంకటరాయశాస్త్రి తెలుగులో సుప్రసిద్ధుడైన కవి, పండితుడు. జీవిత కాలము 1853–1929 క్రీ.శ. బహు గ్రంథకర్త. సాహిత్య దర్పణమును తెలిగించినాడు.

*శారదాతనయుడు* : ఆలంకారికుడు. రచించిన గ్రంథము 'భావప్రకాశనము' అ.గు. నాట్య శాస్త్రమునకు రచించిన 'అభినవభారతి' అను వ్యాఖ్య ఆధారముగా భావప్రకాశనమును రచించితినని చెప్పుకొనెను. జీవితకాలము క్రీ.శ. 1175-1250 మధ్య.

*సింగభూపాలుడు* : 'సర్వజ్ఞ' బిరుదాంచితుడైన సింగభూపాలుడు. 'రసార్ణవ సుధాకరము' అను సాహిత్య శాస్త్రమునకుకర్త. రస చర్చలో ప్రశంసనీయమైన ఈ గ్రంథము ముఖ్యము. రచనాకాలము క్రీ.శ. 1330-1360 మధ్య.

